# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1963

సంపుటము 40 : : సంచిక 9

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1963

# విరహోత్కంఠిత



శ్రీ బాలగంగాధరతిలక్

ఈ గది స్వప్నాలతో నిండిపోయింది
నామది స్వాగతాలతో క్రుంగిపోతోంది
ఇంకా రావెందుకు ప్రభూ
శంకాకులమై యీరాత్రి సడలిపోతోంది.

ఎన్ని సరదాల అగరు వత్తులు వెలిగించుకున్నాను
ఎంత కాంతా శ్రీగంధమ్ము మైనలది కొన్నాను
సవ్వడైతే చాలు ప్రభూ
రివ్వున స్మరశరం హృదయాన్ని దూసుకు పోతోంది.

నావొంటి నిగనిగలవంటి శయ్యను సజ్జితం చేశాను
నా కంటి మిలమిలలవంటి మధువు పాత్రల నింపాను
త్వరమాణమై ప్రభూ, నా
తనువు స్వీయ యౌవన భారాన తడబడి పోతూన్నది.

కిటికీ అవతల హిమస్నాతమాలతీలత నన్ను పలుకరింపదు
కిటుకు తెలిసిన పొదలోని గువ్వజంట నన్నూరడింపదు
కందళించే యీవలపు ప్రభూ
గాఢాశ్లేష దోహదం లేక క్రమవికాసితోద్భాసితం కానే కాదు.

అవధరించవెందుకు పరిపక్వమైనా నా యౌవన విన్నపాన్ని
సవదరించ వెందుకు అసకృదతిశయోక్తి శీలమై నాతనూకావ్యాన్ని
జాగుసేయకు ప్రభూ— కడ
జామువచ్చెనా, తెలివెలుగు పారెనా—నిష్ఫలమివన్నీ.

సేవంతికా సురభిళ శ్రీమంతమీ నిశాంతమ్మునన్ను వేగిరించును
హేమంత సమీరపోత మేమింతగా క్రొవ్వి నన్నలయించును
ఎందు కింత నిర్దయ ప్రభూ
ఏకాంతకుంత నిహతమ్ము రసైక మద్భావనా శకుంతమ్ము.



**అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము:**

# దోష విమర్శలూ, పురోగమనమూ



డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

## 11

సభాముఖాన్న కవిత్వము వినబడినప్పుడు సమూహా మన స్తత్వము మాత్రమే మేలుకుని వింటుందీ పక్కనున్న వారు మెచ్చుకుంటే ప్రతీవారిలోనూ మెచ్చుకునే సౌజన్యమే చప్పట్లు కొట్టుతుంది. నండూరి, త్రిపురారిభట్ల వారూ వంటి గాయకులూ, కృష్ణశాస్త్రిగారి వంటి ఉచ్చారణ దక్షులూ కళాశాల విద్యార్థులకూ, విద్యావంతుల సభలకూ ఆధునిక కవిత్వాలు— తమవీ ఇతరులవీ— వినిపించినప్పుడు అనేక సభలు వారిని అభినందించాయి. తెనాలిలో వేదాంతము వారూ, రాజమండ్రీలో దామెర్లవారూ, విజయవాడలో భాగవతుల వారూ అభిమానించి తమ ఇళ్లలో ఈ కావ్య పఠన సభలు పెట్టించేవారు. సాహితీ సమితి వార్షికోత్స వాలు వీటికి తోడై ఆధునిక కవిత్వానికి ప్రచారమిచ్చాయి. కావ్యపఠనము సభాకార్య క్రమాల్లో తప్పనిసరి అంశమైంది. నవకవులకు ధైర్యము వచ్చింది. గిరజాల జుట్లూ, నున్నని ముఖాలూ, వల్లెవాటు కండువాలూతో పట్టణవీధుల్లో వీరు గుంపుగా కదులుతూండేవారు. ఠాగూరు కవి తన రచనల అర్థము చెప్పమని ఎవరో అడిగితే 'కవితావేశములో వ్రాశాను. ఇప్పుడు— సామాన్య పరిస్థితుల్లో— వాటికి అర్థమేమిటో నాకు మాత్రము ఎలాగ తెలుస్తుందీ ?' అన్నారట. ఆయన కవితారచనా పద్ధతులను వదిలేసినా, ఈ జవాబును దొరక బుచ్చుకుని ఆధునికులు తమ రచనలకు డాలుగా ఉపయోగించే వారు. వారి ఇంగ్లీషు అన్వయాలు, వింత భావాలూ, పాతము విన్నట్టు అర్థమయ్యేవికావు. దానితో ఏ మహానుభావుడో పెట్టేసిన "భావ కవిత్వము" అన్నమాట వీరి రచనలకు గట్టిగా అతుక్కున్నది. వీరి జీవిత పద్ధతులు కూడా— స్వేచ్ఛా ప్రేమ వాదాలతో, ప్రేయసీ కవిత్వాలతో అనుమానా స్పదంగా కనబడేవి. అవకాశం దొరికితేచాలు, తామేదో అమృత మిస్తుంది రచనలు చేసేస్తున్నట్టుగా సంప్రదాయ పద్ధతిలో పద్యాలు వ్రాసేవారిని అప్పుడప్పుడు సభలలోనూ, అన్నిచోట్లా, అన్నివేళలా భోజనానంతరము, నదీ సైకతాల్లోనూ, అపహాస్యము చేసేవారు. ఏదో అజ్ఞాత సౌందర్య మున్నదనే నమ్మకము విద్యార్థిలోకానికి వీరి రచనలను చుట్టిన ప్రాకార మయింది. కాలము గడిచినా ఆ వింత సౌందర్యాన్ని వెదికి చూపించగల విమర్శకులుగాని యత్నముగాని కనపడక పోవడముతో ప్రతికూల శక్తులు గడ్డకట్టి ఒక్కమారు విరుచుకు పడ్డాయి 'భావ కవిత్వము' మీద. అక్కిరాజు ఉమా కాన్త విద్యాశేఖరులు 'నేటి కాలపు కవిత్వము' అని ఒక పెద్ద గ్రంథము— సిద్ధాంతమూ పూర్వ పక్షమూ అని వాదాలు వెలయించి— రచించారూ, కాశీ భట్ట సుబ్బయ్య శాస్త్రిగారు 'సాహిత్యకల' అని విమర్శ గ్రంథము రచించారూ, అనంత పంతుల రామలింగస్వామిగారు 'శుక్ల పక్షమూ', కొల్లూరి ధర్మారాయకవిగారు 'చాకిరేవు', ఆలపాటి కామేశ్వరరావు గారు 'దూదేకుడు', తాపీ ధర్మారావు జాషువాగార్లు ఖండ కావ్యములనూ, ఇంద్రకంటివారు 'కళాభాయి' అన్న కథనూ రచించారు.

ఇంద్రకంటి వారికథ ఈ భావకవుల ప్రేమ కవిత్వపు వెర్రి తిరుగుళ్లమీద. వ్రాసిన దెవరి మీదనైనా, ఏ జుగుప్సాకర పరిస్థితులలో నైనా ఈ స్వైర ప్రేయసుల ప్రేమాలాపాలు— బిడియమూ జంకులేని వ్రాతలైనా— కవిత్వంగా చలామణీ అవుతున్నాయని వారి విమర్శ. వాస్తవానికి చదువరికి కవి తన రచనను ఏ పరిస్థితులలో రచించాడో తెలియదు. నటుడు ఏ అనుభవాన్ని తలుచుకుని— ఏ గ్లిసరీన్ను రాసుకుని— కళ్ల వెంబడి నీళ్లు తెచ్చుకున్నాడో ప్రేక్షకునికి తెలియదు. కవి రచనా, నటుని నటనా వాటంతట అవే కాన వస్తాయి. వాటి విలువ వాటినిబట్టే ఉంటుంది గాని, వాటికి కారణములైన పరిస్థితులు తెలియని కారణముచేత, వాటి

పరిశ్రమను బట్టి ఉండదు. పరిస్థితుల బలము వల్ల ఒక రచన బాగుండవచ్చును. కాని ఈ బాగు ఆ కవి రచనకి ఎల్లప్పుడూ ఉండదు ఒకటీ, ఈ బాగు చాలా పరిమితమై ఉంటుంది. రెండూ ప్రతికూలాలు. వాల్మీకి రామాయణము వంటి సుదీర్ఘమూ సర్వాంగ సుందరమూ అయిన కావ్యములో వర్ణనలూ రసఘట్టములూ భావములూ చక్కగా అమరి ఉంటాయి. దానిలో మంథర దుర్బోధ, రావణకృత రామ నింద, త్రిజట సీతానునయమూ, సంపాతి కుమారుని ఉబ్బా, చాలా వైవిధ్యమూ గల ఘట్టాలు ఉంటాయి. వీటినన్నిటినీ తాపీగా పఠిస్తూ ఓపికగా చివరివరకూ చదివితే, జీవితంలో సమాన మయ్యేటంత అనుభవమూ, తత్ఫలమైన కల్మషక్షాళనమూ, సద్యః పరనిర్వృతి కాంతా సమ్మితోపదేశమూ లభిస్తాయి. అంత రామాయణములోనూ, గభీమని తెరచి ఏదో ఘట్టమ్ము చదివినా, అప్పటికప్పుడు అంతకీ అంత అనుభవము కలుగుతుంది. సైజులో చిన్నవైన ఖండ కావ్యాలు జీవితపు లోతుల్ని పెకలించి తలకెత్తడము అసాధ్యముకాదు కాని అసామాన్యము మాత్రమూను. కనుకనే అవి తరచు కావ్యఖండాలే అయి పూరుకుంటాయి. పరిస్థితుల ప్రత్యేక బలమువల్ల కవి పలికిన రచనలు కావ్య ఖండములు కాగలవుగదా, ఖండకావ్యాలు కాకపోతే మానె ?

జాషువాగారి 'దాంభికుడు' 'నా కవిత్వమునందు రత్నములు గలవు. వాని పెకలించి చూపెడు వాడులేడు' అన్న కవిగానిని గురించినది. వెకిలి తనపు హేళన నిసర్గసుందర భాషతో చేసినంత మాత్రాన ఉదాత్తము కానేరదు. జాషువా గారే ఆ ఖండములోని అభిప్రాయాల్ని ఎంతమాత్రము వాదము వల్ల—నిలబెట్టుకోగలరో నాకు సందేహము. వెక్కిరింపులకు వాదమేమి ఉండగలదూ ? .... తాపీవారి 'విచారణ దినము' సుదూర భవిష్యత్తులో ఆధునిక కవిత్వము సాధించినట్లుగా గుర్తించగలిగిన దెంతో ఉండదనే అభిప్రాయముతో సరస్వతీ రాజ్ఞి చేసిన విచారణను ఖండకావ్యముగా వ్రాసినట్టిది. ఖండ కావ్య రచన లాఘవ కార్యమనీ, సర్గబంధ రచనే గొప్ప పని అనీ వీరి అభిప్రాయము కావచ్చును. అది సరికాదు. ఆధునిక కవుల ఖండకావ్యాల్లో ప్రపంచ వాఙ్మయాల్లో దేనిలోనైనా సరే వాటి కాళ్లమీద నవి నిలబడగల రచనలు పెక్కు లున్నాయి. అవే ఈ ఉద్యమానికి శ్రీరామరక్షలు. నాకూ నా రుచికీ అందినంతవరకూ జ్ఞాపకము వచ్చిన వాటిని ఇదివరకటి వ్యాసాల్లో వివరించే ఉన్నాను. ఆధునిక రచయితలు విశ్వసాహిత్యానికి నివేదించిన ఖండకావ్యాల్ని సేకరించిన సంకలనము రావలసే ఉన్నది. అలపాటివారి పద్యాలు వేగవంతాలు. వారి భావాలు, తిట్లూ పవాళ్లూను, 'ధూదేకుడు' వారి రచనలను కూడా ఏకగలదు.

అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులే ఈ విమర్శకులలో ప్రముఖులు. తెలుగు కవులు—నన్నయగారి నుంచీ నేటి వరకూ గలవారు అందరూ చేసిన ఛందో వ్యతిక్రమాన్నీ, వ్యర్థ పదప్రయోగాన్ని, సంస్కృత పదప్రయోగాన్నీ విమర్శించారు ఉమాకాన్తముగారు. నన్నయగారు పద్య చ్ఛందస్సు లుపయోగించి భారతాన్ని ఇప్పు డున్నట్టుగా తయారుచేయక మాత్రాచ్ఛందస్సులలోనే రచించియుంటే మన వాఙ్మయము రూపు మారిపోయి ఉండును. వారూ, వారి తర్వాతివారూ పద్యము లకు గొప్పదన మారోపించారు. తెలుగుభాషకు పద్యఛందస్సు సంకెలయే అయి ఈనాటివరకూ రచనా వైవిధ్యాన్ని కాక సంస్కృత వృత్తానుకరణాన్నే నేర్పింది. ఆధునికులు ఛందో నియమాన్ని పాటించక రచనను సులభమే చేశారు. ఉమాకాన్తముగారు ఆధునిక కవుల శబ్దవాచ్యతను—విశేషణాలలో వర్ణనను సాగించుటను— విమర్శించారు. ఈ శబ్దవాచ్యత అనేది వెంకట పార్వతీశ్వర కవులూ, శివశంకరశాస్త్రిగారూ ఎక్కువగా చేశారు. కృష్ణశాస్త్రిగారు కొంతా, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు బాగా ఎక్కువగానూ, వెంకట పార్వతీశ్వరుల ననుకరించిన రచన చేశారు. పద్య పురాణావసరము కొంత కారణము శబ్దవాచ్యతకి .... ఉమాకాన్తంగారే 'హృదయ వనజాత సుమ మృదు మనోహర దళము లదయతను త్రుంచినారే, భయదాగ్ని, కీలలను వేల్చినారే' అన్న రచనలో 'పాదాలలో ఇమడని మాటలను రెండు పాదాల మధ్యన వేసి దరువు కొట్టుతున్నాడు.' అని విమర్శించారు. చేస్తే నేమి ? కవి తనకు నచ్చిన ఛందస్సులో రాయకూడదా ? రాయలేదా ? పాటలోని అక్షరాలన్నీ నింపరు, నింపకూడదు కూడాను. వారికి ఇలా 'దరువు' చేస్తే వచ్చిన కష్టము ఏమిటే అని ! ఇవి వికారాలా ? ఇవికాదు వికారాలు. మీకు పట్టనివన్నీ తప్పను కోడము వికారము. పద్య ఛందస్సు పనికిరాదంటిరి. మరి మాత్రాచ్ఛందస్సులలో కొంచెము వైవిధ్యము చూపగానే వికారమై పోయింది ! .... 'జడకుచ్చులు, తొలకరి' అని ఇంపైన పేర్లు పెట్టరాదట. పేరువల్ల సాధించేది పేరు ఒకటే. ఏ పేరు పెట్టితే నేమి ? ఖండఖాద్యకం, సిద్ధాంతకౌముది, అద్వైత రత్నరక్షణము ఇంపైనపేర్లు కావా ? నలుగురి వ్యవహారానికి పనికిరావడానికి పెట్టిన పేర్లు ! వీటిలోని మాధుర్యమును ఎవరు గొప్ప చెప్పుకున్నారనీ అలాటి ఇంపైన పేర్లు పెట్టరాదంటారూ ? పద్యమంజరులు, కావ్యమాల, అని ఎన్నటికి పెట్టగలమూ ? ఇది మాత్రము వికారముకాదా ఈ పేర్లమీద దండయాత్ర ?

'భావకవిత్వ మనడమే అనంగతం', 'భావంలేనిది కవిత్వమే లేదు' అన్నారు విద్యాశేఖరులు. ఒక వస్తువు, దృశ్యము, అనుభవమును గురించిన భావాల్ని నిశ్శ్రేణిగా కూర్చిన రచనలు కీట్సు, షెల్లీ, బైరను వంటి ఆంగ్ల కవుల రచనలలో కొల్లలుగా ఉన్నవి. కథాకావ్యమువల్ల కాని, భావకావ్యంవల్ల కాని, కవి చదువరులలో సద్యః పరనిర్వృతి కలిగించగలడు. 'నా కుగాదులు లేవు నా కుషస్సులు లేవు, నేను హేమంత కృష్ణానంత శర్వరిని, నాకు కాలమ్మొక్కటే కారురూపు, నా శోకమ్ము వలెనే నా బ్రదుకువలెనే, నావలెనే' భావకావ్యం. 'నవ్వుచును పొంగిపోవుచు నాట్యమాడు తరగలను వెల్గు చుక్కల తళ్కు గాని, అబ్ధి గర్భోజ్జ్వల ద్బడబాగ్ని శిఖల హృదయమున దూరి యెవరు చూచెదరు సఖుడ' అన్నది భావకావ్యము. 'ఉపని

పక్షులలోన పూచేను పేరా, ఉద్వి దొర్లన్యాల కూరుకున్నావా ?' అన్నది భావకావ్యం. 'ఎక్కడున్నావోయి వెర్రి రంకుపిల్ల ఉంటాయి (కాత్యాయని) ని కోటకు వెంటలో ఉంది' అన్నది భావకావ్యం. భావము ఒక్కటే అయితే చాలదు. అది మనలో ఉద్దీపనము కలిగించి మన భావానికి సరిపడి కలిగిస్తే అది కావ్యమే. పరిమాణములో చిన్నదైతే అప్పుడుగాక. ధూర్జటివి అంతా సిద్ధ్య, నీ వేదంబు, రామార్పణములు వంటి పద్యాలు— వాటి వివి పూర్తి అయినప్పటి భావకావ్యాలే. ఆధునికులు— అన్వేయముల సిద్ధిలో—లోకానుభవాన్ని భావాల వి(శ్లేషణగా సాహిత్య భావకావ్యాలుగా పరుస్తున్నారు. వెలుగులో చాటు పద్యాలలోనూ పలుకాలలోనూ ఈ కావ్యాల్ని పోలినవి—బహు విస్తరణలున్నాయిగానీ, వాటిలో నిర్మాణముకన్నా పరికేయుడమే ఎక్కువ. మన వాఙ్మయంలో కావ్యత్వసిద్ధి కలిగిన భావకావ్యం లేదేమో ఒక్కటి లేదు. భావాలున్న కావ్యా లున్నాయి, భావ కావ్యాల శాఖ లేదు. కావ్యత్వసిద్ధి కలిగిన భావ ని(శ్రేణుల శాఖ లేదు. భావాలున్న పద్యమంజరులు భావ కావ్యాలు కావు. కావ్యత్వసిద్ధి అన్న పదమును అన్నిచోట్లా ప్రయోగించి కూడా దానిని తాము చెప్పిన సూర్య పతకాపులకు అన్వయించలేయక పోవడము ఉపాధ్యాయుల కార్పణ్యదోషానికి పెద్ద ఉదాహరణము.

ఆధునిక రచను అయోమయంగా ఉన్నవని "బుద్ధి లేనివెన్నె .... నప్పుడు .... మాటలు అయోమయంగా ఉండడము సహజము"ని (వాశారు అక్కిరాజువారు. ఈ మాటలు చదువరివల్ల కూడా నిజమే. షేక్స్పియరు నాటకాలలో 'Sermons in stones; books in running brooks' అన్న మాటల్ని ఇలాటి విమర్శకులే అయో మయు (వాతలని తీర్మానించి "Sermons in books, stones in running brooks' అని దిద్దినారట. ధ్వనించే రచన చెయ్యడానికి కావలసినట్లే, ధ్వనిని పట్ట డానికి కూడా చెవులూ, చైతన్యమూ కావలెను. 'పంజరంబున నున్న కట్లను పగుల దన్నగ లేక (సుక్కితి' నన్న గురజాడ వారి రచన ఈ విద్యాశేఖరులచేత బడితే, 'పంజరంలో కట్లు ఉండవు. కట్లను ఎవ్వరూ పగులదన్నరు' అని విమర్శించేవారు కాబోలు. కృష్ణశాస్త్రి 'కల విహంగమ పక్షముల దేలియాడి' అన్న రచనలోని స్వేచ్ఛ సూచించే ఉత్సాహము ఈ పండితు లకు అందనేలేదు. 'గంగాయాం ఘోషః' అంటే ఏమిటో వ్యాఖ్యానముకోరే పండితశాఖలోనివారు వీరు ! వేమన్న పద్యం "(బహ్మ గుజ్జమాయె భవుడు పల్లంబాయె, నాదివిష్ణువెన్న పంకెనాయె నందు మీదివాడు ఆడదో మొగవాడొ, విశ్వదాభి రామ వినురవేమ" అన్నదీ వీరికి అయోమయమే ! కర్మ ! మళ్లీ వేదాంత శ్లోకాలు మొదలుపెట్టితే మరి విడవకుండా ఏకరువు పెట్టగలరు. కాలజ్ఞాన తత్వాలలో గోప్యతను కోరి వేదాంతులు తమ నిత్య వ్యవహారమూ కాలక్షేపమూ కొరకు కూర్చుకున్న తత్వాల్ని అయోమయ రచన అన్నారు. ఊర్ధ్వ మూల మధశ్శాఖం" అన్న అభి(పాయము—మొనలు మీదుగ తలలు (కిందుగ మొలచి యున్నది వృక్షమూ అవి తెలుగై నప్పటి—కూడా పిరి కొరడాకు గురి అయింది. రవీం(దు కవిత్వము అర్థము కాలేదనేవారు చాలామంది ఉన్నారు. ఆయ రచనలు భారతీయ సం(పదాయంతో సంశ్లిష్టముగానే ఉన్నా టికీ ఆ సం(పదాయముతో పరిచయములేని పాశ్చాత్యు వాటి నర్థము చేసుకుని ఆనందించి భూషించారు. ఆకా శిఖలో గానవచ్చే స్వాతం(త్యాన్ని 'కలవిహాగములు, తారలు మెయిగ్న, మెఱుపులూ' ఉపయోగించి కృష్ణశాస్త్రి వర్ణిస్తే, ఉమాకాన్తంగారి వంటి ఆలంకారికులు "ఈ కృష్ణ పక్షి వర్తి యిన్నా రుమె(్రద అయి, మేఘ మయి, గారడీ చేస్తుంటే చూడవలెనని నేను కుతూహల పడుతున్నాను.' అంటున్నారు ! 'వాడి వనమున ఆగి చం(దుడు తాను చెవి యొగ్గెన్' అని విని చం(దుడికి చెవులున్నాయా ? చం(దు డాగేడా ? అంటే, భూమి తిరగడము మానేసిందా ? అని (పశ్నలువేయడ మారంభిస్తే అంతముంటుందా ? ఒక అలం కారము వాడిదా, పది యెందుకూ అంటే జవాబేమిటీ ? కవి రచనలో ఒకప్పుడు అలంకారాలు పెనవేసుకుంటాయి. వాటిని వేరువేరే ఇస్తే నాటి సమ్మేళనమువల్ల చదువరిలో జరిగే భావ మేళనము జరుగదు. కనుకనే 'పంజరంబున నున్న కట్లను పగులదన్నగలేక (సుక్కితి' నంటారు గురజాడవారు. 'పిచ్చశాఖి హా(గవ(త మార్గములలోని ఇరుల గుసగుసలు ఆమె కన్నులలో అపుడపుడు వినబడుచు నుండు' నంటారు కృష్ణశాస్త్రిగారు. 'పాండవేయుల పదును కత్తులు మండి మెరసిన మహితరణ కథ' అంటారు రాయ(పోలువారు. కత్తులు మండుతాయా ? 'మోహినీ సాట్టహాస కోలాహలములు పండువెన్నెల అలమె (బహ్మాండమెల్ల' నంటారు వేదులవారు. 'భంగుమని (మోసె నీ కంఠస్వరమ్మహో, పొంగిపోయెను ఉదధి భంగమాలిక లాహో' అంటారు విశ్వేశ్వరరావుగారు. రూపకమంటూ ఒక అలంకార మున్నప్పుడు మి(శ రూపకముగా ఉంటుంది. ఈ మి(శమములోని అలంకారాలు పెనవేసుకుని జమిలిగా తాకుతాయా లేక తీర్థానికి తీర్థమూ (పసాదానికి (పసా దమూ అన్నట్టుగా విడిగానే నిలుస్తాయా అన్నది కవి అల్లిక మీదనే కాదు, చదువరి చైతన్యము మీద కూడా ఆధారపడు తుంది.

ఆధునికులు ఒక దర్శనమిచ్చి తృప్తిపడక చాలా ఉదా హరణాలు గుప్పుతున్నారని నిందిస్తూ "భావం హృదయం మంగా స్ఫుటపడ్డ తర్వాత దాన్ని ఇంకా చెప్పడం వినుగును రోతను పుట్టిస్తుంది. కాళిదాసులో నిదర్శన బాహుళ్యం అరుదు" అని (వాశారు విద్యాశేఖరులు. ఈయనది కావ్య రసాస్వాదన విషయంలో చాలా దళసరైన పుస్తి. సున్నితపు భావాలు ఒక పట్టాన ఎక్కవు లోపలికి. కాళిదాసు శాకుంత లములోని "అనా(ఘాతం పుష్పం, కిసలయ మలూనం కర రుహైరనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదిత రసం.... అఖండం పుణ్యా తపః ఫలానాం" అన్న శ్లోకం ఈయన చదవ లేదా ? మరిచిపోయారా ? దాచేశారా ? అయిదు నిదర్శనా లిచ్చాడు కవిలోకగురువు శకుంతల సౌందర్యాన్ని దుష్యంతుడి చేత వర్ణింపజేస్తూ "మురువుగ లోకముల్మనుప మూర్తి

...రించిన బ్రహ్మతేజమో, కరుణ రసాంచిత గుప్తముకరై మెయి దాల్చిన క్షాత్రవ ధర్మమో, స్థిరతరశక్తి సంచయము క్షీర గుణ ప్రకరంబో, వ్యక్తాకారము గోచరించిన జగత్సు పుణ్య విధానరాశియో" అని ఒయిక ఉదాహరణ చెప్పారు. వాల్మీకి అగ్నిహోత్రములో ప్రవేశించిన జానకీదేవిని "సకల రాశితోని పరధర్మ తారకము పోలె, వారు పల్లవముల కుప్పలో నిడిన ...." అంటూ ఉదాహరణ చెప్పారు. ఉదహరించుటవారు సంసారానికి ఎన్ని ఉదాహరణ చెప్పారో 'లక్ష్మీ నృసింహ స్తోత్రం' లో ! "భావాన్ని వ్యక్తులకు చెప్పి చదివితే ఎంతో బలంతో హృదయాన్ని లభిస్తుంది." అన్న ఉమాకాంత పండితులు భావావేశాన్ని చదువరి కందించడానికి పెక్కు ఉదాహరణాలు అవసర మవుతాయని గ్రహించలేక పోవడము వారి అల్పాపేక్ష్యానికి గుర్తు. అయితే పుష్పదళాలకు దారంలాగ ఉదాహరణాన్ని బంధించే భావము కూడా ఉండాలి ఆ ఉదాహరణాలలో. నాటకంలో నటుని అభినయమూ ఆటీ భావావేశమూ నిదర్శన పరంపరను ఒకింటి చేర్చుతాయి. కావ్యములో —ముఖ్యంగా అప్పారావు కల్పించినట్లుగా—నాలుగు చరణాల్నీ బంధించేభావ ముండాలి. కృష్ణశాస్త్రిగారు 'ఆకు' లో ఉదాహరణాలు మాత్రము—పీఠములేని పుష్పదళాలుగా మిగిలి పోయాయి. ఉమాకాన్తంగారు దుయ్యబట్టేరు. అయితే కృష్ణపక్షంలోని తొలి ఖండకావ్యము దట్టంగా ఉన్న అడవిని వర్ణించేది. దానిలో వృక్షాలూ, గాలీ, సెలయేరూ, వరిమడీ, నీలాకాశమూ వర్ణిస్తూ 'ఈ కరణి దిరుగాడ .... అకటా దాహమా చింతలా వంతలా' అని చరణదళాల్ని బంధించే భావపీఠము అమర్చారు. ఆ ఖండము చదువరిని పట్టుకుంటుంది. ఉమా కాన్తంగారిని మాత్రము ముట్టుకోలేదు !

వనకుమారి అన్న కావ్యంలో రామిరెడ్డిగారి తత్త్వాలు ఏవో రెండు చెప్తే అవి పూర్వ వేదాంతులు చెప్పేవాటికన్నా గొప్పవి కావని ఆక్షేపించారు ఉమాకాన్తంగారు. ఆ మాటల్లో నూతనానుభవం లేదట. అనుభవ మన్నది ఎప్పటికప్పుడే నూతనం. మీకు ఈరోజున అనుభవ మైనది నాకు రేపు కావచ్చును. ప్రకృతిసౌందర్యము దీనికి గొప్ప ఉదాహరణం. ఎవరు అనుభవించిన సౌందర్యము వారి కప్పుడు కొత్త. ఎవరికి ఎప్పుడే సత్యం నాటితే వా రప్పుడా సత్యము చెప్తారు. అది 'నూతనానుభవం కాదు, వీరి స్వదృష్టి లేదు అంటే అర్థ మేమిటి ? "పగగొను త్రాచుపామువలె ప్రాణి జనించిన దాది వెంబడిన్ దగిలి చరించు మృత్యువు విధాతయు దాని వశంబె యన్నచో మిగిలిన భూతజాలము ప్రమేయము చెర్పగనేల నిత్యమై నెగడెడి దొండులేదు, కననేరదు లోకము కన్ను లుండియున్" అన్నారు పింగళీ కాటూరీ కవులు సౌందర నందములో. ఇది అశ్వఘోషునిది కావచ్చునూ, కాకపోనూ వచ్చును. కొత్త దైతేనే చెప్పాలా ? 'నేటికాలపు కవిత్వం' లో చెప్పిన విషయాన్ని చెప్పకుండా, అక్కడ దిక్కడ పులుము కుండా వ్రాయలేకపోయారే విద్యాశేఖరులూ, అనుభవాలు చెప్పకుండా ఎలాగుంటారూ కవులు ఆ సన్నివేశం వచ్చి నప్పుడూ?

ఈనాటి కవుల దృష్టి సంకుచితమంటూ "కవి తన మనోవిభుత్వంవల్ల ఉన్నతాలు, ఉత్తమాలు అయిన వస్తువులో ప్రవేశించి అంతర వీక్షణంచేసి ఆ వస్తువుల ప్రశస్తి తత్త్వము లోకానికి ప్రసాదిస్తున్నాడు" అన్నారు ఉమాకాన్తం గారు. అలాటి కవులు తెలుగులో రారేమో. మా తెలుగు కవుల దృష్టిలో ప్రకృతి పరిసరించి లక్షించవలసిన వ్యాపకత్వం లేదు కాదు. దేవతలూ మనుష్యులూ గొప్ప వ్యక్తులేమీ కారు. ఇప్పుడు కాళిదాసుగారి భావి కీర్తి గూర్చి ఉపాసము చేయగానే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు శ్లాఘనీయులై బయు ల్దేరారు. ఆ దేవతల చైతన్యాన్నే తెలుగు కవులు భారంగా దిగుమతి చేశారు. ఆధునికులు అలాంటి గారడీలు చేయుటవల్ల తమ అనుభవాల్ని—పలవరించినట్టుగా చెప్పిఉన్నారు. పలవరించినవి సంకలిస్తేయూ, తోచిన వాటి దారిని అవి పోతాయి. వీరి 'అనుభవ కవిత్వం, ఆత్మనాయక కవిత్వం' సినిమా కవిత్వం అని పేరుపెట్టి ఎందుకీ సంకుచితత్వమంటూ వెక్కిరిస్తారేమి ? ఏ పోయముల గారడీలు ఏ తత్వమూ ? "భువనపతి కెదటా దీప్తి దొలగని, ఇది కొత్త ఆవి, ఇది స్వేచ్ఛ అని, స్వేచ్ఛానువిహారుడని ఇది మహా కవిత్వమని" వెక్కిరిస్తూ అక్కడి దిక్కడ పులుముతారేమి ? "ఇన్నాళ్ల విప్పి నే నిన్ను గాంచినప్పుడె, ఆర్ద్ర హృదయంబు చలియించి యువకమాయె" నన్నాడు పాపినేని వెంకటేశ్వరరావు. అది సంకుచిత దృష్టా ? ఉష అనిరుద్ధుణ్ణి స్వప్నంలో చూచింది. "నడిరేయిని కలలోన నాకు నీవు కానిపింపగ మేల్కాంటి కలతచెందె" అని 'భారతి' లో ఒక కవి రాస్తే మీకెందుకు వింత అయిందదీ ? భవభూతి సీతాన్వర్శకు శ్రీరామునిచే పలి కించిన పలుకులకు మీ సంప్రదాయార్థాలు చెప్పరేమి ? శ్రీరామునికి వెర్రెత్తిందా, భవభూతికా ?

'నూతనత్వాధికరణం' అనే మొదటి అధ్యాయంలో ఉమాకాన్తంగారు ఆధునిక కవిత్వంలో నూతనత్వమే లేదన్నారు. అయితే ఎక్కడా 'కవిత్వంలో నూతనత్వ మన్నది యేమిటి ?' అని వారు వివరించనూ లేదూ, ఆ నూతనత్వపు లక్షణాలు ఆధునిక కవిత్వములో లేవని ఖండించనూ లేదు. "కావ్యంలో రసభావాలు ప్రధానం" అన్న పలుకులు మాత్రం పలికేరూ, 'వీటిలో నూతనత్వ ముండడం సాధారణంగా కవిత్వ ధర్మమే గాని విశేషమేమీ లేదు' అనీ అన్నారు. అయితే "ఆధునికులు, పూర్వులవలె సంప్రదాయ రచనలనే అనుకరిస్తూ, చెప్పే చమత్కారం కోసమే శ్రద్ధ పెట్టుతూ కథలోని రస భావ సౌందర్యాల కోసము చూడక తా మాశ్రయించిన ప్రభువుల సభ, వేట, శృంగారమూ గుదిగుచ్చి దివాణపు కవిత్వమే రచించి, అభూత కల్పనలలో తృప్తిపడలేదూ, సృష్టి సౌంద ర్యాన్ని తమ స్వంత గొంతులో వర్ణించ యత్నించారూ, కొత్త అంతా ఉద్యమములో ఉన్నదీ" అన్న అభిప్రాయాన్ని నేరుగా ప్రతిఘటించి కవుల యత్నమేమీ మారలేదు అని నిరూపించకుండా "మాటలు కొత్తకాదు, మధుర పదాలు కొత్తకాదూ, ఛందో స్వాతంత్ర్యము కొత్తకాదూ అంటూ ప్రబంధకవులు అంగాంగ సౌష్టవాన్ని వర్ణించినట్లు—అంగాంగ విమర్శ చేశారు.

పదవ పుటలో "ఈ నూతనత్వం ఇప్పటి కవిత్వానికి ఉంటే కవిత్వ ధర్మం సిద్ధించిం దనవచ్చును" అన్నది చక్కని మాట. అనేక కృతక ప్రక్రియలవల్ల తెలుగులో నిండుగా ఆవిష్కరించని కావ్యప్రసిద్ధి నేడు పొడచూపుతోంది. అసలు కవిత్వ కళ తత్త్వమే మారిందని అధునికు లిష్టపట్టుగా వాదించారు ఉమాకాంతంగారు. అది తప్పు.

కొల్లూరి ధర్మారాయ కవిగారు ఆంధ్రపత్రిక వ్యాసాల్లో అధునికుల శబ్ద వాచ్యతనీ, మర్మ కవిత్వాన్నీ విమర్శించారు. శబ్దవాచ్యత నెవరూ మెచ్చరు. చిరకాలంగా సంస్కృత సమాసాలు విన్న అలవాటువల్లా, సంస్కృత పదప్రయోగము చెవికి ఇంపుగా ఉండడమువల్లా సంస్కృత విశేషణాలు ధారాళంగా ఉపయోగించారు తెలుగు కవులు. వృత్తాలూ, పద చ్ఛందస్సులూ తగ్గిపోవడంతో ఈ రచనలు తగ్గిపోతున్నాయి. అతి సహజంగ వచన కావ్యాల్లో మాట చెప్పనక్కర్లేదు. మర్మ కవిత్వమని పేరుపెట్టి నిందించడము మాత్ర మన్యాయము. నా యెఱుకలో ఏ ఆధునిక కవీ తన కవిత్వంలో ఇతరుల కందని అర్థా లున్నాయని అనలేదూ, వ్రాయలేదూ. 'నీ కవిత్వానికి అర్థము చెప్పుమ' న్నప్పుడు, "నేను వ్రాయగలంత అందముగా వ్రాశాను. కవిత్వమును పాతము చెప్పినట్లు చెప్ప రాదు" అన్న వారిని నే నెరుగుదును. ఇంతమాత్రానికి కోప మేం ? నన్నయాదులు మాత్రము తమ రచనలకు వ్యాఖ్యానము చేశారా ? వీరి ఊహ లేమిటో తెలియవు. ఏదో ఉన్న దనుకునే వ్యాఖ్యాతలు తాము ఊహించని గొప్ప అర్థాలు చెప్పుదురనే ఆశే కావచ్చును., మించిపోయేదేమీ ? అంత మాత్రానికి 'ఈ కవికి గర్వమూ, ఏదో అంతరార్థము నిమిడ్చి రచించా ననుకుంటున్నాడు' అని వెక్కసపడడ మెందుకూ ? ఆ అర్థ మేదో ఆ కవి జీవితకాలమంతా ఆకాశంలో వేచిఉండి ఆ తరవాత ఆయన స్మృతితో ఎగిరి పోతుంది. ఠాగూరు కవివలె అజ్ఞాత సౌందర్యాన్ని పట్టి తెగించి పద్యాల్లో బిగించగల కవి ఆధునికులలో లేడు, ఆయన లాగ రచించబోయి, సకలేశుని వేరుగానూ, ఆరాధ్యదైవాన్ని వేరుగానూ వర్ణించేవారూ, ఆయన అభిప్రాయాల్నీ, ఊహల్నీ ఆయనవని చెప్పకుండా ప్రచురించుకునేవారే గాని ఆ ఎత్తు నందుకునే దృష్టి నలవరచుకున్నవారు తెలుగు కవులలో లేరు. పూత మెఱుగులు కోసము గొప్ప రచన చేసేవారి రచనలు అలాగ మూసుకుని ఉండడమే శ్రేయము. రాలని పూలు వారికి అందవు.

అనంతపంతుల రామలింగస్వామిగారు నవకవుల వేషాన్నీ, సమితులనీ, అంకితాల్నీ, కవితా సామగ్రినీ, కొత్త పోలికల్నీ, కావ్యనామాల్నీ, అచ్చువేసే పద్ధతినీ, సంప్రదాయ కవి దూషణాన్నీ, ఆంగ్ల కవిత్వ చౌర్యాన్నీ ఎత్తి యీసడించారు 'శుక్లపక్షములో'. తా మే ఆకాశం మీదనుంచో వూడి వడ్డట్టు, నిన్న మొన్నటిదాకా "గడియకు నూఱు పద్దెములు గంటములేక రచింతు' నంటూ టప్పాలు కొట్టిన కవులు ఏ నవకవి పక్కనో చేరి సంప్రదాయ కవిత్వాన్ని వెక్కిరిస్తే శుక్లపక్షములాంటి రచనలు రాకేం జేస్తాయీ ? ఒక్కొక్క కవికి ఒక్కొక్క ప్రేయసి. 'నీ పదలాక్షకు నా హృదయ రక్త మిస్తా' నని ఒకడూ, ఆమె కుచ్చెళ్ళ రేపే దుమ్ములో త్రసరేణు వౌతానని ఇంకొకడూ, తరుణి చీర కుచ్చెళ్ల కాగి తాలమీద బాగవతాలు రచియించి పాడుకొందునని మరి యొకడూను. కొందరి ప్రేయసిని గుర్తించి ఎదురవాణి రామప్ప నడిగిన ప్రశ్న అడగాలి కూడాను. 'వలపుటాకలి క్రుక్కు నా బ్రతుకుమీట ఇసుప పాదాల నిడి లోక మిపుడు నడచు' నని ఒకరంటే 'వలపు తీపి యెరుంగని వట్టి రాతి గుండె లోకమ్ము నిప్పులు గురియనిమ్ము' అని వారి స్నేహితులూ, "చుర చుర కాలిపోవు బ్రతుకు టిసుక యెడారిలో బాహులెత్తి, దాహమని మ్రోగు నా మహత్తర పిపాస" అని వారి అనుయాయులూ, 'కనికరపు నీడ కరవైన కటికరాతి లోకమందున నీ వెవ్వరో కృపాబ్ధి' ? అని వారి హితులూనూ. 'తరులెక్కి అల నీలగిరులెక్కి మెలమెల్ల చదలెక్కి జలదంపు నీలంపు నిగ్గులై' పోతాను అని ఒకరంటే, 'ఇళ్లుదాటి సెల యేళ్లను దాటి నదులు దాటి కాననములు దాటి ఎగిరిపోదు నే నెచటికో' అని రెండు చింతలవారు. 'ఎవ్వరని యెంతురో నన్ను ఏననూనభావ విభవాభిరామ ప్రభాన్వితుండ ..... ఏ నపూర్వ కల్పనానల్ప ప్రజ్ఞాన్వితుండ' నని గోవర్ధనరావు గారు ? "తరతరమ్ముల ప్రేమ స్వతంత్రు లరుగు దారి బోయెడు నూతనాధ్వగుల మనల బరిహసించెడు పాడు ప్రపంచమునకె పారవేయుము నీ యలంకార భరము" అని ఒకరూ, "ఇర్వురము పాపపంకిల మీ జగాన, నిముస ముండక .... నిర్మల పవిత్ర భరత మాతృ విశాల గర్భాంతరాళ నాళ జీవ స్రవంతుల నోలలాడ గ్రుంకిపోవు మిప్పు డకుంఠితగతి, భువనమెల్ల విభ్రాంతి నీరవము గాగ" అని ఇంకొకరూను. ఇలాంటి రచనల్ని చూసే కుందుర్తి నరసింహారావుగారు "ఆడదీ మగవాడు చేరీ, అంటగట్టుకు దూకబోతే యేఱు గొలుగొల్లుమంటూ యింకిపోయింది. ఇంకిపోయిన యేటి నీటిని, యేమి యిదియని ప్రశ్నవేస్తే 'చావబోతూ కౌగి లేలని జవాబిచ్చింది !" అన్నారు. దుఃఖము శేషమైపోయింది. పురిపండావారు "ఈ నిశివేళలందు, గగన పథమున దారకా గణము రాల్చు నశ్రుకణముల నానయనాశ్రుధార గలిపివైతును. గాఢాంధకార పటలి వెక్కివెక్కి దుఃఖింతు" నంటారు 'హృదయ వేదన' లో; ఏమీ అంటే, 'నాదు ప్రణయ సామ్రాజ్యలక్ష్మి నన్ను నెడబాసిపోయిన నాటనుండి నా మనోబ్జము ముకుళించి నవసిపోయె" నట. గోవిందు వేంకటనరసింహశర్మగారు నిట్టూర్పులలో 'కొంచెమైన పథము తోపదు పాడు ప్రపంచమందు, బోరుమని యేడ్వనీయవు' అన్నారు, రెంటచింతలవారు భగ్నమనోరథుడులో "ఎవరివాడవు నాయనా ఈ నిశీథవేళ నేడ్చుచున్నావు వెక్కివెక్కి ఒంటరిగ గూరుచుండి ? .... నన్ను దఱియంగరాకుడు నా యవస్థ వివ గుఱూహల మైనచో విన్నవింతుగాని నన్ జేరరాకుడు, కలవు నా హృదంతరంబున గీతికాతతులు" అంటున్నారు.

దీపం క్రింటినే క్రీనిష. అనుకరణ, అనువాదమూ తెలుసు వారి జాతీయ కళలు. శతాబ్దాలపాటు జీర్ణించిన అలవాట్లు. అనంత పంతులవారు 'ఒక్కని యర్థ మింకొక్కరు దుర్చిని సంగ్రహణంబు సేయుచే నిక్కము' అని పరిహాసముగా కాక పరమార్థంగానే వ్రాశారు. బాణోచ్ఛిష్టం జగత్సర్వమట కొత్త వస్తది ఎక్కడనుంచి వస్తుందీ అన్నారు. వీరిది పూర్తిగా ప్రబంధ పాండిత్యమే. వీరి కావ్యములో 'సాహస్య లోచన మీక్షించెడు లీలలే కవన కాచద్వారమున్ జొచ్చి'నవి. కాని "దర్శన భావాధిక విస్మయార్థములు' తోచలేదనేనా లభిప్రాయము. కథలు వారు నడిపినట్లున్నవే కాని జరిగి నట్లు లేవు. శుక్లపక్షము అధిక్షేపకావ్య మాయిరి. అయితే ఏది సంవత్సరాలపాటు దీనిని తలచుకొని ఆధునిక కవిత్వ ప్రతి ఎక్షులు చాలా సంతోషించారు. రామలింగస్వామిగారి వృత్తాలు మహా జోరుగా నడుస్తాయి. వారి పుస్తకము విద్యార్థులకు పాఠ్యగ్రంథము రెండు విశ్వవిద్యాలయాంలో.

అక్కిరాజువారి విమర్శన కవులకు గట్టిగా తాకింది. ఆయనకు గట్టిగా ఆనా డెవరూ సమాధానము చెప్పలేదు. ఆయన విమర్శ అయితే వేంకట పార్వతీశ్వరులు, రాయ ప్రోలు, కృష్ణశాస్త్రి, నండూరి, రామిరెడ్డి, కవులమీద నైనప్ప టికీ నవ్యత్వానికి ప్రాతినిధ్యం వహించిన సాహితీ సమితికే దెబ్బ తగిలింది. పురోగామి ఉద్యమాలకు ఆటంకము కలగ డము అభ్యుదయకాము లెవరూ సహించరు. గిడుగు రామ మూర్తిగారూ, తెలికిచెర్ల వెంకటరత్నంగారూ, చిలుకూరి నారాయణరావుగారూ, సాహితీసమితి సభాపతులు శివశంకర శాస్త్రిగారూ వంటి పెద్దలంతా చేరి నవ్యసాహిత్య పరిష త్తును స్థాపించారు. వచన రచన, గేయరచన, కథానికలూ, విమర్శలూ కూర్చుకుని వర్ధమానుల ప్రతిభ "ప్రతిభ" పత్రికగా రూపొందింది. అధునిక కవిత్వములో నూతనత్వమే లేదని సులోచనములు లేని పండితులకు అనిపించినా, సామ గ్రిలో, ఛందస్సులో, వర్ణనా పద్ధతిలో ఆ సమయములో వికసించిన నూతనత్వమే ఆధునికత్వానికి పునాది అయినది. పెక్కురు కవులు సుందరములైన ఖండకావ్యాలు రచించారూ, ప్రచురించారు. అందమైన పరిణామముగల కథలూ, సుందర భావములోనికి చదువరిని మీటగల ఖండకావ్యములూ చాలా వచ్చాయి. వీటికి ప్రోత్సాహము నవ్యరచనోద్యమమూ, ఆధు నికులు రచించిన ఖండకావ్యములున్నూ.

సహదేవ సూర్యప్రకాశరావుగారు వేదులవల్ల ప్రభావితు లైనారు. 'నిర్మలంబైన గౌతమీ నీరమందు తన సొగసు వన్నె లను చూచుకొనుచు సందె చెఱగులను సవ్దుకొను నభశ్శ్రీ లతాంగిని చిత్రించినారు. "మునిమాపు" లో గౌతమీ తీర ములో ఉపవిష్టులై నిర్వేద సమాధిలో పరిసరములను మర చిన సమయంలో సూర్యాస్తమయమూ సంధ్యా నిష్క్రమ ణమూ నక్షత్ర ప్రకాశమూ మేఘావసరమూ జరిగేవీ "మక్కలు మాయమయ్యె గౌతమీనది నిద్రలో కలవరించె' ననుకునేవారు వీరు. వీరి మునిమాపు, దివ్య తేజస్వి అనుభ వాన్నే ఇచ్చి నిలిపే రచనలు. పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారు విశ్వనాథ ప్రభావము పొందినవారు. వీరి సత్య వ్రత నము కూడా విశ్వనాథ సత్యనారాయణగారి పద్ధతిలో ఉంటుంది. 'నవప్రభము' రాహోలు వారికి అంకితమిచ్చారు. వారిని విమర్శలను సహించు ఉన్నారు. అయితే వీరి "ఆంధ్రశ్రీ" లోని ఖండకావ్యములలో విశ్వనాథవారి కథా కావ్య రచనా రీతులు కానరావు. కొడాలి వెంకటసుబ్బారావుగారిలో స్ఫుటమై నస్నేహా కానరావు. ఉద్యానవన వస్తువు పదవరాలా, పదిన ఉన్నదున్నట్లైన చదువగా, ప్రేయసిని ముందు చెప్పినా వారి మొక్క ప్రత్యేకతను నమస్తే సీమలలా, వీరి కవితలో కానరావు. ఎప్పుడైనా ఆవేశముగా అనే వాక్యాల నడుమ (ఉదాహరణ మనసులో) పంచపదులు నిర్మించిపోయే కావ్య మాత్ర మున్నాయి. "ఆంధ్రశ్రీ" అనుపేర కవిత ఆంధ్రవాఙ్మయా నికి కూర్చిన అంశాలలో ఒకటి. గండపెండేరము, డొక్కా జంటలు, రామదాసు, త్యాగరాజు, మాధవవర్మ అనే చిన్న ఖండకావ్యాలు ఉన్నాయి అందులో. ఒక్కొక్క ఊహలో పెద్దన గారి సుపీఠి పలుకుల బ్రాహ్మణకాంతతో గండపెండేరము మెరు స్తోంది. ఈ కథ మన తెలుగువారి వెడలున్ వెడలున్. 'డొక్కా జంటలు', సీతమ్మగారు 'పార్వతియు బోలె ఒక రాత్రి బలము నమ్మి' గట్టు లొరసికొని ప్రవహించిన గోదావరి కద్దముగా నిలిచి సంపిన కథ, ప్రథిత ప్రబోధ ఘన పథ పథము. రామదాసులో 'బారీ కాబడి హుకుము జరూరై దొ రక తెప్పపాటుతో గోపన్నను కారాధికర దృశ్యము ఫలాయిడె తూర్పు తెల వారిన తీర్పే.' గిడుగు లీరు రాత్రి తానీషా కోటలో "ధణధణామని కోట తలుపు లదిరి, చకచకల్ మణి నడక సాగిసాగి, లలిత లై చిఱునవ్వు తాండవించి దివ్యలోచులు రూపుతేరి నిలచి, నందనారామ కుసుమ నిష్యంద మాధురులను మఱపించు వనమాల తెలియరాక ఘుమఘుమై తానిషా యెద కొల్లగొనగ నయిరి—రామయ్య యొకడు". విశ్వనాథ వారు మిగిల్చిన 'దయాదాన ధర్మవీరుల రసాస్పద కథనమును తఃయన చేసినారు. వారి ఉపోద్ఘాత వాక్యములవలె వీరివి కథలలోని భాగములు కావు.

మద్దిపట్ల వెంకటరమణయ్యగారు, వడ్డాది సుబ్బా రాయుడుగారి శిష్యులట. వారు భక్తచింతామణిని పౌరాణిక గాథా కథనాలు వాడకుండా రచించినట్లుగా, వీరు 'ఝరీ తరణము' అను రాణా ప్రతాపసింహుని ఝరీ తరణమును ప్రబంధకాలపు ఏనుగ కాలి ఊహలు లేకుండా—కథవలె చెప్పి నారు. ఏ కవితా సంకలనములోనికైనా చక్కగా ప్రవేశించ గలిగిన ఖండకావ్య మిది. "ప్రథితమేవాడ రాజ్య సంభరణశాలి వీరనిలయ శిసోదియావారిధీందు డల్ల రాణాప్రతాప సింహాధి పుండు చనెడు నొక్కడు చైతకాశ్వంబుమీద" అని ప్రారం భించి చదువరిని "చైతకా చైతకాయంచు క్ష్మాతలేశుడనుగు మోమును దన యొడియందు చేర్చె, కనుల నీరొల్క పుల్కు పుల్కననను దొరనుగాంచి యాతేజి కడసారి కన్నుమూసె"

పరమా చక్కగా ఏమీకూపోరా రీయకు. ఎప్పటికేనా తన రచనలు ధ్వానుకుంకంటు బయలుకు నాశలో తల పంచుకు తిరిగి లక్ష్మీ వెళ్ళిపోయిన యువకన్య రీయున .... పెనుమర్తి వెంకటరత్నముగారిది కోయిల గొంతు, ప్రచురణ 'రత్నా పణము' లయిన వెళ్ళిపోయిన రత్నాల వచ్చింది. ''ఈ సమున్నత తాళ దూషితాహమ్ము లేయుగాం నా వంటివో యుపుడనూన విప్రాస్యంద ముకుళిత నేత్రములు లంచుచున్నవి యుగ యుగాంతర చరిత్ర'' అని ప్రారంభించి ''ఈ యుగాంతర చీపు కన్నెమైనాళ్ళ లలసు జెందుకొనరో దిగంతములకు ప్రాకటని యూరాల వల్లు వరించి, ఇల వెలంబడి శీతోష్ణములు సహించి'' అని ముగిసిన వీరి ''లాళపని'' విశ్వ సాహిత్యానికి కానుక పెట్టదగిన రచన. ఈమకలుగా నిర్వపోయినవి వీరి రచనలు ఎన్నో .... బొమ్మ బాపిరాజుగారు వీరూరు వారును విశ్వ సాహిత్యానికి కానుక పెట్టిన ముగ్గురు రత్నాలలో ఒకరు. (నండూరి, ముక్కపాటి తక్కినవారు) వీరి వ్యాపారవాణి ఏయుజా ఎంతో నాకు తెలియదుగాని వీరి కవితావని సరసమూ లలిత మధురమూను. ఆధునిక కవిత్వానికి వీరి రత్నాల రచనలు ఎన్నో లభించకుండెనచో తెరవాల బుగ్గలే మిగిలి వేగానికి తగిన సరుకు లేదనిపించేది. 'ఈ చిపెరాప గుంతేనము లింపుక యుంచుక దించుచున్, సుధాశీతం మందహాస పరిష్కృతవిలోల విలోచనోన్మిష జ్యోతులతో దిగంతముల నొక్క పరిన్ వెలిగించుచుండి, నిర్వృతి జరింతు, ఎంత నివసింపుము నీ కథలో శటిన్నటే!'' అని వీరు వెఱపున సంబోధించి చేసిన ఖండకావ్యము ఆధునిక కవి సౌందర్య చైతన్యానికి చక్కని ఉదాహరణము. వీరి కవితా కన్య రుచిస్నానముతైన ఉదయాచల సానువులను, మిన్ను పదలపట్టి రవికీ కొలకు గదలిని సీరజ లలాంగికీ గల ప్రణయ బంధములనూ, మున్నున్ మిన్నులు గూడు చోట నివసించే సాగరుని ప్రాణజ్ఞాన్ని, పరువెత్తు మున్నీటి లరగ గుర్రాల సవారీ యొనర్చు చందమామనీ, పడమటి కొండ చెత్తముల్పై చిలికించిన కుంకుమంబు లాగడపల చిల్లగాలి తరగల్ విర జిమ్మే అందాన్ని ''పిపంచి'' లో మీటింది. 'చరిత్రలకు నందని కాలపు కంచుకోట ద్వారములను ప్రేల్ శతాబ్దపు తెరల్ తొలగించు కథా నిధానముల' గాంచిన అజంతా వరిస రాల వ్యాఘ్రునదిని వర్ణించినది. కోణార్కలో కింశుకచ్ఛాయు నిలిచి మనోహరునికై నిరీక్షించు నలరు బోణినీ, విలాసినీ లాస్యవేళ మోగిన మృదంగ శ్రావ్య నినదమ్ములనూ, చిత్రించినది. బాపిరాజుగారి కవితావేశము శైల గర్భాంతరాళ నిర్ఝరము వలె నైసర్గికము.

రామచంద్ర అప్పారావుగారిది వింతయైన గొంతు. యౌవనము రేపు సాహసోత్సాహాలతో లోకములో అడుగు పెట్టే యువకుని తలపులపట్టి చూపిస్తారీయన. 'పికాలికు నేను పుట్టుట నాకై నీవు నిలుచుటింక నీ జగ మెట్లు తలచి కొన్న నేమి కొఱత?' అంటారు. 'చీర విడిచి యొంటి పాలతో జెరువుకు దిగు నూత్న యౌవనకన్య మనోధివాణు నెంచుకోక హఠాత్తుగా గాంచిన బెదరును వీరు కుంచెతో గాక మాటలతో పట్టుబోనటము చిత్రము. వీరు చిత్రకారులే కావలసినవారు. కలముపట్టి రంగూ రేఖాకి బదులు మాటలు వచ్చేరు. వీరి రచన లదనంతర పరిణామాన్ని తెలుపుతుంది. 'పటుల ఝంఝానిలా కంపితోర్మికా పరంపరల పంచలేండు టకలములూ, నగ్న సౌందర్యమూ, చిపురుమంట తావి, దీర్ఘ కుంతలమ్ములు కప్పుకొన్న నగ్నాంగన, జలకేళిలోలబాల, పూల మొగ్గల సగలతో మురిసే రసాలమూ, పొన్న కెరటాల నురుగు కేశాలూ' వాలుజడ సౌందర్యమూ' వర్ణిస్తూ ఈ చిత్రకారులు కవియౌట చిత్రము. వీరిని చిత్రములు వ్రాయమని కోరుతున్నాను.

ఆధునిక కవిత్వము ఉమాకాన్తముగారు చెప్పుకొన్నవే సరికే దాని లక్షణములతో, పద్ధతులతో ఒక రాజ్యమైంది. దాని సత్తను గుర్తించలేనివారూ దాని రాజ్యములో—కారణా లేవి అయితే నేమి—ప్రవేశించలేనివారూ దూరముగా నిలబడి వీపుకి కళ్ళు మొలిపించుకుని అవకాశ మున్నంతవరకూ దానిని తమ పరిసరాల్లో నిషేధించి తమ ఆధిక్యము నిలిచిం దను కున్నారు. అన్ని పురోగామి ఉద్యమాల వలెనే ఈ ఉద్యమము కూడా ముందుకు సాగింది పాత మైలురాళ్ళు వెనక నిల్చి పోయాయి తమ పురోమార్గగమన శక్తిని నిరూపించుకుంటూ.

---

గీ. ఆంధ్రభాషా వధూటికో యార్యులార!
ఇచ్చవచ్చినయట్లు మీ నచ్చినట్లు
నగలు నాణెంబులను బెట్టనగునుగాని
సూత్రములు ద్రెంపకుండాంధ్ర శూరులార!

—తిరుపతిశాస్త్రి

# హిందీ - తెలుగు



## శ్రీ లకంసాని చక్రధరరావు

భారత రాజ్యాంగముచే గుర్తింపబడిన ఇతర భాషలలో సమానముగాఁ గల హిందీ పదములను పరిశీలించి వివిధ పద పట్టికలను కేంద్ర విద్యామంత్రిత్వ శాఖవారు ప్రకటించిరి. ఈ వ్యాసమందు "హిందీ— తెలుఁగు" లను పదపట్టిక యుందలి ఔచిత్యానౌచిత్య చర్చగావింప బడును. ఈ పరామర్శకు పూర్వమా పదపట్టిక యందున్న తొలి పలుకులను పరిశీలింప వలయును.

"ఈ పద పట్టిక యందుగల పదములా యా భాషలలో పండితులయినవారి చేతను, హిందీలో అత్యంత పరిచయము గలవారిచేతనుఁ బడినవి."1

"సంస్కృత భాషనుండి హిందూ దేశ భాషలన్నియు అనేక పదములను తీసికొనిన వను విషయము తెలియుట చేత సారస్వతమున మిక్కిలి వాడుక గల పదములు మాచే నీబడుట లేదు. అట్లిచ్చినచో పద పట్టిక పెరుగుటయే. గాని దాని వలన గలుగు ప్రయోజనము మృగ్యముగును."2

ఈ పద పట్టిక యందొసగఁ బడిన తెలుఁగు పదములను పరిశీలించినచో ఆ సంకలన కర్తకు తెలుఁగులో ఏ విధమైన పరిచయమున్నట్లు తోచదు. పదపట్టిక మొదట నుదాహరింప బడిన పదమును పరిశీలింపుఁడు.

"హిందీ—అంక్. తెలుఁగు—అంక్"=సంఖ్య

తెలుగులో సంఖ్యా వాచకములను "అంకె"లందురు. గాని "అంక్"లని ఎవ్వరును వ్యవహరింపరు. మరియు ఆంధ్రులీ పదమును తద్భవముగా గ్రహింతురు. గాని అన్య దేశ్యముగా అంగీకరింపరు.

"ప్రథమ కబళే మక్షికాపాతః" !

"అడుగులోనే హంసపాదు" ! !

ఇక ఈ దోషములను పరిశీలింపుఁడు.

| హిందీ | తెలుగు | ఒప్పురూపము. |
|---|---|---|
| స్త్రీ | ఇస్త్రీ | స్త్రీ |
| కుల్‌వంతి | కుల్‌వంతీ | కులవతి |
| కుల్‌బధూ | కుల్‌బధూ | కులవధువు |
| కుల్‌ద్రోహీ | కుల్‌ద్రోహీ | కులద్రోహి |
| కుమ్హారినీ | కుమ్హారినీ | కుమ్మరిది |

ఇట్టి దోషములు లెక్కకు మిక్కిలిగా నున్నవి. ఆంధ్రులు స్త్రీని "ఇస్త్రీ" అందురా ?

ఈ పద పట్టిక యందున్న పదములలో ఆంధ్ర సారస్వత ప్రసిద్ధములయిన సంస్కృతాది భాషాపదముల సంఖ్యయే యెక్కువ. వారు తామేర్పరచు కొనిన బాటననుసరించి ప్రయాణ మొనర్పకుండిరి. పద పట్టిక యందలి మొదటి పది పుటలలో మొత్తము 256 పదములు గలవు. అందు సంస్కృతము 96, ఉర్దూ 71, సందేహాస్పదములైన పదములు 34, తెనుగులో లేని పదములు 12, పరిష్కృతమైన పదములు 29, తద్భవములు 9, ద్రావిడ పదము 1, పోర్చుగీసు పదము 1, ధ్వన్యనుకరణ శబ్దములు 3 కలవు. పద

*కేంద్ర మంత్రిత్వవిద్యాశాఖవారు "Hindi words common to other Indian languages."

Hindi—Telugu Part XI, pp II+114.

(Publication No 305. Ministry of Education & Scientific research; Government of India) New Delhi. 1958 అని ప్రచురించిన గ్రంథ సమీక్షా ఫలితమే ఈవ్యాసావిర్భావము.

1. The lists in this series have been prepared by scholars whose mother--tongue in the language concerned and who are at the same time, thoroughly familiar with the Hindi language.

2. But loan words of predominantly literary usage, whether borrowed from Sanscrit or from other sources have not been included since they are already well known as the common heritage of all Indian languages. Their inclusion would have made the lists unduly bulky and unwiedly, without bringing to light any new facts.

పట్టిక యందలి పదముల సంఖ్య రమారమి 2000 ఉండును. పై పరిస్థితుల పరిశీలనము బట్టి గ్రంథ స్వభావము తెలియ గలదు. ఈ గ్రంథమును పరిశీలింపగా ఇందుగల దోషములు పది విధములుగా పరిగణింప వీలగును.

1. ఆంధ్ర సాహిత్యమున సుప్రసిద్ధములయిన సంస్కృత పదములతో ఈ పట్టికను నింపుట.

2. తద్భవముల ననేకముల నిచ్చుట.

3. మహమ్మదీయ సంపర్కము వలన ఆంధ్రమున విపుల ప్రచారమున ఉన్న అరబీ, పారసీ పదములను ఈ పట్టికలో ఇచ్చుట.

4. ద్రావిడ భాషా పదములనే హిందీవను భ్రాంతితో ఒసగుట.

5. పోర్చుగీసు పదములను గూడ ఇచ్చుట.

6. తెలుగు వారి కపరిచితములయిన పదముల నొసంగుట.

7. తెలుగు వారి కత్యంత పరిచితములగు హిందీపదముల కీపట్టికలో స్థానము లేకుండుట.

8. తెలుగు విభక్తి ప్రత్యయములను చేర్పకయే యనేక ప్రక్రియల నొసగుట.

9. లిపి సంకేతములను నియతముగా పాటింపకుండుట.

10. అర్థములను తప్పుగా ఇచ్చుట.

ఈ దశ దోషములు సోదాహరణముగా నిరూపింపబడును.

1. సంస్కృత పదములు.

ఈ పద పట్టికలో ఈయబడిన సంస్కృత పదములు ఆంధ్ర సారస్వతమున అత్యంత ప్రసిద్ధములు. నన్నయ్య భారత భాగమున ఆదిపర్వములో ప్రథమాశ్వాసములోనే ఈ పదములు లసమాసకముగా ప్రయోగింపబడెను.

హిం. దాన్ (దానము), ఫల్ (ఫలము), ఇతిహాస్ (ఇతిహాసము), పర్వ్ (పర్వము), దిన్ (దినము).

దానము మొదలగు పదములాంధ్ర మహాభారతమున నన్నయచే ప్రయుక్తములు. ఇట్టి పదములను హిందీ భాష వలన ఆంధ్రమునకు సంక్రమించినవని ఒసగుట దోసగు గదా !

2. నన్నయాదులచే స్వీకరింపబడిన తద్భవములు తెలుగు చెందిన పదము లీపట్టికలో ఎన్నియో కలవు.

| హిందీ | తెలుగు | ఒప్పురూపము | సంస్కృతము |
|---|---|---|---|
| అంకుశ్ | అంకుస్ | ఆంకుసము | అంకుశః |
| యతన్ | జతన్ | జతనము | యత్నః |
| సింగార్ | సింగార్ | సింగారము | శృంగారః |

3. ముస్లిములచే వ్యవహృతములయిన అనేక పదములను తెలుగు కవులు తమ తమ గ్రంథములలో ప్రయోగించిరి. ఈ తెలుగు కవుల గ్రంథములు హిందీ భాష కంటే ప్రాచీనములు. ప్రభుత్వమువారి పద పట్టిక యందీయబడిన అనేక "ఉర్దూ" పదములకు ఆంధ్ర సారస్వతమున విపుల ప్రచారము గలదు. అంబారీ (రంగా 1—161), కమరు (కాశీ 3—240), కాగితము (భీమఖం—1—73) కొలు (ఆంబా. 2—188), ఖర్చు (పలనాటి వీర చరిత్ర) ఖుదా (రంగా 2—252), వజీరు (యయా 1—3)

4. ద్రావిడ పదములు.

సంస్కృత ప్రాకృతములనుండి ఆంధ్రాది ద్రావిడ భాషలు అనేక పదములను గ్రహించినప్పటికిని ద్రావిడ భాషాగత శబ్దజాలమును సంస్కృత ప్రాకృత భాషలందు ప్రవేశించెను. నేటికిని అనేక ద్రావిడ పదములను సంస్కృత భాషాగత పదములుగా అనేకులు భ్రమించుచున్నారు.

హిందీ. అమ్మా. తెలుగు అమ్మా (అమ్మ) సంస్కృతము (అంబా). "అమ్మ" అనుపదము ద్రావిడ భాషా కుటుంబమునకు చెందినది. కాల్డ్వెల్‌గారు ఈ యభిప్రాయమునే ప్రకటించిరి.[3] ద్రావిడ భాషలలో ఈ శబ్దమునకున్న ప్రచారము ఇండో యూరపియను భాషలలో వేనిలోను ఇంతగా లేదు.[4] హిందీనుండి కాని సంస్కృతము నుండి కాని "అమ్మ" అనుపదము తెలుగునకు రాలేదు. "అమ్మ" తెలుగు "అమ్మ" యేకాని హిందీ "అమ్మా" కాదు.

5. పోర్చుగీసు పదములు.

పోర్చుగీసు వారికి ఆంధ్రదేశముతో అత్యంత పరిచయము గలదు. హిందీ వారికిని బుడత గీచులకును ఇంతగా పరిచయము లేదు. పోర్చుగీసు పదములు గూడ ఈ పట్టికలో ఉండుట వింత !

అనన్నాస్ (హిందీ) అనాస్ (తెలుగు) అనానస్[5] (పోర్చుగీసు)

6. అపరిచిత పదములు.

---

3. Amba. Please refer to "A comparitive grammer of the Dravidian" (cold well 1961) Page 568.

4. Please refer to "A Dravidian Etymological Dictionary" (T. Burrow and M. B. Emenean 1961)

5. Ananas (m. Bat) the pine-apple- (Ananas satibut or a comosus) better known as ABA. CAXI (A Portuguese, English Dictionary) James and Tayler 1958.

తెలుగువారికి అపరిచితములయిన అనేక పదములిం దున్నవి. ముస్లిములకుగాని, హైదరాబాదు నివాసులకుగాని హిందీ భాషా విశారదులకుగాని ఈ పదముల యర్థము తెలియునేమో గాని జనసామాన్యమున కాపదములు సుపరిచిత ములుగావు.

| హిందీ | తెలుగు | అర్థము |
|---|---|---|
| అంతరా | అంతరియా | సంగీత పంక్తి |
| కావ్ | కాప్ | ప్రజ |
| అంధాధుంద్ | అంధాదుంద్ | నిర్లక్ష్యముగా |
| లబ్ | లబ్ | పెదవి. |

7. సుపరిచిత పదములు.

హిందీ పదములందు ఆంధ్రమున విపుల ప్రచార మందిన కొన్ని పదముల కిందు స్థానము లేకుండుట శోచ నీయము.

చమ్‌డా (చర్మము), మాయి (తల్లి), భేన్ట్ (కలయిక), అచ్ఛా (మంచిది) ఈ పదము లీపద పట్టికలో లేవు.

8. ప్రకృతులు.

సంస్కృత భాషనుండి తెలుఁగులోనికి పదములు ప్రవేశించునపుడు "డు, ము, వు,లు" అనుప్రత్యయములు చేర్పఁబడి వ్యవహరింప బడును. ఈ ప్రత్యయములు చేర్చ బడనిచో తెలుగు బాషాముద్ర పదములపై పడలేదన్నమాట. ఈ ప్రత్యయములు చేర్పబడకుండ ఈ పద పట్టికలో ఎన్నో తెలుగు పదములుగా ఉన్నవి.

అబ్బహోస్, నాఖ్, లోప్, కిరణ్, దురాచార్—ఇవి తెలుగు మాటలా ? ప్రత్యయములైనను చేర్చలేదు.

9. లిపి సంకేతములు.

(ఎ) లిపి సంజ్ఞల నుపయోగించుటలో వీరికొక పద్ధతి లేదు. "గుట్ట" అను తెలుగు మాటను పట్టికలో "Gutta" అని ఇచ్చిరి, "Gutta" అనునది ఒప్పురూపము.

(బి) హిందీ భాషలో రెండచ్చులకు మధ్యవచ్చు డకార మును శిథిలముగా ఉచ్చరింతురు. (గాఢీ, అగాఢీ), ఇట్టి శిథిలోచ్చారణము తెలుగున లేదు. ఆంధ్రమున లేని పద్ధతిని వీరు ప్రవేశపెట్టిరి.

ఉదా : ఖిచఢీ, అఖాఢా, ఘఢీ. ఇందు "ఢ" వర్ణ ముండకూడదు. డకారము సాధువు.

(సి) తెలుగున గల ఎ, ఒలకు ప్రత్యేక చిహ్నము లిడ బడలేదు. వారిచ్చిన తెలుగు రూపములు చూడుఁడు. ఏకా యేకీ (ఎకాయెకి— ఒప్పు) కోబ్జా (కొబ్జా— ఒప్పు)

10. తప్పు అర్థములు.

కొన్ని పదములకు తప్పు అర్థము లిచ్చిరి. లాగు (భాగము), అచితము (ప్రాంత) ఇంద్రప్రస్థము (స్వర్గము), ఖులాసా (చిన్న పద్దు) సంసారి (ప్రపంచ సంబంధమైన) తెలుగునగల ఈ పదములకీ అర్థములు లేవు.

ఆంధ్ర భాషయందు అత్యంతాదరముగల పాశ్చా త్యాంధ్రేతర పండిత ప్రముఖు లనేకులు లెక్కకు మిక్కి లిగా గలరు. ఈ పదపట్టిక కేంద్ర విద్యామంత్రిత్వ శాఖ వారిచే ప్రచురించ బడుటచే వారీ గ్రంథ ప్రామాణ్యమును శంకించుటకు అవకాశము లేదు. ఇందున్న వన్నియు ఒప్పులని వారు తప్పుగా భావించినచో భాషా శాస్త్రమున అనే కానర్థ ములు సంభవించును. ఇతర దేశములకు వెడలవలసిన ఈ గ్రంథములో ఇన్ని దొసగులుండుట భావ్యముగాదు గదా![6]

ఈ పద పట్టికను పునర్ముద్రించునపుడు పై దోషముల లను పరిహరించుకొనవలెను. మొదట దీనికిగల "Hindi words common to other Indian languages" అను శీర్షికను "Words common to Hindi and other Indian languages" అను రీతిని మార్చుకొన వలెను. ఇట్లు మార్చినయెడల ప్రతిష్ఠ (Prestige)కు భంగము కలుగునని భయపడరాదు. కేంద్ర విద్యామంత్రిత్వ శాఖవారిట్టి బృహత్కార్యమును వహించునపుడు మా ఆంధ్ర విశ్వవిద్యాలయమందలి ఆంధ్ర శాఖవారి సాహాయ్యమును ఆకా క్షించిన ఇన్ని అనర్థములు జరిగియుండెడివిగావు. హిందీ భాషా ప్రచారమునకు శుద్ధమయిన పద పట్టిక యుండుట చాల అవసరము. ఇకనైనను కేంద్రము వారీ విషయమున ప్రత్యేక శ్రద్ధ వహింతురు గాక !

---

6. నా ప్రతిలో 25, 28, 29, 32 పుటలు తెల్ల కాగితములే. ప్రభుత్వము వారి య(శద్ధకిది మంచి యుదా హరణము.

# మొల్ల కవయిత్రి కాలము



## శ్రీ తురగా కృష్ణమూర్తి

ఆంధ్ర కవయిత్రులలో కాలమునందేమి, కవితాప్రౌఢ
వమునందేమి ప్రథమస్థాన మలంకరింపదగు "మొల్ల"
కాల నిర్ణయములో మొన్న మొన్నటి వరకు భిన్నాభి
ప్రాయము లున్నను, యీమె తన కవిస్తుతిలో శ్రీనాథుని
పేర్కొనియున్న కారణమున నిస్సంశయముగా శ్రీనాథున కీమె
తరువాతిదని నిశ్చయింపవలసి యుండునని భాషావేత్తలు,
విమర్శకులు, పరిశోధకులు నిర్ణయించినారు. ఒకరిద్దరు విమర్శ
కులు ఆమె కృష్ణదేవరాయల కాలమునకు చెందినదని, అల్ల
సాని పెద్దన కర్వాచీనురాలని తమ నిశ్చితాభిప్రాయమును వెల్ల
డించినారు. అట్టి నిర్ణయములు చేయుటకు వారు వారికి
తోచిన యుపపత్తుల సిద్ధము చేసుకొనియే యుండి
యుందురు. కాని—ఉన్నట్టుండి శ్రీ వేదము వేంకటరాయ
శాస్త్రిగారు (భారతి సంపుటము 40 సంచిక 7) "మొల్ల
కవయిత్రి కాలము" ను తిరుగ నిర్ణయింప నుద్యమించి,
ఆమె ఎఱ్ఱాప్రెగడ సమకాలీనురాలును, శ్రీనాథ కవికి ప్రాచీను
రాలును నను సిద్ధాంత మొనరింప ప్రయత్నించిరి. వారి వాదనా
సరళి వారి వాక్యములలోనే యుట్టంకించుచున్నాను.

"ఇట్లందరు పెద్దలు వ్రాయుచున్నను మొల్ల రామా
యణము నందలి కవిత్వాదిపూర్వ కవిస్తుతిలోని శ్రీనాథుడను
పదమునకు శ్రీనాథ కవియే యని యర్థమగునా ? యని
నాకు ఆ పద్యమును చదివిన పిమ్మట సందేహము గల్గినది.
ఎందులకనగా యీయమ వాల్మీకి, వ్యాస, భారవి, మాఘ, భవ
భూతి, భట్టబాణ శివభద్ర, కాళిదాసాదులను స్తుతించి,
తర్వాత గతమందు ఆంధ్ర కవులను స్తుతించుచు ఒక్కొక్క
రికిని ఒక విశేషణమును తగిలించినది.

సీ. సురవన్నుతజ్ఞాను సువివేకి వాల్మీకి,
నఖిల వేదాగమాభ్యాసువ్యాసు
ఘోరాంధకార ప్రభారవి భారవి,
సత్కాంతి హిమకరశ్లాఘు మాఘు
వివిధ కళాన్విత విఖ్యాతి భవభూతి,
ప్రకట కార్య ధురీణుభట్టబాణు
మానినీ లోకసమ్మద ముద్రు శివభద్రు,
గవి తారసోల్లాసుగాళిదాసు

గీ. స్తుత గుణోద్దాము నాచన సోము భీము,
నవ్య మంజుల వాగ్ధుర్య నన్నపార్యు
రసికు డైనట్టి శ్రీనాథు రంగనాథు,
దిక్క కవిరాజును మతించి దీవివించి

వీరిలో భీమునికిని, రంగనాథునకును విశేషణములు కను
బడవు. ఇతరుల కందఱకు వదలక ఒక్కొక్కటి కూర్చినట్టి
యీ కవయిత్రి వారిని మాత్రమేల వదలును ? కావున భీము
డనునది వేములవాడ భీమకవి యనుటకన్న నాచన సోమునికే
విశేషణముగా గ్రహించుట యుక్తము. అట్లే శ్రీనాథు డను
నది రంగనాథునకు విశేషణము. తాను రామాయణ కర్త్రియై,
రంగనాథ రామాయణము మీది యభిమానముచే ఆ కవిని "రసికు
డైనట్టి శ్రీనాథుడు" అనగా లక్ష్మీపతి యని విశేషించి పలికి
నది. ఇదియే సాధువని తోచుచున్నది. ఏలయనగా శ్రీనాథుడు
కవి సార్వభౌముడే యైయుండిన ఆ విషయమును చెప్పు
మికిని, తత్పూర్వుడై, కవిత్రయములో నొకడుగా పూజ్యు
డైన ఎఱ్ఱనను వదిలినందులకును కారణము వేరు కవలసి
యుండును."

ఇంతవరకు యే యాధారమును బట్టి మొల్ల శ్రీనాథు
నకు దరువాతి కాలములోనిదని నిర్ణయింప దొరకొన్నారో, ఆ పద
ప్రయోగమునకే వేరొక యర్థమును చెప్పి మొత్తముమీద
మొల్ల జీవిత కాలమును సుమారొక శతాబ్ది కాలము ముందు
నకు నెట్టి విడిచినారు శ్రీ శాస్త్రిగారు ! శ్రీ శాస్త్రిగా రిచ్చిన
యీ అర్థము సమంజసమైనదా ? కాదా ? యన్న హాంశము
మీదనే యీ నూత్న సిద్ధాంత మాధారపడి యున్నది. కావున
వారి యర్థ సామంజస్యమును గూర్చి విమర్శింతము.

మొల్ల తొలుదొల్త తన పద్యములో గీర్వాణ కవితల్లజాల
స్మరించి, పిదప నెత్తుగీతలో ఆంధ్రకవుల నగ్గించినది. గీర్వాణ
కవుల నైనను క్రమ ప్రకారము ప్రశంసించియుండక తన
యిష్టము వచ్చినట్లే వర్ణించినది. వారు జీవించిన కాల
స్వభావమునుబట్టి, పూర్వాపర సందర్భముల నేర్పరింపక,
యిచ్చవచ్చిన తెరంగున యగ్గించి విడిచినది. అటులనే ఆంధ్ర
కవి స్తుతిలో గూడ నొక వరుసక్రమమునకు, పద్ధతికిని కట్టు
బడలేదు. నన్నయకంటె ముందు నాచనసోముని, తిక్కన
కంటె ముందు రంగనాథుని స్తుతించి, క్రమమును తప్పించి

నది. అందుచే ఆంధ్ర కవులలో మొల్లకన్న ముందుతరమువా రెవరో, సమకాలీను లెవరో పరుసగా తెలుసుకోదగు నాధారములు లభింపకుండ బోయినవి. క్రమపద్ధతి నీ కవిస్తుతి జరిగి యుండినచో వాళరున ప్రశంసింపబడినవాని సమకాలీనుడో లేక అర్వాచీనుడో యీ కవయిత్రియై యుండవలెనని నిర్ణయింప వీలు కలిగియుండెడిది. అట్టి దిందు జరుగలేదు. కావున వేరు విధముగ నీ విషయ విచారణ జరుగవలసి యున్నది.

ఇక శ్రీ శాస్త్రిగారు తెల్పిన రెండవ విశేషము. మొల్ల పూర్వకవుల స్తుతియించు పట్ల నొక్కొక్కనికి యొక్కొక్క విశేషణము తగిలించి భీమునకు, రంగనాథునకు నా గౌరవము గల్పింపక వదలుటచే నది యామె వర్ణనా విధానమునకు, వక్ష్యమునకు వ్యతిరేకము గాన సవరింపబడవలెనని సిద్ధాంతీకరించి, అట్టి సవరణ జరుపుటలో "భీము" డన్న పద ప్రయోగము "వేములవాడ భీమకవి" ని స్ఫురింపజేయక నాచన సోమునకు విశేషణ పదముగా పర్యవసించవలెననుట, "రసికుడైనట్టి శ్రీనాథు రంగనాథు" యనునది రసికుడైన లక్ష్మీపతి యగు రంగనాథుడని విశ్చితార్థముగా వాక్రుచ్చుటయు ననునవి. ఈ నిర్ణయమునకు వచ్చుటతోనే శ్రీ శాస్త్రిగారు పొరబడినారూ. మొల్ల తన కవిస్తుతిలో నొక్కొక్క కవికి యొక్కొక్క విశేషణమును తగిలించి, అట్లు చేయక తప్పినది "భీము" విషయమునను, "రంగనాథు" ని విషయమునను యను శాస్త్రిగారి వాక్యము యదార్థము. నాచన సోముని "స్తుత గుణోద్దాము" డని వర్ణించినది. కావున సోమునకు విశేషణము లేకపోయెనను చింత లేదు. వాని వెనుకనున్న "భీము" నకే యీ అపచారము జరిగినది. శ్రీ శాస్త్రిగారి వాదననుబట్టి "భీము" నకు విశేషణ పదము జంటింపబడవలెను. అందులకు భిన్నముగా శ్రీ శాస్త్రిగారు "భీము" పదమే నాచన సోమునకు విశేషణ పదముగా నన్వయించుకొనవలెనని యాదేశించు టెంత సమంజసమో దురూహ్యముగా నున్నది. ఒకవేళ వారి యభీష్టము ననుసరించి య ట్లొనరించినను శ్రీ శాస్త్రిగారి లక్ష్యము సిద్ధించ నేరదు. ఏలనన—"స్తుత గుణోద్దాముడగు నాచన సోముడు" అని వాక్యము పూర్తియైన వెనుక "భీము" పదప్రయోగ సమన్వయ మెట్లు చేయవచ్చునో శ్రీ శాస్త్రిగారు సూచించ లేదు. సూచించి యున్నను యది కుదరదనుట నిశ్చయము. ద్రావిడ ప్రాణాయామము గానట్టి ప్రయోగ సమన్వయ మొనరింతుమన్నను యది యతుకదు. కావున—నాచన సోమునకు "భీము" యన్న పదము విశేషణ మెంతమాత్రము కానేరదని రూఢి యగుచున్నది.. అట్లనే "రసికుడైనట్టి శ్రీనాథు" యను ప్రయోగము కూడ శ్రీ శాస్త్రిగారి వాదనకు వ్యతిరేకముగనే పర్యవసించుచున్నది. "రసికుడైనట్టి శ్రీనాథు" యను వాక్యము "స్తుత గుణోద్దాము నాచన సోము" యను వాక్యము వలెనే అర్థస్ఫూర్తి పూర్తిగా గల వాక్యమై యున్నది గాని విశేషణ పదప్రయోగముతోగాని సంపూర్తి కానిదై యుండలేదు ! కావున—మార్పు సిద్ధాంతమును వెలార్చి "మొల్ల" కవయిత్రి కాలమును పునర్నిర్ణయము గావించు కృషిలో శ్రీ శాస్త్రిగారు సఫలీకృతులు కాలేదనియే చెప్పవలసి వచ్చుచున్నది.

భారత కవిత్రయములో నెఱ్ఱనను పరిహరించుటలో గల అంతరార్థమును శ్రీ శాస్త్రిగా రొక విధమున సమర్థించినారు. అదేమన—మొల్ల గూడ నెఱ్ఱన సమకాలీనురాలైన మడికి సింగనాదులవలెనే నెఱ్ఱన ప్రసక్తి మానివేసిన దనుచు, అందుచే మొల్ల నాచన సోముని యనంతరమును, ఎఱ్ఱన స్మృతిపాత్రు డగుటకు ముందును యుండియుండవలెనని, మరల వెంటనే తమ వాదనలోని దౌర్బల్యమును గుర్తించి, ఎఱ్ఱన, నాచన సోములు సమకాలీనులు గాన యామె కావలసియే యెఱ్ఱనను వదలివేసినదేమో ! యను సందేహము వెలిబుచ్చిరి. అందుచే శ్రీ శాస్త్రిగారి దృష్టిలో మొల్ల నాచనసోముని, ఎఱ్ఱనల సమకాలీనయై యుండి, తన కవిస్తుతిలో నదివడి యెఱ్ఱనను స్తుతింప పరిహరించి, నాచనసోముని, రంగనాథుని, నన్నెచోడుని తిక్కయజ్వను యుగ్గించినదని నిర్ధారించినారు.

ఈ సమర్థనము నెంత వరిపెట్టుకొంద మన్నను వరి పోవుటలేదు. మొల్ల సమకాలికులు శ్రీ శాస్త్రిగారు వచించి నట్లు నాచన సోముడు, ఎఱ్ఱాప్రెగడలనే యంగీకరింతము. అట్టియెడ నాచనసోముని కవిత్వములో గల యే లక్షణమునకు మొల్ల సమ్మోహితయై యతని స్తుతించినది ? యెఱ్ఱాప్రెగడలో నా లక్షణములు లేకుండ పోయెనా ? యధార్థములో నెఱ్ఱాప్రెగడ కంటె నాచన సోము డెందులో గణ్యత సంపాదించుకొన్నాడు. ? ఎఱ్ఱాప్రెగడ నాచన కన్న కొంచెము ముందువాడనియే కదా విజ్ఞు లందరి యభిప్రాయము ? అట్టియెడ నాచనసోముని స్తుతించి, యెఱ్ఱనను వదలివేయుటలో మొల్ల యభిప్రాయ మేమని శ్రీ శాస్త్రిగారు వచింప గలరు ? కావలసియే మొల్ల యెఱ్ఱనను ప్రస్తుతింపక విడిచి వేసె నందురా ? ఆ వాదన కొక నమస్కార మిడి దూరముగా తొలగిపోవలసినదే గాని ప్రత్యుత్తర మీయగల యాస్కారము లేదు !

పై విధముగా తమ వాదనా పటిమచే నూత్న కాల నిర్ణయమును సిద్ధాంతీకరించితిమని నమ్మచు శ్రీ శాస్త్రిగారు మొల్ల రచనా విధానమునే శ్రీనాథుడు అనుకరించినాడని శృంగారనైషధములో నొక పద్యము నుదహరించిరి. అంతతో బోక మొల్ల భావమును పెద్దనయే గ్రహించెనని గూడ ఘంటాపథముగ నుడువ సాహసించినారు !

కవి కాలమును నిర్ధరింపవలెనన్న యే తత్కావి కృత గ్రంథములలోగల అంత స్సాక్ష్యము (Internal evidence) బహిస్సాక్ష్యము (External evidence) అను రెండు ముఖ్య హంశము లాధారములుగా దీసుకొని వ్యవహరించుట నేటివరకు నవలంభింపబడుచున్న పద్ధతి. అంతస్సాక్ష్య మనగా

నాకవి కృతిలో నుదాహరించబడిన సన్నివేశములు, వర్ణనలు వ్యక్తులను బట్టియు వారి సమయమునుబట్టి కాలనిర్ణయము చేయుట. బహిస్సాక్ష్యమనగా నాకవి సమకాలీన సాహిత్యములో గాని, తరువాతి వాఙ్మయములో గాని శాసనాదులలో గాని, వారిని గూర్చి గాని యాతని కృతులను గూర్చి గాని గల ప్రస్తావముల నాధారము చేసికొని కాల నిర్ణయము చేయుట. ఈ రెండు పద్ధతులలో మొదటి పద్ధతి ననుసరించియే యిది వరలో మొల్ల శ్రీనాథుని పూర్వురాలని నిర్ణయించిరి. కాని దాని నిపుడు శ్రీ శాస్త్రిగారు లేదని మార్చి సిద్ధాంతమును నెలకొల్పినారు. ఆ సిద్ధాంత సామంజస్యమును గూర్చి పైన వివరించనైనది. కాన—అంతస్సాక్ష్య ప్రక్రియ నింకొక విధముగా ప్రయోగించి, మొల్ల కాలనిర్ణయ మొనర్ప ప్రయత్నింతము.

మొల్ల తన సుకవి స్తుతిలో నుగ్గడించిన గీర్వాణకవి తతులమాటటుండనిచ్చి ఆంధ్ర కవుల విషయమై కొంత పరామర్శింతము. మొల్ల తాను వర్ణింపదలచుకొన్న కవుల క్రమముగా వర్ణించినచో నా క్రమ మిట్లుండి యుండును—నన్నయ, వేములవాడ భీముడు, తిక్కన, రంగనాథుడు, నాచన సోముడు, శ్రీనాథుడు. ఈ క్రమమున సుకవిస్తుతి యున్నచో నామె శ్రీనాథుని తరువాతి కాలమునకు చెందిన కవయిత్రి యని సులభముగా దెలియును. అట్లుగాక యామె కవి కాలముల క్రమము తప్పించి, ఆమె యిచ్చ వచ్చిన తెరంగున సుకవి వందనము నొనర్చినది. అట్లు చేయుటలో నామె కేమైన ప్రత్యేక యుద్దేశ మున్నదా ? లేక—యుద్దేశ రహితముగా యథాలాపముగా నట్లొనరించినదా ? యన్న విషయమును పరిశీలించవలసి యున్నది.

మొల్ల తన రామాయణమును ప్రబంధమనక కావ్యమనియే వాకొన్నది. ఆ కావ్యభాష యెట్లుండవలెనో యీ క్రింది పద్యములలో తెలుపుకొన్నది.

చ. పలుకుల నన్నపయ్యెదను వాసిగ గందపుఁ బూత లోడుటన్
గొలదిగఁ గానవచ్చు వలి గుబ్బ చనుంగవ రీతి నొప్పఁగాఁ
దెలుఁగని చెప్పుచోటఁ గడు తేటలు మాటలఁ గ్రొత్తరీతులం
బొలుపు వహింపకున్న మతిపొందగునే పటహాది శబ్దముల్.

కం. మును సంస్కృతముం దేటగఁ
దెనిగించెడి చోట నేమి దెలియక యుండన్
ఘన విద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘనమగు సంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే ?

గీ. తేనె సోఁక నోరు తీయన యగు రీతి
తోడ నర్థమెల్లఁ దోచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూఁగ చెవిటివారి ముచ్చటగును !

ఇట్టి కవితా స్వరూపముగల రచనలు, కావ్యములు మొల్ల కభిమాన పాత్రములు. తత్కవులు వందనార్హులు. కావున యామె చేయ తలపెట్టిన సుకవి స్తుతిలో నట్టి కావ్య కర్తలకే చోటుండవలె గాని, తదన్య లక్షణములుగల వారల కందు తావులేదు. ఈ లక్ష్యములోడనే ఆమె ఆంధ్ర కవుల నగ్గించు నవసరమున వివక్షతను చూపించినది. తదనుగుణముగనే ఆమెకు వరుసగా నాచన సోముడు, భీముడు, నన్నయ, శ్రీనాథుడు, రంగనాథుడు, తిక్కనలు దృష్టి పథమున నిల్చిరి. వారల యెన్నికలో గల విశేషము నిట నుట్టంకించు ట ప్రస్తుతము గాదనుకొందును.

నాచన సోముడు క్రీ. శ. 1344 ప్రాంతమున నున్న నాడు. ఈతడు నెల్లూరు మండలవాసి యగుటచే నాతనిపై నెక్కువ భక్తి భావమున ప్రశంసించి, సమకాలీనుడైన యెఱ్ఱా ప్రెగడను పరిహరించినదని వ్రాసిన శ్రీ శాస్త్రిగారి వ్రాత యీ యెడల గూడ సార్థక మగుటలేదు. నాచన సోముడు "పెంచుకల దిన్నె" వాసియగుడు కడప మండలమునకు జెందినవా డగుచున్నాడు గాని నెల్లూరు మండలమువాడు కాడు. మాచయ బ్రహ్మన శాసనమునుబట్టి గుంటూరు మండల వాసి యగుచున్నాడు. అగుట—శ్రీ శాస్త్రిగారు నాచన సోముపై మొల్లకు గల మండలాభిమానమే యీమెచే సోమ నను మున్ముందుగా స్తుతిఁ జేయింపఁ జేసిన దనుట పొసగుట లేదు. అట్లయిన నాచన సోమునకు మొల్ల తన కవిస్తుతిలో నగ్రస్థాన మిచ్చుటయేల సంభవించినది ? నా దృష్టికిఁ దోచిన దిది :

మొల్ల తన కావ్య భాషగా యెన్నుకొన్న తెలుగు, సంస్కృత పదాడంబరములేక తేటతెల్లమై, విదేశీయ పద భూయిష్ఠమై, మృదుమధురమై, వదివినంతనే యర్థమగు శక్తిని యుండవలె నను నియమము గలది. అట్టి లక్ష్యముతో నాచన సోముని "ఉత్తర హరివంశము" రచింపబడి, ప్రజా సుబోధకమై యుండుటచే, మొల్ల తత్కావ్య రచనా శిల్పమునకు ముగ్ధురాలై, యీతని యగ్గించుటలో ప్రథమస్థాన మిచ్చి గౌరవించినది. ఇక వేములవాడ భీమకవిని ఛందశ్శాసన కర్తగా, సాక్షాత్పరమ శివునపరావతారముగా యెంచి ప్రస్తుతించినది. మొల్ల శైవ మతావలంబిని యగుటచే నిట్టి భక్తి ప్రపత్తు లుండుట సాజము. నన్నపార్యునకుఁ దృతీయ స్థాన మిచ్చుట కాతడు నానా రుచిరార్థసూక్తి నిధి యౌటయే కారణము. నన్నయ కవిత్వమున సంస్కృత శబ్దములు మెండుగా మున్నను నవి మృదులములై, సుబోధకములై, మనోహరములుగా నుండుట మొల్ల వ్యాఖ్యానించిన రీతి "మును సంస్కృతముం దేటగఁ దెనిగించెడి చోట నేమి దెలియక యుండన్ ఘనమగు సంస్కృతము జెప్పు" పోలిక గాక, సుబోధకములగు పద, వాక్య ప్రయోగ దక్షతను ప్రదర్శించినవా డౌటయుఁ గూడ నొక కారణము. ఇక "రసికుడైనట్టి శ్రీనాథుని" విషయము. ఇట

మొల్ల శ్రీనాథుని "రసికుడ" నుటలో "శృంగారి" యను యర్థము దృష్టిలో నుంచుకొని యీ విశేషణమును వాడినదని నే ననుకొనను. శ్రీనాథుడు "రసికుడ" నుటలో మొల్ల యర్థము "కళాశీలి" యన్నదే! ఈ కళాశీలత్వ మాతని రచన లలో పతాక స్థాయి నందుకొనుటచే గూడ నామెకు శ్రీనాథునం దధిక గౌరవ మేర్పడి యుండి యుండవచ్చును. ఇదియునుగాక, నాతని కావ్య కళయే క్రొత్త రీతులం సంతరించుకొనుట గూడ మరొక కారణమై యుండి, ఆతని వివిధ కావ్య రచనం లోని రసికృతయే యాతనికి "రసిక శేఖర" బిరుద మాపా దింపజేసి యుండవచ్చును. కవితా ప్రపంచమున యుగ పురుషుడుగా వెలసిన శ్రీనాథుడు "రస సిద్ధాంత కవీశ్వరాః" యను ఆర్యోక్తికి లక్ష్యభూతుడై "రససిద్ధి" నందుకొన్నవా డగుటచేగూడ "రసికుడై" న్ట్టు యెంచుకోవలసి యుండును. ఇన్ని కారణములవలన "మొల్ల" శ్రీనాథుని రసికుడైనట్టివాడని యభివర్ణించినది. మొల్లచే సంతటి భక్తి ప్రపత్తుల నా కట్టు కొన్న శ్రీనాథుని, మొల్ల తన సుకవిస్తుతిలో నుట్టంకింప నుద్యోగింపనే యుద్దేశించలే దనుట నిజముగా సాహసమే యగును!

శ్రీనాథుని తరువాత మొల్ల యగ్గించినది "రంగనాథుని". ఈతడు దేశి ఛందమున ప్రథమముగా రామాయణ కావ్య రచన చేసినవాడౌట నీతనికి మొల్లకై మోద్పు ఘటించు టెంతయు నొప్పియున్నది. కడకు తిక్కనను స్మరించుచు నాతని "కవిరాజు" ని కీర్తించినది. తిక్కనకు "కవిరాజ" ను బిరుద ముండిన ట్లింతవరకు నెట్టి పట్టులను వినపడి యుండ లేదు. అయినను మొల్ల తిక్కనను "కవిరాజు" న్నది యేం?

తిక్కనసోమయాజి భారతమును చిన్న చిన్న దేశీయ పదములతో నింపి, యర్థ గాంభీర్యమును గనబరుచుచు బద్య రచన సాగించినాడు. అతని కవిత్వములో జాల భాగము జాను తెనుగనియే చెప్పవచ్చును. తిక్కనకు పూర్వము గల శివకవుల గ్రంథములు జాను తెనుగున రచితములై, ప్రజాసామాన్యము నాకర్షించిన విధానమును గమనించియే తిక్కన తన భారత మును మూడు వంతులు తెలుగు పదములలో కూర్చినాడు. తిక్కన హరిహరాద్వైత భావము పెంపొందుటకు వీరశైవ భక్తి ప్రాతిపదికములగు కృతులే కారణము. ఒకవైపున వీర శైవము, మఱొకవైపున వైష్ణవము వ్యాపించి సంఘములో విభిన్నత యేర్పడి, కలహములకు కారణ మగుటచేత నా రెండు తత్త్వములను సమన్వయించి, సంఘములో నేకీభావమును కలుగజేయుటకు తిక్కన హరిహరాద్వైతమును మొదట ప్రతిపాదించెను. శివకవుల రచనల నెక్కుడుగా తిక్కన యనుకరించెను. నన్నయ మార్గ కవితాస్రవంతియు, శివకవుల దేశి రచనాస్రవంతియు తిక్కన భారత రచనలో నేకమైనవి. మొల్ల దృష్టిలో కవిత్వ మన్నను, కవి యన్నను తిక్కన కవిత్వమే కవిత్వమును, తిక్కన కవియే కవియును. కావుననే నాచనను స్తుతగుణోద్దాముడని, నన్నయను నవ్యమంజుల వాగ్ధుర్యుడని, శ్రీనాథుని రసికుడని ప్రశంసించెనే గాని వారి కవితా చాతుర్యమును గూర్చి ప్రకటించి యుండలేదు. మొల్ల దృష్టిలో తిక్కన "కవిరాజు". మొల్ల ఆదర్శముగా పెట్టు కొన్న కవితాస్వరూపమును ప్రదర్శించు కవులలో నారదు "రాజు". శ్రుతిరంజకమును, సుబోధకమును నగు జాను తెనుగు కవిత్వ చంద్ర చంద్రికలు బర్వజేయు రేరాజు తిక్కన.

మొల్ల శ్రీ గౌరీశ్వర వరప్రసాద లబ్ధ. గురులింగమార్జున వినోద. అట్టియామె యామె శ్రీరాముని చరిత్రను కావ్య ముగా రచింప నుపకట్టినది. శైవ మతాచార సంపన్నయగు మొల్ల వైష్ణవ సంప్రదాయమునకు చెందిన రామచరితను గాన మొనరింప నుద్యమించుటలో హరిహరాభేదమును వ్యక్తీక రింప దొరకొన్నట్లయినది. అట్టి భావమును కావ్య ప్రపంచ మున ప్రప్రథమమున ప్రవేశింపజేసినవాడు తిక్కన. ఆవిధ ముగా గూడ నాతడు మతావేశ పరవశులై, అజ్ఞానాంధకార మున చరించు వారలకు వెన్నెలబాట చూపించిన కవి చంద్రుడు. గాన మొల్ల యాతని "కవిరాజు" గా పేర్కొనెనని గూడ ననుకొనవచ్చును.

శ్రీ శాస్త్రిగారు తమ వ్యాసములో మొల్ల శ్రీనాథుని స్మరింపలేదని చెప్పుటకు మరొక విషయమును ప్రస్తావించి నారు. శ్రీనాథుడు మొల్లకు ప్రాచీనుడై యున్నచో నాతని సార్వభౌమ పదవీ ప్రస్తావన మేల చేయులేదు? యను యాశంక వెలబుచ్చినారు. ఇదివరలోనే చెప్పినటుల మొల్ల దృష్టిలో శ్రీనాథుని సంస్కృత పాండిత్య ప్రకర్ష యంతగా ప్రాధాన్యత వహించకపోవచ్చును. అట్టి ప్రకర్షచే నాచికొన్న సార్వభౌమ బిరుదమున కామె యధిక ప్రాధాన్యత నొసంగి యుండకపోవచ్చును. సంస్కృత పదాడంబరమును, తత్త్వ యోగములును నామె కెంతమాత్రమును రుచ్యములు గావని ఘంటాపథముగా నామె చెప్పియే యున్నది. అదియునుగాక శ్రీనాథునకు కవిసార్వభౌమ బిరుదము, మొల్ల రామాయణ మును రచించు నాటికి లభ్యమై యుండకపోవచ్చును. ఈ విషయమైన వివరణ ముందు ముందు చేయుదలచు కొంటిని, గాన ప్రస్తుత మింతవరకే తెల్పి యూరుకొను చున్నాను.

అంతతో నూరుకొనక శ్రీ శాస్త్రిగారు "ఈమె శ్రీనాథుని యనంతర కవయిత్రియై యుండిన యెడల "వట హాది" శబ్ద ప్రయోగములను "పొందగునే" అనియు "ఘన సంస్కృతముల జెప్పగా రుచి యగునే?" యనియు చెప్పి యుండునా? ఈమె నిరసించిన మార్గమునే గదా శ్రీనాథు డవలంబించినాడు. ఒకవైపు "రసికుడైనట్టి శ్రీనాథుడ" ని స్తుతించుచు, మరియొకవైపు ఆతని పద్ధతిని నిరసించుట యెట్టిది?" అని ప్రశ్నించుచు నందుచే మొల్ల శ్రీనాథుని కంటె ప్రాచీనురాలై యుండి యుండవలె నన్నారు. శ్రీ శాస్త్రి గారి వాదన యీ సందర్భమున సమంజసముగా కన్పట్టుట లేదు. ఎందువలననో వివరింప ప్రయత్నించుచున్నాడను.

మొల్ల తన కవితాదర్శ మెట్టిదో, స్వరూప మెట్టిదో, లక్షణ మెట్టిదో నిర్ద్వంద్వముగా వెల్లడించినది. తన లక్ష్య

ముతో పరితూగి నడిచిన రచయితల నభినందించినది. శ్రీనాథుడు కూడ నైషధ కావ్య రచనలోనే మొల్ల ఆదర్శమునకు వ్యతిరేక పథమున నడచినాడు గాని, మరుత్తరాట్చరిత్ర, సప్తశతి, పండితారాధ్య చరిత్ర, పల్నాటి వీర చరిత్ర మొదలగువాటిని సంస్కృతపద భూయిష్ఠమును, జటిల సమాస యుక్తమును, అన్వయ కాఠిన్యము గలవానిగ రచించియుండలేదు. అందువలననే మొల్ల శ్రీనాథుని రచనల లోని రాసిక్యలకే ప్రాధాన్య మిచ్చి "రసికుడ" ని యగ్గించినది. కాని నైషధ రచనలో శ్రీనాథుని ఆంధ్రీకరణ పద్ధతియే యామెకు రుచించలేదు. శ్రీనాథుని శృంగార నైషధమును ఆమె తిలకించియే పని పట్టి ఆ రచనా విధానమునకు తన విముఖత్వమును చూపినది. శ్రీనాథుని శృంగార నైషధమును దృష్టిలో మంచుకొనియే యామె

కం. మును సంస్కృతముం దేటగఁ
దెనిగించెడిచోట నేమి దెలియకయుండన్
దన విద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘనమగు సంస్కృతము జెప్పగా రుచి యగునే ?

యని తీవ్రముగా గర్హించుట జరిగినది. ఈ పద్యమును మొల్ల శ్రీనాథుని నైషధాంధ్రీకరణ విధానమును తెగడుటకే యుద్దేశించి సాకూతముగా రచించినదని నా నిశ్చితాభిప్రాయము. అంతియేగాని యెన్నడో రాబోవు రచనా విధానము నూహించి మొల్ల తన కావ్యములో నట్టి రచనా ధోరణుల నభిశంసించినదని వ్రాయుట సమంజసము గాదు. మొల్లకు ప్రాచీనులగు కవులలో నామె కవితా లక్షణమునకు, స్వభావ స్వరూపాదులకు భిన్నమగు రచన అంతగా లేక యుండినవి. ఆమె కవితా దర్శమునకు సన్నిహితముగా నుండుటచేతనే యారీతి కవనమే మేలని, అంతకు భిన్నముగా వచ్చిన శృంగార నైషధ కావ్యాంధ్రీకరణ పద్ధతి నచ్చక, భంగ్యంతరమున యట్టి ఆంధ్రీకరణమును తెగడినది. అందుచే మొల్ల తెగడిన మార్గమున బోయిన శ్రీనాథుని "రసికు" డని యామెయే సంబోధించి యగ్గించునా ? యని శ్రీ శాస్త్రిగారి ప్రశ్నలో పటుత్వము లేదు. శ్రీనాథుని శృంగారనైషధ కావ్యమును చూచిన తరువాత మొల్ల తన రామాయణములో నట్టి ఆంధ్రీకరణ పద్ధతిని గర్హించుచు పద్యము వ్రాసినది గాని మరొండు గాదు. అందుచే మొల్ల శ్రీనాథున కర్వాచీనయే గాని ప్రాచీనురాలు కాదని చెప్ప సాహసించుచున్నాను.

శ్రీ శాస్త్రిగారి సందేహములలో నొకటి తీర్పవలసి యున్నది మిగిలినది. మొల్ల యెఱ్ఱాప్రెగడ సమకాలీన యగుట వలననే యాతని యగ్గింపక విడిచినది. కాకున్న కవిత్రయములో పూజ్యుడైన యెఱ్ఱాప్రెగడ నేల స్తుతింపక వదలినదో కారణము దెలుపవలె నన్నది.

ఈ కారణమును నిరూపింపలేకపోయినచో మొల్లకు యెఱ్ఱాప్రెగడతో గల సమకాలీనత్వ సిద్ధాంతము స్థిరమైనట్లే యన్న యర్థము శ్రీ శాస్త్రిగారి రచనలో ధ్వనించుచున్నది. కావి, తమ ప్రశ్నకు తామే జవాబు చెప్పుకోవలసి యుండునని వా రూహించి యుండరని నే ననుకొనుచున్నాను. శ్రీ శాస్త్రిగారు సిద్ధాంతీకరించినట్లు మొల్ల యెఱ్ఱాప్రెగడ సమకాలీనురా లగుచో నామె నాచన సోముని స్తుతించినట్లే యెఱ్ఱాప్రెగడను గూడ స్తుతించి యుండవలెను గదా ! ఆమె అట్లొనరింపక తప్పినందులకు కారణము శ్రీ శాస్త్రిగారే చెప్పియున్నారు. "ఎఱ్ఱనను ప్రస్తుతింపక వదలినవారు కొందరు కలరు గాని వారు ఆయన సమకాలికులు మడికి సింగన మొదలైనవారు. కొందరు ఎఱ్ఱనను వదలి నాచనసోముని పేర్కొని యున్నారు. కాని శ్రీనాథుని తర్వాత కవిత్రయ స్తోత్ర మొక పద్ధతిగా కుదురుకొన్నది. వీనింబట్టి చూడగా మొల్ల నాచన సోముని యనంతరమును, ఎఱ్ఱన స్తుతిపాత్రు డగుటకు ముందుండి యుండవలయును. కావి—ఎఱ్ఱన, నాచనసోముని సమకాలీనుడేగాన యామె కావలయుననియే ఎఱ్ఱనను వదలినదేమో" యని సమాధానించినారు. ఆ కారణముచేతనే మొల్ల ఎఱ్ఱనను ప్రస్తుతింపక విడిచినదని యనుకొంటలో విప్రతిపత్తి యేమియు నుండకపోవచ్చు ననుకొందము. ఇంతియేగాక శ్రీ శాస్త్రిగారు చెప్పినట్లు శ్రీనాథుని యనంతరము వారే భారత కవిత్రయమును క్రమము తప్పక ప్రస్తుతించు నాచారమును నెలకొల్పినారు కాని శ్రీనాథుడు గాని, అతని సమకాలీనులు గాని, అతని వెనువెంట తరువాత కాలమున (Immediately succeeding period) నున్నవారు గాని యీ యాచారమును తప్పక పాటించినట్లు కనుబడదు. ఆ కోవలోనికే మొల్ల గూడ జేరియుండు ననుకొనుటలో తప్పులేదుగదా !

పైన పేర్కొన్నట్లు శ్రీనాథుడు ఎఱ్ఱనను కొన్ని యెడల నగ్గించి, కొన్ని యెడల పరిహరించి యున్నాడు. భీమ ఖండములో శ్రీనాథుడు మొదట నన్నయను, దరువాత తిక్కన సోమయాజిని స్తుతించి, యెఱ్ఱాప్రెగడను స్మరింపక విడిచివైచినాడు. కాని, నైషధమున నొక పద్యములోనే

ధీరమతి నన్నపార్యుని దిక్కయజ్వ
శంభుదాసునిఁ గరమర్థి సన్నుతించి

యని భారత కవిత్రయ స్మరణము గావించినాడు. అంతమాత్రముచేత శ్రీనాథు డొకయెడ నెఱ్ఱాప్రెగడ సమకాలీనుడై, వేరొకయెడ నర్వాచీనుఁడగుచున్నాడా ? కావున యెఱ్ఱాప్రెగడను మొల్ల తన సుకవి స్తుతిలో నుదహరింపక మానినంత మాత్రమున నామె యాతని సమకాలీన యగునని నిర్ధరించుట తగదు.

ఈపైన నడచిన వాద ప్రతివాదముల వలన శ్రీ వేంకటరాయ శాస్త్రిగారు సిద్ధాంతీకరించినట్లు "మొల్ల" యెఱ్ఱాప్రెగడ సమకాలీనురాలు కాదనియు, ఇతఃపూర్వమే నిర్ణయింపబడినట్లు శ్రీనాథునకు తరువాతి దనియు నిశ్చయింప నగుచున్నది.

వావిళ్లవారు "ఈమె శ్రీనాథునకుఁ దరువాతిదని మాత్రమే తెలుస్తూ ఆమె కృష్ణదేవరాయుల కాలములో

మున్నట్లు చెప్పుదురు గాని నిర్ధారణ చేయుటకు వ్రాత మాధార మంతగా లేదు. లట్లని యీమె పదునాలవ శతాబ్దములోనిది కావచ్చు" ననియు, శ్రీ లక్ష్మీరంజనముగారు "ప్రబంధ కవులను పేర్కొనక పోవుటచే మొల్ల శ్రీ కృష్ణదేవరాయల కాలమున నుండి యుండునని శ్రీ వీరేశలింగం పంతులుగా రూహించిరి. తెలుగు కవిత్వము తేటమాటలతో నుండవలెననియు, పటుహోదిక సంస్కృత శబ్దముల ప్రాచుర్యము కాదనియు నామె పలికినది. ఈ పద్యభావము అల్లసాని పెద్దన పేర వినవచ్చు "ఉత్పలమాలిక" "పూత మెఱుంగులున్ పసరు పూస బెడంగులు చూపునట్టి వాకైతలు" అనుదాని భావము ననుసరించుచున్నది. కావున "మొల్ల యల్లసాని పెద్దన తరువాతదై యుండి యుండవచ్చును" అనియు, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు "మొల్ల కాలము సరిగా నిర్ణయించుటకు ఆధారములు లేవు. కాని పూర్వ కవిస్తుతిలో నీమె శ్రీనాథుని తరువాత నుండిన కవీంద్రుల నెవ్వరిని పేర్కొని యుండమిచే ప్రబంధకవుల కాలమునకే యుండెనని యూహింప వీలగుచున్న" దనియు వెలిబుచ్చిన నిర్ణయముల ననుసరించి మొల్ల శ్రీకృష్ణదేవరాయల కాలమున పెద్దన తరువాతిదిగా నుండియున్నట్లొక వాద మున్నట్లు తెలుచున్నది. ఇది యదార్థము కాదు.

మొల్ల తన కావ్యములో శ్రీనాథుని స్తుతించుచు "రసికుని"గా పేర్కొనినదనియు నట్లేల పేర్కొనవలసి వచ్చినదో సవివరముగా నింతకుమున్నే ప్రస్తావించి యున్నాను, శ్రీ శాస్త్రిగారు కూడ "మొల్ల రసికుడైనట్టి శ్రీనాథు" ని వక్కాణించుటలో నాతడు సార్వభౌముడే యై యుండిన విషయమును చెప్పమికి మొల్ల నిజముగా శ్రీనాథుని ప్రశంసించనే లేదని నిర్ణయింప దొరకొన్నాడు. అనగా శ్రీనాథునకు గల "కవిసార్వభౌమ" బిరుదము "మొల్ల" తన ప్రశంసలో నెత్తుకొనకుండుటచే నామె యసలే శ్రీనాథుని ప్రస్తుతింపలేదు. గాన యాతని తరువాతి కాలమునకు చెందియుండుట సంభవమను సిద్ధాంతమునకు వచ్చుటకుం గూడ సంశయింపలేదు. కాని— మొల్ల "రామాయణము" వ్రాయు నాటికి శ్రీనాథునకు "కవిసార్వభౌమ" బిరుదము లభింపకుండ యుండి యుండనిచో గూడ నిట్టి పరిస్థితి సంభవించి యుండ వచ్చును గదా! మొల్ల "రామాయణము" వ్రాయు నాటికి శ్రీనాథుడు "కవిసార్వభౌముడు" కాలేదు. ఈ బిరుద మాతనికి శృంగార నైషధ రచనానంతరము చంద్రభూష క్రియాశక్తి రాయంచే ప్రసాదింప బడినది. శ్రీనాథుని "దీనారటంకాలతీర్థ మాడించితి, దక్షిణాధీశు ముత్యాలశాల" యను పద్యమును బట్టి యందుదాహృతమైన కనకాభిషేకము నైషధ కావ్యరచనాదికములు నాల్గును అంతకుం బూర్వము స్వల్ప కాలము క్రిందటనే జరిగియుండినట్లును, విశేషకాలము గడచి చనినట్లు లేదనియు తోచును. ఈ బిరుదము శ్రీనాథుడు క్రీ. శ. 1410లో నాచుకొన్నట్లు కొందరు, క్రీ. శ. 1430లో నని మరికొందరు నిర్ణయించియున్నారు. ఏది యేమైనను శ్రీనాథుడు కర్ణాటక్షితిపాల మౌక్తిక సభాగారాంతరమున "సార్వభౌమ" బిరుదమును పొందుట క్రీ. శ. 1410 1430 మధ్యకాలమునయై యుండవలెననుట స్పష్టము. మొల్ల తన స్తుతిలో శ్రీనాథునకు గల "కవిసార్వభౌమ" బిరుదమును వర్ణింపక విడుచుటచే నామె క్రీ. శ. 1410—1430లకు ముందును, నైషధ కావ్యరచనకు తరువాతను (శృంగార నైషధ కావ్యమును రచించుటచే "రసికుడైనట్టి" యని విశేషముపయోగించియు, నాతని ఆంధ్రీకరణ పద్ధతిగా నుంచుకొన్న కవితా లక్షణమునకు, కవితా స్వరూపమునకు భిన్నముగా నుండుటచే నా విధానమును "మను సంస్కృతము దేటంగ దెనిగించెడిచోట...." యను పద్యములో నభిశంసించియు మొల్ల తన విజ్ఞతను ప్రదర్శించినదని నానమ్మకము) యుండి యుండవలెనని తేలుచున్నది.

వీనినన్నింటిని సమన్వయింతుమేని శృంగార నైషధ కావ్యరచనము క్రీ. శ. 1405—1415 మధ్య కాలమున జరిగి, శ్రీనాథునకు "సార్వభౌమ" బిరుద ప్రదానము క్రీ. శ. 1410— 1430 మధ్యకాలమున జరిగినట్లు నిశ్చయింపనగును. అట్లగుట మొల్లరామాయణ రచనా కాలము క్రీ. శ. 1410 అని చెప్పుట కెట్టి యభ్యంతరము నుండ నక్కరలేదు. మొల్ల తన రామాయణము నిండు జవ్వనమున వ్రాసి యుండునని మనమనుకొన్నచో నామె క్రీ. శ. 1375—1380 మధ్యకాలమున జనించి యుండవచ్చునని తేలుచున్నది. ఈ విధిని మొల్ల శ్రీనాథుని సమకాలీన యగుచున్నది·



# భారతదేశంలో గ్రంథప్రచురణ



శ్రీ చిత్తరంజన్ బెనర్జీ[1]

పబ్లిక్ లైబ్రరీలకు ప్రచురణకర్తలు తాము ప్రచురించిన పుస్తకాలను విధిగా పంపితీరవలెనన్న చట్టం 1954 లో ఆమోదింపబడింది. అంతకుపూర్వం భారతదేశంలో ప్రచురితమైన పుస్తకాల సంఖ్యను తెలుసుకోవడానికిగాని, వాటిని సబ్జెక్టులవారీగా వర్గీకరించడానికిగానీ వీలుండేది కాదు. కాని పై చట్టం అమలులోకి వచ్చినప్పటినుంచి మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాలలో ఉన్న పబ్లిక్ లైబ్రరీలకు ప్రచురణకర్తలు తమ పుస్తకాలను, పత్రికలను ఒక్కొక్క కాపీ చొప్పున ఉచితంగా పంపవలసిన అగత్యం కలిగింది. అయితే దేశంలో ప్రచురితమైన పుస్తకాలన్నీ, పత్రికలన్నీ ఈ పబ్లిక్ లైబ్రరీలకు తప్పక వస్తున్నాయని చెప్ప వీలు లేదు. కొందరు ప్రచురణకర్తలు పంపకపోవచ్చు. ఈవిధంగా ప్రచురితమవుతున్న వాటిలో నూటికి పది వంతుల వరకూ పై లైబ్రరీలకు చేరకపొయ్యే అవకాశం ఉంది. కలకత్తాలోని నేషనల్ లైబ్రరీకి చేరిన ప్రచురణలు ఆధారంగా సెంట్రల్ రిఫరెన్సు లైబ్రరీవారు తగు విధంగా వర్గీకరణ చేసి గ్రంథముల పట్టికను తయారు చేస్తున్నారు. ఈ పట్టికనే నేషనల్ బిబ్లియాగ్రఫీ అంటారు. దీనిలో అందిన ప్రచురణల సంఖ్య, వాటి విషయాలు, రచయితలు, ప్రకాశకులు, భాష, వెల మొదలగు వివరాలు ఉంటాయి.

1961—62 సంవత్సరంలో కలకత్తా నేషనల్ లైబ్రరీకి 21,076 ప్రచురణలు అందాయి. వీటిలో మాస పత్రిక, త్రైమాసిక పత్రికలు, వార్తాపత్రికలూ ఇంకా ఇతర సీరియల్ ప్రచురణలు చేరి లేవు. వాటి లెఖ్ఖ వేరే. పోతే సదరు సంఖ్యను విడమరిచితే ప్రాంతాలవారీ వివరం ఇది :

| | |
|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ | 1,084 |
| 2. అస్సాము | 320 |
| 3. బీహారు | 164 |
| 4. గుజరాతు | 1,066 |
| 5. మధ్యప్రదేశ్ | 462 |
| 6. మద్రాసు | 2,861 |
| 7. మహారాష్ట్ర | 3,151 |
| 8. మైసూరు | 632 |
| 9. ఒరిస్సా | 356 |
| 10. పంజాబు | 962 |
| 11. రాజస్థాన్ | 139 |
| 12. ఉత్తరప్రదేశ్ | 2,055 |
| 13. పశ్చిమబెంగాల్ | 3,021 |
| 14. త్రిపుర | 47 |
| 15. ఢిల్లీ | 3,828 |
| 16. కాశ్మీరు | 3 |
| 17. హిమాచల ప్రదేశ్ | 33 |
| 18. కేరళ | 888 |
| 19. మణిపూరు | 3 |
| 20. అండమాన్, నికోబారు దీవులు | 1 |
| మొత్తం. | 21,076 |

సంఖ్యనుబట్టి చూస్తే ఢిల్లీది ప్రథమ స్థానం. మహారాష్ట్ర రెండవ స్థానంలో ఉంది. మూడవ స్థానం పశ్చిమ బెంగాలుది. భారత ప్రభుత్వ ప్రచురణలు చాలావరకు ఢిల్లీనుంచే వెలువడుతాయి కాబట్టి అది ప్రథమ స్థానంలో ఉంది. పుస్తకాలను పబ్లిక్ లైబ్రరీలకు ఇవ్వవలెనని నిర్దేశించే చట్టం ఇటీవలే కాశ్మీరుకు వర్తింపు చేయబడింది గనుక అక్కడివి మూడు ప్రచురణలు మాత్రమే చేరాయి.

ఇక భాషల వారీగా అందిన పుస్తకాల వివరం ఇట్లా ఉంది :

| | |
|---|---|
| 1. తెలుగు | 924 |
| 2. తమిళం | 886 |
| 3. కన్నడము | 411 |
| 4. మళయాళము | 696 |

1. కలకత్తా నేషనల్ లైబ్రరీయందు పరిశోధనాధికారి. బెంగాలీలో వ్యాసకర్త; గ్రంథవివరణ పట్టికల నిపుణుడు.

| | | |
|---|---|---|
| 5. | మరాటీ | 1,038 |
| 6. | హిందీ | 2,805 |
| 7. | గుజరాతీ | 966 |
| 8. | ఒరియా | 189 |
| 9. | బెంగాలీ | 2,043 |
| 10. | అస్సామీ | 173 |
| 11. | పంజాబీ | 764 |
| 12. | సంస్కృతము | 168 |
| 13. | ఉర్దూ | 432 |
| 14. | ఇంగ్లీషు | 9,361 |
| 15. | ఇతర భాషలు | 220 |

అంటే ఇంగ్లీషు పుస్తకాల సంఖ్య అత్యధికంగా ఉందన్నమాట. హిందీ పుస్తకాలది రెండవ స్థానం. కాని ప్రథమ స్థానానికీ, ద్వితీయ స్థానానికీ ఎంతో తేడా! బెంగాలీ పుస్తకాలు మూడవ స్థానంలో ఉన్నాయి. అవి హిందీకి దరి దాపుల్లో ఉన్నాయి. ఇంగ్లీషులో ప్రచురిత మవుతున్న పుస్తకాల సంఖ్యనుబట్టి చూచినా మనం ఆంగ్లభాషపై ఎంతగా ఆధారపడి ఉన్నామో స్పష్టమవుతూ ఉంది.

అందిన పుస్తకాలను మరికొంత విశ్లేషణచేసి చూస్తే సాంఘిక, సాంస్కృతిక విశేషాలు కొన్ని తెలియవస్తాయి. మొదటి అంశ మేమిటంటే అసలు మన దేశంలో ప్రచురిత మయ్యే పుస్తకాల సంఖ్య చాలా తక్కువ. భారతదేశ జనాభా 43 కోట్లకు పైగా ఉంది. ఇంత జనాభాకు 21,076 పుస్తకాలేనా! అంటే 20,500 మందికి ఒక పుస్తకం (టైటిలు) చొప్పున పడిందన్నమాట! పది లక్షల మందికి 48 పుస్తకాల చొప్పున అందుతాయన్నమాట! మరి, పది లక్షల జనాభాకు ఇంగ్లండులో 375, ఫ్రాన్సులో 242, జర్మన్ ఫెడరల్ రిపబ్లికులో 290, జపానులో 199, రష్యాలో 188, జెకోస్లొవేకియాలో 455, బెల్జియంలో 512, నెదర్లాండ్సులో 673, స్విట్జర్లెండులో 649, థాయిలెండులో 198 పుస్తకాలు చొప్పున లభ్యమవుతున్నాయి. అంటే ఈరీత్యా నెదర్లాండ్సుది ప్రథమ స్థానం. స్విట్జర్లెండుది ద్వితీయ స్థానం. మరి ఇవి రెండూ వైశాల్యంలో చిన్న దేశాలు!

ఇంగ్లండు, అమెరికాలలో కొనడానికి పోతే వేర్వేరు పేర్లవి మార్కెట్లో ఒక లక్ష పుస్తకాలు కన్పిస్తాయి. మరి భారతదేశంలో ముఖ్యభాష లన్నింటిని కలిపి చూచినా 35,000 పుస్తకాలకు మించి కన్పించవు. ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా దేశాల ప్రజా జీవితంలో ఆయా దేశాల భాషలు వహిస్తున్నట్టి పాత్రను మన భారతదేశంలో దేశ భాషలు వహించవలెనంటే మన దేశంలో ఉన్న ముఖ్య భాషలలో ఒక్కొక్క దానిలో అధమపక్షం ఒక లక్ష పుస్తకాలైనా ప్రచురింపబడాలి. అంటే మొత్తం 15 లక్షల (టైటిల్సు) పుస్తకాలన్నమాట. వీటిలో పిల్లలకూ, కొత్తగా చదువు నేర్చుకొనే వయోజనులకూ, విద్యార్థులకూ పెద్దలకూ ఉపయోగపడే పుస్తకాలు వెలువడాలి. అవి మన జీవితానికీ, సంస్కృతికీ సంబంధించిన అన్ని విషయాలను గూర్చి ప్రచురితం కావాలి. మన దేశంలో నేటి పుస్తక ప్రచురణ ధోరణినిబట్టి చూస్తే మరి 70 ఏండ్లకుగాని మనం 15 లక్షల లక్ష్యాన్ని చేరుకోలేమేమో! ఆ 70 య్యేఏటనైనా ప్రచురణ వ్యాపారంలో పెద్ద పెట్టున మార్పు వస్తే తప్ప, లేకపోతే పరిస్థితి అంతగా మెరుగు కాదు. గడచిన సంవత్సరాలలో ప్రచురితమైన పుస్తకాలలో చాలవరకు తిరిగి అచ్చుకాకుండా పోతాయి. అవి పోగా ముప్ఫయి అయిదు వేలో, లేదా నలభై వేలో మిగులుతాయి. అటువంటప్పుడు మన ముఖ్య దేశభాషలు ఒక్కొక్క దానిలో లక్ష పుస్తకాలు ప్రచురితం కావలెనన్న మన గమ్యాన్ని ఎప్పుడు చేరుకోగలమో చెప్పడం కష్టం.

వేర్వేరు పుస్తకాల మొత్తం సంఖ్యనుబట్టి మన దేశంలో ఉత్పత్తి అవుతూవున్న ప్రచురణల రాశిని తెలుసుకో గలం. అయితే ఇవన్నీ మన జాతి అభివృద్ధికి ఎంతవరకు ఉపయోగపడుతున్నాయో తెలుసుకోవాలంటే ఇవి ఏ విషయాలకు సంబంధించి వ్రాయబడ్డవో తెలుసుకోవడం చాలా అవసరం. 1961 సంవత్సరంలో ప్రచురింపబడి కలకత్తా నేషనల్ లైబ్రరీకి అందిన పుస్తకాలలో ఇదమిత్థమైన విషయాలను గూర్చి వెలువడ్డ పుస్తకాల సంఖ్య 8,922. ఆ విషయాల వివరం ఇట్లా ఉంది:

| | |
|---|---|
| సాధారణ విషయాలు | 86 |
| తత్త్వశాస్త్రము, మానసిక శాస్త్రము. | 30 |
| మతము | 826 |
| సాంఘిక శాస్త్రములు | 2,955 |
| భాషాశాస్త్రము | 187 |
| కేవలం విజ్ఞానశాస్త్రము | 426 |
| సాంకేతికశాస్త్రము, ఇతర ఉపయోగ శాస్త్రాలు. | 67 |
| లలితకళలు, వినోద కాలక్షేపము | 98 |
| సాహిత్యము | 3,644 |
| చరిత్ర, భూగోళము, జీవితచరిత్రలు | 603 |

ఇక భాషలవారీగా విషయ వివరము ఈ దిగువ పట్టికలో ఇవ్వనైనది.

| | సాధారణ విషయాలు | తత్త్వ శాస్త్రము | మతము | సాంఘిక శాస్త్రము | భాషా శాస్త్రము | విజ్ఞాన శాస్త్రము | సాంకేతిక శాస్త్రము ఇతర ఉపయోగ శాస్త్రాలు | లలిత కళలు, వినోద కాలక్షేపము | సాహిత్యము | చరిత్ర,భూగోళము, జీవిత చరిత్ర | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తెలుగు | 7 | 2 | 86 | 48 | 11 | 13 | — | 7 | 388 | 41 | 603 |
| తమిళము | 4 | — | 72 | 46 | 8 | 28 | 3 | 5 | 295 | 45 | 506 |
| కన్నడము | 2 | 2 | 36 | 21 | — | 7 | — | 1 | 100 | 27 | 196 |
| మళయాళము | 1 | 1 | 22 | 23 | 4 | 3 | — | 1 | 282 | 39 | 376 |
| హిందీ | 7 | 2 | 96 | 339 | 27 | 55 | 11 | 6 | 585 | 49 | 1,177 |
| మరాఠీ | 6 | 6 | 70 | 129 | 17 | 26 | 4 | 6 | 291 | 11 | 626 |
| గుజరాతీ | 4 | 1 | 46 | 96 | 4 | 24 | 5 | 8 | 215 | 58 | 461 |
| ఒరియా | — | 1 | 9 | 21 | — | 12 | 2 | 1 | 67 | 3 | 116 |
| బెంగాలీ | 11 | 6 | 76 | 110 | 11 | 44 | 4 | 28 | 649 | 97 | 1,036 |
| అస్సామీ | — | — | 8 | 3 | 2 | 1 | — | 1 | 56 | 12 | 83 |
| గురుముఖి | 4 | 1 | 20 | 56 | 17 | 8 | 2 | 7 | 180 | 12 | 307 |
| ఉర్దూ | 1 | — | 53 | 20 | — | 3 | 2 | — | 157 | 20 | 256 |
| ఇంగ్లీషు | 39 | 8 | 155 | 2,037 | 76 | 197 | 34 | 27 | 318 | 118 | 3,009 |
| సంస్కృతము | — | — | 40 | 5 | 10 | — | — | — | 40 | 2 | 97 |
| ఇతరభాషలు | — | — | 37 | 1 | — | 5 | — | — | 21 | 9 | 73 |
| | 86 | 30 | 826 | 2,955 | 187 | 426 | 67 | 98 | 3,644 | 603 | 8,922 |

పై పట్టికనుబట్టి భారతీయ ప్రచురణలో నూటికి 40 వంతులు సాహిత్యానికి సంబంధించినవని విశదమవుతూ ఉంది. మొత్తం పుస్తకాలలో నూటికి 4½ వంతులు మాత్రమే విజ్ఞానశాస్త్ర గ్రంథాలు. ఇక సాంకేతిక ఉపయోగ్య శాస్త్రాలకు సంబంధించిన ప్రచురణలు నూటికి 1 వంతు కూడా లేవు. దీన్నిబట్టి ఈ అంశంలో మనం ఎంత వెనుకబడి ఉన్నామో తెలుసుకోవచ్చు. మరి ఈ విషయాలకు సంబంధించిన గ్రంథాలు వ్యవసాయ పారిశ్రామికాభివృద్ధికి అత్యవసరమైనవి. రష్యాలో ప్రచురితమయ్యే పుస్తకాలలో నూటికి 48 వంతులు సాంకేతిక ఉపయోగ్య శాస్త్రాలకూ, 12 వంతులు సాహిత్యానికీ, 7 వంతులు విజ్ఞాన శాస్త్రానికీ చెందినవి. దీనినిబట్టి కేవలం సిద్ధాంతాలతో కూడిన విజ్ఞాన శాస్త్రంపట్ల రష్యనులకు ఆసక్తి లేదని తెలుస్తూ ఉంది. సాంకేతిక శాస్త్రాలకు చెందిన పుస్తకాలను రష్యా దేశమే అత్యధికంగా ప్రచురిస్తూ ఉంది. ఇండియా అత్యల్పంగా ప్రకటిస్తున్నది. సాంకేతికశాస్త్ర ప్రచురణలు విషయంలో ఈ దిగువ భోగట్టా గమనించదగి ఉంది.

| దేశం | సంవత్సరం | ప్రచురణల మొత్తం సంఖ్య | సాంకేతిక శాస్త్ర గ్రంథముల శాతము. |
|---|---|---|---|
| అమెరికా | 1960 | 15,012 | 12 శాతం |
| ఇంగ్లండు | 1960 | 23,783 | 16 ,, |
| జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ | 1960 | 21,103 | 12 ,, |
| జపాన్ | 1960 | 23,682 | 12.5 ,, |
| థాయిలెండ్ | 1960 | 1,472 | 2.5 ,, |
| నెదర్లాండ్స్ | 1960 | 7,893 | 9.5 ,, |
| బెల్జియం | 1960 | 3,645 | 11 ,, |
| బర్మా | 1959 | 608 | 3.6 ,, |
| సింహళము | 1960 | 1,767 | 6 ,, |
| జెకోస్లావేకియా | 1960 | 7,930 | 26 ,, |
| ఫ్రాన్సు | 1960 | 11,872 | 5.5,, |

భారతదేశంలో సాహిత్య ప్రచురణలకు హెచ్చు ఆదరాభికి తగు కారణా లున్నాయి. భారతీయ ప్రచురణలు డబ్బు సంపాదించేవి కావు. కొన్ని సందర్భాలలో ప్రచురణకర్తకు ఖర్చు గడవడం కూడా కష్టమే. ఆంగ్లభాషా గ్రంథాలు, ఎక్కువగా విదేశీ ప్రచురణలు పరిపాలనా వ్యవహారాలకూ, పరిశ్రమలకూ, వృత్తి పనుల వారికీ అత్యవసరమైనవి. సాంకేతిక, విజ్ఞానశాస్త్ర గ్రంథాలు అమెరికా నుంచి, యూరపునుంచి మనం దిగుమతి చేసుకుంటున్నాము. ఈ విషయాలకై ఇతర దేశాలలో కేటాయింపు చేయబడ్డ శాతమును ఆధారంగా పెట్టుకొని భారతదేశం సాహిత్య గ్రంథాలను అధికంగా ప్రచురిస్తూ ఉంది. ఇట్టి గ్రంధాలు మన దేశంలో విద్యావంతులైన వారికి కాలక్షేపానికి ముఖ్య సాధనాలుగా ఉన్నాయి.

మన దగ్గిర ఒక వస్తువు లేనప్పుడు దాన్ని మన మిత్రులవద్ద నుంచి తీసుకొని అవసరం గడుపుకుంటాము. పుస్తక ప్రపంచం విషయంలో ఈ ఎరువు తెచ్చుకొనే పనిని మనం అనువాదాల ద్వారా చేస్తున్నాము. అయితే ఇందులో కూడా సాంకేతిక విజ్ఞానశాస్త్ర గ్రంథాలకు ఇవ్వవలసిన ప్రాముఖ్యం ఇవ్వకుండా సాహిత్యానికే ప్రాధాన్య మిస్తున్నాము. ఇంగ్లీషు బాగా వచ్చినవారు దిగుమతి అయిన పుస్తకాలతో పని గడుపుకుంటారు. కాని తమ మాతృభాష తప్ప ఇతరభాష రాని లక్షలాది కార్మికులు, వృత్తిపనులవారి మాటేమిటి ? వారికి దేశభాషలలో సాంకేతికశాస్త్ర గ్రంథాలను లభింపజేసినట్లయితే వారు మరింత సామర్థ్యంతో పనులు చేయగలుగుతారు. మన దేశంలో ప్రచురింపబడుతూఉన్న పుస్తకాల భోగట్టాను పరిశీలిస్తే సామాన్య మానవునికి ఎటువంటి పుస్తకాలు కావాలో, వేటివల్ల మన వృత్తి పనివారల ప్రావీణ్యము పెంపొందుతుందో, వేటివల్ల జనం ఉత్తమ పౌరులుగా రూపొంది దేశాభ్యుదయానికి కారకు లవుతారో వాటి సంగతి అసలు మనం శ్రద్ధగా ఆలోచించడంలేదని విదిత మవుతున్నది.

ఇక పోతే అనువాదాల సంగతి. 1961 లో 771 అనువాదాలు రిజిష్టరు చేయబడ్డవి. వీటిలో తెలుగువి 94, మలయాళానివి 82, హిందీవి 193. బెంగాలీలోకి అనువదింపబడ్డ పుస్తకాలు 76. ఇంగ్లీషులోకి 58 పుస్తకాలు మాత్రమే తర్జుమా అయ్యాయి. ఈ అనువాదాలు ఏయే భాషల నుంచి చేయబడ్డాయో గమనిద్దాము.

| మూలభాష | అన్ని భాషల్లో మొత్తం | మూలభాష | అన్నిభాషల్లో మొత్తం. |
|---|---|---|---|
| అరబ్బీ | 5 | మళయాళం | 2 |
| అస్సామీ | 1 | మరాఠీ | 18 |
| బెంగాలీ | 106 | నార్వీజియన్ | 6 |
| చైనాభాష | 8 | ఒరియా | 1 |
| ఇంగ్లీషు | 278 | పంజాబీ | 8 |
| ఫ్రెంచి | 29 | పర్షియన్ | 8 |
| జర్మన్ | 28 | రష్యన్ | 33 |
| గుజరాతీ | 26 | సంస్కృతం | 108 |
| హిందీ | 38 | తమిళం | 10 |
| ఇండోనేషియన్ | 1 | తెలుగు | 6 |
| ఇటాలియన్ | 3 | ఉర్దూ | 20 |
| జపాన్ | 2 | ఇతర భాషలు | 23 |
| కన్నడ | 3 | | |
| | | మొత్తం | 771 |

పై భోగట్టాను బట్టి సంస్కృతము కాక తక్కిన భాషలలో బెంగాలీ సాహిత్యమే పాఠకుల అధిక ఆదరాభిమానాలకు పాత్రమైనట్లు వ్యక్తమవుతున్నది. 1961 లో 106 బెంగాలీ పుస్తకాలు భారతదేశ భాష లన్నింటిలోకి అనువదింపబడ్డవి. బెంగాలీ తరువాత చెప్పుకోదగ్గది హిందీ. కాని హిందీ నుంచి 38 ప్రచురణలు మాత్రమే అనువదిత మైనవి. మన అనువాదాలలో నూటికి 50 వంతులు పాశ్చాత్య గ్రంథాల నుండే చేయబడుతున్నాయి. ఇంగ్లీషునుంచి 278 పుస్తకాలు అనువదింపబడ్డాయి. అనువాదాలు చేసుకొనే విషయంలో మన దృష్టి ఇంకా ప్రాచ్య దేశాల గ్రంథాల వైపు పోలేదు.

ఇక దేశ భాషలలో ఒక భాష నుండి మరొక భాషలోకి చేయబడే అనువాదాల సంగతి పరిశీలిద్దాము. ఇది అసంతృప్తికరంగానే ఉంది. మన దేశంలోని వివిధ ప్రాంతాలు ఒకదానిని మరొకటి చక్కగా అవగాహన చేసుకోవాలంటే ఒక భాషకు చెందిన సాహిత్యం మరొక భాషలోకి తగు రీతిలో అనువాదం చేయించి ప్రకటించవలసిన అగత్య మెంతైనా ఉంది.

తగు రీతిలో అని ఎందు కంటున్నానంటే ఇప్పుడు వస్తూవున్న అనువాదాలు సంతృప్తికరంగా లేవు. ఇందుకు తగు కారణాలు ఉన్నాయి. చాలా సందర్భాలలో అనువాదకులకు వారు ఏ భాష నుంచైతే ఒక పుస్తకాన్ని అనువదిస్తారో ఆ భాషలో పాండిత్యం గలవారు కారు. పాండిత్యం లేకపోతే పోయే, అది క్షుణ్ణంగా ఎరుగనివారు కూడా అనువదించడం జరుగుతున్నది. ఇక యూరపు ఖండపు భాషల పుస్తకాలను నేరుగా ఆయా భాషల నుంచి అనువదించడం జరుగదు. మొదట అవి ఆంగ్లంలోకి భాషాంతరీకరణము చెంది ఆపిమ్మట ఆంగ్లం నుంచి దేశ భాషలలోకి తర్జుమా చేయడం జరుగుతూ ఉంది. కాబట్టి మూల గ్రంథాలలోని గుణ విశేషాలను మనవారు గ్రహింపు చేసుకోవడం తరచు కష్టతర మవుతున్నది.

అనువదించే గ్రంథాల భోగట్టాను పరిశీలించినా ఈ రంగంలో కూడా సాహిత్యం పైననే హెచ్చు మోజు కన్పిస్తున్నది. అనువాదాలలో నూటికి 50 వంతులు సాహిత్య గ్రంథాలే. 9 గ్రంథాలు విజ్ఞానశాస్త్రానివి, 39 గ్రంథాలు సాంకేతిక ఉపయోగ్య శాస్త్రాలవి, వెలువడ్డాయి. తక్కిన విషయాలలో వెలువడ్డ పుస్తకాల వివరం ఇట్లా ఉంది.

| | |
|---|---|
| సాధారణ విషయాలవి. | 2 |
| తత్త్వశాస్త్రము, మానసిక శాస్త్రము. | 39 |
| మతము. | 112 |
| సాంఘిక శాస్త్రాలు. | 78 |
| భాషాశాస్త్రములు. | 8 |
| లలితకళలు, వినోద కాలక్షేపము. | 12 |
| చరిత్ర, భూగోళము, జీవిత చరిత్ర వగైరాలు. | 88 |

కొందరు మన భారతదేశంలో ప్రచురణ వ్యాపారం చాలా వృద్ధిలోకి వస్తుందని అంటూ ఉంటారు. ఆ సంగతి ఋజావు చేసుకోవడానికి ఈ దిగువ పట్టీని పరిశీలించాలి.

| సంవత్సరం | భారతదేశ భాషల ప్రచురణలు | యూరపుఖండ భాషల ప్రచురణలు | మొత్తం. |
|---|---|---|---|
| 1889—90 | 8,461 | 917 | 9,378 |
| 1920—21 | 10,105 | 1,690 | 11,795 |
| 1930—31 | 14,074 | 2,353 | 16,427 |
| 1950—51 | 10,377 | 2,312 | 12,689 |
| 1956—57 | 13,104 | 3,163 | 16,267 |
| 1961—62 | 11,715 | 9,361 | 21,076 |

పైన 1961—62 సంవత్సరం బాపతు ప్రచురణలలో 5,000 వరకూ ప్రభుత్వ ప్రచురణలే ! కాని అంతకు పూర్వపు సంవత్సరాలకు ఎదురుగా చూపబడిన సంఖ్యలలో ప్రభుత్వ ప్రచురణలు చేరి లేవు. ఎందుచేతనంటే ఆయా సంవత్సరాల లెక్కలు 1867 సంవత్సరపు ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ ఆఫ్ బుక్స్ చట్టము ననుసరించి వచ్చిన భోగట్టాను బట్టి సిద్ధము చేయబడ్డవి. దేశపు మొత్తం ఉత్పత్తిని అంచనా వేసుకోవాలంటే 1889—90 సంవత్సరం నుంచి మొదలయ్యే అయిదేండ్ల సంఖ్యలకూ సగటున 2,000 ప్రచురణలను చేర్చుకోవాలి. ఈవిధంగా వేటికి 71 యేండ్ల క్రితం భారతదేశంలో 11,378 ప్రచురణలు వెలువడ్డవి. 1930—31 లో 18,427 వెలువడ్డవి. 1961—62 లో 21,076 ప్రచురితమైనవి. 1930—31, 1961—62 మధ్యకాలంలో కంటె 1889—90, 1930—31 మధ్యకాలంలో ప్రచురణ వడిగా జరిగింది. 1930—31 నుంచి భారత దేశభాషల ప్రచురణలు వృద్ధిజెందలేదు. 1930—31 లో రమారమి 14,000 ప్రచురణలు వెలువడగా 1961—62 లో 11,715 మాత్రమే వెలువడ్డవి. కాబట్టి దేశభాషల్లో ప్రచురణ వ్యాపారం పెంపు కాలేదనే చెప్పాలి.

అయితే ఈ మాటను మనమే నమ్మలేము. కారణమేమంటే దేశంలో విద్యావంతుల సంఖ్య ఆయేటి కాయేటికీ పెరుగుతూనే ఉంది గానీ తరగడంలేదు. గడచిన 71 ఏండ్లలో విద్యావంతుల సంఖ్య నూటికి 6 వంతుల నుంచి 23.7 వంతులకు పెరిగింది. అంటే 4 రెట్లు పెరిగిందన్నమాట. భారతదేశం స్వతంత్రమైనప్పటినుండి విద్యారంగంలో, పారిశ్రామిక రంగంలో నిజంగా ఎంతో అభివృద్ధిని సాధించింది. మరి ఆ దామాషా ప్రకారం పుస్తకాల సంఖ్య వృద్ధి జెందకపోతే, పుస్తకాల వాడకం పెరగకపోతే ఆ అభివృద్ధి ఎలా సాధ్యమైనట్లు ? దామాషా ప్రకారం పుస్తకాల సంఖ్య పెరిగి ఉంటే 1961—62 సంవత్సరంలో 21,000 ప్రచురణలకు బదులు 45,000 ప్రచురణలు వెలువడి ఉండాలి. మనం సాధించిన ప్రగతిలో పుస్తకాల అవసరం కలిగినమాట వాస్తవమే. అయితే ఆ అవసరాన్ని మనం ఆయేటి కాయేటికి అధికంగా విదేశీ ప్రచురణలను దిగుమతి చేసుకోవడం ద్వారా తీర్చుకున్నాము. అందుకు ఈ క్రింది పట్టికయే నిదర్శనం.

| సంవత్సరం. | దిగుమతిచేసుకున్న పుస్తకాల విలువ రూ. |
|---|---|
| 1869—70 | 10,59,812 |
| 1889—90 | 21,50,266 |
| 1920—21 | 65,99,989 |
| 1930—31 | 60,91,405 |
| 1946—47 | 48,42,495 |
| 1961—62 | 2,34,28,479 |

ఈవిధంగా గడచిన 71 ఏండ్లలో విదేశీ ప్రచురణల దిగుమతి 11 రెట్లు పెరిగింది. మరి విద్యావ్యాప్తి 4 రెట్లకు ఇంకా తక్కువే జరిగింది. ఇలా విదేశీ ప్రచురణల దిగుమతిపై మనం ఆధారపడటానికి ముఖ్య కారణం భారతదేశ భాషల ప్రచురణలు క్రమేపీ వృద్ధిజెందకపోవడమే. 1889—90 సంవత్సరంలో 8,461 ప్రచురణలు వెలువడగా 1961—62 వచ్చేసరికి 11,715 ప్రచురణలు మాత్రమే వెలువడ్డవి. ఈలోగా దేశం విద్యా విషయకంగా, పారిశ్రామికంగా ఎంత అభివృద్ధి జెందింది ! ఎన్ని ఎక్కువ పుస్తకాలు వెలువడ్డవి. సుమారు మూడువేల చిల్లర మాత్రమే కదా !

ఈనాడు భారత దేశభాషల ప్రచురణలలో అధికభాగం కథలు, నవలలు, హైస్కూళ్ళకు కాలేజీలకు పాఠ్యపుస్తకాలై ఉన్నాయి. ఇప్పుడు పబ్లిక్ లైబ్రరీలు పుస్తకాలు కొనుక్కోవడానికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు గ్రాంట్లు రూపంగా ధన సహాయం చేస్తున్నాయి. ఈ డబ్బులో అధిక భాగాన్ని లైబ్రరీలు, కథలు, నవలలు మొదలగు కాలక్షేప గ్రంథాల కొనుగోలుకు వినియోగ పరుస్తున్నాయి. కథలకు, నవలలకు డిమాండు పెరగడంతో కొత్త రచయితలు రంగంలోకి వస్తున్నారు. వారు వ్రాసినవి అచ్చులోకి వస్తున్నాయి.

ఇప్పుడు ప్రాంతీయ భాషలను కొన్నిచోట్ల డిగ్రీ కోర్సులలో కూడా బోధనా భాషలుగా అవలంభించారు. ప్రచురణ కర్తలు కూడా ఆయా భాషలలో హైస్కూళ్లకు, కాలేజీల కోర్సులకూ, ఉపయోగపడే పుస్తకాలను ప్రచురించడం లాభసాటి వ్యాపారంగా పరిగణిస్తున్నారు. కాని ఇట్టి పాఠ్య పుస్తకాలలో మౌలికత (Originality) తక్కువ. విషయం ఎందులో నుంచో ఎరువు తెచ్చుకున్నదే. ఈ పుస్తకాలు ముఖ్యంగా విద్యార్థులు పరీక్షలలో ఉత్తీర్ణులు కావడానికి ఉద్దేశింపబడ్డవే కాని విజ్ఞానాన్ని కలుగజేసేవి కావు. ప్రాంతీయ భాషలలో ఏదేని ఒక భాష బోధనా భాషగా డిగ్రీ కోర్సులు చదివిన విద్యార్థులకు ఆయా విషయాలపై ప్రవీణులు మేధావులైనవారు వ్రాసిన పుస్తకాలను చదివే అవకాశం లుప్తమైపోతూ ఉంది. భారతదేశంలో సైతం ఆయా శాస్త్రాలలో లేక విషయాలలో ప్రామాణికులని పేరు గాంచిన పండితులు, విద్యావేత్తలు ఆంగ్లంలోనే గ్రంథాలు రచిస్తారు. మరి ప్రాంతీయ భాషలో ఉన్నతవిద్య నభ్యసించిన వారికి ఇటువంటి గొప్ప రచయితల గ్రంథాలను, విదేశీయ నిపుణులు చేసిన రచనలను చదివే అవకాశం కలుగదు. ఈ విద్యార్థులు భారతీయ భాషలలో స్థానికులు సిద్ధపరచిన సంగ్రహములపైన, నోట్సుపైన ఆధారపడవలసిందే. ఈ పరిస్థితి మన యువకతరంవారి విద్యా వైదుష్య ప్రమాణాలు క్రమేణా తగ్గడానికే హేతు వవుతుంది.

అభివృద్ధి, పుస్తకాలు—ఇవి రెండూ ఒకదాని నొకటి అంటిపెట్టుకొని ఉండేవి. ఒకదాని మంచి రెండవదానివి విడదీయలేము. ఒకటి ఉన్నప్పుడు రెండవది ఉండి తీరుతుంది. చదువగలిగిన ప్రతి వ్యక్తికీ అతని భాషలో పుస్తకాలను, పత్రికలను అతనికి లభ్యం చేయకపోతే ఆ వ్యక్తి జాతి అభ్యుదయానికి తన వంతు చెల్లింపజాలడు.

దేశ నిర్మాణ కార్యకలాపాలకు పరిపోవునన్ని భారతీయ ప్రచురణలు లభ్యం కానందుననే స్వాతంత్ర్యానంతరం విదేశీ ప్రచురణల దిగుమతి హెచ్చింది. కొన్ని పరిశ్రమల విషయంలో స్వయం సమృద్ధిని సాధించడానికి మనం సర్వ ప్రయత్నాలు చేస్తున్నాము. ఆచరణరీత్యా గొప్ప కృషి జరుగుతూ ఉంది. అయినప్పటికీ మన ప్రచురణ పరిశ్రమను పెంపు జేసే గట్టి ప్రయత్నం జరగడంలేదు. నేటికీ విదేశీ ప్రచురణల తాలూకు భారతీయ ముద్రణలను తీసుకురావడానికీ, భారతదేశ ప్రజా జీవితమును గూర్చి, భారతీయ సంస్కృతిని గూర్చి ఆంగ్లంలో ప్రామాణిక గ్రంథాలను ప్రచురించడానికీ దేశీయ ప్రచురణ కర్తలకు తగు ప్రోత్సాహ మివ్వడం జరుగుతూనే ఉంది. భారతీయ భాషలలో ప్రామాణిక గ్రంథాలను ప్రచురించడంకన్న విదేశీ ప్రచురణల దేశీయ ముద్రణలను తేవడం లాభసాటి వ్యాపారంగా కూడా ఉంది.

బ్రిటిషువారి హయాములో భారతదేశంలో ప్రచురణ పరిశ్రమ అభివృద్ధి చెందడానికి అవకాశాలు ఉండేవికావు. అప్పుడు మనం ఆంగ్ల ప్రచురణలను దిగుమతి చేసుకొనే వాళ్లం గాని బ్రిటిషు ప్రచురణకర్తల మంచి చెడుగులను, సాధకబాధకాలను పంచుకొనే వాళ్లం కాము. రెండు శతాబ్దాలు గడచిన తరువాత కూడా మన దేశంలో అన్ని యోగ్యతలు గల గ్రంథకర్తలు, అనువాదకులు, సంపాదకులు, వ్యాఖ్యాతలు చిత్రకారులు, ముద్రాపకులు, వ్యాపారస్థుల కొరత ఉంది. మరి ఈ కొరతను పూరించి, పుస్తక ప్రచురణ పరిశ్రమను పెంపొందించాలంటే చక్కని పథకాలు వేసుకొని యోచన చేసి తగు చర్యలు తీసుకోవడం చాలా అవసరం.

(సాహిత్య అకాడమీ పత్రికనుండి)

---

మ. మడిగా నుండిన తల్లి! కన్నకొడుకున్ మైమైలగానంట నీ
కెడగల్గం జనుమంచు కోపపడు, నీకీ మర్త్యులందెంత ప్రే
ముడి, నిన్నంటియశుద్ధులైన గదియం బూతాత్ములంగావింతువీ
కడలుం జేతులనంటి పావనధునీ! కల్యాణి గోదావరీ!

# అథర్వణోపదిష్టమగు అన్యదేశీయము



శ్రీ వంతరాం రామకృష్ణారావు

"అహేయు మన్యదేశీయం యత్తదేవ ప్రయుజ్యతే" అను అథర్వణకారికలోని అన్య దేశీయము కర్ణాటకమని నేను శోభకృత్ సంవత్సరాది సంచికలో వ్రాసి యున్నాను. (బసవ పురాణ కావ్య భాషాచ్ఛందో విశేషములు) దీనిపై జూన్ భారతిలో శ్రీ త్రినేత్రగారు సందేహములను వెల్లడించి యున్నారు. ప్రాజ్ఞులు సందేహించినప్పుడు ఉపేక్షించుట ధర్మముకాదు. కావున సంక్షేపముగా సమాధానము వ్రాయు చున్నాను.

(1) కన్నడ పదములు శ్రీ వజ్ఝలవారి మతమున నన్య దేశ్యములు కావని త్రినేత్రగారు వ్రాసినారు. వారికి శ్రీ వజ్ఝలవారి ఆశయ మవగతము కాలేదని యచ్చటి వాక్యములే చెప్పుచున్నవి. "తమిళ కన్నడాది భాషల సంబంధము గల తెల్గు శబ్దముల నన్యదేశ్యము లనరాదు. మూరు శబ్దము తెల్గున వాడ బడునప్పుడు దాని నన్యదేశ్య మనఁ జనును" అని శ్రీ వజ్ఝలవారు వ్రాసి వివరించి యున్నారు. "వారి (శ్రీ వజ్ఝలవారి) వ్రాతలు పరస్పర విరుద్ధముగా నున్నవి. మూరు శబ్దము తమిళ, కన్నడ భాషల సంబంధియగు శబ్దము కదా! 'మూరు' అన్యదేశ్యమనఁ జనును—అనినారు. అది ఏలాగు సంభవమో" అని త్రినేత్రగారు సందేహించినారు. శ్రీ త్రినేత్రగా రనుకొన్నట్లు 'మూరు' శబ్దము తమిళ, కన్నడ భాషల సంబంధియగు పదము కాదు. అది కన్నడ పదమే. కావుననే శ్రీ వజ్ఝలవారు మూరు శబ్దమును నన్యదేశ్య మన్నారు. తమిళ, కన్నడ భాషల సంబంధముగల శబ్దమని శ్రీ వజ్ఝలవారు ఉదాహరించినది 'మూఁడు' శబ్దము. ఇది మూను —మూరు—అను తమిళ, కన్నడ శబ్దముల సంబంధము కలది. ఐనను అన్యదేశ్య మనిపించుకొనదు. ఆంధ్ర దేశ్యమే అగును. తమిళ, కన్నడ శబ్దములు—తమిళ, కన్నడ సంబంధము గల శబ్దములు— అనువాని భేదము గమనింపక శ్రీ త్రినేత్రగారు శ్రీ వజ్ఝల వారి వ్రాతలలో పరస్పర వైరుధ్య మున్నట్లు వ్రాసినారు. వారి మతమున కన్నడ పదము లన్యదేశ్యములు కావనియు వ్రాసినారు. ఇది కేవలము పొరపాటు. కన్నడ పదములు తెల్గున వాడబడునప్పు డన్యదేశ్యములే యగునని శ్రీ వజ్ఝల వారి యాశయము. కావున నేను చెప్పిన యర్థము విరుద్ధము కాదు.

(2) అహేయు మన్య దేశీయం యత్తదేవ ప్రయుజ్యతే" అను అథర్వణకారిక వ్యాఖ్యలో శ్రీ శాస్త్రిగారు తురుష్కాది భాషా పదములను ఉదాహరించినారు, నిజమే. వికృతివివేకకర్త అథర్వణుడే అన్నది శ్రీ వజ్ఝలవారి సిద్ధాంతము. ఆనాటికే తురుష్కాది భాషాపదము లుండుటకు వీలు లేదనియు, నందుచే వికృతి వివేక కర్త అథర్వణు డగుట పొసగ దనియు శ్రీ తూమాటి దోణప్పగారు వ్రాసియున్నారు. (జూన్ 1959 భారతి) దీనిపై శ్రీ వజ్ఝలవా రిట్లు సమాధానము నిచ్చిరి. "ఆనాఁటికిఁ దెల్గున నన్యదేశ్యము చేరలే దనుట సత్యవిదూరమగుటంజేసియు వారు మూలభూతమగు 'ఆంధ్ర శబ్ద చింతామణి' ని గాని దాని వివరణమగు వికృతి వివేకమునుగాని యాఘ్రాణించుటయు లేమింజేసి వారి వ్యాసమును విమర్శించుట యనావశ్యకము" (బాల ఉద్యో. విజ్ఞప్తి యనుబంధము).

శ్రీ వజ్ఝలవారు "ఆనాఁటికిఁ దెల్గున నన్యదేశ్యము చేరలేదనుట సత్యవిదూర మగుటంజేసియు" అని వ్రాసిరే కాని చేరిన యన్యదేశ్యములను చూపి, యెట్లు సత్య సమ్మతమో నిరూపించి యుండలేదు. అందుచేతనే శ్రీ దోణప్పగా రిట్లు వ్రాయుట కవకాశము లభించినది. "మూలతత్త్వ మిట్లున్నదని యెఱిగియు శ్రీ వజ్ఝలవారు తమ బాల వ్యాకరణోద్ద్యోత పీఠికలో అన్యదేశ్య ప్రసక్తిలో విమర్శక మర్యాదల నతిక్రమించి స్వవచో వ్యాఘాతముగా ప్రసంగము నడుపుట శోచనీయము" ('సాహితి'—1962 నవంబరు.)

శ్రీ వజ్ఝల వా రథర్వణుని నాటికి తురుష్కాది పదములు భాషలో చేరినవని యెక్కడను చెప్పియుండలేదు. కావ అన్యదేశ్యము చేరలేదనుట సత్యవిదూర మనుట 'బుకాయింపు'గ తోచును. మరి శ్రీ శాస్త్రిగారు బుకాయించినారా? అన్నచో లేదు. కాని వారి ఆశయము నిగూఢముగా ఉండిపోయినది.

అథర్వణకారికలో 'అన్యదేశీయమ్' అని యున్నది. ఆ యన్య దేశీయమేదో మనకు తెలియదు. తురుష్కాది పదముల నాకారిక కడ నుదహరించినవారు శ్రీ వజ్ఝలవారు. అథర్వణకారికా వళి టీకా కర్తలు ద్విత్వింత్రిణి సీతారామ కవిగారు "క్రీవి, తవర—ఇత్యాదులు" అన్నారు. తురుష్కాది భాషా పదము లథర్వణుని నాటికి భాషలో చేరుటకే వీలు లేదన్నచో శ్రీ వజ్ఝలవా రిచ్చిన యుదాహరణము లథర్వణోద్దిష్టములు కావని తేలును, తురుష్కాది పదములు చేరుటకు వీలు లేనిచో కర్ణాటాది పదములు చేరుటకు కావలసినంత వీలు గలదు. నన్నెచోడా దులు కన్నడ పదములను ప్రయోగించి రనుటలో విప్రతి పత్తియే లేదు. కాన అథర్వణోద్దిష్టమగు అన్యదేశీయము తురుష్కాదికము కానిచో కర్ణాటకము కావచ్చును. ఈ పక్ష మున శ్రీ వజ్ఝలవారు తురుష్కాది పదముల నాకారికకు ఉదాహరణములుగా నిచ్చుట సరికాక పోవును.. అంతేకాని అథ ర్వణుని కర్తృత్వమునకు భంగము కలదు. అందుచేతనే శ్రీ వజ్ఝలవారు "అనాంటికిఁ దెల్గున నన్యదేశ్యము చేరలేదనుట సత్యవిదూర" మని వ్రాసిరి. తురుష్కాది పదములు చేరలేదనుట సత్యవిదూరమని వ్రాయలేదు. శ్రీ వజ్ఝలవారి నిగూఢా శయము నూహించియే నేను—అథర్వణోపదిష్టమగు అన్య దేశీయము కన్నడమని వ్రాసితిని.

శ్రితిశ్రోత్రగారి సందేహ నివృత్తికి సమాధానము చాలును. గాని యిచ్చట యీ చర్చ అన్నిటికి మూలమైన 'తాయెతు' శబ్ద చర్చను గూర్చి వ్రాయవలసి వచ్చుచున్నది. శ్రీ తూమాటి దోణప్పగారు "దోలాభూషితాత్తకీయాణి" అనుకారికలో నథర్వ ణుడు పేర్కొన్న 'తాయెతు' శబ్ద మరబ్బీ నుండి వచ్చి నపదము, అది యథర్వణుని నాటికి భాషలో చేరిన దనుటకు వీలులేదనియు 'వికృతి వివేక కర్తృత్వము' అను వ్యాసమున వ్రాసిరి. (జూన్ 1959 భారతి) ఆ సందర్భములోనే అన్య దేశ్యము—అనగా తురుష్కము నథర్వణుడు స్మరించుట కవ కాశము లేదనిరి. అందుచే తురుష్కము కానిచో కన్నడ మగు నని చెప్పవలసి వచ్చినది. ఇక 'తాయెతు' శబ్దము తురుష్క మగుట కర్తృత్వమునకు బాధకము కాదా ? అన్న ప్రశ్న ఉద యించు చున్నది. దీనికి శ్రీ వజ్ఝలవారు సమాధానము నిచ్చి యుండలేదు. 'తాయెతు' శబ్ద మన్యదేశ్యమని శ్రీ దోణప్ప గారు తప్ప మరెవ్వరును చెప్పియుండలేదు. ఆంధ్రదేశ్య మనియే యెల్లరును అభిప్రాయపడిరి. తురుష్క పదమును నథర్వణుడు పేర్కొనుటకే వీలు లేదన్నచో ఆయన 'భూషా' శబ్దమును 'తాయెతు' గా భావించరే దనవలెను. లేదా 'తావీజు' పదముతో నేర్పడిన యాదృచ్ఛిక సామ్య మనవలెను. అన్యదేశ్య మన్నను దీనిని పేర్కొనుట కర్తృత్వమున కెట్లు బాధకము కానక్కరలేదో కొలదిగా వ్రాసెదను. అథర్వణునకు పూర్వము, అరబ్బు వర్తకులో మరెవ్వరో వచ్చియుండరాదా ? అని ప్రశ్నించుకొని శ్రీ దోణప్పగారు "వచ్చిన మాట వాస్త వము. క్రీస్తుశకము ఎనిమిదవ శతాబ్దము నుండియు భారత దేశమున నారి దాడులు మొదలైనవి. క్రీ. శ. 848 నుండి 1335 దాక సుమారైదు శతాబ్దముల వ్యవధిలో ఇంచు

మించు ఇరువది మంది అరబ్బీ భూగోళ శాస్త్రజ్ఞులు భారత దేశమును గూర్చి అరబ్బీలో వ్రాసిరి." ఇత్యాది వివరములు తెలిపిరి. మరి 'తాయెతు' శబ్దము వచ్చియుండరాదా ? అన్నచో వచ్చియుండెననుటకు వీలుపడదని చర్చచేసిరి. "ఎన్నో పదము లుండగా ఈ యొక్క 'తాయెతు' మాత్రమే ఒంటెత్తుగా తెనుగున జారబడిన దనుట శాస్త్రీయ పరిశీలన విధానమునకు విరుద్ధము" అనిరి. ఇది 1959 నాటి ప్రసంగము. ఇటీవల "త్రాసులంబోని చిత్తంబుల తోడుతఁ బ్రజ వివాదము లెడఁ బక్షముడిగి" (శాంతి 2—374) అనుచో తిక్కన "త్రాసు" అను అన్య దేశ్యము ప్రయోగించినాడని ప్రకటించిరి. (ఆంధ్రప్రదేశ్—జూన్ 1963) ఇక "అస్తిత్వమువలె అభావము ప్రామాణ్యము కాజాలదను" పూర్వపక్షమును "బలీయములగు ఇతర యుక్తుల సన్నిధిలో ఈ శంకకు తావులేదు" అని త్రోసివేయుట యుక్తము కాదు గదా !

"తాయెతును మయ్యెలయుఁ బయ్యెదయును దక్క" అను ముద్దరాజు రామన పద్య మధర్వణకారిక కనువాదమే— అనుట యుక్తము. "పరుషావా స్వరూపేణ" ఇత్యాది కారికలకు చేయబడిన అనువాదమును 'కవి సంజీవని' లో కలదు.

అహోబలుడే వికృతివివేక కర్త యనియు "అధర్వణుడు నాలుగైదు శతాబ్దులు మన్నైపు నడిచి వచ్చినచో వికృతి వివేక కర్తృత్వము వాయనకే కట్టపెట్టుటలో నేను మొట్టమొదటివాడను" అనియు శ్రీ దోణప్పగారు వ్రాసిరి. అధర్వణకారికావళి 13 వ శతాబ్దమునాటి దనుటకు లిపి విషయక శ్లోకాదులు ప్రమాణము లగుచున్నవి. కాన అహోబలునే మూడు నాలుగు శతాబ్దులు వెనుకకు నడుపవలసియుండును. అధర్వణకారికలు పెక్కు అహోబలుని కర్తృత్వమే కాలేదు. కాన వెనుకకు నడిపించినను అతనికి కర్తృత్వమును కట్టిపెట్టుట దుర్ఘటము. ఇక అధర్వణుని ముందుకు నడుపు మాటయా ? 'త్రాసు' అను అన్య దేశ్యమును ప్రయోగించిన తిక్కనగారిని మూడు నాలుగు శతాబ్దులు ముందుకు నడిపించినచో, 'తాయెతు' శబ్దమును 'భూషా' శబ్దముతో పేర్కొన్నాడని చెప్పబడుచున్న అధర్వణుని ముందుకు నడిపించు మాట చూతము.

చింతామణి వికృతివివేక కర్తృత్వముల విషయమై యిప్పటికే చాలా చర్చలు జరిగినవి. వైయాకరణ పారిజాతపు విజ్ఞప్తి యనుబంధమును సహృదయతతో చదివి పాఠకులు తమకు సత్యమని తోచిన మార్గము ననుసరించుట మేలు. ఇంకను చర్వితచర్వణములగు బహిరంగ పరీక్షలతోను, ఆంతరంగిక పరీక్షలతోను పత్రికలను నింపుటవలన ప్రయోజనము శూన్యము. కాన యీ విషయమై చర్చ లింక అనవసరము.

"అహేయ మన్యదేశీయమ్" అనుకారికలోని అన్యదేశీయము కన్నడమని నేను చెప్పుటకు కారణము శ్రీ దోణప్పగారి "వికృతి వివేక కర్తృత్వము" అను వ్యాసమే. కావున ఆ వ్యాసమును కొలదిగా విమర్శించవలసి వచ్చినది. పై కారికకు కన్నడ పదములతోపాటు "త్రాసు, తాయెతు" శబ్దముల నుదాహరణములుగా ఈయదగునని తోచుచున్నది. 'త్రాసు' శబ్దము తిక్కన ప్రయుక్తమని కనిపెట్టిన ఖ్యాతి శ్రీ దోణప్పగారికే దక్కినది. ఇందుకు వా రెంతయు ప్రశంసనీయులు. శ్రీ త్రినేత్రగారు సందేహము ప్రకటించుటచే ఈ విషయములు ప్రస్తావింపక తప్పినది కాదు. ఇంతటితో 'స్వస్తి'.

---

ఆ. వె. ఉక్కుపెట్టెలేల? చిక్కుతాళము లేల?
రాతిగోడ లేల? హేతు లేల?
ప్రజల సొత్తుగావ బలవంతుఁడగు రాజు
శాసనంబు సరిగ జరుగుచున్న.

# బ్రిటిష్ చిత్రకళ



### శ్రీ ఎస్. వి. రామారావు

ఈ సంవత్సరం ఎన్నో ప్రముఖ కళాప్రదర్శనలు జరుగుతున్నాయి లండన్‌లో. ఒక్కసారి ఇంత హడావుడి ఎందుకు జరుగుతున్నదా అని ఎవరికైనా సందేహం వస్తుంది. దానికి చాలచాల కారణాలున్నాయి. ప్రపంచ చిత్రకళకు, చిత్ర శిల్పకళా రంగాలలో వలుసూత్న ప్రయోగాలకు కూడలియైన పారిస్— రోజురోజుకు ప్రాముఖ్యతను గోల్పోతున్నది. దీనికి కారణం ఏమో చెప్పలేము. అమెరికా, ముఖ్యంగా, న్యూయార్కు నగరం ఈ పారిస్ స్థానాన్ని ఆక్రమించింది. ఇంతవరకు పారిస్ వైపు అఱ్ఱులు చాచిన చిత్రకారులు, కళాభిమానులు ఒక్కసారిగ అమెరికావైపు తిరిగారు. దానికి కారణం అమెరికా చిత్రశిల్ప కళల్లో గూడ, నేటి ప్రపంచ విజ్ఞాన, రాజకీయాలలో తనకుగల ప్రముఖమైన స్థానంవంటి ఒక ఉన్నత స్థానం కావాలని కృషి పెట్టడమే. ఇక్కడి చిత్రాకారుల కృషికి ప్రభుత్వం, వ్యాపార సంస్థల అండ ఎంతో ఉంది. ముఖ్యంగా సైన్సులో జరుగుతున్న ప్రయోగాలను కళలలో గూడ ప్రయోగించి ఒక పెద్ద సంచలనాన్ని తెచ్చింది. ఇంతవరకు చిత్రకళలో వస్తున్న వివిధ 'ఇజము'లను మించి ఒక క్రొత్త మార్గాన్ని కనిపెట్టిన ఖ్యాతి అమెరికాకు దక్కినది. ఒక విధంగా చూస్తే నిజానికి ఇప్పటి చిత్రకళపై ప్రేక్షకుల నమ్మికను పోగొట్టినవి గూడ అమెరికాయే. జాన్‌సన్, పోలక్, మార్కు రోథకో చిత్రాలు చూస్తే ఈ అమెరికా నూత్న ప్రయోగం తెలుస్తుంది కళలో. చిత్రాలా లేక రంగులు పొరపాటున కాన్వాస్‌పై ఒలికిపోతే అదే తెచ్చి ఫ్రేముకట్టి ప్రదర్శించినవా అనే అనుమానానికి దారితీస్తాయివి. ఈ అనుమానం మామూలు ప్రేక్షకునిది. గాని కళా మర్మములను ఎఱిగిన విమర్శకునిది గాదనుకోండి. అయినా అనుమానం అనుమానమే ప్రేక్షకునిదైనా.

నిజానికి చిత్రకళలో పారిస్ తర్వాత ఇంగ్లండు పేరున్న దేశంగా ఇప్పటివరకు చలామణి అవుతూ వచ్చింది. కాని ఒక్కసారి న్యూయార్కు అఖండ ఖ్యాతిని ఎగర గొట్టుకుపోయే సరికి ఎక్కడలేని సంచలనం కల్గింది కళారంగంలో ఇక్కడ. కనీసం ఇంతవరకు అనుభవిస్తున్న తన రెండవ స్థానాన్ని అయినా పోగొట్టుకోకుండా ఉండాలనే ఇప్పుడు జరుగుతున్న మూక ఉమ్మడి ప్రదర్శనలకు కారణం. కాస్త పేరున్న ప్రతి ఇంగ్లీషు చిత్రకారుని ప్రదర్శనలు విరివిగా జరుగుతున్నవి. బాగా పేపర్లన్నీ వ్రాస్తున్నవి. ఇక హెన్రీమూర్, బెన్‌నికల్‌సన్ ఫ్రాన్సిస్ బేకన్‌ల సంగతి, వారికి గల ప్రచారం గురించి చెప్ప నవసరం లేదనుకుంటాను. ఈ తావత్రయంలో ఏర్పాటు చేసినదే "ఈ అరువదవ దశాబ్దంలో బ్రిటిష్ చిత్రకళ" అన్న ప్రదర్శన.

ఈ ప్రదర్శనను ఎంతో కష్టపడి ఏర్పాటు చేసినది ఇక్కడగల 'కంటెపోరరీ ఆర్ట్ సొసైటి'. సొసైటీ ఈ ప్రదర్శనపై బహు చక్కటి చిన్న క్యాటలాగు ప్రచురించినది. అది ఇలా ప్రారంభమవుతుంది. "మనం నేటి అమెరికన్, పారిస్, ఆస్ట్రేలియా, ప్రతి యూరప్ దేశ చిత్రశిల్ప కళా ప్రదర్శనలు చూడడం విరివిగ జరిగింది లండన్‌లో. కాని ఏలనో నేటి ప్రపంచ కళారంగానికి మన బ్రిటన్ సాధించి అందించిన, అందిస్తున్న కళా రీతులను చూపే కార్యక్రమము అసలు జరుగక పోవడం అత్యాశ్చర్యకరము." ఇక మనకు సులువుగ అర్థం అవుతుంది ఈ ప్రదర్శనకు బ్రిటిష్ చిత్రాకారులను అందరిని ఒక్కచోట చేర్చి ప్రదర్శించాలనే కుతూహలం ఉన్నట్లు. అందువల్ల ఈ సొసైటీ మొదట చిత్రాకారుల చిత్రాలను ప్రదర్శించి తర్వాత శిల్పకారులవి, గ్రాఫిక్ చిత్రకారులవి కలిపి ఇంత భారీ ఎత్తునా ప్రదర్శిస్తుండట త్వరలో. మొత్తం 186 చిత్రాలను ప్రదర్శించారు. ఇవన్నీ ఒకసారి 'టేట్ గ్యాలరీ'లో ప్రదర్శించుటకు వీలుపడక సగం "టేట్ గ్యాలరీ"లోను మిగిలిన సగం "వైట్ ఛాపెల్ ఆర్ట్ గ్యాలరీ" లోను ప్రదర్శించారు. టేట్ గ్యాలరీలో వయసు ఉన్న బాగా పేరున్న చిత్రకారులవి, వైట్ ఛాపెల్ గ్యాలరీలో యువతరం వారివిగ విభాగించి ప్రదర్శన ఏర్పరచారు.

ఈ ప్రదర్శన ఒక విధంగా ఇప్పుడు ఇంగ్లండులో ఉన్న చిత్రకారులను, వారివారి చిత్ర వైఖరులను పరిచయం చేస్తుంది. ఈ ప్రదర్శన చూస్తే ఇప్పుడు ప్రపంచ చిత్రకళలో బ్రిటన్‌కు ఉన్న స్థానం తెలుస్తుంది. సామాన్యంగా ఇలాంటి ప్రదర్శనలు జరిగితే ఒక న్యాయ నిర్ణయసంఘం ఏర్పడి, ఆ సంఘం వచ్చిన చిత్రాలలో మంచివి ఏరి ప్రదర్శిస్తుంది. కాని ఇక్కడ అలా జరుగలేదు. ఈ ఆర్ట్ సొసైటీ చిత్రకారులను రెండుగాని మూడుగాని వారికివారు మంచి వనుకున్న చిత్రాలను పంపమని అడిగి వాటిని అలాగే ప్రదర్శించింది ఏమి సెన్సారు లేకుండ. నిజంగా ఇది ఎంతో హర్షించదగ్గది. చిత్రకారుడు ఏవి తను మంచివనుకుంటే అవి ప్రదర్శించే స్వాతంత్ర్యం పొందాడు. సామాన్యంగా ఈ న్యాయ సంఘంలోని వారు తమకు తెలిసిన వారి చిత్రాలు చెత్తవైనా సెలక్టు చెయ్యడం ప్రదర్శనకు, బహుమతు లివ్వడం (బహుమతులుంటే)



నల్లటిపై నేలపై యంత్రం
ఆర్టిస్టు : గ్రహం సదర్లాండ్.

జరగడం అసంభవం కాదు అప్పుడప్పుడు ఇలాంటి పెద్ద ప్రదర్శనలలో. ఈ బెడద లేకుండా తప్పింది ఈ ప్రదర్శనకు.

ఈ ప్రదర్శనలోని చిత్రాలను గురించి వ్రాసేముందు కొద్దిగా ఈ ఆర్ట్ సొసైటీ చరిత్ర వ్రాస్తాను. ఇది పెద్ద లార్డ్లు, ధనవంతులు విమర్శకులు కలిసి ఏర్పరచిన సొసైటీ. మెంబరుషిప్పు బహు తక్కువ. సంవత్సరానికి 28 రూపాయలు, భార్యాభర్తకు కలిస్తే 40 రూపాయలు. మెంబర్లు అందరు చాలసార్లు కలిసి చిత్ర శిల్పకళలపై చర్చించుకుంటారు. కళలో అనుభవస్తులు చేసే ఉపన్యాసాలు వింటారు. పెద్దపెద్ద ప్రదర్శనల ప్రివ్యూలకు ఫ్రీగా వెళ్తారు. అమెరికా, రష్యా, యూరప్‌లలోని కళా సంచయములను, మ్యూజియములను చూడడానికి వెళ్తారు. ఇవన్నీ సొసైటి బహు జాగ్రత్తగా నిర్వహిస్తుంది. ఇక మిగిలిన డబ్బుతో ప్రదర్శింప బడిన ప్రదర్శనలలోని చిత్రాలను కొని చిత్రకారులకు సహాయపడుతుంది సొసైటీ. మరో విశేష మేమంటే కొన్ని చిత్రాలను శిల్పాలను బ్రిటన్ కామన్‌వెల్త్ దేశాలకు బహూకరిస్తారు. అసలు ముఖ్యోద్దేశ్యము ఈ విధంగా చిత్రాలను కొని గ్యాలరీలకు కామన్‌వెల్త్ దేశాలకు ఇవ్వాలని. దాదాపు ఇప్పుడు రెండువేల చిత్రాలైతేనేమి, శిల్పాలైతే నేమి బహూకరించింది. ఇది ఎంతో శ్లాఘించవల్సిన విషయం. మొట్ట మొదటగా సొసైటీ కొన్నది కీ. శే. అగస్టస్ జాన్ "నవ్వుతున్న స్త్రీ" అన్న చిత్రం. కొన్ని చిత్రాలను ముందుగా ఆస్పత్రులలోను, స్కూళ్ళలోను, యూనివర్సిటీలలోను పలు కళా ప్రదర్శనలలోను ప్రదర్శిస్తుంది. ఈ విధంగా కళా రంగానికి ఎనలేని సేవ చేస్తుంది. లక్షల రూపాయల చిత్రాలను కొని ప్రజలందరు చూడడానికి గాను ఎన్నో పట్టణాలలో ప్రదర్శిస్తుంది ఇంగ్లండులో.

ఇటువంటి ఉత్తమమైన కార్యాన్ని నిర్వహిస్తున్నది గనుక, 'టేట్‌గ్యాలరీ' సొసైటి కొన్ని చిత్రాలను ఉంచుకొనడానికి, ఆఫీసుకు, గదులను ఇచ్చి సహాయపడింది. టేట్ గ్యాలరీకి సహితం ఈ సొసైటీ చిత్రాలను బహూకరించింది. ఇది 1910 వ. సంవత్సరంలో ప్రారంభింప బడింది. బ్రతికి ఉన్న చిత్రకారుల చిత్రాలు మాత్రమే కొనాలనే సిద్ధాంతంతో నడుస్తున్నది.

ముందుగా టేట్‌గ్యాలరికి వెళ్ళాము ప్రదర్శన చూడడానికి. ఎన్ని సార్లో వెళ్ళాను లోగడ. కాని ఎన్నిసార్లు చూచినా క్రొత్తగానే కనిపిస్తుంది టేట్, 'మోనాలిసా' చిత్రాన్ని చూచినట్లు. ప్రదర్శనకు వెళ్ళగనే మనకు ప్రముఖ చిత్రకారుడు సర్ విలియమ్ కోల్డ్ స్ట్రీమ్ గారి చిత్రాలు కనబడతాయి. వాటిలో ప్రారంభం అవుతాయి చిత్రాలు. ఈయన గురించి ఇంగ్లండులో తెలియని కళాభిమాని ఉండరు. భారతదేశంలో శ్రీ జి. వెంకటాచలం గారిలాగా జీవితమంతా కళకు ధారపోసిన వ్యక్తి. తేడా అల్లా జి. వెంకటాచలంగారు చిత్రకళా విమర్శకులు, కోల్డ్ స్ట్రీమ్‌గారు చిత్రకారులు. చిత్రకారుడుగ ఎంత పేరుందో అంతకంటే ఎక్కువగా చిత్రకారులను తయారు చెయ్యడంలో పేరుంది. ఎంతో మంది ఆయన వద్ద నేర్చుకొని ప్రఖ్యాతి గాంచారు ప్రపంచ చిత్రకళా రంగంలో. ఈయన మనుష్యుల చిత్రాలు, ముఖ్యంగా పోర్ట్రెయిట్స్, స్త్రీ నగ్న చిత్రాలు, ప్రకృతి దృశ్యాలు చిత్రిస్తారు. చాల మంది ప్రముఖ వ్యక్తులను చిత్రించారు ఇక్కడ. ఈ వ్యాసంలో ప్రచురించిన చిత్రం ఆయన మొదటి భార్యను మోడలుగ ఉంచి చిత్రించినది. దానితోబాటు మరి రెండు చిత్రాలు లార్డ్ గ్లెన్ కోనర్, వాల్టర్ బ్రాంట్‌ల పోర్ట్రెయిట్స్ ప్రదర్శించారు. వీటిలో విశేషం చిత్రించిన పద్ధతి. దాదాపు ఇంప్రెషనిస్టు పద్ధతిలో చిత్రించినా చిన్నచిన్న సన్నని గీతలలో ఫినిష్ చేస్తారు. దగ్గరగా చూస్తే చిత్రం అగ్గిపుల్లలంతటి సన్నని గీతలు రంగురంగులతో కనిపిస్తాయి ముఖం, శరీరం అంతా చిత్రంలో. ఎంతో జాగ్రత్తగా ఇలా వాడిన ఎర్రని గీతలు జీవాన్ని తెస్తాయి. ఒక్కొక్క పోర్ట్రైట్ పూర్తి చెయ్యడానికి నెలలు తీసుకుంటారు. ఈయన చేత పెయింట్ చేయించుకునే వ్యక్తికి అసాధారణ ఓర్పు కావాలి. తీసుకునే సిట్టింగులకు అంతుండదు. నాకు ఒకటి జ్ఞాపకం వస్తుంది. ప్రముఖ చిత్రకారుడు 'సిజాన్' గూడ యిలా ఎన్నో సిట్టింగులు తీసుకునేవాడు చిత్రం పూర్తి చెయ్యడానికి. ఒకసారి తన భార్యను మోడలుగా ఉంచి చిత్రణ ప్రారంభించారు. షుమారు



ముడి

ఆర్టిస్టు: బెర్నార్డ్ కొహెన్.

చిత్రాలలో బేలన్స్ ఎంతో ప్రాముఖ్యంగా ఉన్నట్లు, తెలుపు రంగును చాల నాజూకుగా ఎక్కువగా వాడినట్లు కనిపిస్తుంది.

మరొక ఆయన జాన్‌హైవర్. ఈయన చిత్రాలు నాలుగైదు చూస్తే చాలు. అంతకంటే చూడ నవసరంలేదు. చూడలేం గూడా. ఒకే పద్ధతి, ఒకే రంగులు. వినుగుపుట్టించే చిత్రాలు ప్రదర్శన అంతటిలోకి ఏవయ్యా అంటే ఈయన చిత్రాలే అనిచెప్పాలి. నీటి రంగులు చిత్రించే ప్రత్యేకమైన పేపరుపై నలుపు, ఇటుక రంగులను మిశ్రమం చేసి చిత్రించి, దానిపై రంగుల కాగితాలను వివిధ ఆకారాలలో కత్తిరించి అతికిస్తాడు. చిత్రం అంతా రంగులు చచ్చి తేలుతున్నాయా అనిపిస్తుంది. దానిపై బ్లేడుతోనో, మేకుతోనో గీకుతాడు. కాగితం రేగి ఈ గీతలు ఎంతో అసహ్యకరంగా కనిపిస్తాయి.

మరొక చిత్రాకారుడు, బ్రిటన్ సగర్వంగా నాలుగు కాలాలపాటు చెప్పుకునే అతను, ఫ్రాన్సిస్ బేకన్. ఈయన చిత్రించినట్లు భయంకరమైన చిత్రాలను బ్రిటన్‌లో ఎవరూ చిత్రించరు. జంతువులు తింటున్న మనుష్యులను, ఉరితీయబోయే ముందు గాజుఖైదులో బంధింపబడి ఏకాంతంగా భీభత్సంగా అరచే ఖైదీని, చనిపోయే క్రీస్తు చిత్రాల లాంటివి ఎంతో ప్రజ్ఞతో చిత్రించే మేధావి. 58 ఏండ్లు ఉన్నా 35 ఏండ్ల యువకుడుగా కనిపిస్తాడు. ప్రపంచం అంతటా గొప్ప చిత్రాకారుడనిపించుకున్నాడు. చిత్రాలు వికృత ఆకారమయాలు. ఎరుపురంగును రక్తం కారుతున్నట్లు, పలుపురంగును చచ్చిన శవంలో నుండి జారుతున్నట్లు చిత్రిస్తారు. ఆయనకు రంగుపై ఉన్న అధికారం విపరీతం. ఆకారాలను మనం గుర్తించగలం. అబ్‌స్ట్రాక్ట్ చిత్రాలు అసలు వెయ్యరు. కాని బ్యాకుగ్రౌండుపై ఆకారాలను విలిపే పద్ధతి బహువింతగను, అబ్‌స్ట్రాక్ట్‌గను ఉంటుంది. సామాన్యంగా చిత్రంలో ఒక మనిషికంటే ఎక్కువ ఉంచరు. ఇప్పుడు ఈయన చిత్రాల ప్రత్యేక ప్రదర్శన జరుగుతున్నది. వారం రోజుల నుండి పేపర్లు చిత్రాలను రంగులలో ప్రింటుచేసి బ్రహ్మాండంగా వ్రాస్తున్నవి. ఇప్పటి చిత్రాలలో రెండు మూడు మానవాకారాలను చిత్రించినవి చాల ఉన్నవి. ఇది పెద్ద మార్పు తెచ్చింది, రంగులలో గూడా.

కీత్‌వాగన్ ఈ మధ్య చాల ప్రాముఖ్యంలోకి వచ్చారు. ఈయన ఇప్పటి వరకు నిలుచున్న మానవులను వేయడంలో ఎంతో ప్రజ్ఞ చూపారు. ఈయన వాడే నీలి, ఆకుపచ్చ రంగుల మిశ్రమం, నేపుల్స్ ఎల్లో రంగులో ఎంతో ఎంతో మనోహరంగా ఉంటాయి. ఒకవిధమైన చిక్కటి సముద్రపు నీటి రంగును కలిగి గంభీరంగా ఉంటాయి చిత్రాలు. రానురాను మానవ ఆకారాలను వదలి అబ్‌స్ట్రాక్ట్ పద్ధతిలో చిత్రిస్తున్నారు. ఎక్కువ రంగులు మిశ్రమం చేసి చిత్రించడం ఈయనకు ఇష్టం. విక్టర్‌పాస్‌మోర్ రెండు మూడు రంగులు వాడడమే ఎక్కువగా అనుకుంటే, కీత్‌వాగన్ పద్ధతి రంగుల పెట్టెలోని రంగులన్నీ సరిపోవు అన్నట్లు ఉంటుంది. కాని ఒక విధమైన సంగీతాన్ని అందిస్తాయి చిత్రాలు. అంతగ పెద్ద సైజు చిత్రాలు వెయ్యరు. ఈయన చిత్రాలు యూరపు అమెరికాలలో చాల మ్యూజియములు కొన్నాయి. ఇప్పుడు నాకు ఈయన టీచరు. చాల మితభాషి. నెమ్మదస్తుడు.

మరొక నాటీచర్ ఫిలిప్ సట్టైన్. ఇప్పుడిప్పుడే ఇంగ్లండులో పేరు తెచ్చుకుంటున్నారు. ప్రపంచం అంతా ఎన్నో రకాల ఇజములను దాటి ముందుకు పోతుంటే ఈయన లోగడ 'మెథీస్'ను పట్టుకొని వ్రేలాడుతున్నారు. రంగు, ఆకారాలు అన్నీ మెథీస్‌వే. నకలు అనవచ్చు దాదాపు మెథీస్‌కు. రంగులలో ఈయన స్త్రీలు అందంగా ఉంటారు చూడడానికి, పెద్దపెద్ద (వసంతకాలంలో ఇంగ్లీషు ఆడవాళ్లువేసుకునే టోపీలలో) టోపీల కొరకు మనం చూస్తామా చిత్రాలు ? కాని ఈయన టోపీల కొరకు అయినా చిత్రాలు చూస్తారు గదా అని భావిస్తున్నట్లుంటుంది. ఒక విధంగా యీయన తైలవర్ణ చిత్రాలు నీటి రంగులవలె బహు తేలికగా ఉంటాయి. ఎక్కువగా "అద్దం ముందున్న స్త్రీ" "కుర్చీలో కూర్చున్న స్త్రీ" లాంటి పేర్లతో చిత్రిస్తారు.

ఈ పైచెప్పిన చిత్రకారులు చాల ప్రసిద్ధ చెందిన వారు. వారి చిత్రాలు లోగడ చేసిన పద్ధతిలోనే తిరుగుతుంటాయి కొద్ది మార్పులతో. అంతగా మార్పుతేవాలనే అవసరం లేదు. ఎందుకంటే మ్యూజియములు, ధనవంతులు ఎలాగూ కొంటారు వీరి చిత్రాలు లోగడ పేరునుబట్టి. గనుక చాల స్థిరమైన స్థాయిలో ఉండి పాత సంగీతాన్ని మరల మరల వినిపిస్తూ వారు ఆనందిస్తూ మనల్ని ఆనందింప చేయ ప్రయత్నిస్తారు సదా.

ఇంతలో రవి ఆ గదిలోకి ఫ్లాస్కుతో గాజు గ్లాసుతో వచ్చి కాఫీ గ్లాసులోకి వంచుతూ "మేష్టారూ! కొంచెం కాఫీ తీసుకోండి" అన్నాడు.

శ్రీహరిరావు వెనుదిరిగి చూసి "ఇప్పుడు కాఫీ ఏమిటి? ఇంటిదగ్గర నాకోసం కనిపెట్టుకుని ఉంటారు. భోజనంవేళ అయిందికదా?" అన్నాడు.

గుమ్మం వెనక రవి తల్లి నిలబడి ఉంది. పమిటని ఒకచేత్తో తొలగించి పట్టుకుని ఆమె "ఫరవాలేదు. తీసుకోండి" అన్నది. శ్రీహరిరావు గ్లాసు అందుకుని కుర్చీలో కూర్చున్నాడు.

రవి గుమ్మంవైపు తిరిగి "నేను చెప్పలేదూ అమ్మా? ఆయనే వీరు" అన్నాడు.

ఆమె అలాగే నిలబడి రవితో 'అలాగా' అని శ్రీహరిరావు వంక తిరిగి "నిన్న రాత్రి వీడు ఒంటిగంట వరకూ యింటికి రాకపోయేసరికి నేను దిగులుపడిపోయానండీ. ఇక ఉండబట్టలేక వాళ్ల నాన్నగారిని లేపి పంపబోతూ ఉండగా వీడు ఎదురు వచ్చాడు. వీడికంటె పెద్దవాళ్లిద్దరూ గుంటూరులో కాలేజీల్లో చదువుతూ హాస్టళ్లలో ఉంటున్నారు .... ప్రస్తుతం నాదగ్గర ఉన్నది వీ డొక్కడే .... అందుకని నిన్న రాత్రి బాగా గాభరాపడిపోయాము" అన్నది.

శ్రీహరిరావు గ్లాసు ఎదురుగా ఉన్న బల్లమీద ఉంచి తల ఎత్తి చూసి "మీ అబ్బాయి చాలా తెలివైనవాడండీ. నాకు చాలా సహాయం చేశాడు కూడాను. అది ఫలించలేదు కాని ...." అన్నాడు.

ఆమె "అదేమి టన్న"ట్లు చూసింది. రవి మాట్లాడలేదు. శ్రీహరిరావు "ఇక వెళ్లి వస్తానండీ. మా అక్కగారు నాకోసం ఎదురుచూస్తూ ఉంటుంది. పైగా బండివేళ కూడా అవుతున్నది" అంటూ లేచాడు.

ఇంతలో చిలిపి విసురుగాలి తరంగం ఒకటి రివ్వున వీచింది. గుమ్మంలో నిలబడిఉన్న ఆమె ఒక్కసారి నుదుట పడుతున్న నల్లని ముంగురులను బంగారపు వుల్లలవంటి సన్నని వ్రేళ్లతో పైకి తోసుకున్నది.

శ్రీహరిరావు మెదడులో మెరుపు మెరిసినట్టయింది. అతడు క్షణంలో సగంలోనే మళ్లీ ఆమెవంక చూశాడు. ఆ కళ్లు అతని కెవరినో గుర్తు చేశాయి. ఆమె ... వైదేహి... సందేహం ఏమాత్రం లేదు.

అతడు మెట్లుదిగి బయటకు వచ్చాడు. ఎందుకో కాళ్లు వణుకుతున్నాయి. తమాయించుకున్నాడు. తనవెంట వాకిలి దాకా వచ్చిన రవిని భుజంతట్టి వాత్సల్యం కురిసే కంఠంతో "బాగా చదువుకో" అని చెప్పి త్వరత్వరగా సాగిపోయాడు. ఆతర్వాత కొద్ది నిముషాలలోనే అరటిపళ్ళు చేసుకుని భోజనం చేస్తూవుండగా అకస్మాత్తుగా మేఘాలు క్రమ్ముకవచ్చి అయిదే అయిదు నిముషాలసేపు వర్షం కురిసింది.

మరొక గంట తర్వాత అతడు పక్క గుడ్డలు మడత పెట్టుకుని, వాటిలో కట్టుకుని, చేతిసంచి సర్దుకుని ప్రయాణానికి సిద్ధమయ్యాడు. అతని బావగారు ఇంట్లో లేరు. అక్కడ పేటలో పీకలలోతున మునిగిపోయి ఉన్నాడు ఇప్పుడు. ఆయనతో చెప్పి వెళ్ళే వ్యవధిలేదు. బండి మరొక అరగంటలో వచ్చేస్తుంది. అడ్డదారిన పోతే తప్ప యిప్పుడైనా అందుతుందనే నమ్మకంలేదు. అందువల్ల అతడు గుమ్మంలో ఏదో చెప్పరాని దిగులును గుండెల్లో, కళ్లలో నిలుపుకుంటున్న అక్కగారితో "బావకు నువ్వు చెప్పు. నాకు బండి టైమ యింది" అన్నాడు. తర్వాత ఒక చేతిలో పక్క చుట్టతోనూ మరొక చేతిలో సంచీతోనూ అతడు బయటికి వచ్చాడు. అతని అక్కగారు గుమ్మందాకా వచ్చి "ఒరే తమ్ముడూ! వెళ్లగానే జాబు వ్రాయి. అమ్మను పంపడం మర్చిపోకు" అన్నది గద్గదస్వరంతో.

అతడు త్వరత్వరగా నడిచిపోతున్నాడు. అది స్టేషనుకు అడ్డదారి. ఎత్తయిన గట్టు. అప్పుడే వర్షం పడినందువల్ల బురదతో నిండి జారుతున్నది. అతడు ఒక చేతిలో పక్క చుట్టతో మరొక చేతిలో సంచీతో జాగ్రత్తగా 'బ్యాలెన్సు' చూసుకుంటూ ముందుకు సాగిపోతున్నాడు. అతని కప్పుడు తాను చిన్నతనంలో చూసిన ఒక దొమ్మరి ఆట గుర్తుకు వచ్చింది. అందులో ఒక దృశ్యం. ఒక పచ్చని అందమైన పిల్ల ఎత్తుగా కట్టిఉన్న తీగమీద చేతిలో పొడుగాటి వెదురుబొంగుతో యిలాగే నడిచింది. తా నిప్పుడు చేస్తున్నది కూడా తక్కువ 'ఫీట్' కాదు. ఇలా నడవటం సామాన్యమా?

పరీక్ష విషయం, తనకు జరిగిన అవమానం విషయం గుర్తుకువచ్చి కొంచెం బాధ కలిగించింది. అయినా "అబ్బే! ఈమాత్రవుదానికి బాధపడటం పురుషలక్షణం కాదు. ఇంతకుపూర్వం మనం ఎన్ని చేదు మాత్రలు మింగివుండలేదు గనుక?" అనుకుని హుషారు తెచ్చుకున్నాడు.

అప్రయత్నంగా అతని నోటివెంట యీల వచ్చింది.

---

# శ్రీనివాస సభావర్ణన మాలిక



శ్రీ వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రి[1]

శ్రీకరమై సముల్ల సదశేష ధరాభరణాయమాన ద
ర్వీకర సార్వభౌమ పృథివీధర శేఖర కల్పశాఖియై
నా కథు నీ వతంస సురనాయక పావక భూవినాయక
శ్రీకమలాసనైలబిల శీతమయూఖ ముఖాఖిలామరా
నీక కిరీట కోటి తట నిర్భర గుంభిత కల్పమాలికా
స్తోకగళన్మరంద రససుందర దివ్యపదారవింద ని
ర్ధాకన విభ్రమ భ్రమర రాజివిరాజిత గీతమాధురీ
వ్యాకలన ప్రతిక్షణ హాహాహిత సంతతరోమహర్షణ
శ్రీమలాకపోల పరిశీలన శాలివిశాల కౌతుకో
ద్రేక సటత్కటాక్ష లహరీ బహు రీగ్యహరీశ నూతనా
లోక నిపాతభూత నతలోక నిరంతర దంతురాంతరా
నేక తమోవితానమయి నీలమణీ రమణీయ సత్ఘృణీ
వ్యాకృత గర్వ నిర్వహణ వైభవ ధూర్వహ సర్వతోముఖా
టీకిత దోర్యుగాంతరతటీనికలు ప్రకటీభవత్ప్రభా
వ్యాకలనాభిరామ మకరాభరణోజ్జ్వల నూత్నరత్న రే
ఖా కమనీయకాంతి కలికావలికా వలితేంద్రచాప శం
కాకుల కేకిలోక కుతుకాకలితా విరతాతి తారకే
కాకలనా కలిశ్రవణ కాతర తాభ్యశ కుట్మలీభవ
నైకటికేందు శేఖర వినాయక భూషణ భోగి భోగ భా
గైక వికాస కార్యఖిలకానన సర్వపథీనరాణ వీ
ణాకర కిన్నరీకుల సనాథసభారత భారతీ వధూ
టీ కల కంఠగీత కమఠేంద్ర కిటేంద్ర నటేంద్రముఖ్య నా

---

కీ. శే. వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రిగారు అరువదేండ్లక్రిందట తిరుపతి సంస్కృత కళాశాలయం హించిన మహా విద్వాంసులు. వారి తెలుగురచన యమరుకాంధ్రీకరణమున పద్యములు భారతిలో ప్రకటితములు.
వ

# శ్రీనివాస సభావర్ణనము

సా కుహనావతార శతనాటిత చిత్రచరిత్ర నేత్ర పా
త్రీకరణానురూప బహురీతిక వేష ధురీణ నిర్జర
స్త్రీకృత తత్కథాభినయ శిక్షణ నైపుణ వీక్షణ క్షణాం
గీకృతనైకభావ పరికీర్ణ మనోజ్ఞ నిజాననాబ్జ వీ
క్షాకుతుకప్రసారిత సుసారమసార మరీచి వీచికా
చాకచకీ చమత్కృతి కచాకచి కల్పన శిల్పనాల్ప జ
ల్పాక మిళత్త్రిపాకన పాంగ తరంగిత రంగ దప్సర
స్త్రీకల మేఖలాముఖ పరిష్కృత కింకిణి కాకిణం కిణై
కి కృతకంకణ ప్రకర క్లప్త ఘులం ఘులం ఘుల్ఘుల ప్రణా
నాకలనాధికాంచిత కరాంచల చంచల చారుచామరా
స్తోకతరోచ్చలన్మృదుర సుందర గంధవహస్తనంధయా
పాకృత నిర్గళన్ముకుళ భావ విభాసుర భవ్యనాభి నా
ళీక దళాంతరాళ చిరలీన విరించి ముఖావళీ జటా
వీకృత వేదపాఠ బహుళీకృత నైజగుణోత్కరశ్రుతి
ప్రాకట నిర్గళత్పులక రాజి విరాజిత దివ్యవిగ్రహం
బై, కటిసీమకాంచన పటాభినవద్యుతిపుంజ ముజ్జ్వలం
బై, కడుమీఱు కార్మొగులపై దులకించు మెఱుంగు రంగులన్
వీకవాసించి కన్గవకు వింతనొసంగి తురంగలింప ము
ల్లోకమునై చెలంగు సభలో శుభలోల మరాళి విస్మృతం
బై కొలువనే ఫణీంద్రగిరిపై గొలువొందుచు శ్రీనివాస నా
మాకలనంబుచేత దనరారెడు దైవతరత్నమైక మ
త్యాకరమైన యీసభననల్ప కృపార సాంద్రమానసం
బై, కరముత్తరోత్తరము నభ్యుదయంబు నొసంగి ప్రోవుతన్.



# పానుగల్లు విజయనగర శాసనములు



శ్రీ కె. హెచ్. వి. శర్మ

ప్రస్తుతము మహబూబు నగరు జిల్లా కొల్లాపురము తాలూకాలోని పానుగల్లు కొండ చారిత్రకముగ కడు ముఖ్యమైనది. భూమట్టమునకు సుమారు మూడువేల అడుగుల ఎత్తున నుండి ఐదారుమైళ్ల విశాలముగల యద్భుతమైన చక్కని గిరి దుర్గ మది. అచ్చట పడియుండిన ప్రాచీన శిథిలావశేషములు, శాసనములనుబట్టి చరిత్ర మధ్య యుగమున నందు గల రాజధాని నగర వైభవము నేటికిని విదిత మగుచున్నది. కాలక్రమమున అవి యన్నియు నశింపగా పానుగల్లు కుగ్రామముగ కొండ దిగువన వెలసి నేడా భాగ మంతయు స్వేచ్ఛగ సేద్యమున కుపయోగించబడుచున్నది. కొండపైనుండి దిగువుగ జూచిన సుమారు ముప్పదిమైళ్ల దూరమున ప్రవహించు కృష్ణానదియు మరియు నలుమూలల తత్ప్రాంతమున నెచ్చటినుండి పర సైన్యములు దండెత్తి వచ్చునదియు స్పష్టముగ గోచరించును. ఈ ప్రాచీన గిరి దుర్గమును సంరక్షించుటకుగాను పూర్వపు నైజాము ప్రభుత్వమువారిచే సుమారు ముప్పదిమంది చౌకిదారులు నియమించబడిరట. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు అందలి శాసనము నొకదానిని సుమారు అర్ధ శతాబ్దము క్రిందట మాదిరి పాఠమును ప్రకటించియున్నారు. తదుపరి వారి శాసన పాఠమునే కొద్దిగ సవరించి చరిత్రకారు లందరు నుపయోగించుట జరుగుచున్నది. కేంద్ర ప్రభుత్వ యాజమాన్యమున గత సంవత్సరము నే నా శాసన ప్రతిబింబమున కచ్చటికి పోగా మరియొక నూతన శాసనము గూడ నా కగపడినది. ఆ రెండు శాసనములును విజయనగర బహ్మనీ చరిత్రమున కత్యన్త ముఖ్యమైన వగుటచే వరుసగ వాని నిందు ప్రకటించు చున్నాడను.

## రెండవ హరిహరరాయల శాసనము

పానుగల్లు కొండమీద కోట ద్వారమునకు వెలుపల యెడమచేతి వైపున గల పెద్ద బండమీదను మరల లోపలి కోటద్వారమునకు దిగువున పంక్తులు మాత్రము భేదముగ నిదే శాసనము రెండుమారులు తెలుగు లిపిలో చెక్కబడి యున్నది. పశ్చిమ వైపున కోట ద్వారము వద్దను అట్టిదియే మరియొక శాసనము చెక్కియుండెనని స్థానికులచే వింటినిగాని ప్రస్తుతమా రాతిగోడ యంతయు పూర్తిగ కూలిపోవుటచే నా కేదియు నగపడలేదు. శాసన మంతయు తొమ్మిది చక్కని సంస్కృత శ్లోకములతో గలదు. దీనినే శ్రీ రామకృష్ణ కవిగారు South Indian Research July 1920 Vol. II No. 8 సంచిక 172—73 పుటలలో రోమను లిపిలోను, డాక్టరు నేలటూరి వెంకరమణయ్యగారు Further sources of Vijayanagara History Vol. II 38—39 పుటలలో మూడవ శ్లోకమునుండి నాగరి లిపిలోను, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు తమ History fo the Reddy Kingdoms అను గ్రంథమున 164 పుట అథోసూచికలో 5, 7, 8 శ్లోకములను మాత్రము ప్రకటించి యున్నారు. నేను దీయించిన శాసన ప్రతిబింబములనుబట్టి చదివిన పాఠమును ముందుగ నిచ్చి తదుపరి ఆయా పాఠ భేదములను చరిత్రాంశములను వివరించగలను.

## శాసనమూలము

శ్రీ గురుభ్యోనమః

ఉపాసతే యా జనతా విభూత్యై
సమగ్ర సస్యోదయ హేతు భూతా
కామప్రదా వః కలుషే వ హంత్రీ
భూయా న్మహీ సా భువనైకమాతా.

యః షట్పదా నుచిత వాంఛ్ఛిత దానదానా
దామోద యత్యమల గండ తలానుషక్తాన్
వందారు వృంద వరదాన విధాన చిత్తః
పాయాత్సదా గణపతి ర్భవతోఽంతరాయా.

నమన్న్ర వతి మండలీ ముకుటకూట కోటీస్ఫుర
న్మణి కిరణ మాలికా మహిత పాద పంకేరుహః
మహీ హరిహరాహ్వ యో హరిహర స్వయంభూవమో
మహీశతిలకో మహాన్ జయతి బుక్క భూపాత్మజః.

# పానుగల్లు విజయనగర శాసనము

మంత్ర శ్రీ జితదేవ దానవ గురు ప్రఖ్యాత ధీవైభవః
శాస్త్రా దుర్జన సంచయస్య మహతా మానందనోనందనః
విశ్వానందిత సద్గుణః సమజని శ్రీచైచ దండాధి ప
స్తస్యా మాత్యవరో వరేణ్య చరితశ్చాతుర్యసీమావిదేః. 4

వీరశ్రీ వరణోచితం హరిహరక్షోణీ పతిస్తత్సుతం
సామ్రాజ్య ప్రతిపాలనా పటుతర ప్రజ్ఞా బలోదంచితం
ధీమా నిర్గప మంత్రివర్య మకరోద్దండాధి నాథేశ్వరం
విద్యా వీర్య వివేకధైర్య కరుణా సత్యక్షమాలంకృతం. 5

తస్యానుజో ద్విగుణ బుక్కణ భూమి పాలః
క్షోణీ ధురాం వహతి వీర్యవతాం వరిష్టః
యత్కీర్తి పూర పరిపూరిత దిగ్విభాగా
రాకా నిశాయివ నిశాః సకలా విభాంతి. 6

శాకాబ్దేషు నిధీందు వహ్ని శశిభిః సమ్మిశితే ష్వీశ్వరే
వర్షే మాసి సహస్యనామని తథాపక్షే బలక్షేదినే
శంభోర్భాస్కర వారభాజి విజితా శ్రీ పానుగల్లుః పురీ
తే నానేక తురుష్కవీర విజయ గ్రావావళీ వేల్లితా. 7

ఇమ్మడి బుక్క మహీపతి తనయో
నంత క్షమాపతి ర్జయ తాత్
ఖర తర శర శత శకలిత బలభర
మద ముదిత విమత భుజ దండః. 8

విజిత్యా తా మిమ్మడి బుక్క భూపో
విచిత్ర యంత్రావళి తోరణాఢ్యాం
నవీన పద్మాకర సాలవాపీ
మకారయ న్నూతన కర్మకర్తా. 9

శ్రీ గురువులకు నమస్కారము." ఈ గురువులు విజయ నగర సామ్రాజ్య స్థాపకులగు శ్రీ విద్యారణ్య స్వాములే కావచ్చును. తదుపరి మొదటి రెండు శ్లోకములలో భూదేవి, గణపతుల స్తోత్రము. సమగ్ర సస్యోదయ హేతుభూతమైన యేది ఐశ్వర్యము కొరకు ప్రజలచే ఉపాసించ బడుచున్నదో అట్టి భువనైకమాత, కోరికల నిచ్చునదియు, కలుషముల నడచు భూదేవి మిమ్ములను కాపాడుగాక. స్వచ్ఛమైన దనగండతలము నాశ్రయించిన తుమ్మెదలను వలసిన మద దానముచే సంతసింప జేయునట్టి, భక్తుల వరదానము నందే చిత్తముగల విఘ్నేశ్వరుడు ఆంతరాయముల నుండి మిమ్ములను యెల్లప్పుడు రక్షించుగాక. మూడవ శ్లోకమున రాజగు హరిహర రాయలు వర్ణించబడెను. నమ్రులయిన రాజ సమూహము శిరస్సుల యందు ప్రకాశించుచున్న మణి కిరణ జాలముచే నొప్పు పాదము గలట్టి, హరిహర బ్రహ్మ జుగో సమానాన్మైన హరిహరులను శ్రీశివుని దాతను బుక్క భూపాలుని పుత్రుడు గలడు. తదుపరి నాలుగైదు శ్లోకములు వాని మంత్రుల ప్రశంస. మంత్రాలోచనమున బృహస్పతి, శుక్రాచార్యులను మించిన బుద్ధి వైభవము గలట్టి, మహాసన బహుభావమును శాసించునట్టి, గొప్పవారి ఆనందమునకు పంటవరము వంటియు, లోకము కొనియాడ దగిన సద్గుణములు గలట్టియు, బ్రహ్మచాతుర్యమునకు సీమయైన యున దైవసంపాధిపుడను మంత్రి సత్తము దాత నికి గలడు. వాని పుత్రుడు వీరశ్రీవరణోచితుడు, విద్యా వీర్య వివేక సత్య క్షమాలంకృతుడు. బుద్ధిమంతుడు, సామ్రాజ్యమును పాలించుటలో మిక్కిలి ప్రజ్ఞా బలము గల ఇరుగప మంత్రివర్యుని హరిహర క్షోణీపతి దండాధి నాథేశ్వరునిగ నియమించెను. ఆరేడు శ్లోకముల ఇమ్మడి బుక్కరాజు పానుగల్లు దిగ్విజయమును గూర్చి గలదు, యెవ్వని కీర్తిచే సర్వదిక్కులు నింపబడగా రాత్రులన్నియు పౌర్ణములు వలె నొప్పునో అట్టి అతని తమ్ముడు మిక్కిలి బలవంతుడగు యిమ్మడి బుక్క భూపాలుడు రాజ్య భారమును వహించి యుండెను. శకాబ్దములు నిధి, ఇందు, వహ్ని, శశులచే లెక్కించ బడిన 1319 ఈశ్వర సంవత్సర పుష్య (సహస్య) మాస శుక్ల (వలక్ష) పక్ష ఏకాదశి (శంభు దినము) ఆదివారము నాడు చుట్టునూ రాతి ప్రాకారము గల్గి అనేక తురుష్క వీరులతో గూడిన పానుగల్లు పుర మాతనిచే జయించబడెను.

ఎనిమిదవ శ్లోకమున బుక్కరాజు పుత్రుడగు అనంతుని గూర్చి ప్రశంస. అతి తీక్ష్ణమైన శరపరంపరలచే శత్రురాజుల భుజ దండములను ముక్క ముక్కలుగా జేసినట్టి ఆ రెండవ బుక్క మహీపతి తనయుడగు అనంతుడు జయించుగాక. తొమ్మిదవ శ్లోకమున శాసన ముఖ్యోద్దేశ్య మిట్లున్నది : నూతన కర్మల యందభిలాషగల ఆ యిమ్మడి బుక్క భూపాలుడు విచిత్ర యంత్ర తోరణములతో గూడిన ఆ పానుగల్లు పురమును జయించి నవీన పద్మాకర, సాల వాపులను జేయించెనట !

ఈ శాసన ప్రధానోద్దేశ్యము ఆఖరి తొమ్మిదవ శ్లోకమున ఇమ్మడి బుక్కరాజు పానుగల్లు కోటను జయించిన తర్వాత నూతన సరోవరం, సాలవాపులను త్రవ్వించెనని మాత్రమే గలదు. కాని ఆరు, ఏడు శ్లోకముల ఆ బుక్క రాజెవ్వడు, పానుగల్లు నెప్పుడు, యెవరి వద్దనుండి జయించె ననునది యున్నది. అది శక వర్షము 1319 ఈశ్వర సంవత్సర పుష్య [illegible] ఆదివారమున [illegible] శకము

1397 డిసెంబరు 30నకు సరిగ సరిపోవును. విజయునకిది శాసనపు సరియైన కాలము కాజాలదు. ఇమ్మడి బుక్కరాజు పెనుగల్లు నగరమును జయించిన పిదప కొద్దికాలమునకు బావి సరోవరములను త్రవ్వించు తరి ఈ శాసనమును వేయించి యుండవలెను.

పై శాసన పాఠమునకు, వెనుకవారి పాఠములకు కొన్ని వ్యత్యాసములు గలవు. చారిత్రకముగ నవి యంత ముఖ్యము గాకుండుటచే వానినిట తడవుట యనవసరము. డాక్టరు వేలటూరి వెంకటరమణయ్యగారు స్వయముగ శాసన ప్రతిబింబములను గంటితో జూడకుండుటచే గాబోలు శాసన పాఠమును ప్రధానముగ రెండు తావుల సవరించి యున్నారు. అందు మొదటిది కాలమును గూర్చినది. ఏడవ శ్లోకమున 'మాసి సహస్య' అను పుష్య మాసమునకు బదులు 'మాసిన భస్య' అని భాద్ర పదముగ తలంచుటచే శాసన కాలము నాలుగు నెలలు ముందునకు వచ్చినది. ఆ నాడు శుద్ధ ఏకాదశి ఆదివారము కుదరదు. శ్రీరామకృష్ణ కవి, మల్లంపల్లి సోమశేఖర శర్మగార్లు 'సహస్య' అనుపాఠమునే అంగీకరించిరి.

ఇక రెండవ సవరణ ఆరవ శ్లోకములోని 'తస్యానుజో ద్విగుణ బుక్కణ భూమిపాలః' యనుటకు బదులు 'తస్యాత్మజో. . . . . బుక్కణ భూమిపాలః' అనునది చాల ముఖ్యమైనది. శ్రీరామకృష్ణ కవిగారు 'తస్యానుజో' యను పాఠమునే ప్రకటించిరి. మరియు రెండు తావుల వేర్వేరుగ చెక్కబడిన శాసనముల రెండింటను 'తస్యానుజో' యను పాఠమే సుస్పష్టముగ నున్నది. అట్లైన డాక్టరు వెంకటరమణయ్యగారు 'తస్యాత్మజో' యను సవరణను యెందులకు గావించిరో, అది యెంత వరకు సమంజసమో అరయవలసి యున్నది. ఈ రెండు పక్షములను వరుసగా పరామర్శించగలను.

**మొదటి పక్షము :** నాలుగైదు శ్లోకములలో హరిహర క్షోణీపతి మంత్రులు, తండ్రి కొడుకులగు బైచదండనాయక, ఇరుగవదండాధీశ్వరులను వరుసగా ప్రశంసించి వెంటనే ఆరవ శ్లోకమున 'తస్యానుజో' యనుటచే తచ్ఛబ్దముచే సన్నిహితుడగు ఇరుగవ దండాధినాయకుని తమ్ముని గూర్చి దెల్పుచున్నదనుట యుక్తము. అట్లైన బైచదండనాథుని పుత్రుడగు ఇరుగవకు నిజముగ ఇమ్మడి బుక్కయను తమ్ముడు గలడా యని ప్రశ్న వచ్చును. శ్రవణ బెళ్గొళ గుమ్మటేశ్వరాలయపు ముందటి బ్రహ్మదేవ మండపము నందలి కూష్మాండినీయ క్షిణీ విగ్రహపు వెనక నొక రాతి కంబమునకు ఇమ్మడి ఇరుగవ దండనాథుని జైన శాసన మొకటి యున్నది.[1] శ్రీ బుక్కరాయులకు సమస్త జనులచే అభినందించ బడిన నీతియు, శత్రులోకము నంతటిని నశింప జేసినట్టి బైచ దండేశ్వరుడను మంత్రి సత్తము డొకడ గలడు. దాన, విదగ్ధత్వ, క్షాంతులచే వరుసగా సంతానక బృహస్పతి, సర్వంసహల నతిశయించిన ఆతనికి బైనా వర్గమునకు త్రిరత్నములు వలె జగజ్జయంతులు, చారుశీలురగు మంగప, ఇరుగవ, బుక్కణ యను ముగ్గురు పుత్రులు గల్గిరి.

శ్రీ బుక్క రాయస్య బభూవ మంత్రీ
శ్రీ బైచ దండేశ్వర నామధేయః
నీతి ర్యదీయా నిఖిలాభినంద్యా
నిఃశేష యామాస విపక్షలోకం.
దానం చేత్కథయామి లుబ్ధ పదవీం గాహేతసంతానకో,
వైదగ్ధ్యం యది సా బృహస్పతి కథా కుత్రాపి సంపీయతే
క్షాంతంచే దనపాయినీం జడతయా స్వ్రశ్యేత సర్వంసహా
స్తోత్రం బైచపదండనేతు రవనౌ శక్యం కవీనాం కథం.

తస్మాద జాయంత జగజ్జయంతః
పుత్రా స్త్రయో భూషిత చారుశీలాః
యైర్భూషితో జాయత మర్త్యలోకో
రత్నై స్త్రిభిర్జైన ఇవాప వర్గః.
ఇరుగప దండనాథ మథ బుక్కణ మస్యనుజౌ
స్వ మహిమ సంపదా విరచయన్ సుతరాం ప్రథితౌ
ప్రతిభట కామినీ పృథు పయోధర హారహరో
మహిత గుణోఽభవజ్జగతి మంగప దండ పతిః.

ఇందు పేర్కొనిన బైచదండనాయకుడు అతని పుత్రులగు ఇరుగప, బుక్కణలే మన ఈ శాసనమున గూడ ప్రశంసించ బడిన వారు కావచ్చును. బళ్ళారి జిల్లా హొసపేట తాలూకాలోని హంపివద్ద ప్రస్తుతము పురాతత్త్వ వస్తు ప్రదర్శన శాలలో భద్రపరచబడిన శిథిల విగ్రహ పీఠమునందొక శాసనము గలదు.[2] అందు అనన్య జన్య సౌజన్యాదిగుణ యుతుడు (మూల సంఘబలాత్కారగణ సరస్వతీ గచ్ఛ) ధర్మ భూషణ భట్టారకా చార్యుల శిష్యుడు బైచదండనాథుని ప్రియకుమారుడగు ఇమ్మడి బుక్కమంత్రీశ్వరునిచ

1. ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము 8. పుటలు 15–24.

2. ఎన్యువల్ రిపోర్ట్సు ఆఫ్ ఎపిగ్రాఫీ. 1935–36 నవంబరు.336

కంపనప్రోలి యందు చైత్యాలయము నిర్మించబడి అందు కుంథతీర్థం కరుడు ప్రతిష్ఠించ బడెనని యున్నది. దీని కాలము శకవర్షములు 1316 భావ సంవత్సర ఫాల్గుణ బహుళ ప్రతి పది సోమవారము అనగా క్రీ. శ. 1395 మార్చి 8కి సరిపోవును. ప్రస్తుత పానుగల్లు శాసనము కంటె సుమారు రెండు సంవత్సరములు పూర్వపుది. ఇట్లు పై రెండు శాసనములను బట్టి విజయనగర బుక్క, హరిహర రాయుల మంత్రియగు బైచ దండాధీశ్వరునకు ఇరుగప, ఇమ్మడి బుక్క యను పుత్రులు గలరని సుస్పష్టము. కాన ఆరవ శ్లోకము లోని 'తస్యానుజోద్విగుణ బుక్కణ' యను వాతడు ఇరుగపని తమ్ముడగు ఇమ్మడి బుక్కడే కావలెను. అట్లైన వీరిని మంత్రీశ్వర, దండాధీశ్వరులనియే గాని రాజశబ్దములతో వ్యవహరించుట తగునా యని ఆక్షేపించ వచ్చును. పైన ఉదహరించిన శ్రవణ బెళ్గొళ శాసనమున ఈ ఇరుగప, బుక్కణల జ్యేష్ఠ సోదరుడగు మంగప్పని పుత్రుడగు ఇమ్మడి ఇరుగపని గూర్చి 'యుద్ధా దుద్ధత శాత్రవైరిరుగ పక్ష్మాపతిః, యాత్రా యాంధ్యజనీ పతే రిరు గపక్ష్మాపస్య' అనియు 'ఇరుగేంద్ర దండనృపతి' రిత్యాదిగా వచించినాడు. బైచదండ నాథుని పుత్రుడు ఈ పానుగల్లు శాసనమునందు ప్రశంసించ బడిన ఇరుగప దండనాథుని గూర్చి విజయనగర మందలి ప్రస్తుత గాణిగిత్తి ఆలయ శాసనమునందు ఇట్లు గలదు.

హరిహర ధరణీశ ప్రాజ్య సామ్రాజ్య లక్ష్మీ
కువలయ హిమధామా శౌర్య గాంభీర్య సీమా
ఇరుగప ధరణీశ స్సింహ సంద్యార్య వర్య
ప్రపద నలిన భృంగస్స ప్రతాపైక భూమిః.

ఇందు హరిహర, ఇరుగప లిరువురును ధరణీశ శబ్దము చేతనే వ్యవహరించ బడిరి. వీనినిబట్టి పానుగల్లు శాసనమున పేర్కొన బడిన ద్విగుణ లేక ఇమ్మడి బుక్క భూపాలుడు బైచదండ నాథుని పుత్రుడు ఇరుగపని తమ్ము డనుటయే యుక్తమనునది మొదటి పక్షము.

**రెండవ పక్షము:** ఈ శాసనమునందు మూడు, నాలుగైదు శ్లోకములలో వరుసగా విజయనగర రెండవ హరిహరరాయుల ప్రశక్తి యున్నది. అతనికి తాత పేరింటి వాడు బుక్కరాయలను పుత్రుడొకడు గలడు. వీనినే శాసన కర్తలు, చరిత్రకారులు 'ఇమ్మడి' లేక 'రెండవ' బుక్క రాయలని వ్యవహరించెదరు. ప్రస్తుత శాసనములోని 'ద్విగుణ' శబ్దము 'ఇమ్మడి'కి సంస్కృతీ కరణము మాత్రమే. తన తండ్రి కాలమున నీతడు యువరాజుగ నుండి అనేక యుద్ధములలో పాల్గొని విజయనగర సామ్రాజ్యాభి వృద్ధికి మిక్కిలి పాటుపడెను. వైద్య రాజవల్లభమను సంస్కృత గ్రంథమున ఈతడు యువరాజుగ రాజ్య భారము నంతయు వహించు సమయమున ఆంధ్ర నగర మొక్కదానిపై గొప్ప సైన్యములతో దండెత్తి యచ్చటి తురుష్క సైన్యముల నన్నింటిని పిన్నంజేసెనని చక్కగా వర్ణింపబడియున్నది. అందలి వర్ణ్యమైన గొప్ప శ్లోకముల నిట సుదాహరించ గలను.

విధాయ భూమేశ్వర మాత్ర పుత్రే
నిధీశ్వరే శ్రీమతి బుక్కరాజే
దస్మైక శీలో ఽప్యసయా విహారీ
మ్యగేక్షణానాంన ఋలం విహత్తే.
సయౌవ రాజ్య శ్రియ మత్పువానః
సమశ్రియాం సన్నిధి రత్నకాలే
బిభర్తి పిత్రా సమమేవ పృథ్వీం
భుజేన బుక్క క్షితిపః సమస్తాం.

అథ విజేతు మభంగుర విక్రమో
హరిహరేశ్వర సూను రుదారధీః
అగమ దంధ్ర పతిం స్మయ మంథరం
యవన సంఘ తరంగిత సంపదం.

సమచల న్నృపనందన సైనికాః
తతశతః పరివేల్లితవాహనాః
నగనానాంతరితాంధ్ర మృగీ దృశా
మిన వదాని తతాని దిదృక్షవః
ధ్వజ పటైః కరవాల విధూన నైః
పటహ ఝంఝరనైర వృణోదఘ్రకం
వివిధ హేషిత బృంహిత సంహితం
బలమ రంధ్ర మధాంధ్ర పతేః పురం.

తతస్తురుష్కాః సముదగ్ర పౌరుషాః
సమధ్య రుక్షన్ సహసా తురంగ మాన్
సమంతతో హంతుమ భంగు కార్ముకాః
ప్రవాల యన్తః పరవాహినీ ముఖం.
ఉత్క్షిప్యమాణా సమరే తురుష్క
దన్తావళై ర్మందర కూటకల్పైః
ఆకాశ గంగా ప్రతిమా తురుష్క
రపూర్వ మాయోధన మాచరన్త.

3. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము. 1పుట 157.
5. ఎపిగ్రాఫియా కర్నాటికా. సంపుటము 12. పుట 212.

శ్రీ బుక్క భూపక్షితిపాల యోద్ధా
రణస్థలే మానుష రాక్షసానాం
ఇంద్రోత్సవో వ్యస్య పదార విన్ద
మాసన్నసం మూర్ధ్ని ముద్వవధత్తే.

ఇందు బుక్కరాయలు దండెత్తి జయించిన ఆంధ్ర నగరము పేరుగాని లేదా ఆ తురుష్క ప్రభువుగాని పేర్కొన బడి యుండలేదు. తుముకూరు జిల్లా చిక్కనాయకని హళ్లి తాలూకా బూదిహాళు గ్రామములోని దొడ్డతేకలవట్టి ఈశ్వర దేవస్థానమందలి వీరగల్లున కొక శాసనమున్నది. అందు శ్రీ వీరబుక్కరాయని పౌత్రుడు, హరిహర రాయల పుత్రుడగు బుక్కరాయలు ఓరుగల్లు దేశముపై దండు పోయి అచ్చటి కొత్త కొండవద్ద తురుష్క సైన్యముల నెదిరించి పోరాడినట్లు గలదు. దీనికాలము శ క 1306 రక్తాక్షి సంవత్సర శ్రావణ శుద్ధ ద్వాదశి వడ్డవారమనగా క్రీ. శ. 1384 జూలై 30 శనివారమునకు సరిపోవును. దీనిని బట్టి ఈ పానుగల్లు శాసనమునకు పదిమూడు సంవత్సరాల పూర్వమే ఇమ్మడి బుక్కరాయలు తెలంగాణముపై దండెత్తి ప్రస్తుతము వరంగల్లు తాలుకాలో కొత్త కొండ వరకును పోయి తురుష్కులతో యుద్ధము గావించినట్లు స్పష్ట మగుచున్నది. కాని పై వైద్యరాజ వల్లభము నందభి వర్ణించబడిన దిగ్విజయము ఈ కొత్త కొండ, పానుగల్లు యుద్ధములలో నేదియో మాత్రము తెలియదు. పానుగల్లు శాసనములోని 'క్షోణీధురాం వహతి వీర్య వతాం వరిష్ఠః' ఇత్యాది యిమ్మడి బుక్కరాజు వర్ణన యువరాజు లేక రాజకుమారునికి తగినట్లున్నది. కాన పైన నుదహరించిన బూదిహాళు శాసనము, వైద్యరాజవల్లభముల ఆధారమున ఇందు పేర్కొనబడిన ఇమ్మడి బుక్కరాజు విజయ నగర మొదటి బుక్కరాయల పౌత్రుడు, రెండవ హరిహర రాయల పుత్రుడనుటయే యుక్త మనునది రెండవ పక్షము.

ఈ రెండవ పక్షమునకు 'తస్యామజో' యను శాసన పాఠము సరిగాదు. అందులకే డాక్టరు వెంకటరమణయ్య గారు తచ్ఛబ్దమునపై ఐదవ శ్లోకమున పేర్కొన బడిన హరిహర క్షోణీపతిని గ్రహించి పై గ్రంథస్థ, శాసనాధారములను బట్టి చరిత్రాంశములకు తగినట్లు శాసన పాఠమును 'తస్యాత్మజో' యని చక్కగ సవరించి నేటివరకును మరి యొక సమస్యయే లేకుండ జేసిరి. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారును దీనినే అంగీకరించిరి. విశేష మేమన 'తస్యానుజో' అని తొలుత శాసన పాఠమును జదివిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారును ఆ యిమ్మడి బుక్కరాజు విజయ నగర హరిహర రాయల పుత్రుడే యని వచించిరి.

ఈ రెండు పక్షములలో నేది సరియైనదియో నిర్ధారణ సేయుట మనకంత సులభముకాదు. శాసన కవి పద ప్రయోగమునకే ప్రాధాన్యము నిచ్చిన పానుగల్లు జయించిన యిమ్మడి బుక్కరాజు బైచదండ నాథుని పుత్రుడు, ఇరుగపని అనుజన్ముడేయగును. అట్లుగాక కవి ధోరణి, వర్ణన తదితర చరిత్రాంశములను బట్టి జూచిన ఆతడు విజయ నగర బుక్కరాయల పౌత్రుడు, హరిహర రాయల పుత్రుడే యనిపించును. సమకాలికులగు రాజకుమార, మంత్రికుమారుల పేరులొక్కటిగ ఇమ్మడిబుక్క యని యుండుట చేతను బహుశః యిరువురును పానుగల్లు యుద్ధమున బాల్గొని యుండుటచే శాసన కర్త పొరపడి యుండెనేమో!

ఈ శాసనమునం దెనిమిదవ శ్లోకమున నిమ్మడి బుక్క మహీపతి తనయుడగు అనంత క్ష్మాపతి యొకడు పేర్కొన బడెను. ఈతడు గూడ పానుగల్లు యుద్ధమున పాల్గొని యుండును. నెల్లూరి మొదటి శాసన సంపుటమున ప్రకటించబడిన క్రీ. శ. 1390 నాటి పరచూరు తామ్ర శాసనమును[6] బట్టి యిమ్మడి హరిహర రాయల పౌత్రుడు, దేవరాయల పుత్రుడునగు రామచంద్రుడు దన తండ్రికి తురుష్కులపై దండయాత్రలో మిక్కిలి సాయపడినట్లు దెలియుచున్నది. ఈ అనంతుడు నిజముగ విజయనగర రాజకుమారుడే యైన రామచంద్రుడు దేవరాయనికి వలె దన తండ్రి బుక్కరాయలకీతడు పానుగల్లు యుద్ధమున మిక్కిలి సాయపడి యుండును.

విజయనగర బహ్మనీ రాజ్యములకు వైరము ఆ జన్మ సిద్ధము. తమతమ సామ్రాజ్య ప్రాభవమునకు వారనేక తావుల ప్రత్యక్షముగనో పరోక్షముగనో సుమారు శతాబ్దము తరబడి పోరుచునే యుండిరి. క్రీ. శ. 1377లో విజయనగర సింహాసనము నధిష్ఠించిన రెండవ హరిహర రాయలు తమ సమకాలిక బహ్మనీ సుల్తానులగు రెండవ మహమ్మదు షాహా, ఫిరోజ్ షాహలతో యనేక పర్యాయములు యుద్ధము గావించెను. పై నుదహరించిన బూదిహాళు, పరచూరి, పానుగల్లు, కాశీశ్వరము మున్నగు శాసనములను బట్టియు వైద్య రాజ వల్లభమునుబట్టి విజయనగర హరిహర రాయలు తన పుత్రులగు దేవరాయ, బుక్కరాయలను పౌత్రులగు రామచంద్ర, అనంతులు, సుప్రసిద్ధ దళ నాయకులగు సాళువ రామదేవ, గుండ, బుక్క, ఇరుగప దండ నాథాదుల సహాయమున పలుమారులు తెలంగాణముపై దండయాత్ర నడపి

6. నెల్లూరిజిల్లా శాసన సంపుటము 1. పుటలు 1—7.

నట్లు స్పష్టము మగుచున్నది. పానుగల్లు దుర్గము యుద్ధ తంత్రమున కనువైన చక్కని గిరిదుర్గము. ఇది విజయ నగర రాజులకై పశమైన బద్ధ శత్రువులగు బహ్మనీ సుల్తానుల నుండి తమ సామ్రాజ్యమున కుపద్రవము లేక్కుటయే గాక తెలంగాణా, వెలమ నేతలతో గొంత సంబంధము గూడ యేర్పడగలదు. క్రీ. శ. 1397లో రెండవ మహమ్మదు షాహ్ మరణించుట తోడనే బహ్మనీ రాజకుటుంబమున అంతః కలహములు చెలరేగి రాజ్యము తాత్కాలికముగ అరాజక మయ్యెను. అట్టి తరుణమునకై వేచియుండిన హరిహర రాయలు ఇమ్మడి బుక్క, అనంతాదులను మరల తెలంగాణ ముపై పంపి యుండును. విజయనగర సేనలు హుటా హుటిన పానుగల్లు దుర్గమును ముట్టడించి అచ్చటి తురుష్క వీరుల నందరిని పాఱద్రోలి గిరిదుర్గమును స్వాధీనము గావించుకొని విజయ నగర చక్రవర్తి చిరకాల వాంఛితమును నెరవేర్చినవి.

## ఇమ్మడిలేక ప్రౌఢదేవరాయల శాసనము

ఈ శాసనము ప్రస్తుతము కొండమీద రామన్న గుండ మనబడు దిగుడుబావి ముందరగల యొక శిథిలాలయ కంబమునకు మూడు ప్రక్కల చెక్కబడి యున్నది. ఇది తెలుగు లిపిలో సంస్కృత, కన్నడ భాషలలో నున్నది. ఇంత వరకిది ప్రకటించబడని సరిక్రొత్త శాసనము. పానుగల్లు దుర్గము నధిరోహించి ఈ శాసనములను కనుగొని ప్రతి బింబములు దీయుటయే కడు ప్రయాసతో గూడినది. ఉదయము టీ మాత్రము సేవించి కొండపైకి పోయిన మేము ఈ శాసన ప్రతిబింబములను దీసికొని నిరాహారముగ మరలి వచ్చుసరికి సాయంత్రము నాలుగు గంటలైనది. ప్రభుత్వ, ధన సహాయములుండినంత మాత్రమున దేశము లోని మారు మూలల పడి యుండిన శాసనములను సేక రించుట సులభ సాధ్యముకాదు.

### శాసన మూలము

ఓం స్వస్తి.

పాయాచ్ఛ్రీ శైల పాదాద్రిం పానుగల్లు మపాయతః

పశ్చిమ ద్వార సంచారీ ముక్తి రామేశ్వరో ముదా.1

భారద్వాజ మునీంద్రగోత్ర విలసత్కాశ్మీర విప్రాన్వయే

జాతో విఠ్ఠల-నాయకోఽజని తతః శ్రీ సింహనారాయణః

తత్పుత్రః సుచరిత్ర సంభృత గుణః శ్రీ దేవ నారాయణః

స్త్రీతోరర్ధమ చీకరద్గృహ మచ్ఛేద్యం ముక్తి రామేశితుః2

రసాబ్ధి రామ రాజాంకే శకే క్రోధిని వత్సరే

దేవ నారాయణో రాసీమ్ముక్తి రామేశ్వరాలయం.3

షట్ ర్యంకాత్యక్తా త్రయంచ సంఖ్యా వియుక్తా

త్ర్యంశ్యా షట్సాదేక ముఖ్యాత్మ కాద్దే

క్రోధిన్యా సీమార్గ రాకా ప్రతిష్ఠాం

రామేశీయం వేశ్మ నారాయణాంకాత్ 4

అవ్యాదవ్యయ చిన్మయ శ్రీ వర్ధయుః శ్రీ ముక్తిరామేశ్వరః

శ్రీ శైలోత్తమ పాదపాన్సల గిరౌ ముక్తో వసంతంసదాత్

కాశ్మీరం గడియంక భీమ బిరుదం పేరోజ సేనాచ్ఛి దం

విద్వద్బాంధవ బంధు రక్షణ చణం శ్రీ దేవనారాయణం.5

భూపాక శాసనే దేవరాజే రాజని రాజని

సోమ నామాంత కోముక్తి రామేశాలయ శాసనం6

స్వస్తిశ్రీ శకవర్ష 1346 క్రోధి సంవత్సరద

మార్గ శిర సు 15 సింహ నారాయణ వరపుత్ర

దేవ నారాయణ ముక్తా శ్వేశ్వరను శ్రీ ముక్తిరామే

శ్వర శివాలయ నిర్మాణమం మాడిసి దరాచం

ద్రార్క శ్రీమో యశస్కర మక్కు మంగళ

మహా శ్రీ శ్రీ శ్రీ

పశ్చిమ ద్వార సంచారుడగు ముక్తి రామేశ్వరుడు శ్రీ శైల పాదాద్రి యైన పానుగల్లును అపాయముల నుండి రక్షించుగాక. కాశ్మీర విప్రాన్వయము నందు భారద్వాజ గోత్రజుడగు విఠల నాయకుడు, అతనికి సింహ నారాయణుడు, వానికి సుచరిత్ర సంభృత గుణుండగు దేవ నారాయణుడు జన్మించిరి. శక వర్షములు రస, అబ్ధి, రామ, రాజులచే లెక్కించ బడిన 1346 క్రోధి సంవత్సరమున దేవ నారాయణుడు దన దండ్రికి బుణ్యముగ ముక్తి రామేశ్వరాలయమును నిర్మించెను. నాల్గవ శ్లోకమున మరల ఆ విషయమునే శాసనకాలము నొక సమస్యగా పేర్కొనినాడు. ఒకటి నుండి ఆరువరకును గల వరుస సంఖ్యలలో రెండు, ఐదులను విడిచిన (1346) శక సంవత్సర క్రోధి మార్గశిర శుద్ధ పౌర్ణమి నాడు సింహ నారాయణుని పేర రామేశాలయమును గావించెను. శ్రీ శైల ఉత్తమ పాదమైన పానుగల్లు గిరి దుర్గమునందు సుఖ ముగ నివసించుచున్నట్టి, కాశ్మీర దేశీయుడు, గడియంక భీమ బిరుదాంచితుడు, పెరోజు సుల్తాను సేనలను ధ్వంసము జేసినట్టి, విద్వద్బాంధవ బంధు రక్షణ చణుడైన శ్రీ దేవ నారాయణుని అవ్యయ చిన్మయుశ్రీ వర్ధితుడగు ముక్తి రామేశ్వరుడు రక్షించుగాక. భూపాక శాసనుడగు దేవరాజు రాజ్యమును బాలించుచుండ సోమనామాంకితుడే ముక్తి రామేశాలయ శాసనమును రచించెను. తదుపరి పై సంస్కృత శ్లోకములలో వర్ణించబడిన సారాంశము మరల కన్నడములో గలదు.

ఈ శాసన కాలము మూడు, నాలుగు శ్లోకముల లోను మరల కన్నడ భాగమునను గలదు. అందు నాల్గవ శ్లోకము లోని "ద్వ్యంకార్యక్త్రాప్యంచ సంఖ్యా వియుక్తా త్ర్యంఖ్యా షట్కా దేకముఖ్యాప్ఫు కావ్దే" యనునది పండితులకు చక్కని సమస్య. శకవర్షము 1346 క్రోధి సంవత్సర మార్గశిర శుద్ధ పౌర్ణమి అనగా క్రీ. శ. 1424 డిసెంబరు 6 నకు సరిపోవును. ఆరవ శ్లోకమున పేర్కొనబడిన భూపాల శాసను డగు దేవరాజు విజయనగర దేవరాయలే గాన ఈ శాసన కాలమును బట్టి అతడు క్రీ. శ. 1423 నుండి 1446 వరకును విజయనగర సామ్రాజ్యమును పాలించిన ఇమ్మడి లేక ప్రౌఢ దేవరాయలనియే నిశ్చయము. పై రెండవ హరిహర రాయల శాసనమునకును దీనికిని కాలభేదము సుమారు ఇరువదియేడు సంవత్సరములు. క్రీ. శ. 1397లో యిమ్మడి బుక్కరాయలచే జయించబడినప్పటి నుండియు గిరి దుర్గము విజయనగర రాజుల యధీనముననే నుండె ననుటకీ రెండవ శాసనమే ప్రమాణము. ఈ గడి దుర్గ మును పాలించుటకు మిక్కిలి నిపుణులగు దండ నాయకులు నియమించ బడుచుండిరి. అందొక్కని వంశము నాతం డొన రించిన ఘనకార్యము లిందు మూలమున మొట్టమొదటిసారి తెలియ వచ్చెను.

ఈ శాసన ప్రధానోద్దేశ్యము కాశ్మీర దేశ విప్రుడు భారద్వాజ గోత్రజుడగు విఠల నాయకుని పౌత్రుడు, సింహ నారాయణుని పుత్రుడగు దేవనారాయణుడు ముక్తి రామేశ్వర శివాలయమును గావించెనని దెల్పుట. ఈతడు పానుగల్లు దుర్గాధీశ్వరుడట. విజయనగర రాజుల కాల మునను బ్రహ్మణులు గూడ దండనాయకులుగ, దుర్గాధ్యక్షు లుగ నుండి రనుటకిది యొక తార్కాణము. ఇక నీ దేవరాయ ణుని తండ్రి తాతలు కాశ్మీర దేశ బ్రాహ్మణులని వచించ బడినది. అహోబలపతి విరచితమైన విరూపాక్ష చంపుయను గ్రంథమున పంపావిరూపాక్ష దేవుని వసంతోత్సవ సందర్భ మున వేతెంచిన విజయనగర హరిహర రాయల సామంత రాజులలో కాశ్మీర భూపాలుడొక్కడు గలడు.7 కాశ్మీర భూపాలుడన గాశ్మీర దేశమును పాలించెడి రాజే హరిహరుని సామంతుడనుట యసంభవము. మరియు హరిహర రాయల తమ్ముడగు మారప మంత్రులును తండ్రి కొడుకులగు చౌండప మాధవలు తాము కాశ్మీరజులమని దెల్పుకొనుటచే నీతడు వారి వంటి వాడే యగును. వీనినిబట్టి కాశ్మీర దేశస్థులగు కొందరు విప్రులు, క్షత్రియులుగూడ విజయనగర రాజుల ఆదరాభిమానము లకు పాత్రులై మహామంత్రి, దుర్గాధీశాదిపదవుల నలంకరించి వారి సామంతులుగ నాంధ్ర దేశమును పాలించినట్లు స్పష్ట మగుచున్నది. దేవ నారాయణుని తండ్రి తాతలగు సింహ నారాయణ విఠల నాయకులు గూడ బహుశః విజయనగర రాజుల కొలువులోని వారై యుండవచ్చును.

ఐదవ శ్లోకములోని దేవనారాయణుని గూర్చిన 'గడి యంక భీమ', 'పెరోజి సేనాచ్ఛిద' యను బిరుదు, విశేషణ ములు రెండును ముఖ్యమైనవి. పైన వివరించినట్లు పాను గల్లు దుర్గము తూర్పున కొండవీటిరెడ్డి రాజ్యముతోడ, ఉత్తర, పశ్చిమోత్తరములుగ వెలమ, బహ్మనీ రాజ్యముల తోడను యుద్ధము సేయుట కనువైన గడి దుర్గము. ఆ దుర్గమును వశ పరుచుకొనుట యందే దేవ నారాయణునికి 'గడియంక భీమ' బిరుదు వచ్చి యుండును. రెండవ విశేషణ మగు 'పెరోజ సేనాచ్ఛిద' మనునది కడుముఖ్యమైనది. రెండవ మహమ్మదు షాహ యనంతరము క్రీ. శ. 1397లో బహ్మనీ సింహాసనమునధిష్ఠించిన అతని సోదర పుత్రుడ అల్లుడునగు ఫిరోజషాహయే ఈ పెరోజి ప్రభువు. ఈతడ క్రీ. శ. 1422వరకు మాత్రమే రాజ్యమును పాలించెను కాన దేవ నారాయణుడు ఫిరోజిషాహ సేవలను నాశము గావిం చుట ఈ యిమ్మడి దేవరాయల కాలమున కాజేరదు. అది మొదటి దేవ రాయలకు ఫిరోజిషాహకును జరిగిన క్రీ. శ. 1417—19 నాటి పానుగల్లు యుద్ధమున కావలెను. ఈ యుద్ధమును గూర్చి సుప్రసిద్ధ చరిత్ర రచయితలగు డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారి హృదయంగమ మైన వాక్యములనే యథాతథముగ లిఖించెదను.8

"తెలంగాణా వెలమ, కొండవీటిరెడ్డి రాజ్యముల నందు కట్టునందు ఆయువు పట్టుస్థానమై పానుగల్లు దుర్గము ఇమ్మడి హరిహరరాయల కాలము నుండియు రాయల యధీనమందు ఉండి యుండుటవలన దేవరాయలకు రాజ మహేంద్రవర రెడ్డిరాజులకు బలసహాయ మంపుట కరమను కూలముగ నుండెను. కావున రాజమహేంద్రవర రాజ్యమున మిత్రుడైన అన్నదేవ చోళుని నిలబెట్టి తన యాధిపత్యమును స్థిరపరుచుకొన వలయుననిన ఫిరూజిశాహునకు పానుగల్లు దుర్గమును స్వాధీనము చేసికొని విజయనగర దళములకు పూర్వ దేశమును చొచ్చుటకు అవకాశము కలుగకుండ జేయుట అత్యంతావశ్యకముగ గన్పించెను. మరియు వెలమ రాజులతో

7. Further sources of vijayanagara History Vol. I. p 56 f. n.

8. విజ్ఞాన సర్వస్వము, తెలుగు సంస్కృతి. సంపు టము 3–పుట 350–51.

# పానుగల్లు విజయనగర శాసనము

మైత్రి అవిచ్ఛిన్నముగ సాగుచుండినంత కాలము సుల్తాను నకు పానుగల్లు దుర్గముయొక్క విలువ స్పష్టముగ తెలియ రాదాయెను. ఏ కారణమువల్లనో ఈ దండయాత్ర సందర్భ మున వారికి సుల్తానుపై ద్వేషము జనించెను. దానికి లెంగి దేవరాయలు వెలమ రాజులతో సఖ్యము చేసికొని రాజమహేంద్ర వర ప్రాంతము నుండి సుల్తాన్ యొక్క పశ్చాత్ గమన మార్గమును అరికట్టెను. అటుమీదట సుల్తాన్ పూర్వ దేశమున దండుసేయుట విపత్కరమని గ్రహించి, హుటా హుటి దండు మరల్చుకొని పానుగల్లు దుర్గమునకు వచ్చి ముట్టడి వేసెను. ముట్టడి క్రీ. శ. 1417 మొదలు 1419 వరకును రెండేండ్లు కాలము సాగినను కోట సుల్తానుకు స్వాధీన పడలేదు. ఈ రెండేండ్ల లోపల సుల్తాను సైన్యము చాల కష్టములనుభవించ వలసి వచ్చెను. అడుగడుగునకును హిందు వులపై గవయుచుండిరి. అన్న పానీయాది పదార్థములు దుర్లభమాయెను. స్కంధావారమున దైనందిన జీవనము దుస్సహమాయెను, ఇది ఇట్లుండ గోరుచుట్టుపై రోకటి పోటు పడినట్లు శిబిరమునందు మారి మసగెను. భీతచిత్తు లైన సుల్తాను సైనికులును, సర్దారులును పెక్కండ్రు పరారి చిత్తగించిరి. ఆ సమయము కనిపెట్టి దేవరాయలు దళములను కూర్చుకొని పానుగల్లు ముట్టడిని లేవదీయుటకు వచ్చిన సుల్తాను ఫౌజులను కదిసెను. ఉభయ పక్షముల కును వంకుల సమరము సంప్రాప్తమాయెను. హిందువులు పట్టుదలతో పోరాడినందున సుల్తాను బలము వారితో సరి పోర జాలక పటాపంచలై పారిపోయెను. ఫీరూజ్ శాహు గాయపడి ఎట్లో ప్రాణము దక్కించుకొని పలాయన మొన రెను. హిందువులు విజయోన్మత్తులై ఖండిత మహమ్మ దీయ సేన శిరములను ప్రోవుచేసి గుట్ట వేసిరి. తరువాత సుల్తాను రాజ్యముపై బడి పట్టణములను గ్రామములను కొల్లగొట్టి పరశురామ ప్రీతి గావించిరి. అసంఖ్యాక ప్రజ లను చెరగొనుటయే గాక మసీదులను నాశనము గావించి మహమ్మదీయులపై పగ దీర్చుకొనిరి."

ఉపరి కొద్ది కాలమునకే క్రీ. శ. 1422లో ఫిరోజిషాహ్ మృతి నొందెను. క్రీ. శ. 1417 నుండి 1419 వరకును జరిగిన ఈ పానుగల్లు ముట్టడి యందే మొదటి దేవరాయల కాలమునందే దేవ నారాయణుడు ఫిరోజిషాహ్ సేనలను పూర్తిగ ధ్వంసము గావించి పానుగల్లు గిరి దుర్గ మును సంరక్షించి 'గడియంక భీమ' బిరుదమును వహించి యుండును. బహుశః అప్పటి నుండియే పానుగల్లు దుర్గా ధీశ్వరుడుగ కూడ నియమించ బడియుండును. ముక్తి రామేశ్వర శివాలయము వాడే కట్టించెను. ప్రస్తుతము ఈ శాసన కంబము గల రామన్న గుడమని పిలువబడు దాని కెదురుగ నుండిన శిథిలాలయమే అది కావచ్చును. పానుగల్లు శ్రీశైల పశ్చిమ ద్వారము, ప్రత్యంత పర్వతమునట !

ఈ శాసనమును రచించిన కవి సోమన నామధేయుడు. శాసన కాలమును బట్టి అతడు క్రీ. శ. 1425 ప్రాంతము వాడని స్పష్టము.

ఈ శాసనములను ప్రకటించుటకు దయతో సమ్మతి నొసంగిన శ్రీ భారత ప్రభుత్వ శాసన శాఖాధ్యక్షులకు నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

---

శా. పోస్టాఫీసున పోస్టుచేయఁ డొకడాబున్ నేడు నా మాటలన
పోస్టుం జేయగవచ్చు స్టాంపుమిడి యెట్లీయుంచు వైరిచ్చుచో
బెస్టన్నింటను దీని చూచుకొనుచో వేవేగ మేల్ ట్రెయినులో
నే స్టాంపౌ నతఁడారణాలు కద మీకేమైన వేస్టయినచో.

భోగరాజు నారాయణమూర్తి.

# శబ్దార్థ కల్పతరువు



## శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

శబ్దార్థ కల్పతరువుపై 1962 జూన్ భారతి పత్రికలో నేను వ్రాసిన సమీక్షపై,— నారాయణమూర్తి యనువారు వారి భ్రమలను నివారింపఁబూని వ్రాసిన వ్యాసమును అక్టోబరునెల భారతి పత్రికయందుఁ జూచితిని. "సుఖానందగారి శబ్దార్థ చింతామణిని, వాచస్పత్యమును వీక్షింపకయే వ్రాసితి"నని— నారాయణమూర్తిగారు వ్రాసినది వాస్తవము. కావుననే యాగ్రంథములను జూచియే వారికి నా కృతజ్ఞత తెలుపుకొనుటకై ఇన్నాళ్లదాక యత్నించుటలో ఆలస్యమైనది. అందు శబ్దార్థ చింతామణి ఇప్పటికిని లభింపలేదు. కాని (తారానాథ) వాచస్పత్యము లభించుటచేత నా భ్రమలు తీరినవి తీరినట్లును, లేనివి లే నట్లును భారతి పత్రికా ముఖమున— నారాయణమూర్తిగారికిఁ దెలుపుకొను చున్నాను.

శబ్దార్థ కల్పతరు పరిష్కర్త లగు శ్రీ చైతన్యస్వాములు భూమికలో "ఈ పద్ధతిచేత ఎన్నియక్షరములు గల పదము కావలె ననిన ఆ విధ మగు పదసమూహములో వెదకవలసిన శ్రమ లేకుండ ఒక్కచోటనే చూచుటకు వీలుపడును. అది యున్నగాక అందరును గద్యపద్యాత్మక మగు కవిత్వ మల్లుటకును ఈ పద్ధతి చాల ఉపకరింపఁగలదు." అని వ్రాసిన దానిపై— 1962 మార్చి 25 తేది ఆంధ్రపత్రికా సారస్వతానుబంధమున "గ్రంథసమీక్ష"లో శ్రీ వావిలాల రామమూర్తిగారు "కాని మామూలు నిఘంటువును చూచెడి దానికంటె నిది సులభపద్ధతి కాదు అనవలసి యున్నది." అని వ్రాసిన వాక్యము నావట్లనే చరితార్థమైనది యని యొప్పుకొను చున్నాను.

పదునాల్గేండ్లు శ్రీ సూర్యరా యాంధ్ర నిఘంటు కార్య స్థానమునఁ బని చేసిన నేను శబ్దార్థ కల్పతరువునందున్న ఆన్వీక్షకీ పదమును కనుఁగొన లేకపోయిరి అనిన దెలిసినవా రెవరును నమ్మరు. కాని నిత్యము వాచస్పత్యము, పరవస్తువారి లఘుశబ్దార్థ సర్వస్వము, సంస్కృత శబ్ద కల్ప ద్రుమము అప్టే సంస్కృతాంగ్ల నిఘంటువు, మోనియరు విల్యమ్సు సంస్కృతాంగ్ల నిఘంటువు, కిట్టెలు కన్నడ నిఘంటువు, విన్స్లో అరవనిఘంటువు, గండర్టు మళయాళాంగ్ల నిఘంటువు, మున్నగు వివిధ నిఘంటువులలో ప్రధాన ముద్రిత సమాస పదములు (ఏకదేశములైనను) చూచు నభ్యాసము గలిగినను, వానిత్రోవ వేరు, నేఁటి ఈ ముద్రిత శబ్దార్థ కల్పతరువుత్రోవ వేరువై యుండుటచేత పదములను వెదకి పట్టుకొనుటలో నేనే కాదు, నా వంటి మధ్యమాధికారు లేకొందరో భ్రమపడక మాన రని, నావి కొన్ని భ్రాంతిమూలకములును గావచ్చు నని వ్రాసిన దాధారముగాఁ దీసికొని, అర్థ నిర్ణయముపట్ల పరిష్కర్తలు పొరపడిన విషయములు కూడ నా భ్రాంతులే యని— నారాయణమూర్తిగారు ధైర్యముగా వ్రాయఁగలిగినందులకు వారి సాహసము మెచ్చఁదగినది.

ఈ నిఘంటు నియమములను మరచి "ఆన్వీక్షకీ" పదమును గనుఁగొనలేకపోవుటయు, ఆశ్రయణ శబ్దముక్రింద "శ్రయణ" ఈయఁ బడినది అని వ్రాయుటయు భ్రాంతి మూలకములే.

శ్రీ వేంకటార్యుని మూల గ్రంథమును జూచి సరిగా వ్రాసికొనిన వ్రాఁతప్రతియం దిన్ని తికమకలు లేవు. విశ్వ, కేశవ, హలాయుధాది నిఘంటువులందువలె పదాంత్యాక్షర నియమమే కాక, పదాదినిఁగూడ నక్షర మాలాక్రమమును, ఏక, ద్వి, త్రి, చతురక్షరాది కాంకముల విభాగమును మాత్రమే కలవు. ముద్రితమునన్ ఆ నియమములతోపాటు, మూఁడు నాల్గక్షరములు గలపదములలో నొకదానిని ప్రధాన పదముగా గ్రహించి, ఆ పదము క్రిందనే రెండేసి మొదటి అక్షరములు విడిచి తక్కిన భాగము మాత్రమే (ప్రధాన పదముయొక్క అర్థముతో సంబంధము లేకున్నను) చూపి, దాని కర్థాదులు వ్రాయుచు వచ్చిన మూల్య సంస్కారము నాకు భ్రాంతి గలిగించిన మాట వాస్తవము

నిఘంటు నిర్మాణమునఁ గల క్లేశము కొంచె మెఱిగిన వాఁడను గాన "ప్రమాదము అని నేను చూపునవి భ్రాంతి

# శబ్దార్థకల్పతరువు

మూలకములు కావచ్చు" అని వ్రాసిన వాక్యము దైకని — నారాయణమూర్తిగారు "శ్రుతశ్రోణి" మొదలగు పదము లను గురించియు "శ్రీ శాస్త్రిగారు చాల పరిశ్రమించి వ్రాసినారు. కారణము వారు పైన పేర్కొనినదే కావచ్చును." అని ఇట్టి సమాధానము వ్రాసిరి. అనగా భ్రాంతుడనై యుంటినా వ్రాసితి గాని శ్రమ ప్రమాదములు లేవు — నారాయణమూర్తిగారు పోలగా నా శ్రమను వారించినారైరి. ఆ యొక్క వాక్యముతో వారివ్యాసమే పూర్తికావచ్చును గదా! మరల అవు నని కా దని, నా వ్యాసమునకు సమాధానముగా నే వేమియో వ్రాసి వృథా శ్రమ పడిరే! పాపము! అవల నా వ్రాసిన యుపపత్తి వారికి బోధపడిన నట్లు వ్రాయరు. చర్విత చర్వణముగా వెనుకటి "శ్రుతశ్రోణి" శబ్దనివారణము వ్రాయుట వ్యర్థము. కాన సావధానముగాఁ బరికీలించి వాస్తవ మెఱుఁగ గోరెదను.

"సంజ్ఞప్తి, సంజ్ఞపన" పదములు రెంటికిని "మరణము" అని యొక యర్థముమాత్రమే యుండగా, సంజ్ఞప్తి పదము వద్ద అర్థమునకై చూ. సంజ్ఞపనమ్. అనుటలో సౌలభ్యము కనఁబడదు. ఆ రెండు పదములును దరిదాపులవి కావు. రెండు చోట్లను "మరణము" అని అర్థము వేస్తే చూసిన సులభముగాఁ దెలియునే" అని నేను వ్రాసితిని.

ఈ వాక్యములు — నారాయణమూర్తిగారికి "సంజ్ఞప్తి" పదమునకు "మరణము, మరణము" అని రెండుమార్లు వ్రాసి నట్లర్థమై "మూఁణసేకదా" యని వ్రాయించినవి. ఇం దేమియు సంబంధశుద్ధి గోచరింపదు. నేను వ్రాసినది వారి హృదయమునకు మారణముగా స్ఫురించినది కాఁబోలును "శాంతం పాపమ్".

దానికే యింక నొక సమాధానము వ్రాసిరి. "ఆ పద ములు రెండు పర్యాయ పదము లని తెలిసికొనుట కట చూ. లనుదానికి "ఏదే నొక వివక్షితాంశమును మాత్రము చూడుడు అని యర్థ మనినట్లు కలదు. కాని "చూ అనఁగా పర్యాయ పదముగా గ్రహింపవలెనని సంజ్ఞాసూచియందు లేదు. ఇది సమాధాన మె ట్లగునో వింతగా నున్నది. వారిని మరల వివరింపుఁ డనిన మరింత బాధించిన ట్లగును. కాన ఈ యుభయంగళ ప్రసంగము విరమించి, ముందటి విషయమునకు వత్తము.

"గమ్యా" శబ్దమును గూర్చి నే నిట్లు వ్రాసి యుంటిని— "శబ్దార్థ కల్పతరువు" వ్రాత ప్రతియందు గమ్యా శబ్దము లేదు. ముద్రిత ప్రతియందు (విశేష్యమైనట్లును) భార్య యను నర్థమున నున్నది. వ్రాత ప్రతిలో "గమ్యమ్" అను పదము విశేషణముగా మాత్ర ముండెను. "భార్య" అను నర్థ మున వ్రాత ప్రతియందే కాదు. శబ్దకల్ప ద్రుమమునం గాని, అమర ఎల్ప నానార్థ రత్నమాలా నిఘంటువులం గాని కనబడదు. దీని కేమి ఆ ప్రయోగ మున్నదో యుదా హరణము లేదు. [illegible] వ్యుత్పత్తి మైనా [illegible] సంజ్ఞాపదముగా నిఘంటు [illegible] కాదు." అని.

దీనిని గూర్చి — నారాయణమూర్తిగారు "గమ్యము అనుపదము శబ్దార్థ చంద్రికయందును గలదు. తద్వత్ "గమ్యా" అనుకొనరాదా ?" అని నా భ్రాంతి నొకదానిని తొలఁగింప నొక చిన్న సమాధానము వ్రాసిరి.

"గమ్యము, గమ్యా, గమ్యమ్" అను శబ్దము లుండ వని కాని, ఉన్నచో అశాస్త్రీయములనిగాని నేను వ్రాయలేదు. అవి వారి కల్పనార్థమైనవి కాఁబోలు. వ్రాత ప్రతియందు వేంకటార్యుఁడు "గమ్యమ్" అనుపదము విశేషణముగా చూపె నని వ్రాసియే యుండ "శబ్దార్థ చంద్రిక యుందును గల దనుట యెంత యుచితముగా నున్నదో! గమ్యా అనఁగా "భార్య" అనుట కాధార మున్నయెడల జూపినారు కారేమి అని మాత్రమే—నే నడిగితిని.

దాని కింకొక సమాధానము సప్రమాణముగా నిట్లు చూపినారు ఈ సమాధానము నిలుచుఁగాక నిలువక పోవుఁ గాక— ఇది న్యాయ్యమైన మార్గము.

"అస్తు. శబ్దార్థ చింతామణి ప్రథమ భాగము 785 పృష్ఠమున —గమ్యా స్త్రీ— వత్స్యాం. ఖేదాత్ స్త్రీషు ప్రవృత్తి ర్భవతి. సమానశ్చ ఖేద విభాగో గమ్యాయా మగ మ్యాయాం చ. తత్ర నియమః క్రియతే ఇయం గమ్యాఇయ మగమ్యా ఇతి భాష్యం. ఖేదయతీతి ఖేదః రాగః ఇంద్రియ నియమ నాఽసామర్థ్యం వా ఖేద ఇతి కైయటః— ఏవం చాగమ్యాదినిషేధ స్యేతర్యాభ్యనుజ్ఞా ఫలకతయా స్వదారగమనే దోషాభావః" అని స్పష్టముగా దృగ్గోచర మగుచున్నది. సంశయాత్ములెల్లరును వీక్షింప వచ్చు" నని ఘంటా ఘోషముగాఁ జాటి చెప్పినారు.

సంశయాత్ములు నా వంటివా రింకను బెక్కు రుండ వచ్చును. వేంకటార్యుని సుమారు 18 వేల పదములు గల నిఘంటువున 60 వేల పదము లధికముగాఁ జేర్పఁబడినవి గదా వీని కన్నిటికిని తలాయొక్క సంశయమును సూచించుచు వచ్చినచో, ఈ సంశయాత్ముల కందరకు సమాధానములు చెప్పుటయేనా మానవి ? అని వినువుచే కాఁబోలును వాకును, నావంటి వారికిని నేక సమాధానముగా —నారాయణమూర్తి

గారు "తంత్రయాత్మ కెళ్ళరు పీక్షింప వచ్చు"నని విశృంఖలముగా వ్రాసినారు.

వారు ప్రమాణముగా నిచ్చిన శబ్దార్థ చింతామణియ యుండనిచ్చి ఆ చింతామణి చూపిన మహా భాష్యము గాని ప్రదీపము గాని, ఉద్యోతము గాని గమ్యా శబ్దమునకు వా రనుకొనిన "భార్య" అను విశేష్యార్థము చెప్పక పోవుట శోచనీయము.

ఈ ప్రసంగము మహా భాష్యమున నెందులకుఁ గల్గెనో ముం దరయుదము. "సిద్ధే శబ్దార్థ సంబంధే" అనువార్త్తికము నెత్తికొని 'శబ్దము, అర్థము, సంబంధము' అను మూఁడును లోకము వలననే సిద్ధించుచుండఁగా నిఁక శాస్త్ర మెందులకు ? అని శంకించి, "లోకతో ర్థప్రయుక్తే శబ్ద ప్రయోగే శాస్త్రేణ ధర్మనియమః క్రియతే" ఇతరుల కర్థజ్ఞానము కలుగుటకై లోకవ్యవహారము ననుసరించి శబ్దము ప్రయోగింపఁబడును. శబ్ద ప్రయోగ మారీతిగా లోక వ్యవహారము వలననే సిద్ధించినను, శాస్త్రము శబ్దములయొక్క ప్రకృతి ప్రత్యయములను విభాగించి, సుశబ్దములుగ నిరూపించి, అట్టి సుశబ్దములను ప్రయోగించుటయే ధర్మ మని నియమము చేయును. అని ధర్మ నియమమును గూర్చి చెప్పుచు "యథాలౌకిక వైదికేషు" లోకమునందును వేదమునందును స్మృతులందును శ్రుతులందును మరొక విధముగా సిద్ధించుదానికిఁ గూడ నియమ మున్నట్లే, శబ్దముల విషయమునను వ్యాకరణము నియమము చేయును. అను సమాధాన భాష్యమునందు లౌకిక సిద్ధాంతములందు ధర్మ నియ మె ట్లుండునో ఈ క్రింది రీతిని భాష్యకారులు చెప్పుచున్నారు.

లోకే తావ దభక్ష్యో గ్రామ్య కుక్కుటః, అభక్ష్యో గ్రామ్యసూకరః, ఇత్యుచ్యతే, భక్ష్యంచ నామ— క్షుత్ప్రతిఘాతార్థ ముపాదీయతే, శక్యం చానేన శ్వమాంసాది రపి క్షుత్ప్రతిహంతుం తత్ర నియమః క్రియతే. ఇదం భక్ష్య మిద మభక్ష్య మితి. తథా ఖేదాత్ స్త్రీషు ప్రవృత్తి ర్భవతి. సమానశ్చ ఖేద విగమో గమ్యాయాం చాగమ్యాయాంచ. తత్ర నియమః క్రియతే. ఇయం గమ్యా ఇయ మగమ్యా ఇతి."

లోకమున అనఁగా స్మృతులందు, "గ్రామ్య కుక్కుట గ్రామ్య సూకరము లభక్ష్యములు "అను నియమము కలదు. ఆఁకలి దీర్చుకొనుటకు తిండి తినుట లోకసిద్ధమే. కుక్క మాంసము చేతనైనను ఆఁకలి తీర్చుకొనవచ్చును. అట్టియెడ "ఇది తినఁ దగినది. ఇది తినఁదగనిది" అని శాస్త్రము నియమము చేయుచున్నది.

మరియు ఇంద్రియములను నిగ్రహించుకొనఁ జాలక ఖేదము తీర్చుకొనుటకై స్త్రీ ప్రవృత్తి గల్గును. అట్టి ఖేదము తొలఁగించుకొనుటలో గమ్య (పొందఁ దగినది) యైనను, అగమ్య (పొందఁ దగనిది) యైనను సమానమే. అట్టియెడ "ఈమె గమ్య ఈమె యగమ్య" అని శాస్త్రము నియమము చేయును." అని.

ఇట్లే వైదికములందును (శ్రుత్యుప నిబద్ధము లందును) మూఁ డుదాహరణములు చూపఁబడినవి. అదియుఁ గాక యిటుఁ జూపుట శాఖా చంక్రమ మగు నని ప్రకృత మగు గమ్యా శబ్దమును గూర్చిమాత్రమే ఉద్యోత ప్రదీపము లేమనెనో మనవి చేసికొందును.

కైయటుఁడు ప్రదీపమున : లౌకికము లనఁగా స్మృత్యుప నిబద్ధము లనియు వైదికము లనఁగా శ్రుత్యుప నిబద్ధము లనియు వ్యాఖ్యానించి భక్ష్యా భక్ష్య గమ్యాగమ్య శబ్దములను వివరింపక, స్త్రీలింగ క్షుచ్ఛబ్దమునకు నపుంసకలింగ శక్యశబ్దముతో నన్వయము గూర్చి చర్చించి, ఖేద శబ్దమునకు రాగము అని వాని యింద్రియ నియమ నాఽసామర్థ్యము అని కాని అర్థము గ్రహింపవలె నని మాత్రము చెప్పెను.

దీనిపై నాగేశభట్టు ఉద్ద్యోతమున : ఏవంచ గ్రామ్య కుక్కుట పరదారాదౌ విశేష నిషేధస్య ఇతరాభ్యనుజ్ఞాఫలకతయా ఆరణ్యక తద్భక్షణ స్వదార గమనయో ర్యథా దోషాభావో, యథాచ గ్రామ్య కుక్కుట పరదార గమనయో రధర్మః, తథా శాస్త్రజనిత జ్ఞానపూర్వకే గవాది ప్రయోగే అపూర్వోత్పత్తి రూపకం ఫలం శాస్త్రేణ బోధ్యతే తేషాం సాధుత్వ బోధనాత్ అర్థా దపశబ్దానా మధర్మ జనకత్వం బోధ్యతే. ఏకవిధే స్తదితర నిషేధ ఫలకత్వాత్. యథా ఏక నిషేధస్య అపరాభ్య నుజ్ఞా ఫలకత్వ మితి భావః" అనెను. అనఁగా భాష్య ప్రదీపముల వలనఁ దేలిన సారాంశ మే మన : గ్రామ్య కుక్కుట పరదారాదుల విషయమునఁ జెప్పబడిన విశేష నిషేధము ఇతరాభ్యనుజ్ఞాఫలము కల దనుటచేత, ఆరణ్యక కుక్కుట భక్షణమునను స్వదార గమనమునను దోష మెట్లు కలుగదో, గ్రామ్య కుక్కుట భక్షణ, పరదార గమనములందు అధర్మ మెట్లు కలుగునో, అట్లే శాస్త్రజనిత జ్ఞానపూర్వక మగు గవాది శబ్ద ప్రయోగముచే (శాస్త్రముచే శబ్దములు సాధుత్వము నొందినవి కావున) అపూర్వోత్పత్తి రూప మగుఫలము కలుగునని శాస్త్రముచే బోధింపఁబడును. ఒకదానికై చెప్పఁబడిన విధి తదితరమునకు నిషేధమును, ఒకదానికిఁ జెప్పఁబడిన నిషేధము తదితరమునకు విధియునై ఫలించును అని భావము" అని.

# శబ్దార్థ కల్పతరు

'ఏవంచ' అనియు 'ఇతిభావః' అనియు చెప్పుటచే భాష్య ప్రదీపముల తాత్పర్యము చెప్పుటయే యుద్ద్యోతము యొక్క యాశయము. కాని ప్రతి పదవ్యాఖ్య మాత్రము కా దని స్పష్టము. దీని ననుసరించి గమ్యా—పొందఁ దగినది అని విశేషణార్థ మాత్రము చెప్పుటయే న్యాయము. ఈ వివరణము ప్రతిపదార్థమని యెంచి గమ్యా వి. పత్ని అనియే గ్రహించునెడ అగమ్యా. వి. పరదార అనియు, భక్ష్యము. వి. 1. ఆరణ్యకుక్కుటము 2. ఆరణ్య సూకరము అనియు. అభక్ష్యము వి. 1. గ్రామ్యకుక్కుటము 2. గ్రామ్య సూకరము అనియు గ్రహింపవలయునుగదా ? శబ్దార్థ కల్పతరు వట్లు గ్రహింపలేదేమి? చూడుఁడు.

అభక్ష్యః. అ. త్రి. గ్రామ్యకుక్కుట సూకరాదిషు, తినఁగూడని పదార్థములు. ఊరఁగోడి, ఊరఁబంది, మొ. అని 80 పుటయందును భక్ష్యః త్రి. అదనీయే, తినఁ దగినది, ఖాద్యే (అపూపాది) చిరుతిండి, పలిదిండి, తినుబండము మొ. అని 1117 పుట యందును.

గమ్యమ్. అ. న. ప్రాప్యే పొందఁ దగినది. గమనయోగ్యే గమింపఁ (వెళ్ల) దగినది. జ్ఞేయే, తెలియఁ దగినది. అని 482 పేజీలోను

అగమ్యమ్. అ. త్రి. అజ్ఞేయే, ఎఱుఁగరానిది, గమనాయోగ్యే, పొందరానిది అని 80 పేజీలోను.

విశేషార్థములతో మాత్రమే యేల యాశబ్దములు గ్రహింపఁ బడెను ? (గమ్య శబ్దము. అ. న. అని విశేష్యమైన ట్లున్నను అర్థములను బట్టి విశేషణము స్పష్టము. అ. న. అనుట —నారాయణమూర్తిగారి మతమున "అప్రమాణము కానేరదు. నిరర్థ శబ్దము. పుం. అనుట ప్రమాద మని నేను వ్రాయఁగా "నిరర్థ. త్రి. అనుటకు పుం. అని సకినంత మాత్రాన నిఘంటు ప్రామాణ్యమునకు భంగము కలుగఁబోదు" అని వారు వ్రాసియుండుటచే విశేష్య విశేషణ విభాగమునఁ బ్రమాదము లున్నను జూపుట ప్రమాదమని విరమించుచున్నాఁడను). శబ్దార్థ చింతామణి ననుసరించి, తక్కినవి గూడ విశేష్యములుగా నేల గ్రహింపలేదో, ఆ నిఘంటువు 'గమ్యా'శబ్ద మొకటియే కాని తక్కినవి గ్రహింపలేదో, గ్రంథ విస్తరభియా శబ్దార్థ కల్పతరువు విడిచినదో తెలియదు.

వాచస్పత్యమునందు, శబ్దార్థ చింతామణి చూపిన మహాభాష్యాదిక వాక్యములతో విశేషణ మాత్రముగానే యున్నది. కానీ— నారాయణమూర్తిగారు వ్రాసిన— పత్న్యాం అను విశేషార్థము మాత్రము లేదు. సంశయాత్ములు భ్రాంతి నొందకుండుట కిందున్న విషయమే యిచట పొందు పఱుచుచు—

గమ్య. త్రి. గమ్. వవర్గాంతత్వాత్ కర్మణియత్. 1. గమనీయే 2. ప్రాప్యే అజ్ఞాతేయత్. గమనయోగ్యే. "గమ్యాన్యపి తీర్థాని కీర్తనీయా న్యగమనాని. భా. వ. 85." అభికామాం కామాం స్త్రియం య శ్చ గమ్యాం రహసి యాచితః భా. అ. 73. "గమ్యం త్వభావే దాతౄణాం కన్యా కుర్యాత్ స్వయంవరం. యాజ్ఞ— సమాసశ్చ భేదవిగమో గమ్యాయామగమ్యా యాంచ. తత్రనియమః క్రియతే. ఇయం గమ్యా ఇయమగమ్యా ఇతి మహాభాష్యం. భేదయతీతి భేదో రాగః స ఇంద్రియ విషయ మాపామర్త్యంవా— ఇతికైయటః, ఇతరాథ్యమజ్ఞానలకతయా స్వదార గమనే దోషాభావః, (ఇతి) వివరణం. అని కలదు.

ఈ వివరణ మంతయు— (త్రి— అను) విశేషణమైన గమ్య శబ్దమును గూర్చియే కాన —నారాయణమూర్తిగారు "పత్ని" అను వర్థమును విశేష్యమనుటకు సాధకముగా జూపుట వృథాయని మాత్రము తెలుపుకొను చున్నాను.

"చక్రగజ" పదము నేనుదాహరించితిని. కాని "చక్రగణ" శబ్దము కాదు. అని నేను తప్పుగా వ్రాసితినో, అచ్చు ప్రమాదమో నిశ్చయముగాఁ జెప్పలేను. అది నా భ్రాంతులలో నొకటిగా నెంచి "చక్రగణపద మే నిఘంటువులోనిదో" యని యొక విసరు విసరినారు. చక్రగణ పదము నేను జూచిన యే నిఘంటువులలోను లేదు. శబ్దార్థ కల్పతరువులోని "చక్రగజ" శబ్దముగా గ్రహింపఁ గోరెదను.

"వ్యుత్పత్తులు సంబంధములు చూపించుటను పరిష్కర్తలు పాటించినవారు కారు" అనియు, "భూమికాదులు సమగ్రముగా సమీక్షించి యున్న యిన్ని సందేహములు కలిగెడిది కా వేమో" అనియు —"గమ్యా శబ్దమునకు "పత్ని" యను విశేషార్థ మేనిఘంటువులందును లేనిది వ్రాసినారే ! అట్టి యర్థ విశేషము వచ్చిన తావున నైన వ్యుత్పత్తిని గాని కవి ప్రయోగమును గాని చూపిన బాగుగా నుండు" నని నేను సూచించినదానికి సమాధానము కాఁబోలు ననుకొన్నాను. భూమికాదులు సమగ్రముగ సమీక్షింపక వ్రాసినది కా దని నారాయణమూర్తిగారికి మనవి చేయుచున్నాను. ఇచట విశేష మున్నది కాన సామాన్య సూత్రము నతిక్రమించుట గుణమే ననుకొన్నాను.

"పరిష్కర్తలు చతుర్వింశతి నిఘంటువులు ముందిడుకొని పరిష్కరించినవారే కాని స్వకపోలకల్పిత మిం దావంతయు లేదు" అని— నారాయణమూర్తిగారు వ్రాసిరి. ఎన్ని నిఘం

టువులను జూడక, వేంకటార్యునివంటి మహా పండితుని నిఘంటువున 60 పదములను జేర్పఁగలరు ? ఆ నిఘంటువు లం దున్న దున్నట్లు, కొన్ని తావులందుఁ జూప మఱచిరని మాత్రము తెలుపుచున్నాను.

"ఆత్మసాత్ అన్వయంపై, ఇదంతాది పదములు వాచస్పత్యాది ప్రాచీన నిఘంటువులలోనివే" అని— నారాయణమూర్తిగారు వ్రాసెరి. ఆ పదములను జేర్పఁదలఁచినపుడు లక్ష్య లక్షణములను దెలిసి పరిపూర్ణముగా నా నిఘంటువుల వర్థము చేసికొని వ్రాయవలసినదని నా సూచన.

"ఆత్మసాత్" అనుపదము నొద్ద —సాతి ప్రత్యయాంతము లగు నిట్టివానికి 'సంపద్యాదియోగ మున్ననే సాధుత్వము కలుగు' నను వాచస్పత్యము మున్నగువానియం దన్నిటను విడువక చెప్పఁబడిన వాక్యము విధిగా నుండవలె నని నేను వ్రాసినదానికి "వాచస్పత్యాదులందుఁ గల దీశబ్ద" మని సమాధానముగా వ్రాసిరి. ఆశబ్ద మెందును లేనిదే పరిష్కర్తలు సృష్టించి రని నేను దలఁపలేదు. కాని అచట నేది ప్రధానమో యది విడువఁబడె నని వ్రాసితిని. సంపద్, కృ, భూ, అస, అనుధాతువుల యోగము నిత్య మని వ్రాయక పోవుట ప్రమాద మను నభిప్రాయముతో "ఆప్టే" వ్రాసినది చూపినితి. ఇఁక వా రనిన వాచస్పత్యాదులలో ఆదియగు వాచస్పత్యమునందు "ఆత్మసాత్ అవ్య కార్త్స్న్యేన ఆత్మనో అధీనో భవతి, సంపద్యతే, తథా భూతే, క్రియ మాణేచ అని చెప్పి అన్యచ సంపద్యాదియోగే ఏవ సాధుత్వం ఆత్మసాద్భూతః ఆత్మసాత్సంపన్నః, ఆత్మసాత్కృతః ఇత్యాది" అని సంపద్, కృభూ, అసధాత్వుప్రయోగమందే సాధుత్వము అని యున్నది. ప్రధాన మగు నీ వాక్యమును జూపకుండుట ప్రమాద మగునో కాదో పరిశీలింతురు గాక.

వాచస్పత్యాదులను దానిలోని ఆదిపదముచే నేయితర నిఘంటువులందేని వ్యవహితముగానో అవ్యవహితముగానో సంపత్ కృభ్వస్తి యోగము నిత్య మని చెప్పఁ బడనిచో, నది శాస్త్రీయము మాత్రము కా దని మనవి.

వాచస్పత్యమున 'ఇదంతా' స్త్రీ ఇదమోభావః, ఇదం శబ్దార్థభావే—అంగుళ్యాదినా దర్శన యోగ్యతాయాం మునిర్దేశ్య మితి శ్రుతిపద వ్యాఖ్యానే "ఇదంతాయా నిర్దేష్టు మశక్యమ్" "భాష్యం" అని కలదు. దాని ననుసరించియే వ్రాసినచో 'ఇదంతా' అనఁగా 'ఇదమర్థే' ఇది అని శబ్దార్థ కల్పతరువున వ్రాయుట ప్రమాద మనుట తప్పా ?" ఇదమో భావః, అనఁగా ఇదమ్ అను శబ్దము యొక్క భావము అని శబ్దపరము. ఇదం శబ్దార్థ భావః అనఁగా ఇదంశబ్ద వాచ్యము లైన వీఁడు, ఈమె, ఇది' అను వాని భావము అని అర్థపరము. ఈ రెం డర్థము లను మాని "ఇదమర్థే, ఇది " వ్రాయుట అసంగతము కాదా ? అప్పుడు తత్ప్రత్యయము స్వార్థమున వచ్చినదా ? అహంతా, మమతా శబ్దములకు అహమ్ (—నేను) మమ (నాయొక్క) యని మాత్రమే అర్థము లగునెడల నిదియును సాధు వగును. 'ఇదంతయా' యను శ్రుతిపద వ్యాఖ్య యందలి పదమునకు 'ఇదిగో' అని హస్త నిర్దేశముతో అను తాత్పర్యార్థ మూహించుటకైన నవకాశమున్నది. కాని ఇదంతా శబ్దము తెలుగర్థము స్ఫురించుటయే కష్టముగా నున్నది. ఇదంతాలో భావార్థమును విడిచివేసి ఇది అని యర్థము వ్రాయుట శాస్త్రీయముకాదు. తెనుఁగున సుభోధముగాఁ జెప్పలేనట్టియు వేంకటార్యుఁడు గ్రహింపనట్టి ఈ పదమును కల్పతరువునఁ జేర్చి వేంకటార్యునిదే యనిపించుట న్యాయము కాదని మనవి. చమర పుచ్ఛః అ. పుం. కోకడము. న. చామరము అని మాత్రము కలదు. కోకడ మన నేమియో యని చూడ—నచట బిళేశయమృగభేదేఅని యొక యర్థమును, చమరీమృగే అని రెండవ యర్థమును గలవు. దాని ననుసరించి పుంలింగ చమరపుచ్ఛ శబ్దమునకు ఈరెం డర్థములును గలవా ? ఉన్నయెడల నిఘంటు నియమానుసారము" ,, ఇట్టి గుర్తు ఉండవలదా? అది నేను వ్రాసితిని.

దానికి— నారాయణమూర్తిగా రోపికతో యోజించి "చమరపుచ్ఛ శబ్దమునకు" చామర మనియు, కోకడ శబ్దమునకు చమరీ మృగ మనియు అర్థ భేద ముండ "చూ" అని యెట్లు వ్రాయ నగును ? కొంచె మోపికతో యోజింపవలసి యున్నది" అని వ్రాసినారు. కొంచె మోపికతో యోజింపవలసి యున్నది నేనా ? నారాయణమూర్తిగారా ? నేను 'కొంచె మేల ? మిక్కిలి యోపికతో యోజించితిని. వారిపుడే వోపికతో నేను వ్రాయునది యోజించుకొనుట మంచిది.

నపుంసక మగు చమరపుచ్ఛ శబ్దమునకు 'చామరము అని అర్థ మున్నట్లును, కోకడ శబ్దమునకు "చమరీ మృగము" అని రెండవ యర్థ మున్నట్లును, నేను జూపియే యున్నాను. అది వారు సరిగా చిత్తగింపక, పై విధమున సందర్భ దూరముగా సమాధానము వ్రాసిరి. పుంలింగమగు "చమరపుచ్ఛ" శబ్దమునకు" బిళేశయ మృగభేదము, చమరీ మృగము" అను రెండర్థములు గల "కోకడము" అని మాత్రమే అర్థమీయఁబడెను. పుంలింగ చమరపుచ్ఛ శబ్దమునకు 'కోకడ' శబ్దమునకుఁ గల రెండర్థములును గలవా ? అ ట్లున్నచో నియమానుసారము " " ఇట్టి గుర్తు లేదేమి ? అని నేను వ్రాసినది సరిగా యోజింపక యేదియో వ్రాసిరి. రెండర్థములు లేక "చమరీ మృగము" అనునొక యర్థమునే

చెప్పఁ దలచినపుడు మొదటి యర్థమగు బిలేశయ మృగభేదము నకు వ్యావర్తకముగా "కోకడము, చమరీ మృగము" అని వ్రాసిన నుచితముగా నుండును.

"పరిష్కర్తలు చతుర్వింశతి నిఘంటువులను ముం దిడుకొని పరిష్కరించినా" రని —నారాయణమూర్తిగారు వ్రాసినారు. ఆ చతుర్వింశతిలోనిదే ఆంధ్ర వాచస్పత్యమును కావచ్చును. అందు "కోకడము. సం వి. అ. పుం. బిలేశయము, తేలుమేసరి" అనియు, బిలేశయ శబ్దము నొద్ద. సం. వి. అ. స్త్రీ. రూ. బిలేశయము, అంకజము, కోకడము, గౌధ, గోధిక, గోలి, నిహాక, నిహాక, పంచనఖి ముసలి (తె) ఉడుము ఉరుము, ఏపరి, తేలుమేసరి —అనియు నున్నది. దీని ననుస రించి "బిలేశయే, ఉడుము, అని కోకడ శబ్దము నొద్దను, చమరపుచ్ఛ శబ్దమునొద్ద కోకడే, ఉడుము, అనియు నిచ్చి యుండిన నావంటి వాని కే సందేహమును కలుగ కుండును. నా సందేహము దీర్ప— నారాయణమూర్తిగారి కిట్టి వృధా యాసమును కలుగక పోవును. అంతియ కావి చమర పుచ్ఛము అనఁగా "కోకడము" లనియు, కోకడము అనఁగా "బిలేశయము" అనియు మాత్రమే అర్థము వ్రాసినచో నావంటి సంశ యాత్ములకు నేమి తెలియును ?

"కొన్ని పదములకు విశేషార్థము అనవసరము అని గ్రంథ విస్తరభియా బుద్ధి పూర్వకముగా వదలివేసినారు." అనియు "గ్రంథము పెద్దది కాకుండుటకును" అనియు— నారాయణమూర్తిగారు ఆయా తావుల నంతకంటె సమా ధానము లేకపోవుటచే వేఱు సందర్భమున సమాధానముగా వ్రాసినారు. "గ్రంథ విస్తరభీ" సార్వత్రికముగాఁ గానరాదు. మచ్చున కొకటి, రెండుః

కంచుకః— సర్ప నిర్మోకే, పాము కూసము— వార వాణే, అంగరేకు అనినచోఁ జాలును. అయినను చట్ట, చొకా, చొక్కా, చొకాయ (యి) చొక్కా, చొకా, చోలా, చొక్కా, అని పర్యాయపదములు వ్రాయుట గ్రంథ విస్తరభియా మానవలె నని గోచరింపలేదు.

కవచః అ. పుం..... తనుత్రాణే, మయి మఱువు, మఱువు, మెయిమఱుగు (పు) మెయి మరువు, మెయి మర్పు,వ్నై మర్పు,వ్నై మఱువు, కమరు, జోడు, దగళా, జీరా, జిరాయి, జిరా, తొడుగు (వు, వు) తొడ్గు, బొందడ (ళ)ము, దుప్ప టము, చిలుకత్తు, బందు, కత్తళము, సమకట్టు, చట్ట, పక్కెర, పేరణి, కవచము, అనియు

సూర్య శబ్దమునొద్ద సుమారు డెబ్బది *పర్యాయ పదము లచ్చ తెలుఁగువి సూర్యః. అ. పు. దివాకరే." అనిఁ బద్ద వెలుఁగుటెకము ప్రొద్దు, పగవాఁడు తెల్పు, పొద్దుల్ఱేడు ముదగాంద్రు పొద్దువాని, ఇనుడు వేయిరి (పాడు), ఎండదొర, వేడి (వెల్గు) వేలుపు, ఏడు గుఱ్ఱ ముల తేరెక్కువాడు, కెంపుల గుంపు ఱేడు, ఒంటి మానికము, పవలాడు, చాయపెనిమిటి (మగడు), పగటి పండె దివ్వె, ఇనుడు (పగటి) గొంగ, చీకటుల గొంగ, వెలుఁ పుం (వెలు) సామి, ఒంట్లెరుమలు (ఱేడు), జాముచివ్వ, జగము కన్నుము, ఒమరంచిడి (నయ్య), తమ్మి చుట్టలికెంత, తమ్మి వాఖ్చుటి మగఁడు, లమ్మి చుట్టము (దొర), తమ్ముల చెలువు, తాపకరుఁడు, గొరగొట్టు దొంగదాడ, మనపటి రూపు మండలము, దాలవెసొల్ ప్రొద్దు, పగ దూపుల వేలుపు, పగటిజోతి, (వేలుపు) పగటింటి దొర, పగలు సేయువాండి, పచ్చగుఱ్ఱముగలాండు, పచ్చవారువపుదొడు, పొంజక్కి సామి, ప్రొద్దు, ప్రొఁజుకుపుల పెద్ద, పొద్దు, మింటి తెరువరి, మినుకుంబరణి (యెక్క), మున్నాని వార్గము, మున్వన్నె కాడు, మున్నేలుపుల యెక్క, వెకున్క పొక్కువాని, మొదలి గాము, ప్రొక్కుఁలాని వంటి, రేచటు, రేవెల్గుజోడు, వినుకెంపు, నిమురతనము, వెన్ను వలకన్ను (చూపు), వెలుఁగు ఱేడు, కాఁక (వేఁడి, వే, సెక) వెలుఁగు, వేయిచేతుల దిట్ట, సరిహానసాదణి, సంయుతుఁడు, కలువలదాయ (నాడు), తొగ పాఁడు, లిగివేలుపుల ఱేంకి, తొవలదాయుడి కాఁడు. వెల తోడు, సూర్యుఁడు.

ఇచ్చటయు "గ్రంథ విస్తరణ కేఁ గారణములఁ లే వను కోవలెనా ? 'సంవర్తి' శబ్దమునకు సవళవ్ం అనియు సంవర్తికా శబ్దమునకు చూ. సంవర్తి యనియు అర్థము వివరయువను జూపుట జిజ్ఞాసువునకు శ్రమకరము గాదా, అనివేసు వ్రాసినదానికిఁ గాఁబోలుసు "అల్పాక్షరముల అర్థము వ్రాసి అధికాక్షరముల యొద్ద ఆ అల్పాక్షరమును చూపి, చూ. అని వ్రాయుట పరిష్కర్తల నియమము, "గ్రంథముఁ పెద్దది కాకుండుటకును, ఆపదము కూడ పర్యాయపదమే యని యెఱుఁగుటకును" లని సమాధానము వ్రాసినారు. పై నిచ్చిన అచ్చిక పర్యాయపద మాలికల వంటి వెన్నియో యుండినను గ్రంథ విస్తరము కాదు కాఁబోలుసు ? ఎక్క డెక్కడనో, ఏదియో యొకటి వ్రాసినఁ జాలదా ? అని అప్పటికి తోఁచినరీతి వెనుక ముందులతో నిమిత్తము లేకుండ వ్రాసివైచుట యన సామాన్యవిషయమా ? పర్యాయ పద ములు గ్రంథము లల్లుకానికొనువారి పొకర్యమునకు వ్రాసిరా రని సమాధానము చెప్పుదురు కాఁబోలుసు ? "గ్రంథ కర్తలు పదములు వెదకి పట్టుకొనుటయందుమ, పట్టు

కావునను విశేషణ విశేష్య భావ సాంకర్యమందునను, అర్థము తెలిసికొన నిలునను పరిభ్రమించుట యుండును గరి క్లేశ కల్పనమును గూర్చియే వ్రాసితిని. కాని యన్యము కా దది— నారాయణమూర్తిగారు గ్రహింపఁజాలక శ్రమపడినారు.

తామ్రశిఖి : తామ్ర. చుడ పదము వేఱే యుండ సమానార్థక పదములతో దీనిని సృష్టించుట నిరుపయోగము అని నేను వ్రాసితిని. భూమికలో.... పుండరీక అక్ష అనఁగా పద్మమువంటి కన్నులు గలవాఁడు అనునర్థమును, "పద్మా కమలాక్ష.... లని యిట్లు పదములను కల్పించుకొనియే శబ్దకల్పద్రుమము, శబ్దచింతామణి, తారానాథ వాచస్పత్యము, పెద్ద నిఘంటువులై పోయినవి అవి పరిష్కర్తలు వ్రాయుటయే హేతు వని వ్రాసితిని.— నారాయణమూర్తి గారు వృథాగా పెరిఁగిపోయిన శబ్దకల్పద్రుమాదులు అనిన వానిలోనిదగు శబ్దార్థచింతామణిలో నున్నదే ఈ తామ్రశిఖి పదము గాని, సృష్టింపఁబడినది కా దని సమాధానము వ్రాసి నారు. 1074 పుటయందుఁ గల దనియు వ్రాసినారు. పదములను కల్పించుకొని వృథాగా పెద్ద దగు చింతామణి వృథాగా వ్రాసిన తామ్రశిఖి పదమునకు ప్రమాణమఁట!

"నిరర్థం : పుం. వ్యర్థే, వ్యర్థము— అర్థరహితే. అర్థము లేనిది. అని కలదు. ఆ పదము విశేష్యమైనటు పుం. అని ఇచ్చుట ప్రమాదము. అని వ్రాసి ఆ ప్రమాద మెట్టిదో తెలుపుటకై ఆ పదము క్రిందనే— స్త్రీ. (అనఁగా నిరస్థ). ఇ. త్రి. దూరీ భూతాస్థితే. అని కలదని చూపి, నిరర్థ పుంలింగ మనుటయు, నిరస్థి. త్రిలింగ మనుటయు పొర పాటు" అని ఏకజాతికములుగా నుండఁదగు "అను నా సూచ నపై— నారాయణమూర్తిగారు ' నిరర్థ, నిరస్థి రెండును విశేషణము లైనపుడు రెండును పొరపా టె ట్లగునో స్వవ చోఘాతము" అని యొక యాక్షేప మొనర్చిరి. రెండును విశేషణములు కావుననే నిరర్థ శబ్దము పుంలింగ మనియు, నిరస్థిశబ్దము త్రిలింగ మనియు వ్రాయుట "స్వవచోవ్యాఘాత" మైన దని వాచ్యముగా వారు వ్రాసినట్లు వ్రాయఁ జాలక సూచించితిని. ఆ విషయము వారి మనసు నకు రాక కొంచెము తీవ్రముగా వ్రాసిరి. నిరర్థ ప్రక్కన త్రి అనుటకు పుం.అని పడినంత మాత్రమున నిఘంటు ప్రామాణ్యము నకు భంగము కలుఁగఁబోదు.' అని— నారాయణమూర్తి గారు గట్టిగా వ్రాసిరి. విశేష్య విశేషణములను దెలుపుట లోని నియమములకు నామచార మున్నట్లు కల్పతరువు భూమికయందుఁ గాని మరియే యితర నిఘంటువులందుఁ గాని చూపి యుండకఁ పోవుటచేత ప్రామాణ్యమునకు భంగ మగునేమో యని యిట్లు వ్రాసితిని. అపాటి భేదమునకు బాధ లే దని పరిష్కర్త లంగీకరించి నారాయణమూర్తిగారు సమ్మతించినచో పర్వము చక్కఁబడినట్లే కదా! మఱియు "పుం. లని పడినంత మాత్రమున" అనుటచే వ్రాఁతలోఁ గాని అచ్చులోఁగాని పడిన పొరపాటై యుండవచ్చును. అట్లు వచ్చుట సర్వసామాన్యము. కాని తప్పొప్పుల పట్టిక యందు జూపఁబడవలసినది. అట్లు చూపబడకుండుటచే వారు వ్రాసినట్లు స్వవచోవ్యాఘాతమే యగుచున్న దని మరల వ్రాయవలసివచ్చినది.

"మాట యిరువదేండ్ల క్రితమే కీర్తికాయుఁడైన వేంకటార్యుని నిఘంటువునందు గాంధి, రాధాకృష్ణ, జవహరు లాలు, అబ్దుల్‌కలామ్ అజదు, ప్రకాశం, పొట్టిశ్రీరాములు, మున్నగు దేశనాయకుల నామములు పంక్తిండు కనఁబడు చుండుట యుచితమా?" అని నేను వ్రాసినదానికి —నారా యణమూర్తిగా రిట్లు సమాధానము వ్రాసిరి.

"గాంధి మున్నగు దేశనాయకుల పదములను పరిష్క ర్తలే స్వయముగఁ జేర్చినట్లు చేసిన మనవి (ని) భూమిక 51వ పుటలో క్షకార విషయము క్రింద రెండవ పేరాలో గమనింపఁదగును".

పరిష్కర్త స్వయముగఁ జేర్చినను జూపిన విరో ధము తొలఁగినదా? వేంకటార్యుని యస్తమయము నాటి కీనాయకులలో నేయొకరైనను పుట్టిరో లేరో! ఇట్టి యకారణ మగు పెరుఁగుదలచే నీనిఘంటువు వేంకటార్యు నిదా! శుద్ధ చైతన్యస్వామిదా? అనిపింపదా? అని మరల నడుగుచున్నాను. భూమికలో పరిష్కర్తలేమి వ్రాసినారు? గాంధి ప్రభృతు లగు దేశనాయకుల నామము లిందుఁ జేర్పఁ బడినవి అని వ్రాసిరి. అవి చూచియే పై విధముగా వ్రాసి తిని —నారాయణమూర్తిగారి యీ సమాధానమే పరిష్కర్తలు స్వయముగాఁ జేర్చిన చేర్పులోని ఔచిత్యము తెలుపుచున్నది. శంకకు సరి యగునది యైనను, కాకున్నను, ఏదియో యొకటి వ్రాసి పారవేసినఁ జాలదా యనుభావమున అన్ని టితోపాటే సమాధానమును వ్రాయఁబడినది. ఇంకను నిట్టివి కొన్ని కలవు. కాని యిప్పటికే వ్యాసము విస్తరించి నది అని విరమించితిని.

—నారాయణమూర్తిగారూ

శ్రీ వేంకటార్యునిపట్ల పరిష్కర్తలకును, మీకును మాత్రమే గౌరవము కలదనియు, మావంటి వారికి లే దనియు మీ రెన్నఁడును దలంపకుఁడు. అంతటి సర్వతో

ముఖమును వైదుష్యముగల వాఁడెవఁడనో, ఎవ్వఁడో కాని పుట్టఁడను నమ్మకము గలవాఁడను. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమున ఆ మహనీయుని "ఆంధ్రదీపిక" వ్రాతప్రతి యుండెడిది. అది చూచి యుప్పొంగెడి వాఁడను. దురదృష్టవశమున ఆ కార్యస్థానమందలి కొన్ని ప్రమాణ గ్రంథములతో పాటు నేఁ డదియు నదృశ్యమై పోయినది. రెం డేండ్ల క్రిందట రాజమహేంద్రమున గౌతమీ విద్యా పీఠమునందు శబ్దార్థ కల్పతరువు వ్రాతప్రతి కనఁబడఁగా నేను పొందిన సంతసమునకు మితి లేదు. వదపడి ముద్రితప్రతి కనఁబడఁగా రెండిటిని బెక్కుతావుల సరిచూచితిని. వేంకటార్యుల గ్రంథ మల్పముగాను పరిష్కర్తలు చేర్చినది యున ల్పముగను ముద్రితమునఁ గన్పట్ట నివ్వెర పడితిని. 18832 పదములు గల వ్రాతప్రతికి 60 వేల పదములను జేర్చి 80 వేల పదములు గలదిగాఁ జేసినపుడు పరిష్కర్త పేరితోఁ గాక వేంకటార్యుని పేరితో ప్రకటించుట సముచిత మనిపింపక పోవుటయు, చేర్చిన పదములందు నేను స్థాలీపులాకముగాఁ జూపినట్టి ప్రమాదములు కనఁబడుటయు హేతువుగా వానిని పరిష్కర్తలు సవరించి సర్వాంగసుందరముగా ప్రకటించుదు రనియే బహిరంగ మొనర్చితిని. నాసూచనలలోని వాస్తవ మును గ్రహించితిరా సంతోషము, కా దని త్రోసివేసితిరా ? అంతకంటెను సంతోషము. మీరు నన్నును, నా వ్రాతలను ఆక్షేపించినను (నిరసించినను) సరియే కాని మీగౌరవమును గాపాడుకోవలె నను పట్టుదలతో వేంకటార్యుని వంటి పండితులకు తరతరములుగా నిల్చిపోవు న్యూనతను మాత్ర మాపాదింపవల దని పరిష్కర్తలను, వారిని సమర్థింపఁ బూనిన మిమ్ములను కోరుచున్నాను.

అభీష్టపదములను వెదకి పట్టుకొనుటలో వ్రాత ప్రతికంటెను ముద్రితప్రతి క్లేశకరముగా నుండుట చేతను, ఒక్క బుద్ధితో నిర్ధరించునపుడు భ్రమ ప్రమాదము లుండుట సహజమను భయముతోను "నేను జూపిన వానిలోను భ్రాంతు లుండవచ్చు"నని వ్రాసినమాట గాన్, అవియే సార్వత్రిక మని నా సమీక్షలో రుజువుచేయ మీర్వడిన శ్రమ (నిలుచుఁగాక, నిలువకపోవుఁ గాక) మెచ్చుకోఁ దగి యున్నది. ఆస్విక్షకి, ఆశ్రయ శబ్దముల వద్ద నేను పొందిన భ్రమ మీరు చెప్పినదాఁక నాకుఁ దొలంగలే దని ముందే వ్రాసితిని. మరల వ్రాయుచున్నాను. సారస్వత విషయమున వర్ణములు గాని ఆశ్రమములుగాని ప్రమాణము కానేరవని మాత్రము మఱువకుఁడు. "వాది దౌర్బల్య ముండినను వాదదౌర్బల్య ముండ"వని యందఱు వచింగినదే. అట్లని వాదప్రతివాదములు సాగించుచు, క్రమముగా వ్యక్తి దూషణమునకు దిగిన వాదములు మన మెన్ని యెఱుంగము ? అంతదాఁక వలదు. అది మన కిరువురకును శ్రేయస్కరము కాదు. కావున పరిష్కర్తలును, మీరును, నేనును గూడ చేతనైన సత్య దృష్టితో వాఙ్మయసేవ చేయుదము. లేదా హృదయములు చల్లపరచుకుని యూర కుందము.

వినుమ "అప్రియస్య చ సత్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః" అనువిషయము మీకును దెలిసియే యుండును.

ఇది యిట్లుండ "పులిమీఁద పుట్ర" యనినట్లు శబ్దార్థకల్పతరువు ముడుంబ తిరువేంకటాచార్య కృతము, కాని మామిడి వేంకటార్యునిది కాదు అని రాజమహేంద్ర వాస్తవ్యులును, తులసీ రామాయణాంధ్రీ కర్తలును, నా కాప్త మిత్రులు నగు శ్రీయుత దినవహి సత్యనారాయణ గారు కొన్ని యుపపత్తులు వ్రాసి, తమయింట నున్నముద్రిత మైన వ్రాతప్రతి నొకదానిని నాకు పంపుచు— "రమారమి సంవత్సరము నాఁడు శబ్దార్థకల్పతరువును గూర్చి మీకును మఱి యొకరును భారతి "పత్రికయందు వాదోపవాదములు జరుపుట చదువఁగానే "కర్తృత్వమును గూర్చి నాకు సందేహము కలిగి, నాయభిప్రాయమును గూడ మీకుఁ దెలిపి, పనిలో పని యదియుఁగూడ నిర్ణయింపఁ గోరుచున్నా"నని వ్రాసిరి.

ఆ గ్రంథమునకు ముఖపత్రము లేదు. ఉపోద్ఘాతము గ్రంథకర్త వ్రాసినదియులేదు. తుదను "సంపూర్ణము" అనిమాత్రము గలదు. గౌతమీ విద్యాపీఠమందలి వ్రాత ప్రతికిని, దానికిని పదముల ఆకారాది క్రమమందుఁ జిన్న భేదము కలదు. కాని అర్థనిరూపణమునను, పదముల సంఖ్య యందును సామ్యము కలదు. (మామిడివారి దానిలో 18832 పదములు, ముడుంబవారి దానిలో 18784 పదములు గలవు.) పిదప కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయమున మిగుల శిథిలమైన ముడుంబవారి అచ్చుప్రతి కనఁబడినది. అందు ముఖపత్ర మున్నది. దానిలో:—

"సంస్కృత శబ్దార్థకల్పతరు వను పదమాలా నిఘంటువు"

"శ్రీ వత్సగోత్రజనుషా శుభవేంకటార్య నామ్నా బుధేన బహుకోశపయోనిధిభ్యః శబ్దార్థకల్పతరు రేష సముద్ధృతో భూ, త్తస్మాల్లభధ్వ మఖిలేష్టపదం బుధేంద్రాః". ఈ శ్లోకమందుఁ గనఁబఱచియున్న సంస్కృత ప్రాకృత వైకృతాది సకలభాషా నిపుణులు, నుభయవేదాంత ప్రవర్తకులు నగు శ్రీమాన్ ముడుంబ తిరువేంకటాచార్యుల వారిచే నీగ్రంథము రచింపఁబడి ముద్రాక్షరాంకితము కాకుండు టంజేసి వారిపౌత్రులు శ్రీమాన్ పార్థసారథి అయ్యంగారి యభీష్టప్రకారము.... శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల శేషాచార్యులు వారిచే తెనుఁగర్థము వ్రాయఁబడి పువ్వాడ వేంకటరావుగారి వర్తమాన తరంగిణీ ముద్రాక్షర శాలయందు ముద్రింపఁబడె. 1872 సం. అక్టోబరు 30" అని కలదు.

రెండవ పత్త్రమున "అంకితము" అను శీర్షికతో: "సంస్కృత శబ్దార్థకల్పతరువను పదమాలా నిఘంటువును ముద్రాక్షరాంకితము చేసిన లోకోపకారముగ నుండు నని మ. రా. శ్రీ. సి. పి. బ్రౌను దొరగా రనేక పర్యాయములు నన్ను ప్రేరేపించినందున వారి యనుమతి ప్రకారము గ్రంథ

మును ముద్రాక్షరాంకితము చేసిన యిక్కాలమున వారి పేరిట నంకిత మొనర్చుటకు వారు విదేశగతులుగ నుండుటచే వారికి ముఖ్యప్రియులును చెన్నపట్టణపు హానరబుల్ గవర్న మెంటు సెక్రటరీగా నైన మ. రా. రా. శ్రీ డి. యఫ్. కార్మైకల్ దొరగారి అనుజ్ఞచే వారిపేర నీగ్రంథ మంకిత మొనర్పఁబడియె. పువ్వాడ వెంకటరావు." అనియు, **This work is with permission respectfully dedicated to, David Fremantle Charmichael Esquire, Secretary to Government by his most obidient humble servent Puvada Venkatarao pantulu, proprietar of the Vartamana tarangini press, Madras"** అనియుఁ గలదు.

పిదప పీఠిక యనుపేర.... "మరియు, అమరము, అమరశేషము, విశ్వము, విశ్వప్రకాశము, శబ్దశబ్దార్థ మంజూష, నానార్థరత్నమాల, పర్యాయ రత్నము, పర్యాయ శబ్ద రత్నము, పర్యాయార్ణవము, శబ్దార్ణవము, వైజయంతి, ఉత్పలమాల, శాశ్వతము, హలాయుధము, హారావళి, ధనంజయము, దశరూపకము, ద్విరూపకోశము. శబ్దార్థచంద్రిక, యాదవము, కేశవము, కాత్యాయన ప్రోక్తమైన వైదిక నిఘంటువు మొదలగు ననేక నిఘంటువులు వేదపురాణముల యందు శబ్దార్థములను తెలిసికొనుటకై పూర్వపండితోత్తములచే రచియింపఁబడినవి. అయిన నకారాది పదమాలా నిఘంటువులు— సంస్కృతేతర భాషలందు నేర్పడి యుండినటుల సంస్కృతమందు లేమింజేసి, యట్టి గ్రంథము సంపాదించి ముద్రాక్షరాంకితము చేసిన లోకులకు మిగుల నుపయోగించు నని తలపోయుచుండుతఱి శ్రీ ఉభయవేదాంత ప్రవర్తకు లగు ముడుంబ తిరువేంకటాచార్యులచే రచియింపఁబడిన 'సంస్కృత శబ్దార్థ కల్పతరు వను పదమాలా నిఘంటువు' తత్పుత్రు లగు పార్థసారథి అయ్యంగారిద్వారా నాకుఁ లభించినందున నద్గ్రంథములోని ప్రతి శబ్దమునకుఁ దెలుఁగర్థమును జేయించి ముద్రాక్షరాంకితము చేయఁబడినది. ఈ గ్రంథములోని పదములును వాని లింగనిర్ణయము, అవ్యయస్వరూపమును అమర కోశాదినిఘంటువులచేఁ గను పఱచి యున్నట్లు గ్రంథకర్తచే నేర్పఱుపఁబడి యున్నవి. ఈ గ్రంథమునందు నకారాదియగు శబ్దము కాంతము మొదలు క్షాంతము వఱకు వర్ణక్రమ ప్రకారము క్షాది క్షాంత పర్యంతము పదము లేర్పడి యున్నవి. కావ్యరచన చేయునట్టి పండితులకు సందిగ్ధపదముల యొక్క యర్థము లను సులభోపాయముగఁ దెలిసికొనుటకును కావ్యాభ్యాసము చేయు విద్యార్థులకుఁ దమ పాఠములోని పదార్థములు, లింగములు, పర్యాయ పదములు, అవ్యయములు, నిఘంటు స్వరూపము మొదలగునవి తెలిసికొనుటకును ఈ గ్రంథము మిగుల నావశ్యకముగ నున్నది. పువ్వాడ వేంకటరావు, అని యున్నది.

ఈ రెండు గ్రంథముల పౌర్వాపర్యమును తెలిసికొందు మనిన గ్రంథకర్త లిరువురును తమ గ్రంథముల దొండొరులను బేర్కొనలేదు. మామిడివారివలె ముడుంబ వారు గ్రంథావతారిక వ్రాయరైరి. మొదటనే అ. అవ్య. అని ప్రారంభము కనఁబడుచున్నది. మామిడివా రట్లుగాక "అహం వైశ్యకులాం భోధిసోమః" ఇత్యాదిగా స్వీయ చరిత్రను రేఖామాత్రము వ్రాత ప్రతిలో సూచించిరి. ముద్రితమున గ్రంథి సుబ్బారాయ కృత "గ్రంథకర్తృ చరిత్రము"న వ్రాతప్రతిలోని యవతారిక యేమియు స్పృశింపని వేంకటార్యుని జీవితచరిత్ర 54 శ్లోకములలో నున్నది.

వ్రాతప్రతియందు వేంకటార్యుని స్వరచనలో తన జననకాలాదికము లేదు. కాని గ్రంథివారి రచనలో క్రీ. శ. 1764 మార్చి 16వ తేదికి సరియైన స్వర్భాను సంవత్సర ఫాల్గుణ కృష్ణ 13 భానువారమున వేంకటార్యుని జన్మమును 1834లో మరణమును దెలుపఁబడినది.

ముడుంబ తిరువేంకటాచార్యుల పౌత్రుఁడు 1872లో నున్నట్లు తెలియుటచే తిరు వేంకటాచార్యులును 1834 ప్రాంతముననో అంతకు ముందో పరమపదించి యుందురని యూహింపవచ్చును. కావున మామిడి, ముడుంబవా రిరువురును ఇంచుమించు సమకాలికు లనవచ్చును.

ఇక మామిత్రులు శ్రీ సత్యనారాయణగారు "ముడుంబ వారే నిఘంటుకర్త" లనుటకుఁ జూపిన యుపపత్తు లేవి యున ?

ముడుంబవారి ముద్రిత ప్రతియు మామిడివారి వ్రాతప్రతియు పదముల వరుసయందు మాత్రము భేదముకలవి కావు, పదముల సంఖ్యయందును, పదపదార్థముల విషయమునను, (ఉచ్చారణమందు) థ, ధల విషయమై "ద్వితీయ మధ్యః చతుర్థమధ్యః"అని తెలుపుటలోను, ప్రమాణముగాఁ జూపఁబడిన 'అమరః, విశ్వః' మున్నగువాని విషయమునను, నొక్కటిగానే కనఁబడును. అర్థముల సంఖ్య యందు రెంటియందును కొంచె మెచ్చుతగ్గులు కలవు. ఒండొరుల గ్రంథములను జూడకుండ నంత గ్రంథము నొక్కరీతిగా నేయొకరును వ్రాయఁగలుగుట యసంభవము. అం దొకటి మాతృక. ఒకటి పుత్రిక కావలెను.

సంస్కృతమున అంత్యాక్షర నియమముతో అమర కోశ నానార్థ వర్గము వంటివి కొన్నియుండ —ఏకాక్షర, ద్వ్యక్షరత్ర్యక్షరాది కాండ విభాగము. నానార్థ రత్నమాల, విశ్వ కోశాదు లధికముగాఁ జేసి నట్లగపడును. అవి యన్నియు బద్యమయములు. పద్య నిఘంటువులలోవలె అంత్యాక్షర నియమమే కాక అంగ్ల నిఘంటు సంప్రదాయమున ఆద్యక్షర నియమము గూడఁ దొలుత ముడుంబవారు స్వీకరింపఁగా, వేంకటార్యుండు ఆద్యంతాక్షర నియమమే కాక ఏకాక్షరాది కాండ విభాగము చేసి, కాండములందు వర్గ విభాగమును గూడఁ జేసెను. ఆ మీఁద శ్రీ శుద్ధ చైతన్యస్వామి మధా

క్షరములను గూడ క్రమముగ నొనర్చి, ఒక్కొక్క పదము నొద్ద సవాలియ శబ్దములను సంగ్రహరూపమున నిచ్చి వ్రాయుట సంస్కరించినారు.

ఇదియు ముదుంబవారు తెలుగర్థములతోను, కాండ విభాగములతోను [illegible] నిఘంటువుని చూచి వ్రాసికొనిరే యున్నచో కాండ [illegible] సంక్షిప్తముగా [illegible] గ్రహించుటయు, తెలుగర్థ ములు లేనిదిగా [illegible] శేషాచార్యులు తెలుగర్థ ములు వ్రాయుటయు నెట్లు పొసగును? తెలుగర్థము లేకుండ వేంకటార్యుని యొక్క ప్రతిని రచించి యున్నయెడల దానికే ప్రత్యంతరము ముదుంబవారు వ్రాసికొని యుండవచ్చును. కాని యిట్టిది యున్నట్లు వ్రాతప్రతి యందుగాని పరిష్కర్తల భూమికయందు గాని నిర్ధారించు నాధా రములు కనబడవు. కాన మూలగ్రంథము ముదుంబవారిది కాని మామిడివారిది కానేరదని వ్రాసినారు.

భూమికయందు పరిష్కర్తలు ముదుంబవారి నిఘంటు వున్నట్లు స్మరింపక పోవుటచేత వారా గ్రంథమును చూడలేదో యేమో యని వారియొక్కయు, మీయొక్కయు దృష్టిలోనికిని దెచ్చుచున్నాను. పరిశిష్ట మిరకోశాది నిఘంటు వుల రచియించిన వేంకటార్యుండితరుల గ్రంథమునకు దన పేర ప్రకటించుకొనునా? "శబ్ద కల్పతరు కర్త మామిడి వేంకయ్య" అని త్రౌను రన నిఘంటువునం జేర్చినెను. వాని ముదుంబవారి దింకొక శబ్ద కల్పతరు వున్నట్లు వ్రాయ లేదు. ఉండేనేని వ్రాయక మానునా? ముదుంబవారు వేంక టార్యుని గ్రంథమున నున్న తెలుగర్థములను విడిచిపెట్టి, సంస్కృతభాగము మాత్రమే లిఖించుకొనవచ్చును గాదా? అట్లయినచో పువ్వాడ వేంకటరావుగారు శేషాచార్యుంచే తెలుగర్థ ముల మరల నేల వ్రాయించెను? లను శంక కలుగవచ్చును. ముద్రి తము కాని వేంకటార్యుని మూలగ్రంథము లభింపక, ముదుంబ వారి ప్రతిలో తెలుగర్థములు లేకపోవుటచే పువ్వాడ వేంకట రావుగారే యాంధ్రులకు సుగమ మగునట్లు ప్రచురింపం దలంచి శ్రీ శేషాచార్యులచే మరలం దెలుగర్థములు వ్రాయింప వచ్చును గాదా? కావున వేంకటార్యునిదే మూల గ్రంథ మనియు, బహుశః ప్రత్యంతరము వ్రాసికొనిన లేఖకమాత్రు డగు తిరువేంకటాచార్యులు తన పేరు గ్రంథాదినో, తుదనో వ్రాసికొని యుండగా — కాలాంతరమున నాయన పౌత్రులును, అచ్చొత్తించిన పువ్వాడ వేంకటరావుగారును, కల్ప తరు నిర్మాత తిరువేంకటాచార్యులే యని తలంపవచ్చును గాదా?

పువ్వాడవారు "అంకితము"అను శీర్షిక క్రింద 1. శబ్దార్థ కల్పతరువును ముద్రింప బ్రౌను దొరగారు తన్ను ప్రేరే పించిరను వాక్యమును, 2. ఏకాక్షరాది కాండములుగా విభా గింపబడియున్న వేంకటార్యుని నిఘంటువు చూచి ప్రత్యంత రము వ్రాసికొనునప్పుడు ముదుంబవా రా విభాగము మాని ఏక, ద్వి, త్రి, చతురక్షర క్రమము పోవునట్లు సంకీర్ణ మొనర్చి వ్రాసికొని రని నూహయును, వేంకటార్యుడే మూల గ్రంథకర్త యను నా యభిప్రాయమునకు బ్రబల [illegible]

1. 'ప్రాచీనాంధ్ర [illegible] [illegible] వేంకటార్యుని [illegible] [illegible] ముదుంబవారి ప్రతి [illegible] [illegible] "ముద్రించుట కావలె" [illegible] [illegible] [illegible] "[illegible]" అని [illegible] [illegible] [illegible] [illegible]

2. కాండములుగా విభక్తమై యున్న వేంక టార్యుని గ్రంథమును అవియుతముగా కలిపివేసియు, ఏకా ద్యంతాక్షర నియమముతో మాత్రమే తిరువేంకటాచార్యులు వ్రాసికొనియుండు ననువిషయము, వేంకటార్య కర్తృత్వవ పక్షం బలికాంశముగానే కన్పట్టుచున్నది. కాని తెలుగర్థములు చేర్చుటయు, కాండ విభాగ మొనర్చుటయు, వేంకటార్యుడు లొలుత నొక ప్రతిని నిర్మించియున్నట్లు నిదర్శనము లభింపుచో ఆ ప్రతికే ప్రత్యంతరము ముదుంబవారు వ్రాసి కొని రనవచ్చును. పిదప వేంకటార్యుడు అక్షరసంఖ్యా నియ మములో తన ప్రతినే సంస్కరించుకొని యుండు నన వచ్చును..

మఱియు వ్రాతప్రతియందు "అహంవైశ్య కులాంభోధి సోమః ..... ఇత్యాదికమే కాక, తుట్టతుదిని లేఖకుండైన (ల)క్ష్మయ్య "ఈ గ్రంథకర్త యైన మామిడి వెంకయ్య .... క్ష్మయ్య వ్రాసెను" అని వ్రాసిన గద్యమునుబట్టి మామిడి వెంకయ్య గ్రంథకర్త యని స్పష్టమగుచున్నది. కాన వెంకయ్య యను వేంకటార్యుడే కల్పతరు స్రష్ట యని నా యూహ యము.

—నారాయణమూర్తిగారూ! ఈవిధమగు తుల్య బల విరోధములుగల వాద ప్రతివాదములు తలయెత్తు కుండునట్లు పరిశీలించి వాస్తవమును ప్రకటించి, వేంకటార్యుని కీర్తిని నిష్కళంక మొనర్చి వాఙ్మయాకాశమున విలువుటకై పరి ష్కర్తలును, మీరును యత్నింపవలెనని నా కోరిక. "నా చేత నైనంతతో నేనును యత్నింతును" అని మనఃపూర్వకము దెలుపుచున్నాను" "సహనావవతు .... మావిద్విషావహై" శాంతి శ్శాంతి శ్శాంతిః.

(ఈ విషయమై ఇక చర్చను పొగించదలచలేదు భా. వ

# క్షేత్రయ్య - క్షేత్రజ్ఞ



శ్రీ నిడుదవోలు వేంకటరావు

ఆకాశవాణి ప్రసారాంశములుగా జరిగిన క్షేత్రయ్య త్రిశత వార్షికోత్సవ సందర్భములో ఆలిండియా రేడియోవారు ప్రకటించిన వివరణ సూచికలో: Tricentenary of Kshetragnya అని ప్రకటించియున్నారు. ఆసూచికలో కార్యక్రమముల యందు 'క్షేత్రజ్ఞ' అనియే అన్నిచోట్ల ముద్రితమై యున్నది. కాని తెలుగులోమాత్ర మిదివఱకు క్షేత్రయ్యనుగూర్చి వ్రాసినవారు గాని, నేడు వ్రాయుచున్నవారు గాని యెవ్వరును 'క్షేత్రజ్ఞ' అని వ్రాయుటలేదు. తెలుగున 'క్షేత్రజ్ఞ' అనే వ్యవహారము లేకపోయినను, అది యేవిధముగా, క్షేత్రయ్యకు పర్యాయపద మైనదో తెలిసికోవడము మనకు ఆవశ్యకము.

ఇంగ్లీషు భాషలో సంగీతమును గూర్చి, పదకర్తలను గూర్చి వ్రాయబడిన గ్రంధములు, వ్యాసములు—వీని యన్నింటిలోను క్షేత్రజ్ఞ 'Kshetragna' అనియే యున్నది. కాని నేడుప్రకటితమైనసూచికలో 'Kshetragnya' అని వర్ణక్రమ మున్నది. ఈ విపర్యాసమునకు కారణమేదో తెలియరాలేదు.

ఇంగ్లీషులో నెట్లుంటేనేమి—తెలుగులో సరిగా నున్నది గదా యని కొంతమంది వాదింపవచ్చును. కాని, ఆ వాద మెంత మాత్రము సరికాదు. నేడు జాతీయముగా కాక అంతర్జాతీయముగా వ్యవహరించుటకు, ఇంగ్లీషు భాష ముఖ్యమైన ఆధారము. 'క్షేత్రయ్య' అనే శుద్ధమైన తెలుగుగా భాసించే పేరు ఇంగ్లీషులో 'క్షేత్రజ్ఞ' అని చెలామణి అయితే, రాష్ట్రేతరులకేమి పాశ్చాత్యుల కేమి యీతడు తెలుగువాడని తెలియుటయెట్లు ? క్షేత్రయ్య తెలుగువాడని యూహయే తట్టదు.

ఇక యెప్పటికైనా త్యాగయ్య కంకితముగా తపాళా బిళ్లలు ముద్రించినట్లుగా, క్షేత్రయ్యకు అట్టి మహాభాగ్యము కల్గినట్లయితే, అప్పు డింగ్లీషులో నున్న వర్ణక్రమాన్నిబట్టి వారు 'క్షేత్రజ్ఞ' అని ముద్రిస్తే—అప్పుడు తెలుగువారేమి చేయవలెనో ? క్షేత్రయ్య పేర తపాళాబిళ్లలు కేంద్ర ప్రభుత్వమువారు ముద్రించి గౌరవించేరని సంతోషించడమా, లేక 'క్షేత్రజ్ఞ 'అని ముద్రిస్తే విచారించడమా ?—వారి కింగ్లీషులో పరిచితమైన పేరును బట్టి గదా వారు వ్యవహరిస్తారు.

ఇక ఇంగ్లీషు భాషలోనికి యీ 'క్షేత్రజ్ఞ' అనే పదము ఏరీతిగా వచ్చినదో పరిశీలించినట్లయితే పై విషయము స్పష్టపడుతుంది.

తంజావూరు, మద్రాసు, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాల్లో ఉన్న క్షేత్రయ్య పదాల వ్రాత ప్రతు లన్నింటిలోను 'క్షేత్రయ్య' అనే ఉన్నది. నేటి ముద్రిత ప్రతులలో, వ్యాసాలలో క్షేత్రయ్య యనియే వాడుక. ఇక క్షేత్రయ్య క్షేత్రజ్ఞగా మారిన రీతి వివరిస్తాను.

ఈ 'క్షేత్రయ్య' పదాన్ని 'క్షేత్రజ్ఞ' అను వ్యవహారములోనికి తిసికొని వచ్చినది సంగీత సంప్రదాయ ప్రదర్శిని[1] గ్రంథకర్తలునూ, సుప్రసిద్ధ వాగ్గేయకారులునూ అయిన సుబ్బరామ దీక్షితులవారని చెప్పవచ్చునేమో ? ఆ గ్రంథములో "వాగ్గేయకారకుల చరిత్రము" శీర్షికలో (8, 9, 10 పుటలు) క్షేత్రయ్యను గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

## క్షేత్రజ్ఞులు

ఇతడు త్రైలింగ్య బ్రాహ్మణుడు. ఇతని యునికి మువ్వపురి. ఆంధ్రభాషలో మిక్కిలి ప్రజ్ఞ గలవాడు. సంగీత సాహిత్య జ్ఞానము గల గొప్ప పండితుడు. ఈతడు బాల్యదశలో నొక మహాయోగి వలన గోపాల మూలమంత్ర ముపదేశింపబడి మువ్వపురిలో నుండు గోపాలాలయములో నుండి బహుకాలము భక్తితో మంత్రావృత్తి జేసుకొనియుండునపుడు శృంగార రసాధి దేవతయైన గోపాలుడు దర్శనమిచ్చి యనుగ్రహించిన తోడనే,

> "శ్రీపతి సుతుబారికి నే నోపలేక నిను వేడితే కోపాల
> మువ్వ గోపాలా."

అని వాగేయ రూపమున పదములు జెప్ప ప్రారంభించెనట, ఇతని పద్యములవలె శృంగారరసము లొలుకునట్లు కైశికీ(వృత్తి)గాను, మృదుపదములు గలదిగాను, నాయికీ నాయక లక్షణములు దప్పకను, అర్థపుష్టితోను, సందర్భ రసములకు దగి

---

1. సంగీత సంప్రదాయ ప్రదర్శిని—సంగీతశాస్త్ర విద్వాంసులకు, విద్యార్థులకు కల్పతరువు వంటిది. నేటి సంగీత శాస్త్ర పరిశోధకుల కందరకు నిదియే మూలాధారము. లోకోత్తరమైన యీ గ్రంథ మిప్పటి కరువదేండ్ల క్రిందటనే ముద్రితమైనది, ఇప్పుడీ ప్రతు లలభ్యములు. మొట్టమొదట వాగ్గేయకారుల చరిత్రమును తెలిపినది సుబ్బరామ దీక్షితులవారే. అందు క్షేత్రయ్య చరిత్రము నామమాత్రముగా, యథాతథముగా నీయకుండుటచేత యిక్కడ దాని నిచ్చుచున్నాను.

నట్లు రాగములతోను, ధాతువులతోను, ఇతనికి ముందు గాని వెనుకగాని పదములు చేసినవా రెవరును లేరని నిశ్చయముగా చెప్పవచ్చును. ఇతని పదములు కర్ణాకర్షణముగ చక్కగా వెలసిన రసానుభవములో వెనుక (పౌకముగా) విశదముగా పాడుచున్నాడో ఆ పదములు దారుచించును. ధాతువులను వ్రాసి చూపితే వచ్చినదే వచ్చినట్లుండును. ఇట్లుండుటయే నవ సాహిత్యముల శయ్య. ధాతువులు వచ్చినది రాకయుండుట కీర్తనముల శయ్య. ఈ క్షేత్రజ్ఞులు మధుర, తంజావూరు, గోలుకొండ యీ సంస్థానాధిపతుల సభలలో యున్నేసి యున్నేసి పదములు చెప్పియున్నా నన్నందుకు దేశియ దేవగాంధారి రాగమున 'వేడుకతో నడచుకొన్న విటరాయుడే' అనునొక పదము చెప్పియున్నారు. ఇదిగాక తంజావూరు విజయ రాఘవ నాయక భూపాలుని ప్రార్థనచే యీ రాజాంకితముగా క్షేత్రయ్య పంచరత్నమని యైదు పదములు చెప్పియున్నారు. ఇతని పదము లనేకములు మువ్వగోపాల ముద్రలతో నుండును. కొన్ని పదములు 'కంచి వరదుడు' 'చెవ్వందిలింగడు' అని యుండినప్పటికి మువ్వగోపాల ముద్ర లేక నుండవు.

రసికాగ్రేసరుడైన విజయరాఘవ భూపాలుడు యితనికి సేయునట్టి బహుమానా ద్యుపచారముల జూచి ప్రబంధ రచనా ధురంధరులైన కవీంద్రులు యీమన మహారాజా! ఆదేమి? ఏరా, రారా పోరా యని చెప్పెడి క్షేత్రయ్యమీద నింత మోహమా? ఇతనికి నింత బహుమానా ద్యుపచార గౌరవమా? అనిన పలుకు లాలకించి క్షేత్రయ్య వచ్చినతోడనే యీ పంగతులు చెప్పెను. క్షేత్రయ్య విని వారు చెప్పినది సరిదా ననెను. పిమ్మట కాంభోజీ రాగమున 'పదరకవే' అను పల్లవి, అనుపల్లవి రెండు చరణములు చెప్పి మూడవ చరణమున ''భామరో శకునము లడిగితి మువ్వ గోపాలుడు వచ్చునని కామించినాథుల కలయు చెలుల జూచి కరగి చింత నొందితి'' ఇంతవఱకు చెప్పి యీ చరణము యొక్క కడపటి ఖండము మాత్రము కవీంద్రులు పూరింపవలెను, అని రాజు వద్ద తెలియజేసి సేతు యాత్ర పోయివచ్చెదనని వెడలెను. కవీంద్రులు సభకు వచ్చినతోడనే ''కడపటి ఖండము మాత్రము పూర్తి సేయుడీ'' అని రాజు చెప్పెను. ఆ కవీంద్రు లందఱును జేరి, క్షేత్రయ్య తిరిగి వచ్చువఱకు యోజించియును, ఆ కడపటి ఖండమునకు దగిన వ్యవహారము దోచక చింతిల్లుచుండిరి. క్షేత్రయ్య వచ్చినతోడనే కవీంద్రు లందఱును క్షేత్రయ్య వద్దకి బోయి ప్రార్థించినారట. క్షేత్రయ్య

''రామరామ యీ మేనితో వాని
మోము జూడవలెనా, మొదటి
పొందే చాలు'' అని పదమును పూర్తిచేసినది

విని కవీంద్రు లందఱును, మీరు సాక్షాద్గోపాలుడవే యని కొనియాడి రాజువద్దకు బోయి యీ సంగతిని తెలియజేసి పొగడిరట.

మావద్దనుండు ప్రాచీన పుస్తకములో పై జెప్పిన పంచ రత్నముల జేర్చి ఏ నూరు పదము లున్నవి. ఇప్పుడు గల అచ్చు పుస్తకములో బహు పదముల శబ్దములు మార్పబడి యున్నవి. ఇదిగాక అర్థముల రస సందర్భములు తెలియక నటీనట గాయకులు రాగములను మార్చియున్నారు. ఇతను పై చెప్పిన విజయభూపాలుని కాలమే.''

క్షేత్రయ్యను గూర్చి సంప్రదాయసిద్ధముగా, ప్రామాణికముగా తెలిపిన మొదటి రచన గావున సంపూర్ణముగ నిచ్చితిని. పై యుదహరించిన భాగమున "క్షేత్రజ్ఞులు" అని శీర్షిక యున్నను, సుబ్బరామ దీక్షితులవారే, 'క్షేత్రయ్య' అని వాడిన పట్టులు గమనింపదగి యున్నవి.

## క్షేత్రజ్ఞపదము - ఆంధ్రకౌముది

సుబ్బరామదీక్షితులవారికి ముందుగనే, క్షేత్రయను 'క్షేత్రజ్ఞ' అని వ్యవహరించినవారు లేకపోలేదు. వారిలో 'ఆంధ్ర కౌముది'[2] అను వ్యాకరణ లక్షణ గ్రంథము రచించిన—మంచ లక్ష్మీనరసింహకవి యొకడు. ఈతడు క్రీ. శ. 1700 ప్రాంతమువాడు. ఈతని ఆంధ్ర కౌముది సంస్కృతభాషలో నున్నది. ఈతడే తొలుత క్షేత్రయ్య కాల నిర్ణయమునకు తోడ్పడిన లాక్షణికుడు. ఆంధ్రకౌముదిలో క్షేత్రయ్య ప్రశంస యిట్లు కలదు.[3]

"మువ్వ గోపాల భక్తేన క్షేత్రజ్ఞ కవినా ఉక్తత్వాచ్చ'

క. తమ దామె వత్తు రర్థులు
క్రమ మెఱిగిన దాత కడకు రమ్మన్నారా
కమలంబు లున్నచోటికి
భ్రమరంబుల నచ్యుతేంద్ర రఘునాథనృపా."

పై యుదాహృతివిబట్టి విజయరాఘవ నాయకుని కాలమునందే కాక యాతని తండ్రి రఘునాథనాయకుని కాలములోనే క్షేత్రయ్య యున్నాడని మనకు తెలియుచున్నది. రఘునాథ నాయకుని రాజ్యకాలము క్రీ. శ. 1600—1631. రఘునాథనాయకుని క్షేత్రయ్యయెపుడు దర్శించెనో మనకు తెలియదు కాని, క్రీ. శ. 1610 ప్రాంతమున తంజావూరు వెడలినచో, అప్పటికి క్షేత్రయ్యకు, కనీస వక్షము 25 లేక ముప్పదేండ్లైన నుండవలెను. అట్లయిన నాతని జననకాలము 1570 ప్రాంత మగును.

కాలనిర్ణయము మాట యటుండనిచ్చి 'క్షేత్రజ్ఞ' పదము మొదట ప్రయుక్తమైన విషయము చూడుడు. ఇచ్చట మువ్వగోపాల భక్తేన' అని యుండుటచే 'క్షేత్రజ్ఞ కవి' క్షేత్రయ్యయే కాని వేఱు కవి కాడు. అయినచో లక్ష్మీ నృసింహకవి—క్షేత్రయ్య అని యేందుకు పేర్కొనలేదని ప్రశ్న కలుగవచ్చును. దాని కొకటే ప్రత్యుత్తరము ఆంధ్ర కౌముది సంస్కృతభాషలో వ్రాయబడినది. కావున 'క్షేత్రయ్య'

2. అముద్రితము—మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్నది.

3. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము, పుట 162. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రకటితము.

అని తెలుసుకొని రెండు ప్రయుక్త మగుటకు వీలులేదు కావున 'క్షేత్రజ్ఞ' అని యీ పేరును సంస్కృతీకరించినాడు. దీని ననుసరించి, ఈ నాటికిని సంగీతలోకమున క్షేత్రజ్ఞ పదమే ప్రచారములోనికి వచ్చినది. సుబ్బరామ దీక్షితులవారు గౌరవార్థము క్షేత్రజ్ఞులని వాడిరి.

ఈ క్షేత్రజ్ఞ పద సృష్టికర్త ఆంధ్ర కౌముదీకారుడు.

'క్షేత్రజ్ఞ' శబ్దము క్షేత్రయ్య పదము యొక్క సంస్కృతీకరణమని మనకు తెలియకపోవుటచేత, సంస్కృత శబ్దము ననుసరించి, ఉత్పత్తులు వెలువడుట ప్రారంభమైనది. క్షేత్రయ్య అసలుపేరు వరదయ్య యనియు నా వెనుక నాతడు క్షేత్రములు సేవించుటచేత, నాతడు క్షేత్రజ్ఞ డయ్యెనని యొక వ్యాఖ్యానము. దీనిని క్షేత్రయ్య గురించి వ్రాసిన యీ తరువాతివా రందఱు గ్రంథస్థము చేసిరి. కాని సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో సుబ్బరామదీక్షితులవారీ విషయమై యేమియు వ్రాయలేదు. దీనికి కారణమేదో తెలియదు.

ఇక క్షేత్రజ్ఞ శబ్ద విచారణ చూడుడు:

## క్షేత్రజ్ఞ శబ్దవిచారణ

సంస్కృతమున క్షేత్రజ్ఞ శబ్ద వివరణ మిట్లున్నది.

1. క్షేత్రజ్ఞః—అ. పు. జీవః.

2. క్షేత్రజ్ఞః—అ. త్రి. ఛేక—2 ప్రవీణః తె. 1. పెంపుడు మృగ పక్షులు. 2. నేర్పరి. (త్రి. అనగా త్రిలింగ ముల వర్తించునది.)

ఈ రెండే గాక,

క్షేత్రియ—అను మఱియొక పదము గలదు.

క్షేత్రియః—అ. పు. పారదారకః. 2. ప్రేష్యః. 3. చికిత్స్యార్హః. 4. అస్యదేహా సాధ్యరోగః. తె. 1. పరస్త్రీరతుఁడు. సర్వసిద్ధ సంజీవిని. పుట. 227.

అమరమున—పుంస్యాత్మని ప్రవీణేచ క్షేత్రజ్ఞో వాచ్యలింగకః. (త్ర. కాం. నానార్థ. 738 పుట.)

క్షేత్రియ—అనగా పారదారికుడు విటుడు. ఈ క్షేత్రయ్యయు 'విటరాయని' గా గోపాలుని సంబోధించి యున్నాడు, అని వేటూరి వారు హించిరి.

క్షేత్రజ్ఞ—అనగా ప్రవీణుడు. పద కవిత్వమునందు ప్రవీణుడు—అని మఱికొందఱు.

ఇవి యన్నియు, మన పాండిత్యమును, నూహలను మాత్రమే ప్రదర్శించును. ఈ క్షేత్రజ్ఞ పదము దక్షిణ దేశమునవే వ్యాప్తమై ఆవెనుక దాక్షిణాత్య సంగీత విద్వాంసుల మూలమున నాంగ్లేయ భాషలోని కెక్కినది.

తెలుగున సర్వే సర్వత్ర వ్యాప్తమైన, త్యాగయ్య, అన్నమయ్య నామములవలె క్షేత్రయ్య నామమును అజరామరమైనది. కాబట్టి తెలుగు-వాడగు క్షేత్రయ్యను 'క్షేత్రజ్ఞ' అను పేరితో నాంగ్లభాషలో వ్యవహారము సాగింపక, 'క్షేత్రయ్య' యని నిసర్గమైన తెలుగుభాషా నామముచేత వ్యవహరింపబడ వలయును.

రేడియోశాఖవారే గాక యితరాంగ్లభాషా రచయితలును నీ విషయమును గుర్తించుట యత్యవసరము. అప్పుడుగాని క్షేత్రయ్య ఆంధ్రత్వము ప్రవ్యక్తము కాదు.

## క్షే త్ర య ప ద ము లు సంస్కృత ముద్రణము

కడచిన భారతిలో 'శ్రీవాత్సవ' గారు వ్రాసినట్లుగా నిపఱకు ముద్రించిన విస్సావారు, వావిళ్లవారు, పిఠాపురము మహారాజావారు, ఏయే వ్రాతప్రతుల, పూర్వ ముద్రణ ప్రతుల నాధారముగా గొని ముద్రించిరో ఆ విషయము విస్మరించిరి. ఇది యెంతయు శోచనీయము.

శ్రీ సుబ్బరామ దీక్షితులుగారే, అరవైయేండ్ల క్రిందటనే, క్షేత్రయ్య పదములలో శబ్దముల మార్పున్నట్లు వ్రాసినారు. క్షేత్రయ్య భాషను శబ్దరత్నాకర కారులు ప్రమాణముగా నంగీకరించిరి, ప్రయోగముల నిచ్చిరి. నేనును, దాని గూర్చి పరిశ్రమచేసి నూతన శబ్దములను పెక్కింటిని సేకరించి ప్రకటించితిని.

క్షేత్రయ్య పదములను, వ్రాతప్రతులతో పరిశీలించి సుపరిష్కృతమైన ప్రతి ప్రకటింపవలసి యున్నది. ఈ పదముల విశిష్టతను తొలుత గుర్తించినది బ్రౌను దొరవారు. వారు సేకరించిన ప్రతుల నుండి, తంజావూరినుండి, ఇతర ప్రాంతముల నుండి పాఠములు సేకరించి, అభినయ వివరణలతో అది ప్రకటితము కావలెను.

కవితా విషయమున చేమకూర వెంకటకవి విజయ విలాసమునకు, క్షేత్రయ్య కవితకు పోలికలు కన్పట్టుచున్నవి, ఇట్టి వానిని మనము పరిశీలింపవలసి యున్నది.

ఉపలబ్ధములైన క్షేత్రయ్య పదములు చాలవఱకు తమ వద్దనున్న ప్రాచీన లిఖితపుస్తకమున నున్నవని సుబ్బరామ దీక్షితులుగారు వ్రాసియున్నారు. ఆ ప్రతి నేడు, ఎట్టియాపుర సంస్థానమునందున్నదేమో పరిశోధన జరుగవలసి యున్నది.

క్షేత్రయ పదముల సంస్కరణకు సాహిత్య విద్వాంసులే కాక, సంగీత విద్వాంసులును తోడ్పడవలయును. ఆ పదములు సర్వాంగసుందరముగ వెలువడినప్పుడే, క్షేత్రయ్యకు సంగీత ప్రపంచమున గల విశిష్టస్థానము వ్యక్తము కాగలదు. ఈ పదములను గూర్చిన సంపూర్ణ విమర్శన వెలువడనేలేదు. అట్టివి జరిగిననాడే యిట్టి త్రిశతాబ్ది వారి కోత్సవములు సార్థకములగును.

---

4. క్షేత్రయ పదాభినయ సంచిక.

# 'లోపడు' సాధువు కాదా?



శ్రీ తుమ్మల సీతారామమూర్తి

నాశ్వరిని 'ఆత్మకథ' ను విమర్శించుచు:

''క. మా పెద్దన కన్నన్న లోపడిరి .....

క. నాపై బఱపిన యానకు లోపడవలె ....

ఇత్యాది స్థలములలో '' 'లోఁబడు' అనుటకు 'లోపడు' ప్రయుక్తమైనది. ఇది ప్రామాదికము.'' అని ఒక పత్రికలో ఒకరు విమర్శించిరి.

మఱియు నా రొకచో ధూర్జటి రచించిన 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము' నందలి లోపడని, లోపడి—అను ప్రయోగము లపరూపము లని మూదలింపఁగా దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు—''ఇవి లోఁబడని, లోఁబడి—అని సవరింపఁబడఁ దగును'' అని 1962 జూలై నెల భారతిలో వ్రాసిరి.

ఇంతేకాక 1962 జూన్ భారతిలో నా రచన 'తెనుఁగు నీతి' ని ధూళిపాళ శ్రీరామమూర్తిగారు సమీక్షించుచు అందలి 'లోపడి' అనునది ''ఏ వ్యాకరణమునకైనను లొంగని ప్రయోగము'' అనిరి.

కాఁగా ధూర్జటియు, నేనును అంగీకరించిన 'లోపడు' అను ధాతురూపము అసాధు వని, దానిని 'లోఁబడు' అని సవరించుట ఆవశ్యకమని పైనచెప్పిన విమర్శకులు, పిచ్చయ్యశాస్త్రిగారు, శ్రీరామమూర్తిగారును నమ్మినట్లు తెలివది. వీరుముప్పురును సామాన్యులు కారు. విశేషించి పిచ్చయ్యశాస్త్రిగారు జగమెఱిగిన సారస్వత విమర్శకులు. అయినను తెలిసిన సత్యమును వెల్లడించుట ధర్మమని యెంచి యీ సందర్భమున నాల్గు ముక్కలు వ్రాయుటకు సాహసించితిని. వాదమును పెంచుట నా కభిమతము కాదు. నా శక్తియు పరిమితమే! కావున సుప్రసిద్ధ లాక్షణికులు, పండితులు ఇప్పట్ల వెలువరించిన యభిప్రాయములు, పాటించిన రూపములు కొన్ని పెద్దల యెదుట నుంతును. చిత్తగింతురుగాక.

1. వావిలికొలను సుబ్బారావుగారు. (సులభ వ్యాకరణము—సంధి, పేరట 121)

'' 'లోపడు'—ఈ శబ్దమును పీతాంబరాచార్యులవారు—డొంకారము పొచ్చు, అడఁగు, మన్తరించు లోనగు శబ్దంబుల కడ లక్ష్యంబులలో 'లోపడు' అని వ్రాసియు వానిని మరల సవరింపకయు శబ్దమును 'లోఁబడు' అనియే వ్రాసిరి. దీనికి గారణము వారు ''తే. గీ. కినిసి పాణి నాళీకంబు సానుపుట యును, నంతలోఁబడ కదియు'' (అంతలోన్+పడక, అంతన్+లోఁబడక అని చేదము; హన. 2 ఆ) అని వ్రాయుటగాఁ దోఁచెడి. రెండర్థములందును 'లోపడు' శబ్దమే యేల గ్రహింపరాదో. లోను+పడు=లోపడు అని యయ్యెను. ఈ 'లోను' ప్రత్యేకమైనది గాదు. ఇది చేర్చుట—విద్వాంసు లగుటయు, ప్రేషణము లిండు వారే వ్రాయుచున్నారు. భారతము—విరాట 1 ఆ 328 ప. ''లోను బెలుచు'' అనియే ముద్రింపబడి యున్నది. పెద్దబాలశిక్ష సరిపడ ప్రకరణము ''లోపడు'' అనియే ప్రయోగించబడి యున్నది. (కొట్టి లోఁబడునట్టు, బుద్ధిమంతుఁడు లోపడును) లోచేయు, లోపాపు, లోకడుపు లోచేసికొను, లోతక్కువ—లోను శబ్దంబులం దనున్న గాన కాదు. పైన్+పడు, చేన్+పడు—పైపడు, చేపడు అని యేక శబ్దములగుచో ద్రుతముంకే లోప మగుచుండ లోను+పడు=లోపడు ఏల కానేరదు. అయ్యతే యగును గాని మఱియొక విధముగాఁ గానేర దని తోఁచెడి. 'వాఁడు నీళ్లలోఁ బడెను'—ఇచ్చట 'లోన్' షష్ఠీ విభక్తి ప్రత్యయము, ద్రుతాంతము—'పడు' ప్రత్యేక క్రియ. 'వాఁడు నాకు లోపడె' ననుచో నట్టి విధములు గానరావు. 'నాపతులగు గంధర్వుల చేపడి'—'ఒరు చేపడ నెన్నఁడును'—ఇత్యాది లెక్కున ప్రయోగములుజూచిన నిట్టి శబ్దంబుల రూప నిష్పత్తియందు సందేహముండదు.''

2. మద్గురువులు దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి లేఖనుండి:

''లోపడు—అన్నదే నాకు సమ్మతమయిన రూపము. లోన్+పడు=లోఁబడు—అనునది అర్థము కుదురుపాటునకు అంతగా అనుకూలించు మార్గము కాదు.

'లోను'—అని ప్రత్యేకముగా విశేష్య రూపము, ఔపవిభక్తికము సుప్రసిద్ధముకదా! లోనన్, లోనికిన్—ఇత్యాదులు ప్రచురములు కదా!

ఇంద్రుఁడు లోనగు దేవతలు, ఇంద్రుఁడు లోనుగాఁగల దేవతలు, కన్నెగిచి లోని చూపున—ఇత్యాదులందు 'లోను' ప్రసిద్ధము. లోనిచూపు=లోచూపు. ఇట్టివే లోచేయు, లోతక్కువ—ఇత్యాదులు.''

3. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు.

''సంస్కృతభాష నాయాయి దేశపు జనులు .... వారి లక్షణంబులకు లోపడని లౌకిక ప్రయోగములు మృగ్యము లుగా నుండును.''

(శబ్దరత్నాకరము మొదట ''భాషాప్రశంస'' అను తలబంతి క్రింద.)

4. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

''నాఁటి రోజులలోఁ ప్రధానులు వీరు. మఱికొందఱు చిటితదొరతనము నెఱిపువారు నున్నారు. కాని వారు వంయ వారికి లోపడినవారే! (శృం. శ్రీ. పీఠిక 4)

"భీమఖండ రచనా కాలము క్రీ. 1428 కిం బైవ డియు, 1435 వఱకు లోపడియు నుండును." (శృం, శ్రీ పీఠిక 12)"

5. తిక్కనగారు.

"అపరిన దానవుండు గరుడాకృతిఁ గైకొని మాయతోడ, లోపడభుజంగంబులన్ బొదివివట్టె...." (భీష్మ. 3–105వాక్య)

6. ఆంధ్రప్రదేశ సాహిత్య—అకాడమీవారు. వీరు ప్రచురించిన "పదబంధ పారిజాతము" నందును 'లోపడు' రూప మున్నది. ఉదాహృతికి తిక్కనగారి పై ప్రయోగమే చూపఁబడినది.

జిజ్ఞాసువు లీ సందర్భమున లోచిక్కు, లోచెడు—మున్నగు శబ్ద పల్లవములను, లోతట్టు, లోపిటికి—మున్నగు సమాసములను పరిశీలింతురుగాక!

శబ్దపల్లవములకు సమాన ధర్మము కొంత (వర్ణలోపము, ద్రుతలోపము) కలదని గుర్తింతురుగాక!

శబ్దపల్లవముల మొదట ధాతువు—లేక—నామ వాచకము మాత్రమే విల్చునని (చూ. దూసివారి బా. వ్యా. వ్యాఖ్య. క్రియ 108) గ్రహింతురుగాక.

తోఁబాటు, లోఁబడు—ఒక జాతిలోనివని యెఱుంగుదురు గాక!

# కానాల నరసింహకవి

## శ్రీ వి. ఎ. కె. రంగారావు

భారతి జూలై సంచికలో శ్రీ టి. మోహనరావుగారు కానాల నరసింహకవి గురించి కలగూరగంపలో వ్రాసినారు. వారు తలపెట్టని కవికాల నిర్ణయం చేయ ప్రయత్నించారు ఒక పరిశోధకులు ఆగస్టు భారతిలో. అచటనే శ్రీ వీరేశలింగం పంతులుగారి అభిప్రాయము ప్రకారము కానాల కవి కాలము క్రీస్తుశకం పదిహేడు వందల యాభైగా తెల్పినారు.

పై ఇరువురి దృష్టిలో ఈ క్రింది వస్తువు పడ లేదని వూహించుటకు సాహసించుచున్నాను. జూలై భారతిలోనే శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు "మొల్ల కవయిత్రి కాల" మనే వ్యాసములో ఒక పద్యమును ఉదహరించినారు:

"సురసన్నుత జ్ఞాను సువివేకి వాల్మీకి
 సకల వేదాగమాభ్యాసు వ్యాసు,
ఘోరాంధకార ప్రభారవి భారవి,
 సత్కాంతి హిమకర శ్లాఘు మాఘు,
వివిధ కళాన్విత విఖ్యాతి భవభూతి,
 ప్రకట కార్య ధురీణు భట్టబాణు,
మానినీలోక సమ్మదముద్రు శివభద్రు,
 గవితా రసోల్లాసుఁ గాళిదాసు,
స్తుత గుణోద్దాము నాచన సోము భీము,
 నవ్య మంజుల వాగ్ధుర్యు నన్నపార్యు,
రసికుఁడై నట్టి శ్రీనాథ రంగనాథుఁ,
 దిక్క కవిరాజును మతించి ధీనిమించి."

మోహనరావుగారి క్రింది పద్యము కానాల కవిదిగ నుడివినారు.

"లలిత చిత్రకౌశల విచారు మయూరు తాకిన్
 ఓదు మహోద్దండ దండి
పటుతర కావ్య సంభవ భూతి భవభూతి,
 కలిత రసోల్లాసు కాళిదాసు,
విద్య జనాచార్యు నన్నపార్యు
 సుజన గణమాని సోత్వల సోముసోము
సురుచిరాలంకృత భాజి సోమయాజి
 కవిసనాథు శ్రీనాథు."

పరిశీలించిన ఈ రెండు పద్యములలో పలుకు భావ, శబ్దములలో పోలికలు కొన్ని ప్రస్ఫుటము గాకపోవు. ప్రత్యేకించి "కవితా రసోల్లాసు గాళిదాసు", "కలిత రసోల్లాసు కాళిదాసు", "నవ్య మంజుల వాగ్ధుర్యు నన్నపార్యు", "విద్య జనాచార్యు నన్నపార్యు", "స్తుత గుణోద్దాము నాచన సోము భీము", "సుజన గణమాని సోత్వల సోముసోము అను పాదములలో.

భావ, శబ్ద సాన్నిహిత్యము మొల్ల కవయిత్రికి, కానాల నరసింహకవికి మరొకవిధమైన సాన్నిహిత్య ముండెడిదని సూచించుచున్నది. ఇది ఎటువంటి సామీప్యమో, కేవలము కాల సామీప్యమో, లేక మరొక విధాన మైనదో పెద్దలు పండితులు తెల్పవలసిన విషయము. పై రెండు పద్యములలో పోలికలు యెత్తి చూపుటకు కారణము పరస్పర కాల నిర్ణయము సేయుట కది తోడ్పడవచ్చుననియే.

మరొకమాట. ఒక పద్యములో ఒకరి పేరు చెప్పినంత, కవి వారి తరువాతి వాడని గ్రహించవచ్చును. ఎన్ని ఏండ్ల తరువాత అనునది తరువాతి ప్రశ్న. కాని ఒకరి గూర్చి వ్రాయనంతమాత్రమున వారికి పూర్వుడని నిర్ధారణ సేయుట సబబెంత? ఆ పద్యములో పెద్దన ప్రసక్తి లేకపోవుటకు కారణము పాదములు లేకపోవుటయే కావచ్చును. ఇంతకు అది సీసమాల కాదు. పైగా పెద్దన యెడల ఈనాటి మనకున్న భక్తి ప్రపత్తులు ఆనాటి నరసింహకవికి లేకపోవచ్చును. శ్రీ శాస్త్రిగారి కాలనిర్ణయము కూడను కొంత ఈ పద్ధతిలోనే జరిగినది.

ఈ పద్ధతి ఎంతవరకు సమంజసమో విపులీకరించుమని వీ రిరువురనూ సవినయముగా ప్రార్థించుచున్నాడను.

# ఉదంకోపాఖ్యానము

## శ్రీ వై. సీతారామశర్మ

శ్రీమదాంధ్ర మహాభారతమునం దాదిపర్వమున నుదంకోపాఖ్యానము చెప్పబడినది. ఆ కథను ప్రవేశపెట్టుటలో ముఖ్యోద్దేశము జనమేజయునకు సర్పయాగము—నందాసక్తిఁ గలిగించుట. అతనికా యుద్దేశమును గలిగించుటలో వీ క్రింది హేతువులు మనకుఁ గనఁబడును.

(1) "పరీక్షితున్ భుజంగదాల్మిఁ జనష్ట్వపిష్టాగ్ర ధూమకేతనహతిఁజేసి కృతాంతనికేతనాతిథిన్ జేయుట, యందుచే తక్షకునిపై జనమేజయునకు ప్రతీకారా కాంక్షాపూరిత నిర్భర క్రోధము జనించిన దనుట. (2) ఉదంకునకుఁ దక్షకుడు చేకూర్చిన కష్టపాటు. అందుచే నతఁడు "తక్షకుఁ డొనర్చిన యపకారంబునకుఁ బ్రతీకారంబు సేయుఁ" డని పెట్టుట. తత్కార్యాప్తికై నతఁడు జనమేజయు సర్పించి పురిగొల్పుట; ఏ తద్ద్వయమే జనమేజయు సర్పేష్టికి ప్రధాన హేతు భరితమని తెలియనగును.

కథాంశము లిట్లుండఁ గథలోఁ బ్రతిపాదితాంశములు కొన్ని యర్థము గాకుండ నున్నవి.

(1) ఉదకుండు గుర్వర్థ మర్థియై పౌష్యుని పాలికేగి తద్ధర్మపత్ని కుండలములఁ దెచ్చెను. వాని యవసరము "గురుపత్ని (ఉపాధ్యాయుని) చేయు 'పుణ్యకవ్రతమునకై'" యని మూలము. ఆంధ్రీకృతిలో "నిజసంకల్పిత మహోత్సవ మని" కలదు. ఈ వ్రతమునకో లేక మహోత్సవమునకో కుండలము లవసరమా? అందును పౌష్యమహాదేవి కుండలములే అవసరమా? చేసినవా రందరును (సాత్రాజితి ప్రముఖ కాంతలు) పౌష్యమహాదేవి కుండలములతోనే జేసిరా? అవి వారి కెట్లు లభ్యంబులయ్యె? (2) తక్షకుడు పౌష్యదేవి కుండలము లపేక్షించుచుండునని యభివర్ణితము. అందులకు కారణము చెప్పఁబడి యుండలేదు. అతనిని కూడ నింట నెవ్వరో పుణ్యకవ్రత మనుష్ఠించు తలంపున వేడియుండిరేమో? తక్షకుఁడా కుండలము లపహరించుటలో పై యుద్దేశమే గమ్యమానమా? హేత్వంతర మున్నదా?

ఆంధ్రమహాభారతమున తక్షకస్తవమున నుదంకుఁడు కోర్కెల నెరవేర్చుకొనుటకు సంబంధమును గల్పించి నుతించుట చక్కఁగాఁ గానఁబడదు. మూలమున తక్షకుఁ డిరావత జ్యేష్ఠ భ్రాత యనియు, ఇక్షుమతీ తీరమునఁ గురుక్షేత్ర మందశ్వసేనునితోఁ గలసి కొంతకాల ముండియుండె ననియు, నందుచే దవ్వక నార్యావర్తవాసియగు బ్రాహ్మణునితోఁ గొంత నివాసావాప్త పరిచయ ముండకపోదనియు తదభిమానమును బురస్కరించుకొని కుండలము లిమ్మనియుఁ గోరుట ధ్వనితము.

ఉదంకునకుఁ దక్షకాపహృతమైన పౌష్యదేవి కుండలములు తిరిగి తెచ్చుకొనుటకు తోడ్పడినవాఁ డొక దివ్యపురుషుఁడు. వాడే ఇంద్రుఁడు. అతఁ డట్లుదంకునకుఁ దోడ్పడుటకుఁ దగిన హేతువులు మూలమందును మృగ్యములు.

(1) ఇంద్రుఁ డవ్యాజముగా నుదంకునకుఁ దోడ్పడెనా? అట్లు తోడ్పడుటలో నాశించిన పరమార్థ మేమో? తక్షకునిపైఁ బగయా? లేక బ్రాహ్మణభక్తియా? ఇందును దైవకార్యమో, దేవరహస్యమో కలదా?—ఇవి తెలియరాకున్నవి.

కాగా, నొక చిన్న కథలో నిన్ని చిన్ని సందియములు పొడముచున్నవి. వీనినిఁ దెలిసిన పెద్దలు జిజ్ఞాసువుల చిత్తములను హత్తుకొనుటకు చక్కఁగా ప్రతి పత్రికా ముఖమునఁ దెల్పఁగలరని యాశించుచున్నాము.

# మన రచనలపై ప్రధాని అభిప్రాయం

మన దేశం ఒక మహా పోరాటం సాగించి, విజయం సంపాదించింది. మెరికల్లాంటి వ్యక్తుల్ని కొందరిని తయారు చేసింది. అయినప్పటికి మొత్తంమీద చూస్తే దేశంలో ఆలోచనాశక్తి ప్రమాణం చాలా తక్కువ స్థాయిలో ఉంటున్నది. మనలో చాలామంది పాత నినాదాలను, పాత భావాలను వాటి అర్థం కూడా గ్రహించకుండా ఊరికే వల్లిస్తూ ఉంటారు. ప్రజలలో ఆలోచనాస్థాయి పెరగకపోతే ప్రజాస్వామ్య సాంఘిక వ్యవస్థ చక్కగా ప్రవర్ధమానం కావడం సాధ్యపడదు.

మన దేశంలో పుస్తకాల ప్రచురణ చాలా వెనుకబడి ఉంది. ఒకటవరకం పుస్తకాలు రావడమే లేదు. ఏ ఒక్క వారంలో నైనా, ఏ ఇతర దేశంలోనైనా ప్రచురణ అయిన వాటిని పోల్చి చూస్తే, తేడా ఎంతగా ఉందో తెలుస్తుంది.

మన దేశంలో ప్రచార ప్రకటనల స్థాయి కూడా చాలా తక్కువ స్థితిలో ఉంది. ప్రజలలో ఆలోచనలు పురికొల్పే ప్రయత్నం ఏదీ వాటిలో కనిపించదు. దర్పం మాత్రమే కనవడుతుంది.

జీవిత చరిత్రల విషయంలో కూడా మనం ఎంతో వెనుకబడి ఉన్నాము. మనం ప్రచురించే జీవిత చరిత్రలు వాస్తవికాలుగా ఉండవు. చదవాలనే కుతూహలాన్ని పుట్టించవు. ఒక్కొక్కరిని గురించి వ్రాసిన చరిత్ర చూస్తే ఆ వ్యక్తిలో మానత్వమే లేదా అని అనిపించేటంత ఘోరంగా ఉన్న సందర్భాలు కూడా ఉన్నవి.

పెద్దల శిలావిగ్రహాలు నెలకొల్పడ మనేది కూడా ఈ ధోరణిలోనే ఉంది. ఈ విగ్రహాలను చూస్తూవుంటే ఒక్కొక్కప్పుడు చాలా అసహ్యం వేస్తుంది. అందులో అసలు మనిషి పోలిక ఉండదు. వీనిని చూచినప్పుడు అసలు విగ్రహాలు నెలకొల్పే ఉద్దేశ్యాన్ని ప్రోత్సహించరా దనిపిస్తుంది. ఒక విగ్రహాన్ని నెలకొల్ప దలచినప్పుడు అందుకు మంచి ఛాయాచిత్రం సంపాదించి, చక్కని విగ్రహం చేయించాలి. అంతేకాని, బజారులో ఏ అర్ధరూపాయికో ఒక ఫోటో కొని స్మృతి మందిరాలలో పెట్టకూడదు. విగ్రహాన్ని ప్రతిష్ఠించేముందు యోగ్యులైనవారి ఆమోదాన్ని కూడా పొందడం అవసరం.

(ఢిల్లీలో లాలా లజపతిరాయ్ శతాబ్ది ఉత్సవ నిర్వాహక సంఘ సమావేశానికి ఆగస్టు 18 న అధ్యక్షత వహిస్తూ ప్రధాని నెహ్రూ పైవిధంగా అన్నారు. వా రన్నది రచయితలను, పత్రికలను కవ్వించి, కదలించితీరాలి. వారి, వారి అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాము. భా. సం.)

# స్వర్ణనియంత్రణ విధానములు



## శ్రీ ఆర్. బి. షినాయ్

భారతదేశం స్వర్ణసమస్యలను నాలుగు ప్రధాన శీర్షికల క్రింద పరిశీలించవలసి ఉంటుంది. (1) స్వర్ణ సమస్య అంటే ఏమిటి ? (2) అది ఎప్పుడు తల ఎత్తింది? (3) దానిని పరిష్కరించడానికి మనం తీసుకున్న చర్యలు ఏమిటి? అవి ఎలాంటి ఫలితాన్ని ఇచ్చాయి? (4) ఈ చర్యలు జయప్రదం కానప్పుడు, ప్రత్యామ్నాయంగా తీసుకొనవలసిన చర్యలు ఏమిటి ? అనేవే ఆ నాలుగు శీర్షికలు.

### 1. స్వర్ణ సమస్య

ఇదొక సమస్యగా ఉందని ఆర్థికమంత్రి ఆమధ్యను పదే పదే చెబుతూ వచ్చారు. 1963 జనవరి 9 వ తేదీ రాత్రి రేడియోలో ప్రసంగిస్తూ, స్వర్ణ నియంత్రణ విధానాన్ని వివరించారు. 1963 జనవరి 10 వ తేదీన అందుకు సంబంధించిన నిబంధనలను ప్రచురించారు. సూక్ష్మంగా ఇది ద్విముఖ సమస్య. ఒకటి: స్వర్ణం దొంగ రవాణా. రెండు: స్వర్ణంపట్ల భారత ప్రజల మక్కువ. స్వర్ణం దొంగరవాణా వల్లను, స్వర్ణంపట్ల భారత ప్రజల మక్కువవల్లను ఆర్థిక మంత్రికి రెండు విధాల చిక్కులు వచ్చాయి. ఒకటి: స్వర్ణం దొంగరవాణావల్ల విదేశ ద్రవ్యం హెచ్చుగా వృధా కావడం, అయితే దేశంలోకి దొంగతనంగా ఎంత స్వర్ణం రవాణా అవుతుందనేది కేవలం ఊహించవలసిందే కాని ఖచ్చితంగా అంచనా కట్టడానికి వీలుపడదు. దొంగరవాణాదార్లు కస్టమ్సు రసీదులు దాఖలు చేయరు. దిగుమతి సుంకం కూడా చెల్లించరు. చివరకు ఈ దొంగరవాణా వ్యాపారంవల్ల తమకు వచ్చే ఆదాయం వివరాలు ఆదాయంపన్ను అధికారులకు కూడా అందజేయరు.

దొంగరవాణాచేసిన స్వర్ణాన్ని, అది తీసుకొని వచ్చిన రూపంలో బహిరంగంగా విక్రయించడానికి వీలుపడదు. దానికి మామూలు ప్రతి 1000 కి 999 వన్నె ఉంటుంది. భారత స్వర్ణశుద్ధి కర్మాగారాలలో లభించేదానికి 995 లేదా అంతకు తక్కువ వన్నె ఉంటుంది. దక్షిణాదిని ఉపయోగించేది సావరిన్ స్వర్ణం. దానికి 917 వన్నె ఉంటుంది. అందువల్ల దొంగ రవాణాదారులు తాము తెచ్చే స్వర్ణంలో కొత్త వచ్చినట్టు కనిపించే నిగనిగను భారతదేశంలో లభ్యమగు దానికి అనువుగా తగ్గించడానికి ఆదుర్దా పడతారు. అందువల్ల కరిగించడం, మూసపోయడం అనేది, విదేశాలనుంచి ఎంత స్వర్ణం వస్తున్నదని అంచనా వేయడానికి పరోక్ష సాక్ష్యంగా ఉంటున్నది. నా ఊహ ఏమంటే, సాలుకు 12 లక్షల 30 వేల ఔన్సుల స్వర్ణం వస్తున్నదని. దీని కిమ్మతు 36 కోట్ల రూపాయలు ఉంటుంది. చట్టా వ్యాపారాల కమిషన్‌వారి నివేదికలో కూడా సాలుకు 30—40 కోట్ల రూపాయల కిమ్మతుచేసే స్వర్ణం దొంగరవాణా అవుతూ ఉండవచ్చునని ఉదాహరించారు. ఈ అంకెనే ఆర్థికమంత్రి కూడా పేర్కొంటూ ఉంటారు. కాని, కొంతమంది ఈ అంకెను 50 కోట్ల రూపాయలుగా ఉదాహరిస్తారు. ఈనాడు ఈ అంకె తరుచుగా వినబడుతూ ఉంది.

అసలు సంగతి ఏమంటే తగినంత స్వర్ణం సాలీనా దేశంలోకి దొంగ రవాణా అవుతూ ఉంది. అది సాలుకు 50 కోట్ల రూపాయలదిగా ఉండవచ్చునని ఊహ. ఇది ఇంతకు సమానమైన విదేశ ద్రవ్యాన్ని స్వాహా చేస్తున్నది. ఇది మనం భరించలేని మొత్తం. స్వర్ణం దిగుమతిని నిషేధించారు. స్వర్ణం దిగుమతికి అవసరమైన విదేశ ద్రవ్యాన్ని రిజర్వు బ్యాంకి నుంచి గాని లేదా విదేశ ద్రవ్య వ్యాపారంచేసే కమ్మర్షియల్ బ్యాంకుల నుంచి గాని, అధికారం పొందిన డీలర్ల నుంచి గాని పొందడానికి వీలుపడదు. అయినప్పటికీ, దేశానికి వచ్చే ప్రతి తులం స్వర్ణం బహుమతిగా వచ్చేది కాదు. ప్రతి తులానికి సొమ్ము, అందులోను విదేశ ద్రవ్యంలోను చెల్లిస్తారు. ఇలా చెల్లించే విదేశ ద్రవ్యాన్ని, సాలీనా దేశానికి నిల్వవడే విదేశ ద్రవ్యనిధి నుంచి చెల్లిస్తారు. ఇందులో దొంగ రవాణాదారులు ఎలా విదేశ ద్రవ్యాన్ని సంపాదించగలరనేది వివరంగా దర్యాప్తు జరగవలసిన వ్యవహారంగా ఉంది. అందువల్లనే స్వర్ణం ఎంత మొత్తం దొంగ రవాణా అవుతున్నదో ఊహించిన విధంగానే, దీనికి విదేశ ద్రవ్యం లభించడాన్ని గురించి కూడా ఊహించుకోవలసిందే. దీనిని గురించిన స్థూలస్వరూపం మనకు తెలిసిందిది. మిగిలినదంతా ఖాళీగా ఉన్న గళ్ళు నింపే పని. ఇందుకు సంబంధించిన వివరాల సంగతి ఎలా ఉన్నా, ఈ అంచనా కూడా ఉజ్జాయింపుగా వాస్తవానికి దగ్గరగా మనం కట్టవచ్చు. ఆర్థికమంత్రికి సంబంధించినంతవరకు దొంగ రవాణా జరిగే స్వర్ణంవల్ల వచ్చే నష్టాన్ని అరికట్టడమనేది ప్రధాన సమస్య. ''ఏమైనా సరే'' దానిని అరికట్టాలనే నిశ్చయానికి ఆయన వచ్చారు.

ఆర్థికమంత్రిని ఎదుర్కొన్న రెండవ సమస్య: భారత ప్రజలకు సాంప్రదాయసిద్ధంగా స్వర్ణంపట్ల మక్కువ ఉండడం. మనది పేద దేశం—బహుశా ప్రపంచం మొత్తం మీద పేద దేశాలలో పేద దేశం— అయినప్పటికీ, మనది

# స్వర్ణ నియంత్రణ విధానము

స్వర్ణ ప్రీతికి కారణం. దక్షిణ ఆఫ్రికాలో బంగారు గనుల పరిశ్రమకు సంతోషం కలిగించే విధంగా సాటిగా వారి స్వర్ణంలో చాలా భాగం మనం తీసుకుంటూ ఉంటాము. రైతులకు మంచి పంటలు పండినప్పుడు, వారి చేతుల్లో కొంత సొమ్ము మిగులుతుంది. దానిని వారు స్వర్ణ రూపంలో నిల్వ చేసుకుంటారు. అంతర్జాతీయ వాణిజ్యంలో మిగులు కానవచ్చిన కొలది, మన కుటుంబాల బడ్జెట్లలో కూడ వచ్చే మిగులు పెరుగుతూ ఉంటుంది. పంటలు బాగా పండితే, ఎగుమతులూ బాగా ఉంటాయి. వ్యాపారంలో వచ్చే మిగులుకు స్వర్ణరూప మివ్వడం అలవాటు. అందుకు బొంబాయి లోని వెండి—బంగారం మార్కెట్, దేశం నలుమూలల ఉన్న అనుబంధశాఖలు ఇందుకు అందుబాటులో ఉన్నాయి. దిగుమతి చేసుకున్న స్వర్ణాన్ని వివిధ కుటుంబాలకు, వారి పంటలలో ఉండే మిగులును బట్టి అందుబాటు చేస్తాయి.

ఇలా మనం స్వర్ణాన్ని నిల్వ చేసుకుంటూ వస్తున్నాము. ఎంతకాలంగా ఇది జరుగుతున్నదో ఎవ్వరికీ తెలియదు. గత శతాబ్దం మధ్యలో అంకెల సేకరణ ఆరంభమైన నాటినుంచి, మనకు స్వర్ణం దిగుమతుల వివరాలు తెలుసు. అయితే 1931 నుంచి పది సంవత్సరాలు ఈ స్థితిలో మార్పు వచ్చింది. ఆ పదేళ్లలోను (1931—41) మనం స్వర్ణాన్ని ఎగుమతిచేస్తూ వచ్చాము. దక్షిణ ఆఫ్రికా గనులలో ఉత్పత్తి అయినదాని కంటె వేగంగా ఎగుమతి చేశాము. అవి ఆర్థిక మాంద్యం ఏర్పడిన సంవత్సరాలు. అప్పుడు జరిగిన యీ పనికీ భారత రైతుల కుటుంబ బడ్జెటుల స్థితికి సంబంధం ఉంది. అప్పుడు పంటల ధరలు పడిపోయాయి. పారిశ్రామిక వస్తువుల ధరల కంటె తగ్గాయి. తత్ఫలితంగా రైతు కుటుంబాల ఆదాయం తగ్గింది. తగ్గిన ఆదాయాన్ని భర్తీ చేయడానికి రైతు కుటుంబాల వద్ద స్వల్పంగా నగల రూపంలో ఉన్న స్వర్ణాన్ని కరిగించివేశారు. ఈవిధంగా ఆకలితో ఉన్న కుటుంబాలు, తమ కుటుంబ పోషణకు లేదా అప్పులు తీర్చడానికి మక్కువపడి కొనుక్కున్న స్వర్ణాన్ని ఇచ్చివేయడమనే దృశ్యం విషాదకరమైనట్టిది. ఇలా వీరినుండి స్వల్ప మొత్తాలలో స్వర్ణప్రవాహం బొంబాయి నగరానికి ఆ పదేళ్లు చేరింది. ఇలా ఎగుమతిచేసిన స్వర్ణంవల్ల వచ్చిన లాభాలలోనే బొంబాయిలోని మెరీన్ డ్రయివ్ (సముద్రపు ఒడ్డు) మొదటి శ్రేణి భవనాల నిర్మాణం జరిగిందని ప్రతీతి.

ఇది రైతు కుటుంబాలకు కష్టకాలమే కావచ్చు. అయినా ఢిల్లీలో ఉన్న పాలకులకు ఇది ఎంతో కొంత సంతోషాన్ని కలిగించింది. పంటలు ధరలు తగ్గినందున రైతు కుటుంబాల ఆదాయం పడిపోయిన ప్రతిఫలం వర్తక వాణిజ్యాలలో కూడా కానవచ్చింది. విదేశ చెల్లింపుల ఖాతాలో లోటు వచ్చింది. దానిని భర్తీ చేయడమనేది ఆర్థికమంత్రికి తలనొప్పి తెచ్చింది. స్వర్ణం ఎగుమతి అనేది దివ్య ఔషధంగా వినియోగపడింది.

1940—41 లో మొదలుకొని స్వర్ణం ఎగుమతి నిలిచి పోయింది. తిరిగి పంటల ధరలు పెరిగిపోవడంతో, రైతు కుటుంబాల చేతుల్లో సొమ్ము మిగలడంతో, వారికి అవసరమైన స్వర్ణం దిగుమతి తిరిగి ఆరంభమైంది. 1939 సెప్టెంబరులో భారత రక్షణ నిబంధనల కింద స్వర్ణం దిగుమతి నిషేధించారు. అయినా స్వర్ణం దిగుమతి ఆగలేదు. ప్రజలలో స్వర్ణానికి గిరాకీ హెచ్చింది. దాని ఫలితాలను మార్కెట్ చూపింది. బహిరంగ దిగుమతి సాధ్యపడని కారణంగా దొంగ రవాణా హెచ్చింది. ఇప్పు డది అంతరించలేదు. యుద్ధకాలంలోను, యుద్ధానంతర సంవత్సరాల లోను పెరిగిన వర్తక వాణిజ్యాలవల్ల దేశానికి విదేశ ద్రవ్య నిధులు పెరిగి నిల్వ ఉన్నందున ఇదొక సమస్యగా రూపొంద లేదు. ఇలా దేశం మొత్తంమీద 4100 కోట్ల రూపాయల స్వర్ణం (మార్కెట్ ధర ప్రకారం) నిల్వ ఉన్నట్టు ఆర్థికమంత్రి అంచనా వేశారు. అధికార రేటు ప్రకారం అయితే దాని కిమ్మతు 1800 కోట్ల రూపాయలు. దేశంలో సాలుసరి మిగులు 1100 కోట్ల రూపాయలు అని అంచనా వేస్తున్నారు కనుక, సుమారుగా నాలుగేళ్ల మిగులు సొమ్ము స్వర్ణం రూపంలో దేశంలో నిల్వ ఉందని టూకీగా చెప్పుకోవచ్చు. స్వర్ణమనేది రాబడి నివ్వని ఆస్తి. కనుక ఇంత సొమ్ము ఇలా నిరుపయోగం కావడం భారతదేశం వంటి పేద దేశానికి శ్రేయస్కరం కాదు. ఇలా నిరుపయోగమైపోతున్న మిగులు సొమ్మును ఫ్యాక్టరీలకు, వ్యవసాయానికి పెట్టుబడిపెడితే, దేశం ఆర్థికాభివృద్ధికి శాశ్వత సహాయం జరుగుతుంది. అందువల్లనే స్వర్ణంపట్ల ప్రజలకు మక్కువ అనేది ఆర్థికమంత్రికి పెద్ద చిక్కు అయింది. ఆయన సిద్ధాంతీకరించేది ఏమంటే స్వర్ణం దొంగరవాణాను అరికడితే (1) పెద్ద మొత్తాలలో విదేశ ద్రవ్యాన్ని పొదుపు చేయవచ్చు. (2) ప్రజలు పొదుపు చేసిన సొమ్మును ఆర్థికాభివృద్ధికి పెట్టుబడిగా అందుబాటు చేయవచ్చు అని. ఆయన చేసే సిద్ధాంతానికి కీలకం దేశంలో నిల్వవున్న స్వర్ణం విదేశాల నుంచి వచ్చి ఉండాలని. స్వర్ణానికి ఉన్న గిరాకీతో పోల్చి చూస్తే ఈ దేశంలోని గనులలో ఉత్పత్తి అవుతున్నది స్వల్పం. 1961 లో అధికార రేటు ప్రకారం దాని కిమ్మతు 260 లక్షల రూపాయలు మాత్రమే. 1958 జూన్ నుంచి భారతదేశపు గనుల నుంచి లభించే స్వర్ణం అంతటినీ ప్రభుత్వమే తీసుకుంటున్నది.

స్థూలంగా చెప్పుకోవాలంటే ఇదీ భారత ప్రభుత్వానికి ఏర్పడిన స్వర్ణ సమస్య—స్వర్ణం దొంగరవాణా, భారత ప్రజలకు స్వర్ణం పట్ల మక్కువ.

## 2. ఎప్పుడు, ఎలా ఏర్పడింది

అసలు స్వర్ణ సమస్యలు అనేవి ఎలా ఏర్పడినవి. వీనిని రెండు రకాలుగా పరిశీలించవలసి ఉంది. ఒకటి: స్వర్ణం దొంగ రవాణా ఎందుకు, ఎలా జరుగుతున్నది. రెండు: భారత ప్రజల స్వర్ణ ప్రీతికి ఆర్థిక కారణం ఏమిటి.

ముందు స్వర్ణం దొంగరవాణా సంగతి పరిశీలిద్దాము. స్వర్ణం దొంగరవాణా చేస్తే పెద్ద శిక్షలు విధించడం, పట్టుబడిన స్వర్ణాన్ని ప్రభుత్వం తీసుకొనడం అనేవి కూడా ఉన్నాయి. అయినప్పటికి ఇంకా స్వర్ణం దొంగ రవాణా జరగటానికి కారణం—ఆ వ్యాపారంవల్ల విపరీతంగా రాగల లాభం. మార్కెట్ ధరకు, స్వర్ణం చేర్చడానికి అయిన వ్యయానికి మధ్య విపరీతంగా ఉన్న వ్యత్యాసంవల్ల పెద్ద లాభాలు వస్తున్నాయి. అమెరికా—బ్రిటన్‌లలో స్వర్ణం ధర 10 గ్రాములకు 53—58 రు. ఈ స్వర్ణం కొనడానికి అవసరమైన విదేశ ద్రవ్యాన్ని విదేశాలలో స్వేచ్ఛగా లభించే చోట్ల నుంచి కాని, లేదా భారతదేశంలో బ్లాక్‌మార్కెట్ నుంచి గాని దొంగ రవాణాదారులు పొందవలసి ఉంటుంది. ఈ మార్కెట్లలో విదేశ ద్రవ్యం పొందడానికి భారత కరెన్సీని నూటికి 35 వంతుల ప్రీమియంలో వీరు చెల్లించాలి. ఈ లెక్కను భారతదేశానికి చేరేనరికి స్వర్ణం ధర 10 గ్రాములకు 65 రూ. లు అవుతుంది. (రూ. 53.58 + రు. 18.94 ప్రీమియం మొత్తం + రు. 2.50. రవాణా ఖర్చు చేరి) ఇక భారతదేశంలో మార్కెట్ ధర 1962 ఆగస్టు 31 నాటికి తారాస్థాయిని అందుకున్న రేటు రు. 129.90. అంటే 10 గ్రాముల స్వర్ణంమీద రు. 65 పెట్టుబడి పెట్టి, దొంగతనంగా భారతదేశానికి చేర్చినప్పుడు రు. 65 లాభం, అంటే నిష్పత్తిలో చెప్పుకుంటే నూటికి నూరుపాళ్లు లాభం రాగలదన్నమాట.

ఇలా సాలుకు ఎంత లాభం రాగలదని తెలుసుకొనడానికి, దొంగ రవాణాదారు ఎన్ని దఫాలు ఈ వ్యాపారం జరుపుతాడో ఆ దఫల అంకెతో ఈ లాభం రేటును హెచ్చిస్తే, సరిపోతుంది. ఇలా ఒక వ్యాపారి డబ్బును స్వర్ణంగాను స్వర్ణాన్ని డబ్బుగాను సాలుకు ఆరు దఫాలు మార్పుచేసి వ్యాపారం చేశాడనుకుంటే, రు. 65 లు పెట్టుబడి మీద సాలుకు నికర లాభం 390 రూ. ఉంటుంది. శాతంలో సాలుకు నూటికి 600 వంతుల లాభం అన్నమాట.

బొంబాయిలో ఇప్పుడు ఒక డీలరు మరొక డీలరుకు ఇచ్చే రేటు 10 గ్రాములకు 105 రు. అంటే 65 రూ. ల పెట్టుబడికి వచ్చే లాభం 40 రూ. సాలుకు ఆరు దఫాలు వ్యా వ్యాపారం జరిగితే వచ్చే లాభం 240 రూ. అంటే సాలుకు, నూటికి లాభం రు. 370. ఇంత విపరీతమైన లాభం ఇచ్చే వ్యాపారం భారతదేశంలో మరొకటి ఉందో లేదో నాకు తెలియదు. కనుక భారతదేశంలో స్వర్ణ సమస్యకు కీలకం—స్వరానికి దేశంలో పలుకుతున్న ధరకు, విదేశాల నుంచి స్వర్ణం దిగుమతి అవుతున్న ఖర్చుకు మధ్య ఉన్న తేడాలో ఉంది. ఈ తేడా ఉన్నంతకాలం స్వర్ణం దొంగరవాణా తథ్యం. దొంగరవాణాను అరికట్టాలంటే, ధరలో ఉన్న ఈ తేడాను తొలగించడం ఒక్కటే మార్గం.

అయితే స్వర్ణం ధరలో ఈ తేడా ఎందుకు వచ్చింది? దానిని ఎవరు సృష్టించారు? 1940—41 లోనే ఈ తేడా ఏర్పడింది. 1939 సెప్టెంబరులో ఈ తేడా లేదు. అప్పుడు స్వర్ణం అధికార రేటు 10 గ్రాములకు రు. 37—22, మార్కెట్ ధర కూడా అంతే ఉంది. 1940—41 లో మార్కెట్ ధర పెరిగినందున పెద్ద తేడా వచ్చింది. యుద్ధకాలపు ద్రవ్యోల్బణం (కరెన్సీనోట్ల హెచ్చు చెలామణి) వల్ల మార్కెట్ ధర పెరిగింది. అన్ని ఇతర వస్తువుల ధరల వలెనే స్వర్ణం ధర కూడా, ద్రవ్యోల్బణానికి ప్రతిఫలంగా పెరిగింది. ద్రవ్యోల్బణంతోపాటు ధరలో కూడా తేడా పెరిగి 1949 ఫిబ్రవరి నాటికి రు. 67 ల వద్ద నిలిచింది. 1949 సెప్టెంబరులో స్వర్ణం అధికార ధరను రు. 37.22 నుంచి 53.58 లకు పెంచారు. దీనితోపాటు ద్రవ్యోల్బణాన్ని కూడా అదుపులో ఉంచడంతో, ధర తేడా 1954 జూన్ నాటికి 18 రూ. లకు తగ్గింది. 1955—56 లో ద్రవ్యోల్బణం పెరగడంతో, తిరిగి స్వర్ణం ధర పెరిగి 1962 ఆగస్టు 31 నాటికి తారస్థాయిని అందుకొని 76 రూ. ల తేడాగా నిలిచింది.

దీనినిబట్టి, స్వర్ణం అధికార రేటుకు మార్కెటు రేటుకు తేడా అనేది (1) ద్రవ్యోల్బణం, (2) అధికార రేటు స్థిరంగా ఉంచడం అనే రెండు కారణాలవల్ల ఏర్పడుతున్నదని చెప్పవలసి ఉంది. ఇది నిజమైతే, దానికి పూర్తి బాధ్యత ప్రభుత్వానిదే కాగలదు. ఎందుచేతనంటే స్వర్ణానికి అధికార రేటును నిర్ణయించేది ప్రభుత్వం. కరెన్సీనోట్ల చెలామణి ద్వారా ద్రవ్యోల్బణం తెచ్చేది ప్రభుత్వం. ద్రవ్యోల్బణం లేకపోతే స్వర్ణం ధరలో తేడా అనేది ఉండదు. ఒకవేళ ద్రవ్యోల్బణం అనేది తప్పనిసరి అనే పరిస్థితి ఉన్నా మార్కెట్ ధరకు అనువుగా స్వర్ణానికి అధికార రేటును కూడా పెంచితే చిక్కు ఉండదు. తేడా అనేది పెద్దగా ఏర్పడదు. ఈ రెండింటిలో ఏది జరిగినా స్వర్ణం దొంగరవాణాకు అవకాశం ఏర్పడదు. కనుక స్వర్ణం దొంగరవాణా అనేదానికి పూర్తి బాధ్యత ప్రభుత్వానిదే కాగలదన్నమాట. ఇంటికప్పు నుంచి నీరు కారుతూవుంటే, అందుకు బాధ్యత కంట్రాక్టరుదే కాగలదు. కప్పులో లోపం ఉన్నప్పుడు, అందులోంచి నీరు కారడానికి సంబంధించిన భూమ్యాకర్షణ శక్తిని నిందించి ఎలా లాభంలేదో స్వర్ణం దొంగరవాణా జరుగుతున్నందుకు వెండి, బంగారం మార్కెట్లను, చట్టా వ్యాపారులను, దొంగ రవాణాదారులను స్వర్ణకారులను నిందించి లాభంలేదు. స్వర్ణానికి ఉండే అధికార రేటుకు—మార్కెట్ రేటుకు మధ్య తేడా అనేది ఉన్నంతకాలం—స్వర్ణం దొంగరవాణా జరుగుతూనే ఉంటుంది.

ఇక స్వర్ణంపట్ల భారత ప్రజలకు గల మక్కువను గురించి పరిశీలిద్దాము. స్వర్ణానికి గల ఆకర్షణ శక్తి, అందచందాల సంగతి అలా ఉంచి, ప్రజలకు దీనిపట్ల గల మక్కువకు ఆర్థికమైన కారణం కూడా ఉంది. దీనిని తేలికగా త్రోసివేయడానికి వీలులేదు. ఆర్థిక కారణాలలో మొదటి సంగతి: ప్రజలు పొదుపు చేసుకొనే మొత్తాలు స్వల్పం. జాతీయంగా సగటున, సాలుకు ప్రతి కుటుంబం పొదుపుచేసే మొత్తం రు. 120 లు. ధనికులు మధ్యమ తరగతులలో

# స్వర్ణ నియంత్రణ విధానములు

పై స్థాయివారు పొదుపుచేసే సొమ్ము కూడా దీనితో చేరి ఉంది. స్వర్ణం వల్ల హెచ్చుగా మక్కువ చూపే రైతు కుటుంబాలలో పొదుపు జరిగే మొత్తం ఈ అంకె కంటె తక్కువగా ఉంటుంది. ప్రజలు పొదుపుచేసే సొమ్ము యావత్తు స్వర్ణానికి పెట్టుబడిగా రాదు. అందులో కొంత పొలాల మరమ్మతులకు, తదితర పెట్టుబడులకు పోతుంది. దీనినిబట్టి కుటుంబాల వారీగా స్వర్ణానికి పెట్టుబడి పెట్టగల సొమ్ము స్వల్పంగా ఉంటుందని భావించాలి. ఒకవేళ ఈ సొమ్ము స్టాక్ మార్కెట్టుకు చేరాలనుకున్నా, అక్కడ విక్రయానికి అందుబాటు అయ్యే కంపెనీ షేర్ల కనీసపు సంఖ్య కిమ్మతుకు కూడా ఈ సొమ్ము సరిపోదు. పోతే ఈ సొమ్మును తపాలాఫీసులోనో లేదా స్మాల్ సేవింగ్స్ సర్టిఫికేట్స్ రూపంలోనో ప్రభుత్వానికి అప్పుగా ఇవ్వవచ్చు. రైతులు ఈ మార్గాలను అనుసరిస్తే వచ్చే లాభమేమిటి ? 1939 ఆగష్టు (యుద్ధ ప్రకటనకు ముందు నెల) నెలలో స్వర్ణం మీద పెట్టిన ప్రతి 100 రు. ల పెట్టుబడి 1962 ఆగష్టు నాటికి రు. 401 లుగా పెరిగింది. అదే తేదీలలో అదే సొమ్ము స్మాల్ సేవింగ్స్‌గా వినియోగిస్తే ఆ నూరు రూపాయలుగానే ఉంది. పైగా స్వర్ణంలో పెట్టుబడి పెట్టినప్పుడు అవసరాలు తీర్చుకొనడానికి ఉన్నన్ని అవకాశాలు తపాలా ఆఫీసులలోను, స్మాల్ సేవింగ్స్ సర్టిఫికెట్లలోను పెట్టుబడి పెట్టినప్పుడు ఉండవు. మరొక రకంగా చెప్పుకోవాలంటే 1939 ఆగస్టులో స్వర్ణంమీద రూ. 100 లు పెట్టుబడి పెడితే, 1962 ఆగస్టు నాటికి 401 రూ. వచ్చిందంటే అసలు సొమ్ముకు నూటికి 6.02 చొప్పున చక్రవడ్డీ కూడా కలిసిందన్నమాట. స్మాల్ సేవింగ్సు సర్టిఫికెట్స్‌లో అయితే రు. 300 లకు లోపుగా (అసలు మొత్తానికి నూటికి 4.5 చొప్పున చక్రవడ్డీ చేర్చి) పెరిగేది. ఈమధ్య జాతీయ సేవింగ్సు సర్టిఫికేట్లకు పెంచిన రేట్ల దృష్ట్యా చూచినా, పెట్టుబడి ప్రతి 12 సంవత్సరాలకు గాని ఒకటిన్నర రెట్లు పెరగదు.

ఈ కారణాలవల్లనే భారత ప్రజలకు స్వర్ణంమీద మక్కువ హెచ్చు. ఇందులో మొదటి అంశం: స్వల్ప మొత్తాల పొదుపు. గ్రామాలలోని లక్షల కొలది కుటుంబాల ఆదాయాలను, పొదుపరితనాన్ని పెంచినప్పుడు కాని, వారివద్ద మిగిలే సొమ్ము, షేర్ మార్కెట్‌లో లభ్యమయ్యే కంపెనీ వాటాల కనీసపు సంఖ్య విలువకు అందదు. ఈ పరిణామం సంభవం కావడానికి చాలాకాలం పడుతుంది. రెండవ అంశం. పెట్టుబడిమీద రాగల ప్రతిఫలం సంగతి. ఇందుకు రూపాయి విలువ, స్థిరత్వం మీద ప్రజలకు నమ్మకం కలిగించాలి. ఇది ప్రభుత్వం చేతుల్లో ఉన్న పని. సత్వరం అనుసరించదగినది. కరెన్సీనోట్ల చెలామణిని పెంచి, డబ్బు విలువను తగ్గించ (అంటే ద్రవ్యోల్బణాన్ని పెంచ) రాదనే దృఢ నిర్ణయానికి ప్రభుత్వం రావాలి. ఈనాడు రూపాయికి ఉన్న విలువ—యుద్ధపూర్వపు విలువతో పోలిస్తే, మూడున్నర, నాలుగు అణాలు మాత్రమే. ఇందుకు పూర్తి బాధ్యత ప్రభుత్వానిది. రూపాయి విలువ స్థిరంగా ఉంటే కాని, ప్రజలు స్వచ్ఛందంగా పొదుపు చేసుకొనే మొత్తాలు స్మాల్ సేవింగ్స్ ద్వారా ప్రభుత్వ ఖజానాకు జమ పడవు. ప్రజలు గతంలో పొందిన దారుణమైన అనుభవాల ఫలితమే—స్వర్ణం పట్ల ప్రజలకు మక్కువ పెరగడం.

## 3. ప్రభుత్వం తీసుకున్న చర్యలు

స్వర్ణం దొంగ రవాణాను గురించిన ఆందోళన చాలా కాలంగా ఉంది. దొంగరవాణా నిరోధానికి వరుసగా అనేక చర్యలు తీసుకున్నారు. కాని ఫలితం లేకపోయింది. అయినా ప్రభుత్వం తీసుకున్న నాలుగు చర్యలను గురించి తెలుసుకొనడం అవసరం. ఆ నాలుగు చర్యలు ఇవి: (1) కస్టమ్సు కట్టుదిట్టాలు, హెచ్చుగా పెనాల్టీల విధింపు, (2) సముద్ర కస్టమ్సు చట్టానికి 1955 ఏప్రిల్‌లో జరిగిన సవరణ. (3) పర్షియా, సింధు శాఖలో చెలామణికి గాను 1959 మే—జూన్‌లో ప్రత్యేకంగా రూపాయి కరెన్సీ నోట్ల జారీ (4) 1963 జనవరి 10 న జారీన స్వర్ణ నియంత్రణ నిబంధనల ప్రకటన.

కస్టమ్సు కట్టుదిట్టాల వల్ల ఎలాంటి ఫలితాలు పైకి కనిపించలేదు. పైగా అవినీతి హెచ్చింది. స్వర్ణం దొంగ రవాణా వల్ల వచ్చే లాభాలు విపరీతంగా ఉన్నందున బలహీన మనస్కులను, అధిక ఖర్చుల అలవాట్లు కలవారిని కొనివేయడం సులభమైంది. రూపాయి విలువ తగ్గినందున ఆఫీసర్లకు జీతాల రూపంలో వచ్చిన ఆదాయం వారి పెద్ద కుటుంబాల పోషణకు, అధికంగా ఖర్చులు చేసే అలవాట్లకు సరిపోదు. జీవితంలోని అన్ని రంగాలలోను ఈ రకం మనుష్యులు ఉంటారు. అలాగే కస్టమ్సు అధికారులలోను ఉంటారు. లొంగిపోవడానికి వీలైన ప్రలోభాలు అనేకం వారి కళ్ల ముందు ఉంటాయి. తలాబ్ దొంగ రవాణా కేసు ఈ విషయాన్ని బయట పెట్టింది. దొంగరవాణా చేయడంలో తనకు ఆసరాగా ఉన్నవారిలో ఉన్నత పదవులలోని వారు కూడా కలరని తలాబ్ వెల్లడించాడు. చివరకు విదేశాల నుంచి వచ్చే పెద్దలు, వీరి సిబ్బంది విదేశ ప్రతినిధులు, వైమానికులు, నౌకా వాణిజ్య సంస్థల సిబ్బంది వగైరాలు దొంగ రవాణా కేసులలో చిక్కుకున్న ఉదాహరణలుకూడా విన్నాము. రాజస్థాన్ సరిహద్దుల నుంచి స్వర్ణం దొంగరవాణాను నివారించడానికి పెట్టే పోలీసులను వారాని కొకదఫా మార్పు చేయవలసి వచ్చిందని, అలా కాకపోతే దొంగ రవాణాదారులకు వీరికి సన్నిహిత సంబంధం ఏర్పడవచ్చుననే భయం ఇలా చేయడానికి కారణమని నేను విన్నాను. ఇదంతా శోచనీయంగా కనిపించినా, దీనిలో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. ఎందుచేతనంటే దొంగ రవాణా జరిగిన ప్రతి 100 తులాల స్వర్ణంలోను 16 తులాల ఖరీదు దొంగ రవాణా ఖర్చుల క్రింద పోగా 84 తులాలు దొంగ రవాణాదారు అమ్ముకొనడానికి మిగులుతుంది. ఇందువల్లనే విమానాశ్రయాలలో స్వర్ణం ఆనరా తీసే యంత్రాలను పెట్టినా, ప్రయోజనం లేకపోయింది.

దీనికు పట్టుబడిన స్వర్ణాన్ని పూర్తిగా ప్రభుత్వం తీసుకుంటూ వచ్చినా ప్రయోజనం లేకపోయింది. ప్రతి మూడుసార్లు జరిగే దొంగరవాణాలో ఒకసారి పట్టుబడినా, పైన అంకెలో సూచించిన నికర లాభం దృష్ట్యా, దొంగ రవాణాదార్లు ఇంకా ఈను చర్యలు కొనసాగించి, లాభాలు పొందుతారు. ప్రస్తుతానికి స్వాధీనపరచుకుంటున్న స్వర్ణం కూడా చాలా అత్యల్పంగా ఉంటున్నది. ఇందుకు సంబంధించిన అంకెలు కొన్ని ఉన్నాయి. 1958 తో అంతమైన మూడేళ్లలోను సగటున సాలుకు 175 లక్షల కిమ్మతు గలది పట్టుబడింది. దొంగ రవాణా జరిగేదానికి ఊహామీద వేస్తున్న అంచనాతో పోలిస్తే, ప్రతి 17—20 దఫాలు జరిగే దొంగ రవాణాలో ఒక దఫా మాత్రమే పట్టుబడుతున్నట్టు చెప్పుకోవచ్చు. కనుక ఏవిధంగా చూచినా ఇది కఠినమైన చర్యకాబోదు.

పట్టుబడిన దొంగరవాణా స్వర్ణాన్ని కైవశం చేసుకొనిన మాత్రాన ఆ రవాణాలను అరికట్టలేదనేది, భీమా కంపెనీ వారు (దొంగ రవాణాదారుల అనుబంధ శాఖ) వసూలుచేసే భీమా ప్రీమియం మొత్తాన్ని బట్టి కూడా ఋజువు అవుతున్నది. స్వర్ణం కంట్రోలు బోర్డు అధ్యక్షుడు శ్రీ జి. డి. కోటక్ 1963 ఫిబ్రవరి 20 న అహమ్మదాబాదు రోటరీ సమావేశంలో ప్రసంగిస్తూ, విచిత్రమైన ఈ భీమా వ్యవహారాన్ని గురించి ప్రస్తావిస్తూ, దొంగరవాణా చేసే స్వర్ణం కిమ్మతుకో నూటికి 10—15 వంతులు చొప్పున భీమా ప్రీమియం రేటు తీసుకుంటున్నట్లుగా ఉదాహరించారు. కస్టమ్సు అధికారులు స్వర్ణాన్ని పట్టుకున్న 24 గంటలలో భీమా చేసిన దొంగ స్వర్ణం కిమ్మతును దొంగ రవాణా దారులు పొందుతున్నారట. దొంగరవాణాలలో 7 నుంచి 10 దఫాల జరిగే రవాణాలో ఏ ఒక్కటి పట్టుబడినా, స్వర్ణం కైవశమైనా ఈ భీమా కంపెనీదివాలా తీస్తుంది. కాని ఇలా జరగడం లేకపడానికి వసూలు చేస్తున్న ప్రీమియం రేటు సాక్ష్యంగా ఉంది. దొంగ రవాణాలలో పదింటికి ఒకటి కూడా పట్టుబడి, స్వర్ణం స్వాధీనం కావడంలేదు. బహుశా ఏ 17—20 దఫాల కొక దఫాయో పట్టుబడవచ్చునని పైన చెప్పుకొన్న దానిని నిజమని తలంచవచ్చు. అలాంటప్పుడు భీమా కంపెనీ తాను వసూలుచేసే ప్రీమియం సొమ్ములో నూటికి 41 నుంచి 50 వంతులను తన ఖర్చులకు, లాభాలకు లకు మిగుల్చుకొన గలదన్నమాట.

ఈవిధమైన భీమా ఏర్పాటు స్వర్ణం దొంగరవాణాదారులకు మంచి వీలుగా ఉంది. భీమా సూత్రాల ప్రకారం దొంగ రవాణాలు పట్టుబడగల అవకాశాలను దొంగ రవాణాదారుల మధ్య ఇది పంచుతూ ఉంది. ప్రతి దొంగ రవాణాదారు భీమా పొందితే, అదృష్టంతో అవసరం లేకుండానే, దొంగ రవాణా చేసిన ప్రతి 100 తులాల స్వర్ణంలోను 10 తులాలు భీమా ప్రీమియంకు, 16 తులాలు రవాణా ఖర్చులకు పోగా మిగిలిన 74 తులాలు నికర లాభం కింద దొంగ రవాణా దారుకు మిగులుతుంది.

1878 నాటి సముద్ర కస్టమ్సు చట్టం ప్రకారం, అనుమానంమీద పోలీసులు స్వర్ణాన్ని పట్టుకుంటే, వారు కోర్టువారి ముందు తాము పట్టుకున్నది దొంగ రవాణా స్వర్ణమని రుజావు చేయవలసి ఉంది. ఇలా వారు నిరూపించ లేనప్పుడు ఆ స్వర్ణాన్ని దానికి సంబంధించిన వారికి అప్పగించ పెడతారు. వారిని విడుదల చేస్తారు. ఈ ఏర్పాటువల్ల తాము జాగ్రత్తగా కాపలా కాయడానికి దొంగ రవాణాలను నిరోధించడానికి చిక్కులు కలుగుతున్నవని పోలీసు అధికారులు విజ్ఞప్తి చేశారు. దీనితో సముద్ర కస్టమ్సు చట్టాన్ని సవరించి, స్వర్ణం ఎవరినుంచి పట్టుకున్నారో, వారే అది దొంగ రవాణా స్వర్ణం కాదని రుజావు చేసుకొనవలసిన ఏర్పాటు చేశారు. దీనివల్ల స్వర్ణాన్ని కలిగివున్నవారు అది దొంగ రవాణా సరుకు కాదని కోర్టులో రుజావు చేసుకొనవలసి ఉంటుంది. ఇలా చట్టబద్ధమైన ఏర్పాట్లు మార్పుచేసినందున స్వర్ణ వ్యాపారుల సివిల్ హక్కులు కుంచింపబడినవే కాని కలిగిన ఫలితమేమీ లేదు. స్వర్ణానికి మార్కెట్‌లో ఉన్న ధరకు, దేశానికి చేర్చేసరికి కాగల ఖర్చుకు మధ్య పెద్ద వ్యత్యాసం ఇంకా ఉన్నందున, దొంగ రవాణా అనేది ఈ చర్యవల్ల కూడా ఆగిపోలేదు.

ఇప్పుడు మన దృష్టిని స్వర్ణం దిగుమతికి పెట్టుబడులు ఎలా పెడతారనే దానిమీదికి ప్రసరించాలి. రిజర్వు బ్యాంకువారు జరిపిన పరిశోధనలవల్ల పర్షియా సింధుశాఖ ప్రాంతాలలో భారత కరెన్సీ చెలామణి ఉన్నందున స్వర్ణం దిగుమతికి పెట్టుబడులు లభ్యమవుతున్నట్లు తెలియవచ్చింది. స్వర్ణాన్ని భారతదేశంలో రూపాయలలో విక్రయించి, తద్వారా లభించిన కరెన్సీ నోట్లను దేశంనుంచి దొంగతనంగా బయటకు తీసుకుపోయి, పర్షియా సింధుశాఖ ప్రాంతాలలో స్వర్ణం కొనడానికి వినియోగిస్తున్నారు. ఇలా పర్షియా సింధుశాఖ ప్రాంతాలకు చేరిన భారత కరెన్సీనోట్లు, స్థానికావసరాలకు మించినప్పుడు, అక్కడి బ్యాంకులలో నిల్వ పడుతున్నవి. అక్కడి బ్యాంకులు ఆ కరెన్సీ నోట్లను భారత రిజర్వు బ్యాంకికి అందజేసి, వాటి మూల్యానికి తగిన విదేశ ద్రవ్యాన్ని తీసుకుంటున్నవి. దాని అర్థం ఏమంటే, పర్షియా, సింధుశాఖ ప్రాంతాలలోని బ్యాంకుల ద్వారా స్వర్ణం దొంగ రవాణాకు అవసరమైన సొమ్ము పరోక్షంగా భారత రిజర్వుబ్యాంకి నుంచే లభిస్తున్నదన్నమాట. అందువల్ల రిజర్వు బ్యాంకి నిపుణులు ఏమని భావించారంటే, పర్షియా సింధుశాఖ ప్రాంతాలలో చెలామణి అయ్యే కరెన్సీనోట్లు, భారతదేశంలో చెలామణి అయ్యే నోట్లు వేర్వేరుగా ఉండేటట్లు చేస్తే సరిపోతుంది. స్వర్ణం దిగుమతి ఆగిపోతుంది. దొంగ రవాణా దారులకు సులభంగా విదేశ ద్రవ్యం లభించదనుకున్నారు. ఆ ప్రకారం 1959 మే—జూన్‌లో పర్షియా సింధుశాఖ ప్రాంతంలోని భారత కరెన్సీ నోట్లను ఉపసంహరించి కొత్తరకం రూపాయినోట్లు ఎర్ర రంగు వేసి చెలామణిలో పెట్టారు. అయినప్పటికీ స్వర్ణం దిగుమతి ఆగలేదు. ఎలాగంటే, ఇంతవరకు స్వర్ణ వ్యాపారులు రూపాయినోట్లను దేశం బయటికి తీసుకు వెళ్లేవారు. పర్షియా

# స్వర్ణ నియంత్రణ విధానము

సింధుశాఖ ప్రాంతాలలోని బ్యాంకుల ద్వారా ఆ కరెన్సీనోట్లు భారత రిజర్వుబ్యాంకి చేరేవి. కొత్త ఏర్పాటువల్ల ఇలా చేయ డానికి వీలుపడదు. అందువల్ల డీలర్లు విదేశ ద్రవ్యం రూపంలో ఈ నోట్లను అక్కడికి తీసుకు వస్తున్నారు. అవసర మైన వస్తువులు విదేశ ద్రవ్యానికి కొంటున్నారు. దీనివల్ల భారత కరెన్సీ నోట్లకు "డిస్కౌంట్" రేటు పెరిగింది. అందు వల్ల స్వర్ణం దిగుమతులంపీద లాభాల రేటు స్వల్పంగా తగ్గింది. ఒక్కొక్కప్పుడు ఈ డిస్కౌంట్ రేటు నూటికి 11 కావచ్చు. అయినప్పటికి సగటున సాలుసరి లాభం నూటికి 370 నుంచి 600 వంతుల వరకూ ఉన్నప్పుడు డిస్కౌంట్ రేటు నూటికి 35 ఉన్నా వచ్చే నష్టం పెద్దగా ఉండదు. అదీ కాక మరొక లాభం కూడా ఉంది. ద్రవ్యోల్బణం వల్ల మార్కెట్‌లో స్వర్ణం ధర పెరుగుతూ ఉంటుంది. అధికార రేటుకు, మార్కెట్ రేటుకు ఉన్న తేడా హెచ్చిన కొలదీ లాభాలు పెరుగుతూ ఉంటాయి.

1963 జనవరి 10 వ తేదీన స్వర్ణ నియంత్రణ నిబంధనలు జారీచేశారు. అవికూడా స్వర్ణ వ్యాపారంమీద పెద్దగా ప్రభావాన్ని చూపినట్లు కనిపించదు. ఈ నిబంధనల వల్ల తాత్కాలికంగా బంగారం మార్కెట్ చిందర వందర అయింది. బంగారం మార్కెట్ అనేది సన్నిహిత సంబంధాలు గల వ్యవస్థ కాదు. ఈ మార్కెట్లకు ముఖ్యస్థానం బొంబాయి. బొంబాయి "కొటేషనుల" ను బట్టి దేశంలోని ఇతర కేంద్రాలలో స్వర్ణం ధరలు స్వల్పంగా మారుతూ ఉండేవి. ఇప్పుడు స్వర్ణం ధరలలో విపరీతమైన వ్యత్యాసం కానవస్తున్నది. బొంబాయిలో డీలరు—డీలరు మధ్య ప్రస్తుతం ఉన్న ధర రు. 105. మార్కెట్ ధరవరులలో ఇది చాలా తక్కువనే చెప్పాలి. దేశంలోపలగా ఉన్న కేంద్రా లలో ధర రు. 125 లు, అంతకు మించి ఉంది. నగల రూపంగా ఉండని స్వర్ణంలో వ్యాపారాన్ని ఈ నిబంధనల ద్వారా నిషేధించిన ఫలితమే ఈ ధరల వ్యత్యాసం. నగలు రూపంలో లేని స్వర్ణంలో బహిరంగ వ్యాపారం నిషేధం కనక, అది చీకటిబజారు కెక్కింది. మామూలు పద్ధతులలో స్వర్ణం రవాణాకు చిక్కులు ఏర్పడ్డాయి. దానిని వ్యాపారులు స్వయ ముగా మోసుకువెళ్లాలి. లేదా నమ్మకస్తులైన తమ ఏజెంట్ల ద్వారా రవాణా చేయించాలి. ఇలా రవాణా ఖర్చులు పెరి గాయి. దానికి తోడు పోలీసులు పట్టుకుంటే రాగల నష్టం భర్తీకి భీమా ఖర్చులు ఉన్నాయి. వాటినిబట్టి స్వర్ణం ధరలు ప్రాంతాల వారీగా ఎందుకు మార్పుగా ఉన్నదీ మనం అర్థం చేసుకోవచ్చు. ఇలా మార్కెట్లను విచ్ఛిన్నం చేయడం, స్వర్ణం పొందడానికి ఖర్చులు పెంచడం మినహా స్వర్ణ నియంత్రణ నిబంధనలవల్ల కలిగిన సత్ప్రయోజనం మరేదీ లేదు. త్వరలోనే ఈ నిబంధనలకు కూడా మార్కెట్ అల వాటు పడడంతో, మామూలుగా వచ్చే లాభాలు హెచ్చు స్థాయిలో ఎలాగూ ఉంటాయి కనుక, స్వర్ణం దొంగ రవా ణాకు వీనివల్ల కలిగే ఆటంకం ఉండదు. కాకపోతే అధికారులు స్వర్ణమార్కెట్‌ను కాతాలలో ఎక్కిన వ్యాపార వివరాల ద్వారా కొంతవరకు [illegible] ఈ నిబంధనలు సహాయపడవచ్చు. ఒకవేళ దొంగ రవాణా వచ్చే సరుకు వివరాలు కాతా పుస్తకాలలో ఉండవు. ఉండటానికి వీలు లేదు. దొంగతనాన్ని [illegible] దొంగ [illegible] పోలీసు [illegible] కోసం [illegible] చేయించడం [illegible] అన్నిటికీ [illegible]. దొంగతనం అరికట్ట ఇదేమీ ఏకైక నివారణ కాదు, అలాగే స్వర్ణం దొంగరవాణా నిరోధానికీనూ, స్వర్ణ వ్యాపారు లందరూ పేర్లు రిజిస్టరు చేయించుకొని స్వర్ణ నియంత్రణ బోర్డుకు లోబడాలనే నిబంధనవల్ల కూడా స్వర్ణం దొంగ రవాణా ఆగదు.

ఇలా స్వర్ణం దొంగ రవాణా నిరోధానికి గాను[illegible] తీసుకున్న చర్యలన్నీ విఫలమైనాయి. ఇందుకు ముఖ్యంగా రెండు కారణాలు—ఒకటి [illegible]వల్ల స్వర్ణం మార్కెట్ ధరకు, దేశంలో చేరడానికి కాగల ఖర్చులకు మధ్య ఉన్న తేడా తొల గక పోవడం. అధికార ప్రకటనలో హెచ్చరించినప్పటికీ ఇది [illegible] స్వర్ణం ధర రు. 86 ల కంటె తక్కువకు ఎప్పుడూ తగ్గ లేదు. అది కూడా 1962 నవంబరు 24 న తాత్కా లికంగా సంభవించింది. ఆ తర్వాత ధర పైకి పాకడం మొద లారంభించింది. బొంబాయిలో రు. 105 లు పలికింది. దేశంలోపలి కేంద్రాలలో ఇంకా హెచ్చింది.

ఇకపై అధికార వర్గాలు ఎన్ని చెప్పినప్పటికీ, స్వర్ణం దొంగ రవాణా కూడా ఆగలేదు. ఇప్పటి మార్కెట్ రేటును బట్టి దొంగ రవాణాదార్లు సొమ్ముకు నూటికి 370 వంతులు లాభంలేసే అవకాశం ఉండడమే ఇందుకు కారణం. అయినప్ప టికి ఆర్థికమంత్రి 1963 జనవరి 24 న లోకసభలో ప్రసం గిస్తూ విదేశాలలో భారత రూపాయి విలువకు వచ్చిన స్థిరత్వం అనేది స్వర్ణం దొంగరవాణా నిలిచిపోయిం దనడానికి స్వర్ణ నియంత్రణ నిబంధనల ఫలితం ఉండడానికి నిదర్శ నంగా ఉదాహరించారు. ఈ వాదననే స్వర్ణ నియంత్రణ బోర్డువారు, అధికార వ్యాఖ్యాతలు ఆ తర్వాత పునశ్చరణ చేస్తూ వచ్చారు.

ఈ వాదనకు ప్రాతిపదికగా ఉన్న అంశాలు ఏవంటే— దొంగ రవాణాదారులు స్వర్ణాన్ని భారతదేశంలో విక్రయించి, తద్వారా లభించిన రూపాయలను దేశం బయటకు తీసుకొని పోవడం, విదేశ మార్కెట్లలో వానిని విక్రయించి, ఆయా దేశాల విదేశ ద్రవ్యాన్ని సంపాదించడం, అలా లభించిన విదేశ ద్రవ్యంలో స్వర్ణం కొని భారతదేశానికి దొంగ రవాణా చేయడం. ఇలా దొంగ రవాణాదారులు చురుకుగా వ్యవహరిస్తే, రూపాయలు యిచ్చి విదేశ కరెన్సీ పొందేవారు పెరుగుతారు. తత్ఫలితంగా విదేశ మార్కెట్లలో రూపాయి బలహీనపడే అవ కాశం కూడా ఉంది. ఇలా కాక దొంగరవాణా నిలిచిపోతే, రూపాయలు యిచ్చి విదేశ కరెన్సీ పొందదలచేవారు తగ్గుతారు. ఆ పరిస్థితులలో రూపాయలకు విదేశ ద్రవ్యానికి మధ్య ఉన్న మారకం రేటు పెరగనూ వచ్చు. తరగనూ వచ్చు. రూపా

యంటే మారకం రేటు పెరిగినప్పుడు అది స్వర్ణం దొంగరవాణా అభివృద్ధిలోకి వచ్చిందనడానికి సూచనగా భావించవచ్చు.

అయితే విదేశ మార్కెట్లలో రూపాయికి—విదేశ ద్రవ్యానికి మధ్య ఉన్న మారకం రేట్లకు, స్వర్ణం దొంగ రవాణాకు మధ్య సంబంధం కలిపే వాదన సహేతుకమనిపించదు. ఎందువల్లనంటే (1) విదేశ మార్కెట్లలో రూపాయలు ఇచ్చి విదేశ ద్రవ్యాన్ని పొందడానికి గిరాకీ అనేది కేవలం స్వర్ణం దొంగ రవాణాదారుల వల్లనే పెరగదు. కెమెరాలు, ఖరీదైన కొత్త వస్త్రాలు, సిగరెట్లు, సిగరెట్టు కేసులు, మద్యాలు, విద్యుత్‌సామానులు, ఫౌంటెన్ పెన్నులు, ఫోటోగ్రాఫ్ సామానులు, రేజరు బ్లేడులు, సుగంధ ద్రవ్యాలు, ట్రాన్సిస్టర్ రేడియోలు, చేతి గడియారాలు వగైరాలు దొంగతనంగా రవాణా చేసినవారి వల్లను, విదేశాలలో పెట్టుబడుల ఖాతాను, సొంతవారి ఖాతాను చట్టవిరుద్ధమైన చర్యల ద్వారా సొమ్ము చేసేవారి వల్లనూ కూడా గిరాకీ పెరగవచ్చు. అందువల్లనే స్వర్ణం దొంగ రవాణాను అరికట్టినప్పటికి రూపాయలు ఇచ్చి విదేశ ద్రవ్యం పొందడానికి గిరాకీ తగ్గక పోవచ్చు. అయితే అన్ని సరుకుల దొంగ రవాణా ఆగిపోయిందని, విదేశాలలో చట్టవిరుద్ధమైన చర్యలకు నిధుల గిరాకీ తగ్గిందని నిరూపించినప్పుడు మాత్రమే భారత ప్రభుత్వం చేస్తున్న వాదన చెల్లుతుంది. కాని, వారు ఇంతవరకు అలాంటివి చేయలేదు. (2) విదేశమార్కెట్లలో రూపాయి మారకం రేటు పెరిగినప్పుడు, అది స్వర్ణం దొంగ రవాణా నిరోధానికి సూచనగా కాక, స్వర్ణం దొంగరవాణాను పెంచడానికి సూచన అని కూడా సమర్థించడానికి వీలున్నది. ఎందుచేతనంటే మారకం రేటు ఎంతగా పెరుగుతుందో, అంతగా స్వర్ణం దిగుమతులమీద వచ్చే లాభం హెచ్చుతుంది. భారతదేశానికి చేర్చడానికి కాగల ఖర్చు పది గ్రాములకు రు. 53.58. దీనికి నూటికి 12.1 వంతున విదేశ ద్రవ్యానికి ప్రీమియం కింద కలపాలి. అదనంగా రవాణాచార్జీలు కూడా చేర్చాలి. విదేశ ద్రవ్యపు ప్రీమియం రేటు తగ్గినప్పుడు, భారతదేశానికి స్వర్ణం చేరవేసేందుకు కాగల ఖర్చు తగ్గుతుంది. మరికొందరు చెప్పేది ఏమంటే, భారతదేశపు బ్లాక్‌మార్కెట్‌లోను, విదేశాలలో స్వేచ్ఛగా జరిగే విక్రయాలలోను, రూపాయి మారకం రేటులో ఈమధ్య కానవచ్చిన పెరుగుదల భారతదేశంలో స్వర్ణం ధరలలో వచ్చిన తగ్గుదలకు సమానమై పోయింది. అందువల్లనే దేశంలో స్వర్ణం ధర తగ్గినా, స్వర్ణం దొంగ రవాణా మాత్రం ఆగలేదు.

స్వర్ణ నియంత్రణ నిబంధనలవల్ల స్వర్ణం దొంగ రవాణా ఆగలేదని స్వర్ణ వ్యాపారులకు తెలుసు. దేశంలో స్వర్ణం ధర నానాటికి పుంజుకుంటున్న కొలదీ, రూపాయి మారకం రేటు మెరుగుపడుతున్నకొలదీ, దొంగరవాణా జరిగే స్వర్ణం మీద వచ్చే లాభాలు విపరీతంగా ఉంటాయి. ఉదాహరణకు: బొంబాయి మార్కెట్టులో ధర 10 గ్రాములకు రు. 105లు. ఉన్నదనుకుంటే, సాలుకు ఆరుసార్లు దొంగ రవాణా సరుకుతో వ్యాపారం జరిగినప్పుడు సగటున నూటికి 370 వంతులు లాభం వస్తుంది. స్వర్ణ నియంత్రణ నిబంధనలు ఈ లాభాల ''మార్జిన్'' జోలికి పోలేదు కనుక స్వర్ణం దొంగ రవాణా సాగుతూనే ఉంది. కస్టమ్సు అధికారులు అప్పుడప్పుడు దొంగరవాణాదారను పట్టుకున్నట్టు పత్రికలలో వస్తున్న వార్తలు ఇందుకు నిదర్శనంగా ఉన్నాయి.

## 4. కొత్త విధానాలు

ఇంతవరకూ జరుపుకువచ్చిన పరిశీలననుబట్టి చూడగా—స్వర్ణానికి మార్కెట్‌లో ఉన్న ధరకు, అధికారరీత్యా చెలామణీ చేస్తున్న ధరకు మధ్య హెచ్చుగా ఉన్న తేడాను తొలగిస్తే తప్ప స్వర్ణం దొంగ రవాణాను నిలిపివేయడం దుస్సాధ్యమవుతున్నది. ఒక వస్తువునకు ఒకే సమయంలో విపరీతమైన తేడాతో రెండు రకాల ధరలు పలుకుతున్నప్పుడు, ఆర్థిక సుస్థిరత్వం సాధించాలంటే, ఈ తేడాను తొలగించివేయడం మినహా మరొక మార్గం లేదు. ఇందుకుగాను మార్కెట్‌లో హెచ్చు రేటున ఉన్న ధరను తగ్గించాలి లేదా, అధికారరీత్యా చెలామణీ చేస్తున్న తక్కువ రేటును పెంచాలి. కాని ప్రభుత్వం మాత్రం ఇలా చేయక, అధికారరీత్యా చెలామణీ చేస్తున్న ధరను ఇంకా తగ్గించడంద్వారా ఈ తేడాను భర్తీ చేయదలుస్తున్నది. ప్రణాళికకు అవసరమైన నిధులకోసం ప్రయివేటు స్వర్ణాన్ని సమీకరించే చర్యలను ప్రభుత్వం పరిశీలిస్తున్నదని ఆగస్టు 21 న ఆర్థికమంత్రి చేసిన ప్రకటన జాతీయ రక్షణ నిధికి విరాళాలను స్వర్ణం, నగల రూపంలో ఇవ్వాలని ఆగస్టు 26 న ఆర్థికమంత్రి చేసిన విజ్ఞప్తి, నవంబరు 12 న స్వర్ణబాండుల విడుదల, ఈ బాండులకు వచ్చే స్వర్ణానికి ప్రతి పది గ్రాములకు 53.58 రూ. లుగా అధికార ధరను నిర్ణయించడం, స్వర్ణం తనఖామీద కమర్షియల్ బ్యాంకులు అప్పులు ఇవ్వరాదని రిజర్వుబ్యాంకి పెట్టిన ఆంక్ష, స్వర్ణంలో చట్టా వ్యాపారాన్ని, నిర్ణీత గడువులో డెలివరీ కంట్రాక్టులను నిషేధించడం, స్వర్ణం ధరను పది గ్రాములకు 60 రు. లుగా ఉండేటట్టు చేసే లక్ష్యంతో వెల రోజులలోనే తీవ్రమైన చర్యలు ప్రభుత్వం తీసుకొనగలదని నవంబరు 20 న అధికార ప్రకటన, డిశంబరు 2 న దాని పునరుద్ఘాటన, 1963 జనవరి 10 న స్వర్ణ నియంత్రణ నిబంధనల జారీ, వగైరాలన్నీ స్వర్ణం ధరను పడగొట్టడానికి తీసుకున్న చర్యలుగా ఉన్నాయి. ఇవి ఇందుకే అని మార్కెట్ వర్గాలు వ్యాఖ్యానించాయి.

అయితే ఈ చర్యలన్నీ గమనార్హమైన ఫలితాలను ఇవ్వలేదు కాని, వీనిలో కొన్ని స్వర్ణం ధరలను తాత్కాలికంగా బెదరగొట్టాయి. 1962 అక్టోబరు 26 న ఆర్థికమంత్రి జాతీయ రక్షణ నిధికిగాను స్వర్ణాన్ని విరాళాలుగా ఇవ్వాలని ప్రకటించడంతో ఒక్కరోజులో స్వర్ణం ధర రెండు రూపాయలు తగ్గింది. దేశంలో ఏర్పడిన ఆత్యయిక స్థితికి, స్వర్ణ

# స్వర్ణ నియంత్రణ విధానము

విక్రయించి పెట్టుబడివల్ల, స్వర్ణ నియంత్రణ నిషేధానికి ప్రభుత్వం తీవ్రమైన చర్యలు తీసుకొనగలదని ప్రజలు, వ్యాపారులు తలంచారు. కాని, గతంలో వలెనే ఒక్కసారిగా ధర తిరిగి పెరిగింది. కాని, 1962 నవంబరు మూడున స్వర్ణం బాండుల విషయం మార్కెట్‌ను గందరగోళ పరిచింది. రెండు రోజులు స్వర్ణం కొనేవారే లేకపోయారు. స్వర్ణం ధర 1962 నవంబరు 3 న ఉన్న 121.50 రూ. ల నుంచి నవంబరు ఆరుకు 102.75 రూ. లకు పడిపోయింది. అయితే దీనివల్ల పెట్టుబడులూ పెరిగాయి. స్పెక్యులేషన్స్ హెచ్చాయి. నవంబరు ఎనిమిది నాటికి ధర పుంజుకొని 108.75 రూ. లకు చేరింది. కాని నవంబరు 20 న ఆర్థికమంత్రి "నెల రోజులలో తీవ్ర చర్యలు" అంటూ చేసిన ప్రకటన తిరిగి మార్కెట్‌ను అల్లకల్లోలం చేసింది. ఇదివరకెన్నడూ లేనంత గందరగోళం ఏర్పడింది. పక్షం రోజుల కిందట 106 రూ. లుగా ఉన్న ధర నవంబరు 21 నాటికి 86 రూ. లకు పడిపోయింది. 1956—57 నుంచి ఇంత తక్కువ ధర ఎన్నడూ లేదు. ఇలా స్వర్ణం ధరలు తరుగుతూ—పెరుగుతూ వచ్చినా, చివరకు పైముఖం చూస్తూ నిలిచిపోతూ వచ్చాయి.

స్వర్ణానికి మార్కెట్ ధర అనేది, మామూలు ఇతర వస్తువుల ధరలకువలెనే గాక, గతంలోను, వర్తమానంలోనూ ఉండే ద్రవ్యోల్బణాన్ని ప్రతిబింబిస్తుంది. 1949 సెప్టెంబరులో నిర్ణయించిన అధికార రేటుకు ఈనాటి మార్కెట్ రేటును తగ్గించాలంటే, బంగారం మార్కెట్‌లో ద్రవ్యోల్బణం స్థాయిని కూడా ఆనాటి స్థాయికి తీసుకురావాలి. జలం వలెనే డబ్బు అనేది కూడా సర్వత్రా సమతలంగా ఉంటుంది. ఒక చెరువులోని నీటిని ఒకవైపున ఒక మట్టం లోను మరొక వైపున మరొక మట్టంలోనూ ఉంచడానికి వీలుపడదు. అందువల్ల మార్కెట్‌లో అన్ని వస్తువుల ధరలు నూటికి 30 వంతులు హెచ్చుగా ఉన్నప్పుడు బంగారం మార్కెట్ ధరలను 1949 స్థాయిలో ఉంచడానికి వీలు పడదు. కేవలం స్వర్ణానికి మాత్రమే నూటికి 50 వంతులకు పైగా ధరల తగ్గింపు అనేది ఆర్థికంగా ఆచరణసాధ్యం కాదు.

స్వర్ణానికి మార్కెట్‌లో పలుకుతున్న రేటుకు, అధికారరీత్యా నిర్ణయిస్తున్న దానికి మధ్య ఉన్న తేడాను తగ్గించాలంటే రెండు చర్యలు తీసుకోవాలి. ఒకటి. ద్రవ్యోల్బణానికి స్వస్తి చెప్పాలి. దానివల్ల స్వర్ణం ధరలు మరి పెరిగిపోగల అవకాశం తగ్గుతుంది. రెండు: స్వర్ణానికి అధికార ధరను మార్కెట్‌లో పలుకుతున్న ధరతో సమాన స్థాయికి పెంచాలి. మార్కెట్ ధరను తగ్గించడం ద్వారా తేడాను తొలగించలేనప్పుడు, అధికార రేటును పెంచడ మొక్కటే తేడా తగ్గింపుకు మిగిలిన మార్గం. అయితే మన అదుపులో లేని పరిస్థితులవల్ల ప్రత్యేకంగా పెరిగినప్పుడు, స్వర్ణానికి అధికారికంగా నిర్ణయించే ధర మార్కెట్ పరిస్థితులను బట్టి పునః మార్పులు చేస్తూ ఉండాలి. అలా చేసినప్పుడు కాని స్వర్ణానికి బాహాటంగా, అంతర్గతంగాను ఉన్న ధరలో వ్యత్యాసం తొలగదు. స్వర్ణం దొంగరవాణా నిలిచిపోతుంది. ఇందుకు మినహా దాని పరిష్కారానికి మరొక మార్గం లేదు.

ఇలా ప్రత్యేకంగా లభించి, రూపాయి మారకం రేటులో అవాస్తవికతను స్పష్టం చెప్తున్నాయి, దీనిలోనే ప్రజలకు రూపాయి మీద స్థిరత్వంపట్ల విశ్వాసం తగ్గుతుంది. తాము పొదుపు చేసుకున్న మొత్తాలను ప్రతిఫలమివ్వని స్వర్ణంలో కాక, లాభాలు రాగల ఇతర మార్గాలలో పెట్టుబడి పెట్టడాన్ని ప్రోత్సహిస్తుంది. అయితే చిరకాలంగా రూపాయి విలువమీద అనుమానం ఏర్పడినందువల్ల, రకరకాల పన్నులు విధించినందువల్ల, కంపెనీల వాటాల ధరలు షేర్ మార్కెట్‌లో పడిపోయినందువల్ల స్వర్ణంపట్ల సంప్రదాయ సిద్ధంగా ఉన్న మక్కువ తగ్గుతుందనేది అనుకున్నంత సులభం కాదు. ప్రజల దృక్పథంలో ఇందుకు సంబంధించిన మార్పు తీసుకురావడానికిగాను 22 క్యారెట్ల, 24 క్యారెట్ల బంగారపు నగలు నిషేధిస్తూ శాసనం చేసినా లాభంలేదు. దీనివల్ల అలభ్యంగా ఉన్నందున స్వర్ణానికి ఇంకా పెరిగిన విలువకు తోడు, హెచ్చు క్యారెట్ల స్వర్ణం పట్ల ఉన్న మోజు కూడా చేరినందున, ఇప్పుడు కాకపోయినా మరొకప్పుడు హెచ్చు క్యారెట్ల బంగారపు నగలు చాటుగా చేయించుకొనడమనేది పెరిగిపోగలదు. అంతేకాదు. స్వర్ణంపట్ల ప్రజలకు గల మక్కువ తగ్గించడానికి 14 క్యారెట్లకు మించిన బంగారపు నగలు చేయించుకొనరాదని నిషేధించడం సవ్యమైన మార్గం కాదు. హెచ్చు క్యారెట్ల నగలు చాటుగా చేయించుకొనడం సాధ్యపడనప్పుడు, తక్కువ క్యారెట్ల నగలు హెచ్చుగా సేకరించడానికి ప్రజలు అలవాటు పడతారు. ఇందువల్ల స్వర్ణం వాడకం అందుకు సంబంధించిన అలవాట్లు పెరగగలవే కాని తగ్గవు. "బ్లాక్ మనీ" ని స్వర్ణంలో దాచుకొనడానికి సంబంధించినంత వరకు, స్వర్ణం క్యారెట్లను కంట్రోలు చేయుడ మనేది దానికి వర్తించదు. ఇలాంటి గుప్త నిధులు గుప్తంగానే ఉంటాయి. కనుక స్వర్ణ నియంత్రణ నిబంధనలకు అవి అంతుపట్టవు.

కనుక స్వర్ణ నియంత్రణ విధానం ఫలించాలంటే, పైన పరిశీలించిన మార్గాలేవీ కాక స్వర్ణానికి మార్కెట్‌లో పలికే రేటు మేరకు అధికారరీత్యా చెలామణీ చేయిస్తున్న రేటును పెంచడం ఒక్కటే సవ్యమైన మార్గం కాగలదు. ఆశించిన సత్ఫలితాలను ఇవ్వగలదు. (1963 మార్చి 31 న బెంగుళూరులో ఫోరం ఆప్ ఫ్రీ ఎన్‌టర్‌ప్రైజెస్‌వారి ఆధ్వర్యాన జరిగిన సభలో చేసిన ఆంగ్ల ప్రసంగానికి అనువాదం ఈ వ్యాసం.)

---

# బా ల మే ఘ ము

## శ్రీ జి. వి. కృష్ణారావు

మింటి మేడలోపలివారు కంటగూర్కి
నట్లు కనరాదు రేయి రేయంత ఒకటె
మూల్గొకటె యేడ్పొకటె పెదబొబ్బ వారి
పాప కేదొ కడుపునొప్పి వచ్చెనోయి.

బల్లిదపు గొండతెలి నీలిపాగ జుట్టు
కొనియె పెనుమోపు తలకెత్తుకొనునొ కాక
గరువై జెట్టితో చేయి కలుపునేమొ
ఈ దురుసుచేత తగున? వారింపవమ్మ!

ఆకతాయనై మొయిలు పారాడిపోయి
యేదియో బ్రమింగ లేకున్న నిట్టులేల
బొళుకు బొళుకున తావెళ్ళ బోసికొనును?
వచ్చె కాలుసేతులు దీన వదలరాదు.

కట్టివైచిరి కాబోలు పట్టికొండ
కొమ్ములకు మత్తదంతావళమ్ము లవిగొ
ఘీంకరించుచున్నవి చెవులొ గింగురనగ
కడుపులో చుఱ్ఱుమనెనేమొ విడిచిపుత్తు.

విచ్చుకత్తులాడును వినువీథిలోన
మొదలుపెట్టిరి కాబోలు బొమ్మలాట
రామ రావణ యుద్ధమ్ము కామితమ్ము
భారత రణమ్ము నేత్రపర్వతముగ గాంతు.

కావురులు గ్రమ్మె దిక్కు లేకమ్ముగాగ
చిచ్చువెట్టిరి గగనాన గ్రుచ్చులెవరొ
సీటి బిందియలందిమ్ము నెగడులెగసి
యొగడు సేయకమున్న చల్లార్పవలయు.

కొదమపొట్టేళ్ళ రేచి డీకొల్పి రెవరొ
పెఠిలు పెఠిలుమన్న ధ్వనులు వినగనయ్యె

## బాలమేఘము

తలలు వ్రస్సి కాబోలు రక్తమ్ము వడియ
గట్టి చూడుమా పడమటి కనుమలందు.

కడగి మెటగన్న ఒక్కరిక్కయును గాన
బడదు సుడిగాలి వానకు జడిసిపోయి
తల్లి వెనుకమాటున కేగి దాగికొనెనొ
ఇంత పిరికివారెట్లు మిన్నెక్కినారు ?

వేనితోగాలి పందెమ్ము వేసినాడొ
వ్రేళ్ళతో గూడ వ్రాకుల వెళ్ళగించు
కొనుచు దూకె అంధనృపతి కొడుకు తొడలు
సురుముగొట్టిన భీముండు చుట్టమేమొ?

వింత విల్లెవ్వడే యెక్కువెట్టినాడు
లక్ష్యమేమొ తాగోరు ఫలమ్ములేమొ
వన్యవేదండ తండమ వధ్యమనుచు
చదువడా యేమి యీపాటి చక్కనయ్య!

గుండెలే వెంతగ నవియగొట్టుకొన్న
మండి చావదు మనప్రొయ్యి మొండికత్తి
ముమ్మరమ్ములీ క్రొంబొగల్ పుడమిగ్రమ్మ
యుద్గమింప ఏ రాకాసి యూదెనమ్మ?

ధరణి ధరములు తమ బాహు దండములను
వైచుకొన్న జరీకండువాలు గనుము
వెదకి వెదకి యే యంగళ్ల విలిచికొనెనొ
అట్టి దొకటున్న తలపాగ చుట్టుకొనవె ?

మింటగోరాడు నవలీల మేఘములకు
పుడమిపైనెట్లొ కాలమ్ము పుచ్చునీకు
ఏటి సంగాత మిదివట్టి నీటివ్రాత
వారి గర్జలు నీకేల బర్హిరాజ!

క్రూర ముష్టి మూర్ధమ్మున గ్రుద్దినట్లు
కొంప లెన్నియో గాలికి కూలబడియె
చెక్కుచెదరలే దీతాకు చిట్టచివర
పిచ్చుకమ్మగట్టిన వడ పీచుమేడ.

---

# అముద్రిత ఆంధ్రనానార్థ నిఘంటువు



### శ్రీ తుమ్మపూడి కోటీశ్వరరావు

ఈ శీర్షికతో 63 మార్చి భారతిలో వచ్చిన వ్యాసముపైనే నొక లేఖ ఏప్రిల్‌లో ప్రకటించాను. దానిపై మే—భారతిలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారొక లేఖ ప్రకటించారు. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి ప్రతి లేఖకు సమాధానం చెప్పవలసిన బాధ్యత వుంది కాబట్టి వ్రాస్తున్నాను.

ఆ లేఖలో వారు ప్రకటించిన వాక్‌శౌచమునకు మూడు నాల్గు ఉదాహరణములు.

(1) (నాకు) "ఆంధ్ర నిఘంటువులు వాని స్వరూపము, శబ్దార్థములు, భాషా సంప్రదాయ పరిజ్ఞానము శూన్యము'

(2) "ముద్రితములైన నిఘంటువుల మొగము చూడనప్పుడిక యముద్రితమైన వానినిగూర్చి వీరి కేమి తెలియగలదు."

(3) "నిఘంటువులలో నివి యముద్రితములైనవి, ఇవి ముద్రితములైనవన్న పరిజ్ఞానమే లేదు."

(4) "అపరిణత బుద్ధులు—ఆంధ్ర భాషా పరిజ్ఞాన శూన్యులు"

ఇలా సాగింది. వారి కంత వాక్ శౌచసిద్ధి వుంది. వారిలా వ్రాసినప్పుడు నేను సుకుమారంగా వ్రాయటం దోషం గదా.

మన భాషలో నిఘంటువులు స్వల్పాతి స్వల్పం—ఇది నావాక్యం. వారి విమర్శన "ఏ భాషలోనైన కావ్య నాటకాలన్ని యుండునా!" చూశారుగా వాద వైఖరి! నా మాటకే అర్థం శబ్ద శక్తి ననుసరించి లాగారో? ఒక్కొక్క కవిపైనే నిఘంటువులు వెలయించుకొన్న ఇంగ్లీషులోనే 25, 30 కి మించి లేవే. మన భాషలో ఉంటయ్యని ఎవడనుకొంటాడు. వివేకమున్న వాడనుకోడు. నా భావం ఇంకా పెరగాలనేగాని కావ్యాలన్నీ ఉండాలనికాదు. విపులంగా ప్రతిదీ వ్రాయాలి.

ముద్రిత నిఘంటువుల లెక్క తెల్పాలట. ఎందుకో అందరికీ తెలిసిన విషయం వ్రాయటం కూడా పరిశోధనా? పరావిద్యా?!

మన నిఘంటువుల సముద్ర మన్నాను నేను. ఉదాహరణలు చూపలేదట నేను. వారి కది కోపం. ఏది ప్రసక్త విషయం, ఏది కాదు తెలిస్తే ఇలా వ్రాయడం పొసగదుగదా. మార్చినెలలో వచ్చిన వ్యాసం చదివినా, ప్రబంధ పారిజాత పీఠిక చూచినా తెలుస్తుంది. ఈ మాట చాలమంది అంటున్న మాటే. ఈ లేఖాకర్త తామ శబ్ద రత్నాకర అనుబంధ పీఠికలోనే సూర్యరాయాది నిఘంటువు లసమగ్రమన్న వ్రాత లున్నవి. ముందూ వెనకా ఆలోచించుకోకండా వ్రాస్తే ఎలా. ఉదాహరించలేదని మళ్ళా పోట్లాడుతారు కాబోలునని వారి పై గ్రంథ పీఠికలోనివి వ్రాస్తాను.

"అనుకూల సాధన సహాయ సంపత్తి లభించిన ఒక ప్రామాణికమగు సమగ్రాంధ్ర నిఘంటువును తయారు చేయగలను"—ఎందుకో? మన కున్నవిగా వారి వాదం ప్రకారం. ఈ వాక్యానికి నే నన్న పై వాక్యాలకూ ఏమైనా భేదం ఉన్నదా?

ముద్రిత గ్రంథాల్లోనే (శబ్దాలు) నిఘంటువుల్లోకి ఎక్కటం లేదే—అముద్రిత—అలభ్య గ్రంథాలమాటేమిటి? అని నే నంటే వీరు "ఈ వాక్యమునుబట్టి లేఖా కర్త నేడు వ్యాప్తిలోనున్న సూర్య రాయాంధ్ర శబ్ద రత్నాకర నిఘంటువులను చూడనే లేదనుట స్పష్టము" ఏ వాక్యము? అంటే—"అముద్రిత కావ్యాలు, గ్రంథాలు—అందులో శబ్దాలు" అని ఉద్ధరించారు వీరు. అందులో అలభ్య—అన్నమాట కబళితమైనది. అముద్రిత గ్రంథ శబ్దాలన్నీ ఎక్కినవని వారు చెప్పగలరా? అసలు ముద్రిత గ్రంథాలలో ఎక్కినవి గనుకనా? వారి దృష్టిలో సూర్యరాయం అసమగ్రము. (శబ్ద రత్నాకర అనుబంధ పీఠిక చూడగలరు) శబ్దా రత్నాకరములో వీరి పరిష్కరణలోనైనా ఎక్కని వెన్ని శబ్దాలు, కొల్లలు. కొన్ని చూపిస్తే సరిపోతుందిగా మచ్చుకి—

ఒయ్యాక చేయు—చోగ—బమ్మాచారి—ధర్మపుదార—విసంచుజేయు—తిరువళకు—మిట్టిమీనై అదల్పు—పల్లెరము పెట్టు— కూచి మారములు సేయు— గాజు గడపినట్లు గడవు—కన్నాస—జేజేలాగు—బుల్బె—చూరి—మలప మందులు—చవిరెచల దుబ్బ — తిరువతి కొప్పు— మిటకరించు, వెదావెద—పరిటే—ఎన్నని వ్రాసేది. అన్య దేశాలని కొన్ని ఎక్కించారు. అందులో ఇంకా ఎక్కవలసిన వెన్ని—ముఖాము—గులాము సేయు—హదురావు—బులావు—పరదారు—అసమగ్రమంటే అనకేం చేస్తారు మరి. దానికి బుజాలు తడుముకోవడం దేనికి ? ఇవన్నీ ప్రసిద్ధ కావ్యాల్లోనివే.

## మన శ్శౌచము

ఇది బహుముఖాలుగా కన్పిస్తున్నది.

1. వాదవైఖరి:—నేను సంయుక్తా సంయుక్తాక్షర ప్రాస దోషమని కంద పద్య మొక టుదాహరించాను.

బర్హి — దీనిపై వారు వ్రాస్తారు. బరిహి శబ్దం
బరిహి — బర్హికి రూపాంతరమనీ పైగా నన్నె
బర్హి — చోడుడు దీనిని ప్రయోగించాడనీ—
బరిహి — అది నేను చూడలేదని

అందుచే పై ప్రాస ఒప్పే! ఇది వాదం. నే నా కవి ప్రయోగం చూడలేదట. వీరికి తెలిసింది. అసలు సందర్భ మేమిటి? ఏది ప్రసక్త విషయం—ప్రాస. రూపాంతరంకాదు. వారి వాదం ఎక్కడైనా ఇంతే. "నారాయణ శబ్ద భవం నన్నయ కాదు" వా రీ సిద్ధాంతంచేసి ఉపపత్తి "నేడు సత్యనారాయణ అన్న పేరును సత్య నన్నయ అనుట లేదుగదా. పై సిద్ధాంతాని కిది ఉపపత్తి. ఇదెలా ఉందం టే—వెంకయ్య, ఎంకయ్య, ఎంకన్న వెంకోజి—ఇత్యాది శబ్దాలకు "రావు" చేర్చుట సహజంగా లేదు. అందుచే నివి వేంకట శబ్ద భవములుకావు అన్నట్లుంది. బరిహి శబ్దం నన్నెచోడుడు ప్రయోగించా డన్నది తెలియక పోవటానికి కదేమైనా పీశర—పాకవాదమా? పీలుపాక వాదమా?

2. ప్రాస ప్రకరణము:—పైన చూపిన పద్యంలోని ప్రాస దోషమంటే రూపాంతరం కాబట్టి తప్పు లేదంటారు పరిశోధకులు. కాల్బలము—కాలుజంము—నొవ్వు, వోవు ఇత్యా దులు ప్రాసలుగా వాడవచ్చునని లాక్షణికు డెవడైనా చెప్పి నాడా?

3. యతి ప్రకరణం:—నేను 15 పద్యాలలో (2 గీతాలు 13 కందాలు) 22 యతి దోషా లున్న వన్నాను. వారు "చాల చోట్ల యతి పాటించబడిన" దంటున్నారు. చాలచోట్ల అంటే మిగిలిన 12 చోట్లలోనా?

"ప్రాణవు దన భార్య లేని వానికి పేరున్" ఇది తప్పని నా మతం. వారి మతం ఒప్పని. ఎందుచేత ? ఇది సంభావన వడియట! అప్పకవి దీన్ని సంభావించాడో, అసంభావించాడో అప్పకవీయం మళ్ళా ఒకసారి చూడాలి. ఈ యతి రెండు రకా లుగా ఒప్పు అని వా రనవచ్చు.

1. బూకరింపు 2. అప్పకవీయం మరచిపోవటం.

రెండవది కాకపోవచ్చునేమో. ఏ పద్యం ఉదాహరించి అప్పకవి ఈయతిని తృణీకరించాడో ఆ పద్య పాదమే వీరూ ఉదహరించారు కాబట్టి. పోతే మొదటిదే అయియుండవచ్చు. ఈయతిని అప్పకవి అగ్రాహ్య యతుల్లో చేర్చాడు. కాబట్టి ఇది ఒప్పనటం అసమంజసంగా వుంది. పాఠకుల సౌకర్యంకోసం అప్పకవీయంలోని వాక్యా లుద్ధరిస్తున్నాను.

"ధర పఫబ భమాక్షరములు—
పరువడి ఈ యేసుగూడి వాతో జెల్లున్
వరి సంభావన వడియన—
మరుదీపము లేమ కీరవాణి యనంగన్—

పంచ వర్గాక్షరము లైదింటితోను పబల కభేదయతి గాన ప్రథమ ద్వితీయ చతుర్థ వర్ణములు వకారమునకు వభేద యతులుగాన నవి నిలుచును.

మకారము నడవదు.ఇది విచారింపక చెప్పినాడు గాన నిదియు నయుక్తమని తెలిసికొనునది."

4. శబ్ద ప్రకరణము:—శాస్త్రి దోషాల క్రింద శబ్దాల్ [illegible] ఉదహరించారు. [illegible] ఉప్పలేదు [illegible] శ్వాసంలో ఇట్లా వ్రాయటం [illegible] రొప్పన్న విషయం— ఒక్కగ్రంథంలో ఎందుకు వ్రాస్తాడు? దీనినిబట్టి అది పొరపాటు. [illegible] కానప్పు. నాదిచ్చిన ఉదాహరణలు.

1 దివిషద్వంద్యా— ధ్రువ సన్నిభా.
2 ఈశ్వరీ— ధ్రువము.
3 ధృత వ్రక్షధర— ధ్రువ రోధ.

మొదటి దాని పాఠం నా ప్రతిలో (ఇది శ్రీ [illegible] సూర్యనారాయణ శాస్త్రిగారు పరిష్కరించినది)లో ధృవ లనే ఉంది. అదే [illegible] గదా. కాదు తప్పే. ఇలాంటి వాయన చాల చోట్ల చేశారు.

వనజనగిరి — [illegible] — [illegible]

ధనవప్లుతము— [illegible] (ఇది [illegible] సూచించారు.) అసలీ ఆశ్వాసం ప్రారంభిస్తూనే అప్పకవి—

నేను రచించిన వృత్తపి—
లానములో నొకటి రెండు దప్పుండినని
ద్యాపిధులు కవు పదములు,
లోనారసి యతులు గణములును దెలియుడగున్.

అని వ్రాసుకొన్నాడు. ఏం చేస్తాము మరి, ప్రమాదో ధీమతా మపి కదా. కావున యతి దోషమే.

ఇందులో ధృవముగ బదులు నా దగ్గరి ప్రతిలో దృఢముగ అని ఉంది. అపుడు ఒప్పే.

మూడవదీ యతిదోషంగా అంగీకరించటమే సమం జసం. ఎందుచేత నంటే అసలీ ధృ—ద్రు— దీని ఉచ్చారణలో చాల దగ్గరతనమున్నది. కవులు వ్రాసేటప్పుడు యత్యక్షరము లను ఉచ్చారణ సాదృశ్యమునుబట్టి గాని—లేక పొరపాటున గాని క్వాచిత్కముగా వ్రాయడం దోషంకాదు. ఐనా శత్రులు అనే వ్రాయాలిగాని శత్రు అని వ్రాయరాదు. అని అప్పకవే ప్రథమాశ్వాసంలో సిద్ధాంతం చేశాడుగదా. ఇంకా రగడ ఎందుకు ?

నిఘంటువుల్లో యతి దోషాలు దోషాలు కావని వారి వాదం. "తెన్గు భాషకు ముఖ్యాతి ముఖ్యములు యతి ప్రాసలు" అని వారే మార్చినెల భారతిలో 74 వ పేజీలో వ్రాశారు. ఇక్కడ అక్కఅలే దంటారు. అది ప్రబంధమని వ్రాశా ననవచ్చు. అక్కడా అక్కఅలే దనవచ్చు భావ సౌంద ర్యాదిక ముంటే. అసలు యతిప్రాసలు పద్యానికి కావలసినవి. ఆ పద్యం నిఘంటువులోనిదైనా—ప్రబంధంలోనిదైనా ఒకటే. అవి పాటించకపోతే పద్యందాకా ఎందుకు ? ఐనా దోషం దోషంగా చెప్పినప్పుడు అంగీకరించటం మంచిదిగదా.

5. వ్యర్థ శబ్ద ప్రయోగ ప్రకరణం:—ఆ నిఘంటువులో సానుగ వంటి వ్యర్థ శబ్దా లున్నవని నా వ్రాత. వారి వ్రాత "సన్నయుతో మున్న సానుగలకు వేరే అర్థా లున్నవి కాబోలు" నని ఆశ్చర్య ప్రకటన చేశారు. ఈ వాక్యం నేను చెప్పిన మాటను పోషకమే గాని ఖండన కాదుగదా. ఆ నిఘంటు పద్యాలకు విద్వాంసులుని అవ్యుత ప్రవాహానికి పోలిక ఎందుకు గాని ప్రస్తుతం వ్యర్థ శబ్ద ప్రయోగా లంగీకరించినట్లే గదా. మా కదే పదివేలు.

"ఈ నిఘంటువు పరిష్కరణ దుస్సాధ్యంలాగా ఉంది" నా వ్రాత. "అపరిణత బుద్ధులకు—ఆంధ్రభాషా పరిజ్ఞాన శూన్యులకు ఇది దుస్సాధ్యం. శక్తిగలవారికి సుసాధ్యమే" వారి వ్రాత. ఔను ఎవరు కాదన్నారు. నేనూ అదే అర్థంలో వ్రాశాను. జాగ్రత్త కలవాళ్లు దాన్ని పరిష్కరించగలరు. అలాగే చేయాలి.

ఐనా వారి వాక్యమే ఉదహరిస్తాను.

"ప్రాచీన గ్రంథ పరిష్కరణ దుష్కరమగు కార్యము" ఈ శ్రీ సూక్తి వినిదే (మార్చి భారతి 73 వ పేజీ) "సంపృక్తం బయ్యెను బుద్ధి మాంద్యము."

శబ్దతత్త్వం—భాషా సంప్రదాయం ఎవరికీ తెలియదు. వీరికే తెలుసు. వారి శబ్దతత్త్వ పరిజ్ఞానమునకు ఒండు రెం డుదాహరణలను వారిమధ్య పరిష్కరించిన శబ్ద రత్నాకరమున అన్య దేశ్యముల నుండి ఉద్ధరిస్తున్నాను.

శబ్ద తత్త్వము.

సిపాయి—ఇంగ్లీషు.
టోపీ—ఉర్దూ.
కాగ—చైనా భాషాపదము.
శబ్దస్వరూపము
ఉలిపాకు—హిందీ ఉల్ఫా.
అర్థజ్ఞానము.
త్రేణి=వెదకు—అర్థమట.
అలివపూర్ణేందుభీతీః దదశ్మశాల



త్రేణి—(ఆముక్త 5—146)—అభినవ మల్లినాథుల టీక చూడాలి. (కీ. శే. వేటూరివారీ శబ్దానికి ఇంకా కొన్ని అర్థాలు చూపించారు. అవిందులోని కెక్కలేదు).

వారికి తెలిసిన శబ్ద తత్త్వము ఇలా ఉన్నది. ఐనా తామే ఈ భాషా సముద్రానికి అగస్త్యుల మన్నట్లు వ్రాస్తారు.

"శత తమోగుణక భూతముల....వలన,—అఖిల జగములు సంభవించె"—పరమ యదార్థము.

ఆర్యా !

జూలై నెల భారతి 79, 80 పుటలలో పై శీర్షికలో శ్రీ కస్తూరి విశ్వనాథ్ (తిరుపతి) గారి లేఖ ప్రకటిత మైనది. అందు వారు 'మార్చి భారతి యందు గల "అముద్రిత ఆంధ్ర నానార్థ నిఘంటువు" అను వ్యాసమును పేర్కొనుచు, తెలుగుభాషలో సరియైన నానార్థ నిఘంటువు లేకపోవడంచేత నెన్నియో యుత్కృష్ట కావ్యముల యందు గల మారుమూల పదములయందు గల శబ్దముల కర్థములు తెలియకపోవుటయు, సాహితీవేత్తలు వానిని సంస్కరించి పాఠాంతరములు కల్పించుట జరుగుచున్నది. కాన నిట్టి నిఘంటువులను సత్వరమే ముద్రించినచో నాంధ్రభాష కెంతయో సహాయకారిగా నుండగలదని వ్రాయుచు, నిటీవల నాయొద్ద 84 పద్యములు గల నొక నానార్థ నిఘంటువు కాగితపు వ్రాతప్రతి లభ్య మయ్యుసదనియు తెల్పిరి.'

ఆ ప్రతిలో చాలా కాగితములు చినిగిపోవుట వలన 84 పద్యములు మాత్రమే దొరికినవట. అందు 81 కందములు 2 ఆటవెలదులు 2 సీసపద్య పాదములు గలవట. వాటి యందు గల ఛందో దోషములు, చాలావరకు లేఖక దోషములే నముచు, కొన్నింటిని నిరూపించి చూపించు కొరకు వారు 8 పద్యముల నుదహరించిరి. లేఖాకర్త నేను చూపిన పద్యముల తమ ప్రతితో పోల్చి చూచినాడట. అందులో నా పద్యములు లేవట. లందుచేత నొకే కవిచే వ్రాయబడినవో ? కావో ? యని తమ సందేహమును వ్యక్తపరచిరి. కాన నేనీ లేఖ వ్రాయుట సంభవించినది.

నేను శ్రీ కస్తూరి విశ్వనాథ్‌గా రుదాహరించిన పద్యముల నన్నింటిని నా యొద్దగల వ్రాత ప్రతితో పోల్చి చూచితిని. కాని వా రుదహరించిన పద్యము లిందును లేవు. అందువల్ల వారియొద్ద గల పద్యములు వేరొక కవిచే వ్రాయబడి యుండవచ్చును. ఇట్టి యుత్తమ నిఘంటువు సంపూర్ణంగా లభ్యముగాకపోవడం చింతించవలసిన విషయమే. దీని ప్రత్యంతరములకోన మాంధ్రదేశము యత్నించుగాత !

ఏది ఏమైనను దొరికినంతవరకు భద్రముగా నుంచి బైటపెట్టినందుకు సాహితీ జిజ్ఞాసువులు సంతసించవలసినదే. ఉత్తమ సాహిత్యము వెలువడవలయునన్న, శబ్ద స్వరూపమును, దాని నానార్థములను గ్రహించుట ముఖ్యాతి ముఖ్యము. నిర్దుష్టమయిన యర్థములు తెలుపవలసినవి పద్యమయ నిఘంటువులు. కాన నిట్టి నిఘంటువులను సంస్కరించి ముద్రించడ మత్యవసరము. అనుకూల సాహాయ సంపత్తి

లభించిన 'ఆంధ్ర నానార్థ నిఘంటువు' ను ముద్రింపజేసి ఆంధ్రమహాజనుల కందజేయగలరని విన్నవించుచున్నాను.

సాహిత్యప్రియులకు ముదావహముగా నుండుటని యందలి పద్యముల కొన్నింటి నీ క్రింద జూపుచున్నాను.

1. క. భియనగ రాజులకు దగు
భీ యనగను భయము నయము భీకర మొప్పన్
భియన శత్రుల పేరును
భీయన రణమునకు పేరు భియన కోపమ్.

2. క. గోత్రంబన దాయాదులు
గోత్రంబన పర్వతములు గోరెంకసుమీ
గోత్రంబన గోవులు నగు
గోత్రంబన భూమి పేరు గురుతుగ వినుమా.

3. క. భావంబన మనసుకు దగు
భావంబన బుద్ధి పేరు భావము తెలివౌ
భావమన చిత్తదుఃఖము
భావంబన చంచలంబు బాగుగ జూడన్.

4. క. కుడ్యంబనగ గవాక్షులు
కుడ్యంబన గోడకున్ను గింజ్లకు పేరున్
కుడ్యం బనగను చూరులు
కుడ్యంబనగనులపేర్లు గురుతుగ వినుమా.

5. క. ముఖమన యాగము పేరును
ముఖమన ఇంద్రునకు పేరు మామిడి పేరున్
ముఖమన పార్వతి పేరును
ముఖమన బల రక్కసియును మరి మరి చూడన్.

6. క. గాంగేయము బంగారును
గాంగేయము వెండి రాగి కంచుకు పేరున్
గాంగేయు మనగ ఇత్తడి
గాంగేయము తేనె నెయ్యి గౌరవ ముఖ్యా.

7. క. కరవీర మనగ బలుసును
కర వీరము కంద జీడి కాకరచెట్టున్
కరవీరము పెద తంగేడు
కరవీరము జీడిపలుకు గురుతుగ వినుమా.

హస్నాబాద నాగలింగశివయోగి
(మహమ్మదాబాద్)

# బ్రౌన్ నిఘంటు పునర్ముద్రణ

అయ్యా !

1963 ఆగస్టునెల భారతి పత్రికలో బ్రౌన్ నిఘంటువు పునర్ముద్రణాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, నిఘంటు సంపాదకులు శ్రీ నిడదవోలు వెంకట్రావు (మద్రాసు) గారు వ్రాసిన లేఖలు రెండూ చదువగా రెంటికీ ఉత్తర దక్షిణాలంత సన్నిహితంగా ఉన్నది. ఇరువురి ప్రకటనలూ పునర్ముద్రణ పని ఎప్పుడు మొదలైందో, ఏ సంగతీ ఇప్పటికీ తెలియకపోగ ఇరువురికీ భేదాభిప్రాయాలు ఉన్నట్లు మాకు తెలిసేలా చేసుకున్నారు. ఇంతకీ 1962 ఫిబ్రవరి 21 వతేదీ సమావేశం జరిగిందో లేదో కూడా సందేహం కలిగించారు. సమావేశం జరిగి భేదాభిప్రాయాలు వచ్చియుంటే ఎందుకు వచ్చాయో? యేలా వచ్చాయో కార్యదర్శిగారు ప్రకటించవల్సింది. వారు ప్రకటించలేదు. వెంకట్రావుగారు సమావేశమే జరుగంది భేదాభిప్రాయాలు యేలా వస్తాయి, వ్రాతమూలకంగా కూడా ఏమీ తెలియజేయలేదు, అని అనడంతో మరియు ప్రధాన సంపాదకులు ఈ విషయమై యేలాటి ప్రకటనా చేయకపోబట్టినై ఇరువురి వ్యవహారాలు గమనిస్తే ఇందులో ఏదో గొప్ప గూడుపుఠాణి జరిగే ఉండాలని, దీనిని అందరూ కప్పిపుచ్చడానికే ప్రయత్నిస్తున్నారని అనుకోవల్సి వస్తుంది. వీరి కథలేలా ఉన్నా అసలు ముద్రణ జరుగుతుందా? జరగదా? అనే సంకోచం హెచ్చయింది. లేకలేక వేట కెళ్లితే లేడిపిల్ల కరువైనట్లు యేదో శుభమా అని బ్రౌన్ నిఘంటువు పునర్ముద్రణ జరుగుతుందనుకొంటే దానికి భేదాభిప్రాయాలే మిగిలాయన్నట్లుంది మన వ్యవహారం. ఇదే నిజమైతే మనక్క ఇంతకంటే శోచనీయం మరేదీ లేదు.

ఎస్. గోపాలరెడ్డి,
సామిరెడ్డిపల్లె.

# గ్రంథవిమర్శనము

## మధుపాలిక

(ఉమరు ఖయ్యాము రచనకు స్ఫూర్తిశ్రీ యనువాదము. మూల్యము: రెండు రూపాయలు. ప్రతులకు : టి. భాస్కరరావు, ఏ. సి. కాలేజి, గుంటూరు.)

"మధుపాలిక" యను నీ కావ్యము "స్వామి గోవింద తీర్థ సంకలించి యాంగ్లములోనికిఁగూడ ననువదించిన "The Nector of grace" అను గ్రంథమున కనువాదము. ఉమరు ఖయ్యాము రుబాయీలకు నిటీవల వచ్చిన యనువాద మిది. "దానియందు వెయ్యి రుబాయీలకుఁ బైఁబడి యున్నవి. విమర్శనాత్మక మయిన పెద్ద పీఠిక యున్నది. అందలి కొన్ని పద్యములను మాత్ర మేరుకొని, కొన్ని యితర సంపుటముల నుండి కూడఁ గొన్నింటి నెన్నుకొని యనువాదము చేసితిని. ఈ యనువాద విషయమున నా కాదర్శముగా నిల్చినవారు భర్తృహరి సుభాషితముల ననువదించిన ఏనుఁగు లక్ష్మణకవి, కృష్ణకర్ణామృతము ననువదించిన వెలఁగపూడి వెంగన. మూల పద్యము లక్షర క్రమములో నుండును. నేను వానిని విషయానుగుణముగా విభాగించి, వేర్వేరు శీర్షిక లుంచితి" నని గ్రంథకర్తగారు పేర్కొనిరి.

నవ్యాంధ్ర సాహిత్యమందు ఉమరు ఖయ్యాము రుబాయీల కనువాదము లనేకము లున్నవి. గ్రంథకర్తగారి గణనము ప్రకారము పదేనుగురు కవు లనువాదకులు గలరు. వారిలో పెక్కురు ఫిట్ జెరాల్డు ననుసరించిరి. ఆ యనువాదములలో కొన్ని భావానువాదములు. కొన్ని యథా మూలానువాదములు. కొన్ని స్వతంత్రానువాదములు. పారశీక భాషను వదితములగు వానిలో బరువును బట్టి యుమరాలీషా కవి కావ్యము పెద్దది. కాని రామిరెడ్డిగారి "పానశాల" కు వచ్చిన ప్రతిష్ఠ మఱిదేనికిని రాలేదు. రామిరెడ్డిగారికి కూడ పానశాల ప్రతిష్ఠ వలన చిరకీర్తి లభించినది. వారికి స్వామి గోవిందతీర్థ సంకలనము తెలియును.

స్ఫూర్తిశ్రీ గారి కావ్య పరిమాణము 249 పద్యములు, ఉమరుఖయ్యాము గూర్చి యొక "భూమిక" యిరువది యొకటి పుటలకు పరిమిత మయినది కావ్యాంతమున కలదు. ఈ భూమికలో వైపుల్య మెక్కువ. గ్రంథకర్త బహు పుస్తక పరిజ్ఞానము చాటున దది. అనువాదము కత్తిమీది సాము. అనువాదకు డొకవైపు మూలముపై కన్నుంచి మఱొకవైపు కావ్యగుణ సౌందర్యమునకు చిక్కము వేయవలయును. శ్రీ స్ఫూర్తిశ్రీ యీ విషయములో నొక కొంచెము నెగ్గలేకపోయిరేమో యని యనిపించును. అనువాదమునందుండవలసిన జీవశక్తి కొఱవడినట్లున్నది. భావముల బిగింపు మంద మగుటయే కాక మాటల సడలింపు కూడ ప్రాప్తించినది. కావ్య ప్రారంభమున కాక పోను పోను చిక్కదన మున్నది. కొన్నిచోట్ల భావము చెప్పవలసినవు డుపయోగించిన శబ్దముల మితి యెక్కువ యయినది. అందుచే పద్యబంధము లుప్త మయినది. "తారలు పాఱిపోవ నలుదారుల "వేకువ" రాత్రి పాత్రలో జోరుగ వైచె రాయి గొని". "నీ యన్వేషణమందు లోకమున మందీభూతమై పోయి వాలాయ మ్మోధిషణా ప్రభావము". "కోవిదులైనవారు "నీ— నా" లకుఁ దారతమ్యము తృణమ్ముగ నెన్న గణింప రెన్నడున్" మున్నగు పట్టు లిందులకు తార్కాణము. జిగి బిగి తక్కువైనదని సారాంశము. ఒక్కొక్క పద్యమునఁ బెక్కు వాక్యము లుండుటచే నదియొక సొగసు కన్పించును. ఈ సొగసు నెలయించుటలో స్ఫూర్తిశ్రీ రచనము రాటుతేలినది. మొత్తము మీఁద మధుపాలిక పాఠకులకుఁ బారవశ్యము కల్గింపలేక పోయినను సంతోష పెట్టగలదు.

స్ఫూర్తిశ్రీ రచనా పద్ధతి వారి పద్యమును రామిరెడ్డి పద్య మొకదానితో పోల్చి చూచిన తేటతెల్లము కాగలదు. స్ఫూర్తిశ్రీగారి పద్య మిది:

"రేలుఁబవల్ల గళ్ల నమరించిన యీ చతురంగపాళిపై
శీలగు బావులట్లు కదలింపఁగ నా విధి మానవాళిచే
వీలునుబట్టి నెట్టుకొని వియ్యముల్తై కవగూడి యంతలో
జాలిదొఱంగి చంపుకొని సందుక మందున విశ్రమించెడిన్.

మఱి రామిరెడ్డిగారి పద్యమును జదువుడు :

"ఇల చదరంగ; మందు జనులెల్లరు పావు; లహస్సులున్ నిశల్
దెలుపును నల్పుగళ్లు; కదలించును రాజును బంటుఁ దక్కు పా
వుల విధి యాటకాఁడు పలుపోకలఁ ద్రిప్పును శీగళ్ళమార్చు; న
వ్వల నొకటొక్కటిం జదిపివైచు నగాధ సమాధి పేటికన్."

స్ఫూర్తిశ్రీ గారు "సుందరి పొందుగోరి మనసుంబడి" యని యన్నారు. "మనసు పడు" ననుటకు మాఱుగా "మనసుంబడు" ననుట విచిత్రముగనే యున్నది. "ప్రేమికు" లనుట గూడ నిట్టిదే.

## ఋతుఘోష

(కర్త : గుంటూరు శేషేంద్రశర్మ. మూల్యము: రెండు రూపాయలు. ప్రతులకు : జి. ఎస్. రాజశేఖరము. రాజా మెడికల్ స్టోర్సు, టంకురోడ్డు, నెల్లూరు.)

"ఋతుఘోష" యందు రెండు భాగము లున్నవి. ప్రథమ భాగములో ఋతువు లారు నను క్రమముగా వర్ణింపబడినవి, ద్వితీయ భాగములో ప్రణయ కవిత్వము సమృద్ధిగా నున్నది.

# గ్రంథ విమర్శనము

"ఋతు సంహారము" కాలమునుండి యీనాటి వఱకు ఋతుశోభ కవులకే నెందఱనో పరవశింప జేసినది. కవు లెందఱో ఋతుగానము చేసిరి. ప్రాచీన కావ్యములలో వసంతర్తు శోభావర్ణనము, శరదృతు వర్ణనము బహుళములు. శ్రీకృష్ణదేవరాయలు చేసిన ఋతువర్ణనము అసాధారణము. నవీన కాలమున ప్రణయ కవితోపాసన చేసినవా రెల్లరు నంతయో యింతయో ఋతువర్ణన మొనర్చిరి. మఱి విశ్వనాథవారు తెనుగు ఋతువుల సొగసు నెత్తి చూపిరి. ఇతరులా మార్గమున పోయిరి. ఈనాడు శేషేంద్ర శర్మగారి "ఋతుఘోష" మన చేత నున్నది. ప్రాయికముగా ఋతువర్ణనము ద్వివిధములుగా కొనసాగును. ఆయా ఋతు పరిణామమునుబట్టి ప్రకృతి పొందు నామములను స్వదేశీయములను వర్ణించుట యొక పద్ధతి. ఋతుచక్ర గమనమును బట్టి వైయక్తికముగా తా ననుభవించు రేక సంపాదించు ననుభూతిని బహిర పుచ్చుట రెండవ పద్ధతి. ఋతుఘోష ద్వితీయ పద్ధతితో ముడివడినట్టిది. ఇందు కవి పొందిన యనుభూతి యసుడు, వేదన యనుడు, ఎక్కువ. ఎడనెడ ప్రకృతి పరిణామ వర్ణన మున్నది యత్యల్పము. తన యనుభూతిని, దీనుల యనుభూతిని వర్ణించినవారు శేషేంద్ర శర్మగారు. శర్మగారి యనుభూతి కొన్నిచోట్ల తత్త్వమయమై పెక్కు పట్టులలో వలపుతో దువాళించినది. దీనానుభూతి లేనిచో నవీన కవిత్వము లేదు గనుక యదియు "ఋతుఘోష" లో నిండియున్నది. కాఁగా శర్మగారి కవనములో రెండు నవీన కవితోద్యమముల ప్రభావ మున్నది. భావ కవిత్వము, అభ్యుదయ కవిత్వము ననునవే యవి. వీనికి సహజముగా నున్న తత్త్వ జిజ్ఞాస తోడయినది. ఈ ముప్పేటల పోహళింపే "ఋతుఘోష."

తెనుగు పద్యము రచించుటయే యొక కళ. పద్యమును మొదలుపెట్టుటలో, ముగించుటలో, విశేష్య విశేషణ సంయోజనములో, ఆయా గణముల కడ విరామము ప్రదర్శించుటలో, క్రియాపద నిర్వహణములో, పదముల కూర్పులో ఎన్నెని సొగసులు చూపించవచ్చును. ప్రాచీన కావ్యములలో తదితర కావ్యగుణము లెట్లున్నను శయ్యా సౌభాగ్య మాశ్చర్యావహముగా నుండును. ఈ గుణము సాధింపలేక యుత్తమ కావ్యములలో నిది యప్రధానమే యనువారు నే డున్నారను విషయమీ సమీక్షాకారునకు తెలియును. శర్మగారి కవిత్వము శయ్యా సౌభాగ్యము కలది. శ్రీనాథుని ప్రభావ మిందు స్పష్టముగా గోచరించును. ఈ కావ్యము నందలి పద్యములలో ప్రాచీన పద్యచ్ఛాయ లెక్కువ. క్షోదక్షమముగా ప్రాచీన కావ్యములు పఠించి తదనుభూతితో శర్మగారీ కావ్యములు పలికిరి. శ్రీనాథుని ప్రభావ మధిక మన్నాడను. అందుచే పద్యములు అబ్బురపు నడకల హొయలు చిమ్మును. శయ్య బిగింపే కాని యర్థపు సొంపుండదు. ఈ యుదాహరణములు చూడుడు : "నా కళ్యాణ హృదంతరాళ కల కంఠ స్వైర ఘంటాపథ వ్యాకీర్ణ స్వర మాధురీ లహరులై". "బాల కోమల దళవ్యాలోల డోలావళీ కేళీ మంజుల లీలలన్." "హృదయాగ్ని పర్వత మహా ప్రోష్ఠ రోషిత జ్వాలాజాల కరాళ జిహ్వికలు." "వర్షాగర్వ జమోఘ ...... కాలము వ్యేలన్నై". శ్రీనాథుని సీసపద్యముల పోకడ పుణికి పుచ్చుకొన్న పద్యము లనేకములు. శర్మగారు పద్యరచనా కళ యెఱుఁగినవా రనవారు. దీనికి కావ్యమంతయు సాక్షి. శర్మగారి యూహా వైభవమునకు "ఎవరో చాకలి ఉతుక్ మరద" యన్న పద్యము పరమోత్తమోదాహరణము.

భాషచ్ఛందో విషయములో శర్మగారెంతయో స్వేచ్ఛ చూపిరి. ఇది యంతగా—నియమబద్ధమగు ఛందస్సు స్వీకరించినపుడు— ప్రశంసనీయముగాదు. వీరు వాడిన యతులు విచిత్రములు. "లంఘపూర క్షేదః" "రంగపూర క్షేదః" యను వానికి లక్ష్యము లిందున్నవి. ఈ క్రింది యతులు బహు విచిత్రములు.

'ఇది వాసంత రసప్రవంత, యిది ధాత్రీ పుష్పమాలంబులన్'
'ఏ యనురాగవేగాంహరి మహిమాతిశయమ్మొ కాని'
'ఒక కంటన్ దుహినాంశు మండలము రెండో కంట
సుష్మాంశువుల్'
'హేమంతంబున రెక్క విప్పిన గులాబీపువ్వులా గున్నవే'
'అల్లిన గాథగా నవలగా కలగా కనుపించునంతయున్.'

ఋవళి, ఋత్వ సంబంధవళి, ఋత్వసామ్యవళి యను నవి యప్పకవి చెప్పిన యతులలో కలవు. శర్మగారు మొదటి రెంటిని మేళగించినారు. ఋవళిలో "ఋ—ఎ=రి. రీ. రె. రే మిత్రములు" ఋత్వసంబంధవళిలో "వట్టసుడికి—ఇ. ఈ. ఋ. ౠ, ఎ, ఏ లను కేవల స్వరములు చెల్లును" స్వాతంత్ర్యము వహించిన శర్మగారు తర్కము నుపయోగించి కాఁబోలు "ఇ, ఏ—రీ" లకు యతి వేసిరి. ఇట్టివానికి ప్రాచీన కవి ప్రయోగము లున్నవా ? మిగిలిన యుదాహరణము లెట్లు సమర్థనీయములో దురవగాహముగా నున్నది. ఈ కావ్యములో నింక అఖండయతు లున్నవి.

శర్మగారు శయ్యా సౌభాగ్యము పట్ల చూపిన శ్రద్ధ భావము వెలార్చు శబ్దముల పట్ల చూపలేదు. "కోవెల వంటి నా హృదయకుంజము", హృదయము ముందు కోవెల, తర్వాత కుంజ మన్నమాట. "నా మనో మధుర లతాలవాలముల మంజులభావ తుషారపూర వాక్సుధలను గ్రుమ్మరించు", భావతుషారము, వాక్సుధ—వీని పొత్తేమి ? తుషార మనగా తుంపర యనియా ? "జీవిత యొడారు" అనుట దోషము మాట యటుంచి శ్రుతి కటువుగా నున్నది. 43 వ పుట సీసపద్యమందలి వ్యావహారికాభాషాప్రయోగమువలన నే కవితా శిల్పసృష్టి జరిగినదో యర్థ మగుటలేదు. త్రివిధము లయిన భాష యుపయోగించుట నవీన కవితాలక్షణ మగునేమో కాని యుదాత్త కావ్యలక్షణము కాదు. "కూలీవాడు—కూలీజనుల్" కూలి హ్రస్వాంతము. దీర్ఘాంతము కాదు. భాషా స్వాతంత్ర్యమువలన కవితాకళ రిమూరు ననుకొన్నచో చెప్పవలసిన దేమియు లేదు.

రచనాశక్తి సంపన్నులగు శర్మగారొక కొంత సహృదయ హిత చిత్తముతో కావ్య మర్శించిచో అది రసవంతముగా నుండునని "ఋతుఘోష" చాటుచున్నది. అభిమానము మొహమాటము రెండు నేకమయినచో విమర్శ యెట్లుండునో "ఋతుఘోష" పీఠికలు చాటుచున్నవి. విమర్శ వ్యాఖ్యాతృ భేధానిష్ఠముగదా !

## దేవరకొండదుర్గము

(కర్త : ముకురాల రామారెడ్డి. వెల: రెండు రూపాయలు. ప్రతులకు : నవోదయ సమితి, హైదరాబాదు.)

ఇది ఖండకావ్యము. దీనిలో సాబాలు పద్య ఖండములు. శేషభాగము గేయములు. ఈ గేయములలో ప్రధానమై పాఠకులను పరవశింప జేయునది "దేవరకొండ దుర్గము". భావానుకూలమైన లయతో, ఊహావైచిత్రితో, చరిత్రగతావేశముతో ఈ ఖండ మానందము కల్గింపగలదు. అందుచేతనే కాబోలు ఈ కావ్యఖండ నామమునే యీ ఖండకావ్యమున కుంచిరి.

పద్య కృతులలో ప్రకృతియందు వైచిత్రి కలదు. కళా ప్రపంచమును గూర్చి, హాలికుల యాచారమును గూర్చి, ప్రకృతిని గూర్చి, ప్రాచీన కావ్యగత పాత్రములను గూర్చి రామారెడ్డిగారు చక్కని చిక్కని పద్యములు రచించిరి. అంతర్ముఖ చింతనము గల, రవీంద్రోపహారముగా నున్న, వ్యాజస్తుతి విందలు గల కవితా ఖండములు గలవు. గేయ కృతులలో "దేవరకొండ దుర్గం", "కవితా ప్రశస్తి" ప్రశస్తములు. కొన్ని యభ్యుదయ గేయములు. మఱికొన్ని లోకము నందలి మంచిచెబ్బఱలను చూపునవి.

తూరుపు గవని తువాతునకలై
కిరకిరమని
ఒరిగింది
కేకలు పెట్టుచు
చీకటి దయ్యము
పడమటి మొగమై
పారింది.

వంటి వర్ణనములు గలవు.

రామారెడ్డిగారిలో కవితాశక్తి సమృద్ధిగా గలదు. శయ్య, యూహ, రసభావము గల శక్తి యది. పాఠకులకు స్వానుభవము కల్గించు దక్షత గలవారు రామారెడ్డిగారు. అయిన నొకమాట. కావ్యకారణములగు మూడిటిలో రామారెడ్డిగారియందు ప్రతిభాభ్యాసము లున్నంతగా వ్యుత్పత్తి లేదు. వ్యుత్పత్తియే తగినంత లేదని, సమాధి గుణ మలవఱచుకొనవలయుననని, ప్రయత్నించినచో వారు వానిని సంపాదింపగలరని యీ ఖండకావ్యము ప్రకటించుచున్నది. ఒక్కొక్కచోట తెలగాణము మాండలికము లుపయోగింపబడినవి.

ఒక ప్రత్యేక ప్రణయసిద్ధాంతమునుబట్టి సూరపశాలీనుని సృష్టించెను. రామిరెడ్డిగారు దాని సొంత పోకశాలీనుని కేవలము ఇల్లటపు టల్లునిగా చూచిరి. ఇది యంత సమంజసముగా లేదు. బహుశః ఇది కావ్యములో నెడనెడ కన్పించు వారి హాస్య ప్రియతకు తార్కాణము గావచ్చును. రెండు మూడు చోటులలో భాష గ్రామ్య స్థాయికి దిగజారిపోయినది. అల్పదోషముల కేమిగాని దేవరకొండ దుర్గము పాఠకుల నలరింప గలదు. దీనిని పఠించి పాఠకుడు—

స్తబ్ధతాభరమున కృశించెడి
సత్వహీనుల గాన మిచ్చుట
చేతనా నికేతనము లెత్తిన
నేతలే యెల్లెడల నిచ్చుట.

యను కవిగారి మాట వారికే యప్పగింపగలడు.

—శాక్యసింహ.

## నా గేయాలు

(రచన : వెన్నం. వెల : ఒక రూపాయ. ప్రతులకు : వెన్నం బసవయ్య, పెదగాదెలవఱ్ఱు. వయా తెనాలి.)

"పూవులన్నీ మా వాసమే
తావులన్నీ మా కోసమే
వెన్నెలంతా మా హాసమే
వన్నెలంతా మా భాసమే."

ఎక్కడో ఒకచోట భావానికీ అర్థానికీ సమన్వయం కుదిరే శైలి కల్పించకపోదీ గేయాలలో.

"ఆకాశతిత్తులను" అధిగమించి, "వివిధ రాగ ఊవెలను" అర్థంచేసుకొని, "హీన చూపులు" ను తప్పుకొని, "గతము రాని రేయిలు" ను దాటుకొని, "రాలే పోతలు" ధాటికి ఆగి, "వరాలు వడికినది" "కనులు పూచినది" ఘట్టములందు భ్రమించక, "అనుభూతొందు" సంధులలో కలిసిపోక, "ధూళి కలుసునందాక" ఈ కావ్యమనే మహారణ్యమున పయనించినపుడు "పూలు" కన్పించగలవు. "తావులు" స్ఫురించగలవు. - "వెన్నెల" "వన్నెలు" చూడగలరు.

కవిగారి ఉత్సాహము ప్రశంసనీయము. గానము, చిత్రము, శిల్పము, కవిత్వము ఇత్యాదు లన్నియును "సాధన ముల మీద సమకూరు" నన్న పెద్దల సలహాను వారు మన్నించి ఈ గేయములనే పునఃపరిశీలన చేసి చక్కగా మలిచి ప్రచురించగల్గిన బాగుండును. ఆవిధంగా తయారైనపుడు వారి గేయాలలో,

"కోయిల గానం
మురళీనాదం."

అన్నీ విన్పించి కన్పించి పాఠకులకు సంతృప్తిని చేకూర్చగలవు.

ఆనాడు కవిగారు "మా లేఖినికి రావేమొ సుశ్రుతులు" అనే నిస్పృహను విసర్జించవచ్చును.

కె. సభా.

# గ్రంథ విమర్శనము

## రాఘవరెడ్డి రచనలు

ఖండకావ్య సంపుటి. వెల: రు. 2. ప్రచురణకర్తలు : సచ్చిదానందాశ్రమము, హనుమకొండ, వరంగల్లుజిల్లా.

"సావిత్రి", "రతివిలాపము", "గోపికా వల్లభా", "పరిదేవనము" అనేవి ఈ సంపుటిలో నున్నాయి. మొదటివి రెండు పౌరాణికాలు. మిగిలినవి రెండును శతకతుల్యాలు.

"సావిత్రి" ఖండకావ్యం. కవియొక్క శిల్ప కల్పనకి మచ్చుతునక. ఇతివృత్తం, ఎత్తుగడ, శిల్పపోషణ, భావం, భాష, ఉదాత్తంగా ఉన్నాయి. భారతంలోని సావిత్ర్యుపాఖ్యానం ఆధారమై యున్నట్లూహింపవలసి యున్నది. "సావిత్రీయమ సంభాషణ" తో కావ్య మారంభ మవుతుంది. ఈ ఎత్తుగడ రసవత్తరంగా ఉంది. ప్రణయబంధుర మూర్తిగా, పశ్యతోహరుడుగా, ఆలివ ప్రాణముగా, అభీష్టదాతగా, సత్యవంతుని గూర్చి సావిత్రి సంభాషణ ఆరంభించడంలో భర్తయొక్క శీలాన్ని యముని ప్రసన్నతా సంపాదన యత్నంలో పాత్రమైనదాన్నిగా చేసి కవి కృతకృత్యు లౌతారు. "సతికి పతియే ఆశ్రయం" అనేదాన్ని ధృవపరుస్తూ "నిరాశ్రయానశోభన్తే కవితావనితా లతాః" అనేదాన్ని సందర్భసమన్వయంగా పొందు పరుస్తున్నారు. సాధుమూర్తిగా యముని వర్ణిస్తూ చేసిన ప్రశంస యమ ప్రసన్నతా సంపాదనంలో మరొక మెట్టు ముందుకు పోయినట్లు సంభాషణా విధానాన్ని రూపొందిస్తారు. "శమనుడు" "సమవర్తి" అనే పదాల నిర్వచనం చేస్తూ "సర్వసముండవై తనరు కతన పరఁగితివి సమవర్తివై పావనాత్మ !" అని సమవర్తి పద నిర్వచనంలో కవి స్వతంత్రత చూపారు. కాని, భారతంలోని "సమబుద్ధితోడఁ దత్తత్సముచిత కర్మఫల మఖిల జంతు తతులకున్ సమకూర్చుట నీకయ్యెను సమవర్తి యనంగఁ బేరు జగదభినుతయై. భా. అర. 7. ఆ. 230 ప.

న్యాయనిష్ఠతో, యుక్తాయుక్త వివేకంతో, ఏయే కర్మల కెంతెంత ఫలితమో ! నిర్ణయించు ధర్మపదవీ పరిరక్షణ భారము యముడు వహించినప్పుడు సమాన ఫల భోక్తృత్వం అందరికీ కల్పించడం అధర్మమే అవుతుంది. అసమాన నారీమణిగా, దేవతారూపిణిగా, పాఠకులకు సాక్షాత్కరింపజేసే సావిత్రీసాధ్వి "స్వార్థ తత్పరమతి" గా చిత్రించడం కవిలోటనక తప్పదు. భారతంలో "ప్రకట ధర్మ విశేష తత్పర" గా యముని మనస్సులో సావిత్రి బలపడుతూండగా, సముచిత నిర్ణయార్థం యముడు ఆమెను పరీక్షించడం జరుగుతుంది. ఆ పరీక్షా ఫలితాన్ని భర్తృ ప్రాణ దాన రూపంలో యముడు సావిత్రికి ప్రసాదిస్తాడు. మిత్రత్వము, పాతివ్రత్య గరిమ, సావిత్రీ సంభాషణలో ప్రోది చేసికొని యముని ప్రసన్నతలో ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. ఈవిధమైన సావిత్రీ పాత్ర శ్రీ రాఘవరెడ్డిగారి చేతిలో "సాధారణ" అయి యమునితో వాదానికి దిగి "శాస్త్ర చర్చకు దిగుచుంటి సారసాక్షి !" "అనధికార చేష్టిత మిది" అని యముని చేత ననిపించబడి, సాధ్వీలక్షణాన్ని దూరం చేస్తుంది. "ఎందరెందరు పత్రులు హృదయేశులన్ దొలఁగి కాలము బుచ్చుటలేదు ? నీ తలన్ మొలిచెనె పైడికొమ్ములు ? సాఁదిసినన్ ఫల మదియేమి ?" అని యమునిచేత ఏమగు మాటలు పల్కించడం యముని గాంభీర్య పరిరక్షణను దూరం చేశాయి. మద్రేశ్వరునికి పుత్రశతలాభము కోరినట్లు కాకుండా తనకే పుత్రులను కోరినట్లు మార్చడం సమంజసంగా లేదు. ఆనెపాన తన భర్తను ప్రసాదింపమని "నిర్బంధంతో" పెట్టడం సావిత్రీ పాత్రని కించపరచినట్లే చెప్పవలసి ఉంది. న్యాయనిర్ణయ దృష్టితో వచ్చుజెప్పి న్యాయమార్గాను సారిణిగా ధర్మవిమర్శినిగా, మహాసాధ్విగా యముని దృష్టితో రూపకల్పన చేయించి, యమప్రసన్న ప్రసాదంగా భర్తనివ్వడం, చిత్రించడం మిన్నగా గన్పిస్తుంది.

ఈవిధంగా యమ సావిత్రీ పాత్రలో చిత్రింపబడినా "ఎవని స్మరియింప మిత్తి దవ్వేగు ఎవరి, వచనముల వెనువెంబడి వచ్చు శుభము, లా యశోకికు సమవర్తి యముని శమను, అధికమగు బత్తి దళుకొత్త పంజలింతు" అన్న పద్యమువలన మహామహునిగా పోషింపబడటం జరిగింది. విశ్వస్త్రుల ఈసడింపు సహజాతి సహజంగా చిత్రింపబడింది. సందర్భానుగుణంగా లోకోక్తులు, అర్థాంతరన్యాసములు శోభావహంగా సాగాయి. "తపోవన దర్శనోత్సు కత్వవశత" వంటివి పద్యరచనలో సహజతను కుంటువరుస్తున్నాయి. "నా ఏమి తపములు" "జ్ఞానవహ్ని పాత్కృతము" "వాకొనగరాను" మొదలైనవి కవి పాండిత్యాన్ని స్పష్టం చేస్తున్నాయి.

రతివిలాపము కాళిదాస నన్నెచోడ కవుల రచన లాధారంగా రచితమైందనుకోవచ్చు. ముక్కంటి కంటి మంటలో మదనుడు భగ్నుడు కావడంతో వివేకశూన్యతయే కాని వేఱొకండు కాదని ముక్కంటి గాంభీర్యాన్ని చిత్రించడం అందంగా ఉంది. ఒకవైపున శివుని లలనాలాలసునిగా చిత్రిస్తూ తపోనుష్ఠానము, తరుణీసంగమ సాధనంగా విశదీకరిస్తూ, మరొకవైపున శివుని మహామహునిగా చిత్రింపబూనడం హాస్యాస్పదంగా ఉంది. "అంటిన గందివట్టి" "ఎవ్వరి నేమి యన్న" "దేవారాధ్యుడు" అనే పద్యాలు శివుని మహత్త్వాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఆకాశవాణి రతీమరణాన్ని అడ్డగించినట్లు చెప్పబడిన కాళిదాస, నన్నెచోడ కవుల భావాన్ని దిద్ది అర్ధనారీశ్వరుడై శివుడు ప్రత్యక్షమై సాంత్వనవచః ప్రదానము చేయుట చక్కగా కుదిరింది. మహోన్నత నాపాదించింది. "తప మెంతో తపియించి" అని మునివృత్తిని వర్ణించి మరల "ఎందఱో మౌనిచంద్రులు" అనే పద్యంలో పునరుక్తి చేస్తారు కవి. "చంపక చంపు" "నిటాలవహ్ని" మొదలైనవి కవికి గల "అధికారాన్ని" ఋజువు చేస్తున్నాయి. "మూత్రద్వారము" అనే పద్యము జుగుప్సావహంగా ఉంది. "సొగ కన్నున్ పులితోలు" "అంటినగందునట్టి" మొదలైన పద్యాలు నన్నెచోడుని కుమారసంభవములోని "రతీమదన" సంవాద ఘట్టాన్ని తలపుకు దెస్తున్నాయి. "ఈలాటిదే" మొదలైన పదాలు పేలవంగా ఉన్నాయి. "రతి విలాపము" చివరలో అగజచే చెప్పించిన సందర్భము ప్రస్తుతానికి దూరంగా

కపిస్తుంది. శివుని "సోముడి" గా పేర్కొన్నారు కవి. అష్ట మహాత్మ్యకుంప కావున సరిపోతుందేమో! కాని, కవి సమయము లేమ. చక్కని చిక్కని శైలితో కవి లేఖిని సాగుతూ జనవానికీ క్రింది పద్యము చాలు.

> తాపసులన్న వా టమెర రామసచిర్తులు—ముక్కు మీదనే
> కోపము—వారి నాలుకలకున్ బదునెక్కుడు—మాట మాటకున్
> శాపము—గోపికల్ మిగుల సన్నము—లిన్నియు నుండి భూమి భృ
> ద్వ్యాపన కన్ని కన్మిగులు, సౌమ్యములింక వచింపఁ జెల్లునే ?

ప్రాచీన శతక రచన ననుకరించే పద్ధతిలో రచిత మయాయి "గోపికా వల్లభా!" "పరిదేవనము" అనే ఖండికలు. "గోపికా వల్లభా" అనే శతకమే ముందుగా రచితమైందని గ్రహింపవలసి ఉంది. గోపికావల్లభుని శృంగార చేష్టలు మనోజ్ఞంగానే సాగినాయి. ప్రాచీన శతకములలోని భావాలుగల కొన్ని పద్యాలు అక్కడక్కడా కనిపిస్తుంటాయి. బ్రాహ్మణుల చదువులు, వారి యుపన్యాసాలు మొదలైన వాటిపై కవి కొన్ని అభిప్రాయాలు వెలిబుచ్చినారు. "విని యుంటిన్ గరమున్ బురాణ కథలన్—వేమారు వానిన్ దలంచిన యాశ్చర్యముగల్గు—వానగల వాసిన్ వీసమంతైన గైకొనలేనైతిని" అని తమ పాండిత్య పాటవాన్ని తెలుపుకుంటూ "లబ్ద వర్ణకుల వాకుల్ వచ్చి బొంకుల్" అనుట దుస్సాహస మనక తప్పదు. మొత్తంమీద శతకం అసంపూర్ణంగానే భాసిస్తుంది. భావం, భాష, శైలి మొదలైన వాటిపై గల అధికారము, వైరాగ్య సంపూర్ణ భక్తి భావ మాధుర్యమూ "పరిదేవనం" లో గోచర మవుతాయి. సావిత్రీ వరప్రసాద లబ్ధ కవితాస్ఫురియే అంతభాషౌన్నత్యం ప్రదర్శింప చేయడంలో కారణం కావచ్చు. "అభ్యుదయరాశిభూత తత్త్వన్న కిం గురు కోటీ చరణారవింద వితతా గోభార నిర్వాపణీకరణ ప్రౌఢ వివేక పుణ్యఫల సంఘాత ప్రధాన క్రియాభరణారూఢ రజఃకణంబు" వంటి సమాసాలు సహజతను కోల్పోయి ప్రయత్నపూర్వక రచనను సూచిస్తున్నాయి.

"స్వీయకృతానుగుణ్యము" వంటి దొసగులు దొర్లియున్నాయి. "అపిమాసం మసంకుర్యా" అన్నట్లు "నాటం గోల" "కూల కుంజము" వంటివి గణబంధితా లయాయి.

మొత్తంమీద కవికి భాషపై గల అధికారాన్ని యీ నాలుగూ స్పష్టం చేస్తున్నాయి. ఈ శతకాలలో కవి వ్యక్తిత్వం స్పష్టమవుతుంది. హృద్యమైన రచన, శైలి, ఈ పుస్తకాన్ని ఆసాంతం చదివిస్తాయి. పునరుక్తులు కొన్ని జరిగినా స్పష్టీకరణ యత్నంగా భావింపవచ్చును. సహృదయులు చదువదగిన కావ్యసంపుటి.

—ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు.

# జాతీయభారతి: జయభారతి

(రచయిత : శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి. వెల: రు. 3. ప్రతులకు : భారతీ నికేతన్, మారుతీనగర్, విజయవాడ.)

శ్రీ శాస్త్రిగారు 1942 నుండి 1957 వరకు వ్రాసిన జాతీయ గీతాల సంపుటి ద్వితీయ ముద్రణం యిది. ఇందులో 'జాతీయ భారతి' గీతాలు డాక్టరు రాధాకృష్ణన్ గారికీ, 'జయభారతి' గీతాలు కీ. శే. కాశీశ్వరరావుగారికీ అంకితాలు. శ్రీ బూర్గులవారి 'తొలిపలుకు', శ్రీ రంగాగారి 'మలిపలుకు', శ్రీ గోపాలరెడ్డిగారి అభినందనలు, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారి అభిప్రాయం, వివిధ పత్రికాభిప్రాయాలూ, కవిగారి బిరుద ప్రదానాన్ని గూర్చిన వార్తాపత్రికల రిపోర్టులూ, దాని తాలూకు ఫోటోలూ, వగైరా కూర్పులతో పుస్తకం నిండుగా ఉంది. ఇందులో బుద్ధుడు, తిలక్, గాంధి, బోస్, పటేల్, రాజేంద్రప్రసాద్, నెహ్రూ, రవీంద్రుడు, భావే, పొట్టిశ్రీరాములు, ఆంధ్రరత్న, గరిమెళ్ల, టంగుటూరి ప్రకాశం, సుబ్రహ్మణ్య భారతి మొదలయిన వారిని గురించీ (వారి ఫోటోలతో సహా) అభివృద్ధి కార్యక్రమాలను గురించీ (వనమహోత్సవం, భూదానం, పొదుపు, చేనేత వగైరా) మొత్తం 65 గీతాలు ఉన్నాయి. ఏ నాయకుని జయంతి వచ్చినా, ఏ 'వారం' ('చేనేతవారం' వగైరా) వచ్చినా, ఎప్పుడు సభలో పాడటానికైనా అనువైన గీతం కోసం వెతుక్కోకుండా, అవసరానికి పనికివచ్చేటట్లు తయారైన గేయసంపుటి యిది.

నండూరివారి ధోరణిలో 'జాజిపాటలూ', 'గాథా సప్తశతి' వరుసలో ముక్తకాలూ, విశ్వనాథవారి 'ఋతు సంహారము' ను తలపిస్తూ 'ఋతు ప్రబంధమూ', యిలా పలు త్రోవలు త్రొక్కి చూడటం శ్రీ శాస్త్రిగారి కవిత్వ లక్షణంగా కనిపిస్తుంది. అదే యీ గీతాల్లోనూ పద గుంఫనములో వ్యక్త మౌతోంది. మొదటి గేయం : 'జన్మహక్కు.'

> "శ్రీఖండమును సువా
> సించు భారతభూమి
> నీ జన్మహక్కురా
> నీ జీవగడ్డరా
> పాడుకోరా పురా
> ప్రభ మూడువేళలా
> వేడుకోరా నేడె
> వేలుపుల ముక్తికై."

రాయప్రోలువారి గీతంలోని ముక్కలు ఏరి కూర్చినట్లుంది .... అలాగే "కనకదుర్గ కలకత్తా కాళీ కామాక్షి మీనాక్షి" లో శ్రీ శ్రీ పలుకుబడి ప్రతిధ్వని .... "నీ పలుకే కొల్లాయీ, నీ వెలుగే బ్రహ్మాండం" అని గాంధీని గురించి అంటుంటే "కొల్లాయి గట్టితే నేమి" ప్రసిద్ధ గీతం జ్ఞాపకం వస్తోంది. "ఎగరాలీ ఎగరాలీ మన జెండా" అన్న గీతం ప్రారంభించగానే "ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా"

అనే పాత గేయం, "వడకవే వడకవే కదురా ?" అవగానే "వడకు వడకు కదుర వడకవే కదురా" అన్న గేయం గుర్తు వస్తున్నాయి. "కాశికా విశ్వేశు కనుతుడల నంపదల" అంటే "కాశికా విశ్వేశు గలిసె వీరారెడ్డి" జ్ఞాపకం రాకమానదు. ఒక కవి వ్యక్తిత్వపు ముద్రలో ఇదివరకే ప్రసిద్ధమైనవీ, లేక నలుగురు నోళ్లలో నానటంతో శక్తివిహీనమైనవీ (Cliches) పదబంధాల్ని వాడుకోవటం స్వీయ ప్రతిభకు తప్పకుండా అవరోధమే అవుతుంది. రోజూ పత్రికల్లో చదివీ, సభల్లో వినీ వినుగెత్తిపోతూన్న భావాల్ని కవిత్వంగా రూపొందించటం భగీరథ యత్నమే కాదు, కేవలం దుస్సాధ్యం. అందుకే ఈ గీతాలు దేశీయతాభావ ప్రచారానికి అనుగుణంగా వికసించిన కుసుమాలే అయినా కవిగారి సహజ కవితా ప్రతిభ వాసించని నిర్గంధ కుసుమాలే అయ్యాయి.

# అంకితం

(రచయిత : శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి. రు. 1.50. ప్రతులకు : భారతి నికేతన్, మారుతినగర్, వెల : విజయవాడ.)

శ్రీ సుబ్బరామశాస్త్రిగారు యీ ఆరు అంకాల నాటకాన్ని "జాతీయ రూపకము" అన్నారు. శాస్త్రిగారికి ప్రచారంమీద నమ్మకం ఎక్కువ. "ఇంత విశాలమైన దేశంలో ఏమూల ఏం జరుగుతోందో, నిత్యం చెబుతూఉంటే తప్ప ఎల్లా జ్ఞాపకం ఉంటుంది ?" రచయితే స్వయంగా 'తొలి పలుకు' లో వివరించినట్లుగా యీ నాటకంలో 'ఖద్దరు, చేనేత, కుటీర పరిశ్రమలు, వ్యవసాయంలో సహకారం, సహకారోద్యమం, పంచాయతి ఉద్యమం, ఎన్నికలు, భారత రాజ్యాంగ విధాన పరిజ్ఞానం, కట్నాలు, పొదుపు, శాంతి, సత్యం, అహింస మొదలైన సిద్ధాంతాలూ, రేడియో .... ఇంకా ఎన్నో .... ' దేశాభివృద్ధి కార్యక్రమాలను గురించి ఇందులో పాత్రలు మాట్లాడుకుంటారు. ఆ ధోరణి రోజూ 'రేడియో గ్రామస్థుల కార్యక్రమం' లో వినవచ్చే బావగార్ల ధోరణే, అంతకుమించి విశేషం ఏమీలేదు. ప్రభుత్వ ప్రణాళికా ప్రచార శాఖకు బాగా ఉపయోగిస్తుందీ నాటకం.

—ఆర్. ఎస్.

# ఉర్దూసాహిత్య చరిత్ర

మూలం : డా. ఎహతెషామ్ హుసేన్, అనువాదం : శ్రీ ఎస్. సదాశివ, ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, వెల : ఆరురూపాయలు.

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు భారతీయ భాషల సాహిత్య చరిత్రలను ప్రకటించవలెనని నిర్ణయించి, ఉర్దూ విషయంలో ఒక ప్రామాణికమైన చరిత్రను తెలుగులోకి అనువాదం చేయించి ప్రచురిస్తే బాగుంటుందని అనుకొని ఈ అనువాదాన్ని ఆంధ్రపాఠక లోకమునకు అందజేశారు. ఇదే 'ఉర్దూ సాహిత్యకా ఇతిహాస్' అను పేరుతో హిందీలో మొదట వెలువడింది. మూల రచన 1951 సంవత్సరాంతాన జరిగింది. అంటే ఒక పుస్తకం [illegible] [illegible] సాహిత్య చరిత్రలను [illegible] [illegible] మనకు [illegible]. ప్రామాణికమైన [illegible] 'ఇది ఏమిటి ?' అన్న ప్రశ్న [illegible]. [illegible] ఆర్. బి. సక్సేనా రచించిన 'ఏ హిస్టరీ ఆఫ్ ఉర్దూ లిటరేచర్', హెరిటేజి ఆఫ్ ఇండియా సీరీస్ లో గ్రాహం బెయిలీ రచించగా వెలువడ్డ 'ఉర్దూ లిటరేచర్', ఇంకా ఇతర చరిత్రలు కొన్ని ఉన్నాయి. కాని అవి యేవీ ఉర్దూ ప్రామాణికమైన చరిత్రలు కావని మూల రచయిత భావించినట్లు అకాడమీవారు కూడా అభిప్రాయపడి, ఇదే ప్రామాణికమైన చరిత్ర అని మనకు లభ్యం చేశారు.

ఉర్దూ సాహిత్య చరిత్ర రచన అంటే చాలా సంక్లిష్ట విషయం. ఇది మహమ్మదీయుల సాహిత్యం. అయినప్పటికీ ఇది కేవలము వారి భాష మాత్రమే కాదు. భాషరీత్యా, సాహిత్య రీత్యా ఒక వంక పారసీ, అరబ్బీలతోనూ, మరొకవంక సంస్కృతము, హిందీ వాని వివిధ మాండలిక ప్రాంతీయ భేదములతోనూ దీనికి సంబంధం ఉంది. చారిత్రకంగా చూస్తే గోలకొండ, ఢిల్లీ, మొగలు మహమ్మదీయ మహమ్మదీయుల రాజకీయాలు దీని సాహిత్య వ్యాప్తికి దోహద మిచ్చాయి. ఇక సాంస్కృతికంగా పరిశీలిస్తే అటు ఇరాన్, టర్కీ, అరేబియాలలోనూ, ఇటు హైందవ సంస్కృతితోనూ, సూఫీ తత్వంతోనూ దీనికి సన్నిహిత సంబంధం ఉంది. ఇది ఒకప్పుడు సంఘర్షణకూ తావిచ్చింది.. మరొకప్పుడు సమైక్యతకూ సాధనమైంది. వైవిధ్యాన్ని చూపింది, వ్యక్తిగత ధోరణులలోనూ సాగింది. ఎంతో ప్రతిభ ఉంది. ఎన్నో బలహీనతలు ఉన్నాయి. ఇట్టి నానాగుణ సమేతమైన సాహిత్య చరిత్రను వ్రాయు వ్యక్తి నిష్పక్షపాతియై, సమ్యగ్దృష్టి కలవాడై ఉండాలి. కాని, ఈ రచయిత అట్టివాడు కాడు. ఒక పక్షానికి చెందిన దృక్పథం గలవాడు. గ్రంథం చివరన రచనను గూర్చి తానే వ్రాసుకొంటూ "మార్క్సు వాదమే సర్వ శ్రేష్ఠమైన దర్శనమని భావింతును .... సాహిత్యమును లక్ష్యము చేసికొనుటలో మార్క్సిస్టు దృక్పథమే అన్నిటికంటె ఉపయోగకరమైనదని నా విశ్వాసము" అని స్పష్టంగా చెప్పుకున్నాడు. సాహిత్యాన్ని పరిశీలించడానికీ, వివేచన చేయడానికీ ఈదృశమైన దృక్పథములు ఎంతగా ఏకపక్షమైనవో, అసలు ఒక్కొక్కప్పుడు అసమగ్రమై ఎలా పనికిరావో కొన్నేండ్ల క్రింద తెలుగులో వెలువడ్డ "కావ్యజగత్తు" ను ఈనాడు మరొకమారు చదివినవారికి విశదము కాగలదు. ఆ పుస్తకం రచయితే ఈనాడు ఆ అభిప్రాయాలు కొన్ని పొసగనివని అనుకున్నా ఆశ్చర్యపడ నక్కరలేదు. మరి ప్రస్తుతపు ఈ సాహిత్య చరిత్ర మార్క్సిస్టుచే వ్రాయబడినది. కనుకనే తరచు గ్రంథమంతటా వర్గముల ప్రసక్తి ఉంది. సంఘాన్నీ, సాహిత్యాన్నీ వర్గపరంగా చూచిన సందర్భాలున్నాయి. ఎవరో కవి ఏదో కవిత వ్రాసుకుంటే అతనిలో వర్గ చైతన్యం ఉందా లేదా అని ఈచరిత్ర రచయిత మీమాంస

చేస్తున్నారు. అంతేకాదు, ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం అనదగ్గ 1857 సిపాయీల తిరుగుబాటును 'సామ్రాజ్య కాంక్ష యుతులైన బ్రిటిషు .... ఆంగ్ల ప్రభుత్వము నుండి విడి పోవడానికై చేసిన సాయుధ యుద్ధము' అని వర్ణించాడు. ఝాన్సీరాణి, నానాసాహెబ్, తాంతియాతోపే భారత ప్రజలకు స్వాతంత్ర్య ప్రతీకలన్న సంగతే విస్మరించాడు. రష్యా, చైనా, జపాన్, ఈజిప్టు దేశాలు మన భారత స్వాతంత్ర్య సమరాన్ని ఉత్తేజితం చేసినాయని అన్నాడు. ఫ్రెంచి విప్లవం ప్రస్తావనే లేదు. కాని సామ్రాజ్యవాదం పుట్టి వ్యాప్తి చెందడానికి ఫ్రెంచి విప్లవం ఎలాగా హేతువైనదో ప్రపంచ సాహిత్యాన్నీ, ముఖ్యంగా పాశ్చాత్య సాహిత్యాలనూ అధ్యయనం చేసినవారికి బాగా తెలుసు.

ఉర్దూభాష పరిణామాన్ని చర్చిస్తూ ఉత్తరాన ఖడీ బోలీ భాషతోనే రమారమి ఫారసీ అరబ్బీ పదములను కలుపు కొని, పంజాబీ ప్రభావము వలన, ఢిల్లీ పరిసరముల భాష మెరుగులు దిద్దుకొని ఉర్దూగా మారినదని రచయిత తేల్చాడు. అసలు హిందీ, ఉర్దూలు రెండు సాహిత్యములు, ఒకేభాష అని ఉండుననేది రాభిప్రాయము. 18 వ శతాబ్ది దాకా ఈ భాషకు ఉర్దూ అన్న పేరే రాలేదు. పదిహేనవ శతాబ్ది అంతములో రచన చేసిన షాహమీరాన్‌జీ స్వైతం తన భాష హిందీ అని చెప్పుకున్నాడు. కాని, అతనివి ఉర్దూ రచనలని ఈ రచయిత వాదం. కొందరు సూఫీ రచయితలు తమ భాష దక్కన్ అన్నారు. ఉర్దూ భాషలో ప్రథమ మహాకవి అని రచయిత చెప్పిన ఖులీ ఖుతుబ్‌షా (గోలకొండ రాజు) భాష కూడా హిందూస్తానీయే. మ్రితలే కూడా తన భాష హిందీ అనే చెప్పుకున్నాడు. ఏమైనను ఉర్దూ చారిత్రక భూమికను చర్చించడంలో ఉర్దూ భాషకూ, మతాలకూ సంబంధంలేదని నిరూపించడంలో రచయిత హెచ్చు పరిశ్రమ చేశాడు. అయితే దక్షిణదేశపు ఉర్దూ అధికముగా ముసల్మానుల భాషయేననీ, ముసల్మానుల జీవితము, వారి ఆచార వ్యవహారములు ఉర్దూ సాహిత్యంవల్ల తెలుసుకోవచ్చునని అంగీకరిస్తూ, అది సాంస్కృతి కంగా హిందూ ముస్లిం సమైక్యతకు ప్రతీకగా నిలిచిన భారతీయ భాష అని అభివర్ణించాడు.

ఈ సాహిత్య చరిత్రను రచయిత చారిత్రక సంబంధ మైన అధ్యాయాలుగా విభజించి రచన చేశారు. గాని, సాహిత్య యుగాలుగా విభజన చేయలేదు. ఆంగ్లంలోనూ, తెలుగు, తదితర సాహిత్యాలలోనూ ఒక్కొక్క మహా వ్యక్తికి సంబం ధించిన యుగంగా పరిగణించి ఆ యుగపు కవులను, వారి ధోరణులను చర్చించడం పరిపాటి. కాని ఈ చరిత్రరచన చారిత్రక సంఘటనలను ముఖ్య సంఘటనలుగా పెట్టుకొని సాగిపోయినది. ఉదాహరణకు ఉర్దూ సాహిత్య చరిత్ర మొత్తంలోనే అద్వి తీయుడైన గాలిబ్ మహాకవిని గూర్చి 'ఢిల్లీ అంతిమ ప్రతిభ' అన్న అధ్యాయంలో వ్రాయడం జరిగింది. నిజం చెప్పాలంటే అది గాలిబ్ యుగం. ఆయన అప్పటి మొగలు చక్రవర్తికే గురువు. పతనావస్థలో ఉన్న నాటి సభ్యత కతడు ప్రతీక. కాని మొగలురాజ్యక్షయంపై రచయిత దృష్టి నిలిచిపోవడం చేత దీనిని 'గాలిబ్ యుగము' అని రచయిత చెప్పలేక పోయాడు. మరి అంతకుపూర్వం నజీర్ అక్బరాబాదీని గూర్చి ఒక అధ్యాయమే ప్రత్యేకంగా వ్రాశాడు. ఉర్దూ గద్య వికాస నికి డా. జాన్‌గిల్ క్రాయిస్టు ప్రోత్సాహమున కలకత్తా పోర్టు విలియం కాలేజిలో జరిగిన కృషిని ప్రస్తావించడం ఆధునిక యుగమును సర్ సయ్యద్‌యుగమని అన్నాడు. కాని అతడు జాతీయోద్యమానికి సుముఖుడు కాడు. కేవలం ముసల్మానుల అభ్యుదయానికి పాటుపడ్డవాడు. ఆ పిలుపు ఇచ్చినవాడు. ముస్లిములకు, క్రైస్తవులకు సఖ్యత వెరపాలని చూచాడు. అందరి సమైక్యత అన్నవాడా ? పోనీ సాహిత్య కంగా చూస్తే నవ్యసాహిత్య రూపాలన్నిటినీ ఉర్దూలో ఆరం భించినవాడా అంటే ఆదేమీ కాదు. అతడు గొప్ప వ్యాసకర్త మాత్రమే. ఆ వ్యాసాలు కూడా ఒక మతంవారి అభ్యుదయాన్ని ఉద్దేశిస్తూ వ్రాసినట్టివి. అటువంటప్పుడు ఉర్దూ సాహిత్య చరిత్రలో ఆధునిక యుగమును సర్ సయ్యద్ యుగమని దేని ఆధారంగా అన్నట్లు ? ఇక్బాల్‌ను గూర్చి వ్రాయుటలో రచయిత అతని వ్యక్తిత్వమును ఒకవైపే విస్తారంగా చూపాడు గాని 'సారే జహాఁసె అచ్ఛా హిందుస్తాన్ హమారా' అనీ, 'హిందీ హైఁ హమ్ వతన్ హైఁ హిందుస్తాఁ హమారా' అనీ అన్న ఆ కవి తుది రోజుల భావాలు భారతదేశ విభజనకు కొంత వరకు కారకమైనవా లేదా అన్న అంశాన్ని ప్రస్తావించనే లేదు. కాని "రాను రాను అతడు ప్రతి క్రియావాదులగు (Reactionaries) ముసల్మానుల నాయకుడుగా భావింప బడె ననియు, అతని ఆలోచనలు ముసల్మానులను ఏదో విధ ముగా భారతదేశములోని ఇతర జాతులకు వేరుచేసి అన్య దేశీయులగు ముసల్మానులతో సంబంధింప జేయునట్టివిగా తోచె" నని రచయితే ఒకచోట వ్రాశాడు. ఉర్దూ గద్య నిర్మాత లలో కీ. శే. మౌలానా అబుల్‌కలాం ఆజాద్ పేర్కొనదగ్గ వాడు. ఈ రచయిత ఈయనను 'కొత్తరకపు పత్రికా రచ నకు జన్మదాత' అన్నాడు. కాని, రాజకీయ సంబంధమైన ఆంగ్లభాషా వ్యావహారికముల కెన్నిటికో ఆజాద్ ఉర్దూ పద ప్రయోగాలు చేశాడు. ఉర్దూ రచయితలు నేటికీ వాటినే వాడుతున్నారు. తక్కిన కవులు, కథకులు, నవలాకారులు వ్యాసకర్తలు, విమర్శకులను గూర్చి ఈ చరిత్రకారుడు సంక్షి ప్తంగా నైనా తగు భోగట్టా కూర్చాడు. ముఖ్యంగా అభ్యు దయ రచయితల ప్రస్తావన వచ్చినప్పుడు వారి సంఘాలు ఏర్పడుట గొప్ప పరిణామమనీ, ఆ రచయితలు జీవితాన్నీ, సాహి త్యాన్నీ సమీపమునకు తెచ్చుటకై ప్రయత్నించారనీ వ్రాశాడు. అట్లయితే 1936 కు పూర్వపు రచయితలు జీవితానికి దూరంగా ఉన్నారని దీని అర్థమా ? ప్రేమ్‌చంద్ మొద లగువారు అంతకు పూర్వమే రచనలు చేసినవారు కదా ! ఈ రచయిత విమర్శకులనుగూర్చి వ్రాయునప్పుడుకూడా మార్క్సిస్టు దృక్పథం కలవారినే అతిగా ఉగ్గడించాడు. వారి విమర్శనా పద్ధతే సక్రమమట !

# గ్రంథ విమర్శనము

ఇక ఈ గ్రంథానువాదమును గూర్చి కొంత చెప్పవలసి ఉన్నది. అనువాదకులు శ్రీ సదాశివ ఉర్దూ భాషలో మంచి పరిజ్ఞానము కలవారు. అనువాదము కూడా గ్రాంథికమైనా సాఫీగా సాగిపోయింది. ఆయా కవుల కవితలను ఉదహరించి నప్పుడు పేజీ దిగువనే వాటికి చక్కని తెలుగు తాత్పర్య ములు వ్రాసి మూలంలోని భావాలను చక్కగా అందించారు. అనువాద కాలమునకు ఆయా కవులు ఎక్కడ ఉన్నదీ కూడా తెలిపారు. కాని హిందీ నుంచి సాహిత్య గ్రంథమును తెలుగు లోకి అనువదించునప్పుడు హిందీ పదాలనే, ఆ ప్రయోగాలనే యథాతథంగా వాడినందువల్ల విశాలాంధ్రలోని పాఠకుల కంతరకూ అర్థంకావు. అట్టి వానిలో లోకప్రియము (ప్రజాదర ణకుపాత్రమైన), రాష్ట్రీయత (జాతీయత), అంతర్రాష్ట్రీయత (అంతర్జాతీయత), శిక్షణ (విద్య), సాహిత్యధార (సాహిత్యధోరణి), లోకసాహిత్యము (జానపద సాహిత్యము), లోక గీతములు (పల్లె పాటలు), కృషి (వ్యవసాయము), చేతన (భావుకత లేక ప్రేరణ), నవ్యధార (నవ్యరీతి), విద్రోహులు (తిరుగుబాటుదారులు), ఔద్యోగిక విప్లవము (Industrial Revolution) ప్రతి క్రియావాదులు (Reactionaries), క్రాంతి (విప్ల వము), రూఢివాదులు (సంప్రదాయవాదులు) మొదలైన కొన్నిటికి—అలాగే బక్షీ పదవి, రోమానీ ఆకృతి వంటి వాటికి వివరణలిస్తే బాగుండేది. జనతంత్రమునకు బదులు ప్రజా స్వామ్యమనీ, రచనాత్మక సాహిత్యమునకుగాను సృజనాత్మక సాహిత్యమనీ అంటే తెలుగు పత్రికలు చదివేవారికి సులభంగా అర్థమయ్యే వీలుండేది. 21 పుటలో 'ఔరంగజేబుచే ఒకే కాలమున శాశ్వతముగా నశించినవి' అనీ, 31 పుటలో 'అతని కవితా వస్తువ వివిధము' అనీ ఉంది. రెండవదానికి కవితా వస్తువులో వైవిధ్యం ఉంది అని చెప్పదలిచారు కాబోలు. అల్లే 22 వ పుటలో 'ఉద్దేశ్యములను ప్రచారము చేయు టకు' అని ఉంది. అంటే భావాలో లేక అభిప్రాయాలో కావచ్చు. 'మొన్న మొన్ననే జాడ పడినది (అంటే Traced Recently) అనీ, 'సాగదీయుచున్నాడు, అనగా కొనసా గించుచున్నాడనీ మనం అర్థం చేసుకోవాలి.

ఈ ప్రచురణలో అచ్చు తప్పులు మహా జాస్తిగా ఉన్నాయి. ఎన్నోచోట్ల జఫర్ అని ఉండవలసింది, జపర్ అని ఉంది. ఇంకా ఎన్నో పేర్లు, వాక్యాలు తప్పుగా పడ్డాయి. నవలలు, కథానికలు, విమర్శ మొదలగు పేరాలు ఆరంభమగు చోట్ల ఉపశీర్షికలు పెట్టవలసినది. పుస్తకం చివర ఇండెక్సు ఇస్తే బాగుండేది. ఆంధ్ర అకాడమీ వారికి వ్రాతప్రతులను ఎడిట్‌చేసి ప్రెసు కి ఇచ్చే పద్ధతి ఏర్పడాలి.

ఏమైనా తెలుగులో ఉర్దూ సాహిత్య చరిత్ర ఒకటి సంక్షిప్తంగానైనా విశదమైనది తెలుగు పాఠకులకు లభించిం దని సంతోషించుదాము.

—'కావ్యప్రియ.'

## బ్రతికిన దినాలు:

కథలసంపుటి—రచన: తురగా భూషణ్.

1/8 క్రౌను సైజులో 146 పుటలు. వెల: రెండు రూపాయలు. ప్రచురణ : దేశకవితా మండలి, విజయవాడ—2.

ఈ సంపుటిలో తురగాభూషణ రచించిన తొమ్మిది కథలు సంకలనం చేశారు. మొదటి కథ బ్రతికిన దినాలు 91 పుటలు ఆక్రమించిన కారణంచేత అదే ఈ పుస్తకం పేరుగా సూచించారు. ఈ పుస్తకంలో కథలన్నీ సగటు మనిషి సామాన్యమైన గుమాస్తా జీవితమే. ఒకానొక యువ కుడు, సవతి పోరు పడలేక మద్రాసు వచ్చి, ఒక స్నేహితుని సాహాయ్యంవలన స్టెనోగ్రాఫర్ ఉద్యోగం సంపాదించి, ఆ మహా పట్టణంలో ఇల్లు సంపాదించడానికి పడిన పాట్లు, ఇల్లు వసతి సంపాదించిన తరువాత ఆ పట్టణవాసంలో పొందిన యిక్కట్లు, చివరికి ఒక కుమార్తెను కోల్పోయిన విషాద గాథతో ఎదురుతిరిగిన వేంకటరావు ఉన్న ఇంటిలో నిద్ర పట్టక మేల్కొన్న సోమేశం జీవితం యీ పెద్ద కథలో రచయిత వర్ణించారు. ఈ విషాద సంఘటనతో ప్రారంభ మైన యీ పెద్ద కథలో ఉత్కంఠ లేకపోయినా మొదటి నుండి చివరి వరకు యీ గుమాస్తా బ్రతుకుపైన జాలి కొలిపేటట్లుగా ఉన్నది. ఇంకొక కథలో శైలు ప్రయా ణంలో తటస్థించే దాంపత్యగాథే అయినా దీనికి 'కుక్కపిల్ల' కథ ఒకటి జోడించి రచయిత 'మాంటేజ్' సాధించారు. 'నా సంగీతం చదువు', 'నా మొదటి నవల', 'ఇది నా కథ' వంటివి ఆత్మనే వదంలో చెప్పిన స్వీయానుభవాలు. "నేను సామాన్య మానవుణ్ణి—నాలాంటి మానవు లెందరివో నే నెరుగు దును. నన్ను గురించి చెబితే వారిని గురించి చెప్పినట్లే అవు తుంది. నా కథలో కథ లేదు. నా కథలో ఆనందంలేదు. విరసాన్ని సరసంచేసే రసం లేదు." అన్న నిర్వచనం ఈ కథ లన్నిటికీ సరిపోతుంది. ఆంధ్రదేశంలో కమ్యూనిస్టుల గురించి చెప్పినా అదే. ఆంధ్రస్త్రీ జీవితంలో లక్ష్మి చరిత్ర చెప్పినా అదే. బస్సు ప్రయాణంలో రెండణాల చిల్లర లేక నోటిచ్చి చిల్లరకోసం కండక్టర్‌చేత చీవాట్లుతిన్న ప్రయాణికుడి కథ చెప్పినా అదే. కథకాని కథలు. ఇవి ఎవ్వరిని మెప్పించ గలవో చూడాలి.

## తాను వెలిగించిన దీపాలు

కథల సంపుటి—రచన: మధురాంతకం రాజారాం, ప్రచు రణ : గోదా గ్రంథమాల, మునునూరు, కృష్ణా జిల్లా. 1/8 క్రౌను సైజులో 114 పుటలు—వెల: రెండు రూపాయలు.

ఈ రచయిత కథలు ఎన్నో పత్రికలలో వెలువడి యీకథ కుని ప్రతిభను పాఠకలోకానికి ఇదివరకే పరిచయం చేశాయి. సంపుటిలో తీసుకొన్న మూడు కథలూ బడిపంతులు జీవి తాన్ని వ్యక్తపరిచేవే అని చెప్పవచ్చును. మొదటి కథ అలాంటి బడిపంతులు తెలుగు మాష్టారు కృష్ణశర్మ ముప్పైఏ అయి దేళ్లు ఒక పాఠశాలలో పనిచేసి, తిరిగి అక్కడికే వెళి

పన్నులకు కలిగిన అనుభవం వర్ణించిన కథ యిది. ఇన్నియేండ్ల తర్వాత తొలి పాఠశాల దర్శించి తిరుగు ప్రయాణంలో టిక్కెట్టు లేనందుకు పట్టుబడి, ఆయినస్పెక్టరులో తన ప్రాత శిష్యుణ్ణి చూచి, ఆ పరిచయంతో ఆనందం పొందు రాము ఈ పన్తుగారు. తనకు బడిపంతులు జీవితంమీద మమకారం పోలేదు సరిగదా, మనుమరాల్ని కూడా పంతులమ్మగా జీవితం ప్రారంభం చేయుమని ఉద్బోధిస్తాడు. "పిల్లలు భగవత్ స్వరూపులు. వాళ్ల మధ్యన ఉండటమంటే భగవత్ సన్నిధానంలో ఉన్నట్లు. అంతకంటే ఆనందకరమైన వ్యాసంగం మరొకటి లేదు." అంటాడు. ఈ భావనలో రాజారావుగారి స్వీయానుభవాలు ప్రతిఫలిస్తున్నాయి. ఆయన ఉపాధ్యాయుడుగా ఉండి, ఉన్నత జీవిత ప్రమాణాలు చవిచూచినవాడు. భవిష్యత్తులో భాగ్యమును చూడగల ఆశాజీవి. ఆయన కథలు యిటువంటి నిరాశలో ఆశను చూస్తాయి. నిరుత్సాహంలో ఉత్సాహాన్ని చూస్తాయి. నీలకంఠం కథలో—ఆదరణ పొందలేని పిచ్చయ్య, కొడుకు ప్రకాశంలో చూపి, కథకుడు జీవిత విజయంమీద చిత్రమైన వ్యాఖ్య. రబ్బరు గాజులు చూచి రక్తి పొందే ప్రసాదంవంటి కుర్రవాళ్ల వివాహం గురించి వింత కలలు కంటూవుంటే అటువంటివాళ్లని దివినుండి భువికి దింపిన రాఘవతి మాష్టారు ఉపదేశం రమ్యంగా ఉంది. ఈ మూడు కథలు మూడు ముత్యాల వెలుగులు.

## పచ్చతోరణం

ఖండకావ్య సంపుటి—రచన : దేవులపల్లి రామానుజరావు. ద్వితీయ ముద్రణము. దేశికవితా మండలి, విజయవాడ 2. 1/8 క్రౌను సైజులో 79 పుటలు. వెల : రెండు రూపాయలు.

దేవులపల్లి రామానుజరావుగారు రచించిన ఈ ఖండకావ్య సంకలనం పదేళ్ల క్రితం తొలిసారి అచ్చయింది. పలువురు పండితులు దీనినిగూర్చి సదభిప్రాయాలు ప్రకటించారు. రాయప్రోలు సుబ్బారావుగారు 'ఉపసేచని' పేరున పీఠిక వ్రాశారు. దానిలో వారన్నమాటలు: "పచ్చతోరణము అంతా పచ్చగా లేదు. అక్కడక్కడ కట్టెఱ్ఱని రేకులున్నవి. అకలంక ధవళములైన పత్ర పుష్పాదులును కలవు. కదంబ కల్పనలో ఇలాంటి మిశ్రరూప రామణీయకం తప్పదేమో! ఎందుకంటే ఆయా వర్తమాన సంనివేశ సంపర్కాలనుబట్టి కవికంఠము ఉన్ముక్తమై మ్రోగింది. అంతేకాని, ఏకవస్తు విన్యస్తంగా కావ్యరచనకు శ్రుతి కాలేదు. అందుకే యీ కావ్య సంపుటిలో కాపుకన్నె ఉన్నది. పేదకాపు ఉన్నాడు. సంక్రాంతి ఉన్నది. ఉగాది ఉన్నది. ప్రేమగీతము లున్నవి. వీరపత్ని యున్నది. ఆముక్తమాల్యద ఉన్నది. అనార్కలి ఉన్నది. మహాత్ము డున్నాడు, కస్తూరిబా ఉన్నది. విజయనందు డున్నాడు. రాయప్రోలువా రున్నారు. వీరి పద్యాలలో తెనుగుతనము, దేశభక్తి తెనుగుతోవు, ఆంధ్ర ప్రశస్తిని తలపించు చుండును. సీసపద్యము వీరికి మూసలు పోసినట్లు జాలువాఱును. తొలికరియను శీర్షికను ఈ పద్యము మచ్చుగా తీసికొనవచ్చును.

హృదయ ముప్పొంగగా నుఱిమినచో నీకు
  పూజ యొనర్తుము పొన్నపూల
మిఱుమిట్లు గొలుపగా మెఱసిన నియ్యెదే
  అరటాకు దొన్నెలో యలరు దేనె
చెఱువులు నిండించి స్వీకరింపుము కాన్క
  దొరబంపిన మేలి దోసపండ్లు
పైరులు చక్కగా పండిన నిత్తుము
  పండుటాకుంలోన పచ్చివెన్న
ధాన్యలక్ష్మి ప్రసన్నయై తనరు కొఱకు
వరము వేడుదు జోడించి కరయుగంబు
వరుణ, మావంక జూడుము కరుణతోడ
శబలితంబైన యీ రమ్య సమయమందు.

ఈ చిన్ని పుస్తకములో తెలిసియో, తెలియకయో, ముద్రణవల్లనో, అశ్రద్ధ వల్లనో జాఱిన గణదోషములు, యతి ప్రమాదములు చాల కలవు. మఱొక ముద్రణములో వానిని సవరించుకొందురు గాక!

"కాని యీ దేవదేవున కవ్వానికన్న"
"ఏమియును దోచ కట్టులే యొసంగు నపుడు"
"మధురస్మృతి అయ్యయో ఏల మఱవురాదు."
"స్వచ్ఛ స్వాతంత్ర్యదేశాన సంచరించు."
"ఆప్తుల బంధులముందు నతనితో నేనెట్లు"
"ఎప్పుడో పాడుచు నేగుదెంచె"

"ఎన్నిదినంబుల కే తల్లి నిన్నుజూడ" ఇట్టి వానిలో కొన్ని అచ్చుతప్పులు కావచ్చు. కొన్ని యతిభంగము లున్నవి.

"నడుము కొద్దాణ మొకవింత పొలుపుగూర్చ"
"అరసి తన కష్ట సుఖముల మఱచిపోయి"
"జలకమాడగ నేగును చెఱువునందు"
"హృదయ మింకొక వ్యక్తిపై నుంచుకొనుచు"
"హృదయములు దూర మొనరింపనోపు దొక్క"
". . . . . . . . . . . . వదనార
విందాన దోచు విచారముద్ర"
"కలికి నీ చక్కదనమున కలరియేమొ"
"మృత్యుదేవతకున్ గూర్చు ముదు చెప్పి"

ఇట్టి వెన్నయినా చూపవచ్చును.

## శిక్ష

నవల—ఎన్. ఆర్. చందూర్. ప్రచురణ : దేశికవితా మండలి. విజయవాడ—2. 1/8 క్రౌను సైజులో 176 పుటలు. వెల : రెండు రూపాయలు.

ఈ నవల పునర్ముద్రణము. హరిశ్చంద్రరావు జీవితంలో తటస్థపడిన స్త్రీలలో అభాగిని హారిణి తరువాత ఆతని

# గ్రంథ విమర్శనము

పైన మక్కువగొన్న ఊర్మిళ, వసంతలలో వసంతను పెళ్లి చేసుకోవడం, ఊర్మిళకు శిక్ష విధించడముగా భావిస్తాడు హరి. ఊర్మిళ దానిని చిరునవ్వుతోనే స్వీకరిస్తుంది. ఈ మూడు స్తంభాల ఆటలో ఎవరు గెలిచినా, ఎవరు బయట ఉడిం పోయినా, అందఱూ సమానంగానే జీవితం ఒక వినోద హేతువుగా స్వీకరిస్తారు.

ఇదివఱకు చదువనివాళ్లకి ఇది ఆహ్లాదం కలుగజేస్తుంది. కథలో సంఘటనలు, సంభాషణలు చకచకా నడిచిపోయి మంచి సంఘర్షణతో పాఠకుల దృష్టిని ఆకర్షిస్తాయి. ఎన్. ఆర్. చందూర్ ఏది చెప్పినా ఖులాసాగా, క్లుప్తంగా చెప్పగలిగిన నేర్పరి. ఈ నవల ఆయన రచనాశైలికి ఒక మచ్చుతునక.

## రక్తస్పర్శ

కథల సంపుటి—రచన: కీ. శే. 'శారద'. ప్రచురణ: దేశి కవితా మండలి, విజయవాడ, 1/8 క్రౌను సైజులో 170 పుటలు. వెల: రెండు రూపాయలు.

ఇది కూడ పునర్ముద్రణ. హోటలు సర్వరుగా తెనాలిలో పనిచేసి అచ్చాఫీసు ఆవరణలోను, అభాగినుల పూరి కొంపలలోను జీవిత పాఠాలు నేర్చుకొని వాటిని కథలలోకి, నవలలోకి సమగ్రంగా అనువదించకుండానే అర్ధాయుష్కుడుగా చనిపోయిన 'శారద' పేరుతో వ్రాసిన నటరాజన్ కథల సంపుటం ఇది. రక్తస్పర్శలో ఒక సున్నితమైన సంఘటన. సులలితంగా చెప్పాడు. ఈ కథలన్నీ జాలిగొల్పేవిగా పాఠకుల్ని చదివించేవిగాను ఉన్నవి.

## ఆనందం: జీవనది

వచనకవితా సంపుటి—రచన : గోపాల చక్రవర్తి. ప్రచురణ : స్నేహాంజలి. 234—3— ఆర్. టి. విజయనగర కాలనీ, హైదరాబాదు—28, 1/8 రాయల్ సైజులో 48 పుటలు. వెల: రూపాయి ఇరవై నయాపైసలు.

గోపాల చక్రవర్తి కొత్తగా సరికొత్తగా వచన కవిత్వరంగంలో ప్రవేశించిన పెద్దమనిషి. అయినా శ్రీ శ్రీ, ఆరుద్ర మార్కు 'అర్ధాన్నపు అడవి' లో అర్థాన్ని విడిచిపెట్టలేదు. ఛందో బందోబస్తులు చటప్‌టమని త్రెంచినా, 'లయ' వీడలేదు. గతి తప్పలేదు. అందుచేత అతడు టైఫాయిడ్‌గీతాలు రచించినా 'ఇబ్బంది ప్రయాణం' చేసినా ఆశతో ఆనందిస్తాడు. అందుకే అతని యీ వచన గీత సంపుటికి 'ఆనందం—జీవనది' అని పేరు పెట్టుకొన్నాడు. అంతా చేస్తే 48 పుటలలో నాలుగు పెద్ద పద్యాలు, నాలుగు చిన్న పద్యాలూ కంటె చెప్పలేదు. ఆ చెప్పినవి మఱొకరు చెప్పినట్లు కాక తాను స్వంత గొంతుకతో తర్కించి చెప్పినట్లు ధాటీగా, ఘాటుగా చెప్పివేశాడు. దానిలో చిత్తశుద్ధి శంకించడానికి వీలులేదు. చెప్పవలసినది సూటిగా మోమోటం లేకుండా చెప్పడంలో ఒక పలుకుబడి వచ్చింది. ఒక శైలి వచ్చింది. ఛందస్సు లేని యీ పద్యాలకు కూడ ఒక ముక్త ఛందస్సు ఏర్పడింది. యతిప్రాసలు వాటంతట అవి వచ్చాయి. దానితో మధురమైన లయ, మందమైన గతి స్ఫురించి మనోరంజనంతోపాటు, మన శ్శాంతి కూడా కలిగిస్తున్నాయి. తాడు, బొంగరంలేక తచ్చాడుతూ ఉన్న మన యువకలోకానికి యిలాంటి కంఠం వినిపించడం, భుజంమీద చేయివేసి భరోసా యిస్తున్నట్లుగా ఉంటుంది ఈ పద్యాలు చదువుతూ ఉంటే. ఈ యువకునికి భవిష్యత్తులో మంచి విశ్వాసం ఉన్నది — అందుకే అంటాడు,

> ఎల్లలు చెరిగిపోయి, ఎల్లరు ఒకటయ్యే వేళ
> నేటి నగటు సంతోషాన్ని కోటిపెట్టి హెచ్చించేరోజు
> నిత్యం వసంతంగా ఉండే సీజను,
> అదే కనిపిస్తున్నది మనస్ టెలివిజన్‌లో.

"రైక్షికుడు", "క్రిటిక్ మిత్రుడి" వంటి శబ్దముల కల్పనలోనే కాదు, ఆహాన్ని గ్లాసులో ఓపొల్సి చేసిన దేవదాసుకి 'శరీరం సూపర్‌సానిక్ జెట్‌లా తిరుగుతున్నప్పుడు' కలిగిన అనుభవాల వంటివి క్రొత్త "ఇమేజరీ" వర్ణించేటప్పుడు, రచయిత ప్రదర్శించిన ప్రత్యేకమైన 'ఉపజ్ఞ' ప్రతి పంక్తిలోను ప్రతిధ్వనిస్తుంది. క్రొత్త కంఠం, క్రొత్త బాణీ, క్రొత్త మాటలు. ఉదాహరణకు రిక్షావాడు యూసఫ్‌ని చూచి కవి నేర్చుకున్న పాఠంలో ఎంత ధైర్యం, ఎంత నమ్మకం ?

> ఒంటరితనం శత్రువులా వెంట తరుముతున్నప్పుడు
> నిన్ను చూస్తే హృదికథక్ నృత్యం చేస్తుంది.
> నీ నిర్మోహత్వం, బతుకు పట్ల నీ నమ్మకం
> నా యెడద యెడారిలో నేను కాస్తేవు
> ఆగడానికి రెండు ఒయాసిస్సులు.

నేటి జీవితపు ఎడారిలో ఇలాంటి ఒయాసిస్సులు చూడ గల గోపాలచక్రవర్తిలాంటి రచయితల ఆనందజీవనదులు తెనుగు కవితా కేదారాన్ని పుష్పింపచేయడానికి ఎన్నయినా అవసరం !

## కళ్లులేని కబోది :

(పరిశోధక నవల. రచన : బేతంబెర్ల గుండాచార్యులు ప్రకాశకులు: జనవాణి పబ్లికేషన్స్, మధ్వాచారిపేట 1/118

సి. కోట, కర్నూలు. పాకెట్ సైజులో 115 పుటలు. వెల: ఒక రూపాయ.)

ఒక 70 వేల జనాభా ఉన్న పట్టణంలో యాభై ఏళ్ల వ్యక్తి ఒక బిచ్చగాడు వచ్చి హత్యచేయడం, ఆ యపరాధాన్ని కాడిలాక్ కారులలో తిరిగే డిటెక్టివ్, ఆతని వెంట కాడిలాక్ కారులో తిరిగే 'పారూ' అనే అమ్మాయి పరిశోధన చేయడం—ఇందలి కథ. ఇంతకూ హత్యలో 'కళ్లులేని కబోది' వేషంలోని ఒక సినిమా యాక్టర్ నళినీచంద్, దీనివెనుక 'జగదీశ్వరి' అనే కులట విషప్రయోగం పనిచేసిందనీ కథలో చెప్పబోయాడు. డిటెక్టివ్ కథలో రావలసిన ఉత్కంఠ' కాని, కథలోని జిగి కాని రచయిత తేలేదు. నవల రచనలో ఏవిధమైన ప్రత్యేకత లేదు సరిగదా! పుస్తకం అట్టమీద వేసిన అర్ధనగ్న శరీరంతో అద్దం ముందు కూర్చున్న అలంకరణ దృశ్యం అసభ్యంగాను పుస్తకానికి దీష్టిబొమ్మలాగ పనిచేస్తున్నది. ఇలాంటి పుస్తకాలు కొనేవారున్నారేమో. డిమాండును బట్టి సప్లై, అంతకు మినహా ఈ రకం పుస్తకాలలో సాహిత్యపు విలువల కొరకు ఆశింప నక్కరలేదేమో!

—శ్రీ వాత్సవ.

## ఉత్తరదేశ సంపూర్ణ క్షేత్రయాత్రాదర్శిని

(గ్రంథకర్త : కొల్లూరి వేంకటరావు. పుటలు : 256 వెల : 3.00.)

ఇందు భారతమున ప్రసిద్ధములైన కాశీ, గయా, ప్రయాగ, బదరీ, హృషీకేశ, కేదారాది క్షేత్రములేకాక, పశ్చిమమునగల ద్వారక, ఉజ్జయిని నాసికాత్ర్యంబకాది క్షేత్రములు వర్ణితములైనవి. నేడు ఒరిస్సా రాష్ట్రమందుగల పూరీ, జగన్నాథముతో విది ప్రారంభము. కాని తెలుగు దేశమునగల శ్రీ కూర్మము సింహాచలము హర్షవల్లి (అరసవెల్లి) అన్నవరం వీని వివరము లిందున్నవి.

గ్రంథము చివఱ ద్వాదశ జ్యోతిర్లింగ చరిత్ర సంగ్రహముగా గలదు. ఆయా క్షేత్రములను దర్శించువారికిది 'గైడు'—మార్గ దర్శిని—కావున యాత్రికులకు మిక్కిలి యుపయుక్తము. ప్రతులకు : కొల్లూరు వెంకటరావు, కాకర్లవీధి, రాజాంపోస్టు, శ్రీకాకుళంజిల్లా.

## రా మ దా సు

కర్త : కంచర్ల పాండురంగశర్మ. ఇందు మహా భక్తుడగు భద్రాచల రామదాసు చరిత్ర సులభ వచన రూపమున రచింపబడినది. రామదాసు చరిత్రయందలి కీర్తనలు పద్యములు అచ్చటచ్చట గలవు. పుటలు: 44, వెల : 0—75 న.పై., ప్రతులకు : గ్రంథకర్త, జిల్లాపరిషత్తు హైస్కూలు వినుకొండ.

## వి ద్రో హం

బి. గోపయ్య రచితము. చైనా దురాక్రమణను గూర్చిన నాటకము. అయిదు అంకములు అయిదు రంగములు గలవు. పద్యములతోపాటు పాటలు గలవు. నాటక ప్రదర్శనము సులభముగాదు. చదువుటకు మాత్రముపయుక్తము. పుటలు: 76. వెల: 2.00 ప్రతులకు: బి. రాఘవయ్య రాఘవ విలాస్, రామగిరి పోస్టు నల్లగొండ.

## రా ధి కే శ

రచయిత: ఆవుల పురుషోత్తము. ఇది 'రమ్మనీ దర్శనమ్మిమ్మురాధికేశ.' అను మకుటముగల గీతపద్యశతకము. రాధాస్వామి సంప్రదాయమునకు సంబంధించినది. గీతములు భక్తి యుతములు పుటలు: 28. వెల: రు 25. న.పై., ప్రతులకు: ఆవుల పురుషోత్తము. బహుళార్థసాధక పాఠశాల, ఖమ్మం.

## విజయభారతి-గేయములు

ఆకాశవాణి ప్రసారితాలైన మనదేశం మొదలగు జాతీయ గీతములేగాక, వల్లథోల్, బంకించందు, మంగిపూడి, దాశరథీ మొదలగు జాతీయగీత రచయితల ప్రశంసలు గలవు. ఆంధ్ర రాష్ట్ర ప్రధానామాత్యున కంకితము. పుటల 69, వెల: 2.00.

## వి క్ర మ భా ర తి

ఇదియును గేయకృతియే. నేటి అత్యవసర పరిస్థితి కనుకూలముగ, యువకులనుద్బోధించు గేయము లిందుగలవు. పుటలు : 64, వెల: 2.00. ఇది యస్. వి. ఆర్. అప్పారావు గారికి అంకితము.

## దివ్వటీలు

పద్యకృతి. అనంత శయనం అయ్యంగారి కంకితము, నాదేశము, క్రొత్త స్వర్గము, శ్రీరామరక్ష, ఆగస్టు పదునైదు. జనవరి ఇరువదియారు అను శీర్షికలున్నవి. పుటలు: 28 వెల: 75 న. పై.,

పై మూడు కృతుల ప్రతులకు శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి, భారతీ నికేతనము, విజయవాడ—4 అని వ్రాయవలెను.

## హంస కిరణావళి

శ్రీ పరిపూర్ణ ప్రకాశానంద నాథవిరచితమ్. సంస్కృత భాషారచన— ఇది రెండు భాగములుగా నున్నది. మొదటిది కల్యాణానందనాథ శిష్యులగు పరిపూర్ణ ప్రకాశానందనాథ కృతము. రెండవది, భ్రాభవ్యస్మరదర్శనము. విలాసినీ వ్యాఖ్యా సహితము ప్రకాశ— విమర్శ—ప్రకృతి— సమన్వయ

ములను నాలుగు పాదములకు వ్యాఖ్యగలదు. ఇది శ్రీ వైద్య వల్లభ సర్వతంత్ర శ్రీ రాజ్జీ వెంకటాచలపతి ప్రసాద మహోగ్ని చిద్యజ్వకృతి. ఈ గ్రంథము శ్రీ విద్యాసంప్రదాయజ్ఞులగు సాధి కారులకు మాత్రమే గాని ఇతరులకు గాదు. వెల : 5.00, పుటలు : 65. ప్రాప్తి స్థానము. విద్వాన్ భువనగిరి చెంచు పున్నయ్య, ఆంధ్రోపాధ్యాయులు, జిల్లా పరిషత్ హయ్యర్ సెకెండరీ స్కూలు, కందుకూరు నెల్లూరు జిల్లా.

## కుమతీ శతకము

కర్త : 'మతిశ్రీ' నివేదన—ఇతిశ్రీ సంపాదన— తెలుగున ప్రసిద్ధమగు సుమతి శతకమునకు, హేళనగా రచింపబడిన 113 కంద పద్యముల శతకము. 'వినోద బుద్ధిని కావాలని' వ్రాసినది. ఇట్టి శతక మీ పేరితో ఏభయి యేండ్ల క్రింద టనే ఒకటి రచితమైనది. పుటలు : 23. వెల 40 న. పై. వలయువారు: యం. సూర్యనారాయణమూర్తి కేర్ ఆఫ్ యూని వర్సల్ బుక్ సెంటర్, అమలాపురం.

## సహస్రచరణ శివగీతమాలిక

కర్త : క్రొవ్విడి రామం. ఇందు శివమహిమ, శివక్షేత్ర ములు, శివకవులు, హరిహరభక్తి, చెంచుతిన్నని కథ, శివ ప్రశస్తి, శివానందలహరి భావములు, ఫలశ్రుతి యను శీర్షి కలు గలవు. అన్నియు గీతములే. సులభశైలిలో శివభక్తిని ప్రస్ఫుటము చేయుచున్నది. 44 పుటలు. వెల : 50 న. పై. ప్రతులకు : కౌముదీ పరిషత్తు, విజయనగరం—2.

## కళాతరంగిణి

కర్త : ఎం. ఎస్. రామాచారి. ఇందు 64 కళల నిర్వచ నము, కళాసాధన, కళారక్షణ, జీవకళ, కళాసంపత్తి మొద లైన శీర్షిక లున్నాయి. కళలను గూర్చి సులభముగా తెలిసి కొనుట కుపకరించును. గ్రంథాదిని సుప్రసిద్ధాంధ్ర సినీ నటీ నటకుల చిత్రము లున్నవి. పుటలు—89. వెల : 1—50 ప్రతులకు : ఎం. ఎస్. రామాచారి 1—8—283, చిక్కడ పల్లి, హైదరాబాదు—20.

## శివపురాణ మాహాత్మ్యం

కర్త : బొగ్గవరపు బుచ్చయ్యశాస్త్రి. స్కాందపురా ణాంతర్గతమైన శివపురాణ మహాత్మ్యము వ్యావహారిక శైలిలో జెప్పబడినది. పుటలు : 32. వెల : రూపాయి. పుస్తకమున విశేషము వెల యధిక మగుటయే. ప్రకాశకులు : పి. రాధా కృష్ణమూర్తి. ఆధ్యాత్మ ప్రచారక సంఘము, విక్రమహాలు, రాజమండ్రి.

## పుష్పమాల

కర్త : కోగంటి దుర్గా మల్లికార్జునరావు. ఇందు రచ యిత ఆయా సందర్భములలో కొందరుమంది ప్రముఖులను గూర్చి, సమావేశములను గూర్చి చెప్పిన పద్యము లొక్కచో ముద్రి తము లైనవి. సరస ప్రస్తావిక రచన—చివర విషయసూచి గలదు. పుటలు : 48. వెల : 75 న. పై. ప్రతులకు : గ్రంథకర్త : భారతీ సమితి, పెమ్మళ్ళు.

## భావతరంగాలు

కర్త : రంగెళ్లపాడు రంగశర్మ. ఈ చిన్న పుస్తకములో దేశకాల పాత్రానుగుణముగా, 26 శీర్షికలలో, విజయశ్రీ మొదలు వందన సమర్పణ వరకు గేయము లున్నవి. రచన మనోజ్ఞముగా నున్నది. పుటలు: 64. వెల 1—00. ప్రచురణ: శర్మ పబ్లికేషన్సు, 10/70, పార్కురోడ్డు, విజయవాడ—1.

## అగస్త్యేశ్వర సుప్రభాతము

సంస్కృతము. కృతికర్తలు : వేదాంతపారీణ కవితా మహేశ్వర మిన్నకంటి గురునాథశర్మగారు.. 'శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము' ప్రజాలోకము ప్రతిదినము వినుచున్న సంగతి యందరికు విశదము. ఆ రీతినే కొల్వలూరున వెలసిన అగస్త్యే శ్వరుని గూర్చి గురునాథశర్మగారీ ప్రశస్త ప్రభాతస్తవమును రచియించిరి. ఇందు స్తుతి, ప్రభాతము, ప్రార్థనము, మంగళాశాసనము అను నాలుగు భాగము లున్నవి.

పుటలు : 24. వెల లేదు. ప్రతులకు : గ్రంథకర్త, బ్రాడీపేట—5 వ లైను, 15 అడ్డరోడ్డు, గుంటూరు.

## శ్రీ వైశాఖ వేంకట ప్రభూదయము

రచయిత్రి : శ్రీమతి బుర్రా కమలాదేవి. ఇదియొక పద్య కృతి. విశాఖపట్టణమున హార్బరువద్ద కొండపై తురకల మసీదు, క్రైస్తవుల చర్చి, హైందవుల వేంకటేశ్వర దేవా లయము నొకచోట గలవు. అందు వేంకటేశ్వర దేవా లయము నౌకాశ్రయపు కార్యముల వలన మున్మూలితమైన స్థితికి రాగా భక్తులు దానిని ఉద్ధరించిరి. శ్రీ అన్నవరము వీరవెంకట సత్యనారాయణస్వామి దేవస్థానమువారు పదివేల రూప్యముల నొసగిరి. నేడా దేవాలయమున వేంకటేశ్వరుడు నిత్యా ర్చన భోగము లందుచు, భక్తులకుపాస్యుడగు చున్నాడు. ఆ దేవాలయ పునరుద్ధరణ సమయమున శ్రీమతి బుర్రా కమలాదేవిగారి ప్రశస్త పద్య కావ్యమును రచించి, శ్రీ వేంక టేశ్వరునికి నివేదించిరి. గ్రంథ మమూల్యము. 56 పుటలు

ప్రతులకు : శ్రీమతి బుర్రా కమలాదేవి, మహారాణిపేట, విశాఖ పట్టణము

## నీ రా జ న

ఇదియొక త్రైమాసిక పత్రిక. శ్రీ అరవిందుల యొక్కయు, శ్రీమాత యొక్కయు సందేశములను ప్రచారము చేయుటయేగాక, అరవింద వాఙ్మయము నంతయు నాంధ్రభాషలోని కందించుటకు కృషి సేయుచున్నదీ పత్రిక. ఇది 1962 ఆగస్టులో వెలువడినది. దీనితోపాటు మఱి మూడు సంచికలు ప్రకటితము లైనవి. ఇవి వేఱుగా నున్నను వీందు అరవిందుల "పూర్ణయోగ సిద్ధాంతము" సంపూర్ణముగ వివరింపబడినది. అరవిందుల భగవద్గీతావాదము, ప్రశ్నోత్తరములు, యోగశాస్త్రము, ప్రార్థనలు, ధ్యానము మొదలైన యాధ్యాత్మిక విషయములు, సులభశైలిని అందఱ కందుబాటులో నుండునట్లు రచితమ్మైనవి. ఈ పత్రిక జయపురము నుండి శ్రీ అరవింద పఠన కేంద్రము వారిచే ప్రకటిత మగుచున్నది. సంవత్సర చందా 2 రూపాయలు. విడి ప్రతి : 50 నయాపైసలు.

---

# మ న్మ థ స్తు తి

మన ప్రాచీన కావ్యములలో, ఇష్టదేవతాస్తుతిలో, నితర దేవతలతోబాటు మన్మథుడు స్తుతింపబడుట విశేషము. ఉపలబ్ధములైన వానిలో కొన్ని ప్రకటించుచున్నాము: భా. సం.]

1. క. హరుఁడాదిగ సకలచరా
చరమయ జీవాళి నెల్ల సతతముఁగామా
తురులుగ వశగతి జేసిన
మరుఁడీవుత మఖిలవశ్యమతి మత్కృతికిన్.

—నన్నెచోడ కవి-కుమార సంభవము. (1—9)

2. మ. తన దుర్వార శర ప్రతాపమును జిత్తస్నేహముం బట్టిసే
యునితండెంత విదగ్ధుఁడో తలప 'హాహా' యంచు లోకంబుగో
వన పుష్పం గరమొప్పు దర్పకుఁడు రాజత్సుందరాకారుఁడై
ధన సంపన్నుఁ గృతీశ్వరున్ బ్రచుర సౌభాగ్యాన్వితుం జేయుతన్.

—కేతన దశకుమార చరిత్ర. (1—7)

3. చ. గొనయము తుమ్మెదల్, చెఱకు గోల ధనుర్లత, పూవులమ్ములై
టును నొక మాటు, తానతడునున్ మును మ్రగు జయించి జీవరా
శినొడుచుటేమి చెప్పవని చేయు మతుల్ తగు, మోహనప్రవ
ర్తన గల కాముఁడీవుత ముదంబున మీ కిలు గావు సౌఖ్యముల్.

—చిమ్మపూడి అమరేశ్వరుఁడు. విక్రమసేనము.

4. చ. పరిజనకోటి తుమ్మెదలు, పాటకవర్గము కోకిలాళి, చం
దురుఁడు సితాత పత్రము, వధూతను మధ్యము విల్లు, పొంగమున్
శరములు, గంధ సింధురము చల్లని వాయువుగాఁగ లోకముల్
బరిగొని గెల్చు మన్మథుడు భైరవ మల్లని బ్రోచు గావుతన్.

—కూచిరాజు ఎఱ్ఱన కొక్కోకము. (1—3)

5. ఉ. ఎవ్వని యాజ్ఞమౌళిఁ బ్రియునెప్పుడు దాల్చిన వాఁడు శంకరుం
డెవ్వని మాయఁ జిక్కువడ కెక్కటి ఇంద్రుఁడు కైనఁ దోఁపరా
దెవ్వని పేర్మి వర్ణనల కెక్కు జగత్త్రితయైక ధన్వినా
నవ్వెడ విల్తు గొల్తు కృతివాది కవిత్వ మహత్త్వసిద్ధికిన్.

—నారన సూరన— ఉదయనోదయము (1—5)

---

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Ch[illegible] Street, Madras—1. Editor : S. Sambhu Prasad.

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

అక్టోబరు 1963

సంపుటము 40 : : సంచిక 10

విడిపత్రిక వెల ఒక రూపాయి

# స్వ ప్న భం గం



కీ॥ శే॥ కాటూరి వెంకటేశ్వరరావు[1]

ఈ మంగళ ధ్వనుల్ తూర్యరవము
లేటికి చెవిచెంత? యించుకనన్ను
కన్నుమూయగనీరు, కలగాంచనీరు
బంగారువంటి స్వప్నము భంగమాయె..

పనిపాటు లేదో ప్రజలకునెల్ల
తప్పెటల్ బూరలు తాళములూని
అర్భటుల్ పెడబొబ్బ లట్టహాసములు
చెవిచెంత రొదసేయ చేరినారిచట
ఏమియో మున్గిపోయినది మీకెల్ల
తొందరలేదు నిద్దుర వొండుపోయి..

వలదుపొండన్ననన్ వదల రిదేమి?
తెలవారుగాక చుక్కలు రాలుగాక
ముసుగుదీయను పోయి మొఱవెట్టుకొనుడు..

పోరు నిద్దురమీరు, పోనీరు నన్ను
రాదు నిద్దురమీకు రానీరునాకు
గర్భదరిద్రులు కలలేల మీకు
చెరుపనచేటలై చేరినారిచట
పొందు మీదారిని పొండన్నలార..

అబ్బ యెక్కడిగోలరా? దాపురించె,
కడుపుబ్బ నా కలపైని మీకు
నిర్భాగ్యులకు బండ నిద్దురల్ గాక

---

1. రచన ౧౯౩౩.

కలల యుత్సంగాన కన్నులు మోడ్చు-
సుఖముగల్గునె? నాదుజోలి మీకేల?
కలలపై మీకింత కన్నెఱ్ఱయేల?

ఒక ప్రాణి నిద్రకే నోర్వగలేరు
ఎంతటి పాపభూయిష్ఠ మీ జగము
ఈ రాగతనమేల? ఎవ్వారి పనుల
నెవరు మానుదురు? మీ కిద్దియే పనియె?
ఒకరితో పనియుండ దోకయప్పునాకు
నా తోడనే పనా, నరులకునెల్ల
కనుమూసి నన్నొక్క కలగాంచనీరు
తలలు మీకెంత బ్రద్దలు గొట్టుకొన్న
ప్రళయమ్ము దన్క కన్నులు విప్పనేను
వలదనన్ నేను కన్నులు మోడ్చి మీరు
గలలు గనుండు బంగారుగలలు..

---

## అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము:

# సాహితీసమితి తరువాతి నవకవులు



### డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

## 12

'భారతి' తెలుగువారికి ఇచ్చిన ముగ్గురు నవకవులలో కొడాలి సుబ్బారావుగారు ఒకరు. (జాషువా, బెళ్లూరీ తక్కినవారు.) వీరందరూ కొద్దికాలంలోనే చదువరుల నాకర్షించారు. విశ్వనాథవారి ఆవేశమూ, ఆంధ్రాభిమానమూ ఆంధ్ర ప్రశస్తిలో వర్షావసరమువలె ఉరుములతో మెరుపులతో తొక్కుకు పోయాయి. వారి అనుయాయులే కొడాలివారూ, ఆ రెండూ వీరి మనస్సులో హంపీ క్షేత్రపు పూర్వ స్మృతులలో ముగ్గి హంపీక్షేత్రపు ఖండ కావ్యాలుగా వచ్చాయి. ఆ క్షేత్రాన్ని దర్శించి తమ అనుభవాన్ని రచించినవారితరులు ఉన్నా, కొడాలివారి రచనలలో ఉన్న శక్తీ, వేగమూ వారికెవరికీ అలవడలేదు. తెలుగువారి నైజములోని ఆవేశమూ, కవిత్వాభిమానమూ విశ్వనాథవారి సాహచర్యముతో కొడాలివారిలో పదునెక్కి వాడిగా వచ్చాయి.

కొడాలివారు విశ్వనాథవలె చారిత్రక క్షేత్రాన్ని కావ్య సామగ్రిగా స్వీకరించారూ, వారి సీసముల ఎత్తుబడిని— ఏ రాజు పంచెనో, ఈ పాలాలెంత చేవ, గణితశాస్త్రాంభోధి ఘముడు, ఛేదింపబడి వంటి వాటిని— స్వీకరించి కొత్త ఆవేశముతో విశ్వనాథవారు వేసిన ముడులు— చేవెక్కించుకున్నవి, శౌర్యపు పాయసమ్ములు, గాలి పౌరాతన్యమూ, వియ్యాలు బిగిసిన చోట్లూ, వంటివి— పట్టుకోకుండా సాఫీగా నడిపించారు కొడాలివారు. వారికి లేని ఒరవడి వీరికి ఉంది. ఈ ఒరవడి, పద్యాలు వచనంలాగా నడిచిన చోట్ల వివరంగా కనబడి పోతుంది. తెలుగులోనికి పద్యము ప్రవేశించిన ముహూర్తం చెడ్డది. తెలుగు భాషకి తగని తొడుగుని అమర్చి శతాబ్దాల పర్యంతం— జీవుడికి బొందిలాగ గుదిబండ అయింది. చంపకమాల యెందుకు ఎంచారో, శార్దూలము ఎందుకెంచారో, గీతము ఎందుకెంచారో, ఆట వెలది ఎందుకు ఎంచారో, తెలియకుండా పెద్ద పెద్ద చంపూ కావ్యాల్ని పద్య పంజరాలలో రచించారు కవులు. చదివేవారైనా, చేతవాని సంగీతాన్నైనాసరే ఈ పంజరాలను ఎక్కించి పద్య గతిని నిర్భాగ్యా లాగేసి తమ సంగీతములోని ఆరోహణావరోహణాలకు ఎరగా పంచుకున్నారు. పద్యాల కుండవలసిన పాదాంత విరతిని తీసేసి— ఇంతలోనే నాలుగు విరుపులా ? అని— సూరన్నలను కూడా ఆక్షేపించారు పెద్దన్నలూ, ఉచ్చారణకు కూసరాగము చేర్చి అక్షరగణాలు వైవిధ్యము స్ఫురించకుండా పాడి ఛందోభేదాన్ని నిరుపయోగము చేశారు సభాముఖాన్న 'చదివే'వారు. నన్నయగారు సీసాన్ని ఇంచుమించు గద్యగా వాడుకున్నారు. విశ్వనాథవారు పద్యాన్ని దేనైనాసరే దాని సహజగతి స్ఫురించకుండా వ్రాయగలరూ, వ్రాశారు కూడాను. కొడాలివారు కూడా ఆ దారిలోనే చేశారు చాలా రచనలు. విశ్వనాథవారి వచనంలో వారి పద్యాలలో కంటె ఎక్కువ కవిత్వము కనబడుతుంది నాకు. కొడాలివారి వచన రచన ఎట్లు తేరి ఉండేదో ?

అయితే వారి పద్యరచనలలో 'శిలలు ద్రవించి యేడ్చినవి' (కృష్ణశాస్త్రిగారి యేడ్పునకు తరువాత ఇంత అందమైన యేడ్పు మనము వినలేదు.) బాకు పోటున చిమ్మబడిన నెత్తురు జల్లు వెల్లవేసింది రాజవీథికి, శిరము తెగి మొండెమ్ము కోట బురుజుమీద పడక నిలిచింది, విఠ్ఠలాలయ శిలావేదులందు దేవి పాలమీగడ చిలికింది. తెనుగు రారాజు పండిన యశస్సూ, రాకాసిరేడంటరాని మంటా, వాల్మీకి యమృతంపు వాన చినుకూ జీర్ణించిన కుగ్రామము చూపించింది, కాళ్ల పారాణి చిక్కన కిన్నరాంగనా నృత్యవేళల చెమటలో కరగి చారపోసినది, దాసియయ్యు పతివ్రతాత్వ భంగము కోడి నిట్టూర్పులో అగ్గి నిలిపినది, దీన చరిత కాస్పందంబయినది ఆంధ్రమాత. 'కాలము మారిపోయి శునకంబులు బొబ్బటి లంగ చాలక నిల్చిపోయిన బెబ్బులులూ, రణము వాక్కులతో

విశృంఖలము పెరిగి గుక్క తిప్పుకో వీలులేని రాజసభా, వలయుంబులునై, విరళీకృతంబులై కదలిన శబ్దములూ, నలసల వేడినెత్తురులు చారలుగట్టి బుగ్గలపై రాలు కన్నీటి బొట్లూ జల్లుజల్లు మనిపిస్తాయి. కొడాలివారి వాణిలో తెలుగు గొంతు ఆవేశంతో గణగణ మోగింది. విశ్వనాథవారు ప్రారంభించిన చారిత్రక కథనము, కొడాలివారి రచనలతో ఆంధ్రవాఙ్మయములో పీఠము వేసుకుంది.

రాయలవారి సభలోకి రసమయుడైన అజ్ఞాత కవి ప్రవేశించినట్లు భారతి పుటలలోనికి జాషువా అందపు పద్యములు సందడి చేయకుండా ప్రవేశించినవి. "నాయకురాలి మాయ కదనంబున మా పలినాటి పౌరుష శ్రీ యడుగంటె గడ్డి మొలిచెన్ పులిచారల గద్దెమీద" అంటూ రసమయ రచనలను వస్తుధ్వనిలో వినిపించింది వారివాణి. సంస్కృత పద కింకిణుల మ్రోతకు మొగము మొత్తిన చెవులకు తెలుగు పలుకుల తియ్యదనము రుచి చూపింది వారివాణి. బాల్యంలో ఒడిలో కూర్చో బెట్టుకుని గొల్లసుద్దులు వినిపించి తేనె తేటలూరు భాషనూ, వెచ్చని గుండెనూ తండ్రీ, ఇలుదాటి పోయినవా మరలినదాక మూడు గాళ్లతో వెంట తిరిగిన ప్రేమాభిమానాల రుచిని తల్లీ నేర్పారు ఈయనకు. అందాలు వర్షములాగ కురిశాయి ఈయన రచనలలో. ఈయన భావన అంతా పరిచిత ప్రపంచ సామగ్రినే వాడుకుంటుంది. గిజిగాని తూగుటుయ్యేల గృహమూ, భారతమాత వచ్చిబాలెంతతనమూ, నాయకురాలి మాయ కదనమూ, గజ్జెగదలించియాడు నిటాలేక్షణుడూ, సంతానము వెంట మూడు కాళ్లతో తిరిగే తల్లీ, పున్నమ నుండి అమావాస్య వరకే జీవించే చంద్రుని అల్పజీవనమూ, నెమలి మహేంద్రత్వమూ (కన్నుల పిరిని బట్టి), బంగారు పూవుటెండ్లూ, చిన్నాదేవి గులాబి తోటలూ, క్ష్మామండలం బెల్లముద్దు గొన్న బుద్ధదేవుని చరణాబ్జములూ, నెత్తురు చూడని కసాయి చిరుకత్తీ, ఉయ్యేల దిగని భాగ్యోన్నతుడూ (పసిబిడ్డ), మసీదు గుబ్బల విలాసమూ, కర్ణుని దిగదీసిన కులపరీక్షకులూ, ఇవజాని యెంగిలింగుడిచి పాల్చిన ధర్మరాజాదుల శరీరములూ, ఏనుగు పిల్లల వంటి పాండుపుత్రులూ, కృష్ణరాయల నెటుంగనట్లు వంగనాచివడకలు వడిచే తుంగభద్రా, పసిడికావ్య ద్రవ్యమును వెండితో జెల్లింపం దొరకొన్న గజనీ మహమ్మదూ, పరిచిత ప్రపంచ సామగ్రే వీరికవితా చంచల ప్రకాశముతో అందముగా గోచరిస్తుంది. ఊహ సాగి దూరపు టందాలందుకోయత్నించినప్పుడు కూడా 'గగన గంగమ్మ కవ్వలి గట్టునందు, దేవతలు స్నానమాడు రేవుపొంత, రాజహంసల పాదముద్రలు రహించు నిసుకతిన్నెలూ; పార్థుడు గాండీవంబుతో నాలముతో నటించు సమయంబున నింద్రుని వేయుగన్నులన్ రాలిన మోద బాష్పములూ; ఇనబాలకుని దిత్మునను గర్భమున బూను కాన్పులుడుగని పాదువు దిక్పతి; నెత్తుటి గాలివానా; అరమైలు సాగనంపి సెలవు గైకొను గోపురమూ; గాధినందనముని మేనకామిషతో ఆక్రమించుకున్న సంసార సాగరమూ, గుండెల్లో గుణాలు దాచుకున్న పరిచిత వస్తువే మెరుస్తుంది. అతను సదృశ భావాలకు కూడా సుందర తనువులు చేకూరుతాయి ఈయన శిల్పి స్పర్శతో. ఈ రూపకల్పన మల్లె పూవుల్నీ, మధు బిందువుల్నీ, రగిలే కుంపట్లనీ, బ్రద్దలయే అగ్ని పర్వతాలనీ, గజ్జె గదలించి ఆడే నిటాలేక్షణుణ్ణీ కవితా వనానికి పట్టి తెస్తుంది. చదువరుల నూతనానుభవానికేమి చిక్కు ?

ఈయన భాష తీయని తెనుగు. సంస్కృత సమాసపు అద్దాల అలంకారము లీయన కిష్టములేదు. తెలుగు సౌరభ్యంబులన్, నోరి చాపల్యము, పూర్వపుం బెద్దరికములూ, నేత్రయుగళిన్ సందీపితంబైన, అంటూ తెలుగు మాటల ప్రత్యేక సత్తను అడుగడుక్కీ దీపింపజేసే మక్కువలో సమాసాలు సాధించగల శ్రవణ సుఖానికీయన స్వస్తి చెప్పారు. తెలుగు మాటల చేరికలు 'కన్ను మిన్నెరుగని గర్వము, నినుముట్ట రాదను నియమము, పరుల కొంపలు దినివేయు స్వార్థమూ, కొత్త జాతీయాల చైతన్యాన్నీ, సమాసాల సౌందర్యాన్నీ సేకరించుకుని కనబడతాయి వీరి రచనలలో. పద్యాల అన్వయము అందపు పచ్చిక బయళ్లలో విన్నాణపు వంపులతో సాగిపోతూ కాలిబాటవలె వలపు పిలుపులందిస్తుంది. "పోయె నవాపరే లిపుడు పున్నమవెన్నెలవచ్చె, యుల్లమున్ గోయిల పిట్టయై, తెలుగు కొమ్మతలన్నివసించె, హాయిగా గూయకపోవునే, చిగురు కోకలతోడ వసంత లక్ష్మియున్ డాయుగవచ్చె, బుష్పవదనంబున బ్రేమమరంద మూరగన్" అనీ "వాసిని గన్నరెడ్ల పరిపాలన కొండల దండలన్ శిలాశాసన సంగతిన్నిలచి చచ్చియు చావదు, రెడ్డిరాణివై బూసిన కుంకుమంపు పసపుంబసలంటిన కన్నెతొండనే డూసరవెల్లి యైనవయుచున్నది పండు వెదుళ్ల సందునన్' అనీ పరిచిత సౌందర్యాన్ని ఉదయ వాయువువలే అందిస్తాయి వీరి పద్యాలు.

పద్యమునందంతటా అనుభవాలు చెప్పి, ధ్వని పూర్వకంగా రసానుభవం కల్పించి, చివ్వర ఒక్క— వాచ్యత వెగటు లేని— పద ప్రయోగంతో రచించే చిత్రాన్ని పూర్తి చేస్తారాయన. 'నా కవితా వధూటి వదనంబు నెగాదిగ జూచి, రూపురేఖా కమనీయ వైఖరులు గాంచి "భళీ ! భళి ! " యన్న

# సాహితీసమితి తరువాతి నవశకము

వాడి, ''మీ దేకులము''న్న ప్రశ్న వెలయించి, చిన్నయ్యన లేని పొన్నుచో బాకున గ్రుచ్చినట్లగును పార్థివ చంద్ర!'' అని చదివితే సహృదయులు 'సిగ్గుసిగ్గు' అంటారు. ఈయన కూడా పద్యాన్ని ''వచింప సిగ్గగున్''అని పూర్తి చేశారు. ఇలాగే, ''చిత్రములు మద్భూమి చరిత్రాంశముల్'' ''(మూలుగుచున్న దాంధ్రుల విభూతి) శతాబ్ద పరంపరాహతిన్'', ''మిథ్యా భారత గ్రంథముల్'', ''ఇక నేనియు రమ్ము దారికిన్'' ''(కాలము గమనింతము రమ్ము) కవుంగిలింతలన్'' ''(కులుక నేర్చిన కావ్య గుచ్ఛమిది) వాకుం గూర్చు వాసంద మున్'' వంటి వెన్నైనా ఉదాహరణ లివ్వవచ్చును. ఈ పద్ధతి కవిగారి రచనను సంపూర్ణము చేసి నిండుదనము తెస్తుంది రచనకి.

''అయితే జాషువా కవిత్వము ప్రాచీన సంప్రదాయానికి చెందినది గదా, ఆధునిక కవిత్వముగా లెక్క వేసుకున్నారేమి ?'' అని చదవరులు అడగవచ్చును. జాషువాగారు ఆధునిక కవుల ప్రేయసీ కవిత్వాన్ని తిట్టారూ, ''చకోర బంధు బృందమ్ములకు సుధారస భుక్తినిచ్చు మృగాంకుడంటూ'', చూచివచ్చినట్లు యుగయుగాలు దిగివచ్చిన అందాల మాటల్ని వేయున్ని ఒకటోసారిగా తామూ వాడుకున్నారూ, రెడ్డిరాజుల ఖడ్గ వారిదము నీడ బండు.... పూచిన పంట చేను'' అంటూ ఖడ్గాన్ని మబ్బుతో పోల్చి— దృక్సిద్ధమైన పోలికలను కాక కళ్ళు మూసేసుకున్న మనస్సుతో సాధించిన పోలికల్ని వాడేరూ, చక ''చకలీను తొమ్మిది రసంబుల చిప్పిలు మేలికావ్య సృష్టి'' అంటూ అనుభవ సుందరమైన రసానికి వాచ్యపు అడ్వరుటైజమెంట్లు తగిల్చారూ, మధ్య పద్యాలు తీసేసినా, పద్యాల వరుస మార్చినా నష్టపడని పద్యాల బంతులు పంచ రత్నాలూ నవరత్నాలూ లాంటివే —ఎక్కువ రచించారూ, పెక్కు మూర్తుల పూర్వకవి సంప్రదాయాలే అవలంబించారు. కంటికి తోచే సౌందర్యము కాక — ప్రతి వంటకంలోనూ వేసుకునే మసాలాపొడి పాత్ర ధరించే— కవి సమయాల్నే అగ్గించారూ, వర్ణించే వస్తువు సౌందర్యాన్ని కాక 'నుడికారపు సొంపు'నూ 'రూపురేఖా విలాస వైఖరుల'నూ పొగిడేవారిలో చేసుకున్నారు. నిజమే వారు యాభైపాళ్ళు ప్రాచీనులే. అయితే తండ్రిగారు చిన్నప్పుడీయనకు వినిపించిన గొల్లసుద్దుల ధర్మమా అని వీరికి ప్రబంధపు వీథి అంగళ్ల అతిలోకపు సింగారాలు కాక నిత్య జీవిత చైతన్యాన్ని ప్రకృతిలో చూడగల జానపద చైతన్య మలవడింది. (దానినే నేను వివరించినాననుకుంటున్నాను దయచేసి మరియొకమారు వారి కవితా వివరణము చదవండి.) ఈ స్వానుభవ చైతన్యాన్ని— స్వకపోల కల్పనలను కాక— చిందించే రచన ఈయన చేసిన కారణం చేత ఈయనను ఆధునిక కవిగా ఎంచుకున్నాను. ఈయన రచనలు [illegible] (ప్రేమ, శృంగారవాటి, మాంపాహి, రాజ దర్శనము, క్రీస్తు, [illegible], వంటివి [illegible] అయి తరకట్ల పద్యాల [illegible] పద్యాల వరుసతో ఖండ కావ్యములే అవడము వల్ల కూడా ఈయనను ఆధునిక కవిగా ఎంచుకున్నాను. అలంకార బాహుళ్యమువల్ల కాక వస్తుశక్తి వల్ల చదువరులను పలకరించే రచన కనుక ఈయనది ఆధునిక కవిత్వ పద్ధతే అంటున్నాను. ఈయన ఆధునిక కవిత్వము చదవడము వల్ల ఈ పద్ధతిని అవలంబించినారా ? అంటే, ఖండ కావ్య రచనలో సమకాలికులను చూడకుండానే రచించి యుండరంటాను. ఈయన పద్యాలు రావడము భారతిలో ప్రారంభము. ఆధునిక కవిత్వపు తీరు తీయములు ఈయన చూచే ఉండవలెను గదా ? వీరు ''రచ్చ గెలుపు''లో 'ముసునూర్ష్టేశ్వర రావువారి చరణాంబుల్ గొల్చుచుంటిననీ, ఆదిని రుక్మిణీ పరిణయంబును వ్రాయుచుంటిననీ చెప్పుకొన్నారు. అది 1915—20 నడిమి కాలము—భారతి 1923 నా ప్రారంభము. 'ఇరువదవ శతాబ్దపు' ''కబ్బపుంగపాసనబడి కలవరపడు నవయువకుల'' వ్రాతలీయన యెరుగరనుటెట్లు పొసగును?

బెళ్ళూరి శ్రీనివాసమూర్తిగారు రాయలసీమ కోయిల. తలమర్లగ్రామ జన్ములు. ఆ జన్మసిద్ధమైన ప్రకృతి సౌందర్య దిదృక్ష వీరి స్వభావానికి జీవనము. 'మంజాలంబయి తోచు బ్రహ్మాండ మెల్ల కౌగిలింతు నొక్కొక్క మారు గాఢరక్తి' అంటారీయన. 'లోచనోత్సవకరమైన ఈ ప్రకృతి తన్వి విలాసము గాంచి' విన్వెఱపోతారు. 'పక్షిగా ప్రమోదముగా భావ వీచిగా మనోహర విర్ఘ్ఝరిగా' ఒక్కొక్క మారూ, మెర్పుగా గర్జితంబుగా మేఘమాలగా సురేంద్రచాప ప్రథగా ఇంకొక మారూ పరమేశ్వరుని సరణులు దర్శించుకుంటారు. శ్రీనివాసమూర్తిగారు జన్మతః సౌందర్య తపస్వి. విశ్వ విభుని సుందరోద్యానమే తపోవనముగా పెద్దకాలము వీరు సౌందర్యాన్వేషణ చేశారు. మీలాగా నాలాగే 'క్షితిని రాలిన తొలకరి చినుకు నమ్మి లేతపైరులు నాటి, ఎదిగి కేదారమెల్ల ఫలించినపుడు కనులగాంచెడు భాగ్యము కలదొ లేదో' అని సంశయాకులు లౌతారు. అయితే మనకు దూరమై 'ఆశా వీథుల తీవ్రమై విసరు ఝంఝూకీర్ణమై వృక్ష శాఖాశాఖీనిచయంబు లూగుటనూ, శిశిర మారుత హతులపడు జీర్ణపత్రములను గుర్తించి, ఒక కల్పమైన ప్రకృతి మాధుర్య తృష్ణ తీర్చుకో

రెండా, అని బాధపడతారూ, 'ప్రకృతి సంపదలు విడిచి యెట్లు మరణింప వలెనని' ఏడుస్తారు. 'ఏలవ్యథాభరమ్మున స్మరింప జేయుచు జీవితంబు ? వాడిపోవు మొగ్గలువ్ సురభి శమ్ములుగా ! యని ఊపడిల్లుతారు. 'రాలిన పూలు కొన్ని పవనుల్ పరసించిన పూలు కొన్ని వాతూల హతింజలించి భువి నూలక కొమ్మల చిక్కికొన్న' పూలు కొన్ని యేరి సుమ దామము కూర్చి స్వామి కంధరంబును మహానందముతో నలంకరింప సుప్రీకులూరివారు. స్వామి నిరాదరణపు జేతు లన్ కుసుమ దామము న్వ్యల జారద్రోసెను. ఎన్నడైన నా మొరలకు దయంపు గాంక్ష ఫలియించక పోవని దాని స్వామి అలయుచీపు వెంగుట విహారము చేసినారు. 'ఏవరుణము నిర్మించితిమో తొనక సేవకు నన్ను బిల్వవోన్' అని వేచి నారు. తొలిరోజులలో శ్రీనివాసమూర్తిగారు మీలాంటి నాలాంటి మానవులే, 'కుటీర సీమతో విశీర్ణ భాగముల దిద్దుటకైనను చేవలేని జీవితమిచ్చి' నందులో, 'సాధవాస కాంక్షా మిదంబులు కూర్చితివేమి' మహా ప్రభూ' 'అని మొర పెట్టినవారే.

అయితే వారి తపోవన విహారము వారిని పునీతులను చేసినది. మధుర భావన రమ్యసీమలో, అమల ప్రేమారాధన మునగాక బ్రతికి సుఖియింపలేని' ప్రాణము వారిది. 'పూరి గుడిసెలలోనైన బుత్తగాని గీతమల్లక బ్రదుకు సాగింప లేవేవే తత్త్వము వారిది. భావనా పథముబట్టి పోయ్యే వారినిచూచి 'శ్రీనివాసమూర్తి కాదు ఉన్మాదమూర్తి' అన్నది లోకము. వారు మాత్రము శాంతమతియై లలిత సౌందర్య పూజకై రక్తిబూని కదలి పోయినారు నవ్య మార్గాలలో. దుర్వారములై ప్రశాంతి సుఖభంగము గొల్పే లోకప్పత్తుల్ని వాటి దారికి విడిచి, 'శంపాలతలయందు, శాద్వలస్థలులందు, పరిమళమ్ములు జిమ్ము విరులయందు, పనసకుంజము లందు మరుగుపడిన మహిమను అర్చించారు. ప్రకృతిలో వలెనే ఈయన రచనలో ఎన్నోమారులు వింటాము కోయిల కూతను. 'ఏటొడ్డ వానకోయిల నదించు సుధామయ గాత్ర మెత్తి' అంటారూ, 'ఎలమావి మోక పయనింపుగ బాడెడి కోకిలంబుతో విడువని నేస్తమం'టారు, 'కోయిలలు లేవ నిదురమేల్కొనుచు నుందు' వంటారు. 'పాలకంకులపైన నుయాలలూగి కలకలారావ గద్గదగాత్రమెత్తి.... నన్ను బిల్చు' నంటారూ, మావి చిగుళ్లమేసి రసమంజులగీతము లాపించెడి.... కోకిలబాల' అంటారూ, 'కోయని నన్ను బిల్వ మిక కోకిల' అంటారూ, 'ఒక్క చినుకున కాశించి యుర్వి యెల్ల ప్రతినినదమిచ్చు సుకుమార రుతులు సల్పి'న దంటారు వానకోయిల. అన్నిమారులూ కూస్తుంది కోయిల ! ఈయన కవితా తపోవనములోనే కోకిల అయినారు ! తమకు తోచి నప్పుడల్లా కోయిలను కూయమన్న ఆధునిక కవులు పెక్కురు. కోయిల కూసినప్పుడల్లా వినేవారు కొద్దిమంది. వారిలో వీరు ప్రముఖులు. ప్రకృతి ఈయనకు ఉద్యాన వనముకాదు, మరి తపోవనము. కోయిలలు లేప నిదుర మేల్కొని, అడవి కోనల సెలయేటి పడుచుగాంచి, పొలుసు లీనెడు ననకారు శోభగాంచి, కొండ చరియలలో చెట్ల గుబురులలో, మనోజ్ఞ సైకత భూమిలో, దివ్య శంపాలతలు తెరువు చూపగా నవ్య పథముల భూనభోంతరము దాటి సౌందర్య పూజకు తరలి పోతారు, బెళ్లూరి శ్రీనివాసమూర్తి గారు నవ్యసాహిత్య తపోవనంలో వానకోయిల ! కోయిల కూతను వలెనే వారి రచనలను చదివిన వారందరూ, చదివి నప్పుడల్లా ఆనందించారు.

నిత్య నూతనత్వము ప్రకృతి స్వభావము. కవిగారి దృష్టి అపేక్షతో కూడి ఉంటే అతడు ప్రకృతిని చూచి పొందే ఆనందముకూడా నిత్యనూతనంగా ఉంటుంది. శ్రీ వాసమూర్తిగారి ప్రకృతి దర్శనము ప్రకృతి వలెనే చైతన్య వంతము. వారెంచుకున్న పథములో వారి సీమలో శ్రీనివాస మూర్తిగా రేకాకి. రాయల కాలం నుంచీ వ్యుత్పత్తి బలంవల్ల సాధించిన ఉత్ప్రేక్షలూ, అతిశయోక్తులూతో దీర్ఘ సమాసాలూ వింత అలంకారాలూ ఇమిడ్చి పద్యాల్లల్లడము సంప్రదాయమైన సీమలో, వీర వైష్ణవమూ వీరశైవమూ అద్వైతమూ విచ్చు కత్తులతో విహారము చేసిన యోగ సీమలో, పూర్వ కవులా యోగులా దృష్టితోకాక తన చర్మ చక్షువులతో చైతన్య మిచ్చిన తన తపనీయ సులోచనము లతో చూచి సహజ సుందరమైన పరమేశ్వర సృష్టిని సచైతన్యముతో వర్ణించడము తపః ఫలము కాక మరేమి ? శ్రీనివాసమూర్తిగారు తామై దయతో సంతోషంతో నిర్వేదముతో పలుకుతారు. ఆయన ప్రకృతిని వర్ణించినప్పుడు పితృ పితామహుల వాక్యాల్ని నెమర వేసుకుంటూ వర్ణించరూ సమాసాల వేగానికి పదముల మువ్వల రవళికీ చొక్కి కళ్లెములు వదలిపెట్టరు, తన భావాన్ననుసరించే నడుపుతారు. కనుక ఈయన రచనలు మధురాతి మధురములు.

రవీంద్రుడు ప్రకృతి సౌందర్యయోగి, రాలిన ఆకులలో, నిశీథపు నిశ్శబ్దములో, యెడారి దాహములో, మారుతపు నిట్టూర్పులలో జగత్తంతా వ్యాపించి ఉన్న చైతన్యపు చలనాలు గుర్తించగల మహాతపస్వి. శ్రీనివాసమూర్తి గారు. రవీంద్రుని గీత సౌందర్యానికి చొక్కి కొన్ని గీతాల్ని

# సాహితీసమితి తరువాతి నవకవులు

తెనిగించారు. రవీంద్రుని రచనా కౌశలముచే ప్రభావితులై సౌందర్య పూజ, ఋతుపరిదేవనము, ఊరడింపు, అమృతసిద్ధి అన్న ఖండకావ్యములను రచించినారు. ఇంత మాత్రము రవీంద్రుని సమీపించి రచనలు సాగించిన వారీయనా కొంత మాత్రము కృష్ణశాస్త్రిగారానూ. శ్రీనివాసమూర్తి గారి దృష్టి — సుందరేశ్వరుని విశ్వవిభూతిని అచ్చెరువుతో దర్శించడమే — ఈ నేర్పుకు కారణము. వీరి 'కళాజీవి' పూర్వ ఖండము నవ్య కవిత్వ సోదామని.

ఆధునిక కవిత్వపు సత్తా సాహితీసమితివారి 'సఖి' పత్రికా స్థాపనలో నిరూపిత మయింది; ఉమాకాన్తంగారి విమర్శతో కొంత ఊగులాడింది. అయితే చెప్పవలసిన సౌందర్యాన్ని గుర్తించిన తరవాత చెప్పగల కవులు ఊరకుండలేరు. పైన చెప్పిన కవులు ముగ్గురూ అలాగ చెప్పినవారే. వీరు ఆధునిక కవిత్వ ప్రభావము వల్లనే ఆ రీతిగా రచించి ఉందురా ? అని అడిగితే నామట్టుకు నేను, 'అవును వీరి కవిత్వము నవ్యకవిత్వోద్యమ ప్రభావము వల్లనే ఇప్పుడున్నట్టుగా తీరినదీ ఆ ఉద్యమమే లేకపోతే ఇంకొక రీతిలో ఉండేదీ అంటాను. విశ్వనాథ కవి రచనా పద్ధతివల్ల కొచాడాలివారు ప్రభావితులయ్యారు, తక్కిన వారు ఏ ఒక్కకవి వల్లా ప్రభావితులు కారేదు. ఆ రీతిగానే నవ్య కవిత్వోద్యమము వల్ల ప్రభావితులై రచనలు చేసిన కవులు పెక్కురున్నారు —సాహితీ సమితి యౌవనానంతర దశలో—నేటి వరకూ. విన్నకోట భట్టారం మల్లికార్జునకవి స్వర్గలోకాన్ని వర్ణిస్తూ ఈ లోక సౌందర్యాన్నే ఆ లోకంలో ప్రవేశపెట్టారు. అకిరి శ్రీరామ శర్మగారు చారిత్రిక గాథను తమ 'శర్వరి'కి వస్తువుగా స్వీకరించి— వర్ణనా భూయిష్ఠము చేసి ప్రబంధరూపము ఇవ్వకుండా— కథను వేగముగా నడిపేరు. ముదివర్తి కొండమాచార్యులుగారు తమ 'వీరమనీడు'లో చక్కని సౌందర్యమును పట్టి ఇచ్చారు. 'తొలకరి మబ్బులో మెఱవుతున్న విధమ్మున శత్రుసైనికావళి జొఱబాఱుచున్' అన్నారుగాని 'నాటి యభిమన్యు విధమ్మున' అనలేదు. అది విన్న సౌందర్యమైపోయేది, ఇది చూచిన సౌందర్యము. 'తత్ప్రాంతము మ్రగ్గు చుండెనో నితాంతము వగ్నునగమ్మురీతి' విన్నదే అయినా కొత్తది. 'జీవితము లారక భగ్నములై చిందారిలో ప్రాణ మట్టు రూపుమాయుటకు' 'చిన్న పావని మోము వెన్నెల గుత్తిలో తలసూపు సుస్నిగ్ధతా విభూతి' 'అక్కటికము కొల్పునుధు గజ్జెలుకట్టి నటించె' నన్నవి నవస్ఫురణ గల్గిన వర్ణనలు. కృత్తివెంటి సుబ్బారావుగారు పింగళి కాటూరి కవుల 'తొలకరి' ననువరించి, 'కేవలము పూవులమ్మెడమ్మతో ప్రారం భించి లక్ష్మణలక్ష్మి, [illegible], [illegible], [illegible] ప్రతిమగా, వర్ణించారు. [illegible] సాగిరా, '[illegible]' [illegible], కఱుసనేని [illegible], మంగిపూడి పురుషోత్తమశర్మగారు [illegible] ధోరణితో ప్రారంభించి ''[illegible].. [illegible] నేని.. [illegible].. [illegible] త్సనులతానం.... [illegible].... [illegible] శ్రీచరణ [illegible]'' [illegible]! ధవళసుందర రామాయణకర్తగారు '[illegible] వెన్నెకొని [illegible] మెఱుంగక తొంటి ప్రాతలే [illegible] వ్రాయనేల' అని అడిగేరు. దాశరథి నరసింహాచార్యులుగారు సుమధుర ప్రభావిత మైన శైలితో 'సంధ్యారుణ భిరు హార్యములను, ఇంద్ర చాపచ్ఛ రేఖా సౌధాంతర కాంతి తయ్యలను, రాకా చంద్రి కారామసీమా సౌరభ్యాని కుంజవాపములను, వ్యోమందారవని హృదంతర ప్రశాంతులను, కలల పొలాలమా వెతికేరు. వానమామలై వరదాచార్యులుగారు పరిగెపిల్ల, తృణము' పాదరక్ష, పాకీవాడు, దుక్కిటెక్క వంటి సామాన్య శీర్షికల మీద వ్రాశారు భక్తపోతన చరిత్రముతోపాటు. చిరుమామిళ్ల విజయసారథిగారు కొత్తపాలెపు 'పల్లెపట్టు' నిసర్గ సౌందర్యాన్ని చైతన్యమయమైన స్వభావోక్తితో వర్ణించారు. భమిడిపాటి రామస్వామయ్యాజులుగారు ''మోడు టాపలు చిప్పురించి వాడిపోవు వెగటు దివసంబు లొకదాని వెనుక ఒకటి' అని వేడులనూ 'కలువ'లో కృష్ణశాస్త్రి తేటి వలపునూ, ఘూకరావమును పట్టి ఇద్దర్నీ, స్మరింప జేస్తూ ఒకప్పుడు ఏకాంతంగా 'మహోన్నత పర్వతభూమిలోనూ, ఇంకొకప్పుడు ప్రేయసీ 'సితవిలోకనానిల తరంగముల' లోను గడుపుతూ ఆ నాటి నవకవికి ఉదాహరణాన్ని చూపించారు. ఆంబటిపూడి వెంకటరత్నంగారు చంద్రశాల, పత్ర లుడు కావ్యాలలో చక్కని గమనముగల పద్యాలతో ఊహా కథనము చేశారు. శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి వంటి సంప్రదాయ పండితులు కూడా 'ఆంధ్ర రంగస్థలమున నిద్దన్ని మొదల ప్రబల తరమైన చలన మారంభమయ్యె. నవ నవోద్యాతమైన ఈ నవ్యశక్తి ఎటు పరిణమించునో తీరి కెరుగరాదు' అని వ్రాసి నవ్య సాహిత్యానికి జంఢాలు ఎగరవేశారు. సాహిత్యాభివృద్ధి కాములందరికీ నవచైతన్య స్ఫురణ కలిగింది. బరువైన ఉదాహరణము దిగుమర్తి సీతారామస్వామిగారు.

'దిగుమర్తి సీతారామస్వామిగారివంటి గద్య ప్రాయగల పండితులు ఇప్పుడెందరో లేరు. వారి ప్రజ్ఞ బహుముఖము.

శాలివాహన సప్తశతి, కాళిదాసు ఋతుసంహారమూ తెలుగు పద్యాలలో వ్రాశారూ, అనేక ఖండకావ్యాలు వ్రాశారు. సంగీత సాహిత్యాలలో 'ఏక మాహారతో రమ్యం, అన్యదాలోచనా మృతం' అన్నారు ప్రాచీనులు. సీతారామస్వామిగారి రచనలాలోచనా మృతానికి చక్కని ఉదాహరణాలు. రచనకు వెన్నెముకగా ఆయన తీవ్రాలోచనము సాగినస్తూనే ఉంటుంది. 'శిలాపీఠి'లో నవ్యసాహిత్య కల్లోలమునే కాబోలు వర్ణిస్తూ, "ఒక్కటే మబ్బు పిహితాష్ట దిక్కరాళ కాళికా శ్యామలంబయి క్రమ్ముకొనియె, రేచు పెనుగాలి, ధూళి భరించుహోరు, చండతాండవ మంగళాచరణఘోష, మెఱపు పూదండ లల్లన మఱిగి వడగ మరుములే మేఘ తాండవోద్ధరణ గతులు, అప్పటప్పటి పిడుగుల రొప్పు మెచ్చు నట్టి భూతాల సముఖాట్టహాసకలన, వెఱ్ఱిగాలితో పాటుగ విరిగి పడుచు పాదు పంబులు నృత్య సంపద వెలార్చె, తేని తీవికి సమరిన బృందమునగ సంతయును నాట్యమడుగు సాహసులు లేరు.... తేను మెచ్చుకొన్నదే కళ, మెచ్చి ఇచ్చినట్టి దనదు కానుక కాదు నా రసికుడెవడు ?" అంటారు. వ్యంగ్యార్థము విమర్శ కనుక వాచ్యార్థము కవితా వస్త్రము కట్టుకొన్నది. లోకములో నెగ్గుతీరులు చూచిచూచి విధికెదిరి నిల్చిన రాక్షసుల యత్నాల్ని కూడా ఈయన మెచ్చుకున్నారు "నికుంభిల"లో. నికుంభిల ఇంద్రజిత్తు యజ్ఞము. నికుంభిలలో 'పురుషకార విజయ పతాకలు మబ్బులతో వాడు'నట. 'ఆత్మజాతి విద్రోహుల కధికాదర మధికారము, అలవి భీషణునకా పట్టాభిషేకము మహోత్సవము ?' అని అడుగుతున్నారు ఈయన.

అద్వైత ఒకచోటా అనుభవ మింకొకచోటా అన్న ఊహయే, ఈయనచేత అహల్యతో "అతనికి (ఇంద్రునికి) నీకు నే తగినదన్ని విధంబుల నాతడన్న నిత్యతరుణుడున్ మధాశను డనన్య విలాసి రసైకజీవి, చైత్ర తరుణ దక్షిణానిలుని తాకిడికెన్ నెఱేకు విచ్చినట్టి తలిరుదీవవీవు. జ్ఞానుల యందెగాని రసిక శ్రయణీయ విలాస జీవితాన్వేషమునన్ సదన్యత కనర్హుడు గౌతమమౌని. దీనిగూర్చి పాడవుగదే హృదయాళు రసార్త లోకముల్ ?" అనిపించింది. సావిత్రిని పట్టిన గుడిపాటి వారికి సీతమ్మనే సమీపించిన పామిపేని వారికి అహల్య తట్టకపోడము విచిత్రమే. అహల్యమీది జాలితో ఈయన "తలకొని వెఱ్ఱిగా బొగడతావివలెన్ వలపుం దలంపు మేల్కొలిపిన వాగలేని కథ కోడయి కూయగ శిల్ప వీథిలో నిలిచిన నీశిలాప్రతిమ నిత్యము వందన పారిజాత పుండరీకులతో సహస్ర నయన ప్రథమార్చన స్వీకరించుతన్" అన్నారు. సమకాల పరిస్థితులు గమనించినా, రాష్ట్ర సాధనలో "అసలు దీనికై కష్టించినట్టి వారి మఱచి పదవుల కెగబడు నరులగూర్చి పత్రికలు వాగిన' వన్నారు. అడుగులు నవ్వడింపని మహా విపినంబులు చూపులందుకో దడబడ జేయు తారకల తావులు.... మదికింపు నింప,' 'మృత్యు దేవతాయతన పురాణ ఘంటికల యందు ధ్వనించెడు స్వాగత కృతులు' ఆలోచనకు తగిలిన వరకూ నశాన సాధనయందు మ్రగ్గినవారు కాబోలు, "ప్రాణికోటిలో.. మనుజుడె.... లోతులు ముట్టి....వారక బాధ క్రుంగెడిన్" అనిపించి, "లోకపు లోతులంటి అతిలోక భయంకరమౌట సంతత వ్యాకులమైన జీవితముసం దనిశంబు కృశించుకంటె పైనే కనుగొందు వెన్నెలలు విండిన పువ్వులతోయ వెండి వాగై కదలాడు నేటి వలె హాయిగ బోయెద జీవయాత్రలో" అని నిశ్చయించుకొన్నట్టున్నారు. ఈ రీతిగా "తారలె దివ్వెలైన తొలి దారులలో బడి దివ్యదర్శనుండై రమించి తొగి యుగువట్టి జనుండు, ప్రపంచ భావసంచారములో కవీంద్రుడయి జారెను తావాక మెట్టు !"

యుక్తమేకదా ? "అలసిపోయిన కన్నుల ప్రతిఫలించి సురనదియేని వైతరణిగా దోచు, చిరమిందు విశ్రమించిన సయిజాడు ముళ్ల పుంతలును పువ్వుల బాటలగును." దేవయాన పథమ్ములందిరుగులాడి నట్టిదీ యాత్మ యొక్క వాడవెడి భావమెన్ని విరయధ్వములు చననీ శ్రమమ్ము సహరించి మహాశక్తి' నిచ్చినది కాబోలు, చుక్కలతోనిండి చక్కని రేయి తమవెల్ల కనులుగాగని వన్నారు. 'కలిసిపోసిరి నవదేవతలు నిజమ్ము శీతుగరళమ్ముతో నవజీవనమ్ము'. 'మధుర[illegible] పూర్ణ విశ్వదామమ్ము నుండి పెరిగి జారాడు ఈ ముత్యాల పేట..'కు 'జీవితాలు విరిసి పుష్పించినవి. 'పారిజాత మహామోద భరిత సురవధూ తనుస్పర్శనుంబోలె ప్రీతిగాంచి,' 'మలయ వాయువు పగిది భూతలమెగాక, దివ్యలోకాలు స్పృశియించు దీప్తి'తో "ఈ దరిద్రాణ నిద్రాణ హిమ సమాప్తి విశ్వ శృంగార దేవతార్చాశ్వవృత్తి నొక్కలతయేని పుష్పింపకుండరాదు పూర్తిగానలె సౌందర్య పుష్పమాల" అన్న సంకల్పముతో తిరిగి వచ్చినారు. వచ్చని చేలలోన బడి పారే నదులూ, తెల్లని జాబిల్లి తెరచిన కళ్లు మల్లె పూవులూ, 'మధ్యాహ్న నిద్రలో మాటాడని యుర్వి, సాంద్రని హాయిగా పరుగిడులేగల కాంచునావుల పెద్దకనుల తృప్తి, పెండ్లింటి పగిదినలరు పల్లెటూళ్లూ, జాబిల్లి పుట్టికన్ దెచ్చికొనిన జిలుగురే యొండ పరిపిండి నాలక బోసి గాలి కారగ నెఱపు క్షాత్రీలతాంగి, వర్షాశిరోజ మధుర సింధూర

# ఉదబిందువులు



## శ్రీ జి. వి. కృష్ణరావు

"అమ్మా, అమ్మా !''

కొడుకు పిలుపులోని ఉద్వేగాన్ని పసికట్టిన సుభద్రమ్మ చెరుగుతున్న వడ్లచేట క్రిందబెట్టి అతనివైపు చూచింది.

"కృష్ణా, రామా అంటూ మూల కూర్చోక ఇదేమిటే? ఓపిక ఉన్నది ఒళ్ళు దాచుకొంటే బండెడు చాకిరి నెత్తిమీద వేసుకొన్నావా ?'' రామయ్య ధోరణి మార్చాడు.

"ముసలిదానిమీద ఎన్నాళ్లనుంచిరా ఈ మమకారం ? పిండుమూలాలు ఈపని చెయ్యలేదు కాని అసలు సంగతేమిటో చెప్పు !'' సుభద్రమ్మ నవ్వింది.

తన హృదయాన్ని యిట్టే పసికట్టినందుకు అతని విరాకు మరీ ఎక్కువయింది.

"నీ ముద్దుల కొడుకు ఏమి చేశాడో చూశావా ?''

"నా చిట్టి తమ్ముడు ఏమిచేశాడో చూచావా అనరాదూ ? లవవు. ఎందుకంటా ? ఇంతకూ అసలు సంగతేమిటో !'' తల్లి నిట్టూర్చింది.

కన్నంలో దొంగకు తేలు కుట్టింది. అవును, తల్లివల్ల జరిగిన పొరపాటేముంది ?

"మా తమ్మయ్య ఉత్తరం వ్రాశాడు. నేను ముందుగా వ్రాస్తేనే వ్రాశాడనుకో !''

"నువ్వేమి వ్రాశావు ? అతగాడేమన్నాడు ?''

"ఏమున్నది వ్రాయటానికి ? ఈయేడు ఊచ తెగులు తగిలి పంటలు పోయాయి. ఎకరానికి అయిదారు బస్తాల రాలుబడి కూడ లేదని వ్రాశాను.'' రామయ్య గొంతు జీరపోయింది.

"అవును, ఈయేటి రాలుబడి అంతేగా ! నువ్వు చేలను పండవద్దన్నావా యేమిటి ?'' తల్లి వాత్సల్యం అతన్ని కప్పింది.

"ఊళ్లో మగతాదారులు ఏమిచేస్తున్నారని మా చిట్టి తమ్మయ్య అడుగుతున్నాడు. అవును, ఇంతకాలంనుంచి వాడి చేలో నేను చేస్తున్న దేమిటి, మగతా కాక !''

"ఉద్యోగంలో చేరింతరువాత చిన్నవాడికి బొత్తిగా మతి పోయింది.''

"వాడికేమీ మతి పోలా. పోయింధల్లా మనకే !''

"అయితే - నేను వచ్చిపొమ్మంటున్నానని కార్డుముక్క రాసి పడెయ్యి.''

"రాయవలసిన అవసరం నాకేమీ లేదు. వాడి లెక్క ప్రకారం రావలసిన పైకం అణా పైసలతో సహా ఇవాళే మనియార్డరు చేస్తున్నా.'' రామయ్య వెళ్లిపోయాడు.

సుభద్రమ్మ విస్తుపోయింది. తన ఇద్దరి కొడుకుల సంగతి ఆమెకు పూర్తిగా తెలుసు. వాళ్లకు తండ్రి అయినా తల్లి అయినా తనే. తన చేతులమీదుగా పెంచి పెద్దవాళ్లను చేసింది. ఇద్దరూ కవలలు. ఒకటే పోలిక. ఒకే తల్లి పాలు త్రావి ఒకే సంస్కారంలో పెరిగారు. అయినా గుణాలలో ఇరువురికీ ఎంతో తేడా. పెద్దవాడి మనసు ఉదారం. చిన్నవాడు కూడా మంచివాడే కాని, కాస్త లోభగుణం ఉన్నదేమో ననిపిస్తుంది. అయినా సుభద్రమ్మ కనుగలిగి దిద్దటానికి ప్రయత్నించింది. ఉన్న కొంచెం తక్కువ. ఇద్దరి పిల్లలకూ ఇంగ్లీషు చెప్పించే తాహతు లేదు. కనుక చిన్నవాడైన లక్ష్మయ్యను ఇంగ్లీషు చదువులకు పంపి ఆమె రామయ్యను వీథిబడి చదువుతో మానిపించి తనకు తోడుగా నిలుపుకొన్నది.

రామయ్యకు ఏకోశానా కుళ్ళుబోతుతనం లేదు. నమ్మిక చిక్కితే అతడు ఒడలు కోసి యిస్తాడు. మనసు విరిగిందో అతనిని ఎవరూ వినిపించలేరు. అతని స్నేహం వంటిదే పగ కూడ. అవి అతి ఉత్కటాలు. లక్ష్మయ్య లక్ష్మణరావై ఎల్. టి. పూర్తిచేసుకుని బస్తీలో బడిపంతులై ఒక గ్రాడ్యుయేటును పెళ్లి చేసుకొన్నాడు. కొడుకు లిద్దరూ ఒకరి కొకరు అండదండగా ఉండాలన్న ఆశకొలది లక్ష్మయ్య చదువు ఖర్చులు పాటికి రానీక తనవంతు రెండెకరాలు పోను మిగతా ఆస్తిని ఇద్దరికి చెరిసగం పంచి యిచ్చింది. తమ్ముడూ, తల్లీ కావాలనుకొన్న రామయ్య సణగలేదు. అంతేకాదు, తమ్ముని పొలం తానే చేస్తూ రాలిన పంటను అమ్మి ముద్ర శుద్ధిగా ఈనాటివరకూ అప్పగిస్తూ వచ్చాడు.

అలాంటి రామయ్యకు లక్ష్మణరావు అలా ఉత్తరం వ్రాశాడని వినగానే సుభద్రమ్మ మనస్సు చివుక్కుమన్నది. తనకే అలా అనిపించినప్పుడు పెద్దవాని మనస్సు ఎలా ఉండాలి ? చిన్నకొడుకు దగ్గర ఉంటే గుండె గుబ్బు మని పించేది. కాని, ఏమి లాభం ? ఎక్కడో దూరాన ఉన్నాడు.

అవాళే సుభద్రమ్మ చివాట్లువేస్తూ చిన్నకొడుకుకు ఉత్తరం వ్రాసింది. కాని మళ్ళీ ఏమి తోచిందో వ్రాసిన ఉత్తరం చించివేసి జరూరుగా ఒకసారి వచ్చి వెళ్లవలసిందని కార్డు వ్రాసి రామయ్య కొడుకు సూర్యం చేత పోస్టులో వేయించింది.

రామయ్య తల్లిని పలకరిస్తూనే ఉన్నాడు. కాని ఆమెకు ఆ పలుకరింతలో ఏదో లోటు ఉన్నట్లుగానే ఉన్నది. వారంరోజులకు చిన్నకొడుకునకు మారుగా కవరు వచ్చింది. ఆమె విప్పి చదివింది.

అత్తయ్యకు,

నమస్కారాలు. ఇక్కడంతా క్షేమం. అక్కడ అందరికీ కుశలమే కదా !

మీ ఉత్తరం చేరింది. ఏదో చిరాకులో ఉండి మీ అబ్బాయి బావగారికేదో తెలివితక్కువ సమాధాన మిచ్చారట. ఎంతో నొచ్చుకుంటున్నారు. తనకు మొగం చెల్లక నన్ను సమాధానం వ్రాయమన్నారు. మీరే వ్రాస్తే బాగుంటుందని మొత్తుకున్నాను. వింటేనా ? ఇంకా జాగుచేయటం మర్యాద కాదని వ్రాస్తున్నాను. నా సాహసానికి క్షమించాలి. నేనే వచ్చి బావగారికి కనిపించి క్షమాపణ చెప్పుకొంటే మేలేమోననిపించింది. కాని అన్నదమ్ముల నడుమ నీ జోక్య మేమిటి అంటారేమోనన్న భయంతో మానివేశాను. బావగారికి మీ రెలాగైనా నచ్చజెప్పండి. అదనంగా పంపిన ఆరువందలకు చెక్కు పంపిస్తున్నాను. వారికి అందజేయండి.

అక్కయ్యతో గలిసి ఒకసారి మీరు ఇక్కడకు ఎందుకు రాకూడదు ?

ఇట్లు,
మీ కోడలు,
శ్యామల.

''ఇందుకే చదువుకొన్నవాళ్లకంటె చాకళ్లు మేలంటారు!'' సుభద్రమ్మ విసుగుకొన్నది.

ఆ రాత్రి రామయ్య భోజనంచేసి తాపీగా కూర్చుండగా ''వీ తమ్ముడు ఉత్తరం రాశాడురా.!'' అని తల్లి చెప్పింది.

తడు ఊకొట్టి ఊరుకున్నాడు. ''పొరపాటు జరిగిందని వాడెంతో బాధపడి ఆరువందలు తిరిగి పంపాడు'', అంటూ ఆమె కోడలు పంపిన చెక్కు ఇచ్చాడు.

''మళ్ళా మీ స్వీట్ హార్టుకోసం ఆ డబ్బు పంపక్కర లేదమ్మా'', అతడు నవ్వుతూ లేచి బయటకు వెళ్ళిపోయాడు.

సుభద్రమ్మ నిర్ఘాంతపోయింది. ప్రక్కనే ఉండి ఇంతా విన్న పెద్దకోడలు ''అత్తయ్యా, పెద్దవాళ్ళు. మీ రోజులు దేముంది ? ఆ మనిషికి కోపంవస్తే అంతేనా ! పోయి మీరు స్వహస్తంగా వ్రాసి ఇచ్చి వచ్చేయకూడదూ ?'' అన్నది.

''అవునమ్మా, అంతే. పెద్ద మనసుచేసి, పిల్ల మనసు బ్రతుకులా చూడాలి.'' సుభద్రమ్మ పైట కొంగుతో కళ్ళు తుడుచుకొన్నది.

మబ్బు లాసేసాయి. వర్షరుతువులో రైతులు ఏరువు కట్టారు. మెట్టపనులు ముగిసాయి. గంగమ్మ చెప్పి పంపించింది.

సాయంకాలం దమ్మి నాటి ఇంటికి తోలుకుపోతూ పాత పాలేరు ముత్తయ్య చినబాబు చేను దున్నించరేమని సుభద్రమ్మను ప్రశ్నించాడు. ఆ రాత్రి ఆమె రామయ్యను కదలించింది.

''ఇకనుంచి నీ పొలంతో నాకు నిమిత్తంలేదని ధాన్యం డబ్బు పంపిననాడే వ్రాశానే !''

'ఇంతకూ చేను దున్ననేలేదు!''

''పోరంబోకులన్నీ దున్ని జరిమానాలు వేయించుకొనే దుర్గతి నాకింకా పట్టలేదు.''

''పోరంబోకులా ?'' తల్లి కొడుకుల మాటలు వింటున్న మంగమ్మ అందుకొన్నది.

''కాదు, మీ బాబిచ్చిన అరణం !''

''అమ్మాయ్ ! పుణ్యానికి పోతే పాపం వెంటబడుతుంది గాని నీ వూరుకో. వాడి లోకంలో లేడు.''

సుభద్రమ్మకు అర్థమయింది. పెద్దకొడుకు వ్రాసే ఉంటాడు. చిన్నకొడుకు అన్నను మరుసటివేళ అడిగినాలేని మొగం చెల్లకో, మరచిపోయో చేను సంగతి పట్టించుకోలేదు. చూస్తూ, చూస్తూ బంగారంవంటి చేను పడావెట్టటమా ? పిల్లా జెల్లా ఉన్నవాడు. బస్తీలో కాపురం.

తెల్లవారుజామున సుభద్రమ్మ లేచివెళ్ళి ముత్తయ్యను లేపి లక్ష్మయ్యా చేను చేసుకొమ్మన్నది. తరుణం దాటిన తరువాత తలకెత్తుకొనే సాహసంలేక అతడు తటపటాయించాడు. ''అయితే కూలినాగళ్లు పెట్టి దమ్ముచేయించి నాటు వేయించు. ఖర్చులన్నీ నేనే పెట్టుకుంటాను. నీ ఇష్టం లన్నట్టే

పెట్టుకోను ముత్తయ్యా !'' అన్నది. లోగడ చాలా కాలం రిన్నాడుకొన్న ముసలమ్మ నోరు తెరిచి అడుగని తున్నది. అరడు కాదనలేకపోయాడు.

లక్ష్మణరావు చేతో పడ్డ మొక్కలు రామయ్య చెవిలో పకాపకా వచ్చాయి. తాను తల్లిని పువ్వుల్లో పూజిస్తుంటే ఈనాడు ఇలా నలుగురిలో నవ్వులపాలు చేస్తుందా ? ఏమాట మాత్రమైనా తనతో అనలేదు. నిజానికి ఆమె బొంది మాత్రం తమతో ఉన్నదే కాని ప్రాణాలన్నీ చిన్నకొడుకు వద్దనే.

ఈ ఆలోచన రాగానే రామయ్య మనసుకు గతమంతా మరొకరీతిగా తోచింది. తల్లి పక్షపాత బుద్ధితోనే తన చదువు మానిపించింది. చిన్నవాడి చదువు ఖర్చులు లెక్కకట్టనీక ఆస్తి పంపిణీల్లు వేయించింది. కళ్లు ఉండీ తాను అంధుడయ్యాడు.

ఆ రాత్రి సుభద్రమ్మ మనుమణ్ణి ఒళ్లో కూర్చో బెట్టుకుని, ''ఓజయమ్మ నీ కుమారుడు'' అన్న భాగవత పద్యం చెబుతున్నది. రామయ్య ప్రక్క అరుగుమీద ఒద్దికగా కూర్చుని ''అమ్మా !'' అన్నాడు.

''ఏమిటిరా !''

''ఏమీలేదు. ఇంతకాలం పెంచావు. ఒక యింటివాణ్ణి చేశావు. ఇంకా నీమీద ఆధారపడటం బాగుండలేదమ్మా ! రేపటినుంచి మీ పోలెడు మేము పొంగించుకొంటాము.''

సుభద్రమ్మ కొయ్యబారిపోయింది. ఎలాగో తెముల్చు కొని డగ్గుత్తికతో అడిగింది : ''ఇంతకూ నేను చేసిన పాప మేమిటి ?''

అతడు మాటాడలేదు.

''గడవవలసిన పురుళ్లూ, పుణ్యాలూ గడచినా ఈ మొండికట్టె పోక వచ్చింది.''

రామయ్య మారు మాటాడక వెళ్లిపోయాడు. ఆ మాట లన్నీ వాకిట్లో నిలబడి వింటున్న మంగమ్మ బావురుమన్నది.

''అమ్మాయీ, జరుగవలసిందేదో జరుగుతుంది. వెలలు వచ్చిన మనిషి దిగులుపడరాదు.''

మరునాడు జాము ప్రొద్దెక్కిన తరువాతగాని సుభ ద్రమ్మ లేవలేదు. లేచి ఆమె దొడ్లో కాలు పెట్టగానే తొలి చూరి పడ్డ వెల్లావు, దూడ ఒక్కసారిగా అరిచాయి.

''నాయునమ్మా ! నాయునమ్మా ! ఇందాక పాలచెంబు పత్తుకుని నాన్న దగ్గిలికెలితే పద్దా ఆవు ఏవిచేశాయనుకొన్నా ? మువ్వ చూలారిసింది. బలే చిందులు పెత్తాయిలే ! నీవి మాలో కూలా అలా చిందులు పెత్తలు.'' సూర్యం అభిన యించాడు.

''నోరుముయ్ వెధవ !'' మళ్లీ పాలచెంబు పట్టుకుని వచ్చిన రామయ్య తన చేతిలోని దాయత్రాటితో కొడుకును ఒకటి వేశాడు.

''పెద్దబ్బాయ్ !'' చిరుతపులి క్రాండ్రుమన్నది.

''ఇది నా సంసారం'', రామయ్య తల్లివంకకైనా చూడక వెళ్లి లేగ కోడెదూడను విప్పి ఆవుకు దాయ వెయ్య బోయాడు. అది బిసతప్పిన రాకెట్టులా ఎగిరివడ్డది. మరి కొంచెమైతే అతని కన్ను పోవలసింది.

సుభద్రమ్మ గిరుక్కున మళ్లీ ఇంట్లోకి వెళ్లిపోయింది. పోయిన కొంచెంసేపటికే బాదుతున్న చప్పుడు పడ్డ అరు పులు వినిపించాయి. దానిని ఆమె కన్నబిడ్డలాగా పెంచింది. కట్టుతాడు విప్పితే అది వెంటబడి వంటయింటి గుమ్మం దాక వచ్చి నిలబడిపోయేది. ఆ సంగతి జ్ఞప్తికి రాగానే ఆమె నిలుచున్న చోటనే చతికిలబడిపోయింది.

భూమి మాత్రం చతికిలబడలేక తన చుట్టూ నాలుగు సార్లు అలంగం తిరిగింది. ఆ మధ్యాహ్నం కటికినులకల్లో పండుకొని సుభద్రమ్మ ఇంటి వాసాలవంక చూస్తున్నది.

''నాయునమ్మా, నాయునమ్మా !''

''ఎవరది.''

''ఇష్ ! బిగ్గలగా మాతాలకు. నాన్న బయత అలుగ్గ మీన కూచున్నాలు. ఇంతాలు.''

''అరే, అటు తిరిగిరా !''

''అమ్మో ! వత్తే బతకనిత్తాలు ! మొన్నే చెప్పాలుగా, పానాలు తోలేత్తా నన్నాలు.''

''అలాగా !''

''సరేగాని, అన్నం తిన్నావా ?''

''ఆఁ .... ఆఁ''

''ఒత్తిదే. అబద్దాలు చెపుతున్నావు. నీకు ఆలపిల్లని పులతాలు నాయునమ్మా !''

!''

త్తును. నేను పెత్తను.''

౨.

"ఈ యింట్లో అందరికీ కోపాలే. నీకు కోపం, నాన్నకు కోపం, అమ్మకు కోపం, అవుకు కోపం, అవుదూడకు కోపం· పాకేవా లేంది ! నేనూ కోప్పడతా. "ఒలే పెద్దబ్బాయ్ ! నీకు మతి పోయిందిరా ! లేకపోతే నిచ్చేనంతా పాలు తాగలేక పెద్దను అమ్మేత్తావా ?" సూర్యం నాయనమ్మను అనుకరించాడు.

నవ్వుతుందనుకొన్న నాయనమ్మ బొమ్మలాగ చూస్తున్నది. సూర్యానికి ఏమీ అంతుపట్టలేదు. ఏదో తప్పుచేశానన్న భయంలో అతడు చల్లగా జారుకొన్నాడు.

తనను దగ్గరకు చేరనీని పాడి పడ్డను తెనమ్మ రామయ్య బక్కనీళ్లకు కూడ వాచిపోతున్నాడు. ఆవుకూడ దాయ వేయనీయటంలేదు. కోడెదూడ గదా అదైనా బాగు పడుతుందన్న ఆశతో వదలి ఊరుకుంటూ వచ్చాడు. ఆవు తిరిగిలదనీ, ఒకప్రక్క అయినా తీయకపోతే లేగదూడ అరమూ యించుకోలేదనీ అతడు గుర్తించలేదు. పొలముమీది చాకిరి అయితే చేస్తూ వచ్చాడే కాని పాడి పశువులకు అత డెప్పుడు పరామరిక చేశాడు ? పదిరోజులలోనే అజీర్తిరోగంతో కోడె దూడ చచ్చిపోయింది. వలవల ఏడుస్తూ సూర్యం ఆ సంగతి తడిక కంతలలోనుంచి సుభద్రమ్మకు చెప్పాడు. నిష్ఠుర కష్టంతో ఆమెకు గుండెలు చిలికినట్లయింది. వచ్చిపడుతున్న కడగండ్లన్నిటికీ తల్లే కారణమని కొడుకు మరీ గండరించాడు·

లేగదూడ చనిపోగానే సుభద్రమ్మ మనసు పరివరి విధాల పోయింది. తన ఉనికివల్ల కొడుకు కోపం పెరుగు తుందే కాని తరగదు. ఆ కోపంతో ఇలాగే ఏవో తెలివి తక్కువ పనులు చేస్తాడు. నష్టపోతాడు. తన మనస్సు మరీ వికలమవుతుంది. ఈ చిక్కులన్నీ దేనికి ? కొంతకాలం తా నక్కడ లేకపోతేనో ? వాడి మనస్సు కుదుటపడవచ్చును. లేదా తన కైనా కొంత మనశ్శాంతి కలుగవచ్చును.

ఆ మధ్యాహ్నం కొడుకు వాటాలోకి వెళ్లి మంగమ్మను పిలిచి "అమ్మాయి, ఇల్లు భద్రం ! నీ సంసారం సంగతి నీకు చెప్పనక్కరలేదు. వస్తానమ్మా !" అన్నది. గ్రుడ్ల నీరు గ్రుడ్లలోనే గ్రుక్కుకొంటూ "నన్నేమి చేసిపోతున్నా వత్తయ్యా !" అని మంగమ్మ అన్నది.

"నేను బిడ్డల్ని కన్నానే గాని, గడ్డల్ని కనలేదు." సుభద్రమ్మ ముఖం కొంచెం ఎర్రబడ్డది.

కోడలు మళ్లీ నోరెత్తలేదు.

సూర్యం ఇంటివద్ద లేని సమయం చూసుకొని సుభద్రమ్మ చిన్న మూటతో బయలుదేరి ఎలాగో మరునాటి పద కొండు గంటలకు లక్ష్మయ్య ఇంటికి చేరింది. ఇంట్లో కొడుకు గాని, కోడలుగాని లేరు. పనిమనిషి బండబూతులు తిడుతూ లోపలినుంచి నాలుగేళ్లవాణ్ణి, రెండేళ్లవాణ్ణి తరుము కొచ్చి వరండాలో నిలబడ్డ సుభద్రమ్మను చూచి "ఓవ్వాడికి ఏలాపాలా లేదా ఏంటి ? పోపో" అని కసురుకొన్నది.

సుభద్రమ్మకు తను చేసిన తప్పు, రైలుప్రయాణంతో మాసినట్టు జ్ఞప్తికివచ్చి నవ్వుకొని, "లక్ష్మయ్య లేడా ?" అన్నది.

"ఈడ లచ్చుమయ్యలు లేరు, గిచ్చుమయ్యలు లేరు పోపో. ఈ దొంగేసాలు సాల మాసాము", పనిమనిషి పిల్లలను లోపలికి నెట్టి తలుపు వేసుకొన్నది.

ఆ ప్రక్కింటి ఉపయూన పెన్షను రెండు మెరుకులు ఎంగిలివడ్డరో మునలిప్రాణం ఆ వరండాలోనే చదికిలబడ్డది. సాయంకాలం నాలుగున్నరకు స్కూలునుంచి తిరిగి వచ్చిన లక్ష్మణరావు విస్తుపోయి పనిమనిషిని చెడామడా తిట్టి తల్లి స్నానానికి నీళ్లు తోడించాడు. ఆమె స్నానం చేసింది. ఆంత లోనే శ్యామల ఆఫీసునుంచి వచ్చి జరిగిందంతా విని నొచ్చుకుంటూ, "ముందుగా ఉత్తరంముక్క వ్రాస్తే కాక పోయిందా అత్తయ్యా !" అన్నది.

"ఇంతకూ మా వియ్యంకుడికి ఉత్తరం వ్రాయ మంటావు !"

"ఏమని ?" శ్యామల విస్తుపోయింది.

"ముందుగా ఉత్తరంముక్క తప్ప అమ్మాయిని ఇంటికి రానీయవద్దని."

"అదిగాదు అత్తయ్యా ! మాట మాత్రం ముందు తెలిస్తే ఇలా జరగకపోనుగదా అని అంటున్నాను."

"రోజుకొక పనిమనిషిని మార్చుకొంటున్నారని నేను మాత్రం కలగన్నానా ?"

"ఏమండోయ్, మిమ్మల్నే ! సమాధానం చెప్పండి. వానంతు అయిపోయింది." కోడలు నవ్వింది.

"బాగుంది వ్యవహారం. అత్తా కోడళ్లు పోట్లాడుకొనే వాళ్లు పోట్లాడుకోండి. మధ్య నన్ను లాగుతారు దేనికి ?"

"ఇంతకూ మే మిద్దరం పోట్లాడుకొంటే చూస్తా వంటావు ?" తల్లి, కొడుకు వంక తేరి చూచింది.

"అమ్మ బాబోయ్, ఇద్దరూ ఏకమయ్యారు ! ఈ రాత్రినుంచి సత్ర భోజనం మఠం నిద్ర తప్పదు కాబోలు !" లక్ష్మణరావు ఉత్తరీయంభుజాన వేసుకొని బయలు దేరాడు.

"అత్తయ్య ఎప్పుడు ఎంగిలిపడ్డదో! పెందరాడే రండి!" శ్యామల భర్తను హెచ్చరించింది.

రోజులు తరాటు గొడుతున్నాయి. ఒళ్ళు సరిగా వంచుకోలేక, చేతివాటుకు పిలుపడక పనిమనిషి మానుకొన్నది. సుభద్రమ్మ విసుగుకోలేదు. అన్ని పనులూ తానే అందుకొంటూ కొడుకు ఇల్లు చక్కద్రోసుకొస్తున్నది. పిల్లలు ఏడుపులు పెడబొబ్బలు తగ్గించి పెందలాడే లేవటం, ఎవరి పనులు వారు చక్కబెట్టుకోవటం ప్రారంభించారు. "నానమ్మా! నానమ్మా! మొగం కడగవూ?" అంటూ మూడోవాడు లేచి వచ్చేవాడు. "అరే అన్నాయ్, చిట్టాడి ముఖం ఇత్తడి తేపాలరా. అందుకే కడిగి అవతల పెట్టమంటున్నాడు." అని రెండోవాడు వెక్కిరించేవాడు. "నీ మొగమే సత్తెపాల, రాచిప్ప," అని కొక్కిరించి నాయనమ్మ కడుగుతానన్నా వద్దని తన పని తాను చేసుకోవటం మొదలెట్టాడు. అయినా నాయనమ్మ చేసే వంటకాలలో అదనంగా ఉప్పు, కారాలు వేసి సరిక్రొత్త రుచులు కల్పించటానికి యత్నించకపోలేదు. కాని సుభద్రమ్మ పడనీయటంలేదు.

మంగమ్మ అత్తయ్యకు ఉత్తరం వ్రాసింది. తనకు ఆడపిల్ల కలిగిందట. అంతా కులాసాగా ఉన్నారట. సూర్యం నాయనమ్మకోసం మారాము చేస్తున్నాడట. రామయ్య తల్లి వాటాలో అడుగుపెట్టటంలేదు సరిగదా, అందులో దీపం కూడ పెట్టనీయటంలేదట.

"బావగారికి ఎందు కంత పట్టుదల?" ఉత్తరం చదివిన శ్యామల విస్తుపోయి అడిగింది.

"మనిషికొక బుద్ధి, మనమేమి చెబుతాము?" సుభద్రమ్మ నిర్వేదంతో నిట్టూర్చింది.

ఒకనాటి సాయంకాలం అంతా హాల్లో కూర్చుండగా లక్ష్మణరావు ఉత్సాహంతో అన్నాడు:

"అమ్మా, ఇవాళ మన ఊరినుంచి ఉత్తరం వచ్చిందే!"

"రామయ్య వ్రాశాడా?" సుభద్రమ్మ ముఖం విరిసింది.

"కాదు, షావుకారు చంద్రయ్య వ్రాశాడు."

"ఏమని?" ఆమె గొంతులో మొదటి ఉత్సుకత లేదు.

"మన వాటా, ఇల్లూ, దొడ్డీ అమ్ముతారా అని అడుగుతున్నాడు. పదివేలదాకా పెంచేటట్లున్నాడు."

"ఇవాళ ఇల్లు అమ్ముతావంటావు, రేపు నన్నమ్ముతా వంటావు!"

"అమ్మా! అమ్మా! నిజంగా నాయనమ్మను అమ్ముతారంటే" పెద్దకొడుకు రఘు ఉత్సాహంతో అడిగాడు.

"ఆఁ, అమ్ముతారు, కొంటావా?" శ్యామల అడిగింది.

"ఓ."

"ఏంపెట్టి?"

"నాన్నను తాకట్టుపెడతాము. నాయనమ్మను కొనుక్కుంటాము".

"ఆ తాకట్టు కొప్పుకునే దరిద్రు డెవడంట?"

"మా నాన్న బాగా లెక్కలు వేస్తాడే. హైస్కూలు పిల్లలంతా అంటున్నారు. ఏ షావుకారైనా తాకట్టు పెట్టుకోడా యేమిటి? ఎందుకు నవ్వుతా?"

"నోరుముయ్, వెధవ! పసపిట్ట వాగుడూ నువ్వూను. అది కాదమ్మా! ఆ కొంప అక్కడ ఉండి ఏమిచేస్తున్నది? దీపం పెట్టేవాళ్లయినా లేరా? అమ్మితే యేం? నువ్వు చూస్తూనే ఉన్నావుగా. అద్దె కట్టలేక ఎంత అవస్థ పడుతున్నామో, ఆ డబ్బుతో ఇక్కడ స్థలమైనా కొనుక్కోవచ్చునుగా! ఏమంటావు శ్యామలా?" అతడు భార్యను హెచ్చరించాడు.

"అమ్మాయ్, మీ ఆస్తిని మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి! మధ్య కాదనటానికి నాకేమిటి హక్కు?" సుభద్రమ్మ చటుక్కున లేచి వెళ్లింది.

ఆ రాత్రి శ్యామల భర్తతో తగవు పెట్టుకొన్నది. "మీ సుఖం మీరు చూచుకొంటే సరిపోయిందా? ఇదివరకే మీ అన్నయ్య ఆమెమీద కారాలు, మిరియాలు నూరుతున్నాడు. ఇప్పుడు ఇల్లు అమ్మటానికి ఒప్పుకొంటే ఏమవుతుంది? కచ్చెకట్టి మీచేత ఇల్లు అమ్మించిం దనుకోడా? ఇదివరకు వచ్చిన మాటపట్టింపులతోనే ఆమె కుమిలిపోతుంటే ఇది మరొకటా? ఈమెను మళ్లీ పెద్దకొడుకు ముఖం చూడవద్దంటారు. మీలాగే వారూ ఆమె కడుపున పుట్టలేదా?"

"నీకు బొత్తిగా మతిపోయింది. నువ్వనేదేమిటే? నీ పిల్లల బాగోగులు నీకు పట్టకపోతే నాకా?" లక్ష్మణరావు వికటంగా నవ్వాడు.

"అందుకే మండుతుంది. అంత దూరపు ఆలోచన కలవాళ్లు అయితే మీ అన్నయ్యతో మాటాడి ఆమెకు చెప్పండి. అయినా తెలియక అడుగుతాను. ముందుగానే అన్నదమ్ము లిద్దరూ ఆమె ఆస్తిని అమ్ముకొంటే ఆమె ఎక్కడ ఉంటుంది? ఏమి తింటుంది? ఆమెకు ముసలితనం వచ్చిందనేగా ఈ ఆట ఆడుతున్నది?"

# ఉదబిందువులు

మరునాడే సుభద్రమ్మ ప్రయాణం కట్టింది. వెళ్ల వద్దని శ్యామల ఎంతగానో బ్రతిమాలింది. పెద్ద మనుమ లిద్దరూ చెరొక రెక్క పట్టుకున్నారు. మూడోవాడు ఆమె మూటను తీసుకుపోయి ఇంట్లో ఎక్కడో దాచాడు.

లక్ష్మణరావు తిరిగి గృహ ప్రవేశపు ప్రస్తావన లేలేదు. మాసాలు గడిచాయి.

"అమ్మా, మనియార్డరు వచ్చింది" అంటూ ఒక నాడు లక్ష్మణరావు డబ్బూ, ఫారమూ పట్టుకొచ్చి తల్లి కివ్వబోయాడు.

"ఎక్కడనుంచి ? ఎవరు పంపారు ?" ఆమె అడిగింది.

"అన్నయ్య. నీ వంట పైకం కాబోలు. కాకపోతే ఎనిమిది వందలు దేనికి పంపుతాడు ? ఇకనుంచి పొలం ఎవరి కైనా ఇచ్చుకొమ్మంటున్నాడు."

"లక్కరలేదు. తిప్పి పంపు" ఆమె తాపీగా అన్నది.

"ఎనిమిది వందలే !"

"ఊళ్లో క్లబ్బు లున్నాయే !" శ్యామల నవ్వింది.

"షటప్ !"

"బళ్లో ఈ చదువులే చెబుతున్నావా ?" సుభద్రమ్మ కొడుకువంక చూచింది.

లక్ష్మణరావు అక్కడనుంచి వెళ్లిపోయాడు. ఆరాత్రి ఇంటికి రాలేదు. మరునాటి ప్రొద్దున్నే సుభద్రమ్మ కోడలిని అడిగింది :

"రాత్రి అబ్బాయి రాలేదుగా !"

"లేదత్తయ్యా !"

"ఎక్కడికి వెళ్లాడో !" సుభద్రమ్మ గొంతులో విషాదం పలికింది.

అంతకుపూర్వమే సమాధానం ఆలోచించుకొన్న శ్యామల చెప్పింది : "ఏదో పని ఉన్నదట. ఒకవారం స్కూలుకు సెలవు పెట్టి వెళ్లారు."

సుభద్రమ్మ మళ్లీ ప్రశ్నించలేదు. నిజానికి ఆ ధైర్యం కూడ లోపించింది. వెనుకటి దుస్థితి తిరిగి తారసిల్లు తున్నదా ? లోగడ చిన్నకొడుకున్నాడని బయలుదేరి వచ్చింది. ఇప్పుడు మరెక్కడకు బయలుదేరుతుంది ? ఆలోచించే సాహసంలేక సుభద్రమ్మ కోడలిమాట నమ్మింది. జీవనలాలన ప్రగాఢం. అతి విచిత్రం. అది జీవేశ్వరులనే కాదు, స్వర్గా పవర్గాలనే కాదు, ధర్మాధర్మాలనే కాదు, హేతువునే సృష్టి స్తుంది. అవసరమైతే ఆ హేతువును గూడ నాశనం చేస్తుంది.

శ్యామల చెప్పిన వారం రోజులు గడిచాయి. కాని లక్ష్మణరావు ఇంటికి రాలేదు. స్కూల్లోనే మకాము పెట్టి అక్కడనుంచే స్కూలుకు వెళ్ళివస్తూ ఇంటిముఖం చూడ లేదు. ఈ సంగతి తెలుసుకున్న శ్యామల లోలోన ఉడికి పోతున్నది. అత్తకు ఏమని చెబుతుంది ? ఆమెకు నిజ లేకుండా ఎలా చెప్తుంది ?

"నాయనమ్మా, నాయనమ్మా ! నాన్న ఎక్కడికి వెళ్ళాడు ? ఎప్పుడు వస్తాడు ?" అని రఘు ఒక రోజున జాలిగా అడిగాడు.

"బుద్ధిలేనివాళ్ళు ఎక్కడికైనా వెళ్తారు. ఎన్నా ళ్లయినా ఉంటారు. నీకూ ఆడ బుద్ధిలేదా ?" శ్యామల కొడుకుమీద విరుచుకుపడ్డది.

"మాటాడా, చూడావా ? నేను చేసిన తప్పేమిటి నాయనమ్మా !" రఘు మొగం చిన్నబుచ్చుకొన్నాడు.

"అన్ని తప్పులూ నావే బాబూ !" సుభద్రమ్మ గొంతు జీరపోయింది.

ఆ తెల్లవారుజామున సుభద్రమ్మ కోడలిని లేపి "వస్తా నమ్మా !" అన్నది. శ్యామల తెల్లబోయింది.

"నాకు అంతా తెలుసమ్మా ! నేనుండగా వాడు ఈ ఇంట్లో అడుగు పెట్టడు. అదంతా నా ప్రారబ్ధం. దానికి నీవేమిచేస్తా ? వస్తానమ్మా, వస్తా ! నేను వెళ్లిపోవటం నీకు కష్టమే. కాని, ఏమిచేయను ? కలకాలాడే సంసారం నామూలాన పాడుకావటం నా కిష్టంలేదు. ఆలుమగల్లను ఒకరికొకరు కాకుండ చేయలేను. నేను రాకముందు హాయిగా ఉన్నారు. వచ్చి లేనిపోని కలతలు తెచ్చిపెట్టాను. అవన్నీ మరచిపో. వెనుకటిలాగా సుఖంగా ఉండండి !"

"అక్కడ కాదనుకొని ఇక్కడకు వచ్చావు. ఇక్కడ కాదనుకొని ఎక్కడకు పోయేటట్లు ? వద్దు అత్తయ్యా, వద్దు ! ముసలితనంలో తల్లిని తరిమివేసే అధికారం ఎవ రిచ్చారు ? అయినా తన సంపాదన తెచ్చి ఎవరినీ పోషించటం లేదు. కాస్తో కూస్తో నేమూ తెస్తూనే ఉన్నా. అంత కష్ట మైతే మానుకొంటారు. నేమ తెస్తున్న దానితోనే ఎలాగో సర్దుకొందాము. మీరు ఉండాలి అత్తయ్యా ! జంకితే ఎంత దూరమైనా తరిమికొడతారు." శ్యామల అత్త చేతులు పుచ్చు కొన్నది.

"కడుపున పుట్టిన బిడ్డలకంటే నీవే చాల నయం. చాలు, నాకు ఇంతకన్నా ఏమి కావాలి ? కాని, ఒకటి ఆలో చించు. అత్త వచ్చి కొడుకును కోడలికి కాకుండా చేసిందని

లోకం అడిపోస్తుంది. లోకం సంగతి ఎలా ఉన్నా అంతరాత్మ పీడిస్తుంది. ఏదైనా బాధపడతాను గాని ఈ బాధ మాత్రం పడలేను. కాటికి కాళ్ళు చాచుకొన్న నా సంగతి వదలు. మగని కెడమైన మగనాలు ఎంత చులకన అవుతుందో ఆలోచించు. పైగా పిల్లా జెల్లా. పిల్లందర్నీ ఈదేర్చాలి. ఈ బాధ్యత గొప్పదమ్మా! మనం మనుషులం కాని, పశువులం కాదు.''

శ్యామల నిశ్చల దీపశిఖ అయిపోయింది.

''అమ్మాయ్ !''

''ఏమిటి అత్తయ్యా !''

''ఇంతకాలం నుంచి హృదయం చిదిమిపెడుతున్నా సంతృప్తిపడక ఈ ముసలిప్రాణం మరొకటి కోరుతున్న దమ్మా !''

''ఏమిటి అత్తయ్యా !''

''వాకోసం లక్ష్మయ్యతో తగాదా పడనని మాట ఇవ్వు !''

శ్యామల అత్తవంక చూడలేక ముఖం తిప్పుకొన్నది.

''మాట్లాడవేమమ్మా ? కోరరాని దానిని కోరేనా ?''

''అంతా మీలాంటివారు కాలేరత్తయ్యా !''

''కావద్దు తల్లీ ! కావద్దనే నా ఆశీస్సు.''

సుభద్రమ్మ వెళ్ళిపోయింది. ఇంక క్లబ్బులో అజ్ఞాతవాసం చేయవలసిన అవసరం ఏమాత్రం లేదని శ్యామల ఉత్తరం వ్రాసి రఘుచేత భర్తకు పంపించింది. ఆ సాయంకాలమే అతడు ఇంటికి చేరాడు.

సుభద్రమ్మ తన యింటికిపోయి తా వల్లరిపడటం, పెద్దవాని మనస్సు వికలం చేయటం ఇష్టంలేకపోయింది. ఏగూటిలో పక్షులు ఆ గూటిలో ఉంటున్నవి. వాటి సుఖం తా నెందుకు చెడగొట్టాలి ? బ్రతికి ఇంకా ఎవరిని ఉద్ధరిస్తుంది ?

ఈ ఆలోచన రాగానే సుభద్రమ్మకు తన జీవితమ్మీద విరక్తి కలిగింది. కాని బలవంతాన ప్రాణాలు తీసుకోలేక చేతి బంగారు మురుగులు అమ్మివేసి ఆ బస్తీలోనే మూరుమూల పేటలో బియ్యపు కొట్టు పెట్టుకొని జీవయాత్ర. సాగిస్తున్నది.

ఆ సంక్రాంతికి రామయ్యవద్ద మంచి తల్లిపేర మనియార్డరు వచ్చింది. లక్ష్మణరావు నిర్ఘాంతపోయాడు. తల్లి స్వగ్రామం చేరక ఎక్కడకు పోయినట్లు ? అతడు పోయి భార్యకు మనియార్డరు చూపించాడు.

''ఇంకేం, కావలసిందేదో వచ్చిందిగా. పుచ్చుకోండి ?''

''ఫోర్జరీ చేయమన్నావా ?''

''ఎన్నాళ్లనుంచి ఈ ధర్మబుద్ధి ?''

''అన్నయ్యతో వ్యవహారం !''

''అయితే కూడబలుక్కుని పంచుకోండి.''

''ఎందు కంత కోపం ?''

''నాకు భాగం లేదని ?''

అతడు మళ్ళీ మాట్లాడలేదు. ఆ సాయంకాలం శ్యామల రఘువద్ద వాపోయింది :

''మీ నాయనమ్మ మన వూళ్ళో లేదట రఘూ !''

''మన వూళ్ళో లేదా ?'' రఘు ఆశ్చర్యపోయాడు.

''ఇవాళ అక్కడనుంచి మనియార్డరు వచ్చింది. ఉంటే ఎందుకు వస్తుంది ?'' ఆమె కంట తడి పెట్టింది.

రఘుకు అర్థమయింది. తల్లి కన్నీరు చూడలేక అన్నాడు :

''నాయనమ్మ ఈ ఊళ్ళోనే ఉన్నదమ్మా !''

''ఈ ఊళ్ళోనే ! నీవు చూచావా ?''

''ఉంది. అప్పుడప్పుడు వెళ్లివస్తూనే ఉన్నా.''

''ఒకనాడు కాకపోతే ఒకనాడైనా చెప్పావుకావేమిరా ? అవునులే, విత్తొకటైతే చెట్టు మరొక టవుతుందా ?''

''చెప్పవద్దంటే ఏమి చెయ్యను ?'' రఘు ఖిన్నుడయ్యాడు.

''అయితే బయలుదేరు.'' శ్యామల కొడుకును తొందర పెట్టింది.

''నాన్న వింటాడేమో !''

''ఎవరి మోచేతి నీళ్ళూ త్రాగటంలేదు కాని పద!''

ఇద్దరూ రిక్షాలో బయలుదేరారు. వారు వెళ్లేటప్పటికి కొట్టువేసి ఉన్నది. రఘు ప్రక్కవారిని కనుక్కొంటే రెండు రోజుల నుంచి కొట్టు మూసివేసి ఉంటున్నదని చెప్పారు. అంతకుముం దెన్నడూ అతడు నాయనమ్మ యింటికి వెళ్ల లేదు. ఆమె అడ్రసు కనుక్కొని తల్లీ కొడుకులు వెదకికొంటూ శిథిలావస్థలో ఉన్న ఒక చిన్న పెంకుటింటికి చేరారు. తలుపు ఓర వాకిలిగా వేసిఉన్నది. లోపలి నుంచి మాటలు వినిపిస్తున్నాయి. ''కొత్త సరుకు. ఆ బియ్యం మీకు పనికిరావు. మాట పోతుంది. మీ అమ్మతో చెప్పు. నాలుగైదు రోజుల్లో పాతరపడ్డ సరుకు వస్తుంది. అప్పుడు నేనే పంపిస్తాగా !'' శ్యామల తలుపు బారలుగా త్రోసుకు వెళ్లింది. లోపల ఎవరూ లేరు. గది చీకటి కోనేరుగా ఉన్నది. మూలుగునుబట్టి తడవుకొంటూపోయి ఆమె మంచం

మంచంలో పండుకొన్న అత్త చేయి పట్టుకుని చూచింది. ఒడలు సెగలు, పొగలు చిమ్ముతున్నది.

"ఒరే రఘు, నీవు రిక్షాలో పోయి నేను రమ్మంటున్నానని చెప్పి డాక్టరు రాధమ్మను అర్జెంటుగా వెంట బెట్టుకురా. ఇప్పుడు ఇంట్లో ఉంటుంది. ఇల్లు తెలుసుగా!"

అతడు రాధమ్మ కారులో తిరిగి వచ్చాడు. డ్రైవరు సాయంతో సుభద్రమ్మను కారువెనుక సీటులో పండుకోబెట్టి గదికి తాళంపెట్టి శ్యామల రఘు వెనుకసీటు ముందు కూర్చున్నారు. కారు బయలుదేరింది.

"ఎవరు ఈ ముసలమ్మ ?" రాధ అడిగింది.

"దిక్కులేనిది." శ్యామల గొంతు డగ్గుత్తిక పడ్డది.

"ఈ అనాధసేవ ఎప్పటినుంచి ?" ఆమె నవ్వింది.

"ఏదో దూరపు చుట్టరికం. ఆమెకు కావలసినవాళ్లు ఎక్కడో ఉన్నారు. సుస్తీగా ఉన్నదంటే చూచి నీకోసం కబురంపించాను."

"నర్సింగ్‌హోంకు పోదామా, మీ యింటికా ?"

"నర్సింగ్‌హోంకే పోనీండి !"

"అమ్మా !" రఘు ఏదో చెప్పబోయాడు.

ఆమె మెల్లగా కొడుకును గదిమింది.

శ్యామల ఆఫీసుకు సెలవుపెట్టి అత్త వద్దనే ఉంటున్నది. పిల్లలు అప్పుడప్పుడు వచ్చి చూచిపోతున్నారు. లక్ష్మణరావుకు ముఖం చెల్లక రాలేదు. నాలుగు రోజుల తరువాత సుభద్రమ్మకు తెలివి వచ్చింది.

"ఎవరిల్లు ?"

"ఇల్లుకాదు నాయనమ్మా !! ఆసుపత్రి." దగ్గరఉన్న రఘు అంతా వివరించి చెప్పాడు.

"డాక్టర్లు దేవుళ్లు కాదూ ?" అంటూ కోడలు కనిపించగానే ఆమె బలహీనంగా నవ్వింది.

"అదేమిటత్తయ్యా ?"

"ఎందుకొచ్చిన దండుగ గాని నీ యింటికి చేర్చు. ఈ ముసలితనంలో మందులు పట్టవు."

"అలాగే నత్తయ్యా ! బావగారికి ఉత్తరం వ్రాశాను. బండి తోలుకొస్తారు. రాగానే వెళ్లిపోదాము. ఈ మందు పుచ్చుకోండి !"

"అవునవును. రామయ్య బండి తప్పక తోలుకొస్తాడు!"

సుభద్రమ్మ మందు త్రోసివేసింది.

"ఇంతగా కలవరిస్తున్నావే, మళ్ళీ ఊరు వెళ్ళనీ తెస్తే ఎందుకు రావు ?"

"రాను బాబూ, రాను. నేను వచ్చినా రాను. వాడి సంగతి నీ కిప్పుడిప్పుడే అర్థంకాదు."

పెద్దకొడుకు వచ్చి చెబితేనన్నా మనసు మారుతుందేమోనని శ్యామల బావగారికి ఉత్తరం వ్రాసింది. మంగమ్మ, సూర్యం వచ్చారే కాని రామయ్య మొహమైనా చూపించలేదు. సుభద్రమ్మ పోరుపడలేక శ్యామల ఆమెను తన యింటికి తీసుకువెళ్లింది.

మళ్లీ జ్వరం ఎక్కువయింది. ఎన్ని టానిక్కులు మార్చినా సుభద్రమ్మ మంచం వదలటం మానివేసింది. ఒక నాడు రఘును ఒంటరిగా పిలిచి "బాబూ, ఉత్తరం ఏమిచేశా"వని అడిగింది. "పెదనాన్నను కలుసుకొస్తానని ఇమ్మంటివిగా. అలాగే ఇస్తాను నాయనమ్మా!" అన్నాడు.

కొంది రోజులకే హంస లేచిపోయింది. ఆమె శరీరంతో లక్ష్మణరావు, శ్యామల, పిల్లలు, మంగమ్మ, సూర్యం స్వగ్రామం చేరారు. అప్పుడు గూడ రామయ్య వెళ్లి తన గొడ్లచావట్లో కూర్చున్నాడే కాని తల్లిని చూడ నైనా రాలేదు. ఎందరు ఎన్ని విధాలుగా అన్నా తల్లి అంత్యక్రియలలో పాల్గొనలేదు.

కర్మ ముగిసిన తరువాత లక్ష్మణరావు అన్న వద్దకు వెళ్లి అయిన ఖర్చులు చెప్పి తల్లి తాలూకు పది సంవత్సరాల పంట నిలవ ఉండాలని లెక్క తేల్చాడు.

"ఆమె పంట దమ్మిడీ ముట్టుకోలేదు. ఎప్పుడు కప్పుడు మనియార్డరు చేస్తూ వచ్చాను. ఆమె తిరగగొడుతుంటే ఆమె సేవింగ్సు అకౌంటులో జమ కట్టించాను." రామయ్య లోపలకు వెళ్లివచ్చి ప్యాసుబుక్కు తమ్ముని ముందు పడేసి గొడ్లచావడికి బయలుదేరాడు.

"ఖర్చులు పోగా నీకు సగం వస్తుందన్నయ్యా!" పుస్తకం తెరిచి చూస్తూ లక్ష్మయ్య అన్నాడు.

"నాకేమీ సంబంధంలేదని ఏనాడో చెప్పాను" అతడు వెళ్లిపోయాడు.

రఘు వెదకికొంటూ వచ్చేటప్పటికి రామయ్య గొడ్ల చావట్లో గాటిమీద కూర్చుని మేస్తున్న ఎడ్లజత వైపు దిగాలుగా చూస్తున్నాడు.

"పెదనాన్నా !"

"ఏమిటి ?"

"నాయనమ్మ ఈ ఉత్తరం మీ కిమ్మన్నది."

"అమ్మ చచ్చిపోయింది. అంత్యక్రియలు కూడా జరిగిపోయాయి."

"ఈ ఉత్తరం మీ కిమ్మని చెప్పి చనిపోయింది."

"చచ్చినవాళ్లకు బ్రతికున్నవాళ్లతో పనేమిటో !"

రఘుకు ఆశ్చర్యం, కోపం కలిగాయి. "నీకెలా తెలుస్తుందీ ?" అంటూ ఉత్తరం ఇవ్వబోయాడు.

"నే నెందుకులే, నువ్వే చదువు."

రఘు కవరు చించి ఉత్తరం తీసి మెల్లగా ప్రారంభించాడు :

పెద్దబ్బాయ్ !

తల్లినయి ఉండి చిన్నవాడిమీద పక్షపాతం చూపించావనే కదా నీకు కోపం ? మానవులన్న తరువాత మమతలలో ఎచ్చులొచ్చు లుంటాయి. మనకు రెండు చేతు లొకటే. కాని ప్రతి పనికీ నీవు ముందు కుడిచేయి చాపుతావు. మరి కొందరు ఎడమచేయి చాపుతారు. దీనికేమంటాము ? అది అలా ఉంచు. చిన్నవాడి చదువు ఖర్చులు లెక్కగట్టక ఆస్తిని సరిసమానంగా పంచాననే కదా నీ బాధ. కలతలు లేక ఇద్దరూ ఒకరికొకరు తోడుగా ఉంటారని ఆశపడి మోసపోయాను. పెద్దగా చదువుకొన్నంత మాత్రాన గుణాలు రావు. చిన్నవాడు నీ మనసు గుర్తించలేదు. జరిగినదేదో జరిగిపోయింది. ఈ పదేళ్ల పంట నీదే. దీనిలో దమ్మిడీ కూడా చిన్నవాడికి రాదు. ఇక నైనా నన్ను క్షమిస్తావు కదూ ?

సుభద్ర.

రఘు ఉత్తరం ముగించి చూచేటప్పటికి పెదతండ్రి చెక్కిళ్లపై సెలయేళ్లు ప్రవహిస్తున్నాయి. అతడు ఉత్తరం పెదతండ్రి కిచ్చాడు.

"బాబూ, ఈ సంగతి మీ నాన్నకు చెప్పకు." మాట తీసుకొని అతడు ఉత్తరం ముక్కలు ముక్కలుగా చించి వేశాడు.

రఘు దిమ్మరపోయి తేరుకొని నమస్కరించాడు.



# శ్రీ హస్తరత్నావళి-హస్త అధ్యాయము



శ్రీ నే. శ్రీకృష్ణమూర్తి

చూడా చంద్రమరీచి నిస్పృహమివా నమ్రంస్ఫురద్
విభ్రతీమ్
వక్త్రాబ్జం నిహితైక బాహులతికా మంసే తుషా
రాద్రిజామ్
వామార్థే పరిరభ్య విభ్రమచళ స్పష్టార్ధ ముగ్ధేక్షణః
ప్రీతో డామరుకం రవం విరచయన్ స్మేరోహరః
పాతువః.

శివుని శిరముపై నున్న చంద్రశేఖరుని కిరణముల ప్రసారము, అబ్జముఖి యగు పార్వతికి నిస్పృహ కలిగించ, ఆమె తల వంచికొనెను. (అబ్జములపై చంద్రికాప్రసారము వైముఖ్యమును కల్గించును. నతశిరస్కయగుట లజ్జను సూచించును.) శ్రీ గిరిజాదేవి తన బాహులతికను మహాదేవునిపై నుంచ, స్వామి ఆమెను ఆలింగనము చేసుకొని, డమరుకమును ధ్వనిగావించుచు మందహాసవదనుడై మిమ్ములను రక్షించుగాత !

ఈవిధముగా రాయరాఘవ క్షితిపతి తాను కూర్పం బూనిన 'శ్రీ హస్త రత్నావళి' యను నాట్య ప్రబంధమున కుపక్రమించెను. రాజులు నాట్యాది కళాప్రియులే గాక, తద్ శాస్త్ర నిర్మాతలును. నిదర్శనము :—

శ్రీ రాఘవః క్షితిపతిర్జయతి ద్విజన్మ
వంశప్రసూత పరిభూత రవి ప్రతాపః
శుభ్రాభ్ర శంకర విరంక శశాంక శంఖ
శంకాం సృజత్ భ్రమతి దిక్షు యశోయదీయమ్.

ఎవనియొక్క యశస్సు, శుభ్రమగు మేఘమా లేక శంకరుడా లేక కళంకహీనమైన చంద్రుడా, లేక శంఖమా ? అను సందేహము కలిగించుచు జగత్తున వ్యాపించుచుండునో, అట్టి ద్విజన్ముడును, భాస్కర ప్రతాపమునే త్రోసిరాజను శ్రీ రాఘవ క్షితిపతి వర్ధిల్లుచున్నాడు.

అట్టి రాజకవి :

శ్రీ హస్త ముక్తావళీ కృత్ ప్రబంధే
భూయో యదుక్తాన్ విషయాన్ బబంధ
శ్రీ రాఘవః క్షోణిపతి స్తదేతాం
శ్రీహస్తరత్నావళి మాతనోతి.

శ్రీ హస్తముక్తావళీ కారుడు తన ప్రబంధమున తిరుచుగా ఏ విషయములను నిబంధించెనో, వాటిని శ్రీ రాఘవ క్షోణీపతి 'శ్రీహస్త రత్నావళి' యను కావ్యమున బంధించెను.

అద్దానిని :

పరిషది రుచిరస్తి హస్తకానాం
రసికజనాయది వేదితుం విశేషాన్
కృతిరియ మవధార్యతాం
తదానీం ధరణిపతేః ద్విజరాజ రాఘవస్య.

పరిషత్తునందలి ఓ రసికజనులారా ! హస్త విషయములను తెలిసికొన నభిలాష యున్న, ద్విజరాజగు రాఘవ ధరణీశ్వరుని కృతిని అవధరింపుడు :

నాట్య నృత్య నృత్తములందు కరవిన్యాసములు అందమైనవి, అర్థ స్ఫురణము కలుగజేయునవి. ఈ నాట్య మెట్టిదనిన:

నాట్యం విశ్వమనః ప్రమోద జననం నాన్యద్యథాదృశ్యతే
కిం భూమో హరిణారణే భుజబలోచ్ఛిన్న ప్రవచ్ఛోణితః
బిభ్రాణ శ్చతురోభుజాన్ బలిసుత శ్ఛిన్నావ శిష్టాన్పురా
యత్కృత్వా పరిత ప్రఖండ పరశుం లేభే మహాకాళతః.

అందరి మనస్సుల చూఱగొని రంజింప చేయునది నాట్య మొక్కటే, మరొక్కటి లేదు. యుద్ధరంగమున పూర్వము విష్ణువు బలిసుతుని భుజములను ఛేదింప, మిగిలిన వాల్గు చేతులతో మహాదేవుని సమ్ముఖమున తాండవ మొనర్చి, ఆ మహాకాలుని మెప్పించి ఖండ పరశువును పారితోషకముగా, ఆ దేవదేవునొద్ద పడసెను.

(ఈ బలిసుతు డెవ్వడో ?)

ఈ గ్రంథమందు (1) హస్తక్రమములు అనగా పతాకాది హస్త విన్యాస నిర్ణయములు, (2) హస్త భేదములు, అనగా సంయుత అసంయుత, నృత్త హస్తములు, (3)

హస్త లక్షణములు, అనగా ఈ నిర్ణీత హస్త విన్యాసము లెట్లుండవలెనో, (4) హస్త క్రియలు, అనగా వానికి విధించిన విన్యాస భంగులు వివరించి వర్ణింపబడినవి.

ఈ శ్రీహస్త రత్నావళి కూర్పుకు మూలకృతి శ్రీహస్త ముక్తావళి. ఇయ్యది శుభంకర ప్రణీతము. ఇంకను శుభంకరుడు సంగీతశాస్త్రమును గూర్చిన కావ్యమును రచించి, దానిని తన కుమారుని నామ చిహ్నముగ 'సంగీత దామోదర మ' నెను. శుభంకరుని గూర్చి, వివరము లెక్కువ తెలియరావు. అస్సాము విశ్వవిద్యాలయ సంస్కృత పండితులగు శ్రీ మహేశ్వర నియోగి శుభంకరుడు 14 లేక 16 శతాబ్దివాడని సూచించెను. ఈ గ్రంథము ఖండ ఖండములుగా మద్రాసు మ్యూజిక్ అకెడెమీవారు వారి మాస పత్రికయందు సంపూర్ణముగ (దొరికిన వ్రాతప్రతి నంతయు) ప్రకటించిరి.

శ్రీహస్త ముక్తావళిని పట్టుకొమ్మగా ఊతగొని రాయ రాఘవుడు తన రత్నావళిని వ్రాసెను. సంపూర్ణ గ్రంథము లభ్యము కాలేదు.

నాకు లభ్యమైన గ్రంథ ఖండము ఇంగ్లండుదేశ బాడిలిన్ లైబ్రరీవారు దయతో పంపిన ఛాయాచిత్ర ప్రతిమ పుటలు —నలువది. భాష సంస్కృత మైనను వ్రాతవంగాక్షరము లందున్నది. వంగాక్షరములే గాక, అస్సామీ అక్షర మిశ్రమ మున్నదని పండిత మహేశ్వరుల తీర్మానము. ఇట్టి వ్రాతను సుగమముగా నాకు విపులీకరించినవారు శ్రీమాన్ ఎన్. శఠకోపన్‌గారు. బాడిలిన్‌వారు ప్రతిని పంపుచు ఈ క్రింది వివరముల తెలిపిరి. (31—7—52) శ్రీహస్త రత్నావళి వ్రాతప్రతిని విల్‌సన్ సేకరించిరి. నెం. 234. వ్రాత కాగితములపై నున్నది. విల్‌సన్‌వద్ద నుండి బాడిలిన్ పుస్తక భాండాగారమువారు విక్రయముచేసికొనిరి. గ్రంథకర్త రాఘవుడను రాజు. అసంపూర్ణముగ నున్నది. వ్రాయసగాని పేరు లేదు.

ఇట్టి గ్రంథ మొకటి యున్నదని పరిచయముచేసిన ప్రముఖులు శ్రీ మైల్సు డిల్లన్ పండితులు. వారు దీని విషయమై తెల్పుచు, ఆ వ్రాత ప్రతిని చూచి ఆంగ్లాక్షరము లలో తాను వ్రాసికొన్న కతిపయ పుటల నాకు పంపిరి. ఈ మైల్సుడిల్లన్‌గారు కీ. శే. మానవల్లివారి సాయమున సాగరనంది రత్నకోశ పాఠమును నిర్ణయించి ప్రచురించిరి. ఈ ఛాయా చిత్ర ప్రతిరూప మిప్పుడు మద్రాసు మ్యూజిక్ అకడెమీ వారి కొసంగుటకై పద్మవిభూషణ డాక్టరు రాఘవన్ వారి వద్ద నున్నది. దీని ప్రతులు మన భారతదేశమున మరెచ్చట నున్నది ప్రయత్నించినను తెలియరాలేదు. శ్రీ మహేశ్వర నియోగిగారు శ్రీహస్తముక్తావళిని ప్రచురించు సమయమున నావద్ద నుండిన ఛాయా ప్రతిని చూచిరి. పైవా రందరకును నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

**2**

చతుర్విధాభినయములలో అంగాభినయము ప్రఖ్యాతమై నృత్య నృత్త నాట్యాదులందు సువీక్షణమునకు వీలగునది. అంగాభినయమందు హస్తాభినయము—అనగా హస్త చాలనము ప్రధాన మైనది. స్వరూప ప్రతీకములగు హస్త విన్యాసములే శబ్ద భావ ప్రకాశకములు. ఉదాత్త భావములు భాషచే వ్యక్తమై, హస్తాభినయముచే పునః ప్రకటితమగు కథాచేష్ట :

"నైతావద్ ఏవ, పరో అన్యద్ అస్తి"
ఋగ్వేద సూక్తి—10—31—3.

కేవల మిది కాదు, పర మైనది వేఱుగ నున్నది. ఈ మహా వాక్యము సర్వ కళలకు కీలక మగుటయే గాక అవ్యక్త పరబ్రహ్మమునకు ప్రతీకమై కూడ వెలయుచున్నది.

ఉచ్చారణ వక్తృత్వ ప్రవచనలతో (వాచికాభినయము) సహకరించు హస్తాభినయము భావ ప్రకటనమునకు అనువగు సాధనము. ఈ సూక్తి విశ్వవ్యాప్తమై యున్నది.

ఇంగ్లండు దేశమున ఎలిజబత్ I రాణి కాలమున పాఠశాలలో అధ్యయన క్రమమున ఈ హస్త విన్యాసములు ప్రవచనమునకు ముఖ్యాంగములుగా, విద్యార్థులకు పాఠ్యక్రమమున ఉండినట్లు బి. ఎల్. జోసెఫ్‌గారు తన (ఎలిజబత్‌నాటి నాట్య కౌశలమను) గ్రంథమున తెలిపియున్నారు.

ఈ హస్తవిన్యాసములను శాస్త్రబద్ధ మొనర్చుట భరతనాట్య శాస్త్ర విశిష్టత. హస్త మనగా, ముంజేయి, వ్రేళ్లు, కరతలము కలిసి వివిధ రీతులుగా వస్తువును గాని, భావమును గాని అనుకరించుట. మానవ జీవితానుభవముల తఱచి చూచి, ఈ హస్త విన్యాసములు విభజింపబడి, శాసనములవలె విధిగా నిర్ణయింపబడినవి. Patterned Hand Poses ఒకే చేతితో విన్యసించిన అసంయుత హస్తము, రెండుచేతులను కలిపి భంగులుగా నొనర్చిన సంయుత హస్తములు. ఇవిగాక కేవల సుందర రూపములుగా అర్థ రసస్ఫురణకు దూరమై యొనర్చు హస్త విన్యాసములు నృత్త హస్తములు. ఈ మూడు విభాగములు గాక విశిష్ట భావముల ప్రతీకరించుటకు అనేక హస్తములు నిరూపింపబడినవి. ఇట్లు వీనిని వర్ణించిన ప్రథమ గ్రంథము. నందికేశ్వరుని అభినయదర్పణము.

# శ్రీ హస్తరత్నావళి : హస్తఅధ్యాయము

ఈ హస్తాభినయావిష్కరణమున, హస్తమును నిర్ణీత రూపమునం దుంచుటయే గాక, దానిని శిరస్సు, ముఖము, కర తలమందు, కపోలములపై, కంఠ, వక్ష, ఉదరకటి ప్రదేశములం దుంచినను ఊర్ధ్వ, అధోదిశలకు వ్యాప్తము చేసినను, వేరు వేరు భావార్థముల స్ఫురింపజేయును. నాట్య గ్రంథములందు సామాన్యముగ, సంయుతాసంయుతములుగా విభజింపబడి, వాని లక్షణములు, అనగా చేతి వ్రేళ్ల వేతీరుగ నుంచ వలయునను వివరములు చెప్పబడును. తరువాత ఏ హస్త విన్యాసము ఎట్టి భావములందు, ఏ వస్తువులందు వినియో గింపబడవలెనో వర్ణన లుండును. శ్రీహస్తముక్తావళిలోని ఇట్టి రచనచే ఏ భావమునకు ఎట్టి హస్తము ప్రయో గింపవలయునని తెలిసికొనుట, వెదకికొనుట కష్టము. అందుచే శ్రీహస్త రత్నావళి కావ్యకర్త విస్త్యావిష్కరణమును మార్చి సుగమముగా వ్యక్తీకరించెను.

## 3

శ్రీహస్తరత్నావళి రచనా పథకమున ప్రథమమున హస్త విన్యాసముల వివరములు ఈ క్రింది విధముగా వర్ణింప బడినవి. 1 పతాక, 2 త్రిపతాక, 3 కర్తరీ, 4 అర్ధ చంద్రిక, 5 హంసాస్య, 6 లాం(గా)గుల, 7 ఫణి, 8 ముకుల, 9 కదంబ, 10 పద్మకోశ, 11 పూర్ణనాభ, 12 అలపద్మ, 13 ముష్టిక, 14 శిఖర, 15 కపిత్థ, 16 తామ్రచూడ, 17 అంకుశ, 18 సూచాస్య, 19 ఖటకా, 20 అరాల, 21 శుకతుండ, 22 సందంశ, 23 సర్పశిరా, 24 హంసపక్ష, 25 చతుర, 26 మృగ శీర్షక, 27 భ్రమర, 28 సింహాస్య, 29 కృష్ణసార, 30 తంద్రీముఖ. ఈ ముప్పై ఒక చేతితో విన్యసింపదగిన అసం యుత హస్తములు. ప్రదర్శింపదగిన భావానుసారముగ అదే హస్తమును రెండు చేతులతో చేయనగును.

1 గజదంత, 2 మకర, 3 దోల, 4 మరాళ, 5 కపోత, 6 అంజలి, 7 పుష్పపుట, 8 నిషధ, 9 వర్ధమాన 10 కర్కట, 11 ముష్టి, 12 ఉత్సంగ, 13 అవహిత్థ 14 ఖటకా వర్ధమానక, ఇవి సంయుత హస్తములు. రెండు చేతులను కలపి చేయనగును.

ఇవిగాక వృత్త హస్తములును వివరింపబడినవి. వీని యందు సంయుతా సంయుత విభేదము లేదు.

1 కేశబంధ, 2 నితంబి, 3 పక్షవంచిత, 4 లతా, 5 ప్రద్యోతక, 6 కరిహస్త, 7 గరుడపక్ష, 8 ఉత్తాన రేచిత, 9 రేచిత, 10 అర్ధరేచిత, 11 ఉద్వృత్త, 12 స్వస్తిక, 13 విప్రకీర్ణ, 14 సూచి, 15 దత్తపక్షక, 16 చతుర, 17 ముక్తిక, 18 స్వస్తిక, 19 ఆవిద్ధ, 20 అరాల ఖటకాముఖ, 21 వక్షోమండలి, 22 ఉరః పార్శ్వమండలి, 23 పార్శ్వమండలి, 24 ఊర్ధ్వమండలి, 25 పల్లవ, 26 అలపద్మ, 27 నలినీ పద్మకోశ.

అసంయుత హస్త లక్షణములను ప్రాయశః వర్ణింప బడి యుండవలయును. కాని ఈ గ్రంథము పూర్ణముగ లభించనందున, వీనిలో 1 నుండి 5 వరకు, 24 నుండి 30 వరకును వర్ణింపబడి యున్నవి. అనగా 6 నుండి 23 వరకు—లాంగూలమునుండి సర్పశిర హస్తము వరకు లక్షణ ములు గల పుటలు అదృశ్యములైనవి. సంయుత హస్తము లలో 1 నుండి 10 వరకును లక్షణములు గలవు. తరువాతి 11 ముష్టిని గూర్చిన లక్షణము లేదు. ఇట్లే అసం యుత హస్తముని ప్రఖ్యాత మైనను, సంయుత వర్గమందు చేర్చబడినను, లక్షణము చెప్పబడలేదు. 10 తరువాత అరాళ స్వస్తిక లక్షణము చెప్పబడినది. 14 వరకు లక్షణము లిట్లు బడినవి. వృత్తహస్తముల గూర్చి గ్రంథకర్త :

> మయాత్ర నృత్యహస్తానాం నామమాత్రం ప్రకాశితం
> కింతు శేషం కరిష్యామి తద్విశేషస్య లక్షణం.

నామమాత్రముగనే రచించినాడట. నృత్తహస్తములను, వాని లక్షణములను మున్ముందు చెప్పెదనని వచించెను. కాని లభించిన గ్రంథమందు వ్యత్యయము.

ఇంతవరకు ప్రథమాశ్వాసముగ పరిగణింపవచ్చును.

## 4

> యత్ర శ్రీశ్చ సరస్వతీచ రభసా దవ్యోష్య నిర్మత్సరః
> భూలోకభ్రమణా విరమ్య పరమానందాన్వితేది వ్యతః
> తేన శ్రీయుత రాయరాఘవ ధరాధీశేన యా నిర్మమే
> తామేతాం కలయంతు నాట్య రసికాః శ్రీహస్తరత్నావళీం.

లక్ష్మీ సరస్వతులు భూలోకమున పరిభ్రమణమును మాని పరస్పర మాత్సర్యమును వీడి యెవనియందు పరమానందముతో ప్రకాశించుచుండురో అట్టి శ్రీయుత రాయరాఘవ ధరాధీశు నిచే నిర్మితమగు ఈ శ్రీహస్త రత్నావళిని నాట్యరసికులు ఆల కింతురుగాక !

శ్రీహస్త రత్నావళీ నామమున శ్రీ యక్షర మెప్పుడును పూర్వాంకముగ నుండవలెను. ఈ విషయమును గూర్చి శుభంకరుడు తన శ్రీహస్త ముక్తావళిలో :

> ఆలస్యాద్ గ్రన్థబాహుల్యాత్ శ్రీ శబ్దో యైర్నలిఖ్యతే
> శ్రీ శబ్దస్తాన్ స్త్యజేదేవ మర్యాదాలంఘనోద్యతాన్.

ఆలస్యముచే గాని, గ్రంథబాహుళ్యమువి గాని శ్రీ శబ్ద మును ఎవరు వ్రాయ మానుదురో అట్టి హద్దు మీరినవారిని శ్రీ విడిచిపెట్టును.

ఆ బాణిలోనే రాయరాఘవుని గ్రంథమును శ్రీహస్త రత్నావళి యనియే పరిగణింపవలయును.

ఈ గ్రంథ విశిష్టత, ప్రాముఖ్యము విచిత్రమైనది. అభినయాటీక అనగా కోరియాగ్రఫీకి (Choreography) అనువుగ అనేక భావములను ఎట్లు వ్యక్తీకరించవలెనో కరత లామలకముగ చేయుటకై కవి వర్ణనా పద్ధతిని మార్చెను. ఎట్లనగా, భావములను, వస్తువులను వరుసగా వర్గీకరించెను. శబ్దార్థకారుడు అమరసింహుడు వర్గీకరించినట్లు. ఒక్కొక్క

విషయమునకు ఏ హస్తము నెట్లు అభినయమున ప్రయోగింపవలయునో చెప్పెను. ఈ వర్గములు 450 ను గూర్చి చెప్పినట్లు ఈ భాగ వర్ణనాంతమున చెప్పెను. కాని ఈ వ్రాత ప్రతియందు సుమారు 360 మాత్రమే యున్నవి. మఱల నొక్కొక్క వర్గమునను అనేకములైన ఉపభావములను పేర్కొనెను. వరుసగా భావముల పేర్కొని తదుపరి ఆయా భావములను హస్తవిన్యాస రూపములతో నెట్లు ప్రదర్శింపవలెనో వర్ణింపబడినవి. కాని లభ్యమైన ఖండ గ్రంథమున 121 వర్గముల వరకే వచింపబడి యున్నది. బాడిలీన్ గ్రంథాలయమువారికి వ్రాయగ, మిగత పుస్తక విషయము తెలియదనిరి.

ఉదాహరణకై భావము 101. అష్టవిధనాయికలు : ఉపభావములు, ఆలంకారికులకు తెలిసిన అభిసారికాది ఎనిమిది మంది నాయికలను గూర్చిన వర్ణనములు ఇవ్వడమైనది :

1. వస్త్రావగుంఠనా దేవ తథాభిసరణే నచ
<u>అభిసారికా</u> వినిర్దేశ్యా వామహస్త పతాకకే.

2. చిత్రమండల హస్తేన <u>వాసకజ్జా</u> పతాకకః
త్రిపతాకోంకుశాకారః పురః <u>ప్రోషితభర్తృకా</u>
అరాళేప్యం కుశాకారేపురః ప్రోషిత భర్తృకా.

3. <u>ఉత్కంఠా</u> కరణా కారాత్ తాదృగ్భావ ప్రదర్శనాత్
ఉత్కంఠాయాం....కథితో వామోాయ మలపద్మకః.

4. వామ ముష్టిక విక్షేపాత్ <u>కలహాంతరితామతా</u>
<u>విప్రలబ్ధా ఖండాడితాచ</u> సూచీ విచ్ఛేద దర్శనాత్.

5. సూచీ నిష్పీడనాదేవ <u>స్వాధీన భర్తృకామతా.</u>
(నాయికా భేదాః.)

1. అభిసారిక : వస్త్రముతో శిరస్సును అవకుంఠనము గావించుకొని అభిసరించుచు, ఎడమచేతిని పతాకమందుంచిన అభిసారికా నాయిక సూచితము.

2. వాసక సజ్జిక : చిత్రమండల హస్తముతో పతాక హస్తమును ప్రదర్శించిన వాసక సజ్జిక నాయిక.

ఇచ్చట 'చిత్రమండలము' ను నూతన హస్త విన్యాసము చెప్పబడినది. దీని లక్షణము తెలియదు.

3. ప్రోషిత భర్తృక : త్రిపతాక హస్తము లేక అరాళమున అంకుశాకారముగ నుంచిన ప్రోషిత భర్తృక నాయిక సూచితము.

4. 'విరహోత్కంఠిత : ఎడమచేతివి అలపద్మమున నుంచి ఉత్కంఠను ప్రదర్శించిన విరహోత్కంఠితనాయిక సూచితము.

5. కలహాంతరిత : ఎడమ ముష్టిక హస్తమును విడ ల్చుట వలన కలహాంతరిత నాయిక సూచితము.

6, 7. విప్రలబ్ధ—ఖండిత : సూచీ హస్తమును విచ్ఛేద మొనర్చుటచే, అనగా ముడుచుట, కంపింపకుండ చేయుటచే, విప్రలబ్ధ, ఖండిత నాయికలు సూచితములు.

8. స్వాధీనభర్తృక : సూచీ హస్తమును వలుపుటచే స్వాధీన భర్తృక సూచింపబడును.

ఇట్లే అనేక భావములను వ్యక్తీకరించుటకై ఆయా భావములను విపులీకరించి వానిని హస్త విన్యాసమున ప్రయోగించుటను, ఏ హస్త మెట్లు ప్రదర్శింపవలెనో అను వర్ణనము ఈ రత్నావళియందు వివరింపబడినది. ఈ రచనా పద్ధతి విశిష్టమైనది. అభినయించువారికీ, అభినయటీక వ్రాయు ఒజ్జలకు గ్రాహ్యతమముగా నుండును.

ఏ కీర్తనను గాని అభినయించవలెనన్న అందలి పద జాలములకు అనువగు హస్తాభినయము చేయుటకు, ఈ గ్రంథ మందలి భావసూచనలు, వాటి ప్రయోగములు సులువుగ వర్ణింపబడినవి. ఈ పద్ధతియే రాయరాఘవుని విశిష్టతమ మైన వస్త్వావిష్కరణము.

మఱియు హస్తవిన్యాసమునకు వీలుగాని భావములను ఈ గ్రంథకర్త పేర్కొనెను.

భావమాత్రంతు కర్తవ్యం యేషునో హస్తక క్రియా
తానథో విషయాన్ వచ్మి భరతర్షేర్యథామతమ్.

హస్తక్రియ విధించకయున్న, భావమునే ప్రకటింప వలయును. అట్టి విషయములను భరతముని మతానుసారముగ తెల్పుచున్నాను. అని "శీతార్తి" మొదలు "అంగమర్దనము" ను 32 భావములను పేర్కొని,

హస్తే నాభినయః కార్యోతేషు నృత్యనుకారిణా
భావమాత్రంతు కర్తవ్యం ఘటతేయత్ర యాదృశం.

పై విషయములందు నర్తకుడు హస్తాభినయ మొనర్ప బనిలేదు. ప్రకరణానుసారముగ భావమును మాత్రము వ్యక్తీకరించిన చాలును.

## హస్త అధ్యాయము

నాట్య హస్తముల గూర్చి తెల్పియున్న మరొక ఛాయా చిత్ర పుటలు గల్గిన ప్రతిని నాకు బాడిలిన్ గ్రంథాలయము వారు పంపిరి. ఇదియు ప్రస్తుతము మద్రాసు మ్యూజిక్ ఆకడెమీకి దత్తము చేయుటకై శ్రీ ప్రొఫెసర్ రాఘవన్‌వారి వద్ద నున్నది.

ఇందలి వ్రాత వంగ లిపిలో నున్నది. భాష సంస్కృతము. ఈ వ్రాత ప్రతిని గూర్చి గ్రంథాలయమువారు ఇట్లు తెలిపియున్నారు : (31—7—1952)

విల్‌సన్ వ్రాతప్రతి నెం. 358. ఇది 19 వ శతాబ్దిదై యున్నది. కాగితములపై లిఖింపబడినది. ఇవి విల్‌సన్‌వారి వద్ద నుండి పై గ్రంథాలయమువారు కొనుగోలు చేసుకొనిరి. గ్రంథకర్త పురుషోత్తముని కుమారుడైన హలాయుధుడు. గ్రంథరచనా కాలము 1474. ఈ గ్రంథ ఖండము పురాణ సర్వస్వమను బృహద్గ్రంథమందలి అంతర్భాగము. వ్రాయన గాని పేరు కానరాదు.

# శ్రీ హస్తరత్నావళి : హస్తఅధ్యాయము

పెద్ద గ్రంథములోని భాగమిది తొలి పుట ప్రారంభమున ఆయుర్వేద విషయము పూర్తియైనట్లును, అంత్య పుటలో హస్తముల గూర్చి పూర్తియైన పిదప రాగ నిర్ణయము గూర్చి ప్రారంభింపబడుచున్నట్లును తెలియుచున్నది. శ్రీమాన్ ఎన్. శఠగోపన్‌గారి సాయమున ఈ ప్రతిని సంపూర్ణముగా చదువగల్గితిని.

ఈ హలాయుధు డెవ్వడో తెలియవచ్చుటలేదు. క్రీ. శ. 756—774న పరిపాలించుచుండిన రాష్ట్రకూట రాజగు కృష్ణరాజు వాటి కవి యొకడు హలాయుధ నామాంకితుడు గలడు. అతడు 'కవి రహస్యమను' అలంకారశాస్త్రము రచించెను. హలాయుధుడను నైఘంటికుడొకడున్నది అందరకు తెలిసిన విషయము. బరోడా ఓరియంటల్ సంస్థవారు వ్రాయుచు (24—1—1953) పురాణ సర్వస్వము 1475 లో సత్యభాను గోవర్ధన పథక్ ఆధిపత్యమున సంపుటీకరించినట్లును, అయ్యది వ్రాసినది హలాయుధు డనియు కాలము 1475 అని తెలిపిరి.

పురాణములందు నాట్యమును గుఱించిన అధ్యాయ ముండుట విదితము. ఇంక పురాణ సర్వస్వమునందు హస్త అధ్యాయ ముండుట సామాన్య వస్త్వావిష్కరణము.

హలాయుధుడు తన హస్తాధ్యాయము నిట్లు ప్రారంభించెను.

హస్తకస్య పతాకాది ర్విషయోత్తరణాదికమ్
అనయో ర్లక్షణం తద్వద్వాచ్యం చిహ్నం యదేతయోః.

పతాకాది హస్తములను వాని అర్థములును, ప్రయోగములును, లక్షణములును, చిహ్నములును చెప్పబడెను. తరువాత సామాన్యమైన అసంయుత, సంయుత హస్తములు వరుసగ చెప్పబడినవి. క్రమముగ వాని లక్షణము లివ్వబడినవి. మఱల వరుసగా పతాకాది అసంయుత హస్తప్రయోగములును, గజదంతాది సంయుత హస్తప్రయోగములును వర్ణింపబడినవి. సంయుత హస్తములందు చిట్టచివ్వరి హస్తము వర్ధమానకము. దాని ప్రయోగముతో అధ్యాయము పూర్తియగుచున్నది. గద్యతుల్యమగు మాట లేవన :—

ఇతిపురాణ సర్వస్వే హస్తకాధ్యాయః.
ఉదాహరణకు : అసంయుత హస్తము.

## సూచీహస్త లక్షణము :

ఊర్ధ్వకృతా తర్జనీచేత్ అంగుష్ఠో మధ్యమే పఠి
ప్రసారితేవ శేషేద్వే తదా సూచీ ముఖః కరః.

చూపుడు వ్రేలిని పైకి చాచవలయును. బొటనవ్రేలిని నడిమివ్రేలి నడిమి పర్వము (గణుపు) న తాకునట్లుంచి, మిగత వ్రేళ్లు చాచి యుంచిన సూచీహస మగును.

సూచీహస్త వినియోగము

తారకాయాం ఘటే, శ్వ[illegible] [illegible]
అరాయాం ఖడ్గే శిక్షే శిఖాయే చ [illegible].

పటహే [illegible] [illegible]
ఇంద్రాది దిక్, ఇంద్రే [illegible]
భేరీ పటహ [illegible] సూచీహస్తకః.

నక్షత్రములు, మేఘములు, కుండ ([illegible]) [illegible], పాము, చిన్న పాము, [illegible], కేశ [illegible], [illegible] సింహము, దీపము, పడుట, కోపము, ప్రకాశము, ఎవరు ? అతడు అను పదములందు, గ్రామము [illegible], ఖండించిన ముక్క, చూచుట, దేవత, భేరీ, పటహ, ఘట్యాది వాద్య శబ్దములందు సూచీహస్తము ప్రయోగార్హము.

## సంయుతహస్తము : మరాళహస్త లక్షణము :

కరయోరు భయోరేవ విశ్లిష్టకర శాఖయోః
కమ్పనే నైపకథితో మరాళో నామహస్తకః.

రెండు చేతులయందలి వ్రేళ్ల విడివిగా నుంచి, వానిని కంపింపజేసిన హంసలేక మరాళ హస్తము—అంచ రెక్కల విదల్పు ననుకరించుట.

## మరాళహస్త వినియోగము

పద్మాం పదేచ తీరేచ ప్రతాపే జ్వలనే జ్వరే
కదలీనాం దలే ప్రోక్తః సామాన్యదల ఏవచ.

పడమటి దిక్కునకు, తూర్పునకు పోరు నదులు, తీరము, ప్రతాపము, మండుట, జ్వరము, అరటి ఆకులు, సామాన్యమైన ఆకులు.

ఆః కారే చిబుకే చైవ వసంతే శిశిరేఋతౌ
సమరే సాహసే చైవ మరాళః కథితః కరః.

ఆ ! అనుట, గడ్డము, వసంతకాలము, శిశిర ఋతువు, యుద్ధము, సాహసము, వీనియందు మరాళ హస్తము ప్రయోగార్హము.

ఈ రచన యందలి హస్త లక్షణములు రాయరాహుత్తుని రత్నాకరమునే పోలి యున్నవి. హలాయుధుడును సమకాలికుడేమో !

ఈ పుస్తకమందు నృత్త హస్తముల ప్రశంసయే లేదు. మిగత విశిష్టమైన హస్తముల ప్రస్తావన గూర్చి యోచింప పనిలేదు.

# అరకురాణి



శ్రీ ఆదివిష్ణు

సమాసం : రజని గురించి ఏమీ తెలీదు. అయినా యీ నాటిక ఆమె గురించే వ్రాయబడింది. రజనిపట్ల చాలామందికి చిత్రమైన అభిప్రాయ ముండటం వింతగా తోచింది. నాటికపూర్తయిన తర్వాత ఈ రచయితకి పాత్ర లన్నింటి పైనా 'సింపతీ' ఏర్పడిన మాట నిజం ! అతని హృదయంలో ఓ మూలగా 'యిదీ' అని చెప్పలేని బాధ నిలిచిన మాటా నిజమే ! రజని తన గురించి తనే చెప్పుకునుంటే రచయితకి కొంత బరువు తగ్గినట్టుండేది. కానీ —ఒద్దు. అతని అవస్థని అక్షరాల్లో కూర్చడం సాధ్యపడేది కాదు మరి. —ఆదివిష్ణు.

సమయం : సాయంత్రం. కాసేపటికి చీకటి పడొచ్చు.

స్థలం : హైద్రాబాద్ మహానగరంలో ఓ మూలగా అద్దెకొంప.

(రెండు గదుల్నీ విభజించే డోరు కర్టెన్ డిజైన్‌తో ముచ్చటగా ఉంది. బైట గది అలంకరణ విషయంలో శ్రద్ధ తీసుకొన్నట్టు కనుపిస్తోంది. ఓ మూలగా టేబిలూ, ఒక కుర్చీ —టేబిల్‌పైన అద్దమూ, పుస్తకాలు వగైరా. గదికి మరోమూల బట్టలస్టాండు. గోడకి అందమైన కాలెండర్లూ, ఫోటోలూను. గది మధ్యగా —రెండు కుర్చీలు, మధ్య టీపాయ్ వేసుకుని జగన్నాథమూ, చిదంబరం, యిద్దరూ పేకాట ఆడుతున్నారు. ఇద్దరూ యువకులే. (ఆమాటకొస్తే ఇందులో వచ్చేవాళ్లందరూ ముప్పై వం. లోపు వయసు గలవారేను). ఆ ఆట ఎప్పట్నుంచి సాగుతుందో చెప్పకపోయినా ఇబ్బంది లేదు. చిదంబరం ఆట గెలిచే ప్రాంతాల తెర యెత్తబడుతుంది. తెర ఎత్తిన కాసేపటి వరకూ మౌనంగా ఆట సాగింది.

చిదంబరం : ఆట్టైపోయింది. (పేక టీపాయ్‌మీద పేర్చాడు)

జగన్నాథం : ఈ ఆట నువ్వు గెలుస్తావని నే నెప్పుడో అనుకున్నాను. (తన ముక్కలు చిదంబరంకి చూపించేడు) ఈ అరకురాణి నా ఆటని ఖూనీ చేసింది. ఆటకి లైఫే రాలేదు.

చిదంబరం : (పేక ముక్కలు తీసుకుని సర్దడం మొదలు పెట్టాడు.)

జగ : (అతని చేతిలో అరకురాణి యింకా అలానే ఉంది) ఈ ముక్క నా పేకలో చేరిన ప్రతిసారీ నేను ఓడిపోతూనే ఉన్నాను. తెలుసు నాకు. ఈ అరకురాణి నన్నూ, నా వ్యక్తిత్వాన్నీ పాడుచేసింది. జీవితంలో చంపడం చాలక ఈ ఆటలో గూడా నన్ను తినేస్తోంది. అయినా ఈ రాణీ లంటే నాకు ప్రేమ చావడంలేదు చిదంబరం. (ఆ ముక్కని ముద్దు కూడా పెట్టుకున్నాడు.)

చిద : (పేక మొత్తాన్నీ కలిపాడు గానీ, జగన్నాథం చేతిలో ఆటీన్ మదాం అలాగే ఉండిపోయింది. ఆ ముక్కకోసం చెయి జాపాడు.)

జగ : (ముక్కని యిచ్చేడు) దెబ్బగొట్టి, నన్ను సర్వ నాశనంచేసి, ఒకవాడు, ఇదిగో, ఇలాగే నా చేతిలోంచి శ్యామసుందరం చేతిలోకి వెళ్లిపోయింది రజని. (నవ్వేశాడు)

చిద : ఇది పేకాట జగన్నాథం ! ఏదో కైపులో ఉన్నట్టున్నావ్!

జగ : పేకాట—నా జీవితం. నీకు తెలీదులే. రజనివల్ల నాకు అన్యాయం జరిగిన దగ్గర్నుంచీ ఫిలాసఫీ మాటాడటం నేర్చుకున్నాను. (మళ్లా నవ్వేశాడు).

చిద : (పేకముక్కలు పంచుతున్నాడు.)

జగ : (ముక్కలు తీసుకుంటూ) రజని గమ్మత్తయిన ఆడది. మనిషిని కవ్వించడం బాగా తెలుసు. నన్ను పిచ్చాడిని చేసింది. నాలుగు తరాల వరకూ తరగని ఆస్తికి వారసుడ్ని నేను. చదువుకున్నాను. హోదా గల ఉద్యోగమూ ఉంది. అన్నీ ఉన్నాయి నాకు. లేని దొక్కటే —సుఖం ! నాకు సుఖంలేదు చిదంబరం. దీనికి ముఖ్య కారణం రజని. ఇప్పుడు శ్యామసుందరంగాడితో కులుకుతోంది. ఇది పచ్చి మోసం! సిసలైన దగా !! దేవుడన్నవా డుంటే — నిజం చెప్తున్నాను —ఆ శ్యామసుందరంగానీ, రజనీ గానీ సుఖపడలేరు. చివరకు కుళ్లి కుళ్లి చస్తారు.

(క్షణం మాట లాపేడు) అప్పుడే సదమూడు ముక్కలూ పంచేవా ? రైటో .... (తన కొచ్చిన ముక్కలన్నీ ఒక సారి చూచుకున్నాడు.) ఛంపావ్ పో .... మళ్ళా ఒచ్చింది రాణి. నా ప్రాణం తోడేస్తుంది. ఈమాటు కూడా గెలుపు నీదే.

చిద : (తన కొచ్చిన ముక్కలు సర్దుకుంటో) నువ్వు చాలా ఉద్రేకపరుడివి. ఎంతకీ నీ ఒక్కడి గురించే ఆలో చిస్తూంటావ్.

జగ : నష్టపడింది నేనే కాబట్టి. (కింద తిప్పిన ముక్కని తీసు కుని అరకురాణిని పారేస్తో) తీసుకో. నాకీ రాణి ఒద్దు.

చిద : (ఆ ముక్కని తీసుకున్నాడు) నాకు కావాలి.

జగ : (ఫెళ్ళున నవ్వేస్తూ) ఒద్దు చిదంబరం ! చెడిపోతావ్. ఆ రాణిని నమ్ముకోవద్దు. ఓహ్ .... చాలా గొప్పగా మాటాడేస్తూన్నాను. ఈ రోజెందుకో రజనిని చాలా మాట్లు తిట్టేస్తూన్నాను. ఎక్కడుందో గాని .... నా పిచ్చి కాపోతే ఏమిటిది ? రజనీని నేను జ్ఞాపకం పెట్టు కున్నట్టు ఆవిడకి నే నెక్కడ గుర్తుంటాను ?

చిద : (ముక్క వేశాడు. ఆ ముక్కని జగన్నాథం తీసుకున్నాడు. మరో రౌండు నిశ్శబ్దంగా గడిచింది.)

జగ : నా ఆటిప్పుడు కార్డుషోలో ఉంది. అరకురాణిని నీకు సరఫరా చేశాగదూ ! ఇక గెలుపు నాది (తనో ముక్క పారేస్తూ) ఆల్ రైట్. ఈ మాటు నువ్వేసే ముక్కలో నా ఆట్టైపోతుంది.

చిద : (పేకలోంచి ముక్క తీశాడు. కలవలేదు. విసుగ్గా పారే శాడు. ఆ ముక్కని చూస్తో బిగ్గరగా నవ్వేశాడు జగన్నాథం).

జగ : చెప్పాగదూ ! ఆట్టైపోతుందని. అయిపోయింది (ఆట చూపించేడు.)

చిద : (పేకని విసురుగా పారేశాడు.)

జగ : ఒద్దు. చిరాకు పడొద్దు. అందుకే అన్నాను అరకురాణిని భరించడం కష్టమని. విన్నావుకాదు. (పేకకి కత్తెర వేసి కలిపి ముక్కలు పంచుతున్నాడు.) కానీ బ్రదర్, నువ్వు చాలా అదృష్టవంతుడివి. మనందరం ఒకే క్లాసులో చదువుకున్నా నువ్వు రజని వలలో పడలేదు. పడి, నేను పతనమయ్యాను. రజనీని వలలో వేసుకుని ఆ ఫూల్ సుఖపడుతున్నాడు. నాకు చాలా విషయాలు గుర్తున్నాయి చిదంబరం. ఒకనాడు ఆదివారం. నేనూ, రజనీ మంగినిపూడి రేవు కెళ్ళాం. పరుగుడు వెళ్ళి [illegible]

[illegible]

యువతి యువకుడు. నేడే [illegible] ....

(కొద్ది [illegible] అన్నాడు) ఇప్పటికీ [illegible]

[illegible] రజనికి వాడో [illegible]

[illegible]. అసలే వాడు [illegible]! [illegible]

నుంచి ఒప్పేడు, చదువుతుండేవాడు. అప్పుల్లో మందుల్లా, మాయల్లా దొరుకుతాయని వాడికి. ఏమో వా దేదైనా మందుప్రయోగించవచ్చా, లేదా మంత్రం ప్రయోగించమా వచ్చు. ఆ శ్యామసుందరం ఇప్పుడు నాముందుంటే .....

చిద : (అతని మాటకి అడ్డుపడ్డాడు) చాలా ముక్కలేశావ్ నీ మనసు ఆటమీద లేదు.

జగ : ఉండదు. నీకు తెలీదు బ్రదర్. ఆ ఫూల్ దేవాంతకుడు. మిత్రద్రోహి. (పేకని టీపాయ్ మీద ఉంచేశాడు. సిగ రెట్టు ముట్టించి లేచాడు) నా ప్రేమ విషయం వాడికి తెలుసు. వాడితో నే నెన్నో విషయాలు చెప్పాను. రజనీ నేనూ ఎంత ఆనందంగా గడిపేవారమో వాడికి చెప్పింది నేను. అప్పట్లో, వాడు నన్ను అభినందించేవాడు. వాడు నక్క బ్రదర్. గుంటనక్క.

చిద : (మధ్యలో పేకాట చెడిపోవడం నచ్చలేదు. పేక మొత్తాన్నీ కలిపి టీపాయ్‌మీద ఉంచేడు. లేచి నిలబడ్డాడు.)

జగ : నా బుర్ర వేడెక్కింది. విసుగ్గా ఉంది. నీ విషయం వేరు. నువ్వు మొహమాటస్థుడివి. నీకు విసుగ్గా ఉన్నా చెప్పవు. ఒస్తా. పేకందుమ్హోకి సిద్ధంగా ఉండు. (జవాబైనా వినకుండా వెళ్ళిపోయాడు.)

చిద : (గుమ్మం వరకూ వచ్చి, అతను కనుమరుగయ్యేంతవరకూ అక్కడే నిలబడి తర్వాత వెనక్కి తిరిగాడు. అతన్ని పేక దస్తా ఆకర్షించింది. చేతుల్లోకి తీసుకున్నాడు. వేదాంతిలా నవ్వేడు. ఆ దస్తాలో ఓ ముక్కని లాగేడు. అది ఆటీను మదాం) అరకురాణీ ! నువ్వు అంత త్వరగా అర్థ

మధ్యే మనిషికి కాదు కదా ! (ఆ ముక్కలు ఏరేడు; [illegible] పేకని టేబుల్‌మీద పెట్టి లోపలి గదిలోకి వెళ్ళిపోయాడు.)

(క్షణాల విరామం.)

బైట నుంచి రావ్ వచ్చేడు. అతను [illegible] కాలుస్తున్న సిగరెట్టుని యాష్‌ట్రేలో పారేసి జేబు రుమాలుతో మొహం తుడుచుకున్నాడు. కూజాలో నీళ్ళు గ్లాసులో వంచుకుని తాగేడు. షర్టు విప్పుతుండగా, తల దువ్వుకుంటూ చిదంబరం ఆ గదిలోకి వచ్చేడు. అతన్ని చూడగానే విప్పబోయే షర్టుని మళ్ళా ఒంటిమీదే ఉంచుకున్నాడు.)

చిద : నువ్వొచ్చి ఎంతసేపయింది?

రావ్ : జగన్నాథం నాకు వీధిలో కలిశాడు. కాలక్షేపం నిర్విఘ్నంగా జరిగింది. అవునా ? (నిష్ఠూరంగా అనేశాడు)

చిద : నువ్వు నాకో సాయం చేయాలి.

రావ్ : (అది పట్టించుకోడు) నాకు తెలీక అడుగుతాను. నువ్వీ వేళ సెంటు పెట్టేంది, యీ చీట్లాట కోసరమేనా ?

చిద : అవన్నీ తర్వాత చెప్తానుగానీ, ముందు నాకు—

రావ్ : ఎంత కావాలిట ?

చిద : తెలుసు. నీది [illegible]. ప్రస్తుతానికి ఒక పదివ్వు చాలు.

రావ్ : ఊహూఁ.... నా దగ్గర నయాపైసా గూడా లేదు.

చిద : నీకు అబద్ధం చెప్పడం కూడా చాతకాదు రావ్ ! కొత్త పెళ్లికొడుకువి కదా ! నీ దగ్గర డబ్బుల్లేకపోవడమేమిటి. ఇటీజ్ ఎ-లై ! పచ్చి అబద్ధం.

రావ్ : పండు అబద్ధమైనా సరే. నా దగ్గర లేవు. మొన్నేగా పది హేను తీసుకున్నావు.

చిద : (దువ్వెన డ్రాయరుమీద పారేసి, చెప్పులు తొడుక్కుంటూ పేంటు జేబులు పైకి తీసి) అవి అయిపోయాయి.

రావ్ : (కోపం వచ్చింది) కట్ జోకర్ పుణ్యమేనా? జగన్నాథమే నొల్లుకుపోయేడా ?

చిద : నాన్‌సెన్స్. నీకు జగన్నాథంమీద అంత కోప మెందుకసలు ?

రావ్ : ఇన్నాళ్ళూ నీ మిత్రుడనే గౌరవంకొద్దీ ఊరుకున్నాను. ఇక సహించేది లేదు. అతని సంగతి చిక్కడపల్లిలో ఎవ ర్నయినా అడుగు చెప్తారు. ఎంత డబ్బూ, ఎంత హోదా ఉంటే ఏం లాభం ? అలగా జనంలా తాగి తిరుగుతూంటే వెళ్ళి కెక్కించుకుని పూజించేందుకు యిక్కడ అతని భక్తు లెవ్వరూ లేరు.

చిద : రావ్ !

రావ్ : తనొక్కడూ చెడిపోతూంటే నేనేమీ బెంగపడను. నిన్నూ చెడగొట్టడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇది నీ కింకా తెలీలేదంటే .... (బల్లమీద ఉన్న పేకని తీసుకున్నాడు) నాకీమధ్య కొత్త వార్తలు తెలుస్తున్నాయి. మొన్న ఆదివారం, జగన్నాథం గదిలో తప్ప తాగి నోటి కొచ్చి నట్టు పేలేవట. నిజమేనా ?

చిద : (తలొంచుకున్నాడు.)

రావ్ : నిన్ను కించపరచాలనే ఉద్దేశ్యం నా కెన్నడూ లేదు చిదంబరం. ఇద్దరం ఒకే ఆఫీసులో పనిచేస్తున్నాం. కష్టమో సుఖమో ఇన్నాళ్ళూ ఇద్దరం పంచుకున్నాం. నీ బాగోగులతో నా కెప్పుడూ పని ఉంటుంది.

చిద : (కుర్చీలో కూర్చుండిపోయాడు. పేకని డ్రాయరోలో దాచేసి అతని దగ్గరిగా వెళ్ళాడు రావ్.)

రావ్ : పదిహేను రోజుల క్రితం పత్రికవాళ్ళు నీకు ఏభై రూపాయలు పంపారుట. ఆ డబ్బేం చేశావ్ ? చూడు... ఇది హైదరాబాద్. ఇక్కడ అన్ని హంగులూ అందు బాటులో ఉన్నమాట నిజమే. అది జగన్నాథంలాంటి బహు కొద్దిమందికే. నీకూ, నాకూ కాదు. మనవి మధ్య తరగతి కుటుంబాలు. మనమీద ఆధారపడిన మనుషు లున్నారు. ఎంతకీ మన సుఖం, మన ఆనందమే కావాలనుకుంటే అది స్వార్థ మవుతుంది. కొంత నీచం గూడాను.

చిద : (విసుగ్గా చేతులతో మొహాన్ని తుడుచుకున్నాడు) నా గురించి నీకేం తెలీదు రావ్. నీకేం తెలీదు.

రావ్ : బాగా తెలుసు. పదులూ, ఇరవైలూ నీళ్లలా క్లబ్బులకీ, విస్కీలకీ నువ్వు తగలేస్తున్నట్టు, ఆ రహస్యాన్ని దాచేందుకు ప్రయత్నం చేసినట్టూ, చివరికి నీ ప్రయత్నమూ నిన్నే మింగేసినట్టూ, అన్నీ తెలుసు చిదంబరం. మొదట్నుంచీ నిన్ను గమనిస్తూనే ఉన్నాను. నా పెళ్లికూడా హాజరుకాలేనంత రాచకార్యాలు నీకీవూళ్లో ఏమున్నాయో గూడా తెలుసు. ఒక్క నెల రోజులు నీ కనుమరుగైనందుకు నువ్వెంతో సంతోషించావ్. అంతకుముందు చాటుగా సాగించిన నీ వ్యవహారాలు ఈ నెల రోజులూ నిర్భయంగా, నిశ్చింతగా సాగేయి. దానికి నిదర్శనంగా మన రూములో పేక

ముక్కలూ, దొడ్డివైపు గూట్లో నాలుగు విస్కీ సీసాలు. చాలా చిదంబరం!

చిద : నాకు ఏడుపొస్తోంది రావ్! (మొహాన్ని తన చేతుల్లో దాచుకున్నాడు.)

రావ్ : (జేబులోంచి ఉత్తరం తీసేడు) ఈ ఉత్తరం మీ తమ్ముడు వ్రాశాడు. ఇవ్వేళ ఆఫీసుకొచ్చింది. మీ అమ్మ గారికి జ్వరమట. వాడికి స్కూలుఫీజు కట్టలేదట. నువ్వు నాలుగు నెలలనుంచి ఇంటికి పైకం పంపడం లేదట. ఏమిటిదంతా? నీ కొచ్చే రెండొందలూ ఏమవుతున్నాయి?

చిద : (ఉత్తరం తీసుకున్నాడు. చదివేడు. తల వంచేడు.)

రావ్ : నిన్ను చూట్టానికే సిగ్గు వేస్తోంది. చిదంబరం. సిగ్గు! (లోపలి గదిలోకి వెళ్ళేడు.)

చిద : (లేచాడు. ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు. కాసేపు రూములో తారట్లాడేడు. ఏదో గుర్తుకొచ్చిన వాడిలా బైటికి వెళ్ళబోయాడు.)

రావ్ : (మధ్య గుమ్మం దగ్గర నిలబడి) ఆగు చిదంబరం!

చిద : (ఆగిపోయాడు.)

రావ్ : ఇలారా. (అతను రెండడుగులు వెనక్కు వచ్చాడు.) నీకు నేను చెప్పవలసినవాడిని కాదేమో. క్షమించు చిదంబరం! నేను .... ప్రతి చిన్న విషయానికీ బాధపడి పోతాను. నువ్వెవరు? నే నెవర్ని? దేశంలో తలో మూలనుంచీ వచ్చి ఒకే ఆఫీసులో స్థిరపడ్డాం. మన మధ్య చక్కటి స్నేహం. స్నేహం! ఆ స్నేహమే నిన్ను శాసిస్తున్నది. నేను కాదు.

చిద : రావ్! (అతన్ని కావిలించుకుని ఏడిచాడు.)

రావ్ : నువ్వు కథలు రాస్తావ్. ఆవిధంగా పెద్ద పేరు తెచ్చు కున్నావ్. నన్నపార్థం చేసుకోవని తెలుసు. పది కాదు ఇరవై తీసుకో యిస్తాను. కాని .... ఖర్చు చేసే ముందు నువ్వు చాలా విషయాలు ఆలోచించాలి. (డబ్బు తీశాడు.)

చిద : వద్దు. నాకు డబ్బొద్దు. నే నెందుకూ పనికిరాని వెధవని.

రావ్ : (అతని భుజాన్ని తట్టాడు.) నిన్ను నువ్వు తక్కువ చేసుకోవద్దు. (సిగరెట్టు ముట్టించుకుంటో) ఒక్కటి సూటిగా అడుగుతాను చెప్తావా చిదంబరం.

చిద : ఏమిటది ?

రావ్ : నిజం చెప్పు.

చిద : ఉహుఁ.

రావ్ : [illegible] తెలుసా ?

చిద : (ఏడిపిస్తున్నాడు.) [illegible]

రావ్ : (నవ్వేడు) [illegible]

చిద : తెలుసు. [illegible] చేసుకుంది.

రావ్ : నే చదివింది, [illegible] ఆ రజనికి [illegible] ....

చిద : రావ్! (ఇంకాగు [illegible])

రావ్ : క్షమించు. నేను నీకు చాలా విషయాలు చెప్పాలి. (కుర్చీలో కూర్చున్నాడు. కాలుచాచి సిగరెట్టు [illegible]) సెలవైన రజని ఆఫీసుకో [illegible] ఒక రహస్యం తెలుసుకోవాలని [illegible] కున్నాను. మొదట్నుంచీ నాకో అనుమానం ఉండేది. నువ్వు యీ రాగిణికీ, జానకికీ [illegible] వాయిపడే మనిషివి కావు—అయినా అలవాటు చేసు కున్నావ్. ఒకోనాడు అర్ధరాత్రి లేచి లైటువేసి కూర్చుని, నీలో నువ్వే ఏదో మధనపడేవాడివి. నువ్వు గ్రహించకపోవచ్చు—అప్పుడు నేనూ మేలుకొనే ఉండే వాడిని.

చిద : (మధ్యలో అడ్డుపడ్డాడు) నువ్వేదో కథల్లుతున్నావ్. నేను నమ్మను.

రావ్ : (అతని మొహంలోకి సూటిగా చూసేడు) కాని నీ డైరీ కథలు చెప్పదు.

చిద : రావ్! నువ్వు .......

రావ్ : తప్పే. ఒకళ్ల డైరీని చదవడం అన్యాయమే. నీమీద నాకు గల శ్రద్ధ—ముఖస్తుతి కాదు, ఆత్మవంచనా కాదు. నిజానికి నీమీద గల శ్రద్ధే నన్నాపని చేయిం చింది. ఇప్పుడైనా చెప్పు, రజని నిన్నూ వంచించింది కదూ.

చిద : లేదు. నన్నెవరూ వంచించలేదు. నన్నెవరూ మోసం చేయలేదు. నే నంత చాతకాని వద్దమ్మ కాదు.

రావ్ : (సిగరెట్టు యాష్ ట్రేలో వేశాడు) నిజం చిదంబరం నువ్వొంచరిలాంటి మనిషివి కావు. బాగుపడ్డానికి నీకూ చాలా తేడా ఉంది.

చిద : ప్లీజ్ ! (రెండు చేతుల్తో తల పట్టుకున్నాడు.)

రావ్ : నిన్ను నొప్పించాలని నా కెప్పుడూ లేదు. భిక్షు ప్రేమను గురించి ఏనాడూ గాని నా అనుభవానికి రాలేదు. అంచేత మీ మనసులు నాకు తెలీవు. అయినా గతాన్ని నెమరేస్తూ జీవితాన్ని వృధా చేసుకోవడం పొరపాటు. మువ్విన్నాళ్ళూ పెళ్ళొద్దని భీష్మించుకూర్చో డానికీ, ఇప్పుడు జగన్నాథంలా తయారవడానికీ కారణం రజని. ఇది నువ్వు కాదనలేవు. ఈ రజనీ ఎవ్వరో గాని చాలా ప్రమాదమైన వ్యక్తిలాగుంది.

చిద : ఈవేళెందుకో నువ్వు విచిత్రంగా మారిపోయావు. ఊహించలేనంతగా మారిపోయావు.

రావ్ : నీకు కథలు రాయడ మొక్కటే తెలుసు. సర్వం కాదనుకుంటే జీవితాలు చదవడం నాకు బాగా తెలుసు.

చిద : ఒప్పు రావ్. నీకు నమస్కారం చేస్తాను. నన్ను దెప్పి పొడవకు. మాటకు ముందు కథలు వ్రాసేవాణ్ణి, కథలు వ్రాసేవాణ్ణి అని హింస పెట్టకు. కథలు వ్రాయడం మీ రనుకున్నంత నీచంకాదు. ఒకనాడు రజనీ ఇలాగే అంది "నువ్వు కథలు వ్రాసుకునేందుకు తప్ప మరెందుకూ పనికిరా' వని. రజనీ నన్ను కేవలం కథకుడిగానే చూచింది. మీ అందరిలాంటి మనిషినే నేను. శ్యామసుందరం, జగన్నాథంలానే నేనూ ఒక మనిషినే. వాళ్ళు చేయగల ప్రతి పనీ నేనూ చేస్తాను. నేనేం చేతకానివాణ్ణి కాదు. ఊహాలోకాల్లో రెక్కలు కట్టుకు తిరిగే కథకుడినైతే కావచ్చు. అంతమాత్రాన నే నెందుకూ పనికిరాని చవటని కాదుగా. పోనివ్వు రావ్. మళ్ళా నాకు పిచ్చెత్తనివ్వకు. రెచ్చ గొట్టకు. నన్నిలా బ్రతుకనివ్వు.

రావ్ : ఏమైనా నా సలహా ఒక్కటే. ఎదురునిల్చి దెబ్బతీసిన సంఘటన తల్చుకుంటో జీవితపర్యంతం కుమిలిపోయే దానికంటే—తుడిచి పారేసి తిరగడం నేర్చుకో. కుమిలి పోవడం, జరిగినదాన్ని మరిచిపోయేందుకు అడ్డదోవలు వెతుక్కోవటం పిరికివాళ్ల లక్షణం.

చిద : (వినలేకపోయేడు. వెళ్ళబోయాడు.)

రావ్ : ఆగు. నీ క్కావలసిన డబ్బు తీసుకుని మరీ వెళ్ళు.

చిద : అక్కర్లేదు రావ్. నాకేమీ వద్దు. (వెళ్ళిపోయాడు.)

రావ్ : (నిట్టూర్చాడు. అతను వెళ్ళిన వైపు చూస్తూ నిలబడి పోయాడు. చీకటిపడింది. లైటు వేశాడు. అక్కడున్న పత్రిక తీసి చదవడం ప్రారంభించేడు.

[ఆ సమయానికి నిరంజనం రానే వచ్చాడు. అతని వయస్సు చిన్నదే. ఖరీదైన దుస్తులు వేసు కున్నాడు. అతని మొహంలో ఎంత దాచుకుందామని ప్రయత్నించినా కొంత చిరాకు కనిపిస్తూనే ఉంది.)

నిర : (వాచీ చూసుకున్నాడు) అనుకున్న వేళకి అరగంట లేటుగా వచ్చేను.

రావ్ : (చదవడంలో మునిగిపోయి అతన్ని చూడలేదు.)

నిర : ఏమిటి దీక్షగా చదివేస్తున్నావ్ ?

రావ్ : . . . . . . . . . . .

నిర : మిస్టర్ రావ్ !

రావ్ : (ఉలిక్కిపడి అతన్ని చూసేడు) ఎప్పుడొచ్చావ్?

నిర : ఇప్పుడే. ఏమిటంత పరాకు ?

రావ్ : మావాడి కథ చదువుతున్నాను.

నిర : అంత బాగుందా ఏమిటి ?

రావ్ : రెండోమాటు చదువుతున్నాను. చిదంబరం చాలా చక్కటి కథలు వ్రాస్తాడు. ఇంత చిన్న వయస్సులో అతనీ స్థితికి రావడం హర్షించవలసిందే. అందుకే మా ఆఫీసరు అతన్ని అల్లునిగా స్వీకరించాలని ఉబ లాట పడేది. కాని .... ససేమిరా అని తోసిపారేస్తు న్నాడు పిచ్చి చిదంబరం.

నిర : ఎందుకు ?

రావ్ : అదంతా పెద్దకథ : అన్నట్టు నీ పనేమయ్యింది ?

నిర : భగవంతుని దయవల్ల ఇల్లు దొరికింది. నాంపల్లి స్టేషను దగ్గరగా చక్కటి కొంప. మా శ్రీమతి కీవేళ ఉత్తరం గూడా వ్రాసేను.

రావ్ : గూడ్. హైదరాబాదొచ్చిన వారం రోజుల్లోనే ఇల్లు దొరికిందంటే అభినందించాల్సిన విషయమే.

నిర : మరేమిటనుకున్నావ్. అదృష్టం నన్ను పగబట్టిన పాములా వెంటాడుతోంది. ఎలా ఉంది డైలాగు ?

రావ్ : అయితే నీ విశ్రమణ మెప్పుడో ?

నిరం : రేపే (ఏం మాటాడాలో తెలీక) నీ వ్యవహారం ఏప్పి తేల్చావ్ ?

రావ్ : నా వ్యవహార మేమిటి ?

నిర : 'పెళ్లి చేసుకుని, ఇల్లు చూసుకుని' అన్నారు పెద్దలు మొదటిది పూర్తిచేశావ్. రెండో వేట ప్రారంభించక పోతే సూక్తి చెప్పిన పెద్దలు చిన్నబుచ్చుకోరు? పైగా— —పెళ్లయి గూడా యింకా 'బేచ్‌లర్స్ డెన్' లోనే

కాపురమంటే—హాస్య—నవ్వితోదురు! దా జుంటు పిస్తు జూచి !

రావ్ : (నవ్వేదు) ఇంటిలో యిల్లు చూడాల్సిన తొందరేమి లేదు. దానికంటె ముఖ్యమైన పనొకటి మిగిలిపోయింది.

నిర : ఏమిటో అది.

రావ్ : మా చిదంబరం గురించి బెంగ పట్టుకుంది.

నిర : (బిగ్గరగా నవ్వేదు) వాటే ఫన్నీ అవ్ ఎఫ్ట్! అతని గురించి నీకు బెంగేమిటోయ్, నిక్షేపంలాంటి కుర్రాడు నిక్షేపంలా గుంటేను.

రావ్ : నీకో కథ చెప్తాను. ముగింపు నువ్వు చెప్పాలి.

నిర : కథ నువ్వు చెప్తావా. ముగింపు నేను చెప్పాలా. ఏం బాబూ! చిదంబరంగారి పిచ్చి మనకేమైనా అంటు కుందా ఏం? లేకపోతే నువ్వూ నేనూ కథలు చెప్పడ మేమిటోయ్ బొత్తిగా.

రావ్ : హాస్యంకాదు నిజం.

నిర : సావాసదోషం. అనుభవించక తీరునా .... కాబోయే కథకమిత్రుడు కథ చెప్తాను వినమని ప్రాధేయ పడితే కథలు చదవడం యిష్టంలేని ఒక ఉద్యోగి వినక తప్పుతుందా ? కానివ్వు.

రావ్ : ఇది కథకాదు.

నిర : నువ్వు రాయబోయే కథకి పైటిలా యిది ?

రావ్ : ఏమైనా అనుకో, ఇది కథమాత్రం కాదు. మా చిదంబరంతోపాటు జగన్నాథమని నిన్న నీకు పరిచయం చేసిన వ్యక్తీ, శ్యామసుందరమని మరో పెద్ద మనిషీ కలిసి చదువుకున్నారు. ముగ్గురూ స్నేహితులనే చెప్పాలి. ఈ ముగ్గురికీ రజని అనే వాళ్ల క్లాసుమేటుతో పరిచయం కలిగి ప్రేమ అంకురించింది. ముగ్గురూ ఆమెను ఆరాధించేవాళ్లు. ఈ రజని గురించి నాకు తెలి యకపోయినా, వినగా తెలిసిం దేమిటంటే ఆపిల్ల యీ ముగ్గుర్నీ గుప్పెట్లో పెట్టుకుని ఆడించింది. చివర్ని శ్యామసుందరమనే అదృష్టజాతకుణ్ణి భర్తగా స్వీకరించింది. ఇది జరిగి చాలాకాలమైంది. మా చిదం బరం ఆ పిల్లను ప్రేమించినట్టు ఎవరికీ తెలీదు. పైగా ఆపిల్ల ఇతన్ని నిర్లక్ష్యం చేసిందనే బాధ అతనికి మిగిలిపోయింది. జరిగినదంతా కడుపులో పెట్టుకొని ముందు అనుభవించవలసిన జీవితాన్ని చేతులారా పాడు చేసుకుంటున్నాడు. అందుకే ఆఫీసరుగారి సమ్మంధాన్నీ

[illegible]

నిర : [illegible]

రావ్ : (ఆశ్చర్యపోయేదు) [illegible]!

నిర : అవును రావ్. నీకు [illegible] తెలుసు. ఈ కథలో [illegible] యిద్దరూ [illegible] ఒకే, నాకు [illegible] కథ ! [illegible]

రావ్ : నీకు .... నీకు రజని బాగా తెలుసా ?

నిర : తెలుసన్నానుగా.

రావ్ : ఎలా ? ఎలా తెలుసు ?

నిర : తెలుసు. తెలుసు. ఒకే కాదు—(చెప్పాలా వద్దా అను కుంటూనే చెప్పేశాదు) ఇప్పుడా రజని శ్యామసుందరం దగ్గరా లేదు.

రావ్ : ఇదేమిటి ? మరెక్కడ ఉంది ?

నిర : (చాలాసేపటివరకూ ఏమీ చెప్పలేదు) చెప్తానుంరావ్. నాకేం ? చేస్తున్నా చెప్తాను. పిరివాడు పొరబాటేగాని, రజని గురించి చెప్పడానికేం ? మహారాజులా చెప్తాను. (ఆగి, ఆలోచించి) అనగనగా ఒక రజని. ఆ రజనికి ఒక మేన బావ. అతను చాలా మంచి వ్యక్తి. తెలివైనవాడూను. రజనిని చేసుకోవాలనుకున్న ఆతని కోరిక కొన్ని కుటుంబ కలహాలవల్ల కోరికలాగానే నిలచిపోయింది. అయితే అతను నువ్వు చెప్పిన ప్రేమికుల్లాంటి మనిషి కాదు. తెలిసినే తెలివైనవాడూ, మంచి మనిషి అని. అందుచేత ఆ బంధరాని పంతుపై ఆలిం చక విధికి తలొగ్గి తనకు పెద్దలు నిర్ణయించిన యువతిని పెళ్లాడేసి ఝామ్మంటూ కాలం గడి పేస్తున్నాడు. అనుకుంటుంది లోకం. అతనేమను కుంటున్నాడో నీ కనవసరం. అతను ఒకనాడు యీ సోకాల్డ్ శ్యామసుందరాన్నీ, రజనీని రాజమండ్రి రైల్వే ప్లాటుఫారంమీద కలుసుకున్నాడు. వాళ్ల కోరికమీద ఆ వూళ్లోవాళ్ల ఆతిథ్యం పొందేదు. ముఖ్యంగా ఆ శ్యామ

సుందరం బలవంతంమీద మరో రోజు కూడా అక్కడే ఆగిపోయేడు. రజనీలో చాలా మార్పు కొట్టొచ్చి నట్టు కనుపించింది. పిచ్చి శ్యామసుందరం—నిజం. అతను పిచ్చేదే పాపం. అతను రజని గురించి చాలా చెప్పేడు. కొంత నమ్మదగ్గదీ, కొంత అతను కల్పించిందీ అనుకున్నాడే గాని, దరిమిలా అతను చెప్పిన దంతా నిజమనే నిర్ణయాని కొచ్చాడు. (ఆగిపోయాడు)

రావ్ : తర్వాత ఏమయ్యింది ?

నిర : (తత్తరపాటుతో) అదే—ముగింపెలా చెప్పను ?

రావ్ : నువ్వెలా చెప్పినా పర్వాలేదు. నిజం చెబితే చాలు.

(తలుపు దగ్గర పెద్ద శబ్దమైంది. జగన్నాథం తూలి పడిపోయాడు. లేచి—ఇద్దరివంకా చూచి రెండడుగులు ముందుకు వేశాడు. అతని బట్టలు నలిగి ఉన్నాయి. కళ్లు చింతనిప్పుల్లా ఉన్నాయి. జుత్తు రేగిఉంది.)

రావ్ : చిదంబరం లేడు. అత నిప్పుడే బయటకు వెళ్లాడు.

జగ : (వెర్రిగా చూసేడు) మీకు తెల్సా మాస్టారూ ! శ్యామసుందరమని నాకైవ లోహడుండేవాడని మీకు తెలిసే ఉంటుంది. ఆరోగ్ యివ్వాళ కలిశాడు.

నిర : (ఆత్రంగా) శ్యామసుందర మొచ్చేడా ?

జగ : (నవ్వేశాడు) నేను తాగిన మాట నిజమైతే కావచ్చు గానీ, వాడొచ్చినమాట అబద్ధంకాదు. ఏషియాటిక్ బార్‌లో కలిశాడు. ఎదుట నిలబడ్డాడు. ఈ అదను కోసం .... చాలా కాలం నుంచి ఎదురుచూశాన్లేండి. ఒక్కటే మాస్టారు .... చెంప ఛెళ్లుమనేలా ....

నిర : మీ రతన్ని కొట్టేరా ?

జగ : తప్పా .... మీరు చెప్పండి. రజని—నేను అమితంగా ప్రేమించి ప్రాణపదంగా చూసుకున్న రజనిని వాడు—ఒక్కటి మనుషులంటే నాకు భయమని సీజ రన్నాడట—(నవ్వేడు) ఆ పీనుగ లేవదీసుక పోయాడు. ఇది తప్పుకాదూ ? ఏం. చెప్పండి మాష్టారూ ? ఇది తప్పుకదూ (నిరంజనం ఛాతిమీద వేలుతో పొడుస్తో అన్నాడు.)

నిర : ఇప్పు డతను ఎక్కడున్నాడు.

జగ : ఏమో నాకేం తెలుసు ? జనరల్ హాస్పిటల్‌లో ఉండొచ్చు లేదూ, వాళ్ల వూరి రైలెక్కినా ఆశ్చర్యపడక్కర్లేదు. మనిషి అకస్మాత్తుగా మారిపోయాడు. (భెదిరిపోతూ) నా కిప్పుడు వంట్లో ఏం బాగోలేదు. నే నింతకంటె ఎక్కువగా తాగిన రోజులు చాలా ఉన్నాయి. అది కాదు కారణం, ఏమిటో నాకు తెలీదు. గుండెల్లో మంట. మాష్టారూ .... నన్ను కాస్త పట్టుకుంటారూ.

నిర : (అతన్ని పట్టుకోడానికి దగ్గరిగా వచ్చేడు——రావ్ అతన్ని వారించపోయాడు గాని నిరంజనం అతని ప్రయత్నాన్ని నిరసించేడు) మీరు .... విశ్రాంతి తీసుకోవాలి.

జగ : అవును. విశ్రాంతే కావాలి. కానీ .... అదే లేదు. లేనిదే విశ్రాంతి మాష్టారూ .... అసలు నాకేమీ లేవు. ఏమీ లేవు.

నిర : పదండి లోపలి గదిలో పడుకుందురుగాని.

జగ : థాంక్స్ .... కాస్త తీసుకుని వెళ్లరూ మరి.

(జగన్నాథాన్ని లోపలికి తీసుకెళ్లాడు నిరంజనం. లోపల్నించి మాట లింకా వినిపిస్తూనే ఉన్నాయి. బైట గదిలో—రావ్ గోడకి చేరగిలబడి నించున్నాడు సిగరెట్టు ముట్టించేడు.)

నిర : ఇప్పు డెలా ఉంది ?

జగ : ఏమో .... సరిగ్గా తెలీడంలేదు. ఏమండీ .... మీరు చెప్పండి. శ్యామసుందరాన్ని కొట్టాను. అది తప్పా చెప్పండి .... .... రే .... మీ రెందుకిలా అయిపోతున్నారు. ఏడుస్తున్నారు కదూ .... ఛ .... ఎందుకు కన్నీరు .... నేను వద్దు మాష్టారూ. నా గురించి ఏడవకండి. నాకు ఏడుపొచ్చేస్తుంది..... అబ్బ ..... ఏమిటండీ ఇది. ఈ పక్కన గుండె పక్కగా ఏదో భరించలేని బాధ. అమ్మో.

నిర : అదే సర్దుకుంటుంది. భయపడకండి.

జగ : నా కేమిటో అయింది మాష్టారూ ! అయ్యింది. నిజమే లేకపోతే ఏనాడూ లేనిది యివ్వాళేమిటిది. ఏదో.... ఏదో .......

నిర : మరేం పర్వాలేదు..... కాస్త .... అదీ .... అలా వత్తిగిలి పడుక్కోండి. ఈ దిండు లాక్కోండి. అద్దదీ అలా. (కాస్సేపు విశ్శబ్దం. నిరంజనం బయటి కొచ్చేడు.)

రావ్ : ఏం జరిగిందేవిటి ?

నిర : మగతలో ఉన్నాడు. అయినా ఇంత ఎక్సయిట్‌మెంటు పనికిరా దసలు.

రావ్ : అర్భకుడు.

నిర : ఒకమాటు డాక్టర్ని తీసుకొస్తే బాగుంటుంది.

రావ్: మరేం ఫర్వాలేదు. అత నెలాగైనా కోలుకొంటాడు. ఇప్పుడు డాక్టరు రావడం, అతన్నాస్థితిలో చూడటం, ఈ గదిలో ఉన్నవాళ్లందరూ తాగి తందనాలాడే జాతేమోనని విసుక్కోడం—నీకు తెలీదు నిరంజనం. ఎంత అవమానమో ఆలోచించు.

నిర : జగన్నాథాన్ని చూస్తుంటే నీకు జాలి కలగడంలేదా ?

రావ్ : జాలి కాదు, అసహ్యం. అతను పర్‌వర్టెడ్.

నిర : వస్తుతా మంచి మనిషి.

రావ్ : నీ కందరూ అలాగే కనిపిస్తారు.

జగ : (లోపల్నుంచి) అబ్బ.... మాస్టారూ .... నాకు భయంగా ఉంది. మీరు నా దగ్గరే ఉండండి. తొందరగా రండి.

నిర : మనిషి భయపడిపోతున్నాడు. నా తోడు కావాలిట. వస్తున్నానండి. వస్తున్నా.

రావ్ : (సిగరెటు విసిరికొట్టాడు)

జగ : మీరు నన్ను వదిరి వెళ్లరుగా. చాలామంది నన్ను దగా చేశారు. నా కిప్పుడు భలే ఏడుపొస్తోంది మాస్టారు.

నిర : మీరు అట్టే మాటాడకూడదు.

జగ : నాకు నిద్రలాటి దేదో వస్తుంది. నరాలన్నీ వదులైనట్టూ, తలంతా దిమ్మెత్తినట్టూ, వెచ్చటిగాలేదో నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నట్టూ మాటాడలేను, మీకేమీ చెప్పలేను. నిద్ర .... నిద్ర ......

(చాలాసేపు మౌనంగా గడిచింది. మరి కాసేపటికి శ్యామసుందరం చిదంబరం సాయంతో గదిలోకి వచ్చేడు. శ్యామసుందరం బక్కగా, ఎర్రగా చెయ్యెత్తు గల మనిషి. అతను తొడుక్కున్న బట్టలు చిరిగిపోయాయి. జుత్తు రేగి ఉంది.)

చిద : ఇదే మా రూము. ఇలా జగన్నాథం వచ్చేడా రావ్ !

రావ్ : (శ్యామసుందరాన్ని చూసేడు) మీపేరు శ్యామసుందరం గదూ.

శ్యామ : అవును. చెప్పండి, జగన్నాథం వచ్చాడా ?

రావ్ : మీకు నేను కొత్త వ్యక్తినే కావచ్చు. మీరు నాకు తెలుసు.

శ్యామ : (అర్థంకాలేదు. చిదంబరంవైపు ఏమిటన్నట్టు చూసేడు.)

రావ్ : సమయానికి వచ్చేరు. చాలా సంతోషం. మీతో ఎప్పుడో ఒకప్పుడు తప్పనిసరిగా పరిచయం కలుగుతుం దనుకున్న ఆశ కాస్తా ఇయానాడు నెరవేరింది. నాపేరు [illegible] వస్తుంది.

శ్యామ : ([illegible]) [illegible]

రావ్ : (శ్యామసుందరం మొహం [illegible] కనే అడిగేడు) [illegible] ద్రోహం [illegible]

శ్యామ : ([illegible])

రావ్ : తెలుసు. [illegible] చెప్పాలి. [illegible]

చిద : రావ్ ! మీకు మతి పోతోంది (రావ్ [illegible])

రావ్ : నిజం చెప్పావ్. నాకు మతి పోతోంది. ఈ విషయం ఏదో లోపం, వెలితి నన్ను చిదుముతోంది. చెప్పండి శ్యామసుందరం. మీ జవాబేమిటి ?

శ్యామ : నాకై నే నెవ్వరికీ ద్రోహం చెయ్యలేను. నేనలాటి వాణ్ణి కాను.

రావ్ : (నవ్వేశాడు తేలిగ్గా) నేను 'లా' చదువుకోలేదు. న్యాయ శాస్త్రం మీమీ విషయాల్లో ఎలా పనిచేస్తుందో నాకా తెలీదు. శిక్ష సంగతి దేవు డెరుగు. కానీ, శ్యామసుందరంగారూ, ఒక్కటి మీరు మరిచిపోతున్నారు—లేదా— దాచడానికి ప్రయత్నిస్తున్నారు — చెప్పండి—జగన్నాథాన్ని రజని ప్రేమించిన విషయం మీకు తెలుసుగదూ.

శ్యామ : తెలుసు. రజని నన్ను ప్రేమించిన విషయం మీకు తెలీదా ?

రావ్ : దేవుడు చల్లగా చూడబట్టి నేనీ ప్రేమ తగవుల్లో ఎప్పుడూ తలదూర్చలేదు. మీ కూటమిలో నేను ఒక సభ్యుడినైతే—అయితేనే సుమండీ—ఈ విషయాన్ని మొదట్లోనే తుంచేవాడిని. రజనీని యెదుట నిలబెట్టి మొహం ముందే అడిగి ఉండేవాడిని. 'ఎవర్ని ప్రేమిస్తున్నావ్, ఎవర్ని వంచిస్తున్నావ్'అని. మీ రలా కాదు. మీ గుండెల్లో కాంక్షని దాచుకున్నారు బైటపడటానికి ధైర్యం చాలలేదు. (కాసేపు ఆగేడు) క్షమించండి. నేను మీ స్వంత విషయాల్లో జోక్యం చేసుకోడం ఏమంత మంచిదికాదేమో, నోరు తెరుచుకు అడిగినా మీరు నిజముచెప్పరు.

శ్యామ : రజని గురించి మీకేమీ తెలీ దనలు. అందుకే మీరిలా మాటాడేస్తున్నారు. ఒకవాడు నన్ను పొగ

ఉంది. ఏవేవో కథల్లి చెప్పింది. నమ్మాను. జగన్నాథానికి ద్రోహం చేశానని మీ రనుకుంటున్నారు. నా ప్రణయాన్ని చేతులారా పాడుచేసుకున్నానని నా కొక్కడికే తెలుసు.

రావ్ : బాగుంది. కథ మరో మలుపు తిరిగింది.

శ్యామ : జరిగింది కూడా అదే. రజని ఇప్పుడు నన్ను ఒక్కతెగా వదిలివేసి తన దారిని తాను ఎందుకు వెళ్లిపోయిందో తెలిసినట్టే ఆనాడు నన్నెందుకు పెళ్లి చేసుకుందో కూడా తెలుసు. నమ్ముతారా ?

చిద : (ఉలిక్కిపడ్డాడు) శ్యాం. ఏమిటి నువ్వనేది ?

శ్యామ : (అతని భుజాన్ని తట్టాడు) ఒక స్త్రీమూర్తి చేసిన అపకారం చిదంబరం. అది భయంకర మైంది. తలుచుకుంటేనే గుండె పగిలిపోతుంది. (పేలవంగా నవ్వేడు) అనుకోవచ్చు—నేనేదో సాధించిన ఘనుడననీ, గొప్ప బాధపడుతున్నాననీను. నేను అనుభవించింది శత్రువు కైనా రావొద్దనే చిత్రహింస. రజని నాకు భార్య. అయినా రజనివల్ల సుఖం లేదు. ఆమె వెళ్లిపోయింది. వెళ్తూ నే వెళ్తున్నా ఆమె మాట కెదురు చెప్పలేదు. నాకై నేను కుమిలిపోయిన మాట నిజమే. రజని వెళ్లేది అన్నది 'నిన్ను పెళ్లిచేసుకోడం నాదే తప్పు' అని. వెళ్లిపోయింది. మళ్లా తిరిగి రాదని తెలుసు. జరిగిందేమో జగన్నాథానికి తెలీదు. అతనికి నాపైన కసి, నన్ను సాధించాలనే ఉద్దేశ్యం—అతన్ని తలుచుకుంటే నాకు జాలి. అతను .... అతను నన్ను కొట్టాడు. పదిమంది లోనూ .... అతనిలో వివేకం నశించింది.

రావ్ : (చల్లబడ్డాడు) జగన్నాథం మీ కిప్పుడు కనిపిస్తే ఏం చేస్తారు ?

శ్యామ : కలబడి కొట్టడానికి రాలేను. శారీరకంగా అతను నాకంటె బలవంతుడు. అతను కనిపిస్తే .... అతను కనిపిస్తే (కన్నీరు పెట్టుకున్నాడు) 'నాకంటె నువ్వే అదృష్టవంతుడివి తమ్ముడూ' అని చెప్పాలని ఉంది.

రావ్ : వెళ్లండి. అత నిప్పుడు ఈ గదిలోనే ఉన్నాడు.

శ్యామ : (గబగబా వెళ్లబోతాడు. ఆ సమయానికి నిరంజనం మధ్య గుమ్మం దగ్గిర నిలబడి ఉన్నాడు. అతన్ని చూసి ఆశ్చర్యపోయేడు) మీరా ?

నిర : చేరవలసినవాళ్లంతా ఒకేచోట చేరాం.

శ్యామ : జగన్నాథం ......

నిర : ఈ పరిస్థితుల్లో మీ రతన్ని చూట్టానికి వీల్లేదు. మీ రన్నట్టు అతను వివేకంలేనివా డిప్పుడు. ఉద్రేకంలో మనిషి ఏమైనా చెయ్యవచ్చు.

శ్యామ : (సంశయించేడు. తటపటాయిస్తూ అన్నాడు) నామీద మీకు నమ్మకం లేదా నిరంజనం. నన్ను వెళ్లనివ్వండి. రజని నా దగ్గర లేదూ—నేనూ దగాపడిన మనిషినే నని అతనితో చెప్పనివ్వండి.

నిర : ఆనాడు రాజమండ్రిలో మీ ఆతిథ్యం పొందిననాడే అర్థం చేసుకున్నాను మీ వెన్నలాటి మనసునీ, వెన్నెలాటి మీ స్నేహాన్నీ. కాని జగన్నాథం నిరంజనం కాడు. కాలేడు. ఈ స్థితిలో అతను మిమ్మల్నేమైనా చెయ్యవచ్చు—లేదూ—తనకు తనే ఏదైనా చేసుకో వచ్చు.

రావ్ : నువ్వు .... నువ్వేనా రజని బావవు.

చిద : (గదిలోకి వెళ్లబోయాడు. అతని భుజాన్ని పట్టి ఆపాడు నిరంజనం)

నిర : మీరూ వినదగ్గ విషయం ఒక్కటుంది. విని మరీ వెళ్లండి.

చిద : క్షమించాలి. మీరు చెప్పబోయే విషయం నా కనవ సరం. నేను వినను.

నిర : నా కిప్పుడు గట్టిగా నవ్వేయాలనిపిస్తుంది.

చిద : నవ్వుకోండి. నాట్యం చేయండి. నాకేం అభ్యంతరం లేదు.

నిర : జరిగింది మరిచిపోవాలనే మీ ప్రయత్నం అనుకున్నంత తేలిగ్గా నెరవేరడంలేదు.

చిద : నాకేం జరగలేదు. నేనేం ప్రయత్నాలూ చేయడం లేదు. మీ కింత అతి చనువు కూడదు.

నిర : తమాషా ఏమిటంటే —రజని చాలామందిని గాయ పరచినట్టే, హిప్నటైజ్ చేసినట్టు ఒక్కొక్కరికో విధమైన సెంటిమెంటూ తలకి రుద్దింది. తలుచు కుంటే నవ్వు రాదూ మరి.

చిద : (కోపం వచ్చింది) నాన్‌సెన్స్. నన్ను రెచ్చగొడితే ....

రావ్ : (మందలించబోయేడు) చిదంబరం .....

చిద : నువ్వు. నువ్వు కారణం. ఎవరో పరాయి మనిషి నా గురించి ...... యూ ఆర్ ఆల్ ఫూల్స్ .... గెటవే ఫ్రం హియర్. క్విక్

# గంగాధరయ్య వచనములు



## శ్రీ హస్నాబాద నాగలింగ శివయోగి

శైవవాఙ్మయమున ప్రశస్త వచన రచన అనదగినవి, "నను రక్షింపవే భవానీ మనోహరా" అను మకుటముగల 'పురాతన శంకర వచనములు' ను, 'ఏగంటి వచనములు' ను సుప్రసిద్ధములు. ఇప్పటి వరకు తెలుగున తొలి వచన కావ్యకర్తయు, వచన వాఙ్మయమునకు మూలపురుషుడును, వైష్ణవ భక్తాగ్రేసరుడు నగు కృష్ణమాచార్యుడే నని తెలియుచున్నది. వచన వాఙ్మయమునకు సంబంధించిన గాలింపులో లింగ బ్రాహ్మణుడైన గంగాధరుండు గూడ వచనైక గ్రంథమును రచించినట్లుగా తెలియవచ్చినది.[1] ఇట్టి వచనములు "కురుణించవే కరుణా కటాక్ష గంగాధరయ్య" అను మకుటముతో చక్కని భక్తి ప్రధానమైన ప్రసన్న శైలి గలిగియున్నవి. శైవ రహస్యములనెల్ల యలతి యలతి తెలుగు పలుకులతో జొప్పించి, శివుడే పరబ్రహ్మమని నిస్సందేహముగా జాటిన యాత్మశుద్ధిగల శైవ కవులలో నితడొకడు. ఇతని వచనముల స్వరూప సంప్రదాయ[2] శైలిని బట్టి క్రీ. శ. 12 వ శతాబ్ద్యంతమును, 13 వ శతాబ్ద ప్రథమార్ధమును ఇతడు జీవించి యుండెనని తోపక మానదు. 12, లేక 13 వ శతాబ్దములలో మధురపద కవితా శాఖకు జెందిన గంగాధరుండనే కవి గలడా ? యని పరిశీలించితిమేని, కాసె సర్వప్పకవి వంశములో నొక గంగాధరుడు వైదికాచార శివాద్వైత సదాచార సంపన్నుడుగా నగుపడుచున్నాడు గదా ! అతడే ఈ గంగాధరుండుగానోపు. కాసె సర్వప్ప తన సిద్ధేశ్వర చరిత్ర (ద్విపదకావ్యము) అవతారిక యందు—

"మద్వంశవరులను మాననీయులను
విద్వద్గరిష్ఠుల వినుపింతు వినుఁడు
అశ్వలాయన శాఖయం దుద్భవించి
శా (శ్వతైశ్వర్యుండు) సద్గుణ గరిష్ఠుఁ
డాత్రేయ గోత్రజుం డమల సద్యశుఁడు
గోత్ర ధీరుఁడు బ్రహ్మ కుల సంభవుండు
కాసె మల్లన మంత్రి ఘన కుమారకుడు
వాసికెక్కిన యట్టి వంశ వర్ధనుఁడు
బయకారములు పెక్కు పద్య కావ్యములు
నయమున జెప్పిన నాగరకుండు
శివపద ధ్యానైక చిన్మయాత్మకుఁడు
శైవ శాస్త్రాగమ సారానుభవుఁడు
లింగార్చనక్రియా నిరతుండు కాసె
గంగాధరుండు జగత్ప్రసిద్ధుండు."
....  ....  ....  ....
....  ....  ....  ...."

అని నుడివినాడు. దీనినిబట్టి కాసె గంగాధరుండు శైవ శాస్త్రాగమముల నెరింగిన గొప్ప శివభక్తుడని తెలియుటే గాక కవియై పెక్కు పద్య కావ్యములు, బయకారములు రచించినట్లు విశద మగుచున్నది. ఇక బయకారములు పద కవితకు సంబంధించినవై యుండును. ఇట్టివి వచనములే కాక మరేమిటి ? కావున నీ వచనకర్తయగు గంగాధరుండు

---

1. నా యొద్దగల అనేక అముద్రిత కృతులలో నిదొకటి. ఇది కాగితపు వ్రాతప్రతి (వహి). సమగ్రముగా లభించకపోయినను, చాలమట్టుకు విసంధితో గొలుసు వ్రాత వ్రాయబడినది.

2. "క. ధర కృష్ణాచార్యాదిః
పరికల్పిత పదము తాళ బంధ చ్ఛంద
విరహితమై చూర్ణాఖ్యం
బరగును నిర్యుక్త నామ భాసిత మగుచున్."

అని యాంధ్ర సంకీర్తన కవితా పితామహుడగు—తాళ్లపాక అన్నమయ్యగారు చెప్పినట్లుగా, కృష్ణమాచార్యుని కాలపునాటి పదములు (వచనములు) తాళ బంధచ్ఛందో విరహితములై యున్నవని తెలియుచున్నది. అట్లే క్రమముగా ఏగంటి వచనముల కాలము వరకు పల్లవి అనేది ఏర్పడి, తర్వాత క్రమముగా పల్లవి, అనుపల్లవి ఏర్పడుచు, అన్నమయ్య కాలము వరకు వీటిలో మార్పు లేర్పడి మాత్రాచ్ఛందోరచనలై రాగ తాళ ప్రమాణములై యుండును. ఇట్టివి సంకీర్తన లనబడునే గాని, వచనము లనబడవు.

కానె సర్వజ్ఞకవి వంశమువాడై యుండవచ్చును. లట్లయిన గంగాధరుడు సర్వజ్ఞకు తాతయగు చున్నాడు. కానె సర్వజ్ఞ కవి క్రీ. శ. 1400 ం ప్రాంతమువాడని కీ. శే. వీరేశలింగము పంతులు, చిలుకూరి వీరభద్రరావు, చాగంటి శేషయ్యా గారలు నిర్ణయించిరి. కావున గంగాధరుండు 13 వ శతాబ్దము వాడని ధృవమగు చున్నది. గంగాధరుండీ వచనములను క్రీ. శ. 13 వ శతాబ్దములో రచించినాడనుట సమంజసమే యగును. అనగా సింహగిరి వచన రచయిత కృష్ణమాచార్యునకు పూర్వుడు. ఈ (గంగాధర) వచనములు రచన యందును, సంప్రదాయము నందును, సింహగిరి నరహరి వచనముల తొలిరూపు ఛాయలతోనె నడచినవి—చూడుడు మచ్చునకు :

1. "శివా ఆత్మంబున్ యేమని విన్నవింతు,
నా విశ్వా (వ) సంబు మీకొక్క కట్టుకొల్వ,
శ్రీహరి నేత్ర కమలంబు మీ పాద సరోరు;
అర్చనంబవుట లోకపావనమైన గంగాభవాని,
మీ పేరట గీతాలు మొదలైన ......; పృథివ్యా
పోతేజోవాయు రాకాసంబులు, చంద్ర సూ
ర్యాదులు మీకు తనువులట, సర్వ జీవి నిర్వి
తాకారుండైన బ్రహ్మ కపాలంబు, మీకు భి
క్ష పాత్ర; అతి లావణ్యమూర్తియైన వల
రాజు భూతి మేనుపూతలట; దేవధన
వ కొల్పుంబైన త్రిశూలంబు; మీకు ఆయు
ధంబట; ప్రమథాదులు మీకు పరిచార
కులట; అన్నపూర్ణ భవాని మీకు పట్టి దే
వులసానట; సకల విద్యల గురుండైన విఘ్నే
శ్వరుండు మీకు పెద్దకుమారుండట;
సకల లోకాధారుండైన బసవేశ్వరుండు
మీకు వాహనంబట; మీరు బృహ లెస్స గురుండైన
విశ్వనాథుం డవట; మీకు సరివేల్పు యెవ్వరు
గలరు, కరుణించవే కరుణా కటాక్ష గంగాధరయ్య."

2. ఈ వచనమునందు కవి తన పేరును గూడ తెలియజెప్పినాడు.

"శివా భూలోకమందు గంగాధరుండు ప్రస్తుతి
జేయుచున్నాడు అని; ఆడికాడికి ఆడుచున్నాను;
మహాదేవా ! అందు తమపాటి నే నెరుంగగలనా ?;
నే అజ్ఞానిని గాను; అందులకై లోక వినోదమైన;
పరులకును ప్రచరింపక జెల్లదు; దూషింపక తీరదు;
పురుషార పరుడు; దేవతాశంబని వారి భమియించి
వారి చేతి పదార్థంబు తెచ్చి; లింగార్పితంబు సేయు
చుండినట్లు: పరులకు వందనములు సేతునో !;
మీకు సాష్టాంగుడనై మ్రొక్కినట్లు పరులకు వంద
నములు సేతునో !; కాయము మీ పాద పద్మారాధ
న స్తుతిచేసె దింతేకాని; నరస్తుతికాయును;
కరుణించవే కరుణా కటాక్ష గంగాధరయ్య.—"

3. ఇతని వీరశైవ మున్నంతకీ వచనమే సాక్షి-
"శివా సర్వ జనులకున్; చూపు ఉన్న కావున
మనస్సు ఉండును; మనస్సు ఉన్న కావున కర్మ
ఉండును; కర్మ ఉన్న కావున తగవు ఉండును;
తగవు ఉన్న కావున దండన ఉండును; దండన
ఉన్న కావున ప్రజాపాలన ఉండును; ప్రజా
పాలన ఉన్న కావున సత్యము ఉండును;
సత్యము ఉన్న కావున దృఢచిత్తము ఉండును;
దృఢచిత్తము ఉన్న కావున నిశ్చలత్వము ఉండును;
నిశ్చలత్వము ఉన్న కావున వీరశైవము ఉండును;
వీరశైవము ఉన్న కావున పరమానందమై యుండును;

నీవు ఉన్న తావున సకల దేవతలు ఉందురు;
ఇది జ్ఞానము; కరుణించవే కరుణాకటాక్ష గంగాధ
రయ్యా;—''

4. ఇవి స్తోత్రమునకు ఉదాహరణములు—
''శివా త్రిపుర పురాలు సాధించి వచ్చి రథ
తురంగంబులు విడిచి; భారతికి వంపించి
సారథియైన బ్రహ్మసదంబునకు పంపి;
రథచక్రంబుల మింటికే సంపి గిరి శరాసంబు
యెక్కుడించి; నారియై యున్న శేషున్ని
పాతాళానకు దిగవిడిచి; నారాయణా
స్త్రంబులు లక్ష్మి కౌంగిలన్ జేర్చి; బసవని
కైలాస ద్వారంబున నుంచి; పార్వతీ సమే
తుండవై; సింహాసనారూఢుండవై
యున్న మహాదేవా నా వాక్యంబులు
సదాకు తాయక అవధరించవే;
కరుణించవే కరుణాక క్ష గంగాధరయ్యా—''

''శివా రసము సిద్ధించియుండంగ; తవిటు
పాతర దోడినట్లు; కామధేనువ యుండంగ
గొడ్డుటావును దాయి వేసినట్లు; భుక్తి.
ముక్తి ఫలదాయకుండవైన; మహాదేవా మీరు
యుండంగను; గొడ్డు చెరువు దైవాల గొలిచె
దేమి కారణము; కరుణించవే కరుణా
కటాక్ష గంగాధరయ్య,—''

ఆంధ్రదేశమున శైవ వైష్ణవ వచన వాఙ్మయము నకు మూల పురుషుడును, తొలి వచన కావ్యకర్తయు, శివ భక్తాగ్రేసరుడు నగు గంగాధరుడు చిరస్మరణీయుడు. నిరం కుశపాలన గల యట్టి దశలో గూడ ''ప్రజాపాలన ఉన్న తావున సత్యము ఉండును'' అని సాహసించి ఎలుగెత్తి నినా దాలు జేసిన విప్లవకవి గంగాధరుండు. అందుచేతనే కాబోలు రాజాదరణ లభించక, వీరి కృతులన్నియు మూలబడి యణిగి కాలగర్భములో గలిసియుండును. ప్రస్తుతము లభ్యమయిన ఈ వచనాలయందు ప్రజలలో వ్యాపించిన పౌరాణిక (జిడ్డు) నమ్మకములను చక్కని తర్క యుక్తితో నిరసించిన ఘట ములు లేకపోలేదు.

మత విషయము లక్కరలేని వారికి, భాష, వాఙ్మయ, రాజకీయ విషయము లెన్నియో తెలిసికొన వీలగుచున్నది. ఇక్కడొక చిన్న మనవి. తెలుగు వచన సాహిత్యమునూ, వచన కావ్యకర్తలను గురించి గాని, అంతగా పట్టించుకున్నవారు లేరనవచ్చును. ఆంధ్ర లాక్షణికుల మతమున—''గద్యము'', ''వచనము'' అనునవి సమానార్థకములని సుస్పష్టము.

చూడుడు : అప్పకవి ఇట్లు చెప్పెను :
''ధర సాహిత్యము గద్య పద్యములనం
దా రెండు భేదంబులై
పరగు న్గద్యమునందు బాద నియతుల్
భావింపగా లేవు వా
క్స్ఫురణంబై విలసిల్లగా నుడువనౌ
ప్పుం గావ్య మెంతేనియున్
మరు తంత్రీ మతి దీనికే వచన నా
మంబయ్యె నాంధ్రంబునన్.''

ఇంతకూ అప్పకవి గద్య పద్యాత్మకమైన చంపూ గ్రంథమునందు గల వచనమును గురించియే చెప్పెనా ? అట్లే యైనచో వీటికి వచనములు అని పే రెందులకు వచ్చినది? మకుట నియమ సంఖ్యానియమముతో వేదాంత తత్త్వ సంభృ తములైన పదము (పాట) లను వచనములు (వచనాలు) అనుట సమంజసమా ? ముస్నగు విషయములు సమగ్ర ముగా పరిశీలింపవలసిన దెంతేని గలదు.

ఇప్పటి వరకు బయల్పడిన వచన సాహిత్యములో, సింహగిరి నరహరి వచనములు, వేంకటేశ్వర వచనములు, పురాతన శంకర వచనములు, ఏగంటి వచనములు ముఖ్యములు. వీటియందు గల భావములు విశ్వజనీనములు. వచన వాఙ్మయ మున నభిమానము గలవారీ వచనముల నన్నింటిని సంపా దించి, ప్రకటించిన వాఙ్మయమున వీనికి గల విశిష్ట స్థానము విదిత మగుటే గాక భాషా వాఙ్మయ చరిత్ర కారుల కవి యత్యంతోపాదేయము లగును.

# ఓ యిమార్త్రికుడా!



శ్రీ అద్దేపల్లి రామమోహనరావు

నువ్వూనేనూ ఒక్కచోటనుండే బయల్దేరాం
బయల్దేరే టప్పుడు నువ్వన్నావు గుర్తుందా?
ఇప్పుడే వచ్చి కలుస్తాను, ఈ సందులో నుంచి పోతూ ఉండమని-
ఆ నాటినుండి ఈ నాటిదాకా ఐపులేవు
నా తెల్లటి చూపులకి నల్లపూసవైపోయావు!

నిశ్శబ్దంగా వీచే గాలులతో నదించే నా మనస్సులో
నిరంతరంగా మ్రోగే ప్రకృతి నా హృదయానికిచ్చే నిస్తబ్ధతలో
కనిపించే మనిషియొక్క కనిపించని భాగంలో
వినిపించని పాటయొక్క వినిపించే రాగంలో
నీ పాదాల అలికిడేదో వినిపించి
చటుక్కున వెనక్కితిరిగి చూస్తాను!
నిరాశతో నిట్టూరుస్తాను!

నీకు నేను ప్రాణాధికమైన, ఆత్మీయుణ్ణిగదా!
నన్నింతకాలం వదిలి ఎలా ఉండగలిగావు నువ్వు?
పోనీ వెనక్కివచ్చి నిన్ను వెతుకుదామా అంటే,
నేను నిరంతరంగా నడుస్తున్న యీ సందు
నా వెనుకనుంచీ మూసుకుపోతోంది,
ఎప్పటికప్పుడు ముందుకే నడవమని—

ఇంక నాకు తెలుసులే-నువ్వురావు-
రాకూడదనే ఆగావు!
నేను నీకోసం యింత అనురాగబంధంతో
అలమటించి పోతానని నీకు తెలియదూ?
తెలిసే మోసం చేస్తున్నావు నన్ను!

ఎంతసేపిట్లా ముందుకు నడవనయ్యా?
బాటనిండా జాలిలేని ముళ్ళు

కఠినమై, మెఱుగులు క్రక్కే రాళ్ళు
తామే వెలుగులు మనుకునే నిబిడమైన నీడలూ,
ఎటువంటి సంకటంలో నడవమన్నావయ్యా నన్ను!

భయంతో నేను ఎన్ని అరుపులు అరిచాను!
నువ్వు గానలోలుడివి గదా అని
లయబద్ధమైన పదాలు వెదికి వెదికి మరీ అరిచాను!
నీకు వినబడనే లేదంటే,
నీ కఠినత్వాన్ని ఎంత కఠినంగా వర్ణించేది?

బాబూ! ఇంక నేనడవలేను!
ఇంకా ఇంకా దూరంపోయి
నీకు వరిగిత్తే శ్రమను కల్పించలేను!
నీ వెంటపడ్డ అనేకమంది మిత్రులగోలలో
పడిపోయి నువ్వు మన ఆత్మీయత మఱచిపోయినా
గోపికలాంటి నా హృదయం
నిన్ను గూర్చి బాధపడక మానదులే!
నాకు అది సహజజీవలక్షణం!

ఇంక నేను నడవనే నడవను-
ఇక్కడే నిలబడి
నువ్వు వస్తానన్న దోవ కేసిచూస్తూ
హృదయపు ముడులన్నీ విప్పి
గొంతులోని రక్తనాళాలుబ్బేటట్లు
నిన్నే పిలుస్తూ నుంచుంటాను-

చివరకు నా గొంతుపగిలి
రక్తం వరదలై బాటనిండా స్రవించి
నీ పాదాలకి చల్లగా తగిలినప్పుడైనా
నువ్వు వస్తావో-
ఈ అల్పజీవిని మోసం చేశాగదా అని
నవ్వుకుంటూ నందు మొదటే కూర్చుంటావో!

---

# "చెరిగిపోని గతంలోకి"



## "ధనిష్ట"

"నువ్వెళ్ళి ఆ యింట్లో భోషాణం తాళంచెవి వెతికి' ఆ పస్పు పుస్తకమో కాయితాలో వెతికి, రేపు వెళ్లి పన్ను కట్టి రశీదు తీసుకో. అప్పుడే ఒకరోజు అయ్యేపోయింది. ఇంకా పన్లకి నాంచే లేదు. నాలుగు రోజులు సెలవుపెట్టి వచ్చిన వాడివి అన్నీ చూసుకోకుండా మన్నుతిన్న పాములా కూర్చుంటే పన్లెలా సాగుతాయ్ ? జాగ్రత్తగా ఆ మున్సబెవడో కనుక్కు మరీ కట్టు—రోజుకోడు మారిపోతున్నాడు. జాగ్రత్తగా చూసుకోకపోతే, కట్టేదీ కట్టి రేపు ఏ జప్తుకో నోటీ సొస్తుంది—ఆ వెంకన్నగాడు కాయ పత్రాలేదు. తోటెల్లా ఉందో చూసిరా. ఆడదాన్ని నే నెక్కడికని దేవుళ్లాడను ? వచ్చాం, వచ్చాం. వెళ్లాం, వెళ్లాం, ఏపనీ కాదు—ఆ యింటి అద్దె వసూలొకటి—సిద్ధాంతిగారింటి కెళ్లి శంఖుస్థాపన ముహూర్తానికి ఏర్పాట్లు—" అమ్మ లిస్టు చదివేస్తోంది.

"అబ్బ, యింక ఆపురావా ?" విసుగ్గా అన్నాను. లేకపోతే ఇంక ఆ ప్రవాహంలో ఎక్కడ కొట్టుకు పోతానో? అని.

"అంత విసుగైతే ఎల్లాగరా ? చెప్పకపోతే అన్నీ మర్చిపోరావ్ ! ఇంకోసారి జ్ఞాపకంచేస్తే విసుగు—ఇంక చస్తే, ఈ విషయాల్లో కలుగచేసుకుంటే ఒట్టు. చేసుకున్నావో, బాగు పడరావ్—నేనేం కట్టుకుపోతానా ? ఏళ్లు పైబడగానే సరా, బాధ్యత తెలియక్కర్లా ?"

"బ్రహ్మాండంగా చెప్పావమ్మా— ఇంక నువ్వెందులోనూ కల్పించుకోకు."

"కల్పించుకోను, సరా !"

"సరే !"

రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"ఇంకా ఇక్కడే కూర్చున్నావేంరా ? ఇదేం చోద్యమమ్మా—బెల్లంకొట్టిన రాయిలా—"

పకపక నవ్వు వచ్చింది నాకు.

"సిగ్గులేకపోతే సరి—" తనూ నవ్వుతూ అంది అమ్మ.

నవ్వినా లోపల కోపంగానే ఉందని నాకు తెలియడం వల్లా, ఇంకొక్క క్షణం ఆలస్యంచేస్తే మళ్లీ దండకం మొదలు పెడుతుందనే భయంవల్లా, ఇంకా అక్కడ ఆగకుండా దొడ్డితలుపు తీసుకుని తోటలో పడ్డాను. తోట అవతలి సరిహద్దు అక్కయ్యగారిల్లు.

మామిడిచెట్లు పూత పట్టాయి. నెల్లాళ్లై దింపు తియ్యలేదు కాబోలు, కొబ్బరిచెట్లనిండా గుత్తులుగా వేళ్లాడుతున్నాయి కాయలు.

సపోటాచెట్లు, ఉసిరిచెట్లు కొట్టేసినట్టున్నా రీమధ్య.

చిన్నప్పుడు సెలవులు వస్తే చాలు ఎండా, కొండా లేకుండా ఆ చెట్లమీదనే కిష్కింధాపురీ అగ్రహారీకుల్లా విహారం చేసే వాళ్లం.

ఆలోచిస్తూ నాలుగడుగులు వేసి, **instinctive** గా ఆగిపోయాను. ఇంకొక్క అడుగు ముందుకువేస్తే గోతిలో పడేవాణ్ణి. కాలిదారి కిరుప్రక్కలా కొబ్బరిచెట్లు, దున్నిన నేల. అంచేత దారమ్మటే నడవక తప్పదు. దారి పక్కనే తోట మధ్యగా, ఇటికావకోసం పెట్టిన గొయ్యి యింకా పూడ్చ లేదు. అందుకే ఎప్పుడూ జాగ్రత్తగా చూసుకునే నడుస్తుంటాం. ఒకవేళ ఏదో ఆలోచనలలో పడి ఆ విషయం మర్చిపోయినా, చాలాసార్లు పడ్డ జాగ్రత్తవల్ల అనుకోకుండానే ఆగిపోతాం.

వర్షాకాలం చూడాలి వీటి తమాషా. తోటంతా పాదాలు తడిపే నీళ్లుంటాయి. దారి నీళ్లలో ఉంటుంది. అడుగు తడబడితే కంఠదఘ్నమైన గోతిలో పడతాం. సొంత తోటలోంచి వెళ్లడంలో ఉండే ఆనందం, అహం పీడించి, పక్కన పుంత ఉన్నా, ఇందులోంచే వెళ్లడం అలవాటు.

ఇంకోపక్కని రంపం గోతులు. అవీ అలాగే ఉండి పోయాయి, పదేళ్లనించి. పూడిపిద్దామంటే వంద బండి మట్టి యాభై రూపాయలు. వందబండి పది రూపాయలున్న రోజుల్లో అదే ఎక్కువనిపించి, తగ్గిం తరువాత చూసుకుందామని ఊరుకున్నారు. పది, పదిహేను, అది యిరవై— ఇరవై అయిదు—ఇల్లా పెరుగుతూ వచ్చినకొద్దీ 'అయ్యో ప్రితమే చేయించి ఉండవలసింది' అని నాలిక్కొరుక్కోవడం—

'అయినా యిప్పు డింత ధర పెట్టి ఇది చేస్తే ఎలాగ మీది టికి ఏమైనా పూడ్చించేద్దాం' అనుకుంటూనే సంవత్సరాలు దొర్లిపోయాయి.

ఈవేడు వీటిని పూడ్చించడం మాట అటుంచి, కట్ట బోయే ఇంటికోసం ఇంకా గోతులు పెట్టాలి. ఎప్పటికి కప్పి స్తామో యివి.

కట్టవ అంతటా రాటిచెట్లు ఉన్నాయి. మళ్లీ తిరిగి చేసుకుని వచ్చినప్పుడు కొట్టించి వాసాలు కోయించాలి—గుడ్డిలో మెల్ల—అదోటి నయం—అవి లేకపోతే ఇంకో వెయ్యి ఎక్కువ పుచ్చుకోవాలి.

అక్కయ్యగారింటి దొడ్డితలుపు ఓరగా వేసిఉంది. తోసుకుని లోపలకు వెళ్లి, అద్దెకున్నవారి వాటా పక్కనించి తిరిగి వీధివైపుకి వచ్చి వాళ్లబ్బాయిని పిలిచి తాళంచెవులు ఆతనికిచ్చి తాళం తియ్యమన్నాను.

జాగ్రత్తకోసం ఇంటికి తాళం వాళ్ల వాటాలోంచి వేస్తాం.

అతను వాళ్ల వంటింట్లోంచి తలుపు తాళం తీసి, బల్లల గది పక్కనించి అడ్డంగా పీత నడక నడిచి, వెనక వసారా గదిలోంచి హాల్లోకి వచ్చి సింహద్వారం తెరిచాడు.

అన్ని తలుపులు మూసిఉంచడంచేత గాలి ప్రసరించ డానికి వీలులేక, యీ వాటా అంతా గాబు కంపు కొడు తోంది. గబగబ అన్ని తలుపులు తీసి గాలిని చొరబడనిచ్చే దాకా ఊపిరాడలేదు.

హాల్లో ఎడంచేతి పక్క అవతల మూలకి బల్లల గాది, పన్నెండు బస్తాలు పట్టేది. ఇవతల పక్కకి భోషాణం. తలుపు పక్కనే పుస్తకాల బీరువా.

ఇవన్నీ ఉంటుంటే, ఇల్లిల్లా ఉండక శుభ్రంగా ఉండ మంటే ఎల్లా ఉంటుంది. ఇవన్నీ ఇల్లా ఉంటే, 'ఇంటి కెవ ర్నయినా పిలవడానికి సిగ్గుగా ఉంటుంది. సద్దించవమ్మా—' అంటే 'నోరు ముయ్యరా చెవలమ్మా— లక్ష్మిరా! లక్ష్మి! నాలుగువేళ్లూ నోట్లోకి అవి ఉండబట్టే పోతున్నాయి. అవే లేకపోతే అడుక్కుతిందువు—'' అంటుంది అమ్మ.

అక్కయ్య మహాదేవిగా రెక్కడో పారేసిన భోషాణం తాళంచెవి, ఈ గుహాంతరాళంలో ఎక్కడని వెతికేది ?

ముందర పుస్తకాల బీరువా కదిలించి కింద ఎలుకల వల్ల ఊకగా మార్చబడిన ఒకప్పటి ధాన్యాన్ని, ఊడ్పు తక్కువై పోగుపడిన దుమ్మునీ, ఎప్పుడూ sterile గా అట్టేబెట్టి మృదువుగా వాడుకుంటూ వచ్చిన హస్తద్వయంతో కెలికి తాళంచెవి దొరకకపోగా, చేతులు మాత్రం చక్కటి దుమ్ముతో అలంకృత మయ్యేటప్పటికి, ఒక్క నిట్టూర్పు వచ్చింది.

ఇంతలోకే వీపు దురద పెట్టేటప్పటికి, చేతులకి దుమ్మంటిందనే జ్ఞానం నశించగా, తొందరగా చెయ్యి ఆ పక్కకి పోనిచ్చాను. మళ్ళీళ్ళీరాంచి తెల్ల గొట్టాపేసి వేదిమ్రదల కపిపోతాయనే ధ్యాస పెట్టేసరికే ఒంటయం సంచి పోయింది. మూడవు కూడ దుడుకుంటూండగానే జరిగి పోతూంటాయి, అయినంటి పనులు. చిన్నప్పుడు స్కూలో మేష్టారు చెప్పేవారు, అంట్రోపేరిత ప్రతీకారచర్యని గురించి—అదిప్పుడు అనుభవంలోకి వచ్చింది—

ఏ బట్టలు పెట్టైనా సరా యనుకుని ఇటువంటి పక్కకి దూరంగా ఉండడానికి ప్రయత్నిస్తాన్, అది జరిగేపోయింది.. ఎంత జాగ్రత్త వహించినా—ఇంక బట్టలు ఏవా సొద య్యాయి గనక, భోషాణం అంతా కూడా తేల్చేద్దామని బుద్ధి పుట్టింది. దాన్ని కదపడమే ?—భీమారావని పేరు పెట్టుకుని ఎందుకూ ?— ఊపిరి బిగబట్టి వెడల్పవే పాకచెయ్యి, పొడుగవే పాకచెయ్యీ పెట్టి, జై వీరాంజనేయా అని ఒక్క పట్టు పట్టాను. ఐమూలగా ఒక అడుగు జరిగింది. వెనక కాప్ ఏర్పడింది. కాని, పక్కలకిఅయి గాదికీ, ఇటు గోడకీ జామ్ అయిపోయింది. అటూ యిటూ కూడా కదలదు. భోషాణం ఎక్కి అటువైపు దూకబోయేముందు ఒక్కసారి అడుగు వెనక్కి మళ్లింది. కింద ఏ పామైనా ఉంటే ? పైన అటక, దాన్నిండా కొబ్బరికాయలు—పచ్చికాయకు ధర రాదని అటక మీద ఆరనిచ్చారు. డీజీ అయింతర్వాత అమ్మడం అలవాటు—వెనకోసారి అటకమీద పాము చేరి, అక్కణ్నించి ఎలాగో కిందికి చేరుకుని భోషాణంకింద చుట్ట చుట్టుకుని పడుకుంది. భోషాణం తప్పించి వగ్గం అనుకుని చేత్తో ముట్టుకోబోయిన పాలేరు ఆగిచూస్తే పామై కూర్చుంది. అదృష్టం బాగుండి, అది ఎర మింగి కదలలేని స్థితిలో ఉంది గాబట్టి, గడిచింది గండం. పాములవాణ్ణి పిలిపించి రెండు రూపాయలు, పాత పంచా యిచ్చి దా న్నవతలకి సాగనంపేసరికి తాతలు దిగి వచ్చారు. పాముని చంపడం అంటే మా అమ్మమ్మ కస్సురుచ్చు కుంటుంది. "సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, తోటలో వెలిశాడు—అయినా మన్నేం చేయనప్పుడు దాన్నెందుకు మనం ముట్టు కోవాలి ?'' అంటుంది. ఆ లాజిక్కు బాగానే ఉంటుంది గాని, చెయ్యి చేసుకోవడంలో ఎవరు ముందు చేసుకున్నా ప్రమాదం మనకే ననే విషయం ఆవిడ అంగీకరించదు. అటువంటి ఆవిడ మొండిపట్టువల్ల ఎన్నో అనర్థాలు జరుగుతున్నా, పెద్దదనే గౌరవం నిలబెట్టి యిక్కట్లు కొని తెచ్చుకోవడం తప్పనిసరై కూర్చుంటుం దెన్నోసార్లు

ఛీ! ప్రాణంమీది తీపి ఎంతది. ఒక్క అడుగు ముందుకి వెయ్యడానికి ముందు ఎన్ని ఆలోచనలు వచ్చాయి ? మాటికి తొంభై తొమ్మిది పాళ్లు కింద ఏమీ ఉండే ఆస్కా రము లేదు. ఇన్నాళ్లు మూసిపెట్టిన తలుపులు ఒక్కసారి తెరిచిన అలికిడికి మొదట్లో తొలగిపోయిన ఎలకలాగే, ఏ పామో గీమో ఉన్నా వెళ్లిపోయి ఉంటుంది విధిగా. అయినా ఏమో ఎవరు చెప్పగలరు ? కటుక్కున కాటేస్తే, గుటుక్కు మంటుంది ప్రాణం. తరువాత మన కెంత లాజిక్కు తెలి సినా ప్రయోజనం ఉండదు. కేవలం ఇటువంటి భయానికి

పోనయ్యే ఎన్నో పనులు మన ఇష్టానికి వ్యతిరేకంగా, చేస్తూం టాము. కేవలం ఒక్క సంఘటన ఫలితంగా, ఎన్నోచోట్ల విఫల నమ్మకాల్ని పట్టుకు దేవుళ్ళాడుతున్నాం. దేముడుమీది భక్తి కంటె, భయమే అస్తికత్వానికి వెన్నెముకై కూర్చుంటుంది గదా ?

తెగించి కిందికి ఉరికాను. ఏదో పాకిన అలికిడై గుండె జల్లుమంది. కిచకిచమంటూ మూషికరాజు బైటికి కదల డంతో, అగాధంలో పడ్డ వాడికి ఆధారం దొరికినట్టయి మనస్సు కుదుటబడింది.

కింద చెత్తంతా చేతులతో కెలికి, కర్ర పెట్టి భోషాణం కింద పెల్లగించినా, ఫలితం శూన్యం. భోషాణం యథాస్థానానికి తెచ్చేసరికి తల్ప్రాణం తోకకి వచ్చింది. అలమా ర్లన్నీ వెతికాను. అక్కర్లేనివన్నీ కనబడ్డాయి గాని, తాళంచెవి మాత్రం కనబడలేదు.

అది లేందే భోషాణం తెరవకూడదు. తెరిచామా, మళ్లీ పడదు. ఒకవేళ పడినా అదేవిధంగా ఇతర్లకి దారి చూపించడం అవుతుంది గనక, ఆపని చెయ్యకూడదు. "కరిచి పారిపోతాడేవ్?" అన్నాట్ట, దొంగని పట్టుకున్న పెళ్లాంతో మొగుడు. అంత సేపూ ఏంచెయ్యాలో తెలియక గిజగిజ కొట్టుకుంటున్న దొంగ, ఇది విని ఆమె చెయ్యి కొరికి పారిపోయాట్ట ! ఇటువంటి సందర్భం ఏది వచ్చినా, మా అమ్మ యీ సామెత విసురు తుంది.

వెధవది ! అన లిన్ని జాగ్రత్తలు పడే మతులు పోగొట్టు కుంటున్నామేమో ననుకుంటా న్నేను. పెట్టికి తాళం, అందులో అరకి తాళం—గదికి తాళం, ఇంటికి తాళం—బతుకంతా తాళాలు వెయ్యడం తియ్యడాలతోనే సరిపోతుంది. ఇన్ని తాళాలు వేసినా, పోయేరోజొస్తే పోతూనే ఉంటాయి. ఘరానా దొంగ లొస్తే తాళాలు తీసే శ్రమ కూడా మనకే అప్పగిస్తారు. అసలీ తాళాలు, ప్రతీదాన్ని పదిలంగా అట్టే పెట్టాలనే కాంక్ష, యివన్నీ కలిసే మరిన్ని భయాల్ని, మరిన్ని అనుమా నాల్ని మనలో రేకెత్తిస్తాయేమో నని నా అనుమానం.

అసలు ఈ తాళాలు, తప్పెట్లు మాసిపోయే రో జెన్నటి కైనా వస్తుందా ? ప్రతి మనిషి యిన్నివిధాల భద్రతలు కోరు కుని బాధ్యతలని, బాధలని, అశాంతిని ఎందుకు కొనుక్కొంటు న్నాడు ? ఈ గొడవంతా లేకపోతే ఎంత అశాంతి తగ్గిపో తుంది ?

సరదాకోసమని సినిమాకి వెళ్లడం—కూర్చున్న అర గంటకి, ఇంటి తాళం సరిగ్గా పడిందో లేదో అని అను మానం రావడం—ఇంక యమబాధ ప్రారంభం !

ఇన్ని అవస్థలూ ఎందుకు చేస్తున్నాం ? లేమివల్ల !

దేశంలో అన్నీ కావలసిన దానికంటే ఎక్కువ ఉంటే ఇటు వంటివి, ఉండవేమో ? గుప్తుల కాలంలో మణి మాణిక్యాలు కిరాణా దుకాణాల్లో తట్టలలో పోసి అమ్మేవారట ! వాటి విలువ తెలియక కాదు ! ఆధిక్యంవల్ల. కూరగాయలు తట్టలలో అమ్మడంలా ? అస లింతకీ, యీ విలువలన్నీ మనం ఏర్పరచు కున్నవేగా ! వజ్రాల ధరకీ, నిజంగా దానికున్న ఉపయోగానికీ సంబంధం ఉందా ? వాటి మెరుపుమీది మోజేగా, వాటి ధర నంత పెంచుత !

దబ్‌మని చప్పుడై మనస్సు మళ్లింది.

ఎన్నాళ్లనించో ఆ ఫోటో బరువుని మోసి మోసి యీనాటికి రిటైరై పోదల్చుకున్న మేకు, ఫోటోని కింద పడేసింది. అద్దం బద్దలై ముక్కలు ఇల్లంతా జిమ్మబడ్డాయి. జాగ్రత్తగా ముక్కలన్నీ ఒకమూలకి పోగుచేసి, ఫోటో తీసి లోపల పెట్టేయ్యబోతూ, దానికేసి ఒకసారి దృష్టి మరలించాను. మా ఎస్సెస్సెల్సీ ఫోటో. అప్పటికి నేను వేలె డంత ఉండేవాణ్ణి. చెవులకి పోగులు. మధ్య పాపిడి. నవ్వ బోయినట్టున్నాను—ఏడుపుముఖం పడింది.

అందులో ఉన్న ఇతర్లు అయిదారుగురు తప్ప ఇతర్లేం చేస్తున్నారో తెలీదు. వర్మ ఏదో ప్రయివేట్ కంపెనీలో ఎక్కౌంటెంట్. శాస్త్రి ఎం. ఏ. ప్యాసై లెక్చరర్ అయ్యాడు. శంకరం రైల్వేస్‌లో ఎంజనీరు—రాజుగాడు మేష్టరు.

మేష్టర్లంతా ఇప్పటికీ బాగున్నారు. జపాన్ చిప్పి అని ఒకరికీ, అప్పడాల పిండి అని మరొకరికీ, ద్వితీయ నామా లుండేవి. మా రాజుగాడు మేష్టర్లని తెగ ఏడిపించేవాడు. ఇప్పుడు వాడెలా వేగుతున్నాడో పిల్లల్తో. కాని, ఇటువంటి వాళ్లకి ఒక సులువుంటుంది. కుర్రాళ్లు చేసే అల్లరి విద్య లన్నీ వా రిదివరకు ప్రయోగించినవే గనక, వాటికి మందులు ముందే తయారుచేసుకుంటారు. దొంగని దొంగే పట్టుకోగల డనే సామెతగా !

నేనూ, నాతోటి లెక్చరరూ యిద్దరం invigilators గా ఉన్నాం ఒక పరీక్షకి. నేను ఇటూ అటూ గంభీరంగా తిరుగుతూనే ఉన్నాను. ఇంతలోకే ఆయన నేను నడుస్తున్న వరుసలోనే ఒకడి దగ్గరికి వెళ్లి వాణ్ణి నిలబెట్టి ఇంత కట్ట కాయితాలు పట్టుకున్నాడు. నాకు మతిపోయింది. ఆయ నెక్కడో ఒకమూల అంటీ అంటనట్టుండి ఇట్టే పట్టు కున్నాడు కాపీ. నేను పది జన్మలెత్తినా పట్టుకోలేక పోదును. ఆయన్నభినందించి ఎల్లా పట్టుకున్నాడో అడిగాను. ఆయన చెప్పింది వింటే ముచ్చెమటలు పోశాయి—ఆయ నేమన్నాడని ? "గురువుకే నామం పెడతారండీ వీళ్లు ? ఈ పద్ధతులు నా దగ్గరా ?—ఇవి మేం వాడి పారేసినవిగదూ ?" అని.

నలుగు రమ్మాయి లుండేవారు మా క్లాసులో. జపాన్ చిప్పిగారు వాళ్ల బెంచీలవేపే తారట్లాడే వాడు పాఠం చెప్తున్నంతసేపూ. మల్లిక లీడరుగా రమ్మాయి. అప్పుడప్పుడే ఓణీలు వేసుకుంటూండేది. తెలుగులో ఫస్టు మార్కుకి

# "చెరిగిపోని గతంలోకి"

మా యిద్దరికీ బలే పోటీ ఉండేది. చాలా తక్కువ తేడాలో వచ్చేవి మార్కులు మా యిద్దరికీ. పేపర్లిచ్చిన రోజున తెలుగు మేష్టారి దుంప తెంపేవాళ్లం ఇద్దరం. ఆయన పైకి విసుక్కున్నా లోపల ఎంతో ఆనందించేవారు. ఇప్పుడు మల్లికేం చేస్తోందో, పెళ్లి చేసుకుని ఏ నలుగురి పిల్లల తల్లో అయి ఉంటుంది.

రాజ్యం అని ఇంకో అమ్మాయి. ఆయేడు డింకీ కొట్టిం చింది. ఆమధ్య మెడ్రాస్‌నించి వస్తూంటే కనబడింది. ఇద్దరు పిల్లలు. మొగుడు డాక్టర్ట, తెనాలిలో—

"మీపేరు రామం కదూ ?—" ముక్కు మొహం తెలి యని ఓ యిద్దరు పిల్లల తల్లి అడుగుతుంటే మతి పోయింది—అవునన్నాను.

"అయితే నన్ను గుర్తుపట్టలే దన్నమాట ! నేను రాజ్యాన్ని" అంది. సన్నగా రివటలా ఉండేది, ఏనుగంత అయి పోతే, నేనేం గుర్తుపట్టను ?

"అరె—నువ్వా !— నన్నెల్లా గుర్తుపట్టావ్ ?" అడి గాను, ఇంకా ఆశ్చర్యంగానే.

"మాటిమాటికీ పెదాలు తడుపుకోవడం నువ్వింకా వద ల్లేదుగా—అదే కాదులే—నిరుడు మీ సరళగారింట్లో నువ్విది గిన తరవాతి ఫోటో చూశాను." అంది నవ్వుతూ. క్లాసులో ముంగిలా ఉండేది. ఇప్పు డెంత మాటకారి అయిందో ?

"మీ ఇంట్లో వంటమనిషి ఉందా ?" అడిగాన్నేను.

"ఉంది—ఏం ?" మహాశ్చర్యంగా అడిగింది.

"ఇక లావెక్కక చస్తావా ?—"అనుకోకుండానే అనేసి, నాలిక్కరుచుకున్నాను.

కోపం వస్తుం దనుకున్నాను గాని—నిండుగా నవ్వింది.

"లావు తగ్గడానికి మీ ఆయన మందేం చెప్పలా ?" మళ్లీ అడిగాను.

"చిలిపితనం పోలా రామం, నీ కింకా ?—"

"ఎస్సెల్సీ మళ్లా కట్టావా ?"

"ఊహు !"

"మల్లిక ఎక్కడుందో తెలుసా ?"

"ఊహు—మన స్కూలుఫైనల్ అవగానే మా నాన్న గారికి అక్కణ్ణుంచి ట్రాన్స్‌ఫరైంది. మల్లిక ఇంటర్‌లో జేరతానంది. తరవాతేమైందో—తెలీదు."

పాతవాళ్లందర్నీ జ్ఞాపకం చేసుకున్నాం.

రాజ్యం ఇంగ్లీషు బ్రహ్మాండంగా అభివృద్ధి చేసు కుంది. పిల్లల్తో ఇంగ్లీషే. "పిల్లలకీ ఇంగ్లీషెందుకు ?" అడిగాను.

"ఇంకో భాష వస్తే ఏంచెడిపోతా—అదివాళ్ల అవసా కనే యిష్టం—"

"వచ్చాంపో—"అన్నాను.

మందస్మితం చేసింది.

'వాళ్ల ఊరు రమ్మని మరీ మరీ కోరింది. తప్పకుండా వస్తానని వాగ్దానం చేశాను. కాని నాటికీ నేటికీ వెళ్లలేదు. ఏమయితేనేం, అవాళ్టి ప్రయాణం మాటుగా తీరిపోయింది.

రాజ్యం, మల్లిక, నాక మినహా యిద్దరమ్మాయిలు క్రిస్టియన్లు—అందులో మేరీ థార్డుకి మా ఎస్ ఎస్ ఎల్ సి. లోనే పెళ్లయిపోయింది. మమ్మల్నందర్నీ పిల్చింది. క్లాసంతా చందాలు వసూలుచేసి పదిహేను రూపాయలు బహుమతి కొనిచ్చాం. పార్టీ యిచ్చారు. అప్పటి కింకా మా మొహాల్లో కొందరికి కేక్ తినే అలవాటులేక, తిని డోక్కు న్నారు. సిద్ధాంతిగా రబ్బాయి ఒకడు తినేసి, అందులో కోడి గుడ్డు కలుస్తుందని తెలిసి, వాళ్ల నాన్న అవాళ తన తద్దినం పెట్టేస్తాడని వాపోయి, మా అందరిచేతా ఎవ్వరికీ చెప్పమని ఒట్లు వేయించుకున్నాడు.

నాలుగో అమ్మాయి లిల్లీవైట్ గజనీతో పోటీ పడి పడి, చివరి కెల్లా అయితేనేం, బియ్యే లయిందనిపించి, ఆపైన బి యిడి పట్టా పుచ్చుకుని పంతులమ్మ అయింది.

తల్చుకుంటే, అన్నీ నిన్న జరిగినట్టుంటాయి.

మా హిస్టరీ మేష్టారు రోజూ క్లాసులో ప్రశ్నలడిగి చెప్పలేకపోతే పాతికసార్లు రాయించేవాడు. హిస్టరీ క్లాసంటే అందుకే సింహస్వప్నంలాగుండేది. ఇంపొజిషన్ రాయవల్సు డల్లా, ఆయనకి జ్వరం రావాలని ఎన్నో దేవుళ్లకి మొక్కే వాళ్లం. అలా జరిగేది కాదు. ఇంపొజిషన్ రాయనివాళ్లని దగ్గరకు పిల్చి, దండ దగ్గిర కండల్ని బొటనవేలు చూపుడు వేలూ మధ్య పట్టి నలిపి, నరకం చూపెట్టేవాడు.

ఆ భయంతోనే చచ్చినట్టు చదివేవాళ్లం. అందుకే మానవత్వంమీద ఎంత నమ్మకం తగులడ్డా, శిక్షకి విలువ ఉండనే ఉందేమో ననిపిస్తుంది. భయంతోనూ, బెదురు తోనూ సాధించబడేవి సాధింపబడుతూనే ఉన్నాయి.

హిస్టరీ మేష్టారు అమ్మాయిలు యింపొజిషన్ రాయకపోతే కిక్కురుమనేవాడు కాదు. అది మా మొగ వెధవ లందరికీ మహా ఏడుపు తెప్పించేది.

ఒకరోజున అందర్లోకి కుర్రవెధవన్నైన సన్నుసిగోర్ని "అమ్మాయిలని ఏం అనరేం, ఇంపోజిషన్ రాయకపోయినా ?'' అని అడిగింవారు. "నువ్వు కూడా అక్కడే కూర్చుంటే విన్నా లనన్రా !'' అన్నా డాయన. నాకు చచ్చే సిగ్గు ముంచుకొచ్చి, నా స్వయంబుద్ధివల్ల అడగలేదని చెప్పి ఆయన సానుభూతి పొంది, తక్కిన కుర్రాళ్లచేత తల వాచేటట్టు చివాట్లు తిన్నాను.

అమ్మాయిలని ఏమీ అనకపోవడంవల్ల, వాళ్ళు సహజం గానే శ్రద్ధ చేసేవారు. నా మటుకు నాకు, ఈనాటికీ నిద్దట్లో లేపి అడిగినా, మూడో పానిపట్టు యుద్ధం ఎప్పుడు జరిగిందో, ఆఫ్రికా ఖండాన్ని ఎవరు కనిపెట్టారో వెంటనే చెప్పెయ్యగలగడానికి ఆ శిక్షణే కారణం.

ఆడవాళ్లకి ఇటువంటి కన్సెషన్స్ ఎక్కువయిచ్చే వారి బలహీనతలని మరింత పెంపొందిస్తున్నారని నా భావం. అన్నిటా వారికి అవసరానికి మించిన రక్షణ యిచ్చి, వార్ని పిరికి వాళ్లగా తయారు చేస్తున్నారు. ఆరుగురు పిల్లల తల్లి మా రెండో అక్క—ఇప్పటికి ఆవిణ్ణి ఒక్కత్తినీ ప్రయాణం చెయ్యడానికి ఒప్పుకోడు మా బావ—ఇటువంటి అలవాటుతో ఆమె నిజంగానే, ఒంటరిగా ప్రయాణం చెయ్యలేని స్థితికి వచ్చింది. ఇటు వచ్చేటప్పుడు, అటు వెళ్లేటప్పుడు—విధిగా బాడీగార్డుకి ఇంకో వంద రూపాయలు పొయ్యాల్సిందే—ఎవడు తిన్నట్టు ? అందుకే, ఆమెని రమ్మనే కంటే, మేమే వెళ్లి చూసొస్తే నయమనిపిస్తుంది నాకు.

సుకుమారి కందిపోతుందేమో నని, రాజ్యానికి వాళ్ళా యన వంటమనిషిని కుదిరిస్తే, శ్రమ తక్కువై ఆమె శరీర వైశాల్యం హద్దులు దాటిపోతోంది—

మొగాడి అండ లేకుండా ఆడది బతకలే దనుకోడం !

తీరా చూస్తే ఆడవాళ్ల కున్నంత తెలివి, త్యాగం మొగాళ్లకు చస్తే ఉండవు.

మా ఊళ్లో డాక్టరమ్మ—వేలార్జిస్తోంది. తమ్ము ళ్లనీ, చెల్లెళ్లనీ ఎంతో పైకి తీసుకువచ్చింది, నిస్స్వార్థంగా. పెళ్లి చేసుకుంటే ఆ వచ్చే మొగుడు ఆటంకపరచవచ్చని అనుమానంవేసి, తమ సంసారం అంతా గట్టెక్కేవరకూ, అవివాహితగానే ఉండిపోయింది. లక్ష లార్జించే మొగాడి తమ్ముళ్లూ, అప్ప బావలు అడుక్కుతినడం, నా కళ్లారా చూశాను.

ఆడవాళ్లని మగాళ్ళు మరో విధంగా కూడా బలహీ నంగా తయారుచేస్తున్నారు. వాళ్లల్లో భావదాస్యం అంకురింప జేసి, వాళ్ల మెదళ్లని అలా మొద్దుబారి పోనిస్తున్నారు. ఎంత విచిత్రం కాకపోతే, యీనాటికీ సీతా సుమతులనీ, కేవలం ఆత్మాభిమానం లేనట్లు చిత్రింపబడ్డవాళ్లని, ఆదర్శ పతీ మణులని పొగడుతారా ? చాకలాడు ఏదో కూత కూస్తే, శ్రీరాముడు అది నమ్మో, నమ్మకో సీతా అమ్మవార్ని అడవుల పాలు చేస్తే, కుక్కిన పేనులా ఊరుకున్న ఆవిడ ఆదర్శ సతీమణా ? సుమతి గాడండి—కుష్టురోగి అయిన భర్తని వేశ్య యింటికి తీసుకువెళ్లిందట తట్టలో పెట్టి ! చిట్టితల్లి! ఆవిడో, మహిళల్లో మణిపూస—

ఇటువంటివి చదివి నరనరానా జీర్ణించుకునే, నిక్షేపం లాంటి మా మూడో అక్క, చేజేతులా గొంతుకోసుకుంది. ప్రాణమే పోయింతర్వాత పాతివ్రత్యం ఎందుకూ ? తగులణ్ణా? నానా హింసలు పెడుతుంటే వాణ్ణే పట్టుకు దేవులాడి, చివ రకు భరించలేక, ఆత్మహత్య చేసుకోకపోతే, యింటికి చక్కా రారాదూ ?—

ఇరుగు పొరుగమ్మలు, కొండొకచో తలిదండ్రులు, అక్క చెల్లెళ్ళూ కూడా అవహేళన చెయ్యొచ్చు—అదీ భరించడం కష్టంగానే ఉంటుంది,

కాని, మన్ని కాదనుకుంటే పోలా ?

అసలు తెగించకవేపోవాలిగాని, తీరా తెగిస్తే ఎవడూ ఏం చేసేది ఉండదు.

మా అక్కయ్యగారి ఊళ్లో మరో డాక్టరమ్మ !—పెళ్లికాకుండానే పిల్లాణ్ణి కని దర్జాగా పెంచుకుంటోంది. ఆ చుట్టుపక్కల ఊళ్లల్లోనే ఆపరేషన్స్‌లో అంత చెయ్యి లేదు. అవసరం ఉన్నవాళ్లు చచ్చినట్టు వస్తున్నారు. కుప్ప తిప్పలుగా ఆర్జిస్తోంది డబ్బు. చాటున అనుకుంటారు ఆమెను —కాని ఏం చెయ్యగలిగారు ? అన లెందుకు చెయ్యా లంటాను? పెళ్లి కానంతమాత్రాన పిల్ల లుండకూడదని రూలేమిటి? పెళ్లయి పిల్లలు పుట్టి, ఆ మొగుడు చచ్చిపోయో, పారి పోయో ఉంటే ఆ పిల్లల్ని ఆమె సాకవలసి వస్తే మాత్రం యింతే కాదూ ?

అంటే యింతకీ అధికారం, శక్తీ, ఎవరికుంటే వారి మాట చెల్లుతుంది. వారే ఆట ఆడినా లోకం హర్షించడం తప్ప, ఏమీ చెయ్యలేదు. అది గ్రహించినవాళ్లంతా ఆ అనువు ఉపయోగించుకోనే ఉపయోగించుకుంటున్నారు. ఉపయో గించుకోడం చాతకానివాళ్ళు ఉరోసుకుంటున్నారు. ఆత్మ వంచన చేసుకుంటున్నారు .... హీనంగా బతుకుతున్నారు !

ఏనాటికైనా యీ పద్ధతులు మారి, ఆడది కూడా మగాడితో సమంగా సంచరించగలిగే రోజు లొస్తేయీ

అనుకుంటాన్నేను. వస్తే చిటపటలాడుకుంటుంటారంతాను. కాని, అల్లా అవసరంలేదే—మొగాడు మొగాడు అభిప్రాయ భేదాలమధ్య బతకటంలా ?

కాని, మొగాళ్లంతా తమ విరంకుశత్వాన్ని త్యజించ గలరా, అని ?

ఇన్ని ఆలోచనలొస్తాయి నాకు ?—గట్టిగా మా ఆవిడ బెదిరిస్తే ఓర్చలేను నేను. మాటకు మాట అందిస్తే చెయ్యి కూడా చేసుకున్న రోజులు కద్దు. నేను దానిమీద విసుక్కుంటే అది నా ఆధిక్యానికి చిహ్నం. కాని, అది ఎది రిస్తే, దానికి మంచీ మర్యాదా లేనట్టు !

ఈ ఆధిక్యం చెల్లడానికి కారణం, చాలా యిళ్లల్లో ఆడ దానికి స్వయంపోషక శక్తి లేకపోవడం ! మరి, బియ్యే ప్యాస యిన మా ఆవిడ కూడా, ఎందు కూరుకుంటుందో ఆశ్చర్యమే నాకు.

ఫోటో నా చేతిలోనే ఉంది—మనస్సు విహారం చేసి వచ్చింది.

తాళంచెవి కనబడే ఎత్తు కనబడలేదు.

ఇకపోతే, ఆ పన్ను రశీదులేవో వెతకాలి !

పాత రశీదులు లేకపోతే యిప్పు డెంత కష్టాలో తెలీదు. మునసబు నడిగితే కాకులెక్క చెప్తాడు. పన్ను కట్టక పోతే జప్తు నోటీసొస్తుంది. అంచేత అది వెతకడాని కుపక్ర మించాను. ఉత్తరాల గుత్తిలో గుచ్చాను అని అక్కయ్యెప్పుడో అన్నట్టు గుర్తు.

వెంకటేశ్వరస్వామి ఫోటో తగిల్చిన మేకునే ఉందో ఉత్తరాల గుత్తి. ఎంత వెతికినా రెవిన్యూ పన్ను కాయితాలు కనబడలేదు—

పాత ఉత్తరాలు చూడగానే, అక్కడక్కడ చదువుదా మనే బుద్ధి పుట్టింది. అడుగు ఉత్తరం ఇరవై రెండేళ్ల క్రితంది. మన కప్పటికి అర్ధదశాబ్ది వయస్సు.

నాన్నగారు రాసిం దది—ఆయన పోయి పదిహేడే ళ్లయిపోతున్నది—పెద్దక్కకి రాశారు.

"చి. సౌ. సరళని దీవించి మీ నాన్న వ్రాసేది :

నీ దగ్గర్నించి ఉత్తరం వచ్చి పదిహేను రోజులు కావస్తోంది. ఎన్నో పనుల్లో నేనే తీరిక చేసుకుని వారానికో ఉత్తరం రాస్తుంటే నువ్వు ఆలస్యం చేస్తుంటే, నాకు చాలా బాధగా ఉంటోందమ్మా !

నే నొక్కణ్ణే గదా ఉంటున్నాను. ఉత్తరాలే నా కూరట కలిగించేవి. ఇకనించైనా నువ్వు నాలుగేసి రోజులకో ఉత్తరం తప్పకుండా రాయాలి.

బాంబుల హడావిడి తగ్గేదాకా, అమ్మా పిల్లలూ విజయనగరంలోనే ఉండక తప్పదు. ఇప్పట్లో బాంబుల హడావిడి తగ్గేట్లు లేదు. ఊరంతా ఖాళీగా ఉంది. వదులుకోలేనివాళ్ళంతా ఉద్యోగాలు వదిలేసి వెళ్ళిపోతున్నారు.

రెక్కాడితేగాని డొక్కాడని బతుకు మనది. యుద్ధ అలవైవే లార్జించినా ఎప్పటికప్పుడే ఖర్చయిపోతూ వచ్చింది. పిల్లలింకా ఎదగలేదు. గాకీ, వాణిం కింకా పెళ్ళిళ్ళు కావాలి. నానీ చదువింకా మొదట్లోనే ఉంది.

వారం వారం విజయనగరం వెళుతున్నాను. వెళ్ళడమే గాని మనశ్శాంతి ఉండదు. అమ్మా నేనూ పోట్లాడే ! పిల్లల కేం మిగల్లేదని, పెళ్ళి పేరంటాలు ఎల్లా జరుగుతాయోనని దానికోటే బెంగ. అయితే మాత్రం నేనేం చెయ్యగలను.? చరి నైంది చేస్తూనే ఉన్నాను. అదృష్టమైనదాన్నా లొంగ్ని ఉన్నా యంగా అర్థించడం నా చేతకాదు. అది లేకపోతే యీ అవ స్థలు తప్పవేమో ? తను ప్రతిదానికీ ఊహ దూరాల్రా యాచనలు చేస్తుంది. మంచి బట్టలేనా కట్టుకోదు. ఎంతసేపూ కూడిక, కూడిక అంటుంది. ఎన్నాళ్ళనించో ఒక స్థాయికి అలవాటు పడ్డవాళ్ళం, ఇవ్వాళ పిల్లల లెదుగుతున్నారని దిగిపో గలమా ?

అన్నింటికీ ఆ దైవమే ఉన్నాడు. కొంపంత లేటివి కంటె ఆవగింజంత అదృష్టం మేలు.

నీ బెంగే నన్ను కృంగదీస్తోంది. చేజేతులా నీ గొంతు కోశాను. నువ్వు రాసినవన్నీ వింటుంటే నా కడుపు తరుక్కు పోతోంది. హిందూసమాజంలో పుట్టినవాళ్ళం. నీతినియమం, శాస్త్రం, చట్టం, దేన్నీ వదులుకోలేని బలహీనులం.

కష్టాలు భరించడానికి అలవాటుపడాలి. సహనం వహించి మంచి రోజులకి ఎదురుచూడమని తప్ప నేనేం చెప్పగలను ?

జీవితంతో పోరాటం తప్పదు. ఓడినకొద్దీ జయం పొందాలనే ఆకాంక్ష ఎక్కువ చేసుకోవాలి. అప్పుడే బత గ్గలం. బతకక చెయ్యగలిగిందేం లేదుగదా ! జన్మ అంతం చేసుకుంటే పునర్జన్మ యింతకంటే నికృష్టమైనది రావచ్చు. ఈ జన్మలో మానవులుగా అవతరించడమే ఎంతో అదృష్టం అనుకోవాలి. ఏనాటి పాపమో ఈనాడు అనుభవిస్తున్నాం. ఈనాడైనా జాగ్రత్తగా ఉంటే కనీసం ముందు జన్మలో నైనా సుఖపడగలమేమో. నిరాశ పెంచుకోకు. బతకడానికి ప్రయోజనం, అర్థం వెతకద్దు. ఉన్నంతలో కష్టాలు మర్చి పోయి సుఖపడడానికి ప్రయత్నించాలి.

భగవద్గీత శ్రద్ధగా చదువుకుంటున్నా వనుకుంటాను. హింసే పతనం మానవుడ్కు.

రేపు ఆదివారం. పొద్దున్నే విజయనగరం వెళ్లాలి. నేను వెళ్ళిపోతే మీ అమ్మే బయలుదేరి వచ్చేస్తుంది. అదీకాక వారానికో రోజైనా వెళ్లి పిల్లల్తో ఒకరోజు గడపకపోతే ఎల్లా? ఈ వెధవ హోటలు కూడు తింటూ, వారానికో రోజైనా మీ అమ్మ చేతివంట తినకపోతే అసలు ప్రాణం నిలవదు.

పొన్నాదురుం దప్పమాటే గాని వెడుతుంటే కళ్లమ్మట నీళ్లొచ్చేస్తుంటుంది. ఉద్యోగం మానెయ్యమంటుంది. కలో గంజో తాగి బతికి, బాంబుల హడావిడి తగ్గిన తరువాత మళ్లీ ఉద్యోగ ప్రయత్నం చేసుకోమంటుంది. వెర్రిది! ఈరోజున ఎల్లా గడవడం? నగలమ్మేద్దా మంటుంది. ఎన్నాళ్లొస్తుందా డబ్బు! యుద్ధం ఎన్నాళ్లుంటుందో ఎవరం చెప్పగలం?

రాత్రి అప్పుడే పదకొండు అవుతూంది. ఇది నీకు మంగళవారం అందుతుంది. బుధవారం నువ్వు సమాధానం రాస్తే గురువారం నాకు అందుతుంది.

ప్రసాదానికి ఆశీర్వచనాలు. అమ్మమ్మకు నమస్కారాలు.

నీకోసం ఒక రాట్నం కొన్నాను. మీ పిన్ని విజయ నగరం నించి అటు వచ్చేటప్పుడు, ఆమెచేత పంపిస్తాను.

ఆశీస్సులతో,
మీ నాన్న—''

అప్రయత్నంగా కళ్ల నీళ్ల తిరిగాయి.

పధ్నాలుగేళ్ల పెద్దక్కకి నాన్నగారు రాసిన ఉత్తరం అది!

అందర్లోకి చిన్నవాణ్ణయిన నాకు నాన్నగారితో పరిచయం తక్కువ. నాకు తెలిసినవల్లా ఆయన ఆప్యాయత— కోరితే కొండమీది కోతినైనా మాకోసం తెచ్చి యిచ్చే పట్టుదలాను. అమ్మ ప్రతి విషయానికి మమ్మల్ని కసురుకుని అప్పుడప్పుడు చెయ్యి కూడా చేసు కునేది. ఆ రోజుల్లో అమ్మ ఒక రాక్షసిలాగ నాన్నగారు దేవతలాగా కనిపించేవారు. దీనికి తోడు, ఆయనకి ఆరోజుల్లో స్థిరమైన ఉద్యోగంలేక, ఒక ఉద్యోగం అయిపోగానే మరెక్కడ దొరికితే అక్కడికి వెళ్లిపోయేవారు. దానివల్ల సాధారణంగా నే నెరుగున్నంత వరకు ఎక్కువకాలం రెండు కాపురా లుండేవి. ఆయ నొక్కరూ ఒకచోట—మేమంతా ఒకచోట.

ఇవాళ తల్చుకుంటే ఆయన జీవితం ఎంత నిస్పృహ నిర్లిప్తతల మధ్య గడిచిందా అనిపిస్తుంది.

పెద్దక్క సరళకి అమ్మ, అమ్మమ్మల బలవంతం వల్లమా మూడో మామయ్యతో పెళ్లి చేశారు. చదువు లేక పోయినా ఆస్తి ఉందిగదా అని యిచ్చారు. అతనికి తరువాత మతి చలించింది. దానికి తోడు, అతను పుట్టి పెరిగిన వాతావరణంలో హృదయ వైశాల్యానికి తావులేక, అక్క బతుకు నరకంగా తయారైంది.

నాన్నగార్నడిగితే, అంతా అమ్మ తప్పే నంటారు. నిజానికి అది కాదు. అమ్మ చెప్పినంతమాత్రాన అక్కకి అంత చిన్నతనంలో, తగని సంబంధం ఎవరు చెయ్యమన్నారు? ఇతర విషయాల్లో సాధారణంగా తనకు నచ్చినట్టు వ్యవహరించే ఆయన ఇందులో మాత్రం అమ్మ మాట ఎందుకు వినాలి?

పదేళ్లు పనిచేసిన రైల్వే ఇంజనీరు పని స్వాతంత్ర్యోద్యమ కాంక్ష కొద్దీ ఖద్దరు సూట్లు వేసి, తలపాగాలు చుట్టుకోవడంవల్లా, ముక్కుకు సూటిగాపోయి ఇటు పైవాళ్లకీ అటు కింది వాళ్లకీ కంటకంగా తయారవడంవల్లా ఊడి పోయింది.

తరవాత ఒకటి రెండేళ్లు కంట్రాక్టులు చేశారు. తప్పుదారిన పడకపోతే కంట్రాక్టు ఎప్పుడూ నష్టమే తెస్తుందనే విషయం ఈ రోజుల్లో కుర్రాళ్లకి కూడా తెలిసినా రెండేళ్ల అనుభవం, ఆర్థికనష్టం నేర్పిన పాఠాలవల్లగాని, ఆయన ఒప్పుకోలేక పోయారు.

ఇంక ఆ తరువాతల్లా, ఉద్యోగం ఉండడం, ఊడడాలతోనే గడిచింది. ఉద్యోగం ఉన్న రోజుల్లో మా అమ్మ పొదుపు చేసిన డబ్బు, ఊడిపోయిన రోజుల్లో పనికొచ్చేది. ఈ ఆర్థిక అనిశ్చితత్వం ఒకటి ఆయన్ను పీడించేది. ఇంకా యిద్దరు ఆడ పిల్లలకి తగిన సంబంధాలు వెతికి కట్నాలిచ్చి పెళ్లి చెయ్యడం, నా చదువు గట్టెక్కడం, ఆయనకు గుండెలమీద కుంపటిలా ఉండేది.

ఆలోచనలనించి తేరుకుని మళ్లీ ఉత్తరాలు తిరగెయ్యడం మొదలుపెట్టాను.

ఇంకో కార్డు—

''మై డియర్ కాంతం''—అని మొదలు. బాబయ్య పిన్నికి రాసిందది. పిన్నికి తెలుగు రాయడం చదవడమే అంతంత, పాపం, బాబయ్య యింగ్లీషులో సంబోధిస్తాడు—నవ్వొచ్చింది నాకు.

మరో శుభలేఖ.

వ్రాయు శుభలేఖార్థములు—

# "చెరిగిపోని గతంలోకి"

స్వస్తిశ్రీ చాంద్రమాన—సంవత్సర—

మా జ్యేష్ఠకుమార్తె లేటు వెంకయ్య బావగారి

ఆరవ కుమార్డు

సుబ్బమ్మను శరభయ్య కిచ్చి—

వగైరా, వగైరా—

ఎవరు చెప్మా—అఁ ! అమ్మ మేనమామ బావమరిది కూతురి పెళ్లన్నమాట ! అదే శుభలేఖ ప్రతులు మూడు న్నాయి ఒకే చిరునామాకి—

మా అమ్మ మేనమామ యించుమించు యిల్లరికం— మా అమ్మావాళ్లు వాళ్ల మేనమామ యింటి కెళ్లినప్పు డల్లా, వాళ్ల అత్తారు వీళ్లకి బట్టలు, పాతలు పెట్టి పంపడం—ఆ రోజుల్లో బంధుత్వాలల్లా ఉండేవి. ఎంత గుర్తుంచుకుని పంపించారో శుభలేఖలు !

ఈనాడు రాకపోకలు లేక, మాకు మా నాన్నగారి వంక బంధువులంతా కొత్తే—మొన్న మా దొడ్డమ్మగారు పోయా రని ఉత్తరం వచ్చి చూడ్డానికి వెళ్లి, మా పెత్తండ్రిగా రబ్బాయిని నేను, వాడు నన్నూ, గుర్తుపట్టలేక ఫలానావారు మీరేనా అని నే నడగడం—మీ రెవరని వా డడగడం—నేను చెప్పడం—ఆ పరిస్థితి కళ్లమ్మట నీళ్లు తెప్పించింది.

అంతుతెలియని రెండు మూ డుత్తరాలు కనిపిస్తే, చదగబ తిప్పేశాను.

మరో ఉత్తరం—

"ఏడాది కోసారి పారేసే 60 —రు. కోసం యిన్ని సార్లు అడిగించుకోవడం మర్యాదగా లేదు. పోనీ మీరు లేనివా ళ్లయితే అసలు అడగకనే పోదును. నాకు తరగనంత ఆస్తి ఉన్నా ఈ బాధ లేకపోను.

వెంటనే డబ్బు పంపిస్తారని నమ్ముతున్నాను.

తగువే మీకు ముఖ్య మనిపిస్తే మా ప్లీడరుగారి ద్వారా నోటీసు పంపిస్తాను—

ఇట్లు—"

ఈయన మా అమ్మ మేనత్తగారి భర్త. మా అమ్మ తాతగారు కూతుళ్లిద్దరికీ భూమి రాసిద్దా మనుకుని, ఆ రోజుల్లో ధాన్యం ధర బస్తా రూపాయిన్నర, ఎద్దు ఏడు మాడలు—కావడంచేత డబ్బిస్తేనే బాగుంటుందని, చెరి 360 — రూపాయలు సాలుకోసారి యివ్వ నిశ్చయించారు.

మా తాత లిద్దరూ పంచుకుంటే, ఒక్కొక్కళ్లకి చెరి సగం పంపకం వంత వచ్చింది. అందరూ ముగ్గురు మామ య్యలు పంచుకుంటే, ఒక్కొక్కళ్ల వంతుకు రు. 60 — పంపే బాధ్యత పట్టుకుంది. మా అమ్మగారి పెద్ద మేనత్తకి మొదట్లోనే అవసరమైతే డబ్బు యిచ్చేసి యీ బాధ్యత వదిలించుకున్నారు. పోతే, యీావిడకి పంపడం తప్పలేదు.

ఆస్తి పంచుకుంటే బాగానే ఉంటుంది గాని, ఈ అరవై రూపాయలు యివ్వడం అంటే మాత్రం, మహా బాధగా ఉంటుంది మామయ్యకి.

"ఇద్దాంలే, మించిపోయిం దేమిటి ?" అనుకుంటూనే అశ్రద్ధ చెయ్యడం, ఇల్లాంటి ఉత్తరాలు తెప్పించుకోవడం—

ఇంకా తిరగేస్తుంటే—1943 లో నాన్నగారు రాసిన ఉత్తరం కనబడింది.

కొల్హాపూరు,

"చి. సౌ. సరళకి— ............43.

నువ్వు మొన్న రాసిన ఉత్తరం అందింది. గౌరీ, వాణి, నానీలు పరీక్షలు బాగా రాశారని రాశావు—సంతోషం.

ఏణ్ణర్థం అయింది, మిమ్మల్ని చూసి.

నానీ ఏమన్నా ఎదిగాడా, అల్లాగే ఉన్నాడా ? మీరంతా ఒక ఫోటో తీయించుకుని పంపించండి—

మీ రందరికీ దూరమైపోయానన్న బాధ తప్పించి, యిక్కడ అంతా బాగానే ఉంది.

మొన్న పంపిన రెండు వందలు అందివట్టు, మీ అమ్మ యింకా రాయలేదు. కనుక్కుని వెంటనే రాయి.

మా కంపెనీవాళ్లు విశాఖపట్నంలో బ్రాంచి పెడు తున్నారు. అక్కడికి ట్రాన్స్‌ఫర్ చేయించుకునేందుకు ప్రయ త్నిస్తాను. అనుకూలిస్తే, మళ్లీ అంతా కలిసే ఉండొచ్చు.

అయినా భగవదేచ్ఛ ఎల్లా ఉందో ?

నువ్వు రాష్ట్రభాష పాస్ అవడం నా కెంతో ఆనందం కలిగించిందమ్మా !

మెట్రిక్‌కి కట్టడానికి ఎందుకు ప్రయత్నించవు? చూస్తూ చూస్తూ నీ మెడకి ఉరి నేనే తగిలించావమ్మా—

గౌరికి సంబంధాలు చూస్తున్నారా ? నాకు తెలిసి ఉన్న వరుల జాబితా యిందుతో జతపరుస్తున్నాను. మావ య్యతో చెప్పి ప్రయత్నించమను—

ప్రసాదానికి మాటిమాటికీ యీ మతి చలించడం— ఛీ ! యివన్నీ వింటూ ఏమీ చెయ్యలేక బ్రతికుండీ చచ్చినట్టే ఉన్నానమ్మా !

———"

తరువాతి ఉత్తరాలలో— నాన్నగారికి విశాఖపట్నం ట్రాన్స్‌ఫర్—ఆర్నెల్ల తర్వాత ఆ ఉద్యోగం వదిలెయ్యడం—

పెళ్ళి మరోటి—వాళ్ళు జబ్బు—ఆవిడ పోవడం—నాన్నగారి ఆరోగ్యం పాడైపోవడం—

గౌరికి సంబంధాలు చూస్తూం అవుతుందనీ, ఆరు నెల్లు విశ్రాంతి తీసుకున్నట్టు అవుతుందనీ నాన్నగారు మేం ఉన్న ఊరు వచ్చేశారు. గౌరికి సంబంధం కుదరనేలేదు—

తరవాత మళ్ళీ ఉద్యోగానికి దరఖాస్తులు పంపడం మొదలుపెట్టారు.

"అబ్బ! ఇంక కారు యివ్వని ఉద్యోగం చెయ్యలే నమ్మా!—ఇక్కడ ఆఫర్లు యిస్తామంటున్నారు. అయి తేంటిప్పుడు రాశిస్తే వస్తుంటాను. మెడ్రాసు, బెంగుళూరు హైదరాబాదు—ఏదో ఊరు కోరుకోమంటున్నారు. ఏవూరు ఎంచుకుంటావమ్మా—'' సరళని సరదాగా అడిగారు నాన్నగారు.

నాన్నగారిలో మరో గొప్ప విశేషం యిది—పిల్లలందరికీ ఆలోచించే అవకాశాన్ని కల్పించేవారు. వాళ్ళ బాధ్యతల్ని పెంచే వారు. చిన్నప్పటినించీ మా కందరికీ నాన్నగారి దగ్గర ఎకౌంట్సు ఉండేవి. డబ్బులు చేతి కివ్వకుండా తన దగ్గిరే ఉంచి యిప్పటికి నీ కింతయింది, అయినా ఒక్కొక్కళ్ళ పద్దులో వందలు, ఏమిలా చూపించేవారు. ఆ పద్దులు చూసి అందు లోంచే మాకు కావలసినవి యిస్తారు—అందులో అంకెలు తప్పుతా పోతాయేమోనసే భయంతో పిసినారులలా తయా రయ్యేవాళ్ళం మేం. ఉన్నవే చాలులే బాంక్ నించి ఎందుకు తియ్యడం అన్న తత్వం అలవాటై, ఆ రోజుల్లోనే దుర్వ్యయం చేసే అలవాటు లేకపోయింది మాకు—

సరళ పేజీపెట్టి, వేళ్ళ ఇటు తిప్పి, అటు తిప్పి లెక్కలు చేసి, చివరకు యిచ్చింది సమాధానం—

"హైదరాబాదు మరీ దూరం నాన్నారు! మెడ్రాస్ మాపేసెంచే—బెంగుళూరు అడగండి—'' అంది.

"అచ్చంగా నేనూ అల్లాగే అనుకుంటున్నానమ్మా—'' అన్నారు వెంటనే.

సరళక్క అంతా నాన్నగారి పోలికే. అందుకే బహుశః ఆ కిష్టాలూ అల్లాగే వచ్చాయి ఆమెకి—అప్పట్లో సరళక్క అంటే నాకు ఒక యమదూతలా కనిపించేది—అమ్మా, అమ్మమ్మా, ఆడుకుందుకు వెళ్ళమంటే—'ఒరేయ్ ఎక్కడికి! ఆ లెక్కలు చేశావా?' అని నిలవేసేది. నాకు ఏడుపు ముంచు కొచ్చేది. అమ్మమ్మ నాకు సపోర్టు ఇచ్చేది—"అబ్బ, అస్తమానూ చదువేనా—'' అంటూ. "మీరిల్లా వెనకేసుకొస్తే వాడు అసలు లెక్కతింటాడు. నీ అలును చూసుకు కాదూ వాడు చదువు ఎగేస్తున్నాడు—అదివి కొడుకులకి ఒకళ్ళకీ చుంపులు లేకుండా చేశావు—ఇప్పుడు ఇంక మనవళ్ళని పాడు చేసు కొస్తున్నావు—నువ్వూరుకుండూ!'' అంటూ మా అమ్మ మ్మని అంటుంటే, ఆవిడ అక్కని నాలుగు ఎందు కివ్వకోవా లనిపించేది.

కాని, యివ్వాళనిపిస్తుంది. సరళక్క ఆ రోజుల్లో అంత ఖాయిదాలో పెట్టకపోతే, నే నీనాడు ఎల్లా ఉండేవాణ్ణో? అని.

నెల్లాళ్ళ తరువాత నాన్నగారికి బెంగుళూరులో చేరమని ఆఫర్ వచ్చింది—

ఉద్యోగంలో చేరవలసిన రోజున—టి. బి. శానిటోరి యంలో చేరారు నాన్నగారు.

అంత క్రితం నించే కొద్దిగా జ్వరం, పొడిదగ్గు రావడం—వారం పదిరోజులకి కూడా తగ్గకపోవడం—విశాఖ పట్నం ఆస్పత్రిలో చూపించుకోవడం, వాళ్ళు ఎక్స్-రే తీసి టి. బి. అని తేల్చడం—తాంబరం శానిటోరియంలో చేర మనడం—అందుకు కారణాలు.

శానిటోరియం నించి సరళక్కకి రాసిన ఉత్తరాల్లో—ఆశా, నిరాశా—సంతోషం, సంతాపం—నెల్లాళ్ళల్లో డిశ్చార్జి చేస్తారనీ—కాదు, మళ్ళీ ఇంకో మూడునెల్లు ఉండమంటున్నా రనీ—డబ్బు నీళ్ళల్లా ఖర్చయిపోతూందని బాధా—పక్కనున్న కన్నడం పేషెంట్ దగ్గర్నుంచి కన్నడం నేర్చుకోవడం—

నాన్నగారిలో యిదొకటి—ఏ ప్రాంతానికి వెడితే ఆ భాష తప్పక నేర్చుకునేవారు. అందులో పుస్తకాలు చదివేవారు. ఆఖరికి అనారోగ్యంగా ఉండి ఆస్పత్రిలో ఉన్నా, అప్పుడు కూడా యీ భాషలు నేర్చుకోవాలనే ఆకాంక్ష అయున్ని పదలలేదు—సాహిత్యప్రియులైన స్నేహితు లందరికీ పద్యాలలో రాసేవారు ఉత్తరాలు—

ఇంకా తిరగేశాను.

గౌరిపెళ్ళి శుభలేఖ—

ఒక టెలిగ్రాం—'రాలేను. పెళ్ళి ఆపవద్దు' అని.

దాని పక్కనే నాన్నగారి ఉత్తరం—గౌరి పెళ్ళి తేదీ దానిమీద—శానిటోరియం నించి—నాలుగు భాగాలు. సర ళక్కకి, గౌరికి, అమ్మకి—మామయ్యకి—

చి. సౌ. సరళకి,

బయలుదేరడానికి అన్ని ఏర్పాట్లు చేసుకున్నాను. కాని డాక్టర్ చూసి 'బొత్తిగా నీరసంగా ఉన్నారు—నాలుగు వందల మైళ్ళ ప్రయాణం పనికిరాదు— మొండికేసి వెళ్ళారో పరి స్థితి ప్రమాదిస్తుంది. ఇంక నాలుగు నెల్లు ఓపికపడితే

పండుగా యింటికి వెళ్లిపోవచ్చు. ఒంటేరి యిప్పుడు మొండికి వెయ్యవద్దు—' అన్నాడు.

కడుపు తరుక్కుపోయింది దుఃఖంతో—

ఏం చెయ్యను ?

మీరంతా ధైర్యం చిక్కబట్టండి—దైవేచ్ఛ యిల్లా ఉంటే తప్పేదేముంది ? నా కూతురికి కన్యాదానం చేసుకునే అదృష్టం నాకు లేకపోయింది. నా చేతులతో చేసిన నీ పెళ్లి అల్లా అయింది. ఇది నేను చెయ్యకపోవడం మంచికే వచ్చిందని సమాధాన పడ్డాను.

పెళ్లి మాత్రం ఆపవద్దు.

నువ్వు ప్రసాదం పీటలమీద కూర్చుని కన్నె ధార పొయ్యండి.

సంతోషంగా గౌరిని అత్తవారింటికి పంపండి—

నాకింక నాలుగు నెల్లల్లో తగ్గిపోతుంది.

రోజు లెల్లకాలం యిల్లాగే ఉండవు. బాగుపడే రోజులు వచ్చినప్పుడు ఈ నిస్పృహ గుర్తుకే రాదు.

నామీద ఒట్టు—పెళ్లి మాత్రం ఆపవద్దు"

కన్నీళ్లతో, నాన్నగారు రాకుండానే కన్యాదానం చేశారు గౌరికి. ఊరంతా విడ్డూరంగా చెప్పుకున్నారు—

ణ్ణార్థం తర్వాత తేదీలతో వచ్చిన ఉత్తరాలు—నాన్న గారి మృతికి సంతాపం వెలిబుచ్చుతూ ఆయన స్నేహితులూ చుట్టాలూ రాసినవి.

ఆ ప్రాంతాలలోనే టెలిగ్రాం—

'గోపాలానికి ప్రమాదంగ ఉంది. వెంటనే బయలు దేరండి -'గౌరి బావగారి పేరుతో—

నాన్నగారు పోయి నెల కాలేదు. ఇంతలో ఈ పిడుగు లాటి వార్త ఏమిటని యిల్లంతా గొల్లుమంది. గౌరిని పట్టుకో లేకపోయాం.

మొన్నాడు పొద్దున్నే మళ్లా టెలిగ్రాం వచ్చింది. ప్రమాదమేమీ లేదని.

అయినా గౌరి వెళ్లిపోతానని పట్టుపట్టడంచేత మామయ్యనిచ్చి పంపేశాం.

తరవాత గౌరి రాసిన ఉత్తరం -మామయ్య కథనం వింటే నవ్వాలో, ఏడవాలో అర్థంకా దీనాటికి.

విరహం భరించలేక గౌరిని పిలిపించడానికి గోపాలం బావ వేసిన ఎత్తన్నమాట ఇది '

తరువాతి ఉత్తరాలు చాలావరకు గౌరివి—అక్క ఒక్కతే పిల్లని—బాబయ్యా.

బావగారి ప్రమోషన్—దీపావళికి కొనుక్కున్న చీరా—మైసూర్ వెళ్లడం—మొన్న చూసిన సినిమా—తను అల్లిన స్వెట్టర్లు—ప్రయాణాలు—వీటిని గురించి—

మరో రెండేళ్ల తరువాతి ఉత్తరాల్లో—

మాతృమూర్తి అయిన గౌరి అక్క—పెద్దపిల్ల మణి పసిడి పలుకులు—తడబడే నడకలు—మణి ఉమ్మడం—మణికి ఒక డిగ్రీ జ్వరం రావడం—మణి తన్నేపని చేసుకోనివ్వక పోవడం—ఆదివరలో తనపిల్ల క్లీన్‌గా ఉండాలనే తాప త్రయం, మణి అల్లరి ఎక్కువగా సాగకపోవడం—ఇత్యాదులు—

అప్పటినించి అక్కడక్కడ నా ఉత్తరాలు—

యూనివర్శిటీ వాతావరణం —చదువు —పరిస్థితులు—చదివిన కథలు—పద్యాలు యిచ్చిన ఉపన్యాసాలు—పరీక్షల నిస్పృహ—చూసిన సినిమాలు.

ఈమధ్య నున్న ఉత్తరాల్లో గౌరి దగ్గర్నించి వచ్చిన వాటిల్లో ఏణ్ణర్థాని కొక పిల్ల చొప్పున పెరగడం—మణి తరవాత రాణి—బాబి—ఇదికాక వాళ్లు బెంగుళూర్ నించి మెడ్రాస్ తరలడం—బావగారు సొంతంగా కంపెనీ పెట్టు కోవడం—

1954—మన ఉత్తరం.

అంటే ఆనర్స్ పరీక్షల ముందు దన్నమాట. అప్పటి నా మనఃస్థితి ఎలా ఉందోనని చదవడం మొదలుపెట్టాను.

"సరళక్కా !

నిన్ను పేరుతో పిలవడం నేర్పిన సుందరమ్మగార్ని ఇతర విషయాలు వదిలేస్తే—అభినందించక తప్పదు. బొడ్డూడని వెధవని నేను నిన్ను సరళా ! అని పిలవడం ఆమె భరించ లేకపోవడం ఎంత ఉపకారం చేసింది ?

ఇప్పటిదాకా చదివి చదివి బోరుకొట్టేసింది. పడు కుందామంటే యిందాకా తాగిన టీ నిద్రాదేవతకూ నాకూ విరోధం కల్పించింది. అయినా గుండెలమీద కుంపటిలా పది హేను రోజులలో పరీక్ష లుంటుంటే నిద్రెక్కడ పట్టి చస్తుంది? పానీయంబులు త్రావుచున్'—' లో లాగ నాకిప్పుడు కనబడేదల్లా ఒక్కటే ! పరీక్షలు.

ఎంత చదివినా ఏమిటో స్థైర్యం ఉండడం లేదక్కా ! మూడేళ్ల కోర్సు ముప్ఫై ఏళ్లకి సరిపడుతుందేమో ననిపి

స్తుంది. ఎంత చదివినా తరగని పుస్తకాలు. చదువుతున్నంత సేపూ అంతా తెలిసినట్టే ఉంటుంది. పుస్తకం మూస్తే అంతా అనుమానమే.

పరీక్ష పోతే మూడేళ్ల చదువు వృథా అయిపోతుం దనే బెంగపీడించి కొంత చదువు ఎక్కకుండా చేస్తోంది. కర్మ కాలి ఆ మూడు గంటల్లోనూ తలనెప్పి వచ్చినా చాలు నా ప్రాణానికి.

మన కెంత వచ్చినా ఆ మూడు గంటలో రాసిన దానిమీదే గదా ఉంటుంది ఫలితం!

కన్ను మూస్తే పీడకల లొస్తున్నాయి. మొన్నొకటి వచ్చింది. ఎంతో బాగా చదివి నాకు బాగా వచ్చిన పేపర్ రాస్తున్నానట! ఒక్కసారిగా బుర్ర ఖాళీ అయిపోయిందిట! ఆలోచించుకున్నా ఏమీ జ్ఞాపకం రాదుట! అరగంట తరువాత పేపరిచ్చి వెళ్లిపోయానుట! తల్చుకుంటే వణుకోస్తోంది. అటువంటివి జరుగవని నిశ్చయంగా చెప్పలేం—అక్కా— ఒకలే నిజమైతే—ఇంక నా కాత్మహత్యే శరణ్యం.

రోజూ రాత్రి రెండు మూడూ అవుతూంది పడుకునే సరికి.

బొత్తిగా బోరెత్తిపోతోందని ఇవాళ మధ్యాహ్నం ఒంటి గంట - మేటినీకి 'శకుంతల' కి వెళ్లాను. పదేళ్ల క్రితం తీసిన చిత్రం! ఆ రోజుల్లోనే శాంతారాం ఎంత బాగా తీశా డక్కా! మతి పోయింది నాకు.—జయశ్రీ—మొన్న మొన్నటి పర్‌ఫాయ్‌కీ అప్పటికీ అట్టే తేడా ఏంలేదుస్మా!

ఇంతటి నిరుత్సాహం, నిర్లిప్తతల మధ్య నీ ఉత్తరాలే నాకు అమృతసదృశాలక్కా! గౌరి దగ్గర్నించి ఉత్తరాలు వస్తున్నాయి. మణిని స్కూల్లో జేర్పించారుట. నీకు రాయడ మేమిటి నేను, నా వెర్రిగాని. నీకే ముందర రాయదూ—గౌరి.

మొన్నటి మా కాలేజీ కథలపోటీలో నాకు మొదటి బహుమతి వచ్చింది. పన్నెండు రూపాయల పుస్తకాలు యిచ్చారు.

అందులో విరాజ్ బహు శరత్‌ది—ఒకటి.

బలహీనత విజృంభించగా—పుస్తకాలు అవతలకు నెట్టేసి అది చదివేశాను. కళ్ల నీళ్లు కాల్వలు కట్టాయి. మా రూంమేట్ అది చూసి అంత బలహీను లేమిటండీ మీరు —పుస్తకం చదివి ఏడుస్తా రేమిటి ? అన్నాడు.

నాకూ నిజమే ననిపించింది. అవును, వెధవది పుస్తకం చదివి ఏడవడ- మేమిటి ? ఇంత బలహీనుణ్ణి నే నింక సాధించే దేమిటి ? కాని, మన అనుభూతులను నిగ్రహించే శక్తి మన మనస్సు కెందుకు లేదో ?

నువ్వు ఇంగ్లీష్ బాగా అభివృద్ధి చేశావ్ ? మెట్రిక్ కట్టరా దక్కా. నువ్వు ఎన్నాళ్లనించి పోరుతున్నా నిర్లిప్తంగా ఊరుకుంటావేం ? మన చేతులలో లేనివాటిని మనం నిశ్శబ్దంగా భరించి ఊరుకోవడం తప్ప ఇంకేమీ చెయ్యలేం సరే! కాని మన చేతిలో ఉన్నదాన్ని కూడా ఉదాసీనంగా జార విడుచుకుంటే ఎల్లా ? నీ తమ్ముడు యింక కుర్రాడు కాదమ్మా—నిన్ను నా కళ్లల్లో పెట్టుకుని ఆదరిస్తానమ్మా!—

ఇంటి విషయాలు ఎంత వద్దనుకున్నా తలంపుకి రాక తప్పడంలేదు. ఇంక ఆ ధ్యాస వచ్చిందంటే పరీక్షలు కాదు, ఏ భయం చూపెట్టినా, ఏమీ చదవలేక పోతున్నాను.''

ఇల్లా ఉంది ఉత్తరం అంతా. ఇప్పుడు తల్చుకుంటే నవ్వు వస్తుంది. కేవలం పరిస్థితులవల్ల మనస్తత్వాలు ఎంతగా మారిపోతాయి ?

ఇవాళ నన్నడిగితే ఆనర్స్ పాసవడం అంత సులువు యింకోటి లేదంటాను. సబ్జెక్ట్సు ఏవీ రాకపోయినా పదేళ్ల పేపర్లు చూసి తరుచు వస్తున్న ప్రశ్నలు కంఠతా పట్టి ముక్కున పెట్టుకువెళ్లి, అక్కడ ఎక్కించి వచ్చేస్తే Class I తప్పదు. వెనకటికి మా రూంమేట్ అనేవాడు— ''మనకి అర్థంకావడం ఎందుకండీ! మనం రాసింది దిద్దేవాడి కర్థమైతే చాలు మనం గట్టెక్కడానికి.'' అది పరమ సత్యం.

పరీక్షల ముందు రివిజన్‌లో మా పిల్లలికి నే నిదే బోధిస్తాను. ఏడాదల్లా కష్టపడి మనం చెప్పింది వీళ్లెలాగూ పట్టించుకోరు. వాళ్లకి కావలసింది పరీక్ష ప్యాసయ్యే మార్గం. ఆఖరిక్షణంలో మనం చెయ్యవలసిందీ అదే అనిపిస్తుంది నాకు.

ఇంకా తిరగేస్తే—గౌరి ఉత్తరాల్లో వాళ్ల కంపెనీ అభివృద్ధిని, వాళ్ల మణికి స్కూల్లో రాంక్‌లు రావడం—, వాళ్ల చదువంతా ఇంగ్లీషు మీడియంలోనే సాగడం—తను తమిళం లిపి నేర్చుకుని పుస్తకాలు తెగ చదివెయ్యడం— (గౌరికి మా నాన్నగారి అంశలో భాషలమీది వ్యామోహం వచ్చింది. బెంగుళూరులో కన్నడం తిరిచి వదిలిపెట్టింది.)— తరువాత పుట్టిన ఉష, తారలని గురించీ—

ఇంకా తిరగేస్తుంటే మా అనసూయ దస్తూరి కనబడి ఆగాను. ఏడాది క్రితం ఉత్తరం అది—

''వదినగార్కి అనసూయ నమస్కరించి వ్రాసేది :

ఈమధ్య మీ దగ్గర్నించి ఉత్తరాలు బొత్తిగా లేవు. కారణం తెలీదు. మీ తమ్ముడికీ నాకూ పోట్లాట లేని క్షణం

ఉండడంలేదు—మీరొచ్చి ఒక్కసారి నాలుగూ ఝాడించక పోతే నా పరువు నిలిచేటట్టు లేదు.

నా కర్మ కాలి ఆయనకా కథల పిచ్చి ఒకటి. రాసినవి సగం తిరిగి వస్తున్నా మానరు. ఆ సగం కూడా పత్రికల వాళ్లు వేసుకోవడం మానేస్తే బతికిపోదు నేను.

ఇవాళ యింట్లో ఒక చిన్న గొడవ జరిగితే దానికి వన్నెలు, చిన్నెలు తగిలించుకుని మరో పక్షానికి ఏ పత్రిక లోనో తయారవుతుంది. ఇల్లా ఇంటిగుట్టంతా బట్టబయలు చేసుకుంటే నే నెక్కడ చచ్చేది ? తనని ధర్మరాజులా చిత్రించు కుని నన్నో తాటకిలా వర్ణిస్తారు. ప్రతీ కథలోనూ తప్పంతా నాదే అయి, నేను తన్ని క్షమాపణ కోరడం అంతఘట్టం !

మీరన్నా మందలించకపోతే నేను విడాకు లిచ్చేసి మావాళ్లింటికి చక్కా పోతాను.

నెలకో పాతికో పరకో ఎక్కువ రావడం, నా ఖర్చుల నేమీ ఆయన అరికట్టక పోవడం బాగానే ఉన్నాయి కాని— నన్ను వదిలేసి, లోకంలో ఇంకెంతమందో ఉన్నారు, వాళ్ల నిరి కించి రాసుకుంటే నాకే అభ్యంతరం లేకపోను.

మొన్న ఎరియర్స్ వస్తే అందులో మూడు వందలు పెట్టి, మీకూ, గౌరి వదినగారికీ, నాకూ మూడు కాశ్మీరు పట్టుచీరలు కొన్నారు. మేం వచ్చేటప్పుడు పట్టుకొస్తాం అవి.

డబ్బు నీళ్లలా వాడే అలవాటూ, స్నేహితులుంటే నన్ను మర్చిపోయే అలవాటూ మాత్రం వదులుకోలేక పోతున్నారు.

రోజూ సాయంత్రం ఇంటి కెవరో తయారౌతుంటారు, ఇంక మిన్ను విరిగి మీద పడ్డా, ఇంట్లో వంటకి సరుకు లున్నా, లేకపోయినా ఆయనకి ఏ పట్టింపు ఉండదు. గట్టిగా అడిగితే ఉపవాసా లుండ మంటారు.

ఉండి దరిద్రం అన్నట్టు ఏమిటీ అవస్థ. అప్పు కెళ్లడం అంటే అసహ్యం నాకు.

అత్తయ్య తన కొడుకు నెన్నమకున్నా నే నంటే మాత్రం ఓర్చలేరు. ప్రతిదానికీ కొడుకుని వెనకేసు కొస్తుంది.

మొన్న నాకు కోపం వచ్చి "మీరిల్లా ఆయన్ని వెన కేసుకొస్తే యింకీ యింట్లో అన్నం తిన్నానే !" అన్నాను. అంటే ఆవిడ—మీ అమ్మగారు ఏమందో తెలుసా—"పని పాటా లేకుండా ఆ అడ్డమైన చెత్త పుస్తకాలూ చదువుతూ కూర్చోకపోతే నువ్వెళ్లి తెచ్చుకోరాదూ ?" అంటూ ఉప న్యాసం మొదలుపెట్టారు. నాకు దుఃఖం ఆగలేదు.

కాని, తప్పేదేముందీ—నెలనెలా సరుకులు తెచ్చు కోవడం ఒక పనై కూర్చుంది.

మీమీద ఎన్నో ఆశలు పెట్టుకుని రాస్తున్నా నివే. తప్పకుండా మీ రాయన్ని నాలుగూ దులిపెయ్యాలి. మీరేన్నా అన్నా పల్లెత్తి మాటాడకుండా ఉన్నీ మింగేస్తారు గరళ కంఠుడిలా. నేనంటే బొత్తిగా భయంలేకుండా పోయింది.

అందర్నీ పేరు పేరు వరసన అడిగానని చెప్తారుగదూ—

ఇట్లు,
అనసూయ"

నాకు చెమటలు పట్టాయి.

హాసీ నీ అసాధ్యం కూలా ! అనుకున్నాను.

తనే ఆట ఆడినా తగ్గ తాళం వేస్తుంటే నా కొచ్చిన లాభం యిదీ ! ఎంతకైనా తగుదురీ ఆడవాళ్ళు.

"ఇల్లిల్లా బార్లాపెట్టి ఎక్కడి కెళ్లావురా ?" అమ్మ కేకతో ఉలిక్కిపడ్డాను.

"నిన్ను నమ్ముకుంటే కుక్క తోక పట్టుకుని గోదావరి యీదినట్టే—ఏ దొంగలో దోచుకుపోయినా దిక్కులేదు గదా— ఏమైంది, తాళంచెవి కనబడిందా ? పన్ను రశీదులు ? గుడ్లు మిటకరిస్తా దేమిటమ్మా — ఈ కొత్త దానికే యిల్లా లయి పోయినవాడివి నువ్విల్లు కట్టించే దేమిటి ?"

# కానాల నరసింహ కవి



## శ్రీ తురగా కృష్ణమూర్తి

భారతి సంపుటం 40 సంచిక 7 కలగూరగంపలో శ్రీ టి. మోహనరావుగారు కానాల నరసింహకవిని గూర్చి ప్రస్తావించుచూ పీఠ ఎనిమిది యాశ్వాసములుగల "శేషధర్మములు" అను గ్రంథము రచించినవానిగా నుగ్గడించియున్నారు. వారికి లభ్యమైన గ్రంథములోని వంశావతార వర్ణనసుబట్టి, కవి వంశవృక్షము నీ దిగువ విధముగా నిచ్చియున్నారు:

అహోబిల మంత్రి వంశమున
వెంగామాత్యుడు
కృష్ణయామాత్యుడు
వేంకటేశయామాత్యుడు
నరసింహకవి

నరసింహకవి నందవరీక బ్రాహ్మణుడు. వశిష్ఠగోత్రుడు. తరిగొండ నృశింహ వరప్రసాద సమాసాదిత కవితా సామ్రాజ్య ధురీణుడు. అందుచేత నాతడు తన గ్రంథమును నరాంకితము గావింపక, తరిగొండ నృశింహునకే అర్పించెను. పూర్వ కవుల మార్గమున నీతడు సుకవిస్తుతి, కుకవి నిందల నొనర్చుట మానలేదు! సుకవిస్తుతిలో:

లలితచిత్ర కౌశల విచారు మయూరు
తాకిన్‌జయ మహోద్దండి దండి
పటుతర కావ్య సంభవ భూతి భవభూతి
కలితర సోల్లాసు కాళిదాసు
విద్య జనాచార్యు నన్నపార్యు
సుజన గణ మానిసోత్పల సోముసోము
సురుచిరాలంకృత భ్రాజి సోమయాజి
కవిసనాథు శ్రీనాథు.

అని గణ, యతి భంగ సీసపద్య పాదములలో పూర్వ కవుల ప్రస్తుతించినాడు. ఈ పద్యము తరువాతి భాగము కొంచెము శిథిలమైనట్లున్ను, దీనికి తోడు కుకవి నింద నొనర్చిన భాగము గూడ శిథిలమై యుండినట్లును శ్రీ మోహనరావుగారు తెల్పియున్నారు. ఈ విషయములను సారస్వత ప్రియుల కందించుచు, నీ గ్రంథమును చూచినవారుగాని కవిని గూర్చి తెలిసినవారుగాని మరికొన్ని విశేషములను పత్రికా ముఖమున వెల్లడించి సారస్వతసేవ నొనర్పవలసినదిగా నభ్యర్థించినారు.

ఈ అభ్యర్థనమును పురస్కరించుకొని, భారతి మరునటి సంచికలో "ఒక పరిశోధకుడు" నరసింహకవిని గూర్చి కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ "కవి జీవితము"లో నుల్లేఖించిన కానాల నరసింహకవి విశేషోదంతము నుద్ధృతించుచూ, శ్రీ పంతులుగారు వెలిబుచ్చిన యభిప్రాయములను యథాతథముగా నుదహరించి, కాల నిర్ణయము చేయ ప్రయత్నించి శ్రీ పంతులుగారుట్టంకించని తరిగొండ వేంకమాంబ చరిత్రము నుగ్గడించి, కానాల నరసింహకవి వంశమునకును తరిగొండ వేంకమాంబ వంశమునకును గల గోత్రవంశాదికముల యేకత్వ ప్రాధాన్యతను గూర్చి చర్చించి, తరిగొండ వేంకమాంబ క్రీ. శ. 1794—1877 ప్రాంత కాలము నాటిదౌటచే నామె తండ్రి కృష్ణార్యుడు క్రీ. శ. 1750—60 మధ్య కాలమునం దుండినవాడై యుండియుండవలెననియు, తా మూహించినట్లు నరసింహకవి కృష్ణయామాత్యుని (కృష్ణార్యుని) మనుమడే యైన వెంగమాంబ నెఱింగియుండి యుండవలెననియు, కాని గ్రంథమున నట్టి సూచన లేమియు గాన్పింపవనియు నస్తి నాస్తి విచికిత్సా హేతువాదములో పడిరి. వెంగమాంబయు తన తాతపేరుదహరింపనందున నరసింహకవి వంశములోనివారికినీ, వెంగమాంబ కవయిత్రి వంశములోనివారికినీ గల సంబంధమును నిర్ణయింప వీలుకలుగుటలేదనియు వ్రాసినారు. శ్రీ వీరేశలింగం పంతులుగారిచ్చిన "సత్కవి సనాథు శ్రీనాథు నన్నుతించి" యను పాఠము నాధారము చేసుకొని క్రీ. శ. 1460 ప్రాంతము తరువాతివాడని నిశ్చయము చేయవచ్చుననుచునే, శ్రీ పంతులుగారు నిర్ణయించిన క్రీ. శ. 1750 సంవత్సరము కవికాలమై యుండ వచ్చునని యంగీకరించుచు, తరిగొండ వేంకమాంబ చరిత్రాధారముగా చూచినను యాతడు క్రీ. శ. 1800 ప్రాంతమువాడనుటకు సందేహింప నవసరములేదని నిర్ధరించుచు గ్రంథ

మెప్పుడు వ్రాయబడెనో తెలుసుకొననిదే తమ నిర్ణయము నిశ్చితము గాదని వక్కాణించి యున్నారు.

వీ రిరువురి వ్రాతలనుబట్టి చూచిన శ్రీ మోహనరావు గారు ప్రయత్నించక విడిచివైచిన కవికాల నిర్ణయ కార్యమును సాధింప "నొక పరిశోధకుడు" పరిశ్రమించి, లరి గొండ వెంకయరాజ చరిత్రము నీ కవి చరిత్రముతో జోడించి, సమన్వయింప ప్రయత్నించి, తుదకు శ్రీ వీరేశలింగం పంతులు గారు వచ్చిన నిర్ణయమునకే వచ్చి, కవికాలము క్రీ. శ. 1750—1800 లుగా తాత్కాలిక నిర్ణయ మొనరించి నట్లు తేలినది.

ఈ నిర్ణయము లోపభూయిష్ఠమని "ఒక్క పద్యములో ఒకరి పేరు చెప్పినంత, కవి వారి తరువాతివాడని గ్రహింప వచ్చును. ఎన్ని ఏండ్ల తరువాత అనునది తరువాతి ప్రశ్న. కాని— ఒకరినిపూర్చి వ్రాయనంత మాత్రమున వారికి బూర్వుడని నిర్ధా రణ సేయుట సబబెంత ? ఆ పద్యములో పెద్దన ప్రసక్తి లేక పోవుటకు కారణము పాదములు లేకపోవుటయే కావచ్చును. ఇంతకు అది సీసమాల కాదు. పైగా పెద్దల యెడల ఈనాటి మనకున్న భక్తి ప్రపత్తులు ఆనాటి నరసింహకవికి లేకపో వచ్చును. శ్రీ శాస్త్రిగారి కాలనిర్ణయము (శ్రీ వేదము వేంకట రాయ శాస్త్రిగారి "మొల్ల కవయిత్రి కాలనిర్ణయము") కూడ కొంత ఈ పద్ధతిలోనే జరిగినది. ఈ పద్ధతి ఎంతవరకు సమంజసమో విపులీకరించమని వీ రిరువురనూ సవినయముగా ప్రార్థించుచున్నాను" అని శ్రీ వి. ఎ. కె. రంగారావుగారు భారతి సెప్టెంబరు సంచిక కలగూరగంపలో తమ వేడికోలును ప్రచురించినారు.

అంతతో బోక వారు పై యిరువురి దృష్టిలో మొల్ల రచించిన "సురసన్నుతజ్ఞాను సువివేకి వాల్మీకి, నఖిల వేదాగ మాఖ్యానువ్యాసు" అను సీసపద్యము పడక తప్పించుకొన్నదనియు ఆ పద్య రచనా విధానమును గమనించినచో నీ రెండు పద్యము లలో పలుకు, భావ, శబ్దములలో పోలికలు కొన్ని ప్రస్ఫుట ముగా గానుపించుచున్నవనియు, ఈవిధమైన భావ, శబ్ద సాన్నిహిత్యము మొల్ల కవయిత్రికి, కానాల నరసింహకవికి మరొక విధమైన సాన్నిహిత్య ముండవచ్చునని సూచించుచున్నదనియు, అది ఎటువంటి సామీప్యమో—కేవలము కాల సామీప్యమో లేక మరొక విధమైనదో పెద్దలు, పండితులు తేల్చవలసిన విషయ మనియు, పై రెండు పద్యములలో పోలికలు ఎత్తి చూపుటకు కారణము, పరస్పర కాలనిర్ణయము సేయుట కవి తోడ్పడవచ్చుననియే యనియు శ్రీ రంగారావుగారు తెల్పి యున్నారు.

శ్రీ రంగారావుగారి వ్రాతనుబట్టి శ్రీ వీరేశలింగం పంతులుగారి ననుసరించి "ఒక పరిశోధకుడు" చేసిన కవికాల నిర్ణయము సరికాదనియు, వారి కాల నిర్ణయ విధానము సమర్థమైనది కాదనియు, తాము ప్రతిపాదించిన గాఢనిర్ణయము దృష్ట్యా కవికాల నిర్ణయము జరిగినను దాగదనియు మనియుని వారి వ్యాసము ముగియుచున్నది.

శ్రీ మోహనరావుగారు చూపించిన పద్యములోని సుకవిస్తుతి పూర్వక సీసపద్యములో మొల్ల "...వన్న జనాచార్యు నన్నపార్యు, సుజన గుణాభాసితోన్నతు సోము సోము, సురుచిరాలంకృత భ్రాజి సోమయాజి, సత్కవీనాథు శ్రీనాథు" యన్న అసంపూర్ణ, సీస పాదములు మాత్రమే చూపినను శ్రీ వీరేశలింగం పంతులుగారు తమకు లభించిన ప్రతిపై ఆధారముగా సవరించినది:

"ఉద్ధవ వన్న జనాచార్యు నన్నపార్యు (?)
సుజన గుణాభాసితోన్నతు సోము సోము
సురుచిరాలంకృతి భ్రాజి సోమయాజి
సత్కవీనాథు శ్రీనాథు సన్నుతింతు."

అని నిర్దుష్ట పాఠమును ప్రకటించి, కొంతలో కొంత విషయనిర్ణయమునకు తోడ్పడినారు. ఈ పద్య మాధా రము చేసుకొనియే మనము కవికాల నిర్ణయము సేయ ప్రయ త్నించవలసి యున్నది.

మొల్ల తన రామాయణములో చేసిన సుకవిస్తుతి విధానమునకు నరసింహకవి తన "శేషధర్మముల" లో చేసిన స్తుతి విధాన మునకు భేద మంతగా కన్పట్టలేదు. మొల్ల గీర్వాణకవుల నీ వరుసగా నుగ్గడించినది : వాల్మీకి, వ్యాసుడు, భారవి, మాఘుడు, భవభూతి, భట్టబాణుడు, శివభద్రుడు, కాళిదాసు; నరసింహ కవి, వరుసగా మయూరుని, దండిని, భవభూతిని, కాళిదాసుని (ఆతరువాత సీసపాదములు శిథిలములైనవి) వర్ణించినాడు. మొల్ల ఆంధ్ర కవులలో నాచన సోముని, భీముని, నన్నపార్యుని, శ్రీనాథుని, రంగనాథుని, తిక్కన కవిరాజును స్తుతింపగా నరసింహకవి నన్నయను, నాచనసోముని, తిక్కనసోమయాజిని, శ్రీనాథుని ప్రశంసించి విడిచినాడు. ఈ రెండు పద్యములలోను శబ్దాలంకారమందేమి, భావస్ఫురణమందేమి, పలుకు సుడికారము నందేమి మొల్ల, నరసింహకవుల రచనా విధానము లొకదానితో నొకటి పోలియున్నవనుట కాదనరాని సత్యము. కాని—పవుల వరుసక్రమ మెన్నుకొనుటలో మొల్ల త్రొక్కిన మార్గము వేరుగా నున్నది. వీ రిరువురును భారత కవిత్రయములో నెఱ్ఱాప్రెగడను ప్రస్తుతింపక విడిచివైచినారు ! మొల్ల, నర

# కానాల నరసింహకవి

అని వ్రాసికొని యున్నందువలన వెంగమాంబిక స్త్రైకోడు "కృష్ణుండు" కాని "వేంకటేశుడు" గాదని స్పష్ట పడుచున్నది. అదియునుగాక వేంగమాంబ తల్లి మంగ మాంబిక కాగా, వేంకటేశుని తల్లి "తిమ్మమాంబ" యగు చున్నది! కావున వెంగమాంబయు వేంకటేశయామాత్యుడును యేకగర్భజనితులు కారు! ఆ విధిని కృష్ణార్య పుత్రికయగు వెంగమాంబకు, కృష్ణయామాత్య పౌత్రుడగు నరసింహ కవికి యెట్టి సమకాలీనత్వసంబంధ మూహింప వలను పడదు. ఆ కారణమున వేంగమాంబ జీవితకాలముతో ముడి పెట్టి నరసింహకవి జీవిత కాలనిర్ణయ మొనర్ప యత్నించుట తగనిపని.

కానాల నరసింహకవి నందవరీక వంశమున జనించినవా డౌటచే తమ నందవరీకులలో సుప్రసిద్ధులైన పెద్దవాది కవుల ప్రసక్తి తేక విడుచుట కేదియో ప్రబల కారణ ముండియుండవలెను. లేనిచో ప్రబంధ కవులలో పేరెన్నిక గన్న "ఆంధ్రకవితా పితామహుడు" "పెద్దన"ను పరిహ రించి సుకవిస్తుతి చేయుట నిజముగా నభిశంసింప దగ్గదే!

శ్రీ రంగారావుగా రనినట్లు పెద్దనను వర్ణించుటకు సీసపద్యములో పాదములు దొరకకపోవుటయు, పెద్దన యందు మనకున్న భక్తి ప్రపత్తులు నరసింహకవికి లేకుండ పోవుటయు కారణములుగా చెప్పి సంతృప్తిపడుట ఉత్తమ లక్షణ మనిపించుకొనదు! ఇందులకు ప్రబల కారణ మేదియో యుండవలెను. సమయ మాసన్న మైనప్పుడు ప్రతిభా వ్యుత్పత్తులు గల తమ స్వకులమువాని నెగ్గించుకొనక విడిచి యూరకుండు వెంగలితన మెందైన యుండునా ?

అల్లసాని పెద్దన క్రీ. శ. 1470 ప్రాంతమున జన్మించి, నలుబది యేండ్ల వయస్సున రాయల యాస్థాన ప్రవేశభాగ్యము గాంచి, క్రీ. శ. 1533 ప్రాంతమున చని పోయెనని తత్ చరిత్రకారులు వ్రాసియున్నారు. అందుచే నరసింహకవి "శివధర్మముల" రచించునాటికి "పెద్దన" జనించియుండలేదనియే చెప్పవలసి వచ్చుచున్నది. కావున సగోత్రీకుడును, స్వకుల సంజాతుడును, కవితా పితామహుడున్న నగు పెద్దనను ప్రస్తుతించు భాగ్యము నరసింహకవికి పట్టలేదు! లేనిచో—కృష్ణరాయలచే సకలసన్మాన మర్యాద లంది, అష్టదిగ్గజములతో మేటియై, ఆంధ్ర కవితా పితా మహు డల్లసాని పెద్దన యను బిరుదము వహించి, గండ పెండేరమును డాకాల రాయలచే నలంకరింపబడి, కృష్ణ రాయం మరణానంతరాధిరోహణ గౌరవమును, త్రిభువన కైవంద సాహాయ్యమును పొంది, కవితాలోక మెల్ల కైవారము ఘటింప కీర్తిగాంచిన స్వకులజుని కీర్తింపక విడిచి నరసింహ కవి పరిహాసభాజను డగుట సంభవింపదు!

ఇంకొకమాట చెప్పి యీ వ్యాసమును ముగించెదను. "శివధర్మముల' రచించిన కవులు మరి ఆర్గురు కనిపించు చున్నారు. వారు—తామరపల్లి తిమ్మయ, వెణుతురుపల్లి సిద్ధ నాథకవి, బమ్మ సిద్ధకవి, తరిమెళ్ల రామకవి, అల్లసాని రంగశాయకవి, శ్రీనివాసకవులు. ఇందు కొన్ని ప్రకటితము లును, కొన్ని అముద్రితములై యున్నవి. ఇవిగాక వచన గ్రంథముగా శ్రీ శతగోపాచారి, చదలువాడ సుందరరామ శాస్త్రి, నోరి గురులింగశాస్త్రిగారలు రచించినవి ముద్రిత ములై ప్రకటింపబడి యున్నవి. పూర్వ కవి రచిత పద్య కావ్యముల సంపాదించి, వాని నన్నింటిని సమ్యక్పరిశీలనము జరిపి పరిశోధించినచో నే వెలార్చిన కాలనిర్ణయము యొప్పో తప్పో తెలియగలదు. ముమ్మురం దట్టి ఉద్యమము చేకొని సాహిత్యసేవ చేయ విమర్శకలోకమును సవినయముగా ప్రార్థించుచున్నాను.

---

# అభ్యుదయ కవిత్వంలో కవిత్వ పరిశీలన



"జానకిజాని"

ఈ శతాబ్దపు మూడవ దశాబ్దంలో ఆంగ్లభాషలో వెలువడిన రాజకీయ కవిత్వానికీ, ఇటీవలి కాలంలో తెలుగులో వెలువడిన అభ్యుదయ కవిత్వానికీ ఎన్నో పోలికలు కనుపిస్తాయి. మొదటి ప్రపంచయుద్ధం కారణంగా యూరప్‌లో ప్రజలు నిత్యజీవితంలో ఎన్నో కష్టాలు ఎదుర్కోవలసి వచ్చింది. మరణించినవారు మరణించగా మిగిలినవారికి జీవితం దుర్భరమైంది. ఆకాశాన్నంటుతున్న ధరలూ, యుద్ధంలో వికలాంగులైనవారి రోదన ధ్వనులూ, నాటి ఆంగ్ల సమాజంలో నైరాశ్యాన్ని వ్యాపింపజేశాయి. ఒక విధమైన స్తబ్ధత దేశమంతటా అవరించింది. ఈ సంధి యుగంలో కవిత్వం వ్రాస్తున్న యువకవు లందరూ, ఈ స్తబ్ధత నుంచి చైతన్యంలోకి, ఈ చీకటి నుంచి వెలుగులోకి ప్రజలను తీసుకుపోవటానికి తగిన మార్గాన్నన్వేషించటం మొదలుపెట్టారు. అలా అన్వేషిస్తున్నవారి దృష్టికి కమ్యూనిజం ఒక మహత్తర సాధనంగా కనుపించింది. తత్ఫలితంగా కవితారంగంలో ఒకవిధమైన విప్లవం బయలుదేరింది. అది రాజకీయ సాహిత్య సృష్టికి దోహదం చేసింది. W. H. Auden, C. Day Lewis, Stephen spender వంటి యువకవులు T. S. Eliot రచనలనుంచి (ముఖ్యంగా Waste Land) ఉత్తేజాన్నిపొంది కవిత్వం వ్రాయటం ప్రారంభించారు. సమాజంలో ఉన్న ఆర్థిక అసమానత్వాలు తొలగి ఒకే ఒక వర్గరహిత సమాజం స్థాపింపబడుతుందనీ, తత్ఫలితంగా ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లగలరనీ ఆశించారు. కమ్యూనిజం మీది నమ్మకం ఈ కవుల నందరినీ ఒకే త్రాటితో బంధించి ఉంచింది. కాని, అనతికాలంలోనే రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. చరిత్ర పునరావృత్తం కావటంతో కమ్యూనిజానికి సంబంధించిన కొన్ని నగ్నసత్యాలను వారు తెలుసుకున్నారు. వర్గరహిత సమాజ స్థాపన అన్నవారి ధావత్రిపాస కమ్యూనిజం అనే మరీచికవల్ల తీరదని వారు గుర్తించారు.* అంతటితో ఆంగ్లభాషలో రాజకీయ కవిత్వానికి భరతవాక్యం పాడటం-జరిగింది.

ఇంచుమించు ఇదే వాతావరణంలో తెలుగులో అభ్యుదయ కవిత్వోద్యమం ప్రారంభమైంది. "కల్పన" అనే కవితా సంపుటికి పరిచయ వాక్యాలు వ్రాస్తూ శ్రీ బెల్లంకొండ రామదాసు ఇలా అన్నారు : "రెండు ప్రపంచ యుద్ధాల తరువాత మూడవ ప్రపంచయుద్ధ భయానకచ్ఛాయలు ఆవరిస్తున్న విషమ సమయంలో ఈ కవితాసంపుటి వెలువడుతున్నది. ఒక యుగం సమాప్తమై మరో యుగం ప్రారంభం కానున్న సందిగ్ధ సంధ్యా సమయం ఇది" .... "ఈ యుగాన్ని ఆవరించిన ప్రధాన తత్త్వ దృష్టి మార్క్సిజం. సాంఘిక విషబంధంలో చిక్కిన నేటి మానవునికి మార్క్సిజం ఒక గొప్ప నిష్కృతి మార్గంగా కనుపించింది."

ఆంగ్ల కవులు టి. ఎస్. ఇలియట్ రచనల నుంచి స్ఫూర్తిని స్వీకరించినట్లే తెలుగు కవులు గురజాడ అప్పారావు గారి రచనల నుంచి ఉత్తేజాన్ని పొందారు. ఐతే అప్పారావు గారి రచనలలో, భాషలో భావాలలో విప్లవం తీసుకురావాలనే అభిలాష కనబడినప్పటికీ, ఆయన మార్క్సిజాన్ని అభిమానించినట్లుగా భావించటానికి ఆధారాలు లేవు. అప్పారావుగారి రచనలలో ఉన్న స్పష్టత అభ్యుదయ కవుల రచనలలో కనుపించదు. మార్క్సిజంలో నమ్మకం ఉన్నా లేకపోయినా, సంఘంలో ఉన్న చెడును విమర్శిస్తూ అందరికీ సమానావకాశాలు కావాలనే వారిని గూడా ఒకప్పుడు అభ్యుదయ కవులుగా పరిగణించటం జరిగింది. కనుకనే దాశరథి, నారాయణ రెడ్డి, పిలకా గణపతిశాస్త్రి, సింగరాచార్య, కరుణశ్రీ గార్లు అప్పట్లో అభ్యుదయ కవుల జాబితాలో చేర్చబడ్డారు. వీరు కమ్యూనిస్టులని గాని వీరికి మార్క్సిజంలో నమ్మక ముందని గాని అనుకోవటంవంటి అసత్యం ఇంకొకటి ఉండదు. ఇక పోతే మార్క్సిజంలో ప్రగాఢమైనవిశ్వాసం ఉండి, కమ్యూనిస్టు తత్త్వాన్ని తమలో జీర్ణం చేసుకుని కవిత్వం వ్రాసినవారిని మాత్రమే అభ్యుదయ కవులనీ, వారి కవిత్వాన్నే అభ్యుదయ కవిత్వమనీ అనటం ఉచితంగా ఉంటుంది. ఈ తరగతికి చెందిన

---

* స్టీఫెన్ స్పెండర్ ప్రభృతులు "The God that Failed" అన్న గ్రంథంలో వారు కమ్యూనిజాన్ని విడచిపెట్టటానికి గల కారణాలను వివరించారు.

# అభ్యుదయ కవిత్వంలో కవిత్వ పరిశీలన

కవులకు నాయకత్వం వహించి అభ్యుదయ కవిత్వోద్యమానికి నాయకుడుగా నిలచినవాడు శ్రీ శ్రీ. ఆయన "మహా ప్రస్థానం" అనే రచన తెలుగు సాహిత్య చరిత్రలో ఒక నూతన యుగానికి నాంది పలికింది. శబ్దాలను సాధికారికంగా, సమయోచితంగా ప్రయోగించగల శక్తి, ప్రతిభా శ్రీ శ్రీ కున్నట్లుగా మరే అభ్యుదయ కవికీ లేవు. కనుకనే ఆయన రచించిన "కవితా! ఓ కవితా", "దేశ చరిత్రలు" అన్న గేయాలు అంత విశేషంగా ప్రజాదరణ పొందాయి.

"ఏ యుద్ధం ఎందుకు జరిగెనో, ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో,
తారీఖులు దస్తావేజులు, ఇవి కావోయ్ చరిత్ర కర్థం
ఈ రాణీ ప్రేమపురాణం, ఆ ముట్టడికైన ఖర్చులూ
మతలబులూ, కైఫీయతులూ, ఇవి కావోయ్ చరిత్రసారం,
ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావా లిప్పుడు! దాచేస్తే దాగని సత్యం
నైలునదీనాగరకతలో సామాన్యుని జీవన మెట్టిది?
తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీ లెవ్వరు?
సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుల సాహసమెట్టిది?
ప్రభువెక్కిన పల్లకి కాదోయ్ అది మోసిన బోయీలెవ్వరు?"

అన్న శ్రీ శ్రీ.

"రా రష్యా! లే రష్యా!
గర్జించు రష్యా! గాండ్రించు రష్యా!
పర్జన్య శంఖం పూరించు రష్యా!"

అని నినాద కవిత్వం వ్రాయటం — ఎంత ఉత్తమ కవియైనా ఎల్లప్పుడూ ఉత్తమ కవిత్వాన్నే అందివ్వలే డనటానికి ఒక చక్కని ఉదాహరణ.

శ్రీ శ్రీ ని మినహాయిస్తే భావుకుల నాకర్షించగల కవిత్వం చెప్పగలవారు అభ్యుదయ కవులలో లేరనటం బాధాకరమైన సత్యం. ఆయన తరువాత అభ్యుదయ కవిత్వం మరీ పేలవంగా, మార్క్స్ సూత్రాలను తెలుగు వచనంలో కొన్ని పంక్తులు పొడుగ్గాను, కొన్ని పొట్టిగానూ వ్రాస్తే కవిత్వమవుతుం దనుకున్న వారి చేతులలో పడింది. ఉదాహరణకు "ఆకలియాత్ర" అన్న రచనలో ఈ క్రింది పంక్తుల చూడండి:

"కడుపు కాల్చుకుని చాకిరి కాదిక మావల్లకాదు
పదండి! పదండి అడుగుదాం పరిపాలించేవారిని!
విల్వలున్న కలవాళ్లను నిలేసి అడిగేశేద్దాం
వరి పాతర కల వాళ్లను నలుగురిలోకీ పిలిపిద్దాం
అందరికీ తిండీ గుడ్డా అందిస్తారా లేదా?"

"జమీందార్ల దుస్సలేని వేలవేల యకరాలు
సమస్త బంజర్లూ, బీళ్లూ సాగుకు మా కివ్వండి
నాల్గునెలల కాలంలో పంఖ్యైకోట్ల మంది ప్రజలకు
బంగారం పండిస్తాం తిండి కొరత తీరుస్తాం!
ఒకటే మాకు నినాదం—తిండిలేంది పూరుకోం"

ఇది కవిత్వమని పొరబడకుండా నినాదమని సూచించిన రచయితని నిజంగా అభినందించాలి.

"ఏది కవిత్వం?" అని ప్రశ్నిస్తే సమాధానం చెప్పటం అంత తేలికయిన పనికాదు. ఐనా ఉన్నది ఉన్నట్లు చెప్పటంలో కవిత్వం లేదని అందరూ అంగీకరిస్తారు. చెప్పే విధానంలో వైచిత్ర్యమో, కొత్తదనమో, ఏదో ఒకటి ఉండాలని అంగీకరించి, ఆ చెప్పదలుచుకున్న దానిని, ఉద్రేకంతోనో, ప్రశాంత సమయంలో స్ఫురణకు తెచ్చుకొన్న ఉద్రేకంతోనో (Emotion recollected in tranquility) చెప్పినప్పుడు అది కవిత్వ మవుతుందని అనుకుందాం. ఈ దృష్టితో చూస్తే చాలామంది అభ్యుదయ కవుల రచనలలో ఉద్రేకం కనిపిస్తుంది కాని కవిత్వం కనుపించదు. ఉదాహరణకు "కాటూరు, యలమర్రు, కడలూరు" అన్న గేయం మొదటి పంక్తులు చూడండి.

"ఎర్రజెండా ఎగరేస్తూ కొడవలి ఝళిపిస్తూ
సందులను గొందులను చవిడిటి సన్నలను
అవిటి గోడలను అనేకం
శతఘ్నితో పేలుస్తూ రాలుస్తూ ...."

ఇలాంటిదే "సత్యం, శివం, సుందరం" అన్న రచన కూడా.

కవిత్వానికి విలువ కట్టేటప్పుడు, కవి ఇవ్వదల్చుకున్న సందేశ మెంత ముఖ్యమో, ఆ సందేశాన్నిచ్చే విధానం కూడా అంతే ముఖ్యంగా పరిగణించాలి. అభ్యుదయకవు లందరూ నాటి సంఘ వ్యవస్థమీద తిరుగుబాటు చేశారు. శ్రామిక వర్గం పడుతున్న యాతననూ, కష్టాలనూ గుర్తించారు. పేద ప్రజల పట్ల సానుభూతి చూపటానికి ప్రయత్నించారు. అంతవరకూ వారు వారి కర్తవ్యాన్ని సక్రమంగానే నిర్వర్తించారు. కాని, కవులుగా వారి బాధ్యత వేరు. తమ భావాలను కవిత్వరూపంలో ప్రకటించటంలో వారు కృతకృత్యులు కాలేదు. కవిత్వానికీ, వాస్తవికతకీ ఎంతో భేదముంది. ప్రఖ్యాత ఆంగ్ల రచయిత G. K. Chesterton వాస్తవిక విషయం సాహిత్యంలోకి వచ్చినప్పుడు ఎలాంటి మార్పుకు లోనౌతుందో సూచించారు. (Every form of literary art must be a symbol of some phase of

the human spirit. but whereas the phase is in human life sufficiently convincing; in itself, in art it must have a pungency and neatness of form) ఈ లోపం అభ్యుదయ కవుల రచనలలో కనుపిస్తుంది. కనుకనే చాలా రచనలు ఆలోచనామృతంగా లేకపోగా ల పాత కర్కశంగా తయారైనాయి. ఐతే, అందరు అభ్యుదయ కవుల రచనలూ ఈవిధంగా లేవు. భావౌన్నత్యంలో, భావప్రకటనా వైచిత్ర్యంలో, జిజ్ఞాసను రేకెత్తించే రచనలు చేయటంలో కొందరు అభ్యుదయ కవులు చక్కని కవిత్వాన్ని అందించారు. ప్రాచీన సంప్రదాయంపై అభ్యుదయ కవులందరూ తిరుగుబాటు చేసినా భావ ప్రకటనలో, రచనా విధానంలో, నూతనత్వాన్ని కొద్దిమంది మాత్రమే ప్రదర్శించగలిగారు. వారిలో ముఖ్యంగా పేర్కొనవలసినవారు శ్రీ ఆరుద్ర. ఉదాహరణకు ఆయన రచించిన, "చిరంజీవి మానవునికి మృత్యువు" లోని ఈ క్రింది పంక్తులు చూడండి :

"పన్నెండు పెగ్గుల తర్వాత
అభిజ్ఞ వర్గాలు ప్రమాదాన్ని పసికడతాయి
విదేశ వ్యవహారాల శాఖ
పాత్రికేయుల ప్రశ్న పరంపరల నుంచి
సురక్షితంగా తప్పించుకొని
తనలో తాను తర్జన భర్జనలు చేస్తుంది.

పుకారుల భారీ పరిశ్రమ మీద
అధిక లాభాల పన్ను అక్రమమనే
వాణిజ్య సంస్థల రాయబారం విజయవంత మవుతుంది.
అబద్ధాల అమ్మకాన్ని ప్రభుత్వాలు
జాతి పరం చేస్తాయి."

కవి ప్రతిభను అడుగడుగునా వ్యక్తంచేస్తూ సాగిన ఈ రచన అభ్యుదయ కవిత్వాని కంతకీ తలమానికంగా ఉంది. ఈ రచనకు శ్రీ ఆరుద్ర నభినందించినా ఆయన మరొక రచన "పర్వత దశ"కు ఆయనను విమర్శించకుండా ఉండలేం. ఉత్తమ కవిత్వంగా పరిగణించబడటానికి స్పష్టత కూడా అవసరమని అంగీకరిస్తే అది ఇందులో లోపించిందని చెప్పక తప్పదు. ఆంగ్ల పదాలు అసంఖ్యాకంగా వాడబడిన రచన కావటంవల్ల కాబోలు "పర్వత దశ"లో శైలి పాషాణపాకంగా ఉంది.

రెండవ ప్రపంచయుద్ధం ఫలితంగా ప్రజలలో ఏర్పడిన నిరుత్సాహానికీ, నిరాశకీ, ప్రతిబింబంగా నిలచిన అభ్యుదయ కవిత్వం, పరిస్థితులు కొంతవరకూ చక్కబడి దేశం పురోగమించటంతో ప్రజాదరణను కోల్పోయింది. జాతీయ, అంతర్జాతీయ రంగాలలో వస్తున్న అనేక మార్పులవల్ల కమ్యూనిజంపై ప్రజలకు గల అభిప్రాయాలు మారిపోతున్నాయి. కమ్యూనిజం ప్రభావంవల్ల కవులైనవారు కవితారంగంనుండి నిష్క్రమిస్తున్నారు. తాత్కాలికంగా అభ్యుదయ కవిత్వోద్యమంవైపు ఆకర్షింపబడ్డా కవిత్వమే జీవన ధాతువుగా గల ఆరుద్ర, బాలగంగాధర తిలక్, గణపతిశాస్త్రి, సోమసుందర్, కొనకళ్ల వంటి కవులు రచనా వ్యాసంగాన్ని విడవకుండా సాహిత్య సేవ చేస్తూనే ఉన్నారు. భవిష్యత్తులో సమగ్రమైన ఆంధ్ర సాహిత్య చరిత్ర రచింపబడితే అభ్యుదయ కవిత్వోద్యమానికి చారిత్రక ప్రాధాన్యం (Historical Importance) మాత్రమే ఉంటే ఆశ్చర్యపడ నవసరంలేదు.



మ. ప్రణుతింపం బడముల్ ప్రజల్, బహుళముల్ వాక్యంబులే గేహముల్
ఘన పద్యంబులె గ్రామముల్, కృతులె విఖ్యాతంబులౌ సీమలౌ
యన స్వాయత్తములై తగన్ సుకవితా యద్యస్తి రాజ్యోనక
మ్మను నార్యోక్తి చెలంగ నీవె కవిరాజై మింతు వెంతేనియున్;

కొక్కొండ

# ప్రసాదరాయ కవి



## శ్రీ కన్నేపల్లి మార్కండేయశర్మ

ఆధునికాంధ్ర కవులలో అశేషశేముషీ ధురంధరులును, అనన్యకల్పనా కోవిదులును నున్నారు. వీరిని మూడు వర్గములుగ వెంచవచ్చునని డా. వెంకటావధానిగారు చెప్పిన దెంతయు సమంజసము. సాంప్రదాయికులు, ప్రాజ్ఞవ్యకవులు (Neo-classicists) భావకవులు, అభ్యుదయ కవులను వారిలో మొదటి వర్గమువారే చిరకీర్తిప్రియులని చెప్ప నొప్పును. ఏమన, వారి ప్రతిభకు వ్యుత్పన్నత తోడయి రచనలకు అజరామరమైన కీర్తి తెచ్చును.

అట్టి కీర్తికాయులలో ప్రసాదరాయ కవిగా రొక్కరు. వీరు పండిత కుటుంబమున పుట్టుటచే బాల్యమునుండి కవితాప్రతిభ గలిగియుండుట వింతకాదు. దానికి తోడు గురుశుశ్రూష, నిరంతర కృషి, నవ్యకళా కలాపమను నైపుణ్యము నొసంగినవి. వీని పరమావధిని కవిరాజుగారి మొయిలు రాయబారమున దర్శింపవచ్చును.

కాళిదాస కృతులలో మేఘసందేశ ముత్తమోత్తమమని రసజ్ఞు లందురు. రఘువంశాది కావ్యనాటకములలో కథాంశము పరకీయము. మేఘుని వృత్తాంతమంతయు స్వకపోల కల్పితము. ఇతర కావ్యము లన్నియు ఉపమాలంకార పూరితములుగా నుండ నీ కృతి యంతయు వ్యంగ్యార్థ వైభవ శోభితము. కథాకల్పనయందేమి, రచనా సౌందర్యమందేమి, ఇది కాళిదాసుని లోకోత్తర కళాసృష్టికి నిదర్శనముగా నున్నది. దానిని తెనుంగు కబ్బముగా తీర్చి దిద్దుటలో కవిగారు కృతకృత్యులైనారని చెప్పనగును. సంస్కృతమున మేఘసందేశమంతయు మందాక్రాంత వృత్తమున రచింపబడినది. కవిగారు వీనుల కింపైన యక్షగాన పద్ధతిని ఏకపాత్ర నాటికగ కూర్చినారు. ఇది క్రొత్త ఛందో విశేష మగుటయే గాక మిక్కిలి హృదయరంజకముగ నున్నది. దీనికి చక్కని మకుటములు గూడ చేర్చినారు.

"క్రొమ్మెఱుపు వగలాడి కూర్మి సంగడికాడ !
క్రొమ్మొయిలు ఱేడ! గయికొమ్ము నా విన్నపము !
వెమ్మి జీవనమిచ్చి నిఖిల లోకమ్ములన్
సమ్మోదమున దేల్చు సారస్యము గలాడ!"

ఇట్లే ఉత్తర మేఘమున సంబోధన :—

"జీవితేశ్వరి ! నిన్ను బాసియు,

దేవి ! యీ కఠినాత్ము దుర్దశ తెలి గొరకింపక నిసదే'
కథావృత్తాంతము గూడ నిట్లే గానముగ నాలపించును. చూడుడు :

ధూమజ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః క్వమేఘః
సందేశార్థాః క్వపటు కరణైః ప్రాణిభిః ప్రాపణీయాః
ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యకస్తం యయాచే
కామార్తాహి ప్రకృతి కృపణా శ్చేత నాచేతనేషు.

మరుదగ్ని జలధూమ మయమైన మొయిలేడ ?
కరణ పాటవ యుక్తి గలుగు ప్రాణులచేత
నరగ బంపగ దగ్గ సందేశము లవేడ ?
తరమౌనె యిది యన్న తలపేది తహతహన్ ?

తరుణికై తనదు వార్తలు బంపగోరి,
విరహి యొక్కడు మబ్బు వేడికొన్నాడంట !
అరుదుగా దిది చేతనా చేతనములందు
కరము దీనులు కదా కామ పీడితులు !

ఇయ్యది ఇంపు సొంపులు పెంపారు తెలిగింపు మాత్రమే కాదు. పద్యము నడక, తూగులో కూడ విశేష మున్నది. పద్యముగాను, రగడవలెను, పాట పద్ధతిని చదువవచ్చును. హరికథ చెప్పినట్లు కాలక్షేపము చేయవచ్చును. కవిగారట్లు పద్యములు పాటలుగ కథా వృత్తాంత మంతయు సభలలో వినిపించి వేనకువేలు శ్రోతల రంజింపజేయుచుండిరి.

ఇంక కవిగారు కాళిదాసుని వ్యంగ్యార్థ విశేషము నెట్లు పోషించిరో చూడదగును :

సంతప్తానాం త్వమసి శరణం తత్పయోద ప్రియాః
సందేశంమేహర ధనపతి క్రోధ విశ్లేషితస్య
గంతవ్యాతే వసతి రలకానామ యక్షేశ్వరాణాం
బాహ్యోద్యాన స్థితహర శిరశ్చంద్రికా ధౌతహర్మ్యా

పరితప్తులకు నెల్ల శరణంబవగు దీవు
రమణీ వియోగ సంతాపతప్తుడ నేను
ఘనవాహ! సఖ్యమై దయ్యైనవాకిట్లి
బాంధు! నా సందేశ మంపజేయగ దయ్య
వెలిపూవు దోటలో వెలయు క్రొన్నెల తాల్పు
తలనున్న జాబిల్లి వెండి వెన్నెలంచే
నలరు మేడలతోడి యక్షేశవాసవౌ
నలకకున్ నీ విప్పు డరుగ గావలెనన్న!

''రమణీ వియోగ సంతాప తప్తుడ నేను'' అని భావము విస్తరింపబడినది. అలకాపుర వర్ణనము కాళిదాసు ఒక్క సమాసములో నెసగగొట్టినాడు. అది యాతని వ్యంగ్యార్థ వైఖరికి ననువుగా నున్నది. అలకానగర బాహ్యోద్యానమున విడిసి యున్న శివునిచే నది పవిత్ర మగుటయు, అతని చూడామణియైన బాలచంద్రుని వెన్నెలలచే ధవళితములగు సుధా సౌధములచే శోభ గాంచుటయు సూచనా ప్రాయముగ చెప్పి శ్రోతల భావనాశక్తికి కుతూహలము కల్పించెను. సంస్కృతమున నేది వ్యంగ్యముగ నుండునో యది తెనుంగున వాచ్యమై వెలసినప్పుడే రమణీయ మగునని కవిగారెంచి—

వెలిపూవు తోటలో వెలయు క్రొన్నెల తాల్పు
తలనున్న జాబిల్లి వెండి వెన్నెలంచే అలరు మేడలతోడి

అని తీరు తియ్యములు గల పలుకులలో తెనుంగు మెఱుంగులు చూపినారు.

ఇదే శ్రీనాథుడు చాటిన పద్ధతి కదా?

''ప్రౌఢి బలికింప సంస్కృతభాష యండ్రు
పలుకు నుడికారమున తెనుంగుబాస యండ్రు ....''

కాళిదాసుని ప్రౌఢ పదగుంఫనము వాణీప్రసాదులగు ప్రసాదరావుగారి పలుకు నుడికారముగ నెట్లు మారెనో మరియొక మచ్చుతునుక :—

మార్గం తావచ్ఛృణు కథయతస్త్వత్ప్రయాణానురూపం
సందేశం మే తదను జలద శ్రోష్యసి శ్రోత్రపేయమ్
ఖిన్నః ఖిన్నః శిఖరిషు పదం న్యస్య గంతాసి యత్ర
కీణః కీణః పరిలఘు పయః స్రోతసాం చోపభుజ్య.

అలపు గొన్నపుడెల్ల యుందందు శ్రమవాపి
యలరించు విడిది పట్టైన గొండలుగల్గి
కొడువెడన్ బడలికన్ గడలు కొన్నపుడెల్ల
కడుపార త్రావ జొప్పడు యేఱులును గల్గి
పయనమ్మునకు నర్హమైన చక్కని దారి
మూని నే వినిపింతు మును మున్న వినుమన్న
చెవులకున్ గడు విందు సలుపు నా సందేశ
మవల వింపెసలార నాలింపగదవన్న!

మార్గాయాసమున సనయించుటకు కనువగు కొండ వెత్తములను, దప్పి దీర్చునట్టి సెలయేళ్లను కవికుల గురుండు సూచనాప్రాయముగ స్పృశించి విడువ, తెనుంగుకవి అత్యంత రమణీయముగ విశదీకరించెను గదా!

ఇట్టి పట్టులం దీ రచన స్వతంత్రకావ్యమువోలె భాసించును. అమర భాషయందు గర్భితమైయున్న యర్థగౌరవము భావనా సౌరభములకు తెనుంగు తేనెను జేర్చెనా యని తోపింపజేయును.

ఇట్టి కవితా విశేషముల నెన్నింటినో ఆంధ్ర కావ్యమున ప్రతి పద్యమందును జూపవచ్చును. అతి విస్తరభీతిచే విరమింపవగును. ఈ కావ్యము కవిసామ్రాట్ విక్రమదేవవర్మ మహారాజాగారి మెప్పు నంది, కట్టమంచివారి ప్రశంస బడసి, వేటూరివారి నాణ్యము నందినది. విశ్వవిద్యాలయమువారు కవిగారికి 'కళాప్రపూర్ణ' బిరుదము నిచ్చి గారవించిరి.

---

మ. లలితోత్సాహములై సువర్ణ మణిమాలా కంధర స్ఫూర్తిరం
జిలఁగండంబులు గల్గి మంగళ మహాశ్రీలం బ్రకాశించి కాం
చిలసత్కే సరబంధురంబులయి పృథ్వీ వర్ణిత ఖ్యాతిని
చ్చలు కావ్యంబులనం జెలంగుఁ బలినాజానేయ గంధర్వముల్

మల్లన—విప్రనారాయణ చరిత్ర

# బహుకర్తృక క్రియాపదములు



శ్రీ మంగిపూడి కృష్ణమూర్తి

''ఆన యెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా యిది యెట్లు చెప్పుమని యడిగినఁ జె
ప్పనివాఁడును, సత్యము చె
ప్పని వాఁడును ఘోర నరక పంకమునఁ బడున్.''

(ఆం. భా. ఆది—1—137)

పై పద్యములో 'చెప్పని వాఁడు' అను పాఠాంతరము కంటె, 'చెప్పనివాఁడు' అను పాఠాంతరమే సమంజస మైనదని నేను వ్రాసియున్నాను. (చూడు. భారతి 1962 మే నెల) శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు నా యభిప్రాయమును బలపరిచిరి. (చూడు భారతి 1962 ఆగష్టు) కానీ, 1962 నవంబరు భారతిలో శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, నా నిర్ణయమును వ్యతిరేకించుచూ నిట్లు వ్రాసిరి: '' 'చెప్పనివాఁడు' అను పాఠాంతరము నిస్సంకోచముగా తప్పు. ఎందువల్ల ననగా : ఆ పాఠమున 'ఇది యెట్లని యడిగిన—'చెప్పనివాఁడు' ఒకడు, 'సత్యము—చెప్పనివాఁడు'—ఇంకొకడు, ఇద్దరవుతారు. అప్పుడు క్రియాపదము బహువచనమున ఉండవలె. పద్యములో ''పంకమునఁ బడున్'' అని ఏక వచనములో నున్నది. అందువలన భిన్న వచనమను దోష మేర్పడి నన్నయగారి పద్యమే భ్రష్టమగుచున్నది. కాబట్టి 'చెప్పనివాఁడు' అను పాఠము దుష్టము. విమర్శకులు గిమనించలేదు.''— అని సెలవిచ్చినారు శ్రీ శాస్త్రిగారు.

ఇక్కడ శ్రీ శాస్త్రిగారు పెద్ద పొరపాటనెడి పంకమున బడినారు. పై విమర్శవల్ల, వారు సంస్కృతమునందును, ఆంధ్రమునందును అనేక కర్తృక క్రియాపద ప్రయోగములను సరిగా గమనించలేదని తెలియుచున్నది.

అనేక కర్తృపదములకు, ఒక ఏకవచన క్రియాపదమును అన్వయించుకొను పద్ధతి సంస్కృతభాషలో నున్నది. ఇందులకు ఒక్క ఉదాహరణ :—

శ్లో. ''అజ్ఞశ్చా శ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి.''

(—భగవద్గీత—4—40)

ఇక్కడ అజ్ఞః, అశ్రద్ధధానః, సంశయాత్మా, అను మూడు కర్తృపదము లున్నవి. క్రియాపదము మాత్రము 'వినశ్యతి' అనునది ఒక్కటే. అది ఏకవచనమున నున్నది. అశ్రద్ధధానః వినశ్యతి, సంశయాత్మా వినశ్యతి, అజ్ఞః వినశ్యతి అని మూడు కర్తృపదములును ఏక క్రియాపదమునే అన్వయించుకొనవలెను. శ్రీ శంకరాచార్యులవారు భాష్యమున నిట్లు వ్రాసినారు. ''.......అజ్ఞ శ్రద్ధధానౌ యద్యపి వినశ్యతస్తథాపి నతథా యథా సంశయాత్మా సంశయాత్మాతు పాపిష్ఠః సర్వేషామ్.....'' పై భాష్యమువల్ల అజ్ఞుడు, అశ్రద్ధధానుడు, సంశయాత్ముడు—వీరు ముగ్గురు వేర్వేరు వ్యక్తులనియు, అందరికిని, ఒక్క ఏకవచన క్రియా పదమునే మూడు కర్తృపదములును అన్వయించుకొనవలెననియు స్పష్టమగుచున్నది. సంస్కృత భారతమున ఇట్టి ప్రయోగము లెన్నియో కలవు.

ఇక, తెలుగు భాషలో గూడ అనేక కర్తృపదములకు ఒక్క ఏకవచన క్రియాపదమును అన్వయించుకొను పద్ధతి ఉన్నట్లు మహాకవి ప్రయోగముల వలన తెలిసికొనవచ్చును. ముఖ్యముగా కవిత్రయ ప్రయోగములను కొన్నిటిని చూపుచున్నాను.

''నీ వొండె, విదురు డొండెను
గావలయుం గాక యిట్టి కార్యంబులకున్
రావేఱ కలరె తగు వా
రీ వినయము, నేర్పు గలదె యితరుల కెందున్.'')

(—ఉద్యో—1—364)

ఇచ్చట నాల్గవ పాదమున ఈ వినయము, ఈ నేర్పు అను రెండు కర్తృపదము లున్నవి. ఆ రెంటికిని అన్వయించుకొనుటకు 'కలదె' అను ఏకవచన క్రియాపద మొక్కటియే యున్నది. 'ఈ వినయము గలదె'—'ఈ నేర్పు గలదె' అని యన్వయము.

"అంతయు లేదయు పనయు వానయు ప్రాహ్ణ
భక్తియును నహో ప్రభావతయును,
నతని యందకాని యన్యులయందు లే
వింత యెన్నియు నహీంద్ర."

(—ఉద్యో—7—181)

ఇచ్చట నిన్ని కర్తృపదము లున్నను, అన్నిటికిని ఏక వచన క్రియాపదమైన 'లేదు' అనుదాని నొక్కటినే అన్వయించుకొనవలెను.

"వసుధయంద దెలిసియుఁ గర
పదములయం దెనయు ......"

(—అరణ్య—7—411)

ఇచ్చట 'చెనయు' అను ఏకవచన క్రియాపదమును రెండు కర్తృపదములకును అన్వయించుకోవలయును. పై నుదాహరించిన ప్రయోగములను పొరపాటులైనవని ఏ ప్రతి యందును గానరావు. కనుక శాస్త్రిగారు, పై ప్రయోగ ముల యందలి క్రియాపదములకు 'కంపె', 'లేవు', 'చెనవు'— అని బహువచన రూపములు నుంచి సవరణ చేసినను, గణ యతి ప్రాసలకు భంగము వాటిల్లదని వాదింతురేమో. అట్లు సవరణ చేయుటకైన వీలులేని ప్రయోగము లున్నవి కనుగొనుడు :

సీ. "సర్వజ్ఞుఁడగు పరాశర నందనుని చేత
భాషితంబైన యి స్పరమపుణ్య
వృత్తంబు సదివిన, విన్నను విప్రుండు
వేదవేదియు, రాజు విజయశాలి,
యును వణిజుండు లాభోపేతుడును శూద్రుఁ
డత్యంత సుఖియును నగు నరేంద్ర ...."

(—శాంతి—6—417)

పై పద్యమున విప్రుడు, రాజు, వణిజుడు, శూద్రుడు— అను నాలుగు కర్తృపదములకును, 'అగున్' అను ఏకవచన క్రియాపద మొక్కటియే అన్వయించుచున్నది. 'అగుదురు' అను బహువచనము వాడబడలేదు.

"మనుజుల దానవులను గడచిన యువి భుజబలముల స్త్ర శిక్షా విధముల్ గొనియాడఁ గొలందిగాదీ, తని నాతఁడ, యతని నెరఁడ, ఉరుఁ జెనయుంగన్—"

(—విరాట—5—167)

ఇందు 'అరఁడ', 'ఇరఁడ' అను రెండు కర్తృపదము లును ఆ రెంటికిని 'తగున్' అను ఏకవచన క్రియాపద మొక్కటియు మాత్రము గలవు. 'తగుదురు' అని ప్రయో గింపబడలేదు. 'అతని నీతడ చెనయుంగ దగున్'—'ఈతని నాతడ చెనయుంగ దగున్' అని అన్వయించుకోవలయును.

శ్రీ శాస్త్రిగారు పై భగవద్గీతా ప్రయోగమును, పె. కవిత్రయ ప్రయోగములను జూచి సంశయాత్ములు కాబో రని నా నమ్మకము.

అంతేకాదు. క్రియాపదములను అన్వయించుకొనుటలో, ఇంకొక్క విశేషమును గూడ శ్రీ శాస్త్రిగారు గమనింప వలయును. అనేక కర్తృపదము లున్నప్పుడు, క్రియా పదము, దానికి సమీపమందున్న కర్తృపదముయొక్క వచన మును గైకొనును. ఈ విషయమునే ప్రౌఢ వ్యాకరణకర్త యిట్లు చెప్పినాడు. "అనేక కర్తృక క్రియకు, సమీప కర్త యొక్క లింగ వచనంబులగు." (ప్రౌఢవ్యా. వాక్య—15.) దీనికి లక్ష్యములుగా ఎన్నెని ప్రయోగములు చూపబడినవి. ఇంకను వెదకినచో భారతమునం దిట్టివి కోకొల్లలు లభింప గలవు.

ఇంత ఎందుకు ? ప్రౌఢ వ్యాకరణమునందే మరి యొక సూత్ర మిట్లు చెప్పబడినది.

"మహద్బహు కర్తృక క్రియకు నేకవచనంబు విభాష నగు."

(ప్రౌఢవ్యా. క్రియా—6)

దీనికి ఉదాహరణగా- నేను విమర్శించిన పద్యమే చూప బడినది. శ్రీ సీతారామాచార్యులుగారు కూడ 'చెప్పనివాఁడు' అను పాఠమే సరియైనదని తెల్పియున్నారు. తేలిన దేమనగా "ఏకవచనమునందున్న అనేకములైన కర్తృపదములకు, ఒకే క్రియాపద మున్నప్పుడు, ఆ క్రియాపదము ఏ వచనమందైన నుండవచ్చును."

# క్షేత్రయ

## శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

అన్నమయ్యను పద కవితా పితామహు డన్నారు. చక్కని, చిక్కని తెలుగులో అసంఖ్యాకములైన శృంగార —, ఆధ్యాత్మ—, సంకీర్తనములను రచించి పదములకు తెలుగు కవిత్వములో గౌరవస్థానము కల్పించిన రచయిత అన్నమయ్య. "ఏగంటి వచనాలు" అన్న పేరుతో 'పాటల సద్భక్తిపరులు మతి యింప' రచించిన గార్లపాటి లక్ష్మయ్య తన పదములకు "వచన ములు" అని కన్నడ సంప్రదాయపు పేరు పెట్టుకున్నాడే కాని— రాగ తాళములు నిర్దేశిస్తూ—సంకీర్తనములని అనలేదు. కనుక పోశెట్టి లింగకవి వంటి భక్తుని పరిగణనలో కూడా అవి 'పాట'ల

గానే విశిచిపోయినవి. అన్నమయ్యగారు పదములను విబంధించి, నిబంధ పదములనుగా తీర్చి వాటికి గౌరవస్థానము కల్పించినారు. ఆయన రస పదములను స్వామి సమక్షమున పాడి వినిపించి నట్లు ఆయన రూపశిల్పములు సాక్షి.

క్షేత్రయ అన్నమయ్యకు నూరేండ్ల తరువాత పుట్టి నాయన. వీ రిరువురకూ నడుమ తెలుగునాట సంగీతము ఏ వికాసము పొందినదో తెలిపే సాక్ష్యము ఎక్కువ లేదు. వెంకటపతిరాయలమీది ప్రబంధము—ఇప్పటికి లభించిన ప్రాచీన సంగీత రచన—శబ్దమూ స్వరమూ, సాహిత్యమూ చేర్చి రచించిన ప్రబంధము. స్వరముల రంజకత్వమును కంటె రచయిత ప్రబంధ నిర్మాణ చాతుర్యమును మెఱపించుటకు రచించినదే అనిపిస్తున్నది. ఇది సంగీత సర్వార్థసార సంగ్రహములో ఉన్నది.) క్షేత్రయ అన్నమయ్య నిబంధ పదముల పద్ధతిలోనే తన పద మును రచించినాడు.

అయితే, క్షేత్రయ పదములలో స్ఫుటముగా కనిపించే భాగము అనుపల్లవి. ప్రతిపదమూ పల్లవితో ప్రారంభ మవుతుం దని మన కందరికీ తెలుసు. పల్లవికి వెనువెంటనే—ఆ కీర్తన లోని ఆరోహణావసానమును అందుకొని చూపే—అనుపల్లవి ఉంటుంది. నిండు రూపములో ఈ అనుపల్లవి పల్లవికి రెండు రెట్లు పొడవుంటుంది. పల్లవితో ప్రాస కలిపితే కలుపుతుందీ లేకుంటే తన పాదములు రెండింటిలోనూ ప్రాస కలుపుకుం టుంది. పుష్పానికి ఆకర్షక పత్రమువంటి ఆరోహణాభాగము నిముడ్చుకుని వినపడడము అనుపల్లవి ప్రత్యేకత. పొడవు ఎక్కు వుంటే ఈ అందము చక్కగా అనుతుంది. క్షేత్రయ్య పదాలలో ఈ రకపు అనుపల్లవు లున్నాయి.

అన్నమయ్య కాలానికి పదము సంగీతపు ఆంక్షా, సాహిత్యపు టాంక్షా దులుపుకుని సభాగౌరవము పొందింది; అయితే అది బాల్యావస్థ కనుక అక్షరాల కలకలము ప్రధానమై స్వరాలు చాలినన్ని ఇమడలేక, అక్షర స్వరాల మాధుర్యాన్ని వహించి సాగినది. సంగీతా తానికి సర్దుకుని కీర్తనలవలె పాడడానికి వీలిచ్చే సంకీర్తనలు అన్నమయ్యవి ఎన్నో పట్టడము కష్టము. క్షేత్రయ పదాలు అన్నీ చక్కగా చౌకముచేసి పాడడానికి వీలిచ్చేవే. కొంద రన్నమయ్య అభిమానులు క్షేత్రయను దిగదియ్యడానికి 'మహావిద్వాంసులు క్షేత్రయ పదాలను చేతులు తట్టుతూ భజనపాటలవలె పాడే వార' నడముకలదు. కళాపరిణామ క్రమానికి అభిమానాలు అడ్డు రావచ్చునా ? క్షేత్రయ్య పదాలలో "వలబిది .... పదములు నన్ను గలసి వినిపించెనే" అన్న మాటలు కలవు. క్షేత్రయ పదాలు పాడుతూంటే వర్తకి అభినయముచేస్తూ అందగించేది. అదే 'నన్ను గలసి వినిపించడమం'టే. పదములలోని సాహిత్యమును మించి సంగీతము పెరుగుతున్నట్లున్నందు అభినయము బాగా లోకైన లోటు లేదు. స్వరాలు వెంటనే స్వరంలో సాగింపుగా సాగి పదాన్ని నాటకముతో పూరిస్తాయి. ద్యా ప్రధాన మైన అభినయము వెనువెంటనే సాహిత్యానికి మంచి వెలుగుని ఇ దు దనము చేస్తుంది. ఈనాటికి ఈ పదాలే అభినయానికి చాలా అనుకూలములు. తర్వాత పాటలు చెరు రాజులలో సాగ అభి నయానికి అవకాశ మిచ్చేవైనదే అభినయానికి నాటుకున్నాయి. పదాలు పట్టడము గాయకునికి నట్టి పట్టె. వారు నాటము పోస్తూ పట్టేవారు ఎన్నైనా అంటారు పదాన్ని క్షేత్రయ పదాల్లోను. అన్నమయ్య పదాల సంగీతము ఎప్పుడు గానేదో ఇంకా తెలియబడలేము. వాటిని మనము పెట్టినదే సంగీతము ! ఆనాటి సంగీత వికాసాన్ని దాటిన ఈనాటి సంగీతాన్ని అన్నమయ్య పదాలకు అద్దడము యోగ్యమూనా, సంక్షిప్త సంప్రదాయంగా దిగివచ్చిన పదాభినయమును పురస్కరించుకుని క్షేత్రయ పదాల్ని చౌకముచేసి పాడడము అయోగ్యముకానా ? సంగీత వికాస సరళికి వ్యతిరేకముగా—మనము పాడలేము కదా అని— భజనపాటల స్థాయికి క్షేత్రయ పదాన్ని దింప యత్నిస్తే మన రుచి దిగుతుంది పాతాళానికి. ఆ పదాలు వాటి స్వరమాధుర్యంతో సాగిపోతాయి.

అన్నమయ్య పద కవితా పితామహుడు, క్షేత్రయ్య పద సంగీత పితామహుడు. ఈయన పదసంగీత మాధుర్యమే సంగీత రచనను శంఖలీల, సింహతాళము వంటి తాళ బేషజాల నుంచి పదములవైపు తిప్పినదేమో అనిపిస్తున్నది నా మట్టుకు నాకు. లేకుంటే 'ఉత్కుత్కిట్ట, భ్య' అంటూ గాయకుని ఉచ్చారణా సౌలభ్యమును పరీక్షించే భాగాలతో కక్కుల కళ్లేము వలె సాగిన ప్రబంధ రచన ఆగిపోయి రాజ సభలలోనూ, యక్షగానాలలోనూ పదాలే వినపడే పరిస్థితి ఎలాగు వచ్చియుండగలదూ? శబ్దములూ, గీత ప్రబంధములూ సలాములూ వంటి వైవిధ్య విస్తృతి గల రచనలతో మోగిపోతుండే 'సం' గీతము పదములవైపు ఎందుకు తిరిగి ఉంటుంది? ఎవరి పదములు తంజావూరిలో, మధురలో, కంచిలో ముఖరితములైనవీ ? ఎవరి పదాలశక్తి విజయరాఘవ నాయకుని కాలపు యక్షగానాలలో అన్నిటిలోనూ ప్రతిధ్వ నించిందీ ? అతడే పద సంగీత పితామహుడు, క్షేత్రయ. ఈయన తరువాత సంగీతరచన నిబంధ పదములనుబట్టి పెరిగి నది. త్యాగయ్య రచనలు ముప్పాతిక మూడుపాళ్లు నిబంధ పదాలే.

క్షేత్రయ కర్ణాటక సంగీత వికాస కాలములో బేషజాలు లోపించి మాధుర్య మకరందము చిందించే శుభసమయానికి ఉషస్సువంటివాడు. ఆయన పదాలు దక్షిణదేశమంతటా వినబడి వ్యాపించి గాయకుల దృష్టిని రంజకత్వము వైపు తిప్పేయి.

అవే వినబడి ఉండకపోతే త్యాగరాజు క్షేత్రయ్యవంటి వాగ్గేయకారుల క్షేత్రమహాత్మ్యంలో కర్నాటక సంగీతము కూడా ఆనాటి తెలుగు కవిత్వపు ప్రభావాన్ని కుదురుపాలన్నీ రూపొందించి ఉండేది. సాహిత్యము ఎక్కువగా సభలో వినిపించదానంత లాలసను తరుచు ధరిస్తున్నా సంగీత మాధుర్యము అంతరాత్మములను ముంచి వింటూగా ప్రవహిస్తుంది క్షేత్రయ్య పదాలలో. అవి ఇక్షు ఖండాలు. సాహిత్యము దాని పైని బీజము, మరి సంగీత మధుర రసము.

# మొల్ల రామాయణ కాలము

## శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

శ్రీ ఖండవల్లి లక్ష్మీ రంజనం, ఎం. ఏ. గారు తమ ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహములో "మొల్ల జీవించిన కాల మిదియని చెప్పుటకు తగిన సాధనము ఈమె కావ్యములో లేదు'. (పు. 223) అని సూచించినారు. కాని, ఇది పునః పరిశీలనాంశ మగుచున్నది.

ఈ దృష్టితో ఆగస్టు, సెప్టెంబరు 1963—భారతి సంచికలో మొల్ల కవయిత్రి కాలమును గూర్చి శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి ఎం. ఏ. గారును, శ్రీ తురగా కృష్ణ మూర్తిగారును చర్చలు ప్రారంభించినారు.

'మొల్ల శ్రీకృష్ణదేవరాయల కాలమున పెద్దన తరువా తీదిగా నుండియున్నట్లొక వాద మున్నట్లు తేలుచున్నది.' ఇది యదార్థం కాదు.

మొల్ల తన రామాయణము నిండు జవ్వనమున వ్రాసి యుండునని మన మనుకొన్నచో నామె క్రీ. శ. 1375—1380 మధ్యకాలమున జీవించియుండవచ్చునని తేలు చున్నది. ఈ విధిని మొల్ల శ్రీనాథుని సమకాలీన యగు చున్నది.

పూర్వాంధ్ర కవిస్తుతిలోని 'రసికుడై నటి శ్రీనాథుని' కాలమునుబట్టి పై సిద్ధాంతము చేయబడినది. కాని, మొల్ల రామాయణాంతరములోని అంతస్సాక్ష్యము (Internal evidence) ను బట్టి ఆ కావ్య రచనా కాలము వ్యంజక మగునేమో ? చూతము.

సీ. తే. చింతకవులందుఁ దపసుల చిత్తమందు
వర్ణ మిళితంబు చిత్తరువందు యవను
లందునవె కాని యొండెడఁ జెందకుండ
లీల ధరయేలె రామభూపాలవరుఁడు.

మాలిని . . . . . . . . .
. . . . . . . . . . .
కవిజన నుతనామా కావుమా మమ్ము రామా.

(3—135, 138)

ఇది పౌరాణికముగా మ్లేచ్ఛ్యులను—యవనులను శిక్షించిన కల్క్యవతార స్తుతి కాకపోదన్నను, మరం చారిత్రకముగా ఇది మునల్మానులను—యవనులను శిక్షించి రక్షించిన అళియ రామరాయల స్తుతి కాబోలునుటకు శబ్దశక్తి ధ్వని తోడ్పడు చున్నది.

వర్ణ మిళితంబు—చాతుర్వర్ణ జాతి సంకరము యవను లందుననే కాని, ఆర్యులందు లేదనుట సాంప్రదాయము, శ్రీకృష్ణదేవరాయల కల్లడైన అళియ రామరాయలు యవన సుల్తానులను జయించి, ఆర్యులు వర్ణ సంకరులు కాకుండు నట్లు జాతిని కాపాడినా డనుట చరిత్ర ప్రసిద్ధము.

సీ. ఎడలపైఁ బొదలు వయ్యెదలు జాఱఁగ బాఱు
ఓబ్బీంకు మునుంగులబ్బఁ జేసె
ఘన భేరికా ధ్వనుల్ విని గుండియలు ప్రీల
వ్రాలు మల్కలకు గోలీలు సేసె
నుడుగని విభ్రాంతిఁ దడగాళ్ల వడనిల్పు
ఖానులు డాఁగ జీకటులు సేసె
. . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . .
నమచు శిరములఁ దాల్తు రెవ్వని సమగ్ర
సైన్య ధుతధూళిఁ జకితులై చనునపాద
కుతుపశాహి నిజామాది కుతల పతుల
తండు నృపమాత్రుఁడే రామ ధరణి విభుఁడు.

(వసుచ. 1—45

అళియరామరాజు కాలములోను,

సీ. నిరతంబు దుర్మార్గ నిరతులౌ తురకల
నతుల సన్మార్గ సంగతులఁ జేసె.

(వసుచ. 1—50)

అనునట్టి కట్టుబాట్లున్నట్లు మొల్ల కవయిత్రి వ్యంగ్య చరిత్ర చెప్పుచున్నది.

ఇట్లగుట కాక్షేపము లేనిచో క్రీ. శ. 16 శతాబ్ద మున—అళియరామరాజు జీవితకాలమున మొల్ల కవయిత్రి రామాయణ కావ్య రచన కావించినట్లు విశ్వయింప వీలున్నది.

క్రీ. శ. 1542—43 తేది నెల్లూరుజిల్లా ఉదయ గిరి కొండమీది శాసనములో 'శ్రీ సదాశివ దేవ మహా

రాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివి రాజ్యంబు చేయుచున్ ఉండి అలియరామయ దేవ మహారాజులుంగారు రామరాజు తిమ్మయ్యదేవ మహారాజులు గారు పాలించిన ఉదయగిరి దుర్గంమీద ......' (సం. 3— పు. 1377) అని కందు.

క్రీ. శ. 16 శతాబ్దము మధ్యకాలములో అలియ రామయదేవ మహారాజులుంగారు ఉదయగిరి దుర్గం పాలించు చున్నపుడు నెల్లూరు పాకనాటిలోని మొల్ల కవయిత్రి ఆ పాకనాటి ప్రభువు అలియ రామరాయల యవన యుద్ధ జయములను తన కావ్యాంతములో వ్యంజకము చేసిన దనుట గ్రంథాంత రంగిక శబ్ద శక్తి ధ్వని చరిత్రము.

సీ. గీ. సాధు కర్ణాట విభవ సంస్థాపనంబు
పూని 'శరణాగతుల నెల్లఁ బ్రోచె రాముఁ
డతఁడు నిజ చరితంబు రామాయణముగ
(వసుచ. 1—43)

మొల్ల రామాయణ మీ దృష్టితో రచించబడినదేమో ?

## "రాజావళి" చరిత్ర

ఢిల్లీ రాజధానిగా యుధిష్ఠిర మహారాజు మొదలు దాదాపు అయిదువేల సంవత్సరాలు ఏలుబడి సాగించిన బహు వంశముల రాజుల చరిత్రను వివరించే "రాజావళి" అన్న పురాతన గ్రంథం ఇప్పుడు లభించింది. దీనివల్ల భారత చరిత్రలో అజ్ఞాతంగా ఉండిపోయిన అనేక విషయాలు ఇప్పుడు బయటపడగలవని చరిత్రకారులు భావిస్తున్నారు.

"రాజావళి" అన్న ఈ గ్రంథం కాంగ్రీ భాషలో ఉంది. కాంగ్రీ మాజీ రాజు శ్రీ బలదేవ్‌సింగ్ ఈ గ్రంథాన్ని సంపాదించారు. ఈ అపురూప చారిత్రక గ్రంథాన్ని పంజాబు ప్రభుత్వపు హిందీ విభాగంవారు ప్రకటించబోతున్నారు. దానిని పరిష్కరించి, శుద్ధ ప్రతిని తయారుచేయవలసిన బాధ్యతను ఆచార్య గౌరీశంకర్, ఆచార్య యదునందనశాస్త్రిగార్లకు అప్పగించారు.

పాండవ వంశీకుడైన యుధిష్ఠిర చక్రవర్తి మొదలు ఢిల్లీ రాజధానిగా 4834 సంవత్సరాల మూడు నెలల పదకొండు రోజులు దేశపాలన చేసిన రాజుల చరిత్ర ఈ గ్రంథంలో ఉంది. ఈ రాజుల వంశ చరిత్ర, వారి పరిపాలనాదిక విషయములు, తెచ్చిన సంస్కరణలు వగైరాలన్నీ 'రాజావళి' లో గ్రంథస్థమై ఉన్నాయి. అందులోని కొన్ని వివరాలివి :—

ధర్మరాజు అనంతరం పాండవ వంశీకులైన రాజులు 30 మంది పాలించారు. వీరి పరిపాలనా కాలం 1745 సంవత్సరాల 2 నెలల 2 రోజులు.

పాండవ వంశం అంతరించిన అనంతరం ఢిల్లీ సింహాసనం విసర్వ వాజిర్వ వంశీయుల పరమైంది. ఈ రాజులు 14 మంది 500 సంవత్సరాల 5 నెలల 6 రోజులు పాలించారు.

వీరి తర్వాత వీరబాహు వంశం అధికారంలోకి వచ్చింది. ఈ వంశపు రాజులు 420 సంవత్సరాల 10 నెలల 14 రోజులు పరిపాలించారు.

ఆ తర్వాత పాలనకు వచ్చిన వంశం ధుండపాలాయు : ఈ రాజులు 9 మంది. 360 సంవత్సరాల 11 నెలల 13 రోజులు పాలించారు.

ఈ వంశాన్ని సముద్రపాలుడనే రాజు అంతమొందించాడు. ఇతని వంశపు రాజులు 15 మంది 405 సంవత్సరాల 5 నెలల 19 రోజులు పాలించారు.

వీరి తర్వాత అధికారానికి వచ్చినవారు తిలోకచంద వంశంవారు. వీరు 10 మంది 119 సంవత్సరాల 10 నెలల 9 రోజులు పాలించారు.

వీరి అనంతరం హరత్ ప్రేమ్ వంశం అధికారానికి వచ్చింది. ఈ వంశపు రాజులు నలుగురు. పరిపాలనా కాలం 49 సంవత్సరాల 11 నెలల 10 రోజులు.

వీరినుంచి ధీసేన వంశంవారు ఢిల్లీని ఆక్రమించారు. వీరి రాజులు 12 మంది. 158 సంవత్సరాలు ఏలుబడి చేశారు.

తర్వాతిది దీపసింగు వంశం. ఆరుగురు రాజులు. 104 సంవత్సరాల 6 నెలల 24 రోజులు పాలించారు.

ఢిల్లీ రాజధానిగా పాలించిన చివరి హిందూ రాజ వంశం రాయ్ పథోరాం వంశం. ఈ రాయ్ పథోరామ్ పృథ్వీ రాజు. ఈయనకు ముందు ఈ వంశీయులు నలుగురు అధికారంలో ఉన్నారు. ఈ వంశం పరిపాలనా కాలం 85 సంవత్సరాల 8 నెలల 24 రోజులు.

పృథ్వీరాజు అనంతరం ఢిల్లీ ముస్లింల ఆక్రమణకు గురి అయింది. మొత్తం 51 మంది ముస్లిం రాజులు పాలించారు. వీరి పరిపాలనా కాలం 778 సంవత్సరాల 2 నెలల 11 రోజులు, అని ఈ "రాజావళి" గ్రంథం తెలుపుతున్నది.
(వాహెవ్)

# 'లోపడు' సాధువు కాదా?



## శ్రీ వంతారాం రామకృష్ణారావు

పైశీర్షికతో శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు సెప్టెంబరు భారతిలో ఒకవ్యాసమును ప్రకటించినారు. శ్రీ తుమ్మల వారి పై వ్యాసమును చదివిన తరువాతకూడ 'లోపడు' శబ్దము సాధువు కావచ్చునను అభిప్రాయము నాకు కలుగలేదు. ఇది నాకు పరమపూజ్యులైన వారితోడి వ్యవహారము. ఐనను భాషావిషయ మగుటచే నాకు సత్యమని తోచిన విషయమును వ్రాయ సాహసించు చున్నాను.

లోను+పడు=లోపడు — అయ్యెననుటకుదృష్టాంత ముగా వ్యాసములో చూపబడినవానిలో—"లోచేయి, లోచేసికొను, లోవిక్కు, లోచెదు, లోతట్టు, లోపిరికి—అను రూపములు సూర్యరాయ నిఘంటువున లేవు. లోచూపు, లోకడుపు, లోతక్కువ—అనునవి సూర్యరాయ నిఘంటువున కలవు. శబ్ద రత్నాకరమున, లోచూపు, లోతక్కువ అనునవి కలవు. కాని ఇవి "లోను+చూపు (లోనిచూపు—అని మాత్రమే అగును.) లోను+కడుపు; లోను+తక్కువ—అను పదచ్ఛేదములచే ఏర్పడి నవికావు. లోపల+చూపు; లోపల+కడుపు; లోపల+తక్కువ—అనియే నిఘంటువుల పదచ్ఛేదము. శబ్ద రత్నాకరమున 'లోచేయి' కలదు. లోపల+చేయి—అనియే పదచ్ఛేదము చెప్పబడినది. సూర్యరాయ నిఘంటువు'లోఁజేయి' అని గ్రహించినది. లోను+చేయి—అని పదచ్ఛేదము చేసినది.

లోచూపు—మున్నగు పదములు, లోపల+చూపు—ఇత్యాది పదచ్ఛేదములచే నేర్పడినవగుటచే, లోను+పడు—లోపడు—అగుననుటకు ఈ రూపములు సాధకములు కానేరవు.

"పైన్+పడు, చేన్+పడు—పైపడు, చేపడు అనియే ఏక శబ్దములగుచో ద్రుతములకే లోపమగుచుండ లోను+పడు =లోపడు—ఏల కానేరదు" అను సులభ వ్యాకర్తగారి యుక్తి సరికాదు. ఈ పదచ్ఛేదముల పక్షమున ద్రుతలోపమునకు దారి ఏమి? శబ్ద పల్లవములో 'కేచిచ్ఛబ్ద విశేషాస్స్యుః క్రియా యోగే ద్రుతాన్వితాః" అను అథర్వణకారిక చొప్పున కొన్నింట ద్రుతమాగమ మగుట కవకాశము కలదుగాని ద్రుతము పోవు ననుటకు అవకాశ మేమియునులేదు. అసలు ద్రుత ప్రకృతి కము శబ్ద పల్లవ పూర్వావయవము కానేరదు గాన ద్రుతలోప మునకు ప్రసక్తి లేనేలేదు. శబ్ద పల్లవ పూర్వావయవము ధాతువును కావచ్చునను చిన్నయసూరి ఆశయము సరికాదన వలసియున్నది. (వ్యా. సం. సర్వ. 'శబ్ద పల్లవ స్వరూప నిరూప ణము' —సాహితి—ఏప్రిల్ 1963.) శబ్ద పల్లవ పూర్వావ యవము ద్రుత ప్రకృతికముగ నుండు నుదాహరణము చిన్నయ సూరియైనను ఇచ్చియుండలేదు. 'ప్రథమాయాద్వితీయాయా స్సంబంధ స్సప్తత్ర సమ్మతః క్వచి ద్విభక్తి వైచిత్ర్యం దృశ్యతే కవి భాషితే" అను అథర్వణ కారికల చొప్పున శబ్ద పల్లవ పూర్వావయవము ప్రథమాంతముగాని, ద్వితీయార్థక ప్రథ మాంతముగాని సప్తమ్యాద్యర్థక ప్రథమాంతముగాని, అగు నామమై యుండవలెను. కాన పైన్+పడు, చేన్+పడు—అను పదచ్ఛేదములు సరికావు. అందుచే "ద్రుతములకే లోపమగు చుండ, లోను+పడు = లోపడు. ఏల కానేరదు" అను వితర్కము, అవిచారిత రమణీయము.

"కవి భల్లటైః క్రియాణాం నామ్నాంచోలోప ఇష్యతే హ్యేషు, ప్రథమైకవచనమాత్రే వికృతా నాన్తదయోపి కథ్యన్తే" అను చింతామణి చొప్పున నువర్ణాంత శబ్దములలో ఉత్వము లోపించుచుండును. మ్రాను+పడు= మ్రాన్పడు, మీను+పొల=మీన్బొల, కను+పట్టు=కన్పట్టు మొ. ఉత్వ ములోపింపగా మిగిలిన 'మీన్' మున్నగు వానిలోని నకారము ద్రుతమగుటయే చింతామణి సమ్మతము. అయినను "నోరన్య స్యాపి సర్వం స్యాద్బహుళం సత్ప్రయోగతః" అను అథర్వణ కారికలోని బహుళ శబ్దముచే 'మ్రాన్పడు' మున్నగుచోట్ల ద్రుత కార్యములు జరుగలేదని గ్రహింపవలసి యున్నది. 'ఏను+పది=ఏఁబది' మున్నగునవి ద్రుత కార్యములు జరుగు టకుదాహరణములు. లోను+పడు—అనుచో "కవిభల్లటైః" ఇత్యాది సూత్రముచే ఉత్వము లోపించి పరిశిష్టన కారము ద్రుత కార్యముల నందగా "లోఁబడు' అనురూప మేర్పడును. 'ను' వర్ణ లోపము జరుగదనుటకు పై 'ను' వర్ణాంత శబ్దములు ప్రమాణములగు చున్నవి. అంతేకాక "లోఁగడ, లోఁగన్ను, లోఁగలి, లోఁగోను, లోఁజెయ్యి, లోఁజే(యి), లోఁజేయు, లోఁబుట్టు" అను రూపములలో 'లోను' శబ్దము నందలి ఉత్వము లోపించు టయు ద్రుత కార్యములు జరుగుటయు కన్పట్టుచున్నది. 'ను'

# 'లోపడు' సాధువు కాదా?

వర్ణ లోప మెంత మాత్రమును లేదు. పై రూపమునకు లోను + కడ' ఇత్యాదిగానే సూర్యరాయ నిఘంటువున పద చ్ఛేదములు చెప్పబడినవి.

కాగా, లోను + పడు=లోన్ + పడు = లోఁబడు— అనియే అగును. 'ను' వర్ణము లోపించి 'లోపడు' అగుట 'ను' వర్ణాంత శబ్ద తత్త్వమునకు విరుద్ధమని స్పష్టపడుచున్నది.

లోను + పడు = లోపడు—అగుటయే నిజమైనచో లోను + కొను='లోకొను' అగుట ధర్మము. 'పడు' పరకత్వము ను'కొను' పరకత్వముననను రూపము లోక రీతి నుండుటయే కన్పట్టును. ఉదా: పై పడు—పైకొను; చేపడు—చేకొను ము. 'లోకొను' అను రూపములేదు సరే గదా 'లో(గొను' అను రూపము ప్రాసాది ఘటితమై యున్నది. ''పింగునపార సత్త్వగుణ విస్ఫురణన్.........తద్దయున్, లోంగొని పేర్మితో'' కు. సం. 1—4 అను ఈ నన్నచోడని ప్రయోగమును సూర్య రాయ నిఘంటువు చూపియే యున్నది. ''లోఁగొను—లోపలికి దీసికొను—'కన నెంతవానిలో గొనుట నాదర్శంబు, నెమ్మొగంబగుట సందియము గలదె.' ఆముక్త 2—30 (వశ పరచుకొనుట అని రెండవ యర్థము)'' సూ. ని. లోను + కొను=లోన్ + కొను= లోఁగొను—అయినట్లే లోను + పడు=లోన్ + పడు=లోఁబడు— అగుట సుసంగతము. 'లోను + పడు' అనుచో 'ను' వర్ణ లోపము రాదనుటకు 'లోఁగొను' అను రూపమును ప్రోద్బలముగా నున్నది.

'లోఁబడు' అను రూపమునకు శ. ర. కర్త హరిశ్చంద్ర నలో పాఖ్యాన ప్రయోగమును చూపినాడు. ''కినిసిపాణి నాళీకంబు సానుపుటయును, నంతలోఁ బడకదియు'' (అంతలోన్ + పడక, అంతన్ + లోఁబడక—అని భేదము'') శ. ర. లేడిపై బాణమును ప్రయోగించినపుడు—అది నేల గూలలేదనియో, చావలేదనియో చెప్పుట స్వరసమై యుండును. కానీ వశపడలేదని చెప్పుట స్వరసముకాదు. లేడిని పట్టుకొనుటకు వలవన్ని, ఆ వలలో అది పడక తప్పించు కొన్నప్పుడు వశపడలేదని (లోఁబడలేదని) చెప్పుట సుసంగతమై యుండును. కాన బాణమును ప్రయో గింపగా లేడి, అంతలోన్, పడకపోయె ననుటయే సమంజ సము. అంతలోన్, పడక—అనియే ప్రాచీన వ్యాఖ్యాత పద చ్ఛేదము చేసినాడు. అతడు రెండర్థములలో 'వశపడు' అన్నచో చాలుననుకొన్న యెడల లోఁబడు=వశపడు' అని వ్రాసియే యుండును. కాన ఇట 'లోఁబడు' అనుదానిని 'లోపడు' అని దిద్ది వేసి, లోను + పడు=లోపడు—అగునను సులభ వ్యాకర్తగారి ధోరణి అసంగత మనక తీరదు.

లోనం + చూపు=లోచూపు—అయినట్లు లోపల + పడు లోపడు—అవ్వ ననుటకును అవకాశములేదు. ఈ పదచ్ఛేద పక్షమున 'వశపడు' అను అర్థము రాదేమి. లోనుపడు, లోనగు, లోనుచేయు, లోనుగాచేయు—అను రూపములున్నవి. (సూ. ని.) కాని ''లోనిబడు=వశపడు'' వంటి రూపములు లేవు.

కాళహస్తి మహాత్మ్యమున 'లోపడు' అని ముద్రితము. ఈ గ్రంథరాజము సుపరిష్కృతము కాలేదు. ఈ ముద్రణమును గూర్చి శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు పీఠికా ముఖమున ఇట్లు తెలిపియున్నారు. ''కాళహస్తి—పరిశీలనము పూర్తి అయినది. అచ్చు పొరపాటులు చాలా మార్పవలసినవి తేలినవి. ఇక అర్థ దోషములు ప్రత్యేకముగా చెప్పవలసినవి'' ఇట్టి తప్పుల తడక ముద్రణములోని 'లోపడు' అని పాఠ మనుట విశ్వసనీయము కాదు. భీష్మపర్వములో (భీష్మ 3.105) 'లోపడు' అని వావిళ్ళ ప్రతిలో నుండుట యొక్క ప్రమాణము కానేరదు. రామా అండ్ కో వారి ప్రతిలో 'లోఁబడు' అని సరి గానే యున్నది.

''తోఁబాటు, లోఁబడు—ఒక జాతిలోనివి'' అనుట సమం జసముగా కనబడదు. 'తోపాటు' సాధువు, 'తోఁబాటు' దానికి బదులుగా వచ్చిన అపశబ్దము. ''నాతోపాటు అని పూర్వులు వాడ లేదు. అధునికులు కొందరు స్వేచ్ఛగా కావ్యాలలో ప్రయో గిస్తున్నారు. శ. ర. లో 'తోపాటు' ఉన్నది. అయినా అది తప్పని భ్రమపడి 'నాతోఁబాటు' అని సవరిస్తున్నారు. అలాగున చేయ డము అవివేక విలసితము. భారతములో 'తోడిపాటున' అని ఉన్నది. దానినుండి రాను రాను ఉత్తరాంధ్రములో ఈ రూపమేర్పడి నది'' అని శ్రీ గిడుగువారు తెలిపినారు. (బాలక—253పుట) 'తోఁబాటు' సాధువే అయియున్నచో 'తోఁగొను' అను రూప ముండి యుండెడిది. అట్టి రూపములేదు. 'తోకొను' అనియే కలదు. దీనినిబట్టియు 'తోపాటు' అన్నదే సాధువని తెలియు చున్నది. ఇక 'లోఁబడు' విషయము దీనికి కేవలము భిన్నము. లోఁబడు—సాధువు దీనికి బదులుగా వచ్చిన అపశబ్దము—'లోప డు' 'లోకొను' అను రూపములేక పోవుటయు, ఇది అప శబ్ద మనుటకు తార్కాణమని చెప్పియే యున్నాను. ఈ ''లోపడు'' శబ్దము పై పడు—చేపడు—అను వాని సామ్యమున సలక్షణతా భ్రాంతి కలిగి ఏర్పడిన రూపము.

'లోపడు' సాధువు కాదనియు 'లోఁబడు' అన్నదే సాధు వనియు సారాంశము. ఇందుకు నాకు తోచిన ఉప పత్తులను పెద్దల ఎదుట యుంచినాను. నా ఈ సాహసమును దయతో మన్నింప వేడుకోలు.

---

# అముద్రిత నానార్థనిఘంటువు

✱

శ్రీ నిడుదవోలు వేంకటరావు

సెప్టెంబరు భారతిలో పై శీర్షిక క్రింద ప్రకటిత మైన లేఖ కేవలము వ్యక్తిగతమైనదేగాని భాషాసాహిత్యము నకు సంబంధించినది కాదు. ఇట్టి వ్రాతలకు ప్రత్యుత్తరము వ్రాయుట, అమూల్యమగు కాలమును వ్యర్థము చేయుటయే యగును. అయినను సూర్యాలోక భాగ్యము పడయలేని కొన్ని వాఙ్మయ దివాంధముల స్వభా వము లోకమునకు తెలుపుటకే గాక, తెలియదగిన కొన్ని విశేష ములు వెల్లడి కాదగినవి యుండుటచేత నీ ప్రత్యుత్తర మావశ్యక మైనది.

## 1. సంయుక్తా సంయుక్తాక్షర ప్రాసదోషము

''బరహియనన్
బర్హియనన్
బరహియన

బర్హియనన్— ఇది సంయుక్తా సంయుక్తాక్షర దోషమని యాక్షేపము. ఛందో గ్రంథములలో:
సంయుతాక్షర ప్రాసము. సంయుతా సంయుత ప్రాసము—అని యున్నవి గాని సంయుక్తా సంయుక్తాక్షర ప్రాస యెక్కడ నున్నది ? లేఖాకర్త చెప్పగలడా ?

సంయుతాక్షర ప్రాస లక్షణము :

గీ. సంయుతాక్షర ప్రాసమై జగతి వెలయు
గర్గు దర్పించు దైవంబు భర్గుఁ డనఁగఁ
బక్ష్మలేక్షణ కొనతి సూక్ష్మ మనఁగఁ
జంద్రవంశ్యుండు భోగదే వేంద్రు డనఁగఁ.
అప్ప. 3—313

సంయుతా సంయుత ప్రాస లక్షణము:

గీ. రలలు తమ క్రింద జడ్డలై క్రాలు వ్రాలు
ప్రాస వర్ణంబులై వాని బాసియైన
కూడి యైనను బెఱ యడుగులను నిలుచు
నంయుతా సంయుత ప్రాస సంజ్ఞ దనరి.
అప్ప. 3—314.

పొడి ద్రచ్చఁగనిమ్ము నా తండ్రి కృష్ణ
వేడు కొనియెద నందాకఁ బండ్లు దినుము
దుండగపుఁ జేష్టలును నోటి గాండ్రతనము
మెండుగాఁ జొచ్చె నీకు నై దేండ్లు కనగ.—3—315

సంయుతాక్షర ప్రాసలో ప్రాసాక్షరము లన్నియు నాయా యా వర్గ సంయుక్తాక్షరములై యుండవలెను.

గర్గ—భర్గ—పక్ష్మ—సూక్ష్మ—చంద్ర—దేవేంద్ర...
సంయుతా సంయుత ప్రాసలో:
పొడి—తండ్రి—వేడు—పండ్లు.

ఇట్లొకచోట రేఫ లకారములు క్రిందనున్న సంయుతాక్షర ములు రేఫ లకారములతో ప్రాస చెందునని దీని లక్షణము.

పై కందపద్య మీ రెండింటికి చెందదుగదా!

సంయుతాక్షర ప్రాసలో వలె ప్రాసాక్షరములు వేర్వేరు పదములకు ప్రాస లేదు.

గర్గ—భర్గ—ఈ రెండును వేర్వేరు పదములు—'ర్గ' కార సంయుక్తాక్షరము మాత్రము సమానము.

పై కందమున—బర్హి—అను పదము రెండుచోట చూపబడినది. తక్కిన రెండు పాదములలో బరిహి—అను శిథిల రూపము చూపబడినది. అది కూడ 'బర్హి' అను రూపమే గాని వేఱొక రూపముగా నుండదు కదా. అప్పుడు నాలుగు పాదములలో నొక సంయుక్తాక్షరమున్నప్పుడు—అది సమప్రాసమగుచున్నది. ఇచట దోషమే లేదు. ఏలననగా:

'బరిహి' అను రూపాంతరము జెందిన—బర్హి శబ్దముతో అట్టి రూపాంతరము చెందని గర్హిత—తర్హిత—మొదలగు శబ్ద ములు ప్రాసలో నున్న అప్పుడు ప్రాసదోష యుక్తము.

బరిహి
తర్హిత

గర్హిత—అని యున్న ప్రాస తప్పుమ—ఏలననగా, తర్హిత—గర్హిత అనువానికి గరిహిత, తరిహిత—అను రూపాంత రములు లేవు. 'బర్హి' కి అట్టి రూపాంతరము లేదు. అట్లు

కానప్పు డన్నియు నొకే శబ్దరూపాంతరము లైనప్పుడు ప్రాస దోషము లేదుగదా. ఇట్లు పాఠశాలలో చదువు బాలురకు తెలియు ప్రాస లక్షణము కూడ—లేఖా కర్తకు తెలియదన్నమాట.

నేను చెప్పినది రూపాంతర మట :—తాను చూపినది ప్రాస మట—దానికి దీనికి సంబంధము లేదట. ఇచట శబ్దము ప్రాసతో గాక, యతితో సంబంధమా ? మఱియొక దానితో సంబంధమా ? వ్రాయనకాడు రెండుచోట్ల సంయుక్తాక్షరముగా వ్రాసిన శబ్దమును, వివేచింపకనే ప్రాస దోష మనుట—ఛందోపరిజ్ఞాన శూన్యతను స్పష్టము చేయు చున్నది.

ఏ శబ్దము యొక్క రూపాంతరము లాయా భాషలకు సంబంధించినవేగాని యితర భాషా సంబంధి య్యైనవిగా నుండవు.

ఉదా : బర్హి— బరిహి— కురువకము— కుర్వకము—ఇట్టివి తత్సమములే. బర్హి రూపము తత్సమమే. కావున దాని రూపాంతరము 'బరిహి' తత్సమమే. అందుచేతనే బరిహి కేశభరంబున అను సమాసమున ప్రయుక్తమైనది. 'రూపాంతరము' అనగా నేమో, 'భవము' అనగా నేమో, అర్థము తెలియక లేఖా కర్త వ్యక్తిగత ద్వేషము నెట్లు వెడల గ్రక్కెనో చూడుడు:

''నారాయణ శబ్ద భవం నన్నయ కాదు. వారి సిద్ధాంతం చేసిన ఉపపత్తి నేడు సత్యనారాయణ అన్న పేరును సత్య నన్నయ అనుట లేదుగదా ! పై సిద్ధాంతానికి ఉపపత్తి ఇదెలా ఉన్నదంటే వెంకయ్య, ఎంకయ్య, ఎంకన్న, వెంకోజీ—ఇత్యాది శబ్దాలకు రావు చేర్చుట సహజంగా లేదు. అందుచే నివి వేంకట శబ్ద భవములు కావు అన్నట్లుంది.''

ఇది చాలును. లేఖాకర్త నా లేఖకు ప్రత్యుత్తరము వ్రాయుటకు కారణము తానే తెలిపినాడు.

''నారాయణ శబ్దభవం నన్నయ కాదు.'' అని నేను ''నన్నయ నన్నిచోడ కవులు'' అను వ్యాసమున వ్రాసియున్నాను. (చూ. భారతి మే : 1963. పుట 58). ఇది కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ''నన్నయ ప్రసన్న కథా కలి తార్థయుక్తి'' అను గ్రంథము 2 వ పుటలో 'నారాయణ శబ్దభవము నన్నియ' అను వాక్యమును విమర్శించుచు వ్రాసి నది. లేఖాకర్త విశ్వనాథవారి యనుయాయి యగుటచేత అప్రసక్తముగా, అసందర్భముగా, నీ విషయము నిక్కడ చేర్చి—తన యజ్ఞతను ప్రదర్శించినాడు.

రూపాంతరమనగా—వేఱు రూపమును పొందినది—

భవము—అనగా పుట్టినది—తద్భవము—అనగా తత్సమమగు సంస్కృతమునుండి పుట్టినది. ఇట్లర్థము ఉండగా, రూపాంతరమగు బర్హికిని—నన్నయకు సంబంధమేమి—

లేఖాకర్త విశ్వనాథ వారి పేరెత్తినపుడును, నా యభిప్రాయము చెప్పినను, విశ్లేషింపు వ్రాత వ్రాసి యున్నాను. అసలు వేంకట శబ్దము—నానార్థముగా నుండి శుద్ధ సంస్కృత శబ్దము కాదు. ద్రావిడభాష యందలి 'వేంగడమ్'' శబ్ద సంస్కృతీకరణము—రాయప్రోలు వారి నుండి వెంకటరత్నం పంతులుగారు 'వేం' పాపం కటయతీతి—, అన్న వ్యుత్పత్తిని సిరసించి 'అఘహారిణి' అని వ్రాసినారు. వ్యక్తి పక్షముగా వ్రాయుట నా సంప్రదాయము సమ్మతము లేదు—అయినను లేఖాకర్త ప్రారంభమునందే యిట్లుగా వ్రాయవలసి వచ్చుచున్నది.

విశ్వనాథవారిని పురస్కరించుకొని లేఖాకర్త—వెంకయ్య—ఎంకయ్య—ఇత్యాదిగా వ్రాసినందులకు నేను—''విశ్వనాథ' వారికి శబ్దస్వరూపము, శబ్ద లక్షణము తెలియని మాట యటుంచనిచ్చి, భాషచరిత్ర—వాఙ్మయ చరిత్ర—అనగా నేమో, అట్టి పరిజ్ఞానము కూడ లే''దని మఱియొక వ్యాసమున వారి వాక్యములనే ప్రమాణముగా తీసుకొని ప్రకటించుచున్నాను.

ప్రస్తుత లేఖాకర్త కాని, వారి పక్షమునగాని దానికి ప్రత్యుత్తర మేమి యొసగెదరో చూచెదను.

## 2. యతులు-మ-వ యతి.

''మానవుడవ భార్య లేని వానికి పేరున్.''

అని యొక పాద మున్నదని లేఖాకర్త. కాని యిది లాక్షిణికు లిచ్చిన యతి.

''మరు దీమము లేమకీర వాణి యనంగన్—
దీనికి సంభావన వడి'' యని పేరు.

అని నేను వ్రాసితిని.

'దీనికి లేఖాకర్త ''ఈ యతి రెండు రకాలుగా ఒప్పు'' అని వా రనవచ్చు.

1. బూకరింపు. 2. అప్పకవీయం మరచిపోవడం.

రెండవది కాకపోవచ్చునేమో, ఏ పద్యం ఉదాహరించి ఈ యతిని తృణీకరించారో ఆ పద్య పాదమే వీ రుదాహరించి వారు కాబట్టి. పోతే మొదటిదియే అయి యుండవచ్చు. ఈ యతిని అప్పకవి అగ్రాహ్యయతుల్లో చేర్చాడు. కాబట్టి యిది ఒప్పనడం అసమంజసంగా ఉంది. పాఠకుల సౌకర్యం కోసం అప్పకవీయంలోని వాక్యా లుద్ధరిస్తున్నాను.

ధర నవ ఋషభా క్షరము...
వరుసవి బూ యేను గూడి వాలో జెల్లన్
సవిసంధానవ పడియని—
మరు ధీమము లేమ కీరవాణి యమనంగన్—

సంయుక్తాక్షరము లైయుండినప్పుడు న జ ల కళేవ యతి గాన ప్రథమ ద్వితీయ చతుర్థ వర్ణములు ఒ కారమునకు న శ్రేవ యతియగాన నది నిలుచును.

మ కారము నడపడు. ఇది విచారించక చెప్పినాడు గాన నిలుచు న యుక్తమని తెలిసికొనునది.''

పై వ్రాతమట్టి నేను వ్రాసినది 'బాకరింపు' అప్పకవీయమును మరచిపోవడం—అని కదా లేఖాకర్త అభిప్రాయము. ఈ క్రింది అంశము వలన లేఖాకర్తకు ప్రాస పరిజ్ఞానమే కాక యతి పరిజ్ఞానము కూడ స్వల్పమని తెలియుచున్నది.

లేఖాకర్తకు అప్పకవి గ్రంథము తప్ప మఱియొకటి తెలియదు. ఆంధ్రభాషా చింతామణి కర్త ఎల్లయ సన్నయ భట్టును తెలియనప్పుడు, అప్పకవి భాషా వాఙ్మయ సంప్రదాయములను మఱచిపోయియున్నారు. కాబట్టియే కూచిమంచి తిమ్మకవి వెంకటరాయ ప్రభృతు లప్పకవిని తీవ్రముగ విమర్శించియే యున్నారు. కాని, వారి గ్రంథములలో తిమ్మకవి సర్వ లక్షణ సారసంగ్రహము ముద్రితమైనను, దాని పైన మన విమర్శకులు చక్కగా చదువకపోవుట చేతను, వేంకటరాయకవి గ్రంథము ముద్రణలో లేక, కీర్తిశేషులు గిడుగువారి మూలముననే లోకమునకు తెలియుటచేతను— అప్పకవీయమే పరమ ప్రమాణ గ్రంథమని యుదాసీంతనుల కుపాదేయమైనది—అది యట్లుండనిండు—

అప్పకవి అగ్రాహ్య యతులలో నీ యతిని, చేర్చుట యెంత యప్రమాణికమో, ఎంత వారిత్రక విరుద్ధమో, చూడుడు:

అప్పకవి తాను పరిశీలించిన లక్షణ గ్రంథములలో నొకటి యగు[1] 'లక్షణ దీపిక'లో నున్న పై యతి లక్షణములను విమర్శించి యగ్రాహ్యమని నిరూపించినాడు. కాని ఆ లక్షణ గ్రంథ కర్త యేపూర్వ కవుల లక్ష్యము లున్నందువలన మ—వ యతిని నిరూపించెనో వానిని పరిశీలింపలేదు. లక్షణ దీపికలో లక్ష్యములు లేవు. అంతమాత్రమున నట్టి యతి యగ్రాహ్యమని చెప్పరాదు. లక్షణ దీపికాకారుడీయకపోయినను, లతని యతికి లక్ష్యములుగా నీ క్రింది ప్రయోగములగుపడుచునే యున్నవి.

పాల్కురికి సోమనాథుడు—బసవ పురాణము:
ప్రస్వి యెంతయును శ్రమంపడి యుట్లు.
5. ఆ. 190 పంక్తి.

వచ్చె నా బాస శ్రమణలార—నేడు.
6. ఆ. 591 పంక్తి.

విన్నకోట పెద్దన :
ఏనుమతి యెల్లవారలు శ్రమంపడ. (3—441)

పెద్దన్నయే కావ్యాలంకార చూడామణిలో (9—10) సీమ, వ ప్రాసమునే వాడియున్నాడు. చూడుడు.

క. క్రమమునం దత్సమమునుద
ద్భవమును సహజాంధ్ర దేశభవమును దేశ్యో
ద్భవమును గ్రామ్యమునాం బం
చ విధములై తెలుగు పలుకు జాతము పరగున్.

పై పద్యమున వ్రాత ప్రతులలో 'క్రమము' అని యున్నది. కాని ముద్రణమున 'క్రమము' అని గాని లేక క్రవము అనిగాని రూప ముండదని ప్రాస తప్పినదని, 'భువిలో' అను వ్యర్థ పద మొకటి చేర్చి పాఠము ముద్రిత మైనది.2

విన్నకోట పెద్దనయే గాదు. కవిత్రయములోని తిక్కన యెఱ్ఱన లిరువురు నిట్టి ప్రయోగములను గావించినవారే. అందు తిక్కన కర్ణపర్వమున (2—30) ''వలసినం బేర్చు శ్రమంబులందు'' అని యుండగా, నిది తప్పనుకొని— శ్రమంబులందు—అను దానిని 'సత్యంబులందు' అని మార్చినారు. ఇది నిరర్థకము, మూల విరుద్ధము.

మది మది నుండి యేను బలవంతుడనై.
(హరి. ఉ. 8—198)

వావిళ ముద్రణమున (నూతన ముద్రిత వత్సరము లేదు.)

'బలమత్తుడనై' అని కలదు. కాని, పూర్వ ముద్రణమ్ములలో, వ్రాతలలో 'బలవంతుడనై' అనియే కలదు.

1. ఇది ముద్రితము కాలేదు. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున ఆర్. 1312 సంఖ్య గల తాళపత్ర ప్రతి. (ప్రస్తుతమునకు యిది తిరుపతిలో నున్నది) రంగరాట్ ఛందస్సు మూలమున నీ గ్రంథమునకు కర్త వార్తాకవి రఘునాథయ్య యని స్పష్టపడినది.

2. వేదమువారు ప్రకటించిన కావ్యాలంకార చూడామణి. 122 పుట.

3. తిక్కన భారతమున పెక్కుచోట్ల నిట్లు మ. వ పాఠములు మఱుగుపడినవి. వాని నన్నింటిని—నేను భాషా శాస్త్ర పరిశోధన—యతిప్రాస తత్త్వము—అను వ్యాసమున నిరూపించితిని. (Annals of the Oriental Research of the University of Madras-Volume XV- 1958—1959 1—38 pp.

ఇట్లు—వు, వ ంటే కాక ము—వు—లకు యతి గల ప్రయోగములు 'సంభావనవడి' అను శీర్షిక క్రింద తెలుగు బాసలో ఛందోరీతులు అను గ్రంథమున చూపబడినవి. 4.

పై వానిలో శ్రమము, క్రమము మొదలైన వానికి శ్రమము, క్రమము అను రూపాంతరములైనా అంగీకరింపవలెను. లేదా, ము—వ యతి గ్రాహ్యము అని యైనా అంగీకరింపవలెను.

ఇప్పు డేమైనది అప్పకవి మాట! బాకరింపు అప్పకవిదా లేక నాదియా?

## 3. ఋ-రు-(శతృల్)

ఋ—రు—యతి విషయమై లేఖా కర్త వ్రాసిన విషయ మాత డప్పకవీయము తప్ప వేఱొక ఛందో గ్రంథము గాని, ఛందో విషయములపై వచ్చుచున్న విమర్శనములను గాని చూచి చదివనట్లు స్పష్ట మగుచున్నది. తన గ్రంథము చూచిన తరువాత తక్కిన ఛందోలక్షణ గ్రంథము లను చూడ నక్కరలేదని గొప్ప చెప్పుకొన్న అప్పకవి యీ యతిని సంగ్రహింపనే లేదు4. ఆపైని శబ్ద స్వరూపము నిరూపించి, ఋ—రు లలో అచ్చు, హల్లు ఈ రెండింటికి యతు లున్నవని చెప్పలేదు. శివకవులమాట యటుండనిచ్చి తిక్కనాది మహాకవుల రచనలలోను నిట్టి యతి కన్పట్టు చున్నది. అప్పకవికి ముందు సుప్రసిద్ధ లాక్షణికుడు, తాతం భట్టు దీనిని నిషేధించుటయే యీ యతి యంతకుముం దుండెనని తెలియుచున్నది.

కవిత్రయమున తిక్కన—ఎఱ్ఱనలును నీ యతిని ప్రయోగించి యున్నారు. 'సప్తఋషులైరి వారు మరుద్గణంబు'—తిక్కన శల్య. 2—160—ము.ద్రిత ప్రతిలో సప్తపురుషులైరి.

ఈ యతికి ఒక్క భాస్కర రామాయణమున యుద్ధ కాండముననే నాలుగుచోట్ల ప్రయోగము లున్నవి.

క్రూరార్థ—కృత్తోరు (1448) కొని—గృహ (1617) సుర—శృంగ (252) పృథు—పొంపిరి (2021) భోజ రాజీయమున—గృహ—కొని (3—27).

ఋషభ ప్రౌఢ—సంరోధించి—ఎఱ్ఱన—హరి. పూ. 8. 48

ఇట్లు మహాకవి ప్రయోగములున్నను, అప్పకవి సంగ్రహింపలేదు. ఇట్టి అప్పకవి ననుసరించి యీ యతి దోషమన్న లేఖాకర్త వ్రాత, అత్యంతమూ దోషభూయిష్ఠ మనక తప్పదు.

'శబ్ద తత్త్వము' అను శీర్షిక క్రింద శబ్దరత్నాకరాను బంధముననే నిచ్చిన పదములు విమర్శింపబడినవి. ఈ శీర్షిక వల్ల లేఖాకర్త యుదాహృతాంశము [illegible]. పైని క్రింది యుదాహరణము చూడుడు.

కాగజ్—చైనా భాషాపదము :

శబ్దరత్నాకరమున నున్నది. కాగజ్—చైనా భాషా పదము అని. ఈ శబ్దచరిత్ర తెలుసుకొనుచో, శబ్దరత్నాకరమున నున్న శబ్ద రత్న [illegible] వేఱు పెట్టిరో [illegible] గ్రహించుడు.

## 4. కాగితము - కాగతము

నేడు మనము వ్యవహారములో వాడు కాగితము—కాయితము అను వాని పూర్వ రూపము కాగితము—ఇది కాగజ్' అను పారసీకపదమునుండి వచ్చినదని ఉర్దూ నిఘంటువులలో కలదు. కాని యిది పారసీక భాషాపదము కాదు. అరబీ భాషలో దీనికి పర్యాయపదముగా (Quirtas) క్విర్టాస్ అనునది కన్పట్టుచున్నది. ఇది మహమ్మదీయుల వేదమగు ఖొరానులో నున్నది. కాని, అరబీ భాషలో, కాగితమును తెలుపు వేఱు పర్యాయపదము లేనందున ఆ భాషా విద్వాంసులీ శబ్దమును దేశాంతరమునుండి (అన్య దేశమునుండి) గ్రహింప బడినదే కాని దేశ్యము కాదని తీర్మానించిరి.

ఈ క్విర్టాస్ అను పదము చైనా భాషనుండి వచ్చి నట్లుగా అరబీ, చైనా భాషలు తెలిసిన పండితులు నిర్ణ యించిరి.

చైనా యందలి దక్షిణ ప్రాంతీయ భాషలో, (Chi-tan-trz) (చి. టాన్. ట్ర) అనగా కాగితము జ్ఞాపిక అని యర్థము. (Papa Memo) అనియు నర్థ మున్నది. అది అరబీ భాషలో 'క్విర్టాస్' గా మారినది.5 (క్విర్—టా—స) (Quir-ta-s) కాగితము అను నర్థములో నది ఖొరా నులో నున్నది. 'క్విర్టాస్' కు పర్యాయ పదముగా కాగజ్ అను నది అరబీ భాషలో నున్నది. చైనా భాషలోనే చి. టాన్.

4. ఈ ఋ—రు—యతినే కాదు. స్వా—త—ఉ—వు. వలపలగిలక యతి యిట్టివి నిరూపింపనే లేదు.

దీనిని గూర్చి వివరములు—ముందు నా వ్యాసమునం దును; సాహిత్య అకాడమీ బహుమతి పాత్రములైన—సంప త్కుమార—"తెలుగు ఛందోవికాసము—తెలుగు భాషలో ఛందో రీతులు" అను గ్రంథములలో గలవు. ముద్రితమై ప్రసిద్ధ మైన పుస్తకములలోని విషయములను కూడ పరిశీలింపని వ్రాతలకు సమాధాన మేమి ?

5. క, చ—మార్పు—ద్రావిడ భాషలలో నున్నదే— కన్ను—కెడియు—తెలు. చెఱువు మొదలగునవి.

# అముద్రిత నానార్థ నిఘంటువు

టప్పుడు, దైవమా! అన్నట్లు, ఒక నిఘంటువు బయల్పడి నది. గుణగ్రహణ పారీణులగు భాషాభిమానులు గలరుగదా! దీని బాగోగుల గురించి వారే నిర్ణయించుట మంచిదని, యథామాతృకముగ కొన్ని పద్యములను భారతియందు నుదాహరించి యుంటిని. వాటి సవరింపుకుగాని, ఆ పదము లను క్రమముగా నిరూపించుటకుగాని బూనక తొందర పడి, ఏది విమర్శించదగ్గది, ఏదికాదు అను పూర్వా పర సందర్భముల పరిశీలింపకయే, శ్రీ కోటేశ్వరరావుగారు 63 ఏప్రిల్ భారతియందు ఏమోమేమో మరికొంత లేఖ వ్రాసిరి.

"నేటికి 107 సం.లు క్రిందట వ్రాయబడిందని వ్రాతము అందులో ఉందట" అని లిఖించిరి.— (ఆనంద నామ సంవత్సర కా. బ. 10) అని స్పష్టముగా వ్రాత ప్రతియందు వ్రాయబడియున్నది. కాన ఇది క్రీ. శ. 1855తో సరిపోవు నంటిని. ఇది తప్పేనా ? మరి "అట" అనడం దేనికీ.

| | |
|---|---|
| బరిహి<br>బర్హి<br>బరిహి<br>బర్హి | అని యుండుట వ్రాసదోషమే. అందుకే శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు "బర్హి అను శబ్దము యొక్క రూపాంతరము బరిహి అనియు— అన్ని పాదములు బర్హి |

అనియో లేక బరిహి అనియో ఉండవచ్చును. ఇట్లు సవరించిన వ్రాసదోషమేమి ? అనిరి." మరి సవరించ వీలు లేదా ? చూడుడు.

బరిహి యన నెమిలిగానము
బరిహియనన్ కాకిగూబ మారేడు చెట్టున్
బరిహి యన కోతిచీమయు
బరిహి యనన్ శునకగద్ద భావజ్ఞనిధీ.

బర్హియన నెమిలిగానము
బర్హియనన్ కాకిగూబ మారేడు చెట్టున్
బర్హియన కోతిచీమయు
బర్హియనన్ శునకగద్ద భావజ్ఞనిధీ.

ఇక— "కురువకమన.... కూకటి యగునూ. ఇందులో ఈనూ దీర్ఘమెట్లు వచ్చిందో తెలియదు." అని మరొక వ్రాత.

ఇట్టి లేఖక దోషమును సవరించ తెలియదా! "కురు వకమన నేలతాటి కూకటియౌనా" అని గూడ దిద్దవచ్చును.

"ఇది పరిష్కరణ దుస్సాధ్యంలాగా కనిపిస్తుంది." అని మరొక గుండువేసిరి. భాషా పరిజ్ఞానులకు సుసాధ్యమే అనేసరికి, "ఔను, ఎవరు కాదన్నారు? నేనూ అదే అర్థంలో వ్రాశాను. బ్రాగెత్త కలవాళ్లు దాన్ని పరిష్కరించగలరు." అని పంకలు దిద్దుకొనిరి. అయితే దీని పరిష్కరణ సుసాధ్య మని అంగీకరించినట్లేగదా! మాకదే ఇరువదివేలు.

ఇంతటితో నాగక "శబ్దములు అర్థములు ఏవి యందు గల దోషములు విచార సహ్యములట." ఇక్కడొక చిన్న మనవి. సర్వ సాధారణముగా నిఘంటువులలోని పద ములు కావ్యములలో చేరటం, వాటినుండి మరి పద నిఘంటు వులలో కెక్కటం, పరిపాటి. అట్లైనచో అమర సిం హుని నామలింగాను శాసనంలోని కొన్ని శ్లోకములు నేటి ముద్రణ ప్రతిలో లేవనుకొన్నచో, నా పదజాలము కావ్యాల కెలా ప్రాకటం? అప్పుడు ఒకవేళ నా పదముల నెవరో పూర్వ కవులు వాడినను, ముద్రాపకులు, సంస్కర్తలు తమకు తెలియమిచే అరగొరగా దిద్దిరిగదా! కావున, నా పదముల యునికి వ్రాతప్రతులందే నిలచినది. నేటి ముద్రితములైన గ్రంథములయందు, ఆ పదములు గనిపించని కారణమున వెంటనే తొందరపడి 'వీటి కర్థములు విచార సహ్యములు' అనడం సాహసమేగాక, భాషకు గొడ్డలిపెట్టుకాదా ?

అప్పుడు, తగినన్ని వ్రాతప్రతుల పరిశీలించవలెనన్న, సమయ మవసరము. ప్రసిద్ధులైన నిఘంటుకారులు తమ నిఘంటులలో జూపిన పదములు నేటి పరిష్కృతములైన గ్రంథములలోగాని, పద నిఘంటువులలోగాని జేరలేదు. అందుకు కారణం తత్సద సంబంధమైన శ్లోకములో, పద్యములో ముద్రణగాక పోవుటయే.

ఉదా : శల్యారి అను పదమునకు ధర్మరాజు (పాండు రాజు పెద్దకుమారుడు) అని అర్థం. భారత యుద్ధములో శల్యుని జంపినది ధర్మరాజే, కావున ఈ పేరు సార్థకమే. అయినను ఈ శబ్దము (పదము) ఏ నిఘంటువులలోనైన గలదా ? ఇది అమరంలోనిదే. (నాయొద్ద ముద్రిత గ్రంథ ములకన్న తాళపత్ర గ్రంథములే యధికము, నేనుదాహరించు పంక్తులందలివే— కావున యథామాతృకముగ నుద్ధరించిన వాని యందలి దోషములు పాటింపకుందురని మనవి.)

శ్లో. కిష్కిందాధిప సుగ్రీవౌ ద్వౌజటాయుర్జటా యుషః
అజాత శత్రు శల్యారి ధర్మపుత్రా యుధిష్ఠిరః.

తా. కిష్కిందాధిపః, సుగ్రీవః, ఈ 2 న్ను సుగ్రీవుని పేళ్ళు.

జటాయుః, జటాయుషః, ఈ 2 న్ను జటాయువు పేరు

అజాత శత్రుః, శల్యారిః, ధర్మపుత్రః, యుధిష్ఠిరః, ఈ 4 న్ను ధర్మరాజు పేళ్ళు—

నేను వ్రాసిన ప్రతిలో నున్న లభించినందు ఈ శ్లోకం ముద్రింపబడలేదు. అంతమాత్రమున ఈ పదములను త్రోసి వేయ వలయునా? అన్ని ప్రత్యంతరముల సేకరించి, ముద్రింప జేయడం ముద్రాపకులపని. అట్లు జరుగలేదు. అందుకే, ముద్రితములైన గ్రంధముల బట్టి చేసిన విమర్శ, నేలవిడిచి సాముచేయునట్టిదే. విమర్శనము ఎటువంటిదైనను రాగద్వేషములకు తావివ్వక సత్యాన్వేషణమై, మరింత పరిశోధనకే ప్రేరకమ్మునదై యుండవలయును. అప్పుడే ఉత్తమ సాహిత్యము వెలువడును. లేనిచో, భాషకే గొప్పముప్పు వాటిల్లును. కావున, దోషమును దోషముగాను, గుణమును గుణముగాను, విమర్శించుటయే శ్రేష్ఠం. అదీ తొందర పడికాదు. —ముద్రితమైన అమరములో లేని మరికొన్ని శ్లోకముల స్వీకరించ జూపుదును. గమనించుడు—

1. శ్లో. రాధేయో౽ంగాధిపః కర్ణ భీమసేనోహిడింబజిత్
మారుతిః కీచకారాతి ర్బకవైరి వృకోదరః.

టా. రాధేయః, అంగాధిపతిః, కర్ణః ఈ 3న్ను కర్ణుని పేళ్లు. భీమసేనః, హిడింబజిత్, మారుతిః, కీచకారాతిః, బకవైరిః, వృకోదరః, ఈ 6న్ను భీముని పేళ్లు.

2. శ్లో. ధనంజ యోర్జునః పార్థో విజయః శక్రనందనః
గాండీవి ఫల్గుణః సవ్యసాచీ మధ్యమ పాండవః
జిష్ణుః కిరీటి భీభత్సుః శ్వేతవాజి కపిధ్వజః.

టా. ధనంజయః, అర్జునః, పార్థః, విజయః, శక్రనందనః, గాండీవి, ఫల్గుణః, సవ్యసాచీ, మధ్యమ పాండవః, జిష్ణుః, కిరీటి, భీభత్సుః, శ్వేతవాజీ, కపిధ్వజః ఈ 14 న్ను అర్జునుని పేళ్లు.

3. శ్లో. రామో దాశరథీ రావణారిః కాకుస్థ రాఘవః
సౌమిత్రి లక్ష్మణోలంకాపతిః పౌలస్త్య రావణః

టా. రామః, దాశరథీ, రావణారిః కాకుస్థః, రాఘవః, ఈ 5 న్ను శ్రీరామచంద్రునిపేర్లు—
సౌమిత్రి (ః), లక్ష్మణః, ఈ 2 న్ను లక్ష్మణుని పేళ్లు.
లంకాపతిః, పౌలస్త్యః, రావణః, ఈ 3 న్ను రావణుని పేళ్ళు.

4. శ్లో. (దశాస్యోపేంద్ర) (దశాస్య) (ఇంద్ర) జిన్మేఘనాథా
మండోదరీ సుతః
ఆంజనేయశ్చ హనుమాన్ మారుతిర్మారు తాత్మజః.

టా. దశాస్యః, ఇంద్రజిత్, మేఘనాథః, మండోదరీ సుతః, ఈ 4 న్ను ఇంద్రజిత్తుని పేళ్ళు.—
ఆంజనేయః, హనుమాన్, మారుతిః, మారుతాత్మజః, ఈ 4 న్ను హనుమంతుని పేళ్ళు—

ఇట్లు చూపుచు పోయినచో కొన్ని పదుల సంఖ్యలలో జూపవచ్చును. ఈ నిఘంటువుల పరిస్థితి ఇట్లున్నది. అలాంటప్పుడు పద్యమయ నిఘంటువుల పైననా, మన కసి?

---

మ. పదబంధంబులనగ్గలించి బుధశబ్దభ్రాజియై సద్గుణా
స్పదమై దుష్క విహ్వృత్సరోజవనమున్ భంజించుచున్ భూరిస
మ్మద లీలన్ విలసిల్లుకబ్బము జగన్మాన్య ప్రచారంబులన్
మదనాగంబును బోలెఁగాల వలదా మూరెందు లేకున్నతిన్

నన్నెచోడ కవి – కుమార సంభవము

# ద్రవ్యోల్బణము : ధరలు

✱

**'పరిశీలక్'**

దేశం ఆర్థికాభివృద్ధి సత్వరంగా జరగాలన్నది ఈనాటి ప్రభుత్వం లక్షణ లక్ష్యంగా ఉంది. ఇంతకీ ఆర్థికాభివృద్ధి అంటే ఏమిటి? త్వరితంగా పెట్టుబడులు రూపొందుతూ ఉండడం (Capital formation) అని అర్థశాస్త్ర పరిభాషలో చెబుతారు. సామాన్యులకు అర్థమయ్యే విధాంగా చెప్పుకోవాలంటే, ఎక్కువగా రహదార్లు పంట కాల్వలు, యంత్రాలు, రకరకాల పరికరాలు వగైరాలు స్థాపించుకొనడం అని చెప్పుకోవచ్చు. అయితే ఈ పెట్టుబడు లనేవి ఎలా రూపొందుతాయి? నిత్య వాడకాలను తగ్గించుకొన డంవల్లను, తలసరిని ఉత్పత్తిని పెంచి, తద్వారా జీవితావసర వస్తువుల ఉత్పత్తిని పెంచడంవల్లను పెట్టుబడి రూపొందు తుంది. అంటే పొదుపు చేసుకున్న సొమ్మును పెట్టుబడిపెట్టి దమన్న మాట. ఇది ఆర్థికాభివృద్ధికి కీలకం.

కమ్యూనిస్టు దేశమైనా, ప్రజాస్వామిక దేశమైనా ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ఈ మార్గం ఒక్కటే అను అనుసరణీయము. అయితే పెట్టుబడులను ఎలా సమకూరుస్తారనే దానిలో మాత్రం ఈ రెండు రకాల దేశాలకు వ్యత్యాసం ఉంది. కమ్యూనిస్టు దేశాలు ప్రత్యక్ష పద్ధతిని అనుసరిస్తాయి—అంటే ప్రణాళికాకర్తలు దేశం ఆర్థిక స్తోమతును—సంపత్తులను అంచనావేసి అంకెలు, కోటాలు ఇస్తారు. ఆ ప్రకారం ప్రభుత్వం వానిని విధిగా సమకూరుస్తుంది. నిత్య జీవితావసర వస్తువుల ఉత్పత్తిని ప్రధానం చేస్తారు. ఉత్పత్తిలో లేని వస్తువులను ప్రజలు వాడుకొనలేరు కనుక తప్పనిసరిగా ప్రజల నిత్య వాడకాలు తగ్గుతాయి. బలవంతాన పొదుపు జరుగుతుంది. దానికి తగ్గట్టుగానే ప్రణాళికకు పెట్టుబడులు పెరుగుతూ ఉంటాయి. ఇలా ప్రజలందరినీ ఆర్థికంగా కట్టడి చేసి, ప్రణాళికం ద్వారా అభివృద్ధిని సాధించడ మనేది కమ్యూనిస్టు పద్ధతిగా ఉంది. ప్రజాస్వామిక దేశాలలో పద్ధతి ఇలా ఉండదు. వీటిది పరోక్ష పద్ధతి. ప్రజలు ఎంత మొత్తాన్ని పొదుపు చేస్తున్నారనేది ప్రణాళికా కర్తలు ముందుగా అంచనా వేస్తారు. ఆ తర్వాత ఆ మొత్తానికి తగ్గట్టు ప్రణాళికలువేసి, పెట్టుబడులు సమకూరుస్తారు. ఉత్పత్తి కార్యక్రమాన్ని నిర్ణయిస్తారు. అంటే ప్రజలు పొదుపు చేసిన, పెట్టుబడి పెట్ట డానికి సిద్ధపడిన మేరకు మాత్రమే ఆర్థికాభివృద్ధి కార్యక్రమా లను ప్రజాస్వామిక దేశాలు పరిమితం చేసుకుంటాయి.

ఈ రెండు పద్ధతుల వ్యత్యాసం సామాన్య ప్రజలకు ఎలా అనుభవమౌతుంది? ప్రజాస్వామిక పద్ధతిలో ప్రతి వ్యక్తికి తన రాబడిని తన అభీష్టాన్నిబట్టి ఖర్చు చేసుకొనడానికి లేద పొదుపు చేసుకొనడానికి స్వేచ్ఛ ఉంటుంది. నిత్య వాడకాలలో అవరోధాలు ఉండవు. కాని కమ్యూనిస్టు పద్ధతిలో ఖర్చు చేసుకొనడానికి అవకాశాలు ఉండవు. పొదుపు బలవంతంగా ఉం టుంది. నిత్య వాడకాలకు కొరతగా ఉంటుంది.

ప్రభుత్వ స్థాయిలో ఈ రెండు పద్ధతుల వ్యత్యాస మేమిటి? కమ్యూనిస్టు పద్ధతిలో ప్రణాళికా సంఘం ముందుగా ప్రణాళికను సిద్ధం చేస్తారు. ఆ ప్రకారం ఉత్పత్తి—పంపి ణీని ప్రభుత్వం ఏర్పాటు చేస్తుంది. తర్వాత ప్రణాళిక అవసరమైన పెట్టుబడులు బలవంతాన సమకూర్చుకుంటుంది. ప్రజాస్వామిక పద్ధతిలో వ్యయానికి ధనము ప్రవేశపెట్టడం జరగాలి. పెట్టుబడులను ముందుగా అంచనావేసి, తదనుగుణమైన ప్రణాళికలువేసి, దానికి తగ్గట్టు ఉత్పత్తి—పంపిణీని ఏర్పాటు చేయాలి. భారతదేశం ప్రజాస్వామిక దేశమైనా, దాని ప్రణా ళికలు ఈ పద్ధతిని అమలు జరపలేదు. అది కమ్యూనిస్టు పద్ధతి అనడానికి వీలులేకపోయినా, అనుమానాలతో లోటు బడ్జెట్టుల (Deficit financing) విధానాన్ని అనుసరిస్తూ ఆర్థి కాభివృద్ధి కృషిని కొనసాగిస్తున్నది.

ప్రభుత్వం ఆదాయానికి—అది చేసే వ్యయానికి మధ్య, కావాలని సృష్టించే వ్యత్యాసాన్ని (ఆదాయాన్ని మించి ఖర్చు చేయడాన్ని) భర్తీ చేసే పద్ధతిని "లోటు బడ్జెట్టు" విధానం అని పాశ్చాత్య దేశాలలో పిలుస్తారు. ఈ లోటు మొత్తాన్ని అప్పు చేస్తారు. దీనివల్ల జాతీయాభివృద్ధికి ప్రభుత్వం పెట్టే పెట్టుబడి మొత్తం పెరుగుతుంది. ప్రయివేటు వ్యక్తు లకు బ్యాంకులలో నిరుపయోగంగా నిల్వ ఉన్న నిధులు వాడకం లోకి వస్తాయి. లేదా, ప్రభుత్వ ఋణ పత్రాలను బ్యాంకులు కొనడం ద్వారా "డిపాజిట్"ల సృష్టి జరుగుతుంది. ప్రయి వేటు వ్యక్తులవద్ద ఉన్న మిగులు సొమ్ము ప్రభుత్వ ఋణ పత్రా లద్వారా ఉపయోగంలోకి వస్తుంది. ఇలా అదనపు మొత్తాల సేకరణ, తద్వారా ప్రభుత్వ వ్యయం పెంచడం అనేది ఒంటికి తెలిసిన "లోటు బడ్జెట్టు విధానం". ఆర్థిక ఉపసంపత్తుల సృష్టికి ఇదొక మార్గమన్న యోచన అప్పటికి అంతగా లేదు.

"లోటు బడ్జెట్టు విధానము" అంటే, డబ్బును సృష్టించడం, నగదు సప్లయి పెంచడం (కరెన్సీ నోట్లు చెలామణి హెచ్చు చేయడం) అనేది జర్మనీలో మినహా (హిట్లర హయాంలో) మరెక్కడా అమలు జరగలేదు. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం వెలువడిన అర్థశాస్త్ర గ్రంథాలలో లోటు బడ్జెటు విధానాన్ని గురించి రకరకాల చర్చలు జరిగాయి. ఈ చర్చలు మూడు అంశాలమీద కేంద్రీకరించబడ్డాయి

(1) ఆర్థికమాంద్యాన్ని తొలగించడానికి. ఇది తాత్కాలిక చర్య. (2) ప్రయివేటు పెట్టుబడులు లాభసాటిగా లేనప్పుడు భర్తీచేయడానికి. ఇది కొంతవరకు శాశ్వత చర్య కావచ్చు. (3) దేశ రక్షణ వ్యయం సమకూర్చడానికి. ఈ మూడు అంశాలకు కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. ఆర్థికమాంద్యం తొలగించడం, ప్రయివేటు పెట్టుబడుల కొరతను తీర్చడమనే దానిలో ఈ విధానం "అల్పవ్యయం, ఉత్పాదక శక్తి అభివృద్ధి చెందుతుందా" అనే దృష్టి ఉంటుంది. ఇక దేశ రక్షణ వ్యయంలో "అవసరాలకేగాని ఉత్పాదక శక్తి" అనేదానికి పరిగణనలేదు. ఆర్థిక మాంద్యం తొలగించడం, ప్రయివేటు పెట్టుబడులలోటు తీర్చడం అనే దానిలో నిరుపయోగంగావున్న సహజ శక్తులను (Natural resources) నిరుద్యోగంలోవున్న జన శక్తిని (Man-Power) ఉపయోగంలోకి తీసుకు రావడమనేది లక్ష్యం కాగా, దేశ రక్షణ వ్యయాన్ని సర్దడానికి జీవితావసర వస్తువుల వాడకాన్ని తగ్గించివేసి యుద్ధావసర వస్తువుల సప్లయిని పెంచడమనే సూత్రం పని చేసింది. (ద్రవ్యోల్బణం, విధిగా పొదుపు అనేవి ఈ సందర్భంలో పని చేస్తుంది) వీటన్నింటికోసం ప్రధానాంశం లోటు బడ్జెటు ద్వారా జాతీయ వ్యయాన్ని లేక పెట్టుబడిని పెంచడం. ఈ మూడు అంశాలలోను పెట్టుబడులు రూపొందించడం, జాతీయ ఉత్పాదక శక్తిని పెంచడం అనే అర్థంలో ఆర్థికాభివృద్ధి సాధన అన్న యోచన లేదు. ఆర్థికాభివృద్ధి సాధనకు లోటు బడ్జెటుల విధానాన్ని అనుసరించినప్పుడు వచ్చే ఫలితాలలో వ్యత్యాసం ఉండవచ్చు నన్న సూచనలు జరిగినా, లోటు బడ్జెటుల విధానం ద్వారా ఆర్థికాభివృద్ధి సాధనకు అవకాశం కలదన్న అంశం ఆనాడు తీవ్రమైన చర్చనీయాంశం కాలేదు. ఆర్థికాభివృద్ధికి లోటు బడ్జెటు విధానాన్ని అనుసరించినప్పుడు—ధరవరులు ఎలా ఉంటాయి, పెట్టుబడులు ఎలా రూపొందుతాయి అనేది గట్టిగా పరిశీలనకు రాలేదు.

ఆర్థికాభివృద్ధి అనే దానిలో ఉత్పాదక శక్తి పెరుగుదల (తలసరి ఉత్పత్తి హెచ్చింపు) జాతీయాభివృద్ధి, జీవన ప్రమాణం పెంపుదల, ఆర్థిక సంక్షేమం అనేవి గర్భితంగా ఉన్నాయి. వీటన్నింటికి కీలకం ఉత్పాదక శక్తి పెంపుదల. దీనిని సాధించడానికి ఒక్కొక్కటిగాగాని, సమన్వయంగాగాని అయిదు రకాల చర్యలు అవసరం. (1) వినియోగించదగిన వనరులను పెంచడం. అంటే భూములను సాగుకు లాయికీగా చేయడం. నీటి పారుదల వసతుల పెంపు. రహదార్ల అభివృద్ధి వగైరా (2) యంత్ర సాధనాలు, రసాయనిక శక్తుల అభివృద్ధి—అంటే విద్యుత్తు సప్లయి, యంత్రాలు, ఇనుము—ఉక్కు, సిమెంటు కెమికల్స్ వగైరాల సప్లయిల పెరుగుదల (3) కార్మికుల దక్షతను, పని చేయడానికి శక్తిసామర్థ్యాలను పెంపుదల. ఇందుకు వైద్య, విద్యా వసతులు, సాంకేతిక నైపుణ్యాన్ని పెంచే ఏర్పాట్లు జరగాలి. (4) సాంఘిక జ్ఞానాన్ని (సైన్సు) సమీకరణ శక్తులను (ఆర్గనైజేషన్స్) పెంచడం (5) అధికోత్పత్తికి తగిన ప్రోత్సాహాలను ప్రవేశ పెట్టడం. ఇందులో మొదటి రెండు పెట్టుబడులు రూపొందడానికి చివరి మూడు అంశాలు సాంఘిక సంక్షేమ సాధనకు సంబంధించినవి.

పెట్టుబడులు రూపొందడం అనేది ఆర్థిక ప్రగతికి కీలకం. ఇందుకు చాలా నిధులు అవసరం. అవి ప్రభుత్వం సమకూర్చవచ్చు. అయితే ప్రయివేటుగా లభించవచ్చు. ఈనిధులు ఎలా లభించినప్పటికీ, జరగవలసిన పని, నిత్య జీవితావసర వస్తువులు కాక, యంత్ర పరికరాలను, అంటే కొత్త ఉత్పాదక శక్తులను సమకూర్చడం. కేపిటలిస్టు వ్యవస్థలో అయితే ప్రయివేటు రంగం ద్వారా ఇవి లభిస్తాయి. సోషలిస్టు వ్యవస్థలో ప్రభుత్వమే వీనిని సమకూరుస్తుంది. ఇక మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో ఆ యా దేశాల పరిస్థితులు, వాని ప్రభుత్వాలు అనుసరించదలచిన విధానాలనుబట్టి పబ్లిక్—ప్రయివేటు రంగాలు రెండూ కలిసి వీనిని లభింపజేస్తాయి. వీనిలో ఏ అంశంలో ఎవ్వరికి ప్రాధాన్యం ఉండాలనేది వివాదాంశంగా ఉంటుంది. మూడవ పంచవర్ష ప్రణాళిక అమలు జరుగుతున్న భారత దేశంలో నేటికీ ఈ వివాదం ఇంకా కొనసాగుతూనే ఉంది. వివాదాంశాల సంగతి ఎలా ఉన్నా— కొత్త పెట్టుబడులు పెట్టడం అనేది ప్రధానాంశం. ఇందులో జాతీయ వ్యయ పద్ధతలను మార్పుచేసి, అందుబాటులో ఉన్న నిధులను సమన్వయంగా వినియోగించుకుంటారా, లేక లోటు బడ్జెట్టుల ద్వారా అదనపు నిధులు చేరుస్తారా అనేది మాత్రమే ఇక్కడ పరిశీలనాంశం. ఇది కూడా ఆర్థిక వ్యవస్థ ననుబట్టి మారుతూ ఉంటుంది. ప్రయివేటు వ్యాపారానికి ప్రాధాన్యం ఉన్న ఆర్థిక వ్యవస్థలో సొమ్ము పొదుపు చేసుకున్న వారంతా తప్పనిసరిగా పెట్టుబడిదారులుగా ఉండరు. పొదుపు జరగడానికి ముందే పెట్టుబడులు పెట్టడం జరిగిపోతుంది. పారిశ్రామిక వర్గాలు ఇందుకు ముందుకు వస్తాయి. పెక్కుమంది వద్ద మిగులు సొమ్ము వీరి ద్వారా పెట్టుబడి రూపం పొందుతుంది. ఉత్పత్తి పెంచుతుంది. ధరల పెరుగుదల పద్ధతి ద్వారా ఆదాయాల మార్పు సంభవ మవుతుంది. ధరల పెరుగుదలవల్ల పెరిగిన రాబడి, ప్రజలలో మిగులు మొత్తాలకు దారి తీస్తుంది. ఈ మిగులు మొత్తాలు ఆరంభ పెట్టుబడికి నాంది అవుతాయి. లోటు బడ్జెట్టు విధానాలు దీనిని పెంచుతాయి. ఈ విధంగా పెట్టుబడి—రాబడి జాతీయ వ్యయంలో సమన్వయం. ఉత్పాదక శక్తుల సృష్టి అనే దాని ద్వారా ఆర్థికాభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది. అన్ని సందర్భాలలోను ఇది సుసాధ్యమని తలంచడానికి వీలులేదు. ఆరంభ పెట్టుబడివల్ల ఉత్పాదక శక్తులు ఆశించిన విధంగా రూపొందనప్పుడు, పారిశ్రామికులు, దేశం కూడా పెద్దగా నష్టపోవలసి వస్తుంది. పారిశ్రామికుడు దివాళా తీస్తాడు. దేశానికి నిరుపయోగమైన ధరల పెరుగుదల ప్రమాదం ఏర్పడుతుంది. ఆరంభ పెట్టుబడివల్ల ఉత్పాదక శక్తులు బలపడినప్పుడు పారిశ్రామికులు, దేశం కూడా పూర్తిగా లాభం పొందుతుంది. పారిశ్రామికులకు ఆస్తులు ఆదాయాలు పెరుగుతాయి. దేశంలో ఉత్పాదక శక్తులు పెరిగి, అధికోత్పత్తిసాగి ధరల పెరుగుదలవల్ల కలిగే కష్టాలను కొంతవరకు తొలగిస్తుంది. ప్రజల ఆదాయా

లను పెంచుతుంది. మిగులు సొమ్ము చూపుతుంది. బ్యాంకుల ద్వారా పెట్టుబడిగా దానిని కేంద్రీకరింప జేస్తుంది. కొత్త కొత్త ఉత్పాదక శక్తుల అభివృద్ధికి అది వినియోగపడుతుంది. పెట్టుబడి అనేది మూలం పెట్టుబడిని సృష్టిస్తుంది. పరపతి విధానమనేది అప్పులు తీర్చడానికి కూడా మార్గం చూపుతుంది. ఆచరణలో ఆర్థికాభివృద్ధి సారాంశమిదే. లోటు బడ్జెటు విధానాల నిజ స్వరూపం ఇది. ఈ పద్ధతులలోనే అమెరికా బ్రిటన్, జపాన్ దేశాలలో ఆర్థికాభివృద్ధి జరిగింది.

చారిత్రకంగా లోటు బడ్జెట్టు విధానం పుట్టుక ఆర్థికాభివృద్ధి సమస్యలనుంచికాక యుద్ధావసరాలు లిచ్చడంలో ఆరంభమైంది. యుద్ధ సమయంలో ప్రతిదేశం తన శక్తి కిమించిన వ్యయం చేస్తుంది. ఇక్కడ "శక్తి" అంటే ప్రజలు ఇచ్ఛికంగా తెలిసి ఉన్న పద్ధతుల ద్వారా ప్రభుత్వానికి చెల్లిస్తూ వచ్చే సొమ్ము అని అర్థం. ప్రజలు ఇచ్ఛికంగా, తెలియని మార్గాలలో ప్రభుత్వ ఖజానాకు సొమ్ము చేర్చే మార్గం మరొకటి ఉంది. డబ్బు సప్లయి పెంపుదల—పరపతి సౌకర్యాల అభివృద్ధి ధరల పెరుగుదల మార్గం వీనివల్ల ప్రజల సొమ్ము వారికి తెలియకుండానే ప్రభుత్వ ఖజానాకు చేరుతుంది. ఇది కూడా లోటు బడ్జెట్టు విధానంలో అంతర్భాగమే. యుద్ధకాలంలో అనుసరించే ఈ విధానంవల్ల ధరల పెరుగుదల ఆదాయాలలో, ఆస్తులలో అసమానత్వం పెరిగిపోవడం పెద్దగా కానవస్తుంది. ఇదంతా లోటు బడ్జెట్టు విధానంక్రింద పెరిగిన ద్రవ్యోల్బణం ఫలితం అన్న అభిప్రాయం బలపడింది. ఇది సహజం. దీనికి కారణం యుద్ధ కాలంలో జరిగే వ్యయం ఉత్పాదక శక్తులను పెంచదు. పెట్టుబడులను రూపొందింప జేయదు. చెలామణిలో ఉంచిన కరెన్సీకి తగ్గట్లుగా సరుకుల సప్లయి ఉండదు. ప్రజలవద్ద మిగులుగా ఉన్న సొమ్మును రాబట్టడానికి యుద్ధం బాండుల విక్రయం, రకరకాలుగా అప్పులు తీసుకొనడం వంటివి జరిగినా, పూర్తిగా ఆ సొమ్ము ప్రభుత్వ ఖజానాకు చేరదు. కనుక ద్రవ్యోల్బణం—ధరల పెరుగుదల అనేది ప్రత్యక్షంగా కానవస్తుంది. లోటుబడ్జెట్టు విధానాన్ని అనుసరించే ప్రభుత్వంపట్ల అసంతృప్తి బయలుదేరుతుంది. అలాంటి విధానాలు అనుసరించరాదన్న ఆందోళన సాగుతుంది.

అయితే ఇక్కడొక సంగతి గుర్తుంచుకోవాలి. ఒక ప్రయివేటు పారిశ్రామికుడు అప్పుచేసి పరిశ్రమలు నెలకొల్పితే ఎవ్వరికీ ఎలాంటి అనుమానం కలుగదు. ఇది కూడా లోటు బడ్జెట్టు విధానం వంటిదే. ఎందుచేతనంటే ఈ పరిశ్రమ స్థాపనవల్ల కొంతమందికి ఉపాధి లభిస్తుంది. ఉత్పత్తి పెరుగుతుంది. రాబడులు హెచ్చుతాయి. మిగులు సొమ్ము అనేది కనిపిస్తుంది. లోటు బడ్జెట్టు విధానం సత్ఫలితాలు కానవస్తాయి. దీనిని అందరూ హర్షిస్తారు. లోటు బడ్జెట్టువల్ల ద్రవ్యోల్బణం—ధరల పెరుగుదల సంగతి విమర్శిస్తారు. కనుక లోటు బడ్జెట్టు విధానం అనే దానిలో లోపం లేదని, ఆ విధానం వల్ల ద్రవ్యోల్బణం తథ్యమనేది తప్పని, దాని మంచి చెడ్డలనేవి ఆ విధానాన్ని అమలు జరిపే తీరుమీద ఆధారపడి ఉంటాయని మనం చెప్పలేకపోవచ్చు. కాని చరిత్రను పరిశీలించి చూస్తే ఇందుకు విరుద్ధంగా ఉన్నాయి కూడా. అభివృద్ధిచెందినా, యుద్ధావసరాల కోసమైనా, [illegible], ప్రయివేటు పెట్టుబడులు కొంతవరకు [illegible] బడ్జెట్టు విధానాన్ని [illegible] ఇప్పటికీ ఉన్నాయి. [illegible] లోటు బడ్జెట్టులో పాటు ద్రవ్యోల్బణం [illegible]. [illegible] ద్వారా కాక, ప్రయివేటు పెట్టుబడుల ద్వారా పెట్టుబడులను రూపొందింప చేయడం, ప్రభుత్వం లోటు బడ్జెట్టు ద్వారా కాక, బ్యాంకులు సృష్టించే పరపతి సౌకర్యాల ద్వారా పెట్టుబడులను పెంచడం, తద్వారా ఆర్థికాభివృద్ధి [illegible] నిజం. ఇక ఇప్పుడు ప్రభుత్వం ద్వారా పెట్టుబడులను రూపొందింపజేయడం, లోటు బడ్జెట్టు విధానం ద్వారా [illegible] శక్తులను పెంచడం అనేది—లోటు ఆర్థికాభివృద్ధికి లోటు బడ్జెట్టు విధానాన్ని అనుసరించడం అనేది భారతదేశంలోనే గత పదిహేను సంవత్సరాలుగా అమలు జరుగుతున్నది. ఈ ప్రయోగం ప్రపంచ రాజ్యాల దృష్టిని ఆకర్షిస్తున్నది.

పాశ్చాత్య అర్థశాస్త్ర నిపుణుల దృష్టిలో లోటు బడ్జెట్టు అంటే పరపతి Credit విస్తరణే కాని కరెన్సీ నోట్ల చెలామణిని పెంచడంకాదు. భారతదేశంలో మాత్రం లోటు బడ్జెట్టు విధానము అంటే కరెన్సీ నోట్ల చెలామణిని పెంచడం అనే అర్థం అమలులోకి వచ్చింది. భారత ప్రణాళికా సంఘంవారు కూడా లోటు బడ్జెట్టు అంటే క్రిందివిధంగా నిర్వచనం ఇచ్చారు: "లోటు బడ్జెట్టు ద్వారా (ఆ లోటు రెవెన్యూ కాతాను ఉన్నారనే, పెట్టుబడుల కాతాను ఉన్నారనే) మొత్తం జాతీయ వ్యయానికి అదనపు మొత్తాలను చేర్చడాన్ని ఈ విధానం సూచిస్తుంది. ఇలాంటి విధానానికి ప్రాతిపదిక—పన్నులు, ప్రభుత్వ పరిశ్రమల ద్వారా వచ్చే లాభాలు, ప్రజలనుంచి వచ్చే అప్పులు, డిపాజిట్లు, నిధులు వగైరాల రూపంలో వచ్చే ఆదాయాన్నిమించి ప్రభుత్వం ఖర్చు చేయడం. ఈ లోటును తన నిల్వలను తగ్గించి గాని, బ్యాంకులనుంచి అప్పులు తీసుకొనిగాని భర్తీ చేయవలసి ఉంటుంది". ఈ రెండు సందర్భాలలోను కరెన్సీ నోట్ల చెలామణిని పెంచడం అనే పద్ధతి మాత్రమే ప్రణాళికాకర్తల మనస్సులో ఉందనేది నిస్సందేహం.

ఇలా ప్రభుత్వం కరెన్సీ చాలామణిని పెంచడం అనే దానికి, బ్యాంకులు పరపతి సౌకర్యాలు పెంచి ప్రయివేటు రంగం ద్వారా పెట్టుబడులు రూపొందింపజేయడమనేదానికి చాలా వ్యత్యాసం ఉంది. ఈ రెండు పద్ధతులవల్ల సప్లయిలోఉండే ద్రవ్యం పెరిగినా, అవి తెచ్చి పెట్టగల ద్రవ్యోల్బణ పరిణామాలలో విపరీతమైన వ్యత్యాసం ఉంది. ఇందుకుగల కారణాలు ఇవి:—(1) బ్యాంకుల ద్వారా పెరిగే పరపతి సౌకర్యాలు బ్యాంకులకువద్దగల నగదు నిల్వలతో పరిమిత సంబంధాన్ని కలిగి ఉంటాయి. ఈ నగదు నిల్వలకు అదనంగా చేర్చగల మొత్తాలనుబట్టి పరపతి సౌకర్యాలవిస్తరణ జరుగుతుంది. కరెన్సీ చెలామణి కొత్తగా చేర్చిన అదనపు మొత్తాలను మించుతుంది. తత్ఫలి

రంగ పథకాలు, నానాటికి నిర్మాణ వ్యయం పెరుగుదల, ద్వారా ద్రవ్యోల్బణం ప్రమాదం సంభవం అవుతుంది. బ్యాంకి ద్వారా పరపతి సృష్టి జరిగినప్పుడు, అప్పులు తీసుకొనేవారు, అప్పు చేసే మొత్తానికి మించిన ఆస్తులను బ్యాంకులకు హామీ ఇస్తారు. నిర్ణీత గడువులలో చెల్లింపులకు షరతులు ఉంటాయి. అలా చేయనప్పుడు హామీ పెట్టిన ఆస్తుల విక్రయం జరుగుతుంది. అంటే బ్యాంకి సృష్టించే పరపతి దానికదే మాఫీ చేయగల పరిస్థితులలో అమలు జరుగుతుంది.

ప్రభుత్వం లోటు ఋణ పత్రాలమీద ద్రవ్యాన్ని సృష్టించినప్పుడు పరిస్థితి ఇలా ఉండదు. ఎందుచేతనంటే ఈ ఋణ పత్రాల చెల్లింపుల గురించి నిర్ణీతమైన బాధ్యతలు ఉండవు. వీటి ప్రజలకు విక్రయించడం కష్టం. అలా విక్రయించటంలో ప్రజల పరపతి సౌకర్యాలకు కష్టం రాకుండ చూడవలసి ఉంటుంది. పన్నులేమైనా పెంచినా, ప్రయివేటు, పబ్లిక్ పథకాల మీద దీని దుష్ప్రభావం పని చేస్తుంది. కొత్తగా చెలామణిలో పెట్టిన కరెన్సీని మాఫీ చేయాలనే దృష్టితో ఈ ఋణ పత్రాలను ప్రభుత్వం అమ్మజూపినా, వీటిని తీర్మానం చేయడానికి—బ్యాంకులు హామీ తీసుకొనే ఆస్తులతో పోలిస్తే హెచ్చు వ్యవధి పడుతుంది. అంటే ప్రభుత్వం కరెన్సీ చెలామణి ద్వారా సృష్టించే డబ్బును, బ్యాంకులు సృష్టించే పరపతిని అదుపులో ఉంచుకున్నట్టుగా హద్దులో పెట్టడానికి అవకాశం ఉండదు.

(2) బ్యాంకుల పరపతిని వినియోగించుకొనేవారు నిర్ణీతమైన కార్యక్రమాలకు అప్పులు తీసుకుంటారు. ఈ కార్యక్రమాల అమలు ద్వారా వ్యాపారాన్ని సాగించి, లాభాలు తీయవచ్చునని భావిస్తారు. వారు అనుకున్న కార్యక్రమాలు జయప్రదమైనప్పుడు బ్యాంకులకు హామీ పెట్టిన ఆస్తులను విక్రయించవలసిన అవసరం లేకుండానే అప్పులను తీర్చివేయగలరు. ఈవిధంగా అదనపు పెట్టుబడులవల్ల వచ్చే అదనపు రాబడి బ్యాంకులకు చేరే ఏర్పాటు కూడా పరపతి విస్తరణ పద్ధతిలో ఉంది. కాని లోటు బడ్జెటు ద్వారా ప్రభుత్వం అమలు జరిపే పథకాలలో ఈ పద్ధతి ఉండదు. ఉదాహరణకు ప్రభుత్వం అమలు జరిపే పథకాలు ఆర్థికాభివృద్ధికి అవసరమైన రోడ్లు, నీటి పారుదల వసతులు సాంఘిక సదుపాయాలు వగైరా రూపంలో ఉంటాయి. ఆర్థికాభివృద్ధికి ఇవి కీలకమైనవి. కాని వీటినుంచి నేరాసరి ఆదాయంరాదు. కనుక వీటికి పెట్టిన పెట్టుబడిని రాబట్టడానికి, వీటివల్ల సమాజంలో వచ్చే అదనపు ఆదాయాలను రాబట్టడానికీను ప్రభుత్వం ప్రత్యేక ప్రయత్నాల చేయవలసి ఉంటుంది. ఇందుకు పన్నులు విధించడం, ప్రజల నుంచి అప్పులు తీసుకొనడ మొక్కటే మార్గం. వీని అమలులో చిక్కులు చాలా ఉంటాయి. ప్రజా వ్యతిరేకత ప్రబలుతుంది. అయితే ప్రభుత్వం పెట్టుబడివల్ల లభించే ఫలితాలను నరాసరిని ప్రజలకు అమ్మకంచేసి ఆదాయం తీయగల అవకాశాలు ఉన్నప్పుడు ప్రయివేటు, పబ్లిక్ పథకాలకు పెట్టిన పెట్టుబడిని రాబట్టడంలో చిక్కులు ఉండవు. ఈ రెండింటి విధానాలు పహేరుకంగా పని చేయగలవు. ఆర్థికంగా చిక్కులురావు.

ఇందులోనే మరొక సంగతి కూడా పరిశీలించాలి. ప్రయివేటు రంగంలో ఒక పథకం విఫలమైనప్పుడు దానికి సంబంధించిన పారిశ్రామికుడు దివాళా తీస్తాడు. అతని ఆస్తులు విక్రయించి అతనికి అప్పులు పెట్టినవారు తమ సొమ్ము తీసుకుంటారు. ఇందువల్ల ఆస్తుల మూలవిలువ తగ్గుతుంది. అంటే సరుకులు ఉత్పత్తి చేయించి రాబట్టదలచిన ఆదాయాన్ని, ఆస్తుల విక్రయం ద్వారా రాబడతా రన్నమాట. ప్రభుత్వ పథకం విఫలమైనప్పుడు, ఇలాంటి "మాఫీ" ఏర్పాట్లు, "రాబట్టే పద్ధతులు" ఉండవు. ఈ పథకంకోసం ప్రభుత్వం చేసిన అదనపు ఖర్చువల్ల అవసరమైన ఉత్పాదక శక్తి ఏర్పడదు. సంఘంలో సృష్టించిన అదనపు రాబడిని "స్వాహా" చేయగల విధానంగా సరుకుల నప్లయి పెరగదు. కనుక ద్రవ్యోల్బణం అనేది నిలిచిపోయి, ధరలు పెరిగిపోతూ ఉంటాయి.

(3) బ్యాంకులు పెట్టుబడి పెట్టే ప్రయివేటు కార్యక్రమాలకు నిర్దిష్టమైన పథకాలు, జాగ్రత్తగా వేసుకున్న అంచనాలు, దక్షతతో నిర్వహణ అనేది ఉంటుంది. అందువల్ల దీనివల్ల జరిగే వస్తూత్పత్తి లాభదాయకంగా ఉంటుంది. వృథా వ్యయం ఉండదు. పెట్టుబడికి తగిన ప్రతిఫలం ఆస్తుల రూపంలో, ఉత్పత్తి జరిగే వస్తువుల రూపంలో కనిపిస్తుంది. కాని ప్రభుత్వం అమలు జరిపే పథకాలు ఇందుకు వ్యతిరేకంగా ఉంటాయి. వృథా వ్యయం, నిర్వహణలో లోపాలు, నష్టంమీద ఉత్పత్తి సహజంగా ఉంటుంది. అంటే లోటు బడ్జెటు ద్వారా ప్రభుత్వం పెట్టే పెట్టుబడులు, ఆశించిన ఫలితాలను ఇవ్వకపోగా ద్రవ్యోల్బణాన్ని పెంచగలవన్నమాట.

ఏమైనప్పటికి లోటు బడ్జెటు విధానం అనేది క్రింది కారణాలవల్ల ద్రవ్యోల్బణానికి, ధరల అస్థిరతకు దారి తీయగలదని మన మిప్పుడు క్లుప్తంగా చెప్పుకోవచ్చు:—

(1) కరెన్సీ నోట్లు పెంచడంతోపాటు బ్యాంకుల ద్వారా పెరిగే పరపతి సౌకర్యాలవల్ల కూడా డబ్బు సప్లయి రెట్లు అవుతుంది. (2) కరెన్సీ నోట్ల చెలామణిని పెంచడం ద్వారా ప్రభుత్వం పెట్టే పెట్టుబడుల ఫలితం—సరుకుల సప్లయి, సర్వీసు సౌకర్యాలు—ప్రత్యక్షంగా ఉండవు కనుక, అదనపు పెట్టుబడులు సమాజంలో సృష్టించిన అదనపు రాబడిని "మాఫీ" చేయడానికి అవకాశాలు తక్కువ అవుతాయి. (3) సమాజంలో సృష్టి అయిన అదనపు రాబడులను రాబట్టడం (పన్నులు—అప్పుల రూపంలో) ప్రభుత్వానికి కష్టం కాగలదు (4) ప్రభుత్వ పథకాలలో వృథా వ్యయం, అసమర్థతతో నిర్వహణ అనే దానివల్ల ఆశించిన ఫలితాలు, లక్షించిన వ్యవధిలో రావు. ఈ మూడు కారణాలవల్ల లోటు బడ్జెటు విధానం అనేది —ఆర్థికాభివృద్ధికి ఒక సాధనంగా వినియోగించినప్పుడు కూడా —ద్రవ్యోల్బణానికి, ధరల పెరుగుదలకు దారి తీయడం తథ్యమని సిద్ధాంతీకరించవచ్చు. అందువల్లనే ప్రభుత్వాల బడ్జెట్టు విధానాలలో, లాభదాయకమైన (productive works) పథకాలకు అప్పుల ప్రజాఋణాల ద్వారాను లాభదాయకంకాని పథకాలకు (Unproductive works) పన్నుల ద్వారాను పెట్టుబడులు సమకూర్చాలనే సూత్రం చిరకాలంగా అమలులో ఉంది. దీనిని విడని లోటు బడ్జెట్టు విధానాలను అనుసరించడం ప్రమాదకరమని భారతదేశానికి పెక్కుమంది ఆర్థిక నిపుణులు హెచ్చరిక

# ద్రవ్యోల్బణము; ధరలు

చేశారు. మూడవ ప్రణాళిక కాలానికైనా వారి హెచ్చరికలు నిజమని నిరూపితం కాలేదు.

భారతదేశానికి ద్రవ్యోల్బణం అనేది కొత్తకాదు. లోటు బడ్జెట్టు విధానాన్ని ప్రభుత్వం అనుసరించడమనేది కూడా కొత్త కాదు. చివరకు భారత పారిశ్రామికవేత్తలు సిద్ధం చేసిన "బొంబాయి ప్రణాళిక" అనే దానిలో కూడా కరెన్సీ నోట్ల విస్తరణ విధానాన్ని సూచించారు. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో పొందిన అనుభవం ఈ సూచనలకు దారి తీసింది. దేశంలో నేటి ద్రవ్యోల్బణం అనేది 1955—56లో ఆరంభమైనప్పటికీ, ద్వితీయ ప్రపంచ యుద్ధం ఆరంభమైన రెండు సంవత్సరాలనుంచి (1941—42 నుంచి) దేశంలో ద్రవ్యోల్బణం ఉంది. ధరలు పెరుగుతూనే ఉన్నాయి. అయినప్పటికి పంచవర్ష ప్రణాళికలకు లోటు బడ్జెట్టు విధానాన్ని ప్రభుత్వం అనుసరించడమనేదే విమర్శనీయంగా ఉంది. లోటు బడ్జెట్టువల్ల ద్రవ్యోల్బణం—ధరల పెరుగుదల తథ్యమని తెలిసి ఉండి కూడా, ముందు జాగ్రత్తలు పడకుండా ఈ విధానాన్ని ప్రభుత్వం ఎందువల్ల అమలు జరుపుతున్నదనేదే అనుమానంగా ఉంది. 1938—39 నాటికి భారత రిపబ్లిక్‌లో సప్లయిలోఉన్న డబ్బు 264 కోట్ల రూపాయలుకాగా, 1961 చివరకు సప్లయిలో పెట్టింది 2808 కోట్ల రూపాయలు. అంటే దేశంలో ప్రణాళికల పేరుతో లోటు బడ్జెట్టు విధానంక్రింద డబ్బు సప్లయిని పది రెట్లు పెంచారన్నమాట. తొలి ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలోను డబ్బు సప్లయిని నూటికి తొమ్మిదిరెట్లు పెంచారు. జాతీయోత్పత్తికూడా నూటికి తొమ్మిదిరెట్లు హెచ్చింది. కనుక ద్రవ్యోల్బణం ఏర్పడలేదు. కాని 1955–56 నుంచి 1960–61 నాటికి డబ్బు సప్లయిని నూటికి 52 వంతులు పెంచగా, జాతీయోత్పత్తి నూటికి 22 వంతులు హెచ్చింది. సప్లయిలోవున్న సరుకులను మించి డబ్బు సప్లయిని పెంచారు కనుకనే ధరలు నూటికి 32 వంతులు పెరిగాయి. డబ్బు సప్లయిపది రెట్లు పెంచి, పెట్టుబడులు పెట్టినా, వ్యవసాయోత్పత్తులు నూటికి 35, పారిశ్రామికోత్పత్తులు నూటికి 85 వంతులు పెరిగాయి. ఉత్పత్తులలోని ఈ వ్యత్యాసం ధరలలో నాలుగైదు రెట్ల తేడాకు దారి తీసింది. ఇక తృతీయ ప్రణాళికక్రింద డబ్బు సప్లయి ఇంకా పెంచడంవల్ల 1959—60 లో కంటె ఏడు రెట్లు ద్రవ్యోల్బణం పెరిగే అవకాశంవుంది. 1959—60 నాటికి ధరలు నూటికి 32 వంతులు పెరిగితే, తృతీయ ప్రణాళికా కాలంలో ధరలు ఇంకా ఏడు రెట్లు పెరగడం తథ్యమని భావించవచ్చు.

ఇలా ధరలు పెరిగిపోతే రాగల ఫలితాలు ఏమిటి? ధరలు ఎంతగా పెరిగిపోతే డబ్బుకు కొనుగోలు శక్తి అంతగా తగ్గి పోతుంది. ద్వితీయ ప్రపంచ యుద్ధానికి పూర్వం నెలకు 60 రూ. సంపాదించి, సుఖంగా జీవించిన కుటుంబాలకు నేడు నెలకు 300 రూ. వచ్చినా చాలడంలేదు. 1955—56 లో ప్రణాళికా నిపుణులు [illegible] వేతనంలో [illegible] 6.5 వంతులు [illegible] మొత్తంమీద భారతదేశంలో డబ్బు విలువ నూటికి 30 వంతులు పడిపోయింది. [illegible] పెరుగుదల [illegible] లకూడా [illegible] స్థితి, స్థిరమైన ఆదాయాలు గలవారి [illegible] గా ఉంటోంది. [illegible] తగ్గింపు [illegible]. ఇది [illegible] జీవితాన్ని దెబ్బ తీస్తుంది. అయితే [illegible] ఉత్పత్తిదారులు, పారిశ్రామికులు, వ్యాపారులు, [illegible], భూస్వాములు లాంటి పెద్దగా ఉత్పత్తిచేసేవారు, సరుకులు నిల్వచేసి, వ్యాపారం చేసే వారికి ధరల పెరుగుదలవల్ల లాభాలు పెరుగుతాయి. వారి నిల్వ ధనం వాటాలు కూడా రకరకాలుగా హెచ్చుతాయి. ఈ విధంగా ద్రవ్యోల్బణం ధరల పెరుగుదల వల్ల ఆర్థిక అసమానత్వం హెచ్చుతుంది. సాంఘిక అన్యాయం పెరిగిపోతుంది. ఆర్థికాభివృద్ధికి రాజకీయమైన, సాంఘికమైన అవరోధాలు ఏర్పడతాయి. అవినీతి, లంచగొండితనం, ప్రభుత్వ నిర్బంధాలు, పన్నుల భారం, సాంఘిక కల్లోలాలు, అసంతృప్తి పెరుగుదల, పారిశ్రామిక అశాంతి పెరుగుతుంది. ప్రభుత్వం మీద, ప్రభుత్వ విధానాలమీద, శాసనాలమీద విశ్వాసం సడలి పోతుంది. ఆ యా దేశాల పరిస్థితులనుబట్టి ఈ పరిణామ ఫలితం రకరకాలుగా ఉంటుంది. ఉదాహరణకు జర్మనీలో హిట్లరు అధికారానికి వచ్చి నాజీ నియంతృత్వాన్ని పెంచాడు. అమెరికాలో రిపబ్లికన్ పార్టీ అధికారానికి వచ్చే అవకాశాలు దాదాపు ఇరవై సంవత్సరాల వరకు లభించలేదు. ఫ్రాన్సులో అనేక పార్టీ ప్రభుత్వాలు పతనమైనాయి.

ఇలాంటి పరిణామాలనివారణకు మార్గమేమిటి? శక్తికి మించిన పెట్టుబడి పెట్టడం,ధరల స్థిరత్వాన్ని గమనించకుండా ఆర్థికాభివృద్ధి పట్ల మాత్రమే శ్రద్ధ చూపడం అనే విధానాలకు స్వస్తి చెప్పడం ఒక్కటే ఈ పరిణామాల నివారణకు పరిష్కార మార్గంగా ఉంది. అంటే లోటు బడ్జెట్టు విధానాలు ద్రవ్యోల్బణం పద్ధతులు సరైనవి కావని, అవి ఆర్థికాభివృద్ధిని సాధించలేవని దీనికి అర్థం చెప్పకోరాము. అవి ఆర్థికాభివృద్ధి సాధనకు మార్గాలు సిద్ధాంతాలు అయినప్పటికి, వానిని అమలు పరచడంలో, ఆచరించడంలో—ధరల స్థిరత్వాన్ని, సాంఘిక న్యాయానికి అధిక ప్రాధాన్య మిచ్చినప్పుడే ఆర్థికాభివృద్ధి సాంఘికంగాను, రాజకీయంగాను సఫలం కాగలదని, ఆ హద్దులకు లోబడి ఈ విధానాలను అమలు జరపనప్పుడు మూలం సిద్ధాంతాలకే అపజయం రాగలదన్న అర్థం చెప్పుకోవలసి ఉంటుంది. భారత దేశం గత పది సంవత్సరాలుగా ప్రణాళికా రంగంలో పొందిన అనుభవమే ఇందుకు సాక్షి.

# ఉస్తాద్ అలీ అక్బర్ ఖాన్

ఈ సంవత్సరం సంగీత నాటక అకాడమీవారి బహుమతి ప్రఖ్యాత సరోద్ విద్వాంసుడైన అలీ అక్బర్‌ఖాన్‌గారికి ఇచ్చారు. ఈ బహుమానము వారికన్న అర్హులైనవారు లేరు. సరోద్ వాద్యంలో నేడు ఆయనను మించినవారు లేరు. ఆయన ప్రతిభ సర్వలోకము మెచ్చినది.

భారత సంగీత ప్రపంచంతో పరిచయం ఉన్నవారికి అలీ అక్బర్‌ఖాన్ అంటే తెలియనివా రుండరు. ఈమధ్య



ఎడింబరోలో జరిగిన సంగీత ఉత్సవంలో ఆయన వాయిద్యం ప్రపంచ పండితుల ప్రశంస నందుకొన్నది.

అలీ అక్బరు తన తండ్రి అల్లాఉద్దీన్‌ఖాన్ వద్దనే సంగీతవిద్య నభ్యసించారు. మాటలు నేర్చే వయస్సులోనే మాటలూ సంగీతం ఒకేసారి తండ్రి ఆయనకు నేర్పడం ఆరంభించారు. అల్లాఉద్దీన్ కేవలం సంగీత స్రష్టలలో ఒక రత్నము. (ఆయన చరిత్ర భారతి పాఠకులకు పరిచయం. భారతి నవం' 62) సరోద్ ఆయన సృష్టి. ఈ వాయిద్యాన్ని రబాబ్‌ను సంస్కరించి ఆయన చేశారు. (రబాబ్ అక్బరు చక్రవర్తి కాలంలో ఆఫ్ఘనిస్తాన్ నుంచి వచ్చింది.) శతవృద్ధు అయినా ఆయన గత సంవత్సరం జాతీయ కార్యక్రమంలో గంటన్నరసేపు సరోద్ వాయించి శ్రోతలను ఆశ్చర్యపరిచారు. వారి వాయిద్యంలోని నాదశుద్ధి అసాధారణము. ఆయన దృక్పథము అధునాతనం గాని, సనాతనం కాదు. పాశ్చాత్య సంగీతమన్నా ఆయనకు ఎంతో అభిమానము. "పాశ్చాత్య సంగీతమంటే నాకు ఎంతో ఇష్టము. ఇంత వయస్సు వాడిని కాక, కాస్త చిన్నవాడిని అయివుంటే దాన్ని గట్టిగా నేర్చుకోటానికి ప్రయత్నించేవాడిని" అని పాశ్చాత్య సంగీతం గురించి మీ అభిప్రాయ మేమిటని ఈమధ్య ఎవరో అడగగా చెప్పారు.

ఒకప్పుడు కుమారుడు అలీ అక్బర్, అల్లుడు రవిశంకర్ కలిసి పాశ్చాత్య స్వరాల ద్వారా మన రాగాలను వాయించాలని చూచారు. కాని మన రాగ భావానికి వాటికి కుదురదని ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నారు.

కొద్ది సంవత్సరాలుగా ఐక్యరాజ్యసమితి సంస్కృతిక శాఖ ఆధ్వర్యాన కెనడాలో విద్యార్థులకు అలీ అక్బర్ పాఠాలు నేర్పుతున్నారు. ప్రాచ్య పాశ్చాత్య సంగీతాలను పోల్చి పాఠాలను చెబుతారు. భారత సంగీతాన్ని తబ్లా, సరోద్ వాయిద్యాల ద్వారా వినిపించి వాటికి సన్నిహితమైన పాశ్చాత్య సంగీతాన్ని గ్రామఫోను రికార్డుల ద్వారాను, టేప్‌రికార్డుల ద్వారాను వినిపిస్తారు. ఈ పద్ధతిలో మొదటి పాఠం "బిలావల్ తట" తో ఆరంభ మవుతుంది. తట అంటే కర్నాటక సంగీతంలో చక్ర మన్నమాట. ఈ తటలో ఉన్న ఏడు స్వరాలక్రమం పాశ్చాత్య సంగీతంలో డు—రి—మి స్వరాలతో ఆరంభమయ్యే "పెద్ద స్కేలు" కు దగ్గరగా ఉంటాయి. వీరి ప్రయోగ ప్రయత్నము జయప్రదమైంది. దాని ద్వారా ఉభయుల సంగీత స్వరూపం తెలుస్తున్నది. అందుకనే విశ్వ విఖ్యాత వయొలిన్ విద్వాంసుడు శ్రీ మెహూదీ మినూహిన్ ఇలా అన్నారు :

"ఇది విన్న తర్వాతనే మాకు కాలము, లయ యొక్క ప్రాధాన్యత ఎక్కువగా తెలిసింది. మరొక విధంగా అయితే ఇంతగా తెలిసేది కాదు."

అలీ అక్బర్ కేవలం ప్రతిభావంతుడైన వాయిద్య విద్వాంసుడే కాదు. కొత్త రాగాలను కూడా సృష్టించారు. వాటిలో చంద్రనందన్, గౌరీమంజరి, హిందోళహేమే, మిశ్రశివరంజని, లాజ్‌వంతి అనేవి ప్రసిద్ధమైనవి. "ఈ రాగాలలో ఒక్కొక్కదానికి ప్రత్యేక స్వరూపము, వ్యక్తిత్వము తీసుకు రావడానికి మూడు నాలుగేళ్లు పట్టింది" అని ఆయన అన్నారు. వీరికి బహూకరణలు కొల్లలుగా వచ్చాయి. రవీంద్రుని Hungry stones కథతో తీసిన ఫిల్ముకు వీరు సంగీత దర్శకత్వం యిచ్చారు. దానికి 1958 సంవత్సరంలో ఉత్తమ సంగీత దర్శకుడుగా బహూకరణ పొందారు. అనేక ఫిల్ములకు సంగీతాన్ని తయారుచేసి ఇచ్చారు. ఈమధ్య ఇండో—అమెరికన్ ప్రొడక్షన్ వారి The House holders అనే చిత్రానికి సంగీతం సమకూర్చారు. ఫిల్ములకు వా రిచ్చే సంగీతంలో విశేష మేమిటంటే, ఆయన కేవలం శాస్త్రీయ సంగీతమే యిస్తారు. "మొదటి నుంచి చివరిదాకా శాస్త్రీయ సంగీతాన్నే ఉపయోగించాను. అదీ కూడా పూర్వ ప్రయత్నం లేకుండా—ఆడిషన్, ప్రాక్టీసు లేకుండా—అప్పటికప్పుడు తయారుచేశాను." అని ఆయన అన్నారు. ఫిల్ములకు శాస్త్రీయ సంగీతం పనికిరాదనేవారు వారు చేసినదానిని గమనించడం మంచిది. మన లలిత సంగీతం కూడా మన శాస్త్రీయ సంగీతం నుంచే రావలసిఉంది.

# గ్రంథ విమర్శనము

## ఉత్తరరామ ప్రణయచరిత్ర

రచన : శ్రీ చర్ల గణపతిశాస్త్రి. ప్రతులకు : రచయిత, ఆర్ష గ్రంథమాల, సమిశ్ర గూడెము, నిడదవోలు పోస్టు, పశ్చిమ గోదావరి జిల్లా. వెల : రు. 1—25.

సంస్కృతమున భవభూతి వ్రాసిన నాటకము ఉత్తర రామ చరిత్ర. దానికి తెనుగు అనువాదములు ఇప్పటికే చాల గలవు. శ్రీ గణపతిశాస్త్రిగారును దాని ననువదించిరి. పేరులో 'ప్రణయమును చేర్చిరి. "భవభూతి వచోమృత మందు మునిగి ఆ తీయన సుంతయుం జెడని తీరులనేనిడ సాహ సించితిన్" ఇది శ్రీ శాస్త్రిగారి ప్రతిజ్ఞ. ఇంతవరకు బాగు గనే యున్నది. "ఉత్తరరామ చరిత్ర—అనువాదముల తీరులు" అను శీర్షికతో ఎనిమిది శ్లోకముల నిచ్చి వానికి వేంకటరామ కృష్ణ కవులు, జయంతి రామయ్య పంతులు, మల్లాది సూర్య నారాయణశాస్త్రిగారల యొక్క అనువాద పద్యముల నిచ్చుచు శ్రీ గణపతిశాస్త్రిగారు తమ పద్యముల గూడ నిచ్చిరి. ఒక అనువాదకుడు ఇంత ధైర్యముగా మూలమును, మరియును తనకంటె పూర్వమున్న అనువాదములను చూపుచు, తనదిగూడ చూపుచున్నా డనగా, ఆ యనువాదకునకు తాను సర్వో త్కృష్టముగ చేసితినన్న ప్రగాఢమైన విశ్వాసముండి తీరవలయును. ఎవనిమీద వానికే విశ్వాసమూ లేనిచో అసలు పని సాగదు. కాని, దానిని వ్యక్తీకరించుటలో ముందు వెనుకలు చూచుకొనవలయును. ఉత్తరరామ చరిత్రమున కెన్నియో అనువాదము లుండగా ఆ ముగ్గురు అనువాదకుల పద్యములనే ఏల ఎత్తి చూపవలయును ? ఆయన చూచినవా ముగ్గుర అనువాదములే యున్నచో సరిపోవును. కాక 'ఇంతకు పూర్వమున్న అనువాదములలో ఆ ముగ్గురవే బాగున్నవి— అంతకంటెను ఈ అనువాదము శ్రేష్ఠముగా నున్నదని చూపుట కట్లు చేయబడిన దన్నను సరిపోవును. అది యట్లుండె. ఒక ప్రసిద్ధమైన గ్రంథమును భాషాంతరీకరించునపుడు అనువాద కుడు తానే మూలప్రతిని అనుసరించినదియు ముందు చెప్పవలయును. ఈ అలవాటు చాలమందికి లేదు. దీనివలన కొన్ని చిక్కులున్నవి. సంస్కృత ముద్రిత ప్రతు లన్నియు నొక విధముగా నుండవు. కొన్నింట కొన్ని వాక్యముల నిర్మా ణము భేదించియుండును. కొన్నింట కొన్ని లోపించి యుండును. అనువాదకుడు తా ననుసరించిన మూల ప్రతిని గురించి చెప్పనిచో అనువాదమును పరిశీలించుట కష్టము. ఇది చూడుడు. ప్రథమాంకమున గల చిత్ర ప్రదర్శనములు — ఆ చిత్రములను వేసిన చిత్రకారుని పేరు అర్జునుడు. శ్రీ గణపతిశాస్త్రిగారి అనువాదములో ఆ చిత్రకారునకు పేరు లేదు. ఇది పెద్ద విశేషము కాదనుకొనుడు. ఇట్టి వనేకము లుండును. తృతీయాంకమున 31, 32 శ్లోకములకు మధ్య శ్రీరాముని నోట వచ్చు వచన వాక్య మొక్కటియే 1940 సంవత్సరమున వావిళ్లవారు ప్రకటించిన తెలుగు లిపిలోని దానియం దున్నది. శ్రీ గణపతిశాస్త్రిగారి అనువాదమున శ్రీరాముని వచన వాక్యమునకు ముందుగా 'అవును. ఇది యట్లే' అన్న సీత వాక్యము కూడ నున్నది. అనుసరింప బడిన మూల ప్రతి తెలియరానప్పుడు వచ్చు చిక్కు లిట్టివే.

ఇక శ్రీ శాస్త్రిగారి అనువాద పద్ధతి చూడబోయి నచో నదియు నంత లోకోత్తరముగా నేమియు లేదు. "కిం వా మయా ప్రసూతయా? యస్యా మమ తాదృశమపి పుత్రకాణాం షద్విరళ కుంద ధవళ దశనోజ్జ్వలం మలోచన మను బద్ధకాకలీ హసితం నిత్యోజ్జ్వలం ముఖ పుండరీక యుగళ మలం నపరిచుంబిత మార్య పుత్రేణ," ఇది తృతీ యాంకమునందలి సీతాదేవి వాక్యము.. దీనికి శ్రీ గణపతి శాస్త్రిగారు వ్రాసిన తెనుగు చూడుడు. "కొంచెము ఎడ మైన మెత్తని పల్వరుసచే ప్రకాశించు చెక్కిళ్లతోను, మెల్లగా మధురముగా అస్ఫుటముగా కిలకిల ధ్వని చేయు చిరునవ్వుల తోను, ముడివేయబడిన పిల్ల జుట్టుతోను సుందరమైన యటువంటి నా కొడుకుల నిర్మల ముఖపద్మముల జంటను ఆర్యపుత్రుడు ముద్దు పెట్టుకొన నప్పుడు ఇంక నేను ఆ కుమా రులను కని ఏమి ప్రయోజనము ?" ఈ షద్విరళ కుంద ధవళ దశన మన్న దానికి కొంచెము ఎడమైన మెత్తని పల్వరుస యున్నదేమి తెనుగు ? చెక్కిళ్ల ప్రసక్తి మూలమున లేని దేల తెనుగున అవసరమైనది ? ముఖ పుండరీక యుగళ మన్న దానిని తెనుగున చెప్పు యత్నమే కూడదు. తెనుగునను నది యట్లే నిలుపబడవలయును. నిర్మల ముఖపద్మముల జంట యన్నది మూలములోని సొగసుందనమును కోల్పోయిన పేలవ మైన తెనుగు. శ్లోకానువాదమును వింతకుమించి లేదు.

త్రస్తైకహాయన కురంగ విలోల దృష్టే
స్తస్యాః పరిస్ఫురితగర్భ భరాలసాయాః
జ్యోత్స్నామయీవ మృదుబాల మృణాల కల్పా
క్రవ్యాద్భిరంగలతికా నియతం విలుప్తా.

తెనుగు పద్యము శ్రీ గణపతిశాస్త్రిగారిది చూడుడు:

హడలుం జెందిన యొక్క యేటి చిఱుతే డట్టుల్ వితో లంబ చూ
చెడి దానిన్—నడవంగలే కెటొ చరించె నిండుమూలాలఁ, బం
డెడిలే వెన్నెల వాకవోని మృదువౌ లేఁ దూండ్లయుంగాల యా
యొడలిం దీవెన వశ్య మే వనవృగాలో మ్రింగియుండున్
గదే. 3—29

ఏకహాయన కురంగ మన్న దానికి తెలుగు యొక్క యేటి చిఱుతేడి—ఒక్క యేడ వయస్సు గలిగినదనుట వల్లననే అది చాల చిన్నదని తెలియుచుండగా మరల 'చిఱు' అన్న విశేషణ మేల ? ఏకహాయన కురంగ మనగా ఒక యేడైనను నిండనిది నెలల లేడిపిల్ల అనీ యీ మొదలముగా నర్థము చేసికొన వలయును గాని "యొక్క యేటి — ఒకటే సంవత్సరము వయస్సు గలిగిన" అని 'ముక్కన్య ముం గ్ర్థము, చేసికొనరా దనిపించుచున్నది. జ్యోత్స్నామయీవ—ఇత్యాది వాక్యమునకు 'పండెడిలే వెన్నెలవాకలోని'—ఇత్యాది ఏమి తెనుగో తెలిసినవా రూహింపవలయును. "పండెడిలే వెన్నెల" యేమి ? పండు వెన్నెల యన్నదానిని మనసున బెట్టుకొని యన్నమాటయా ? ఈవిధముగా విచారించుచు బోయినచో నన్నియు సందేహాస్పద ములుగనే యుండును. "వా రిద్దఱను భగవానుడైన వాల్మీకి తల్లివలె బరిగ్రహించి పోషించి రక్షించెను." (రెండవ యంకము. పుట. 26) అన్న వాక్య మున్నది. వాల్మీకి తల్లి పరిగ్రహించినట్లు పరిగ్రహించెనా ? లేక పరిగ్రహించి తల్లి వలె పోషించి రక్షించెనా ? మూలమున తల్లి యన్నమాట కానరాదు. "వాల్మీకినా ధాత్రీకర్మతః పరిగృహ్య పోషితౌ పరి రక్షితౌ" అని యున్నది. ధాత్రీ కర్మతః అన్న దానిని పట్టుకొని "తల్లివలె" అనుట విచారించి యనుట కాదు. ధాత్రీ కర్మతః అనగా ఉపమాతృ వ్యాపారేణ అని వీరరాఘవుని వ్యాఖ్య. ఆ వాక్యమును వేదమువారు "వారిని వాల్మీకి భగవంతుడు దాది పని మొదలుకొని తానే పూనుకొని పెంచినాడు.—రక్షించినాడు" అని తెనుగు చేసిరి. శ్రీ గణపతిశాస్త్రిగారు "అనువాదముల తీరులు" చూపించుటలో వేదమువారిని పేర్కొనక పోయినను, వేదమువారి అనువాదమును బాగుగ నెరింగి యున్నట్లే ఈ గ్రంథమును చదువుచున్నప్పుడు మధ్య మధ్య స్ఫురించుచున్నది. "కిమ త్రోచ్యతే" ఇందు చెప్ప వలసిన దేమున్నది ? అని వేదమువారు, శ్రీ గణపతిశాస్త్రి గారును తెనుగున నదే వాక్యము వ్రాసిరి. (2 అంకము). 'త్వం జీవితం త్వమసిమే హృదయం ద్వితీయం'—ఇత్యాది శ్లోకమును వేదమువారు "ఈవె మదీయ జీవితమ వీవె ద్వితీయ మనంబ వక్షులం దీవె విశుద్ధ కౌముదివి—" ఇత్యాదిగా ననగా శ్రీ గణపతిశాస్త్రిగారును "నీవు మదీయ జీవితమ వీవు ద్వితీయ మదంతరాత్మవున్—' ఇత్యాదిగా ననిరి. ఇట్లు వ్రాయుట యొక దోషమనుట లేదు. ఒకే మూలమును అనువదించునప్పు డిట్టివి అనివార్యములు. ఇదంతయు నెందుకనగా 'ధాత్రీ కర్మతః" అన్న చోట వేదమువారివలె వ్రాసియున్నను బాగుండెడి దని చూపుటకు మాత్రమే.

శ్రీ గణపతిశాస్త్రిగారు శబ్దప్రయోగము నందును కొంత స్వేచ్ఛ నవలంబించినట్లు కనిపించుచున్నది. "సభనుండే చొచ్చు శుద్ధాంతమున్" (పుట. 4) "స్వతేజ దర్శించి రిటుల్" (పుట 8.) "వృత్య వఱకున్" (పుట. 19) "ఆయువట్లు" (పుట. 22) "ఈ గ్రావము క్రిందె" (పుట. 36) "ఖరేల్నన్" "పేరుకొన్ వ్యథ" (పుట. 36) "కోలాహలాలన్" (పుట 38) "ఇంకోప్రక్క" (పుట. 48) ఇట్టివి కేవలము దోషములు కాకపోయినను తత్తత్ప్రకరణములకు నప్పి సముచితముగ లేవు.

ఇది అనువాదము గనుకను, చాలమందిచేత నింతకు పూర్వమే అనువదింపబడి యున్నది గనుకను, పూర్వానువాదముల కంటె ఈ తమ యనువాదము మేలుగా నున్నదన్న నిశ్చయాభిప్రాయము రచయిత కున్నది గనుకను—దీనిని గూర్చి యింతగా వ్రాయవలసి వచ్చినది. లేకపోయినచో భవభూతి ఉత్తరరామ చరితమున కిదియు నొక అనువాద మనుట చాలును. శ్రీ గణపతిశాస్త్రిగారు సంస్కృత మూలమును బహు వారములు పఠించి పఠించి తత్కవితా మృతమును తమ యోపిన కొలది తెలుగువారి కందించుటకు చేసిన యత్నమే ఈ కృతి.

ఎందఱెందఱో యిది మథియించిరనుచు
మనము మాత్రము మఱి యూరకొనుట యేల ?
అంత లంతలు యత్నంబు లాచరించి
యందఱును తుద కమృతంబు పొంది రొక్కొ ?

శ్రీ శాస్త్రిగారు తమ యనువాదమునకు భూమికగా వ్రాసికొన్న యీ పద్యమే చాలును, సర్వమును వ్యాఖ్యానించుటకు. ధారాశుద్ధి కలిగిన శ్రీ శాస్త్రిగారి పద్యములు ముచ్చటగా నున్నవి. సహృదయు లీ యనువాదమును కూడ తప్పక ఆదరింపగలరు.

## ఛం దో హం సి

రచన : బుర్రా కమలాదేవి, విశాఖపట్టణము. వెల : మూడు రూపాయలు.

"ఛందశ్శాస్త్రము చాల విపుల మైనది. అందులో గల సారమును ప్రత్యేకించి తెలియజేసే గ్రంథము, కనుక ఇది ఛందోహంసి యైనది". "గ్రంథ పరిచయము" వ్రాసిన బ్రహ్మశ్రీ గిడుగు వేంకట సీతాపతిగారి వాక్య మది. శ్రీమతి కమలాదేవిగారు వ్రాసిన ఈ గ్రంథము రెండు భాగములుగా నున్నది. మొదటిది నామారాధనము. రెండవది లక్షణ పద రచన.

# గ్రంథ విమర్శనము

ఛందో గ్రంథములు తెనుగున చాల గలవు. అందన్నింటను గణ ప్రస్తారము—పద్య లక్షణ నిరూపణము, లక్ష్య పద రచనము కలవు. అప్పకవీయము ఛందో గ్రంథము లన్నింటను శిరోరత్నముగా ప్రసిద్ధికి వచ్చినది. శ్రీమతి కమలాదేవిగారు అప్పకవీయమునందు నిరూపింపబడిన శ్రీ మొదలుకొని మంగళ మహా శ్రీ వరకు గల 187 పద్యముల లక్షణములకు క్రొత్తగా లక్ష్యములను రచించిరి. రెండవ భాగముగా చెప్పబడిన లక్ష్య పద్య రచన యిదియే. నామారాధనమున పద్యముల పేర్ల నిమిడ్చి భగవంతుని స్తుతించినది. అందు శ్రీమతి కమలా దేవిగా రిమిడ్చిన పద్యముల పేర్లు 180. అందు కొన్ని పృథ్వి, సతి, క్షమ, ఇత్యాదులు పునరుక్తములైనవి. స్థూల దృష్టికి నామారాధనమున నిమిడ్చిన పద్యముల పేర్లను వరుసగా తీసికొని లక్షణ నిరూపణ పూర్వకముగా లక్ష్యము లను రచించు ప్రయత్నము జరిగియుండు ననిపించును. అట్లు చేసియున్నచో నొక పద్ధతి ననుసరించినట్లుండెడిది. అప్పకవీయమున "పద్య లక్ష్యోపయోగి సంజ్ఞలు" అను శీర్షికను పద్యములపే ర్లొక్కచోట నీయబడి తరువాత వరుసగా లక్ష్య రచన జరిగినది గదా! అట్లుండి యుండెడిది. కాని శ్రీమతి కమలాదేవి గారా పద్ధతి ననుసరించుటను పెట్టుకొన లేదు. లక్ష్యములు వ్రాయబడని ద్విపద—దండకము ఇత్యా దులు కూడ నామారాధనలో చేర్చబడినవి.

ఈ గ్రంథమేమి పరమార్థము సాధింపబడు నుద్దేశ్య ముతో వ్రాయబడినదో తెలియుటలేదు. లక్ష్యభూతములైన పద్యములు క్రొత్తవి. అంతే. లక్షణ మంతయు అప్పకవి గారిదే. కొని పద్యముల లక్షణమును గూర్చి కొని భిన్న వాదము లున్నవి. శ్రీమతి కమలాదేవిగారు కనీస మట్టిచో నైనను విశేషముగా నేమియు వ్రాయలేదు. కేవల మప్ప కవీయమును వరుసగా ననుసరించినది. శశివదన—సురలత అని రెండు పద్యము లున్నవి. ఆ రెండును భిన్నములు కావు. న—య—గణములే రెండింటను. అప్పకవీయమును పరిష్క రించిన గిడుగువారును, ఉత్పలవారును. రెండింటికి భేదము లేదు గనుక రెండవదానికి లక్షణము జూప ననవసరమని అధో జ్ఞాపికలో వ్రాసిరి. అప్పకవీయమున నేది అనవసరముగా జెప్ప బడినదో అది ఈ ఛందోహంసి యందును అట్లే చెప్పబడినది. మరియు "భుజంగశిశు" రుతమునకు "భుజగ శిశిరుతము" అని శ్రీమతి కమలాదేవిగారు వ్రాసిరి. అప్పకవీయ పరిష్క ర్తలు "భుజంగశిశి" అన్నది తప్పనియు సంజ్ఞల పట్టికలో నున్నట్లు "భుజంగ శిశు" అనియే ఉండవలయుననియు వ్రాసిన దానిని ఈమె గమనింపలేదు. శుద్ధవిరాటి—వృత్త గణములు—మ. స. త. గ—అని ఈమె వ్రాసినది. అప్ప కవీయమునను, కావ్యాలంకార చూడామణియందును, ఆనంద రంగరాట్ఛందము నందును మూడవది జగణముగా లక్షణము చూపబడినది. అప్పకవీయ లక్ష్య పద్య ద్వితీయ పాదమున మాత్రము "గ్రాలున్ శుద్ధవిరా టిన్‌షడ్యతిన్" అని మూడవది తగణముగా నున్నది. గ్రాలున్ శుద్ధ విరాటిషడ్యతిన్ అన్నచో చెప్పబడిన లక్షణమునకు సరిపోవును. మరి శ్రీమతి కమలా దేవిగారు మూడవది తగణమని ఎట్లు చెప్పగలిగినదో తెలి యదు. తిక్కన్నగారు స్త్రీ పర్వమున వ్రాసిన శుద్ధ విరాటి వృత్తమున మూడవ గణము జగణముగనే యున్నది. క్రౌంచ పదము, మానిని, కవిరాజ విరాజితము—ఈ వృత్తముల యందు యతులను వేయుటయందు నన్నయ తిక్కనాది కవులు భిన్న మార్గములను గూడ అనుసరించిరి. శ్రీమతి కమలాదేవిగారు ఆయా విషయములను గమనింపక కేవలము అప్పకవీయమును పట్టుకొని క్రొత్త లక్ష్యములను వ్రాసినది. కనీస మాంధ్రకవులచేత వ్రాయబడిన విశేష వృత్తముల నన్నింటి నైను గైకొని లక్ష్యములు—లక్షణములు చెప్పబడి యుండిన కొంత నయముగా నుండెడిది. అదియును లేదు. లయగ్రాహి—లయ విభాతి—ఇత్యాది ప్రసిద్ధములైనవే ఇందు లేవు. ఈ ఛందోహంసి యను గ్రంథము "స్వతంత్ర పద్య కావ్యముగా రచిత మయినది" అనుట అసలు గ్రంథ స్వరూప స్వభావముల అంతర్య మంతుబట్టక, ప్రయోజన మవగతము గాక అనవలసి యనుట మాత్రమే యగును.

—క్షేమేంద్ర.

# శ్రావణ చరిత్ర

(కృతికర్త : శ్రీ అంబటి సుబ్బరాయగుప్త, మూల్యం: రూ. 3, ప్రతులకు : రచయిత, 7 ఫస్ట్ స్ట్రీట్, అక్బర్‌బాద్ మదరాసు—24.)

రసవత్కావ్యమయిన రామాయణము నందలి ఒక కమ్మని కథయే శ్రావణ కుమారుని యుదంతము. ప్రత్యక్ష దైవతములగు మాతా పితరులను సేవించుటకే తమ జీవితము లను మీదు కట్టిన మహనీయులుగా శ్రావణ కుమారుడు, జీమూత వాహనుడు మున్నగువారు ప్రతిభాసించుచున్నారు. వీరు సర్వ మానవులకు ఆదర్శప్రాయులు, వీరి పవిత్ర జీవిత చరిత్రలు అవశ్య పఠనీయములు.

శ్రావణ చరిత్ర తెలుగువారికి సుపరిచితమైనదే. కాని యీ కథ 160 పుటల కావ్యముగా వెలుగులోనికి వచ్చుట యిదే ప్రథమ మనుకొనుచున్నాను. ఇందులకు కావ్యకర్త అయిన శ్రీ అంబటి సుబ్బరాయ గుప్తగారు అభినంద నీయులు.

శ్రీ గుప్తగారు తమ విజ్ఞప్తిలో ఇట్లుల పేర్కొని నారు. "అర్థ సౌలభ్యము, పద్యముమ హృద్యముగా నడిపించు లయయు ( Rhythm ) ముఖ్యాశయములుగా రచింప బడిన కావ్య మగుటచే నిందు .యతులు, సంధులు శకట రేఫానుస్వారాది ఛందో వ్యాకరణపు ముండులందు కొంత మడి సడలుట అనివార్య మైనది. ముద్రారాక్షసములు కూడ చాల దొర్లినవి," కనుక ఈ విషయాదికమును గురించి చర్చించుట అంత సమంజసము కాదు. అయినను, ఒక్క ఆంధ్ర ద్రావిడ

భాషలకే సొంత మనదగిన యతి విషయమును కొంత 'మడి' అవసరమని నా యభిప్రాయము. కావ్య మంతయు సరళ సుందరమైన శైలిలోనే సాగినది. కొన్ని పద్యములలో వ్యర్థ పదముల మోతాదు కొంచెము ఎక్కువగా కానవచ్చు చున్నది. ఈ క్రింది పద్యమును చూడుడు :

"అనుచా దశరథుఁ డాచితిఁ
దనరఁగఁ బడనున్నఁ గని, యతని నారదుఁడో
మనుజేంద్రా ! నిలు, నిలు, విను
మనఘా ! నీకు వలదిట్టి యాగడమా నృపా !"

కాశికా విశ్వనాథః సత్కారణ, పాటలీపుత్ర సత్పట్టణము, సుశాశ్వతము వంటివి చాల కనబడుచున్నవి. ఇవి కనుక లేకున్నచో, ఈ కావ్య మింకను రమణీయముగ నుండి యుండెడిది.

శ్రావణుని కథ క్రొత్తది కాకపోయినను, ఇందులో చేయబడిన కల్పనలు సహృదయులను బహుధా ఆకర్షించు నవిగా నున్నవి. ముఖ్యముగా, తన్ను వలచిన రాకుమార్తె యందు శ్రావణుడు వైముఖ్యము వహించిన కథాఘట్టము రమ్యముగా నున్నది. శ్రావణుని పితృసేవలో పాల్గొందుననియు ఆమె నుడివెను. పితృసేవాసక్తుడైన యాతని విషయమున ఈ మాటలు రామబాణమువలె పనిచేసి యుండవలసినదే. కాని అటుల జరగలేదు. శ్రావణుని మనోనిగ్రహమును, పితృసేవా నిరతిని, విధ్యుక్తధర్మ నిర్వహణాభిలాషను ఈ ఘట్టము ప్రవ్యక్తము చేయుచున్నది.

శ్రావణ కుమారునిచే వివిధ ఘట్టములందును కవి నైతికబోధ గావించినాడు. తదవసరమున పేర్కొనబడిన 'పాపభీతికి జంకని ప్రభులు ప్రభులె ?', 'చేతులార నేను చేసిన తప్పును, పూర్వ కర్మపైన మోపఁదగునె ?', 'ప్రజల పేరట నధికార పదవులంది యవల వారినే వంచించు స్వార్థ పరులు', 'ధనమా ముఖ్యము పరిణయమునకు, వరుని శీల సుగుణములుగా వాక్కో'—మొదలైన సుభాషితములు రసజ్ఞులను అలరించు ననుటలో సందేహములేదు. మొత్తముమీద, కమ్మని కథయు సరళమగు శైలియు గల యీ కావ్యము అవశ్యపఠనీయము.

—'కృష్ణ.'

## ఆంధ్ర సాహితీ సార్వభౌముడు

ఆంధ్రసాహితీ సార్వభౌముడు : రచన: దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డి. పుటలు : 76. వెల :1—15. ప్రాప్తిస్థానము : తెంకణ గ్రంథమాల. ఉలవపాడు. నెల్లూరుజిల్లా.

ఆంధ్రవాఙ్మయ చరిత్రలో నన్నెచోడ మహాకవి రాజు శ్రీ కృష్ణదేవరాయలు, తంజావూరి రఘునాథరాయలు, రాజ కవిత్రయముగా కీర్తింపదగినవారు—ఈముగ్గురిలో "కుండ లీంద్రుండు తన్మహనీయస్థితి మూలమై నిలువ" అన్నట్లుగా కీర్తి గన్న రాజకవీంద్రుడు కృష్ణదేవరాయలు—ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున యుగ విభాగములో, శ్రీకృష్ణదేవ రాయ యుగమునకే గాక, దక్షిణాంధ్ర వాఙ్మయమున యుగ మునకు సృష్టికర్త, మూలపురుషుడు. 1

అట్టి కృష్ణరాయల కృతి ఆముక్తమాల్యదను గూర్చి పై గ్రంథము వెలువడినది. కృతికర్తలు వెంకటకృష్ణారెడ్డి గారు, విమర్శకలోకమునకు విశ్రుతులే. ఆముక్తమాల్యద—ఆంధ్రసాహిత్య ప్రపంచమున కతి పరిచయ మైనదే. అయిన నెందుకీ రచన యని ప్రశ్న రావచ్చును. దేశమున నింకను, ఆముక్త మాల్యద రాయలు రచింపలేదను నపప్రథ యున్నది. దానిని నిర్మూలింపజేసి, కర్తృత్వమును రాయల వారిదిగా నిర్ణయించుటయే ప్రథమోద్దేశముగా నిది వెలసినది.

ఆముక్తమాల్యద రాయల కృతమే యని, ఈనాటి కవి జీవిత, కవి చరిత్రలు, వాఙ్మయ చరిత్రలు చెప్పుచున్నను, కీ. శే. వేదము వేంకటరాయ శాస్త్రులవారు ఆముక్తమాల్యదను విపులపీఠికా వ్యాఖ్యానాదులతో క్రీ. శ. 1927 లో వెలయించిన గ్రంథమున నది పెద్దన కృతమగునట్లుగా నిరూపించియున్నారు. అంతేకాదు. ఆముక్తమాల్యద కృతి స్వరూపమునే మార్చియున్నారు. ఆగ్రంథమునకు గల తాళపత్ర ప్రతులలో పెక్కింట ఆఱాశ్వాసముల గ్రంథము మాత్రమే లభ్యమగుచుండగా, తర్వాతి కాలమున నొక వ్యాఖ్యాత చేర్చిన ఏడవ యాశ్వాసమును నందు చేర్చి ముద్రించిరి.

ఆముక్తమాల్యదలో తొలి నుండియు నాఱాశ్వాసములే యున్నట్లు, మన మీ క్రింది యుపపత్తులచే నిరూపింప వచ్చును.

### ఆముక్తమాల్యద - బ్రౌనుదొర వారి ప్రతులు

తక్కిన ఆంధ్ర గ్రంథములవలె, ఆముక్తమాల్యద వ్రాతప్రతులను సేకరించి, పాఠభేదములను సూచించి, సంస్కరించి, దానిని ముద్రణ యోగ్యముగ నొనర్చినది. బ్రౌను పండితుడే. వారు ఆముక్తమాల్యదకు ఒక శబ్దసూచి (Concordance) వ్రాయించిరి—తమ నిఘంటువులో, దానినిబట్టి యుదాహరణ లిచ్చిరి. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో 405 సంఖ్య గల ప్రతిలో విషయము చూడుడు.

2 బ్రౌను పండితుని స్వదస్తూరితో నిట్లున్నది.

This manuscript has been Corrected by the very learned critic Zuluri Appaya in 1834. The third book of the poem is wanting.

బ్రౌను పండితుడు సంప్రతించిన ప్రతులలో 6 ఆశ్వాసములే యున్నవి. వ్యాఖ్యానములలో నొకటి తప్ప తక్కిన వాని

1. ఈ విషయము—నా దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమున నిరూపిత మైనది.

2. ప్రా. పు. భాం. ప్రబంధములు—2 వ సంపుటము. పుట. 491.

# గ్రంథవిమర్శనము

యందు అన్నింటను ఆతాశ్వాసములే. హరి శబ్దసూచి ఆతా శ్వాసములకే

## ఇతర ప్రతులు

మదరాసు ప్రాచ్య లిఖిత భాండాగారముననే కాక శి తంజా వూరి పుస్తకశాలలో 131—136 సంఖ్యలతో 6 ప్రతు లున్నవి. అం దియిదింట 6 ఆశ్వాసములే యున్నవి.

క్రీ. శ. 1869 నుండియు, వావిళ్లవా రింతవఱకు 6 ముద్రణములు వెలయించినారు. అన్నింటియందు ఆతా శ్వాసములే.

అయితేనేమి—వేదమువారు వ్రాత ప్రతులలో ఆఱవ యాశ్వాసాంత పద్యము—షష్ఠ్యమం'' అను దానిని 'సప్తమం' అని మార్చి—ఆముక్త మాల్యద నేడాశ్వాసముల గ్రంధముగా ప్రకటించినారు.

ఏ కవియైన గ్రంథమునకు నాశ్వాసములను రోదన సంఖ్య యగు నేడాశ్వాసములుగా వ్రాయడు—ఇంతకు ఆముక్త మాల్యద యందున్నవి ఆఱక్షరములే—కావున రాయలవారు ఆతాశ్వాసములే వ్రాయుట సహేతుకము, సమంజసము.

తాళపత్ర ప్రతులలోను, ముద్రితములలోను నాతా శ్వాసములున్నను, ఆముక్తమును నేడాశ్వాసములుగా వేదము వారు ముద్రించుట, గ్రంథ పరిష్కరణ ముద్రణ విధానము నకు విరుద్ధము. అయితే తాళపత్రములలో వేఱు విధముగా నున్నను స్వతంత్రించి ముద్రణ చేయు విధానమునకు నీవఱకే పురాణం హయగ్రీవశాస్త్రిగారు, వేదమువారికి దారి చూపిన ట్లున్నది. విషయాంతర మైనందులకు పాఠకులు మన్నింతురు గాక.

నేటి పోతన భాగవతమున నన్ని ముద్రణముల యందును గంగన విరచిత పంచమ స్కంధము రెండాశ్వాసముల క్రింద విభాగింపబడి యున్నది. రెండింటియం దాశ్వాసాద్యంత గద్యలు గలవు. కాని, ఏ భాగవత తాళపత్ర ప్రతియందును పంచమస్కంధము ఒకే యాశ్వాసము తప్ప—రెండాశ్వాస ములు లేవు.

భాగవతము క్రీ. శ. 1848 లో ముద్రించిన పురాణం హయగ్రీవశాస్త్రులుగారి పంచమస్కంధమును రెండాశ్వాసము లుగాఆశ్వాసాద్యంత పద్యములతో ముద్రించిరి. అవి యెవ రివో తక్కిన ముద్రణము లన్నింటిలో మొదటి ముద్రణము ననుసరించియే యున్నవి. 1905 లో ఆనంద ముద్రణమున కొంత సూచిక యున్నది.4

ఆ శాస్త్రులవారి వలె నీ శాస్త్రులవారును వ్రాత ప్రతు లను మార్చిరి. రెడ్డిగారీ గ్రంథ మాతాశ్వాసములే యని నిరూ పించిరి.

వేంకటకృష్ణారెడ్డిగా. రీ గ్రంథమున—భువన విజయ ప్రశంస లేకపోవుట—వైంధ్య ద్వీపము—ప్రబంధసంబంధ్యన్న భావము—వీని వ్యంగ్యార్థ సూచన మున్నగు నూతన విషయ ముల దెలిపిరి. ఇది ప్రశంసనీయమే. కాని చారిత్రకముగ నీ కృతిలో కొన్ని విపర్యాసము లున్నవి.

పుటలు : 16, 17, 8

రామకృష్ణు డాముక్త మాల్యదను గూర్చి చెప్పిన చాటువును గూర్చి చర్చించుచు, ''రాయల యాస్థానకవి రామ లింగని పేర చమత్కార కథలను సృష్టించినట్లే—''అనియు. ''రాచకవిత్వ బాధపడరాదు పరామరిశింపు దైవమా అను కాలమహిమతో కల్పింపబడిన చాటు కథలే కాని'' అనియు వాక్యములు గలవు.

తెనాలి రామలింగకవి, తరువాత తెనాలి రామకృష్ణుడు కృష్ణదేవరాయల కాలమువాడని, ఆతని యుద్ధ టారాధ్య చరిత్రవలన నిర్ణీతమైన చారిత్రక విషయము—రాయల యాస్థానమున, నానాడు రామలింగకవి చెప్పిన పద్యములు, కథలు, అవి యన్నియు చారిత్రకముగా సత్యములని విఖ్యాత విజయనగర చారిత్రక విద్వాంసులు నేలటూరి వేంకటరమ ణయ్యగారు సప్రమాణముగ నిరూపించి యున్నారు.5

''రాచకవిత్వ బాధపడరాదు పరామరిశింపు దైవమా'' అని రామలింగకవి చెప్పినది పంచతంత్ర కృతికర్త యగు బైచరాజు వెంకటనాథకవిని గూర్చి. ఈ వెంకటనాథకవి కృష్ణ రాయల సమకాలికుడగు రాజకవి. కృష్ణరాయ లాముక్తమును పెద్దన తోడ్పాటుతో రచించెనని వ్యంగ్యముగా నిరూపించుచు, తానును రాజకవిగావున తాను అసహాయ కవితా నిర్మాణ శూరుడ నని గద్యయందు వ్రాసికొన్నాడు. అష్టదిగ్గజములను వ్యంగ్య ముగా నిరసించినాడు. ఈతడు దుద్దండుడు. స్వతంత్రుడు. కవితా ప్రతిభ కలవాడు. కావుననే రామలింగకవి యంతవా డీ రాచకవిత్వ బాధపడరాదు అని యాతని గూర్చి చెప్పినాడు.

---

3. తంజావూరి తెలుగు పుస్తకముల కేట్లాగు. పుట. 15.

4. ప్రస్తుతము పోతన భాగవతము సమగ్ర పరి ష్కృత నూతన ముద్రణమునకు సమకట్టిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవా రేమి చేయుదురో ?

5. చూడుడు : భారతి 1940. తెనాలి రామకృష్ణుడు: అతని చాటువులు.

ఘటికాచల మహాత్మ్యము రచించునాటికి రామకృష్ణ కవి పుట్టుడు. లప్పటికి కృష్ణరాయలు గతించి, యే ముప్పది సంవత్సరేండ్లు కావొ అయినది. ఆ కృతిని రామకృష్ణకవి మను పుడు ఖండోజీకి సమర్పించెను. దీనినుండి యుదాహరించిన 'భువిని విచిత్ర వాక్సరణి .... కృతికన్య నింటనే యుంచెను' అను వచనము అను పద్యమును (1ఆ. 14, 15) రామ కృష్ణునివి గావు. ఆ యవతారిక యంతయు వేంకటగిరీంద్రుని కవిత్వము.

పుట. 7. క్రీ. శ. 1805 లో జోగి జగన్నాథరాజువ్యాఖ్య.

ఈ వ్యాఖ్యరచనా కాలము. (శరవహ్న్యద్రిశశాంక 1765 శా. శ) క్రీ. శ. 1813.

ఈ గ్రంథమున చూపబడిన ప్రక్షిప్తములు, చారిత్రి కాంశములు ఆముక్త మాల్యదకు నూతన పరిష్కృత ముద్రణ మొకటి కావలయునని నిరూపించుచున్నవి. అందుకు వారికి మన కృతజ్ఞత.

## ఆముక్తమాల్యద-విశేషములు సంస్కరణము

ఆముక్త మాల్యద పేరునకు మృదువగు పుష్పముల సంబంధ మున్నను రచన మాత్రము కఠినమగు నారికేళ పాకమున నున్నది.

ఈ కృతిని రాయలవా రవతరింపజేసిన నాట నుండియు కవిరాజ ప్రశంసలకు పాత్రమైనది.

I. (1) తెనాలిరామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యమున—(4—244) గురుభీత మతికి నాముక్త మాల్యదకు వెన యగుచున్." అని యీ గ్రంథనామము సూచించెను.

(2) రామరాజు రంగప్పరాజు—సాంబోపాఖ్యానము—(1—53)షష్ఠ్యంతములు.

క. ఆముక్త మాల్యదా కవి

రాముక్త ప్రసవమాలికార్చితునకు ... అని యీ కృతి సూచించినాడు.

(3) విశ్వేశ్వర పండితుడు.[6] కృష్ణ విలాసము. (1670—1700.)

సీ. పా. బాగైన యాంధ్ర ప్రబంధంబులం దెల్ల
"నాముక్త మాల్యద" యందు కరణి.

(4) కాణాపము—పెద్దన సోమయాజి—ముకుంద విలాసము.

ఆ. ఇందు సకల హితము నిచ్చు మున్విష్ణు చి
త్తీయ తుల్యమే మదీయ కవిత. అవతారిక.

II. తెలుగున విశిష్టాద్వైతమును ప్రతిపాదించిన ప్రథమ ప్రబంధము.

III. తిరుపతి వేంకటేశ్వరున[7]కంకితములైన కృతులలో మొదటిదియై వేంకటేశ్వరు వాఙ్మయమునకు శ్రీకారము చుట్టినది.

IV. నాయిక పేరితో నున్న కృతులలో మొదటిది.

V. ఆశ్వాసాంతముల గద్య లేక పద్యము లుండుట.

ఇవి సంస్కృతమున హర్ష నైషధము ననుసరించి రచిత మైనది. అందు శార్దూల వృత్తములు ఇందు మత్తేభ ములు—(రాయలవారికి మత్తేభముల యందు ప్రీతి హెచ్చు గదా.)

VI నన్నెచోడ శ్రీనాథాది మహాకవుల యనుసరణ లిందు గలవు.[8]

ఈ లోకోత్తర కృతి—క్రౌను పండితుని పదానుక్రమణి కతో, పాఠ పరిష్కరణములతో, ప్రతిపదార్థ పదౌచిత్య వివరణతో భావబోధ తాత్పర్య విశేషములతో సుసంస్కృతమై వెలయవలసిన యావశ్యకత యున్నది. ఇప్పుడు ముద్రిత మైన వ్యాఖ్యలే గాక, అముద్రిత వ్యాఖ్యల నామూలాగ్రముగ పరిశోధించి వానియందలి విశేషము లిందు సంగ్రహింప వలసి యున్నది.

ఈనాడు శ్రీ వేదమువారి సంజీవని వ్యాఖ్య యున్నది. ఆ వ్యాఖ్యయం దాముక్త మాల్యద పాఠములు, నవీన వ్యాకర ణానుసారముగ మార్పు చెందినవి. వ్యాఖ్యానములలో నాయా

---

6. అముద్రితము. చూ. దక్షిణాంధ్ర వాఙ్మయము. పుట : 497.

7. రాయలవా రెచ్చటను నాముక్తమాల్యదలో వేంకట శబ్దమున ఈశ్వర శబ్దము చేర్చి వేంకటేశ్వరుడని వాడలేదు. వేంకట భర్త వెంకటనాథుడనియే వ్రాసినారు.

రాయలకు కొంచెము ముందుగా ఎఱ్ఱన తన సకల నీతి కథా నిధానమున, కృతిభర్తను వెంకటేశ్వరుడు బ్రోచు నట్లు వర్ణించినాడు. గాని, స్వయముగా వేంకటేశ్వరున కది యంకితము కాదు.

8. ఈ నడుమనే కీర్తిశేషులైన విశిష్ట సాహితీ వేత్తలు, కవులు శ్రీ బిరుదు వెంకటశేషయ్యగా రాముక్త మాల్యదను గూర్చి 800 పుటల మహాగ్రంథమును రచించి రని వింటిని.

చోట్ల నెన్నియో మార్పులు కావలసి యున్నవి. వేదమువారి వ్యాఖ్యయు నే డలభ్యముగా నున్నది. ఒక్క ఉదాహరణము చూపుచున్నాను.

ఈ క్రింది పద్యమును వ్యాఖ్యయు చూడుడు :

గీ. వెద మొదవు కూడఁ బోలేని వెచ్చ క్రొవ్వు
కల్వ మెడ చాప వెడలెనో యనఁగ వెట్ట
కేలకును గ్రుంగి తెచ్చు అంకెలు నిగుడగ
మందగతి గున్కె వృషభముల్ మంద పిఱుఁద.''

వ్యాఖ్య—వృషభముల్ — ఆఁబోతులు, వెద మొదవు కూడన్—ఋతువులో నున్న పాడియావుతో కూడ, పోలేని వెచ్చ —పోలేనందున గలిగిన తాపము, క్రొవ్వు (మెడ పలుకు లోపల నున్న) క్రొవ్వును, కల్వన్—కరగునట్లు చేసినంతట, మెడ చాపన్ —కంఠమును దీర్ఘీకరించినందున, వెడలెనో —అంకె బయటికి వచ్చినదో, అనఁగన్—అనునట్లు, ఎట్టకేలకున్—ఎంతయు ప్రయాసపడి, క్రుంగి—క్రిందికి తల వంచి, తెచ్చు అంకెలు బయటికి రప్పించుకొను వృషభధ్వనులు, నిగుడగన్—వెలువడుచుండగా, మందపిఱుఁదన్ —పశువుల గుంపునకు వెనుక, మందగతిన్—మెల్లని నడకతో, గున్కెన్—పోయెను. అని కలదు. ఈ వ్యాఖ్యార్థమునకు సరిపోయినట్లుగా భావము వ్రాసి —అలంకారము నిరూపించినారు.

'అంకె వచ్చుటకు తాపము క్రొవ్వును కరగించుట హేతువుగాదు. దానివి హేతువుగాఁ జెప్పినందున హేతూత్ప్రేక్ష.

ఈ పాఠ మెక్కడిదో తెలియరాదు. పై పద్యమున రెండవ పాదములో కల్వము —అనగ—అని యతి తప్పిన విషయము వారు గమనించలేదు. కలుగు ధాతువునకు 'కల్వన్' అను రూప మెట్లు సిద్ధించును. వ్రాతప్రతిలో.

గీ. వెద మొదవుఁ గూడ బోలెక వెచ్చ గ్రొవ్వొ
కల్పమెడ సూప వెడలెనో యనఁగ.

ఇందు యతిభ్రంశము లేదు—క్రొవ్వు ఒక అల్పము, క్రొవ్వోకల్పము—ఒక కల్పములో 'అ' మీద యతి.

వావిళ్ల ప్రతిలో 'వెచ్చ గ్రొవ్వు—స్వల్ప మెడ సూప—వెడలెనో యని'' పాఠము ఇచ్చట స్వల్ప శబ్దమున—సు అల్ప—అని విడదీసిన యతి సరిపోవును. 'ఎడ సూప' అన. పాఠము గ్రహింపక 'మెడ చాప' అను అసందర్భపాఠము గ్రహించుటచే, తాత్పర్యము—అలంకారము తప్పినవి.'9

వేదమువారి ఆముక్త వ్యాఖ్య—వారి శృంగార నైషధ వ్యాఖ్య వలె నియంత్రుత్వ విధానమున వెలసినది. వారి పౌత్రులు వేంకటరాయశాస్త్రిగారు, క్రిందటి యేడు, శృంగార నైషధమును పునర్ముద్రణము చేసి, పూర్వ ముద్రణ పాఠముల నట్లే యుంచి ప్రకటించినారు. అంతియేకాక, ఆ పాఠముల నెవ్వరును తాకుట కర్హత లేదని, వ్రాసినారు. ప్రాత ముద్రణమున పాఠములు లర్థములును అప్రామాణికము లైనవి. లవి అట్లే నిలిచినందువలన—ఆముద్రణ సార్థకత యేమో విచారింప దగినది.

సంజీవని వ్యాఖ్యతో గూడ, ఆముక్తమును శ్రీనాథుని నైషధమువలె, తిరిగి ప్రకటించుటలో వారు వెనుదీయరు. ఏలననగా, వారి తాతగారితో ప్రాచీన గ్రంథ పరిష్కరణ విధానము, వేదముగా పరిణమించినదని వారి భావన. ఇంటిపేరు వేదమువారు కావచ్చును. కాని, వారు చెప్పినది వ్రాసినది అంతా వేదమా ?

శృంగారనైషధము, ఆముక్త మాల్యద వంటి మహాకృతులకు సంస్కృత, సమగ్ర ముద్రణములకు ఆంధ్ర విద్వల్లోకము ప్రయత్నించుగాక.

—నిడుదవోలు వేంకటరావు.

## ఆప్తమిత్రులు

బెంగాలీ నవల—అనువాదం: మద్దిపట్ల సూరి. ప్రచురణ: దేశి కవితా మండలి, విజయవాడ—2. క్రౌను సైజున 156 పుటలు, వెల: రెండు రూపాయలు.

తెనుగు సినిమా ప్రొడ్యూసర్లు ప్రసిద్ధ బెంగాలీ చిత్రాలకు తెనుగు అనువాదాలుతీసి లాభాలు సంపాదిస్తున్నారు. ఆ

9. ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవము—ముద్రితాంధ్ర గ్రంథములు. విద్వాన్ పిశుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారి వ్యాసము. పుటలు. 135—136.

బెంగాలీ చిత్రాలు ప్రసిద్ధ నవలలలోని కథల నాధారంగా తీసి కొన్నవే. అందుచేతనే ఏమో, ప్రసిద్ధ బెంగాలీ నవలలు తెనుగు లోనికి విరివిగా అనువాదం చేస్తున్నారు. ఆప్తమిత్రులు పేరు గల ఈ తెనుగు అనువాదం కూడ అలాగ వచ్చిందేమో అని పిస్తుంది. దీని సినిమాంతరీకరణ "కొడుకులు కోడళ్లు" తెనుగు చిత్రంలో ఉన్నదట! లేకపోతే ఆ ప్రసిద్ధ బెంగాలీ నవల పేరుకాని, గ్రంథకర్త పేరుగాని ప్రకటించక పోవడానికి వేరే కారణం కనిపించదు. బెంగాలీ నవలలో సెంటిమెంటు, నిరాశ, నిస్పృహ తరచు కనిపిస్తూ ఉంటాయి. ఇందులో కాశీనాథ్ అనంతు ఆప్తమిత్రులు. అన్నదమ్ముల బిడ్డలు. ఒకడు చదువు రానివాడు. ఒకడు ధనము లేనివాడు. ఇద్దరూ అబద్ధాలు చెప్పి, ఒకరికి ఒకరు పెళ్ళి చూపులకి వెళ్ళి — ఇద్దరూ తాము కోరిన పిల్లల్ని పెళ్లి చేసుకొంటారు. ఈ పెళ్ళిళ్లు కొన్ని విచిత్ర మైన సందార్భాలలో జరుగుతాయి. పెళ్ళి చూపులవేళ జరిగిన దానికి ఆకాశ రామన్న ఉత్తరాలు తోడ్పడతాయి. పెళ్ళిళ్లకి అనంతరం వచ్చిన చిక్కులూ, వాటి వింత పరిణామాలు చివరికి హత్యాపరాధం, కోర్టు విచారణ—అనంతు విషాద గాథగా పరిణ మిస్తుంది. ఇదీ యితివృత్తం. అబద్ధాలుచెప్పినా, కాశీనాథ్, వజరాణీ— ఈ జంట కాపురం సుఖంగానే ఉంటుంది. అనంత్‌కి చదువురాదని భార్య మీనా,మామగారు పృథ్వీశ్ కూడ గేలిచేసి,ఆకాశ రామన్న ఉత్తరం అతడే బనాయించాడని ఆరోపిస్తారు. నిజానికి అది వ్రాసినది కాశీనాథ్. ఈ సంగతి తెలిసిన అనంత్, తన ఆప్తమిత్రుడని కూడ వెరవక కాల్చి చంపివేస్తాడు. కోర్టు, సాక్ష్యం ఇదంతా విషాద గాథగా అంతమవుతుంది. ఈ విషాద గాథలో ఉత్కంఠ కలిగించే సన్నివేశాలు లేకపోలేదు. రెండు రెళ్లు నాలుగు గల ఈ కుటుంబ కథలో బెంగాలీ నవల లన్నింటి వలెనే జమీందారుల ఇండ్లలో వారికి వేట, వినోదమువంటి వ్యస నాలున్నట్లు ఈ నవలలో కూడ ఉన్నవి. కథ మొదలునుండి చివరి వరకు ఆసక్తితో చదివిస్తుంది. ఎవరైనా సరదాగా చదువుకుని ఆనందించడానికి వీలుగా మద్దిపట్ల సూరి తెనిగించారు. అయితే మౌలిక రచన పేరు, ఆ రచయిత పేరు చెప్పక పోవడం శోచ నీయమే.

—శ్రీవాత్సవ.

## ఏడుకొండలవాడా, వేంకటరమణా!

రచన : తాళ్లూరు నాగేశ్వరరావు. వెల : రు. 2—50. శాంత ప్రచురణ, తెనాలి.

ఈ సంపుటిలో మొత్తం ఏడు కథ లున్నాయి. వీటిలో మూడు నేరస్థులకూ, నేరాలకూ సంబంధించినవి. నేరస్థు లకు సంబంధించిన కథలలో వారివారి పరిస్థితులను, చర్య లను చెప్పడంతోపాటు వారికి విముక్తి ఏమైనా లభిస్తుందా లేదా అని పాఠకుడు చూస్తాడు. అది ఆశించినవారికి ఈ సంపుటి ఆశాభంగమే కలిగిస్తుంది. పుస్తకంపేరే శీర్షికగా కల కథలో పాపం, ఆ నేరస్థుడు ఏ కారణంవల్ల నైతేనేమి పశ్చా త్తాపం పొంది తాను దొంగిలించినవాటిని తిరిగి అక్కడ పెట్టడానికే పోతాడు. కాని, తిరిగి పట్టుపడతాడు దొంగగా! ఇట్లా నేరస్థుణ్ణి తిరిగి నేరపు గాడిలోకే తోసి అదొక విష వలయం అనేట్టు రచయిత చూపాడు. అంటే ఆదర్శమేమీ లేదన్నమాట. మరొక కథలో 'అతనిది హంతకుని మనస్సు కాదు గాని, చూపు మాత్రం హంతకుని చూపు' అని ఒక సిద్ధాంతంచేసి కథ అల్లడం జరిగింది. 'వడ్రంగి వీరన్న' అనే కథలో ప్రేమ్‌చంద్ ప్రవేశపెట్టిన గ్రామీణ జీవిత వాస్తవిక చిత్రణం కన్పిస్తుంది. గ్రామాలలో మోతుబరి ఆసాముల మధ్య ఉండే పోటీలు, వైషమ్యాలూ, వాటివల్ల వృత్తి పనివాళ్లు పడే బాధలూ చూపెట్టాడు. తక్కిన కథలు అలా అలా ఉన్నాయి. ఈ కథల రచనలో రచయిత అక్కడక్కడా కూర్చిన గ్రామీణ ప్రయోగాలు, ఉపమానాలు బాగా ఉన్నాయి. ఉదాహరణకు 'పుండుకు పుల్ల పొడుచు కున్నట్లు', 'మనస్సులోని ఉత్సాహం నీళ్లలో పడ్డ ఉప్పు అయింది.', 'ఈడుబోయిన బీడులోని ఆకురాల్చిన తుమ్మ చెట్టువోలె', 'నీళ్ల రాతిమీద పడుతూన్న చప్పుడు లాంటి నవ్వుతో', 'వెన్నెల్ని చూసి తెల్ల గులాబి సిగ్గుపడ్డట్లు' వంటివి.

పుస్తకం చివరి అట్టమీద ఫోటో క్రింద రచయితను గూర్చి ఇవ్వబడ్డ భోగట్టా ప్రకటనలో ఈయన మూడు వందలకు పైగా కథలు వ్రాశారని తెలుపబడి ఉంది. అయినా కథా కథనంలో శిల్పం ఉన్నత స్థాయికి చేరుకున్నట్లు గాని, భావనలో Maturity వచ్చినట్లు గాని కన్పించదు. కథ విస్తృతి జెందటం ఉందిగాని, క్లుప్తీకరణలోనే విశదీకరణ లేదు. రచయిత ప్రాయమునందు పిన్నవాడు కాబట్టి, ముందు ముందు ఆ పరిపక్వతను సాధించగలడేమో!

—కావ్యశ్రీ

## శ్రీ విశ్వేశస్తుతిమాల

రచయిత్రి : కొత్తపల్లి లక్ష్మీ కామేశ్వరమ్మ. ఇందు 'విశ్వేశా' అను మకుటముతో 220 కంద పద్యములు నొక దండకము గలవు. పుటలు : 56. వెల : 50 న. పై.

# గ్రంథ విమర్శనము

## దేశంకోసం సందేశం

కర్త : ఎం. రంగ కృష్ణమాచార్యులు. బి. ఒ. ఎల్. ఇది ప్రస్తుతమున్న అత్యవసర పరిస్థితులకు అనుకూలముగా రచింపబడిన అయిదు దృశ్యముల నాటకము. పద్యము లున్నవి. గురజాడ గేయము భరత వాక్యము. పుటలు : 60. వెల : రూపాయి. ప్రాప్తి స్థానము : శ్రీ రంగనాథ సరస్వతీ సదనము, అందోలు, మెదకు జిల్లా ఆంధ్రప్రదేశ్.

## శ్రీకృష్ణ స్తవ తరంగిణి

రచయిత్రి శ్రీ పై కవయిత్రియే. 'శ్రీ కృష్ణా' అను మకుటముతో 200 కంద పద్యము లున్నవి. పుటలు : 50. వెల : 50 న.పై. ప్రతులకు : (పై రెండింటికి) కొ. వేం. రా. ల. నా. శర్మ, శ్రీ విశ్వేశ్వర గ్రంథమాల, బాహుబలేంద్రుని గూడెం (పోస్టు), వయా గన్నవరం. కృష్ణా జిల్లా.

## బాలల వివేకానందుడు

శ్రీ నిరామయానందస్వామి బెంగాలీ మూలమునుండి శ్రీ కరణం రంగనాథరావు తెనిగించినది. పేరును బట్టియే గ్రంథము బాలలకై సులభముగా రచింపబడినదని, తెలియగలదు. వివేకానంద చిత్రముతో అచ్చు ముచ్చటగ నున్నది. పుటలు : 56. వెల : 50 న. పై. ప్రతులకు : శ్రీ రామకృష్ణ మఠము, మద్రాసు—4. (మైలాపూరు)

## కనువిప్పు

గ్రంథకర్త : పురాణం కుమార రాఘవశాస్త్రి క్రైస్తవ వేదమగు బైబిలున లూకా సువార్త యందలి (The story of the Prodigal son) అను ప్రసిద్ధ కథకు తెలుగు పద్యముల యనువాదము. నీతిని బోధించు నీ కృతి సులభాగ్రాహ్యముగ నున్నది. పుటలు : 31. వెల : 1—50 న. పై. ప్రాప్తిస్థానము : జిల్లా పరిషదున్నత పాఠశాలోపాధ్యాయ బృందము. మైలవరం.

## స్రవంతి

దక్షిణభారత హిందీ ప్రచారసభ—(ఆంధ్ర) హైదరాబాదు వారి రజత జయంతి సందర్భమున ప్రకటింపబడిన 'స్రవంతి' రజతోత్సవ సంచిక.

ఈ సంచికలో పద్యములు, గద్య వ్యాసములు పేర్కొనదగినవి అనేక మున్నవి.

'జాతీయ సమరంలో ఆంధ్రుల పాత్ర'—శ్రీ కొడాలి ఆంజనేయులు, 'ఆంధ్రభారతి ఆచారాలు—సామాజిక ప్రమాణాలు'— శ్రీ రాపూరి వేంకట సత్యనారాయణ, 'మనుధర్మశాస్త్రము : కౌటిల్యుని అర్థశాస్త్రము' శ్రీ గూడా సుందర రామయ్య, 'తెలుగులో అన్యదేశ్యమగు "బాకు"' శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి 'తెలుగు సాహిత్యంలో హాస్యం' శ్రీ పోతుకూచి సాంబశివరావుగార్లు వ్రాసిన వ్యాసములు గమనింపదగినవి.

విశేషములు : హిందీ భాషలో అభిభాషణలు, గ్రంథ స్వీకారము, పుస్తక పరిచయము గలవు. ఈ సంచికలో 115 పుటలు తెలుగు, 20 పుటలు హిందీ భాగములు గలవు. వెల: 70 న. పై. ప్రాప్తిస్థానము : 959, ఖైరతాబాదు, హైదరాబాదు—4.

## రాజయోగి

గ్రంథకర్త: అంబటిపూడి లక్ష్మీనరసింహం. ఇది ప్రసిద్ధ తత్వవేత్త అయిన పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్రను చిత్రించిన నాటకము. ఇందులో అంకములు లేవు. ఆరు రంగము లున్నవి. మధ్య మధ్య పోతులూరి వీరబ్రహ్మంగారి తత్త్వాలు (తెనుగు దేశం అందరికి పరిచిత మైనవే) అనుసంధించు బడ్డాయి. పద్యాలు కూడా ఉన్నవి. 106 పుటలు. వెల : 1—25 న. పై. ప్రతులకు : మేనేజరు, బ్రహ్మంగారి మఠం, కందిమల్లయపల్లె (పోస్టు), బద్వేలి తాలూకా, కడపజిల్లా.

## మహాకవి గురజాడ శతజయంతి ఉత్సవ సంచిక

ఖమ్మంనందు గురజాడ శత జయంతి ఉత్సవ కమిటీ వారు ప్రకటించిన యీ సంచికలో 11 పద్య రచనలు, 12 గద్య వ్యాసా లున్నవి. అన్నీ గురజాడ రచనలు. సంస్కృతి గురించి చెప్పినవే. వెల : 2.00. ప్రాప్తిస్థానము : గురజాడ శత జయంతి కమిటీ, ఖమ్మం.

---

## గమనిక

[59 వ పేజీలో "ప్రసాదరాయకవి" అనేవ్యాసం ప్రచురించాము. ఆకవి పూర్తిపేరు శ్రీ త్రిపురాన వెంకట సూర్య ప్రసాదరావుగారు. స్వస్థలము శ్రీకాకుళంజిల్లా. సిద్ధాంతము. ఈ విషయము పాఠకులు గమనించ కోరుతున్నాము—భా. సం.]

---

# లేఖలు

# శ్రీమదాంధ్రభారతము కృతిపతిత్వము



వై. సీతారామస్వామి

ఆర్యా,

వసంత తిలక వృత్తము :

వీరావతారా సుకవిస్తుత నిత్యధర్మ
ప్రారంభ శిష్ట పరిపాలనసక్త రాజా
నారాయణాఖ్య కరుణారసపూర్ణ వీర
శ్రీ రమ్య రాజకులశేఖర విష్ణుమూర్తీ.

ఆది పర్వము. ద్వి. 240.

మాలిని :

ప్రణమ దఖిల ధాత్రీ పాలకాళోల చూడా
మణి గణ కిరణ శ్రీ మండితాంఘ్రీ నరేంద్రా
గ్రణి నిఖిల మహీరక్షామణీ రాజనారా
యణ విమలమతీ శీతాంశు వంశ ప్రకాశ.

ఆది పర్వము. షష్ట. 312.

కం. భూరి గుణ రత్నభూషణ
నారాయణమూర్తి రాజనారాయణ కం
ఠీరవ విక్రమ శారద
నీరద నీహార హార నిభశుభ కీర్తీ.

సభాపర్వము. ప్ర. 295.

ఈ పద్యములు మూడును నన్నయాంధ్రీకృత మహా భారతమునందలి ఆశ్వాసాంత పద్యములు.

పై వాటిలో గీత లుంచినచోట్ల కనబడు "రాజా నారాయణాఖ్య", "రాజనారాయణ"; "నారాయణమూర్తి" "రాజనారాయణ" మొదలగు శబ్దములు కృతి భర్తృత్వ విషయమున కొంత సంశయమును గల్పింపక మానవు.

రాజనారాయణ పదమునందు నారాయణ శబ్దము శ్లేష వాచకమని చెప్పి సమాధానము చెప్పుకోవచ్చును. కాని రాజా నారాయణాఖ్య అను సంబోధనములందు సమాసము లేదు. రాజా సంబుద్ధి, నారాయణాఖ్యా సంబుద్ధి

ఈ సంబోధనము వలన కృతిభర్త నారాయ ణాఖ్యుడని అర్థమగును. మఱి రాజరాజు గతి యేమి కావలెను ? లేదా రాజరాజునకే నారాయణుడని పేరు కలదా ? ఆయన విష్ణు వర్ధనుడు కదా ? అందలి విష్ణు పదమునకు నారాయణ శబ్దము పర్యాయపదమా ? ఇట్టి సంశయములు కలుగుచున్నవి.

ఈ సంశయములకు పరిష్కారము దొరకుట సులభ సాధ్యముకాదు.

కానీ, భారతమునకు కృతిభర్తలు చాళుక్య రాజులే. ఇది నిర్వివాదాంశము. కాని, చాళుక్యరాజులు రెండు చీలికలైరనియు, వారు తూర్పు చాళుక్యులు, పశ్చిమ చాళుక్యులనియు చారిత్రిక ప్రసిద్ధమైన విషయము.

నారాయణాఖ్యుడు తూర్పు చాళుక్య రాజని, అతనికి నన్నయ కృతి నిచ్చెననియూహచేయుటకు అవకాశ మున్నది. ఇప్పటి కిది యూహయే కాని యూహకు తగిన యాధార బలమున్నచో యూహ వాదమునకు నిల్చును.

పండితులీ విషయమును చర్చింతురను యాశతో నీ లేఖ వ్రాయుచున్నాను.

## మనరచనలు, శిలావిగ్రహాలు

ఆర్యా,

ప్రధానమంత్రి మన రచనల, శిలా విగ్రహాలపై, వెల్లువరించిన అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నాను. ప్రస్తుతం వెలువడే రచనలు ఆలోచనా శక్తిని రేకెత్తించేవిగా ఏమాత్రం ఉండటంలేదు. అనుకరణా విధానం కొద్దిగానో గొప్పగానో ప్రతీ రచనలోనూ పొడచూపుతోనేవుంది. ప్రాచీన కవుల పోకడలే ఆధునిక కవులు ఆశ్రయించటం జరుగుతోంది. మనకు స్వరాజ్యంవచ్చి దశాబ్దన్నర దాటిపోయినా మనలోనుంచి భావ దాస్యం వదలిపోవటంలేదు.

# లే ఖ లు

సృజనాత్మక శక్తిని పెంపొందించే రచనల ప్రచురించాలనే ఉద్దేశం ప్రచురణకర్తలకు ఉన్నట్లు కానరాదు. ప్రచురణ సంస్థలు వ్యాపార సంస్థలుగా మారినవా అన్న ధోరణి ఎల్లెడల కానవచ్చు చున్నది.

విగ్రహాలను తయారు చేయించే విధానంలో ప్రతిష్ఠాపకులు ఏమాత్రం జాగ్రత్త తీసుకుంటున్నట్లు కానరాదు. గాంధిగారి విగ్రహాలు, సుభాస్‌చంద్రబోస్ విగ్రహాలు వాడ వాడలా కనిపిస్తూ ఉంటాయి.

ఆ విగ్రహాలలో కొన్నిటికి సహజత్వం ఏమాత్రం ఉన్నట్లు తోచదు. ఇది ఎవరి విగ్రహమా అని క్రొత్తగా వచ్చినవారు అనుమానింపకపోరు. ఈ రీతిగా విగ్రహముల నెలకొల్పటం దేశ సేవా దురంధరులుగా పేరు పొందిన వారిని అవమానించటమే అవుతుంది. కలకాలం నిలచివుండే విగ్రహాలు కనుక, భవిష్యత్ మానవుల చూచి ఆనందించే విధంగా సహజత్వం ప్రస్ఫుటమయే పద్ధతిలో నెలకొల్పాలి.

ఆనాడు ప్రతిష్ఠాపకుల ఆశయం నెరవేరగలదు. శిల్ప కళాభివృద్ధికి దోహదమూ జరుగుతుంది.

జీవిత చరిత్రల ప్రచురించే విషయంలోనూ మనము అభివృద్ధికి రాలేదు. వాస్తవ జీవిత విశేషాలను సేకరించి ప్రచురించే సంస్థలు బహు అరుదుగా ఉన్నవి. జీవిత చరిత్రల ఒకే మాదిరిగా నిజ పరిస్థితుల మరుగుపరచి ప్రచురింపబడుతూ ఉన్నవి. పాశ్చాత్య వాసనా ప్రభావం మనలో ఎట్టి మార్పును కలిగించలేదు. జీవితచిత్రణ విషయంలో పాశ్చాత్య ప్రచురణ సంస్థలు విరివిగా ధనమును వ్యయపరచ చున్నవి. ప్రభుత్వ ఆదరణ కూడా వాటికి మెండుగా ఉన్నది.

ఒక విషయం మనము ఆలోచించాలి. ప్రభుత్వ ఆదరణ లేనిదే ఏ కళాకారుడూ రాణించలేడు. ఏ కొద్దిమందికోతప్ప పెక్కుమంది కళాకారులకు సరియగు ఆదరణ మనదేశంలో లభించుటలేదు. కళ కళగా రాణించాలనే దృక్పథం మరుగైపోతున్నది. ఈ పరిస్థితిలో కళోద్ధరణ ఎంతో అవసరమై యున్నది.

ప్రభుత్వ అండ దండలు పూర్తిగా లభించినపుడు రెట్టింపు ప్రోత్సాహాలతో కళాకారులు, వివిధ రంగాలలో ముందుకు రాగలరు. ఆనాడు కళ నీరసించి కనిపించదు. తదితర సంస్థలు కూడా అన్ని భేద భావములు వదలి నిర్దుష్టమైన కళా ఖండముల ప్రోత్సహించాలి. విమర్శకు తావులేని పరిస్థితి ఆనాడే ఏర్పడుతుంది.

(చల్లపల్లి) —ఏకా రామశేషగిరిరావు

---





మ. సదయ ప్రాణవిహారమై విహిత వర్ణోద్యద్విభక్తిక్రియా
సదనంబై సదలంకృతి ప్రభవమై సద్విక్రమావాసమై
విదితార్థాస్పదమై ప్రసన్నపదమై వృద్ధశ్రవోవైభవా
స్పదమైరాజనుబోలెఁ గ్రాలవలదా పద్యంబు హృద్యస్థితిన్

ఎవ్వరిదో!

# మా వ్యాసకర్తలు





## శ్రీ నిడుదవోలు వేంకటరావు

శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు 1904 జనవరి 10 వ తేదీన విజయనగరంలో జన్మించారు. తండ్రి శ్రీ సుందరం పంతులు. తల్లి శ్రీమతి జోగమ్మ. విజయనగరం, విశాఖ పట్టణాలలో విద్యాభ్యాసం చేసి, 1924 లో పట్టభద్రులై 1926 నుంచి 1939 వరకు ఇంపీరియల్ బ్యాంకిలో గుమాస్తాగా పనిచేసి, 1940 నుంచి 1942 వరకు పిఠాపురం సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థాన పండితులుగా ఉన్నారు. 1942 నుంచి 43 వరకు కాకినాడ, పిఠాపురం రాజాకళాశాల ఆంధ్రపండిత పదవిని నిర్వహించి, 1944 జూలైలో మద్రాసు విశ్వవిద్యాలయంలో ఆంధ్ర భాషా సహోధ్యాపకులుగాచేరి 1949 జూలైనుండి ఆ శాఖాధ్యక్షులై నేటికీ ఆ పదవిలో ఉన్నారు. 1949 నుంచి మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం గ్రంథ ప్రచురణ సంఘంలోను, తంజావూరు సరస్వతీ మహలు లైబ్రరీ ప్రచురణ సంఘంలోను సభ్యులుగా ఉన్నారు. సాహిత్య పరిశోధన, ప్రాచీన గ్రంథ పరిష్కరణల కృషి ఫలితంగా ఖడ్గలక్షణ శిరోమణి—విద్యావతి దండకము (మదరాసు), రాజగోపాల విలాసము—చెంగల్వకాళకవి, కట్వా వరదరాజు ద్విపదరామాయణము 4 సంపుటాలు (తంజావూరు సరస్వతీమహలు), బసవపురాణము (ద్వితీయ ముద్రణ. ఆంధ్ర గ్రంథమాల) ప్రచురితమైనవి. స్వీయ రచనలలో ఆంధ్రవాఙ్మయచరిత్రము, దక్షిణాంధ్రవాఙ్మయ చరిత్రము, తెలుగు—కన్నడ సాహిత్యాల పరస్పర ప్రభావం, ఉదాహరణ వాఙ్మయభాషా శబ్దోత్పత్తి పదకోశం, (ఎటిమలాజికల్ డిక్షనరీ) వంటివి ప్రసిద్ధములు.

## శ్రీవాత్సవ

శ్రీ యండమూరి సత్యనారాయణరావు శ్రీవాత్సవ అనేది అసలు పూర్తిపేరు. దాని సంక్షిప్త రూపము శ్రీవాత్సవ. భారతి పాఠకులకు ఇది సుపరిచిత నామధేయము. భారతి పాఠకులకే కాదు, దేశంలో ప్రతి తెలుగు పత్రిక చదువరులకు పరిచితం. ఆయన రచనాశక్తి అపారము. బహు వ్యాసకర్తలు. గ్రంధ రచయితలు. శ్రీవాత్సవకి అనేక భాషలు వచ్చు. అనేక విషయాలు తెలుసు. తెలిసినవానిని విప్పి చెప్పగలరు. ఇది పెద్ద విశేషం. వీరి 'సాహిత్య చరిత్ర'కు రాష్ట్ర సాహిత్య అకాడమీ బహుమతీ, 'ఔర్విజన్' గ్రంథానికి కేంద్ర ప్రభుత్వ బహుమతీ వచ్చాయి.

శ్రీవాత్సవ జన్మస్థలం తూర్పు గోదావరిజిల్లా పసలపూడి. జననం 1913 మే 21. బి.ఏ. బి. ఇడి. చదివారు. "జనవాణి" పత్రిక సంపాదకవర్గంలో ప్రవేశించడంతో రచనా వ్యాసంగం ఆరంభమైంది. ఆ తర్వాత ఆల్ ఇండియా రేడియోలో చేరారు. ప్రస్తుతం విజయవాడ కేంద్రంలో ఉన్నారు.

**Printed & Published For Nageśwara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor : S. Sambhu Prasad.**

Bharati October 7th 1963 Regd. No. M 1856

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 175/- | రు. 150/- |
| 2 లేక 3 వ కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | 150/- | 125/- |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | 125/- | 100/- |
| అర్ధ పేజి | ... | 65/- | 55/- |
| పావు పేజి | ... | 40/- | 35/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం॥నకు వరుసగా 12 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12-0-0 |
| 6 మాసముల చందా | ... | రు. 6-0-0 |
| విడి ప్రతి | ... | రు. 1-0-0 |

మేనేజరు, భారతి.

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

నవంబరు 1963

సంపుటము 40 : : సంచిక 11

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1963



## మాతృశ్రీ రామాయమ్మ

విశ్వదాత సతీమణి మాతృశ్రీ రామాయమ్మ అక్టోబరు 16 వ తేదీ బుధవారం రాత్రి 10-10 గంటలకు మద్రాసులో శివసాయుజ్యము పొందిరి. వారి వయస్సు 85 సంవత్సరములు. "భారతి"కి విశ్వదాత జనకుడు. రామాయమ్మ జనని. "భారతి" విచారమును అసంఖ్యాకులు పంచుకున్నారు.

# ప్రౌఢ మేఘము



శ్రీ జి. వి. కృష్ణరావు

శబర సీమంతినీ కబరికా గండూష
రసముల దేహ విభ్రమము లెనసి
ప్రౌఢాంగనా రోష లీఢారుణాపాంగ
రోచిస్సమూహమ్ము దోచి దాచి
రంభోప గూహాన ప్రారంభదశముఖో
ద్భూత మారుత సముద్యోగమంది
దాక్షాయణీ తనుత్యాగ వార్తాతప్త
కాకోలకంఠ హుంకార మొరసి

దారుణ నిదాఘ దైత్యదందహ్యమాన
దశదిశీ దైన్య తీవ్రతా దర్శనమున
క్రోధ ఘూర్ణిత కాయమై క్రూరగతుల
పంచి యంభోద మెత్తె గ్రీష్మంబుపైని...

నవ నీలోత్పల కాంతులన్ మొసవి, వింధ్యప్రాంత మత్తేభ
రవముల్ దూలిచి, యంజనాద్రిగత గర్వమ్ముల్ విదారిం
ర్భవతీ పీన కుచాగ్ర నీలిమల సంపత్తిన్ విభాసించి, ప
ర్వ వియద్భాగమునన్ ఘనాఘనము లుద్యోగోగ్ర ఘోష

ఆశాభాల విశీర్ణ కుంతలములై యద్రీంద్రసీమన్ హృషీ
కేశస్వామి కరమ్ములై పుడమికోర్కుల్ దీర్చు దైవమ్ములై
వ్యాళోష్మీకృత నిమ్నగావళికి నవ్యశ్రీనిధానమ్ములై
వేళంతోపశమమ్ములై వెలసె ప్రావృట్కాల శీలాబ్దముల్

# భారతి

ఆత్మాంగనా మోదులో మయూరములకు
నాట్యక్రియా వర్తనమ్ము నేర్పి
స్వాగత వ్యాహార పంక్తి వేమరు జెప్ప
భేకలోకము గృపావృష్టి మనిచి
నిశ్శేష శోషిత నిర్ఝరీ కన్యకు
జీవదానమ్ముతో చిందు గరపి
తపనపీడిత భూతధాత్రి మహాదేవి
కంఠః పరీతాప మపనయించి

ప్రార్థ్య పాలనమొన్మన గూర్చె ప్రభుత నెరపి
గ్రీష్మగర్వ నిర్వాపణ క్రీడ నాత్త
కఠిన హుంకార ముఖర దిక్కందరుండు
కాలకూట కంఠశ్యామ కంధరుండు...

తప్తకాంచన చంచలాద్దండ విహాత
మైన దర్ప దర్పిత పటహమ్ము మ్రోత
ప్రబల నీరంధ్ర నవవారివాహచయము
ప్రోసె తరుణాద్రి హృదయముల్ బూరటిలగ...

కాలవిభేదబోధ కళికా పరిగూహన కర్బురాంబరా
వేలములై సముచ్ఛ్వసన వీచివికంపిత గండమండలో
త్కూల నవోద బిందులయి ఘూర్ణముఖాంతరలీన తారకా
జాలములై వికుంధన విసర్పములై పొలిచెన్ దిశావళుల్...

గగన మత్తకాశిని నిజకైశ్యమందు
చెరువుకొన్నట్టి సంపెగ చెండ్లువోలె
కాళికత్తిన మణిదీప గణములట్లు
వలయితాకృతి శంపలు పరిఢవిల్లె...

ఉభయతటమ్ములం గడపి యుద్ధతరాగ ఝరీవిలంఘన
ప్రభవములై యుదగ్ర వినిపాతములై యఘజీవనమ్ములై
రభస పరీత వక్రగతిరాజిత సంగతులై తరంగిణీ
విభుగలయంగ నిమ్నగలు వేతరలెన్ గులటావథమ్ములన్...

# ప్రౌ ఢ మే ఘ ము

వారిధరము ధారా పరిష్వంగమొసగి
గారవించిన కాబోలు గండశిలలు
పులకరింతల హరితశైవలము దాల్చి
ప్రణయమొలికించె స్వాధీనపతికలట్లు...

పరువమ్ము గడచన్న బసవన్న కంఠాన
        పెనురంకె పొంకమ్ము బిగువు లుబికె
పాథోధరము మాడ్కి యూథమ్ముచేపిన
        మొదవు చన్నుల పయః పూరపూరలై
పాలాశరుచిర శాద్వలము గన్గొన్న యా
        లేగ కాళుల జౌకళింత లెసగ
సలిల ధారాపాత సరళమ్ములై కర్ష
        కుని చూపులారసి దుక్కులను వ్రాలె

లోక మెరుగని కన్యకాలోకనముల
చిలిపి లేనవ్వు దళుకులు తొలకరించె
ప్రచుర జీవాను గతికమ్ము వర్షఋతువు
నేల నాల్గుదిక్కులలమి యేలునపుడు...

అద్వైత రసభావ విద్వాంసుడగు మన్మ
        థుని ధనుఃఖండమ్ము కనుపుదేలె
కరకు టీదరగాలి పటువుతో దరుణాకో
        టరముల ఘూత్కారభరము రేగ
పార్వతీ పరమేశ భావమ్ము భజియించి
        రాత్రిందివము లేక గాత్రమయ్యె
ఆకాశ పర్యంకమటు పూర్యమాణమై
        సలిలాశయమ్ములు కలక చెందె
శ్వాసరోగికింబోలె శార్వరులు విప్ర
యుక్తహృదికి దుర్వార దుర్భుక్తులయ్యె
కర్దమ విదూషితమ్మగు గ్రామములకు
స్వైరసంచార కేళికి వైరమయ్యె...

# భారతి

ఆసారంబులఁ దోఁగి కేతకి పరాగాలేపముల్ పూసి నా
నాసూనానన చుంబన క్రియల నానందించి గోవత్స లీ
లా సాదృశ్యవిలంఘులై పవనముల్ సయ్యాటలం దేల గా
సాసూయంబుగ జూచె యౌవత మధిజ్యానంగ కోదండమై...

ఉత్పల నీలమున్నత పయోధరమాలిక యత్తరిం బుర
స్తాత్పరి పుష్యమాణ హరిచాప నిరూపిత రక్షతో నవి
ద్యుత్స్ఫురి దీపనాఢ్యమున యుక్తసమీర సహాయులై, స్పృహా
తత్పరచిత్తయై కదలె దర్పకఘోషము వెంబడింపగన్...

హరితసూచికాగ్రియము ముత్యమ్మువోలె
నవతృణాగ్రస్థితమ్మై తనర్చు వార్షి
కాంబుకణము సేవించె నొయ్యార మొలుక
గళము సారించుచున్ నీలకంఠవిభుడు...

కాదాచిత్కముగా మే
ఘోదరములు వాసితోచు నుడుపతిదరబిం
బోదయములు యువజన లో
కాదరములు వొందెభావనా స్పదమగుచున్...

అపుడె తానమాడిన తరుణాంగి కేశ
పాశమున నుండి దిగజారు పగిది సాంద్ర
నీలమేఘ జాలమునుండి నీటిబొట్లు
తరలె పృథ్వీధరమ్ము-నితంబసీమ...

అరిమెడి యురుములు తరిమెడి
మెఱపులునై వానకారు మిన్నులు దొనగా
గురియం గడు దత్తరమున
బరచెన్ వాగులు సముద్రబాహుల జేరన్...

జగములతాపముల్ దొలప చల్లని దైవము వచ్చెనంచు నెం
తగ గొనియాడి మ్రొక్కిరి జనమ్ములు దాని ఫలమ్ము లేమి! దుం

# ప్రౌ ఢ మే ఘ ము

డగములు వృక్షపాత వికటమ్ముగ దోటలు నిర్గత చ్ఛద
మ్ముగ గుటులున్, పరిప్లవన పూరముగా బాలముల్ శపించెడిన్ ...

అదలించి కొంత గదిమిన
కదలని బసవన్న తెరగు గన్గొని సీకుం
బాదవెన బాడవ దమ్ముల
చదువులు చెప్పుమంచు కాపు జవరాలడిగెన్ ...

అవిరళ జలధారా ర
జ్జువులం బిగియంగబట్టి క్షోణీవలయం
బు విహాయసమున జేర్పగ
ప్రపిహితమతియూర్ధ్వ నంబు వాహము పిలుచన్ ...

శక్రచాపకోటీ భిన్న జఠర మగుచు
క్రూరకాలాభ్ర మహిషమ్ము ఘోష వెట్టె
వ్రీలి వ్రేలాడు నద్దాని ప్రేవులట్లు
వెలసె సౌదామినులు హరిద్వీథులందు...



# ఆధునికులలో నవ్యుడు శ్రీ. శ్రీ.



డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

## 13

పాండిత్యాన్ని ఉపయోగించి నాటికవి ఏదో కథని పెంచి రచిస్తే, అనుభవాన్ని తరిమెణపెట్టి నేటి కవి ఖండ కావ్యాన్నే, భావ కావ్యాన్నే రచించాడు. ప్రకృతిని తన కావ్య వనములోని పడినిగా వాడుకొని తన ఊహ కనుకూలంగా నాటికవి తయారు చేసుకుంటే, విశ్వము మీదికి తెరుచుకునే కిటికీలాగ నేటి కవి ఉపయోగించి సౌందర్య చైతన్యాన్ని పెంచాడు. వర్ణించే పద్ధతిని బరువుచేసి నాటి కవి సంతోషిస్తే, శక్తివంతమైన భావాన్నే, పలకరించే సౌందర్యాన్నే పట్టి నేటి కవి సంతోషించాడు. లేనివాటి నన్నిటినీ ఊహించి పట్టుకొచ్చి నాటి కవి వర్ణిస్తే, ఉన్నవాటిని పట్టి ఊహలు పెంచాడు నేటి కవి. కావ్యాల భాషతో నాటికవి రచిస్తే, జీవితానికి దగ్గరగా ఉన్న భాష నేటి కవి వాడేడు. ప్రవాహశీలములైన వృత్త ఛందస్సులను నాటి కవి స్వీకరిస్తే, మందగమనశీలములైన జాతి ఛందస్సులను నవకవి స్వీకరించాడు. నవ్యత అంటూ కవిత్వములో చైతన్యము ప్రారంభమైంది గాని పద్యాన్ని విడిచింది కాదు. అజంతమైన పదాలతో భాసించే తెలుగు భాషకి మాత్రాచ్ఛందస్సులు రాణించినట్టు పద్యాలు రాణించవు. మీదు మిక్కిలి రచనా బలహీనతను పద్యాలు—గంగిరెద్దుని బొంతలవలె—కప్పిపెట్టుతాయి. 'కందము నల్లినవాడే కవి', 'గర్భ కవిత్వము', 'బంధ కవిత్వము', 'ఆశు కవిత్వము' అన్న మాటలు పద్యాన్ని ఆధారంగా పెట్టుకునె వెలిశాయి. కవిత్వాన్ని ఆధారంగా పెట్టుకోనేలేదు. గద్యంలో కూడా కవిత్వ ముంటుందనే సాహిత్య పన్నాలకు లోటులేదు గాని, ఆ దృష్టి ఎక్కడా కనిపించడములేదు. కవిత్వము పద్యాన్నే ఆశ్రయించి ఉండింది.

కవి సమయాలు కూడా అధికారాన్ని విడవలేదు. నీలాభ్ర సరసిలో జాబిలి రాజహంసలూ, తారకాకుసుమముల దాల్చు తిమిర లతలూ, విలోచనాంధతమసమ్ములూ, పెదవి సంజలూ, ప్రణయ విమలాంబరాబ్ధి, అది యేమొ, వలపులపేటి, మృదు రజోలేశ దివ్యసంపద (ప్రేయసిదీ, స్వామిదీ—) క్రూరలోకము, పవను డొకడు, కాటుకచీర, పవడా చిగురాకూ వంటి నవ కవి కల్పనా సమయాల కోలాహలము ఎక్కువైపోయింది. ఈ కవిని చూచి ఇంకొక కవి 'ప్రణయమోహన నీలాంబరమూ, దారియేలేని శోకంపు ఎడారీ, హృదయదళాలూ, మబ్బు నీడలూ విసరడమూ, ఆయన్ని చూచి ఇంకొకరు కనికరము లేని కఠికులోకాన్ని తిట్టడమూ, మరియొకరు 'నాకు దుఃఖమ్ముకై తృష్ణ లేక కాదు' అనడమూ, ఇదంతా మళ్లీ పాత షాపులకు బదులు కొత్త షాపుల్ని తయారు చేస్తున్నట్టే అయింది. "చూచికొని చూచికొని శూన్య హృదయములోని కోవెలీ యటం చేడ్తును సుమా" అని కృష్ణశాస్త్రిగారు చెప్పుకుంటే, వేదులవారు ఇదేదో బాగున్న దన్నట్టు—'ప్రవాసజీవనభరమ్ము స్మరించుచు .... సోనలువార నేడ్చెద' ననడమూ, పురిపండావారు—ఇహ నా తప్పు లేదన్నట్టు "నా ప్రేమవెల్లి .... నన్ను నెడబాసి పోయిన నాటినుండి ..... గాఢాంధకార పటలి వెక్కి వెక్కి దుఃఖింతు" నంటూ ప్రకటించడమూ, ఆ తరవాత రామచంద్రవారు, పిలకావారు, రెంటచింతలవారు, కందుకూరివారు ! ఏడుపు ఒక వేలాము వెర్రి అయిపోయింది. కృష్ణశాస్త్రిగారు ఘూకరావము విన్నారు, వేదులవారు ఉలూక విలోకనాలు చూచారు, భరోసాగారు ఘూకాన్నే వారి రచనలోకి తీసుకొచ్చారు. లేని ప్రేయసి అతి సామాన్య కవితాసామగ్రి అయింది. ఇదంతా మళ్లీ పాత కథలోనికి లాగుతూన్నట్లు గ్రహించారు ఆధునికులలో నవ్యులు.

పద్యము వాడుతూండడము వల్లనే ఈ అనర్థము దాపురిస్తున్నదని వారు—పైకి అనకపోయినా—గ్రహించారని నాకు

# ఆధునికులలో నవ్యుడు శ్రీ. శ్రీ.

వారి రచనలనుబట్టి అనిపిస్తోంది. ఏమంటే, వారు పద్యాని వదిలేసి, మాత్రాచ్ఛందస్సులూ, పద్యాల అవతార భేదాలూ— కేవలము గతి కోసము ఎప్పుడూ లెక్కవెయ్యకుండా—వాడేరు. పద్యము వాడగానే పూర్వకవుల, పాత కవుల, నిన్నటి కవుల పద్య పాదాలు జ్ఞప్తికి వస్తాయిా, అనుకోకుండా పడిపోతాయి. తమకు తెలిసో తెలియకుండానో కృష్ణశాస్త్రిగారు తమ పద్యాల్ని మళీ వాడేరు, వేరే సందర్భాల్లో. కృష్ణశాస్త్రిగారి రచనల పోలికలు వేదులలో తరుచు కనబడతాయి. పద్యపు గుర్రాన్ని ఎక్కిన తరువాత అందరు కవులూ—ఎంతో కొంత —గుర్రపు నడక కనువుగా కళేమం పడలించవలసి వస్తుం దనుకుంటాను. అలాటి చోట్ల ఇతర కవుల పోకడలు—మన మ్పులో ఉన్నవి, తప్పించుకు—వచ్చి చేరతాయి. శ్రీనాధునిలో పెద్దన్నగారి పోలికలు అందరూ ఎరిగినవే కదా ? పద్యము వాడక పోతే ఈ చిక్కు రాదూ, మాత్రా చ్ఛందస్సులూ రచించ డము సులువు, ఎవరి పడవని వారు ఇష్టము వచ్చినట్టు నడపవచ్చును. చందస్సు ఆటంక ముండదూ, పూర్వాచార సౌలభ్యమూ కుదరదు. తెలుగు కవిత్వ రచనకు ఇంతవరకూ బరువులుగా అడ్డమైన సంకెళ్లు చట్ ఫట్ ఫట్ మని తెగు తాయి. అదే జరిగింది నవ్యాధునికుల రచనలవల్ల. ''క్రౌర కౌటిల్య కల్పిత కఠిన దాస్య శృంఖలములు తమంతటనే చెదరిపోవ, జగమునిండ స్వేచ్ఛాగాన ఝరులునింపు ' నని ఆధునికులు చాటినా, ఆపని నిజంగా చేసినవారు నవ్యాధు నికులు. వారిలో మొనగాడు శ్రీ శ్రీ.

శ్రీ శ్రీ పుట్టినది 1910 లో. బి. యే పరీక్ష ఇచ్చిన కాలం వరకూ ఆధునిక కవిత్వ సరణులు పరికించుకుంటూ ప్రకృతిమీదా, భగవంతునిమీదా, వివిధ విషయములమీదా ఈయన పద్యాలు రచించారూ, 'ప్రభవ' అనే సంపుటముగా ప్రచురించారు. ''ఇది నవోజ్జ్వల మమృత రసైక మధుర మిది మనోహర మానంద సదనమిద్ది ! ఈ ప్రకృతి గర్భ కుహర కాంతి ప్రసార వీచికా మార్దవమునకు వివశమతిని ?'' అంటూ సంస్కృత పదాల్ని ధారాళంగా విసరడమూ, 'ఈదు కొని పోతి మామక హృదయకుహరజనిత భావ నౌకాధిరోహణ మొనర్చి, కంధర తరంగ నివహసంకలిత మహిత గగనసాగర గంభీర గర్భమందు' అని చేపపిల్ల లనవలసిన మాటల్ని తిమింగలాలచేత పలికించడమూ 'ఎఱుకపడరాని ఎచటికో ఎగసిపోదు' ననడమూ, హృదయ .... స్థిత .... ' భావ సము దయ ప్రదర్శనోత్సుకమతితో దేవసన్నిధి కేతెంచ' డమూ, 'అక్కటా ఈ వియోగాగ్ని యతిశయించి కాల్చెడిని మామకీ నాంగకములవెల్ల ! కాఱుచున్న యనంతాశ్రుకణములందు స్నాన మొనరింతుఃదావప్రశాంతి కొఱకు !' అని వియోగ దుఃఖాన్ని యత్నించి తెచ్చిపెట్టుకోడమూ, 'ఆధునిక దివ్యఖండ కావ్యములయందు గీతిని పరుగులెత్తించడమూ కనబడుతుంది ఈ తొలి కావ్యములలో. ఆధునిక కవిత్వంతోనే పుట్టి పెరిగి, ఆ కవిత్వపు రీతుల్ని ఇంచుమించు అన్నిటినీ, ఆ రచయితల నించుమించు అందరినీ స్పృశించి సిద్ధమయ్యా రీయన నవ రచనకి. ఉమాకాన్తంగారి దెబ్బతో నిర్వీణ్ణమైన ఆధునిక కవి త్వము కొత్త చివుళ్లు వెయ్యడానికి తపన పడింది.

'ప్రకృతి గాఢ రహస్య మెఱుగుట' కవే నమ్మకము నాకు లేదు గాని, కొత్త గొంతును సర్దుకుంటూ 1932—35 ప్రాంతాలలో విశాఖపట్నంలో స్విన్‌బర్న్, ఎడ్గారు ఆలెన్‌పో, బరన్స్, బ్లాక్ కవుల రచనలను తాను చదువు కుని జల్లుమంటూ నావంటి మిత్రులకు వినిపించి పకపకా నవ్వుకుంటూ, చంచల మనస్సుతో, చేతన హృదయంతో శ్రీ శ్రీ తిరుగుతూండడము నేను ఎరుగుదును. ఆయన ఏదో వెతుకుతున్నారని నేను పలుసారులు గుర్తించానూ, పురిపండా వారితో అన్నాను కూడాను. 1933 లో శ్రీ శ్రీ ని నడిపించిన ఆశయే, 'జయభేరి' గా పలికింది. ముత్యాలసరాల్లో రెండు పాదాలే పట్టి, చివ్వర దీర్ఘాక్షరంతో మరొక ఆవృతం సాగ డాన్ని సూచించిన రచన అది. సంస్కృతపదాలు ఎఘిరి పోయాయి. చేపపిల్ల స్వంత గొంతుతో ఆశాదీపపు అందపు నృత్యాన్ని చిన్న మాటలతో చిత్రించింది. 'నే నాకన్నీ విప్పి పోతే చంద్ర గాడ్పులు, వాన మబ్బులు, మంచు సోనలు భూమి మీదా భుగ్న మౌతాయి ! ట'. 'నింగి నుండీ తొంగిచూచే రంగు రంగుల చుక్కలన్నీ రాలి నెత్తురు కక్కుకుంటూ పేలి పోతాయి' ట ! ఆశకూ, ఆత్మవిశ్వాసానికీ చక్కని రూపం, వాడుక మాటలతో జాతీయాలతో రచిస్తున్న సంయమం కంటే చెపుతూన్న ఉత్సాహం గిపించేటట్టు, ఇచ్చారు. ఈ గేయం నాకు వినిపించారు. దీనిలో తరంగితమయే లయ ఉత్సా హాన్ని చక్కగా విరూపించిందని గుర్తించాను. తరవాత వచ్చింది 'ఒకరాత్రి', ద్విపదలలో. ఛందస్సు సరళమైపోతోందీ, సంప్ర దాయపు సులోచనాలు పడిపోయి స్వంత కళ్లతో చూస్తు న్నారు కవిగారు. బహుళ పంచమి జోత్స్న చీకటిదారుల్లో వస్తుంది. వెన్నెల కంటే చీకటే ఎక్కువగా కంటికి తగులు తుంది.. కనుకనే 'పొగలాగు కమ్మి భయపెట్టు' నన్నారు. ఇదే ఊహ 'ఈ రేయి రేగింది ఇసుక తుఫాను' గా వచ్చింది. భయము, భూదివమ్ముల మధ్య ఈదుతున్న కనరాని గడుసు దయ్యాల్ని గుర్తించింది. మనకీ ఈ భయం తగిలేటట్టు 'నోరెత్తి హోరెత్తి వాగులు సాగరము', 'కరి కళేబరములా

కదలదు కొండ.' 'వెలిబూది వోలె విశ్వమంతా నిండింది జ్యోత్స్న' అంటూ ఆ దృశ్యాన్ని మనముందు పెట్టారు. ద్విపదలో 'నలము' దాని గమనానికి అడ్డు, అయిదు లఘువుల గణము ఏ రూపంలో ఉన్నా ద్విపద గమనానికి సహాయకారి. ఇసుకతుఫాను కదలదు, వంటి 'నలములూ', 'ఈదుతున్నాయి' 'కళేబరములా' 'ఒంటెలా' వంటి వాడుక ప్రయోగాలూ వాడి, ''కవిత్వ మువాచ'' అన్న స్థితి నుండి 'చెప్పె' నన్న స్థితికి తెచ్చారు శ్రీ శ్రీ. ఈ రచనలో 'శోకత్వ'మే చక్కగా స్ఫురించి 'శ్లోకత్వా'న్ని విరిచింది. 'ఆకాశపు ఎడారిలో కాళ్ళు తెగిన ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి' అని చదివినప్పుడు ఈ పాదాల లయ గంధము స్ఫురించనే స్ఫురించదు. ఛందస్సు తెగిపోయి కవిత్వపు తలకట్టు నుంచి వ్రేలాడుతోంది ఈ రచనలో. (మూడో రచన గంటలు, శ్రీ శ్రీ నాట్య యాగంలో ఒక కరణం అది ప్రస్తుతం వదిలేస్తాను.) తరవాతి రచన ఆకాశదీపంలో' ఛందస్సు రాలిపోయింది ! ''గదిలో ఎవరూ లేరు, గది నిండా నిశ్శబ్దం. సాయంత్రం ఆరున్నర'' ఈ చివరి మాటలో (రెండో భాగంలోని) చందస్సు మూలుగు కూడా వినబడదు. 'గదిలోపల చిమ్మకులవలె చీకట్లు' ట. అందని ఊహ కోసం గాలం. గతి విసురుకుంటూ వచ్చింది, ''ఇది కవిత్వము, పాయిలా పాయిలా మాటలు కాదు'' అని మనకు జ్ఞాపకము చెయ్యడానికేమో ! 'గదిలోపల ఏవేవో ఆవిరులు, భయంతో వింపే- యత్నం. కవిత్వము మళ్లీ 'దూరాన వింగిమీద తోచిన ఒక చుక్కదాకా' పరుగెత్తి తిరిగివచ్చి 'గదిని తలపోతతో కౌగిలించుకు' న్నది. ఇక్కడ కవి 'ఒక దురదృష్టజీవి ఉదయం ఆరున్నరకు ఆ గదిలోనే ఆరిపోయాడు' అని చెప్పేశారు. తరవాతి రచన ఊహల కందని ఛాయల్ని పొగత్రాళ్లతో కట్టేలాగే యత్నం. ఈ మూడో రచనలో ప్రయత్న స్ఫురణలేని రచనా, లయగంధి గంటల మ్రోతా, 'బహుళ పంచమి' జ్యోత్స్న, కరచాలనమూ మూడు పాయల్లాగ పెనవేసుకుని వచ్చాయి. 'ఆకాశదీప' జీవితం కూడా—పరుచుకునే అనుకొండి—ఈ రచనలో ఇమిడింది. కలల పొలాలలో మంచి 'పికూ వాకూ చెవుల సోకని కేకలు' విని వినిపిద్దామనే యత్నం బలంగా కనబడుతున్నది.

ఈ తరువాత శ్రీ శ్రీ మదరాసుకు వెళ్లిపోయారు. మార్క్సు సిద్ధాంతాలూ, పేదల జీవితాలూ, ధనికస్వాముల విహారాలూ కంటబడడంతో ఈ ప్రపంచం వద్దు, పదండి మరో ప్రపంచానికి అని ప్రబోధించే 'మహాప్రస్థాన' గీతం వచ్చింది. ఇది 'కిటలక కిటలక' అంటూ చతురశ్ర గతిలో నడిచే గీతం. స్విన్‌బర్న్ గీతాలు వల్లించి, మూడో రచనగా ఇంతకుముందు ఎడ్గార్ ఏలెన్ ''గంటలు'' రచించి మూలుగు లోనికి దింపుకున్న ప్రవాహపు తూగుడు ఈ 'మరో ప్రపంచం' గీతంలో ప్రవేశించింది. కదం తొక్కుతూ, పదం పాడుతూ, హృదంతరాళం గర్జిస్తూ—అంటూ ఉత్సాహంతో ఊగేగేయంలో సంస్కృతపు మాటలు చక్కగా అమిరేయి, హరహరలూ, త్రేతాగ్నులూ, మేరువులూ, శివసముద్ర నయాగరాలూ, కంచునగారాలూ అగ్నికిరీటాలూ, హోమజ్వాలలూ, ఎర్ర బావుటాలూ కోలాహలము చేశాయి. సంఘమంతా ఈడిగిలబడుతున్న దురాచారాలతోనూ, అసంతృప్తితోనూ ఉండిన పరిస్థితులలోనైతే, 'ఇంకొక ప్రపంచము ఏదైనా సరే, ఇది మాత్రము తప్పితే చాల' వి అనిపించవచ్చును. అట్లా లేనినాడు, పదండి పదండి లని తోస్తూ చెప్పే మరో ప్రపంచం ఎలాంటిదో తెలియక పోతే, చదువర్లకు ఈ గేయం ఇంకొక సుందర ప్రపంచాన్ని కలలో చూచి మసల్ని పద పదా మని తొందరపెట్టే యువకోత్సాహ సంరంభములాగ కనబడుతుంది. ''ఏ దేశములోనైనా, ఏ జాతిలో నైనా సంస్కారాశయానికి ఇది శక్తివంతమైన రూపము'' అని వాదిస్తే, ''అయితే ఇది బుక్కులలోనికి పోవలసిన రచన కాదా'' అనవలసి వస్తుంది. వినబడలేదు మరో ప్రపంచపు జలపాతం, నీవు వినిపించిన దెప్పుడూ ? కనబడ లేదు మరో ప్రపంచపు అగ్నికిరీటపు ధగధగలు, నీవు చూపించిన దెపుడూ ? నీ మనసులో మెరసిన మరో ప్రపంచానికి నన్ను లాగడానికి నీ తొందర తప్ప మరేమిటుందంటావూ ?

మరో ప్రపంచము సామ్యవాద ఆశయాలు ప్రోద్బలించిన గీతము కావచ్చును. ఆ వెంటనే 'యుముని మహిషపు లోహ ఘంటలు మబ్బుచాటున ఖణేల్మన్నాయి' అని ప్రారంభించే గేయం వచ్చింది. యముని మహిషమూ, నరకలోకపు జాగిలములూ, సూర్యుని హయములూ, దుర్గసింహం, ఐరావతమూ, నందికేశుడూ, ఆదివరాహమూ ఉద్రిక్తులయారు. పుడమి తల్లికి పురిటినొప్పులు కొత్త సృష్టిని స్ఫురింపించాయి. ఎదురుచూద్దాము ఆ కొత్త సృష్టికి. 'బాటసారి' వచ్చింది. ఆతడు పట్టణంలో బ్రదుకుదామని' బయలుదేరాడు. 'పట్టణంలో అతని యత్నం తిరస్కృతమూ, అతని వేడికోళ్లూ బిచ్చపు కేకలూ, అతని విశ్రాంతి మాసెన్నూ అయిన సూచన చెయ్యకుండా మూడు రోజులు నడిచినట్టు చెప్పేరు కవిగారు. పట్టణంలోనా, దారిలోనా ? నాకు తెలియదు. దారిలోనే అయితే ఈ విషాదాంత గాథ కుపయోగము లేదు. పట్టణంలో అన్న సూచన లేదు. 'భిక్షు వర్షీయసి', 'పేదలు', 'నీడలు', గుండెను పిండే పిడికిలినొక్కులు. పైన చెప్పిన గీతములు వ్రాసి అలసిన గుండె డిక్టేటుచేసి ఉంటుంది. 'ఆ అవ్వే మరణిస్తే ఆ పాపం ఎవ్వరిది' వి అడిగితే ఎగిరి వచ్చిన ఎంగిలాకు 'ఇది నా పాపం కాదు' అన్నది. వజ్రముని అది

దాటివచ్చిన కిటికీలో దూరుతుంది చదువరి మనస్సు. ('పేదలు అనువాదమట) పేడలూ అట్లాంటివే. అభిప్రాయాలే చెపుతూ వడపోసి కనక దానికంటె ఇది రచించడము కష్టము. జాడలు, గోడలు, మేడలు, వాడలు, కాడలు, ఓడలు, క్రీడలు, పీడలు అన్న ప్రాస పదాల్ని అమర్చి సామ్యవాదపరంగా చెప్ప యత్నించిన గేయమైనా, రాధా మాధవకవి రాయల ఆస్థానంలో చెప్పిన పద్యాలకంటె రసవంతంగా ఉంది ఈ గేయం. వాడు అన్నదీ రాజకీయ తత్త్వ సంస్కారం కోరే గేయమే. అయితే ఇందులో శ్రీ. శ్రీ 'అడ్వర్టయిజుమెంటు' లో వ్రాసినట్టు 'అజరామర మౌ నిత్య సత్య తేజస్సులపై ఇజాల పోటీ ఆరాటంలో... పూర్ణత్వమేది చూర్ణమౌతుంది.' ఇవి చదివిన తర్వాతే ''నిజంగానే, నిఖిలలోకం నిండు హర్షం వహిస్తుందా ?'' అన్న గేయం ధ్వనిస్తుంది. 'ప్రతిజ్ఞ' దీనికి జవాబు. 'యథార్థ జీవిత యథార్థ దృశ్యం' చూపడము ఎన్ని మహాప్రస్థాన గీతాలకన్నాను శక్తివంతం, 'భిక్షువర్షీయసి' అలాంటిది. 'బాటసారి' దారి తప్పిపోయింది. 'ఉన్మాది' ఈ చాటకానే కాదు. పీడలు శక్తివంతమైన వర్ణన. ''ఏ దేశ చరిత్ర చూచినా'' గేయము 'నర జాతి చరిత్ర సమస్తం', పరస్పరాహరణోద్యోగం, రణరక్త ప్రవాహాసిక్తం, దరిద్రులను కాల్చుకుతినడం' అని చెప్పీ, 'చెంగిజ్ ఖాన్ తామర్లేనూ నాదిర్షా ఘజ్నీ ఘోరీ సికందరో ఎవడైతే నేం ఒక్కొక్కడూ మహా హంతకుడూ' అని చూపీ, చిర కాలం జరిగిన మోసం, ధనవంతుల పన్నాగాలూ, ఇంకానా ఇకపై చెల్లవు' అని గర్జించీ, 'అణగారిన ఆర్తు లందరూ గర్జిస్తారు (ఎప్పుడో భవిష్యత్తులో). ఈ రాణీ ప్రేమపురాణం, ఆ ముట్టడికైన ఖర్చులూ, ఇవి కావోయ్ చరిత్ర సారం' అంటూ 'ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కాన్పించని కథలన్నీ కావా లిప్పుడు' అని నీతులు చెప్పీ, చివ్వరికి 'సామాన్యుని జీవనమూ, రాళ్ళెత్తిన కూలీలూ, సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుని సాహసమూ, బోయీ లెవ్వరూ అని పతితుల సంగతులూ చెప్పి చెప్పి, విరామానికి నోచుకున్న కొద్ది రచయితల ''ఏ శిల్పం ? ఏ సాహిత్యం ? ఏ శాస్త్రం ? ఏ స్వప్నం'' అంటూ ధనవంతుల సొమ్ము పేడలలో పెరిగే 'కుక్క గొడుగుల్నే' తలుస్తోంది. ''మానవజాతి సౌఖ్యానికి, రోగనివారణానికి, సహజీవనానికి, పరస్పర సహకారానికి, రక్షణకి, జరిగిన ఏర్పాట్లేమిటి, వీటికొరకు ప్రాణా లిచ్చినవారూ, జాతి సుఖంకోసం తమ సుఖాన్ని త్యజించినవారూ, ఆశపోతుల పన్నాగాలకు ప్రత్యుపాయాలు చేసినవారూ ఎవరు ?'' అని కాదా ప్రశ్నించవలసినది ? జగన్నాథుని రథచక్రాల్లో 'వస్తున్నా యొస్తున్నాయి' అని రేపటి, మర్నాటి, మదూర భవిష్య దాశలే .... ఇది శ్రీ శ్రీ రాజకీయ శంఖానాదము కథ. శ్రీ శ్రీ కవి, ''యథార్థ జీవిత యథార్థ దృశ్యాలు'' అయిన చూపినవి బహు కొద్ది, తక్కిన వాటిలో పోల్చితే మరీ తక్కువ.

శబ్దచిత్రాలు శ్రీ శ్రీ రచనలో రెండో భాగం. గంటలు గేయంలో ఉన్న తూగుడు, గతి శ్రీ శ్రీ ని బాగా ఆకర్షించింది. స్విన్‌బర్న్ రచనలూ లాగేయి. తరళరాలుగా నడిచే పద్యాన్ని పాటగా పాడి, గతి మాధుర్యాన్ని కప్పేసింది ఆంధ్రజాతి. మళ్లీ ఆ పద్యాన్నే పట్టుకుని పాకులాడింది. పాటలో సమలయ ఉన్నా అకారము ఉండడమువల్ల, సంగీతజ్ఞులకే తప్ప మిగిలినవారికి పాటలోని లయ చక్కగా బోధపడదు. ఆధునికులూ, నవ్యాధునికులూ రచించే పాటంలో ప్రతి అక్షర కాలానికీ సాహిత్యాక్షరము ఉండి తీరుతుంది, కొసని ఎక్కడో దీర్ఘాక్షర ముండి మూడు నాలుగు అక్షరాల కాలముదాకా సాగుతుంది. కనుక అక్షరాలు స్ఫుటంగా నడిచి లయను కనుపరుస్తాయి. దీనికి తోడు ప్రాసలూ, యతులూ చేరితే నాదమూ, లయా చేరి అందగిస్తాయి. 'భూతాన్ని యజ్ఞోపవీతాన్ని వైప్లవ్య గీతాన్ని నేను'' అని ఖండ గతిలో—అయిదేసి అక్షరాల ఆవృతాలతోనూ, ఎగిరించకు లోహ విహంగాలను, కదిలించకు సుప్త భుజంగాలను, అని 'తక కిట తక కిటతక కిటతక తక' వరుసలలానూ, పోనీ పోని పోనీపోనీ అని నాలుగు నాలుగక్షరాల ఆవృతాలూ వీటి వెంటనే నటాల్ సురుల్ .... అంటూ నాలుగు మూడక్షరాల ఆవృతాలతోనూ, అలసిన కన్నులు కాంచే దేమిటి, తొలగిన స్వప్నం, తొలగిన స్వర్గం అని నాలుగక్షరాలు ఆవృతాలతోనూ, మాయంటావా అంతా మిథ్యంటావా' అని ఎనిమి దక్షరాల ఆవృతాలతోనూ రచించారు వీరు పాటల్ని. వీరికి గేయాల లయను గురించి మరికొంత తెలిసివుంటే, ఖండగతిలోనూ రూపకతాళవం లోనూ ఇంకా వైవిధ్యము చూపి ఉండేవారు.

ఈ గేయాల్లో భావానిది గౌణస్థానమే. 'నా ఊహ చాంపేయమాల ! రసరాజ్యడోల ! నా ఊళ కేదారగౌళ' ట. కేదారగౌళపుణ్యం పండింది, కన్నడగౌళ, నారాయణగౌళ, రీతిగౌళ యక్కడ అన్‌ఫిట్ ! మాయామాళవగౌళ మాట పురేలా ? భావము నృత్యముచేసే గేయము నెత్తిమీద ఘటంలో తొణుకుతూఉండవలసినదే. వర్ణకౌశలము స్ఫురించడానికి చిత్రకారులు సాదృశ్యాన్ని (అనగా లోక వృత్తాలతో పోలికని) ఒక్కొక్కప్పుడు అతిక్రమించి చిత్రరచన చేస్తారు. సంజీవదేవుగారి 'ప్రకృతి చిత్రాలు' ఇలాటివి ఉన్నాయి. వాటిలో వస్తువూ, వర్ణమూ తూగే సౌందర్యమూ, వర్ణ

ముల ఛాయలూ, వంపులూ, లయా, ఇవే ముఖ్యము. ఇక్కడ లయా, ప్రాసక్రీడా ముఖ్యం, భావం కాదు, అర్థము ఏదో రీతిగా సందర్భమైతే చాలు. ఇది మాటలా, శబ్దాలా చిత్రము. మాటల చేరిక కున్న అర్థములో కొంత అందమూ, ఆమాటల శబ్దాల చేరికకున్న అందము కొంతా చేరి అందుతుంది మనకి. అచుకవిత్వములో ఛందో నియమమూ, అవధానాల్లో నియమ పాలనమూ మాత్రము చూచి సంతుష్టి పడుతున్నాము కదా? అలాగే ఈ ప్రాస క్రీడల్లో అర్థ గౌరవము కాక శబ్ద శ్లేషల్నే గుర్తించి తృప్తిపడలేమా ?' అనితర సాధ్యం ఈ మార్గం' అని అనుకోవచ్చును గదా ? మరియొక విశేషము : "వెనక్కి తిరిగి చూసుకునే అలవాటే లేదు నాకు" అంటారు శ్రీ శ్రీ. అదీ ప్రత్యేకతే కదా ? "పవనంలా రసవత్ కవనంలా వెల్గు చలిస్తుంది. వృక్షంలా కాలిన పక్షంలా చీకటి నిలుస్తుంది." అన్నప్పుడు ద్విత్వాక్షరాల వరుసలే చెవికి తగిలేవి. "వక్రము విక్రమించె కరిపాదాక్రాంత నిర్వక్రమై" అన్న పోతన గారి పద్య పాదములో అనుప్రాస గౌణమూ, అర్థము కాదు. ఇక్కడ అర్థము గౌణము .... శబ్దచిత్రపు మాత్రమే కాక శబ్దఖేలనమువల్ల—వర్ణావకుంఠనాలతో నర్తనము చేసేవారి కలుపువల్ల ఏర్పడే అందాన్ని, కవిత్వంలోకి తేవడం కూడా శ్రీ శ్రీ రచనల్లో చూస్తాము. 'కవితా, ఓ కవితా ! నా యువకాశల నవపేశల సుమగీతావరణంలో, నిను నే నొక సుముహూర్తంలో, అతి సుందర సుస్యందన మందున' అంటూ మాటల వరుసల్ని అనుప్రాసపు వంపులలో తిప్పుతూ నడుపుక్కు పోతారు. పదములతో నిర్మించిన శబ్ద లత (designs) లివి. డిజైనులకు సాదృశ్యము కొంచెమే ఉంటుంది కదా ? వీటితోనూ అంతే .... ఆధునిక చిత్రకారులు రంగులతో విచిత్రమైన ప్రక్రియ ఒకటి కనిపెట్టారు. చిత్రరచనకని కర్ర పలకమీద అతికించిన పటాన్ని తడిపి ఆరబెట్టి, అది పూర్తిగా ఆరిపోకముందు కుంచె నిండా తాము ఎంచుకున్న రంగులను ఆ పటముమీద అక్కడా అక్కడా ముద్దలుగా పెట్టుతారు. (రంగులలో వాటిలో వాటికి మైత్రీ నగమేరికా ఉన్నాయి.) ఈ రంగులు కాగితానికి మిగిలిఉన్న తడిలో పెట్టిన దగ్గర చుట్టూ చిమ్ముతాయి. పటము పూర్తిగా ఆరిపోయిన తర్వాత ఈ రంగుల ఏర్పాటుని ఊహాచిత్రంలో ఇమిడ్చి చిత్రము రచిస్తారు. లోకంలో మనము చెట్ల ఆకు పచ్చనా, నీటి పలచన నీలమూ, దానిలో ప్రతిఫలించే మబ్బుల తెలుపు నలుపులూ, ఒక బంగారా పెంకుటింటి ఎర్రటి కప్పూ, దారుల కచికరంగు చారలూ మూడగలము కొండ ఏదైనా ఎక్కి చుట్టూ చూస్తే. పై చిత్రము రంగుల కెలైడాస్కోపు దృశ్యములాగ ఉంటుందీ, రంగులు కొంచెముగా తమ పరిసరాలకి చిమ్ముతాయి. శ్రీ శ్రీ 'అద్వైతం' అనే ఖండం చూడండి. ఆనందం, అనురాగం, ఆర్ణవం, అంబరం అనే నాలుగుమాట లున్నాయి. ఇవే పైన రంగుల లాంటివి. ఇక అల్లడము ప్రారంభమైంది. ఆనందం ఆర్ణవమైతే, అనురాగం అంబరమైతే—అనురాగపు టంచులు చూస్తాం— ఆనందపు లోతులు తీస్తార. (ఈ అల్లిక, ఆనందం అంబరమైతే, అనురాగం ఆర్ణవమైతే, ఆనందపుటంచులు చూస్తాం అనీ సాగి ఉండవచ్చును) తర్వాత నిక్వాణం, నిర్వాణం, డోలలు, జ్వాలలు, రేకులు, బాకులు, అంటూ జంటపదా లొచ్చాయి. నేనూ నువ్వూ అనే ద్వంద్వమూ ఈ జంటల ద్వంద్వాలూ సమానాంతరం (Parallel) గా సాగిపోయాయి. "అయితే సాదృశ్యము పోలేదే ?" అంటారా ? నడిచినంతవరకూ నడుస్తుందీ, పోయినప్పుడు పోతుంది. 'ఎగిరిన జీవ విహంగం' సరే, 'పగిలిన మరణ మృదంగ' మేమిటి ? మరణ మృదంగం పగలడ మేమిటి? ఇక్కడ లోక వృత్తాంతో గల సాదృశ్యంలోపిస్తోంది. అయితే మొత్తంగా గోచరించే సాదృశ్య కోలాహలంలో ఈ లోటు వినపడదు .... చిత్రకారులు రేఖలతోనూ, రంగులతోనూ రచించి రచించి విసిగి, బుజు రేఖలతో, వెడల్పులతో సమచతురస్రాలూ (squares), సమఘనాలూ (Cubes) తో మానవులూ, జంతువులూ, పరిసరాలూ చిత్రములు రచించారు పాశ్చాత్య దేశాల్లో. మనవారి బంధ కవిత్వము ఇలాటిదే కదా ? శ్రీ శ్రీ కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్లా వరుసగా అక్షరం క్రింద అక్షరం వ్రాసి సమ చతురస్రం చేసి, (నాలుగోపాదం వ్రాస్తే ఎత్తు ఎక్కువైపోతుంది !) దాని కింద మరో రెండు పాదాలు వ్రాసి 'బుక్కులు' చేశారు. అంత్యప్రాస నిలిచింది వీటిలో.... చిత్రకారులు ప్రకృతిదృశ్యాలు చిత్రించేటప్పుడు, కంటికి కనబడే రేఖల వంపులూ, నరుకులూ పెన్సలుతో గీచి, కుంచెతో రంగులు అద్దడము ఒక పద్ధతి. రంగుల్నే కుంచెతో కాగితము మీద(నో, ఇంకొక రకపు పటము మీదనో) అద్ది, వాటి ఛాయలవల్లా, రికామీ అంచులవల్లా ఆకుల గుంపుల్నీ, చెట్టు రకాన్నీ స్ఫురింపజేయడము ఇంకొక పద్ధతి. అరటి, ఈత, వేప, మర్రిచెట్లని ఈ పద్ధతివల్ల సూచించడము మేలు. కవిత్వంలో రూపకము సరళముగా కాక, రెండు మూడు కుక్కినట్లుండడము ఈ రకపు యత్నమువల్లనే. "ఈ నిశాంతము శూన్య మిందెన్నడో రహశ్శిథిలసుప్తి కలవరమంది లేచి గుబులు కొనె లేత నెత్తావి గుసగుస లేవో" అన్న కృష్ణశాస్త్రి రచన ఇలాటిదే. శ్రీ శ్రీ ఈ ఇంప్రెషనిజమ్ తంత్రాన్ని "—ఇవేమిటీ వింత భయాలు ?—ఇంట్లో చీకటి !—ఇవేమిటీ అవ

స్వరాలు ? తెగింది తీగ !—అవేమిటా రంగుల పీడలు ?—చావూ, బ్రదుకూ !—ఎచటికి పోతా వీ రాత్రి ?—అవతలి గట్టుకు !'' అన్న ఖండికల్లో శక్తివంతంగా ఉపయోగించారు. 'జ్వాలాతోరణంలో' 'ఇదేమి ! లోకం హిరణ్యనేత్రుని పదాఘాతమున ప్రతిధ్వనించగ, కురుక్షేత్రమున క్రుద్ధ వృకోదరు గదాఘాతమున గజగజ లాడగ' అని ధనికుని జులుమ్, ధర్మశక్తి బరువూ సూచించారూ, 'అదె సంవర్తపు తుఫాను మేఘం, తొలి గర్జించిన తూర్య విరావం' అని విప్లవాన్ని సూచించారూ, ''ప్రదీప్త కీలా ప్రవాళమాలా ప్రపంచవేలా ప్రసారములలో, మిహిరవాజితతి ! మఘవ ధనుర్ద్యుతి!'' అని మహానందాన్ని సూచించి, పుడమికి నేడే పుట్టిన రోజులు !'' అని ఆ ఆనందాన్ని మాటలతో పట్టి నిలిపేరు. మహానందంలో మొదటలో లాస్యమూ, తరువాత దరువుల ముక్తాయింపూ గోచరిస్తుంది...... అనిబద్ధ కవిత్వం శ్రీ శ్రీ రచనలో మూడో భాగము ''నిప్పులు చిమ్ముకుంటూ నింగికి నే నెగిరిపోతే నిబిడాశ్చర్యంతో వీరు ! నెత్తురు కక్కుకుంటూ నేలకు నే రాలిపోతే నిర్దాక్షిణ్యంగా వీరె'' అన్నారు. శబ్దాలంకారమూ, ఆడంబరమూ, ఛందస్సు కవాతులూ, కళ్లెపు బిగింపులూ, రికాబు రాపిళ్లు లేవు ఈ రచనలో. లోకుల వైఖరిని ఎంత చక్కగా వర్ణించారు, దీనిలో ? ఇది నైసర్గిక కవిత్వం, అనిబద్ధ కవిత్వము. 'కూటికోసం కూలికోసం, పట్టణంలో బతుకుదామని తల్లి మాటలు చెవిని పెట్టక బయలుదేరిన బాటసారికి' అలాటిదే. ''అదృష్టవంతులు మీరు వెలుగును ప్రేమిస్తారు. ఇరులను ద్వేషిస్తారు. మంచికీ చెడ్డకీ నడుమ కంచుగోడ లున్నాయి మీకు. అభాగ్యులం మేము సరిహద్దులు దొరకని సంధ్యలలో మా సంచారం. అలజడి మా జీవితం, ఆందోళన మా ఊపిరి. తిరుగుబాటు మా వేదాంతం'' ఎక్కడా పోహళించినట్లుగాని నడిపేసట్లు గాని కనబడక చక్కగా నడిచిపోతుంది. చిన్నపిల్లల పలుకుల లోని సౌందర్యమూ, జీవితసారపు మాధుర్యమూ, బరువూ ఉంటాయి ఈ రచనల్లో. ఛందో బందోబస్తులన్నీ చట్ ఫట్ ఫట్ తెగి దిక్కుల మూలలకి ఎగిరిపోతాయి వీటిల్లో. అంకితంచేసిన గీతం వినండి ఈ రకానిదే ''తలవంచుకు వెళ్లిపోయావా నేస్తం, శలవంటూ ఈ లోకాన్ని వదిలి ? .... ఎవరు ? దుఃఖించారులే, నేస్తం ! నువ్వు చనిపోతే ఏదో వేచూ, ఆరుగురు స్నేహితులూ తప్ప !'' ఎక్కడో ఒకచోట ఒక యతీ, ఒక అనుప్రాసో ఈ రచనాకాశంలో ఎగురుతూ కనబడతాయి. ఇది హృదయము పలికే భాష. మనస్సు కోతి కల్పనలకి ఈ దేవిడీమన్నా. ఇది అచ్చమైన, నిర్మలమైన కవిత్వము, రాగి కలవని అపరంజి. 'ఎవడో చెబితే వినే రోజులు ఏనాడో వెళ్లిపోయాయి ఇంకా ఏదో చెప్పాలని ఎందుకీ ఉబలాటం ?' అంటా రింకొక రచనలో. దీనిలో నానుడికున్న బలం ఉంటుంది కాని, గజల్ కున్న గజ్జె లుండవు. 'ఆనకట్టలు మట్టితో కట్టేద్దాం, వానమీద తప్పు వేసేద్దాం' అన్నప్పుడు గజ్జెల గలగల వినబడుతుంది. రవీంద్రుని గీతాంజలిలో పరమేశ్వరుని సంబోధించే గీతాలు ఈ జాతి రత్నాలు. 'నా పాట అలంకారా లన్నిటినీ తీసేసింది. అవి నీ గుసగుసల్ని వినపడ నియ్యవు' అంటాడు ఆయన. ఇంకో గీతంలో ఇలాటి అందాల్ని సముద్రపుహోతుల్నించి తెచ్చి ప్రేయసి ముందు కుప్ప పోశాడట. ఇవేమిటో ? ఇవేం చేసుకోనూ ? అన్నదట ఆమె. 'అవును. నేను వీటిని చెమటకార్చి సంపాదించలేదు, అంగడిలో పెద్ద దరలు ఇచ్చి కొనిలేనూ లేదు' అంటాడు. ఇవి అనుభవ సముద్రపు లోతులలోనివి, నిసర్గ సౌందర్యము గల ముత్యాలు.

చిత్రకళలోనే సర్రియలిజమనే సంప్రదాయ మున్నది. ''జాగ్రత్ప్రపంచములో దాక్షిణ్యమూ, జంకూ, భయమూ అడుక్కి తొక్కేసిన కోరికలూ, నరదాలూ, తల్పాలూ, స్వప్నాలలో అదో రీతిగా ప్రస్ఫుటమౌతాయి. ఆటంకాల ఇనుప పాదాలక్రింద ఇవి అప్పుడాలవలె మారిపోకుండా, కవి, కలము పట్టి నైసర్గిక తత్వాలే దాన్ని నడిపేటట్లుగా వ్రాయడము ప్రారంభిస్తే రచనలు నదీప్రవాహాల్లాగ నైసర్గిక శయ్యలో తరంగితములు అవుతాయి'' ని ఆ తత్త్వమును వివరిస్తారు తజ్ఞులు. అనుభవమనే హారతి కర్పూరపుబిళ్లను వెలిగిస్తే వచ్చే పొగ గాలితో ఎన్ని వంపులతోనో లేస్తుంది. అవే ఈ సర్రియలిజపు వ్రాతలుట. శ్రీ శ్రీ ఆయన మిత్రులు తలా ఒక అక్షరము చెప్పి 'స్వజేశజం' అనే పేరు నిర్మించారట దీనికి. 'సిందూరం సంధ్యారాగం, బంధూకం రక్తచందనం' అంటే వీటి ఎరుపు వీటి నన్నిటినీ లాగుకుని వచ్చిం దన వచ్చు, 'దారుణ మారణ దానవ భాషలు ! ఘోరవ భైరవ భీకర ఘోషలు' అంటే, 'ఇవన్నీ నీ బాధనుంచి పుట్టేవే' అన వచ్చును. ''ఎర్రశాలువ కప్పుకొని ఏడాయింటి కొచ్చిం దొక రివాల్వర్, బాధలో బెంజైను సీసా, ప్రేమలో డైనామరాణి'' అంటే భావార్థం ఏమిటో తెలియదూ, ఈ మాటల వెనకాల ఉన్న అర్థాలు వరుసగా నిలబడతాయి. కవి చేసేది అంతవరకేనట. మిగిలినది మనలో జరగాలట.

సామ్యవాద తత్త్వమూ, ప్రాస క్రీడలూ, అనిబద్ధకవిత్వమూ, స్వజేశజమూ దేని కది దాని రచనలలో విజృంభించినా వీటిలో రెండోదీ మూడోదీ మేళవించి నడిపిన రచనలు — శైశవగీతి, ఔను నిజం, సంధ్యా సమస్యలు, ఏవో ఏవేవో, — ఉన్నాయీ, మొదటి రెండూ చేరిన రచన లున్నాయి, ఆశాదూతలూ, జగన్నాథ రథచక్రాల్లాంటివి. శ్రీ శ్రీ రచన లన్నిటిలోనూ ఈ నాలుగు విభాగాలూ—నాలుగే విభాగాలు — ప్రత్యేకంగానూ, లుమ్మ చుట్టుకునీ గోచరిస్తాయి.

# మాతృక



## శ్రీ రంగధామ్

మనోరమను కలుసుకోవాలనీ, ఆమెతో మాట్లాడాలనీ, ఆమె యెడల నాకుగల సానుభూతిని తెలియబర్చాలనీ, నాకు చిరకాలంగా ఉన్న ఒక తీరని వాంఛ. ఆమెయందు నాకు కలిగిన ప్రీతి మరే వ్యక్తియందూ ఏనాడూ కలుగలేదు. ఆమె విశాలమైన వదనంలో, ప్రేమార్ద్రితతో నిండిన నల్లని సోగదేలిన కళ్ళూ, చిన్న చిరునవ్వును తాండవింపజేసే ఆమె నోరూ, ఆమె సుందర ముఖంలో ఎత్తయిన నుదుటిని ప్రస్ఫుటంచేసే తలకట్టూ, సుదీర్ఘమైన ఆమె వేణీ నన్ను వదలకుండా ఎన్నాళ్ళో వెంటాడాయి. కలల్లోనూ, భావనలోనూ ఆమె, ఆమె మాటలూ నన్నావరించాయి.

వర్షఋతువు వచ్చినప్పుడు ఆకాశంలో మేఘాలు వడిగా పరుగెడ్తూంటే, ఆ మేఘాలను తీవ్రంగా చూస్తూ మనస్సు భావనా లోకంలోకి ఎగిరిపోయినప్పుడు, ఆ మేఘాలమధ్య మనోరమను చూస్తుండేవాడిని. ఆమె మాటలూ, ఆ మాటలలోని ఒక సూక్ష్మమైన సరళతా, నా మెదడులో ప్రతిధ్వనించేవి. ఆమె తెలివితేటలూ, అందం, మంచితనం, త్యాగబుద్ధీ, సౌశీల్యం, ఆఖరికి ఆవిడలో కల బలహీనతా, అన్నీ నా మనస్సుకు హత్తుకుపోయాయి. నే నెప్పుడైనా మంచిపని చేస్తే, ఆ మంచి పనిని ఆమె తెలుసుకుని మెచ్చుకుంటే ఎంతో బాగుండు ననిపించేది. నే నేదైనా పొరపాటు చేస్తే అది నా బలహీనతగా భావించుకొని, దానిని ఆమె బలహీనతలో పోల్చుకుని, అటువంటి బలహీనతలు కూడా ఒక ఉత్తమ ఆదర్శానికి చెందినవే అని నన్ను నేను సమర్థించుకునేవాణ్ణి. ఆమెను గురించి నాకు తెలిసినంత బాగా మరెవరికీ తెలియదనుకునేవాణ్ణి. ఏదైనా కొత్త ఊరు వెళ్ళినా, కొత్త మొహాల్ని చూసినా, ఆమెయొక్క పోలిక లెవరిలోనైనా కన్పిస్తే, ఆమేనేమో ? నని భ్రమపడేవాణ్ణి.. ఆ వ్యక్తిని కలుసుకోవాలనీ, మాట్లాడాలనీ అనిపించేది. తీరా అటువంటి ప్రయత్నమేదైనా చెయ్యబోయేముందు, వాళ్ల మాటల్లోనో, చేతల్లోనో ఏదో ఒక అసహజత్వం చూసి, ఆ వ్యక్తి నా మనోరమ కాదని గ్రహించేవాణ్ణి.

ఆశకు ఎంత బలం ఉందో నాలాంటి భావుకుడి భ్రాంతి వల్ల తెలుస్తుంది. నేను మనోరమను ఎప్పటికీ కలుసుకోలేనని నాకు తెలుసు. అయినా ఇంకా ఆశే ! ఇంకా భ్రమే ! నేను నశించచ్చు, నా తరువాత తరంవారు వారి తర్వాత తరాలూ నశించచ్చు. కాని మనోరమ చిరకాలం వర్ధిల్లుతుంది ! నాలాటి భావుకుల్ని లలా ఆవేశించి, ఆక్రోశింప చేస్తుంది. లేదా నాలాటి యాత్రికులకు కల్లోల జీవిత సముద్రంలో మంచితనానికీ, త్యాగానికీ త్రోవచూపే ధ్రువతారలా నిలుస్తుంది—సాహిత్యాకాశంలో !

ఎందుకంటే ఆమె, ఒక పాత్ర ! 'కరుణ' అనే నవలలోని నాయిక ! ఆ నవలను 'సత్యశ్రీ' గారు రచించారు. ఆ నవల చదివి చదివీ నా మనసులో ఆ పాత్ర రూపం హత్తుకుపోయింది. ఆమెకోసం ఎంతో బాధపడ్డాను, ఎంతో పరితపించాను, కాని నా జీవితంలో నే నామెను కలుసుకోలేనని నాకు తెలుసు—నవలల్లోని పాత్రలకు మాటలతో జీవంపోసే రచయితలకు, ప్రత్యక్షంగా వారిని రక్తమాంసాలతో పాఠకుల ముందుంచగల శక్తి కలిగితే తప్ప ?

ఇంతటి అసంభవమైన కోరిక సుమారు పదేళ్లు నన్ను బాధించింది. నాకు పదిహేడేళ్ల వయస్సప్పుడు మొట్టమొదటిసారి 'కరుణ' అనే నవల చదివాను. అది సుమారు మూడు వందల పేజీల నవల. ఒక సాయంకాలం ప్రారంభించి, తెల్లవారులూ కూచుని చదివి, మర్నాడు పొద్దున పది గంటలకు పూర్తి చేశాను. ఆ రోజుల్లా నేను ఆ నవల గురించీ, మనోరమ పాత్ర గురించీ ఆలోచిస్తూ పరధ్యానంగానే ఉన్నాను. ఆ పాత్ర నన్నెంత బలంగా ఆకర్షించిందంటే, చివరకు అది, ఒక నవలలోని పాత్ర అనే విషయం మర్చిపోయి, ఆమె ఒక ప్రత్యక్షమైన, పరిచితమైన వ్యక్తి అయినట్లు భావించుకోసాగాను. కాలం గడిచినకొద్దీ ఆ భావన బలపడడమే కాకుండా ఆ భావనకు మరికొన్ని ఆలోచనలు తోడయ్యాయి.

అసలు మనోరమ వంటి వ్యక్తి ఎందు కుండగూడదూ ? ఆమెలో చాలా సహజత్వం ఉంది. ఆ పాత్రలో అంత సహజత్వాన్ని చొప్పించగలగడానికి రచయిత, అటువంటి వ్యక్తిని చాలా సన్నిహితంగా ఎరిగిఉండాలి. ఆ వ్యక్తి బహుశా

# మాతృక

రచయితకు దగ్గర బంధువు కావచ్చు, స్నేహితురాలు కావచ్చు; లేకపోతే రహస్య ప్రేయసి కావచ్చు. ఏమైనా ఆ వ్యక్తితో రచయితకు గాఢమైన పరిచయం ఉండితీరాల్సిందే. అసలు ఆ వ్యక్తిని రచయిత ఎంతగానో ఆరాధించి ఉంటాడు. లేకపోతే అంత శక్తివంతంగా, సజీవంగా ఆ పాత్రను సృష్టించలేడు. కాబట్టి మనోరమ ఎవరో తెలుసుకోవాలన్నా, ఆమెను కలుసుకోవాలన్నా ఒకే ఒక మార్గం నాకు స్ఫురించింది. అదేమిటంటే, ఆమెను గురించి ఆ రచయితను సూటిగా అడగడమేనా. బహుశా అది నే ననుకున్నంత తేలిక వ్యవహారము కాకపోవచ్చు, గాని అంతకన్నా నాకు వేరే గత్యంతరం తోచలేదు.

మా ఊరిలో 'సత్యశ్రీ' గారిని బాగా ఎరిగిన ఒక స్నేహితు డుంటే ఆయన వద్దకు వెళ్ళి, నాకు 'సత్యశ్రీ' గారిని కలుసుకోవాలని కోరికగా ఉందని చెప్పాను. ఆయన ఒక లాయరు. 'ఎందుకూ ?' 'ఏం కావాలి ?' అన్న ప్రశ్నలు వేస్తాడేమో నని భయపడ్డాను. ఆయన అటువంటి ప్రశ్నలు వేస్తే అసలు విషయం చెప్పడం చాలా కష్టం. ఇది భావనా ప్రపంచంతో సంబంధించిన విషయం. వాస్తవిక ప్రపంచంలో చాలా అసందర్భంగా కన్పించే విషయం. ఎలా చెప్పగలను ? కానీ, ఆయన అటువంటి ప్రశ్నలేమీ వెయ్యలేదు. ఆరాత్రే సత్యశ్రీగారు వస్తున్నారనీ, రాత్రి వచ్చి నేను ఆయనను కలుసుకోవచ్చుననీ చెప్పారు. నాకు చాలా ఆనందం కలిగింది.

ఆ రాత్రి ఆయ నింటికి మళ్ళీ వెళ్ళాను. లాయరుగారు నన్ను తమ మేడమీదకు తీసికెళ్ళి గదిలో ఇద్దరు వ్యక్తులతో సంభాషిస్తూ కూర్చున్న, ఒక సన్నని మధ్య వయస్కుడైన వ్యక్తికి పరిచయం చేశారు. ఆ యిద్దరు వ్యక్తులూ యువకులు. వారి చేతిలో ఏవో పుస్తకా లున్నాయి. సత్యశ్రీగారు నన్ను చూసి చిరునవ్వు నవ్వి నమస్కరించారు. ఆయన పంచె కట్టుకుని, దానిమీద చొక్కా వేసుకున్నారు. తల కొద్దిగా నెరిసింది. కోల మొహం, చామనచాయ ఆయనిది. ఆ మొహంలో నాకేమీ ప్రత్యేకత కన్పించలేదు. ముక్కు కొద్దిగా పెద్దది. నుదురు సామాన్యంగా ఉంది. ఆయన్ను చూడగానే, అంత వరకు నా మనస్సులో ఆయన ఆకారం ఫలానావిధంగా ఉంటుందని ఊహించుకున్న ఊహంతా పటాపంచ లయిపోయింది. ఆయన పుస్తకం చదివినప్పుడు ఎంతో సన్నిహితంగా కన్పించే ఆయన ప్రత్యక్షంగా చూస్తుంటే పూర్తిగా కొత్త, అపరిచిత వ్యక్తిలా తోచారు.

ఎలా మాట్లాడడమో, ఆయనతో ఏం మాట్లాడడమో నాకు తోచలేదు. కానీ ఆయనే సంభాషణకు దారి తీశారు. కొద్ది నిముషాలు పరస్పర పరిచయాలు అయ్యాక, ఆయనతో మాట్లాడడం అంత కష్టం అనిపించలేదు. నేను వచ్చేసరికి ఉన్న ఇద్దరు వ్యక్తులూ కొద్ది సేపటిలో వెళ్ళిపోయారు. నేనూ, లాయరుగారూ, సత్యశ్రీగారూ మిగిలాం.

అది విశాలమైన గది. పైన మధ్యగా ఒక ఎలక్ట్రిక్ లైటూ వెలుగుతోంది. రెండు పెద్ద బట్టల బీరువాలూ, రెండు పెద్ద సోఫాలూ, ఒక మంచం, నాలుగు గోద్రెజ్ కుర్చీలూ ఉన్నాయి. గోడలకు రెండు వైపులా రెండు నిలువుటద్దాలున్నాయి. నేనూ, లాయరుగారూ ఒక సోఫామీద కూర్చున్నాం. మా కెదురుగా సోఫాలో సత్యశ్రీగారు కూర్చున్నారు. టీపాయ్ మీదున్న ఆష్‌ట్రేలో సగం కాలిన సిగరెట్టుంది.

గోడలమీద నాలుగైదు మంచి పటా లున్నాయి. అప్పుడప్పుడు వాటివైపు చూస్తూ కాలం గడపసాగాను. నాకెదురుగా ఉన్న చిత్రం ఠాగూరుడిది. ఆయన చూపులో ఉన్న గాంభీర్యం నన్నెంతో ఆకర్షించింది. కొన్ని చిత్రాలలో ఆయన కండ్లు మూసి ధ్యానిస్తున్న ట్లుంటుంది; కానీ, ఆయన కళ్లు తెరవబడి ఉన్నప్పుడే ఎక్కువ ప్రశాంతత స్ఫురిస్తుంది, నాకు.

మా సంభాషణ, సాహిత్యం మీదకు మళ్లగానే, నేను ఆయనను 'కరుణ' నవల గురించి చాలా అభినందించాను. ఆ నవలలో నాకు మనోరమ పాత్ర చాలా నచ్చిందని చెప్పాను. ఆయన చిరునవ్వు నవ్వారు.

నా మనస్సులోని భావం నే ననుకోకుండా నా మాటల్లో బయటికి వచ్చేసింది. ''అసలు మనోరమ వంటి వ్యక్తి నిజంగా ఉందేమో, తెలుసుకోవాలనే మీ వద్దకు వచ్చాను'' అన్నాను. ఈ మాటలు అన్నాక నాకు కొంచెం సిగ్గు వేసింది. అనవసరమైన ఆవేశం ప్రకటించానేమో ? అని భయం వేసింది. ఏమైనా, విషయం బైటపెట్టేశాక ఏం జరిగినా సిద్ధంగా ఉండాలనుకుంటూ, జవాబు కోసం ఎదురుచూశాను.

ఆయన కొద్ది నిముషాలు నావైపు చూశారు. నా కళ్లలోనూ, నా మొహంలోనూ, నా భావాల్ని పూర్తిగా చదవగల్గుతూ, మనోరమయందు నాకు గల అభిమానాన్ని గ్రహించారేమో ననిపించింది, ఆయన అలా చూస్తుంటే.

కొద్దిసే పయ్యాక ఆయన కొత్త సిగరెట్టు ముట్టించారు. ''మనోరమ అంటే మీలాగే, నాకూ చాలా యిష్టం'' అన్నా రాయన గంభీరంగా.

నాకు కొద్దిగా ధైర్యం వచ్చింది. ''నిజంగా అంత అద్భుతమైన పాత్ర నే నెక్కడా చూడలేదు. మీ రటువంటి

వ్యక్తిని చూచి, ఆ పాత్ర చిత్రించి ఉంటారని, ఆమెలోని అందం, మంచితనం, సహృదయతా మిమ్మల్నెంతో ఆకర్షించి ఉంటాయనీ ఊహించాను. అసలు ఆ వ్యక్తి సజీవంగా ఉంటే ఒక్కసారి చూడాలని ఉంది'' అన్నాను.

లాయరుగారు, '' మీరొక రచయిత కావల్సింది'' అన్నారు నన్ను. ముగ్గురం నవ్వాం.

సత్యశ్రీగారు ''మీ ఆత్రుత నేను గ్రహించగలను. నేనూ అలాగే బాధపడ్డాను. ఆ పాత్రకు సంబంధించిన ఒక సంఘటన చెప్తాను వినండి'' అని ప్రారంభించారు. నేనూ, లాయరుగారూ చెవులు రిక్కించి వినసాగాం.

''అసలు నా చిన్నతనంనుండి నేను చాలా కష్టాలలో, ఒంటరిగా పెరగడంవల్ల, నాకు ఇతరుల సానుభూతీ, ప్రేమా కరువైయాయి. నేను నా తలిదండ్రుల్ని నా మూడోయేట పోగొట్టుకున్నాను. మా తాతగారింట్లో నేను పెరిగాను. నేను అనాథుడ నవటంవల్ల, మా మామా, అత్తా నన్ను చాలా నీచంగా చూసేవారు ఇంట్లో. వారి పిల్లలకు మంచి బట్టలూ, శుభ్రమైన భోజనం ఉండేవి. కానీ, నా కెప్పుడూ చిరిగిన గుడ్డలూ, చద్దన్నమేను. అలాగే మొండిగా పెరిగి, స్కూలుకు వెళ్తుండేవాణ్ణి—సుమారు ఎనిమిది సంవత్సరాల వయసులో, నాకొక స్నేహితు డుండేవాడు. వాడికి, వాళ్ల పిన్ని ఎంతో సేపు ముస్తాబుచేసి పంపేది. ఆమెకు ఇరవైయేళ్ల లోపు వయస్సు ఉంటుంది. తెల్లటి చీరలు కట్టుకునేది. ఆమెన్ను నేను చూసినప్పుడల్లా, జడ వేసుకోకుండా విరబోసిన తల వెంట్రుకలతో, కాటుక కళ్లతో కన్పించేది. నా స్నేహితుడి పేరు గోపి. నేను చాలా కాలం వరకూ, ఆమె గోపీకి తల్లయి ఉంటుందనీ, ఊరికే ఆమెను 'పిన్ని' అని పిలుస్తున్నాడని అనుకునేవాణ్ణి. కాని, ఒకనాడు గోపి చెప్పాడు, తన తల్లి చిన్నతనంలో చనిపోయిందనీ, వాళ్ల నాన్న పిన్నిని పెళ్లి చేసుకున్నాడని. అప్పుడు నాకు అనిపించింది, మా అమ్మ కూడా చనిపోయింది కదా, నాకు అటువంటి పిన్ని ఉంటే ఎంతో బాగుణ్ణని ! కానీ, నాన్న లేకుండా పిన్ని రాదని అప్పు డంతగా తట్టలేదు. అసలు నాకు పిన్నిమీద ఎందుకు కోరిక కల్గిందంటే, గోపీ వాళ్ల పిన్ని, వాణ్ణి ఎంతో ప్రేమగా చూసేది. వాణ్ణి బ్రతిమాలి బిస్కట్లూ అవీ తినిపించేది. ఇక నా పరిస్థితి ఎలాటిదంటే, నేను బ్రతిమాలినా నాకు బిస్కట్లిచ్చేవా రెవరూ లేరు. పైగా ఆమె శ్రద్ధగా గోపీకి బట్టలూ, జోళ్లూ వేసి, తల దువ్వి పుస్తకాల సంచి చేతికిచ్చి, బడికి పంపిస్తూంటే, నా మనస్సు కూడా నన్నెవరైనా అలా చేర దీస్తే బాగుండునని కోరేది. గోపీ పిన్ని, నన్ను కూడా ఎంతో ప్రేమగానే పలకరించేది. ఆమె ఎంతో మంచిదని నా విశ్వాసం. గోపీ వాళ్ల నాన్న కూడా ఎంతో మంచివాడయి ఉండాలనిపించేది. అప్పుడప్పుడు ఆయనను చూద్దామని కోరిక కల్గుతూండేది, నాకు. ఆయన ఇంకా అందంగా, మంచిగా ఉంటాడనిపించింది.

''ఒకనాడు నేనూ, గోపీ, మరికొందరు పిల్లలూ వాళ్లింట్లో ఆడుకుంటూంటే, గోపీ పిన్నికి ఫిట్సు వచ్చింది. ఆమె నేలమీద హఠాత్తుగా పడిపోయింది. తల ఊరికే బాదుకోసాగింది. పిడికిళ్లు బిగించింది. ఆ దృశ్యం చూసేసరికి నేను హడిలిపోయాను. కాని గోపి అంతగా భయపడలేదు. ఇంట్లోకి పరుగెత్తి ఒక తాళంచెవి తెచ్చి, ఆమె పిడికిలిలో పెట్టాడు. కొద్దిసేపట్లో ఆమె తల బాదుకోవడం తగ్గింది. మెల్లిగా ఏడ్చింది కాసేపు. క్రమంగా తేరుకుంది. అదే సమయంలో వాళ్ల ఇంటిముందర ఒక జట్కా ఆగింది. అందులోంచి దిగింది గోపీ నాన్న అని తెలిసింది. లావుగా, పొట్టిగా ఉన్నా డాయన. తలమీద కొద్ది తెల్ల వెంట్రుక లున్నాయి. ఎందుకో ఆయనను చూస్తే నాకు జుగుప్స కలిగింది. ఆయనకు ఏభై ఏళ్లకు తక్కువ ఉండవు. గోపీ పిన్నికీ, ఆయనకూ ఎంతో తేడా ఉంది. ఆయన రాగానే మేమంతా బయటికి వచ్చి మా యిళ్లకు వెళ్లిపోయాం. తరువాత చాలాకాలం వరకూ నా మనస్సులో గోపీ పిన్ని గురించి బాధగా ఉండేది. గోపీ వాళ్ల నాన్న ఆమెను బాధిస్తున్నాడేమో ? అందువల్లనే ఆమె కా రోగం వచ్చిందేమో ? ననిపించేది.

''నాకు పదేళ్లు దాటాక నేను తాతగారింట్లో ఉండలేకపోయాను. మా పిన్ని తన దగ్గర ఉంచుకుంటానని వాళ్ల ఊరు తీసుకెళ్లింది. ఆమెవద్ద నాకు కావలసిన ప్రేమాభిమానాలు లభిస్తాయేమో నని చూశాను. కాని, ఆమె నన్నొక అనాథునిలాగే చూసేది. గోపీ పిన్నికీ, మా పిన్నికీ ఎంతో తేడా కన్పించింది. రెండేళ్లు అక్కడ ఉన్నాక, బంధువు లెవరైనా నన్ను ఒక్కలాగే చూస్తారని గ్రహించాను. ఒకనాడు వాళ్లింట్లోంచి పారిపోయాను—విశాల ప్రపంచంలో విహరిద్దామనే కోర్కెతో. అలా పారిపోయి చాలా ఊళ్లు తిరిగాను. ఆరోజుల్లోనే, స్వతంత్రంగా బ్రతకటం అలవాటయింది. ప్రతి ఊరిలోనూ కొన్ని నెల లుండడం, ఏదో చిన్న చిన్న పనులు చేసి పొట్ట పోషించుకోవడం, మళ్లీ మనస్సు మారిపోగానే, ఆ ఊరి నుంచి మరో ఊరు వెళ్లిపోవడం, ఇలా ఎనిమిదేళ్ల కాలం గడిచింది. ఈ తిరగడానికి కారణ మేమిటో నేనే చెప్పలేను. ఏదో అన్వేషణ, నా హృదయంలో ఎవరినో కలుసుకోవాలని, ఎవరినో సంపాదించుకోవాలని, ఆ వ్యక్తికోసం అన్వేషణ ! గోపీ

పిన్ని రూపం అలా కన్పిస్తుండేది. వయస్సు వచ్చి కొత్త విషయాలు నేర్చుకున్నకొద్దీ, కొన్ని సంగతులు నా మనస్సులో మెదలుతూండేవి. గోపీ పిన్ని చాలా అందమైనది. మళ్లీ అటువంటి అందమైన స్త్రీ నాకు కన్పించలేదు. ఆమె వయస్సులో చిన్నది కావటంవలన, ముసలి భర్త ఆమెను సుఖపెట్టలేక పోతున్నాడేమో ననిపించేది. ఆమెకు తిండీ, బట్టా సమకూర్చవచ్చు అయున, కాని ఆమె వాంఛలు తీర్చగలడా ? శారీరకంగా వాంఛలు తీరకపోతే యవ్వనంలో ఉన్న స్త్రీకి గాని, పురుషుడికి గాని హిస్టీరియా వస్తుందంటారు. ఆమెకు దారుణమైన అన్యాయం జరిగిందని ఆమెను తల్చుకునప్పుడల్లా పరితపించేది నా హృదయం. అటువంటి స్త్రీ ఎక్కడైనా కన్పిస్తుందేమో, ఆమెకు నా సానుభూతి తెలియచెయ్యడం ద్వారా తృప్తి పొందగలనేమో ! నని ఆశించేవాణ్ణి !

''కాని, అనుకోకుండా హఠాత్తుగా ఒకరోజున ఒక యింట్లో అచ్చు అలాటి స్త్రీయే కన్పించింది. నా కళ్లను నేనే నమ్మలేకపోయాను. నా కప్పటికి ఇరవయ్యో యేడు నడుస్తోంది. అప్పుడు నేను చేసే వ్యాపారం పత్రికలూ, పుస్తకాలూ అమ్మడం. ఆ ఊరు నేను వెళ్లి రెండు నెలలైంది. ఒక పుస్తకాలషాపు యజమాని వద్ద ఆ ఉద్యోగం సంపాదించాను. నేను చేసిన అన్ని ఉద్యోగాల కన్నా, పుస్తకాలూ, పత్రికలూ అమ్మడం అంటే నాకు చాల సరదా. ఎందుకంటే, ఆ ఉద్యోగంలో పుస్తకాలూ, పత్రికలూ చదువుకోడానికి గల అవకాశమే నన్నాకర్షించేది. ఆ రోజుల్లో వెర్రిగా చదివేవాణ్ణి. నే చదివిన కథల్లోగాని, నవలల్లో గాని, గోపీ పిన్నంత అందమైన స్త్రీ గాని, అంత మంచితనం కలిగి, అంత దారుణం జరిగిన స్త్రీ గాని నాకు కన్పించలేదు. అనేక కథల్లో అనేక రకాల బాధలు పడ్డ స్త్రీలున్నారు. వాళ్లందరూ ఒక ఎత్తు, నా మనస్సులో ఉన్న గోపీ పిన్ని ఒక ఎత్తు. అటువంటిది, నేను పత్రికలమ్ముతూ ఒక యింటికి వెళ్తే ఆ యింట్లో ఆమె కన్పించింది. నేను హాలు కిటికీవద్ద నిలబడి 'పత్రికలు కావాలా?' అని అడిగాను. కుర్చీమీద కూర్చుని, ఎటో మొహం పెట్టుకున్న ఆమె చటుక్కున నావైపు తిరిగింది. ఆ కళ్లను చూసే సరికి నా శరీరంలో విద్యుత్తు ప్రవహించినట్లయింది. వాటిలో ఎంత ఆకర్షణో, ఎంత అమాయకతో, ఎంత మంచితనమో, చెప్పలేను. ఆమె వయస్సు 20 లోపు ఉంటుంది. చాలా అందంగా ఉంది. అచ్చు గోపీ పిన్నిలాటి రూపమే ఆమెది. నా మనస్సు సంతోషంతో పొంగిపోయింది. నా హృదయం ఎంతో వేగంతో కొట్టుకుంది. 'పత్రికలా ? ఏవీ చూస్తాను' అని లేచి వచ్చింది. నా దగ్గరున్న పత్రికలన్నీ చూసి ఒక వారపత్రిక తీసుకుంది. నేను ఆమెవైపు వెర్రిగా చూస్తున్నానని నాకు తెలియకుండావే చూశాను. ఆమె ఒక్క నిముషం నావైపు చూసి లోపలికి వెళ్లిపోయింది. ఆమె వెళ్లిపోయాక నాకు తెలివి వచ్చింది. ఆమె ఏమనుకుందో ? అని భయం వేసింది. ఒక నౌకరు కుర్రాడు వచ్చి డబ్బు లిచ్చాడు. నాకు డబ్బులు తీసుకోవా లనిపించలేదు. వద్దన్నాను. నా మనస్సు ఎంత హాయిగా, ఆనందంగా ఉందంటే, నాకు డబ్బులు తీసుకోడం తప్పులా కన్పించింది. నౌకరు లోపలికి వెళ్లిపోయాడు. కొద్దిసేపు ఆమె మళ్లీ హాలులోకి వస్తుందేమోనని చూశాను. హాలులో ఒక స్త్రీ పటం కన్పించింది. వికారమైన మొహం, ఎత్తు పళ్లూ, నల్లగా, లావుగా ఉండి, సుమారు నలభై ఏళ్ల వయస్సున్న స్త్రీ రూపం అందులో ఉంది. ఎక్కువసేపు ఆ పటంవైపు చూస్తే, ఆ వికారం నన్ను వెంట తరుము తుందేమో నని భయం వేసింది. కొద్దిసేపు చూశాక, ఆమె తిరిగి రాదని నిశ్చయించుకుని వచ్చేశాను. ఆరోజు నుంచీ ప్రతి రోజూ ఒకసారి ఆ వీథివెంట వెళ్తూండేవాణ్ణి, ఆమె కన్పిస్తుందేమోననే ఆశతో.

''ఆమెను ఒకసారి చూసిన దగ్గర్నుంచి నాలో ఏవో ఊహలు చెలరేగాయి. ఆమెతో స్నేహం చేసుకోవాలనీ, మాట్లాడాలనీ ఉండేది. ప్రతి వారం విధిగా వెళ్లి వారపత్రిక ఇచ్చి వస్తుండేవాణ్ణి కాని తరువాత మళ్లీ ఆమె కన్పించలేదు. నా మనసులోని ఆరాటాన్ని ఎవరితోనైనా చెప్పుకోవాలనిపించేది. ఆమెకు సాహిత్యమంటే ఇష్టం కాబోలు. పత్రికలు బహుశా చాలకాలంనుంచి కొంటూ ఉండి ఉండవచ్చు. ఆ రోజుల్లో నాకొక స్నేహితు డుండేవాడు. అతని కొక కిళ్లీకొట్టుంది. సుమారు రెండేళ్ల క్రితం అతను కూడా ఇంటింటికీ వెళ్లి పత్రికలూ, పుస్తకాలూ అమ్ముతూండేవాడు. తరువాత కిళ్లీ కొట్టు పెట్టుకుని, ఆ అమ్మకం మానేశాడు. అతనితో ఒక నాడు యాదాలాపనగా మాట్లాడుతూ, ఫలానా వీథిలో, ఫలానా ఇంట్లో పత్రికలు అమ్ముతూండేవాడివా ? అని ప్రశ్నించాను. దాని కతడు, 'ఓ. ఆవిడకు పుస్తకాలంటే మహా పిచ్చి. ఆవిడ చాలా మంచిదని అందరూ అంటారు. ఆమెని పొగడని వాళ్లు లేరు. కాని, పాపం, ఆవిడ భర్త మంచివాడు కాడు. ఎప్పుడూ ఆమెను హింసించేవాడని వినికిడి .... ' అని ఇంకా ఏంచెప్పాడో నాకు విన్పించలేదు. నాకు కావలసిన వ్యక్తి లభించింది. సరిగ్గా గోపీ పిన్నిలాటి వ్యక్తినే చూశాను. ఆ అందం, ఆ మంచితనం, ఆ అన్యాయాన్ని భరించి సహిస్తున్న కళ్లూ మళ్లీ చూశాను.

''అప్పటినుంచి నా భావనలో ఆ వ్యక్తి ఇరవైనాలుగు గంటలూ మెసిలేది. ఆమెను ప్రత్యక్షంగా చూడకపోయినా ఆమె రూపం, ఆమె మంచితనం, ఓర్పూ, అవన్నీ స్పష్టంగా

నా కళ్లముందర కదలాడుతుండేవి. ఒక్కణ్ణీ కూర్చుని, ఆమెతో మాట్లాడుతున్నట్టూ, ఆమె అందాన్ని ఆరాధిస్తున్నట్టూ, ఆమెయందు సానుభూతిని చూపిస్తున్నట్టూ ఊహించుకునే వాణ్ణి. ఆమె మంచితనం తల్చుకుని కన్నీరు కార్చేవాణ్ణి. ఆ అందం, అలా దుర్మార్గుడైన భర్త చేతిలో నలిగిపోవడం నాకు చాలా కష్టం కలిగించింది. ఏమైనా సరే, ఆమెకు నా సానుభూతి తెలియజెయ్యాల్సిందే ననుకున్నాను. నా శక్తినంతా ఉపయోగించి ఆమెకు జరుగుతున్న అన్యాయం నెదుర్కోవాలి. గోపీ పిన్నిని తిరిగి కలుసుకోలేను. కాని, ఈమెతో నా పరిచయం వృద్ధిచేసుకోవా లనుకున్నాను. ఆమెకు పుస్తకాలంటే చాలా ఇష్టం అని నా స్నేహితుడు చెప్పాడు. అందువల్ల వీలైనన్ని పుస్తకాలు తీసికెళ్లి ఆమె కివ్వాలని నిశ్చయించాను. పుస్తకాల ద్వారా ఆమె పరిచయం సంపాదించచ్చు. తరువాత క్రమముగా మా యిద్దరి మధ్యా స్నేహం పెరుగుతుంది. అప్పుడామె హృదయాన్ని నావైపు తిప్పుకొని, నా సానుభూతినామె స్వీకరించేట్టు చెయ్యొచ్చు. నాకు కావలసిన దంతేను.

''ఆ వారం పత్రికలతోబాటు, ఎన్నో మంచి పుస్తకాలు తీసుకుని ఉత్సాహంతో ఆమె ఇంటికి బయల్దేరాను. వాళ్ల ఇంటి తలుపు వేసిఉంటే గట్టిగా బాదాను. ఒక నౌకరు వచ్చి తలుపు తీశాడు. వాడు కొద్దిగా ముసలాడు., వెమ్మదస్తుడిలాగా కన్పించాడు. నెరిసిన తలా, ముడతలుపడ్డ మొహం, అతనికి కొద్దిగా చిన్న వయస్సులోనే సంప్రాప్తించినట్టున్నాయి. ''ఏం కావాలి ?'' అని అడిగాడు. పుస్తకాలూ, పత్రికా చూపించి అమ్మగారి కివి ఇవ్వాలనీ, ఆమె కావాలనీ అడిగాను. అమ్మగారింటో లేదనీ, బజారు కెళ్లిందనీ చెప్పాడు. 'అయినా ఆవిడగారి కెందుకీ పుస్తకాలు ? చదవడం వస్తేగా ?' అన్నాడు.

''వాడి అమాయకతకు నాకు ఆశ్చర్యం వేసింది. ''ఆమెకు ఈ పుస్తకాలంటే చాలా యిష్టం'' అన్నాను. వాడు తెల్లబోతూ 'అబ్బే ! ఆమె కసలు తెలుగు చదవడమే రాదు' అన్నాడు. అప్పుడు నేను, వాడు పొరబడుతున్నాడనీ, ఆమె మునుపు ఎన్నో పుస్తకాలు కొందనీ, నా దగ్గర వారపత్రిక కొందనీ చెప్పాను. దానికి కొంచెం ఆలోచించి, 'ఆ అమ్మగారు వేరు. ఆమె మా బాబుగారి మొదటి భార్య. మహ దొడ్డ యిల్లాలు. ఈవిడ రెండోభార్య. ఈమెదీ దేశం కాదు. తెలుగు కొంచెం మాట్లాడ్డం నేర్చుకుంది, గాని, చదవడం రాదు. మా బాబుగారు ఆవిడని మలబారు నుంచి తీసుకొచ్చారు' అన్నాడు. నౌకరు కాస్త సంస్కారం కల వ్యక్తిలా కన్పించాడు. పైగా కొద్దిగా బాతాఖానీ అలవా టున్నట్టుంది. అందుకని మెల్లిగా ఆమె విషయం మళ్లీ కదిపాను. 'పాపం వయసులో చిన్నావిడలాగుంది. బాబుగారు సరిగా చూస్తారా ?' అని అడిగాను.

''దానికి, 'ఓ ! ఆవిడెంత చెప్తే అంత ఆయనకు. ఆ మొదటి భార్యనే నానా కష్టాలు పెట్టారు. ఆ మహాతల్లి చనిపోయేదాకా అలాగే ఓర్పుతో భరించింది. ఇహ ఈవిడ వచ్చిన దగ్గర్నుంచీ, మా ప్రాణాలు తీసేస్తోంది. ఇంత గయ్యాళిని నే నెక్కడా చూడలేదు. మా అయ్యగారి కోపం అంతా ఏమైపోయిందో ఈవిడ ముందర పిల్లిలా ఉంటారు. ఆ భార్యను అంత కష్టపెట్టినాయన, ఈవిడను నెత్తిమీద పెట్టుకు పూజిస్తారు.' అన్నాడు. నాకు కొద్దిగా చెమట పోసింది. ఊపిరి పీల్చుకోవడం కష్టమైంది. మెల్లిగా, 'అయితే ఈమె పైకి కన్పించినంత మంచావిడ కాదా ?' అన్నాను. అతను తలూపుతూ 'అబ్బే ! వట్టి నీతి, జాతీ లేని మనిషి. మమ్మలి చూసి కళ్లల్లో నిప్పులుపోసుకుంటుంది. ఎక్కడో నీచపు వృత్తిలో బ్రతికిన మనిషిలాగుంది' అన్నాడు. తన మనస్సులోని అక్కసున్ని వెళ్లగక్కుతూ. 'అయితే మీ పాత అమ్మగా రెలా ఉంటారు ?' అని అడిగాను. హాలులో ఉన్న ఫోటో చూపించాడు. 'ఆమె మా పాతమ్మగారు. మనసు వెన్నలాటిది. పుస్తకాలూ, పత్రికలూ తెగ కొనేది. ఈవిడ కూడా అప్పుడప్పుడు ఆ పత్రికలలోని బొమ్మలు చింపి దాస్తుంది. కానీ ఆవిడకూ ఈవిడకూ సహస్రాంతం .... '. ఇక వినలేకపోయాను. ఎదురుగా ఫోటోలోని వికారం నన్ను తరుమగా బయటికి పారిపోయాను.

''అప్పటినుంచీ నే నటువైపు వెళ్లలేదు. వాస్తవం నన్ను మోసం చేశాక నా కల్పనే నాకు మిగిలింది. నా మనసులో నేను సృష్టించుకున్న వ్యక్తి, నన్ను ఇరవైనాలుగు గంటలూ వెంటాడసాగింది. నిజంగా అటువంటి వ్యక్తిని చూడాలని నాకు తహతహగా ఉండేది. కాని ఆమె నాకు లభ్యమౌతుం దనే ఆశ లేదు. నా ఊహల్లోని స్త్రీ క్రమంగా, నా కలంలో జీవం పుంజుకుని, నా నవలలో పాత్రగా పరిణమించింది. 'కరుణ' నవల వ్రాసి, ఆమెను నా భావనా ప్రపంచంలో సృష్టించుకొన్నాక గాని నాకు మనశ్శాంతి కలుగలేదు. మనస్సులోని తృష్ణకు, కల్పనవల్ల లభించిన శాంతే మనోరమ.''

అని ముగించారు సత్యశ్రీగారు.

# భావసమైక్యత - నాగరలిపి



## శ్రీ ఆర్. సత్యనారాయణ

ఐకమత్యం జాతికి సర్వస్వం. ఇది మనం ఎంతోకాలం నుండి చదువుతూ వచ్చిన, వింటూ వచ్చిన ఆర్యోక్తి. చదువుకున్న ప్రతి వ్యక్తికి, సంస్కారము గల ప్రతి పౌరునికి దీని అర్థం బాగా తెలుసు. కాని, ఈ ఐకమత్యమును కాపాడుకొనుటయందు ఎన్నెన్నో కష్ట నష్టములను ఎదుర్కొన వలసి వచ్చినది. మనం చిన్నతనములో గూడ రాజు—ముగ్గురు కొడుకులు, సింహము—ఎద్దులు మొదలైన కథలలో యీ యైకమత్యమును గూర్చి చదివి యుంటిమి. మరొకవైపు మనలో ఐకమత్యము లేదని, సుమారు 12 వ శతాబ్దము నుండి (క్రీ. శ. 1947 వరకు) భారతజాతి పరాధీనయై ఉన్నదని చరిత్ర చాటి చెప్పుచున్నది. ఐకమత్యమును గూర్చి ఎన్నెన్నో పుస్తకాలు చదివియున్నాం. ఎన్నెన్నో ఉపన్యాసములు ఆలకించి యున్నాము. కాని సుమారు 7 న్నర శతాబ్దములపాటు మనం దాన్ని సాధించలేక పోతిమి. పృథ్వీరాజు చౌహాన్ పతనమునకు ముందే మనలో అనైక్యత బీజములు నాటుకొన్నది. అప్పటి నుండి ఇంగ్లీషువారిని దేశంనుండి పారద్రోలు ప్రయత్నం ప్రారంభమయ్యే వరకు మనలో ఐకమత్యం లేకుండెననే చెప్పాలి. అంటే ఐకమత్యం సాధించడానికి సుమారు 700 సం॥ల సమయం పట్టినదన్నమాట. ఇంతకూ చెప్పవచ్చిన దేమంటే, ఐక్యత యనునది చెప్పినంత త్వరగను, చదివినంత శీఘ్రముగను సాధించబడదు.

ఈ 7½ శతాబ్దముల దీర్ఘకాలంలో సమైక్యతావాదులు తమ ప్రయత్నమందు అనేకమార్లు పరాభూతులైనారు. అవమానింప బడినారు. ఎన్నెన్నో యితరమైన కష్ట నష్టములకు గురైనారు. అనేక త్యాగములు చేసినారు. స్వాతంత్ర్య రక్షణకై లక్షల సంఖ్యలో తమ ప్రాణాలను గూడ కోల్పోయినారు. కొండ యనక—గుట్ట యనక, కానన మనక, రాత్రి యనక—పగలనక నిరంతరం బాధలకు లోనయ్యారు. ఈ విషయంలో మహారాణా ప్రతాపుడు అనుభవించిన కష్టములు స్వాతంత్ర్యప్రియుడైన ప్రతి భారతీయునికి తెలుసు. ఇట్లే వీర శివాజీ స్వాతంత్ర్య రక్షణకై సల్పిన కృషి గూడ తెలియనిదేమియు కాదు. అయినా వారి త్యాగశీలాన్ని గూర్చి తెలియజేయడం జరుగలేదు. చదువుకున్నవారు మాత్రమే - వారిలోనూ అందరునూ ఆ మహావీరుల త్యాగశీలాన్ని గురించి, స్వాతంత్ర్యాన్ని గురించి, దేశం కోసమై సల్పిన నిరంతర కృషిని గూర్చి తెలుసుకొనలేక పోయినారు. తెలిసికొన్నవారందరునూ వారి మహోన్నతాదర్శముల విలువను గుర్తించలేక పోయిరి. అందువలననే భారతజాతి సత్వరముగ మేల్కొనలేక పోయినది. అందువలననే పై మహావీరులు గతించిన కొన్ని శతాబ్దముల వరకు మనం పారతంత్ర్యమునందే మ్రగ్గిపోయినాము. అందువలననే మనలో ఐకమత్యం నెలకొనుటకు కొన్ని శతాబ్దముల సమయం కావలసి వచ్చినది. అందువలననే యీనాడు భావ సమైక్యత లోపించినది.

ఎందరెందరో వీరులు, మహాపురుషులు, దేశభక్తులు స్వాతంత్ర్యము, సమైక్యతల కొరకై తమ తమ జీవితాలను ధారవోసినట్లుగా చరిత్ర చెప్పుచున్నది. ఆ స్వర్గీయుల చిరస్మరణీయములైన త్యాగముల వలననే, ఆ త్యాగధనుల నిరంతర నిర్విరామకృషి వలననే భారతజాతి మేల్కొన్నది. సమైక్యతను, స్వాతంత్ర్యమును పొందగలిగినది. నేడు మనం అనుభవిస్తున్నది ఆ త్యాగధనుల సర్వస్వ సమర్పణా ఫలితమే. వారు దేశం కొరకై చేసిన బలిదానముయొక్క సత్ఫలితాన్నే నేడు మనం అనుభవించుచున్నాము.

స్వాతంత్ర్యము సిద్ధించిన పిదప దేశంలో అనేక సమస్యలు ఆవిర్భవించినవి. వాటిలో మనకు సంబంధించినది రాజభాష—లిపి. మన ప్రధాన మంత్రిగారు, బాపూజీ తలపెట్టిన ''హిందూస్తానీ'' ని 'రాజభాషగా' గా చేయ సంకల్పించినారు. కాని, వారి మాట నెగ్గక హిందీనే రాజభాషగా రాజ్యాంగ సభలో నిర్ణయించడం జరిగినది. ఈ భాషను వ్రాయుటకు ఉపయోగించెడి లిపినే రాజలిపిగా (దానిని ''నాగరిలిపి'' అంటారు.) స్వీకరించి రాజ్యాంగ చట్టమునందు పొందుపరచినారు.

దేశంలో ఎక్కువమంది హిందీ మాట్లాడువారున్నారనియూ, దేశములోని మిగిలిన ఆర్య భాషలకు హిందీకి ఎక్కువ సన్నిహిత సంబంధ మున్నదనియూ, అతి సులభమగు భాష యనియూ, ఉర్దూ—హిందీ ప్రారంభదశలో ఒకటిగానే యున్నందున హిందూ మహమ్మదీయుల సమైక్యతకు చక్కగా ఉపకరించగలదనియూ పెద్దలు ఆలోచించి దానిని 'రాజభాషగా' స్వీకరించినారు. ఇట్లు దాని నొక సింహాసనముపై కూర్చుండబెట్టిరే గాని, దాని యభివృద్ధికై తగిన విధముగా వాంఛనీయ మైనట్టియూ, గణనీయ మైనట్టియూ కృషి సలుపకుండిరి. పోస్టుకార్డుల మీదనూ, రైళ్లయందు, సైన్‌బోర్డుల మీదనూ వ్రాసినంత మాత్రమున హిందీ రాజభాష స్థాయికి చేరుకొనునా ? ప్రభుత్వ పరముగా హిందీ

యభివృద్ధికై జరిగిన కృషి ఏమాత్రమునూ చాలదు. ఇప్పటిలాగుననే దాని యభివృద్ధికై కృషి సాగించిన మరో రెండు శతాబ్దముల వరకు మన రాజభాష ఇంగ్లీషు స్థానమును యాక్రమించజాలదు. హిందీ మాతృభాషగా గల రాష్ట్రములయందే అధికార భాషగా దానిని వాడుటలేదు. ఇదియే దాని ఉన్నతికై తగినంతగా కృషి జరుగలేదనుటకు ప్రబల నిదర్శనము.

హిందీని రాజభాష సింహాసనముపై కూర్చుండబెట్టి తమ బాధ్యత పూర్తియైనట్లుగా చేతులు దులుపుకున్నారు పెద్దలు. గత రెండు మూడు సంవత్సరాలుగా మరొక స్లోగను వినబడుచున్నది. అదియేమన—భారత దేశంలో భావ సమైక్యత కావలయునన్న భారతీయ భాషలన్నిటికీ ఒకే ఒక లిపి ఉండవలెనని యనుట. ఏక—లిపిని ప్రవేశపెట్టి దాని ప్రతిపాదకులు దానికే దోషం పట్టించబోవుచున్నారో తెలియకున్నది.

ఏది ఏమైనా ఏక లిపి సిద్ధాంతం యొక్క సంభవాసంభవములను, ఉచితానుచితములను గూర్చి పరిశీలించుటే యీ వ్యాసకర్త ముఖ్యోద్దేశం. ఏక లిపి భారత్‌లో భావ సమైక్యతకై ఎంతవరకు తోడ్పడ గల్గుతుంది? అసలిది ఆచరణ సాధ్యమేనా? నాగిరిలిపిది సర్వలక్షణ సమన్విత రూపమేనా? ఇది అంతగా పరిణతి జెందిన లిపియేనా? మరి భావసమైక్యత ఎట్లు సాధించవచ్చు? దానికి ముఖ్యమైన మార్గము లెవ్వి? ఈ విషయాలను గూర్చే క్లుప్తంగా చర్చిద్దాం.

దేశంలోని సమైక్యతను భంగపరచు శక్తులు తలలెత్తడము చూచిన పెద్దల దృష్టి భావ సమైక్యతవైపు మళ్లినది. భాషా దురభిమానం (లభిమానం కాదు) ప్రాంతీయతత్త్వం, మత నిరపేక్ష దేశమైనప్పటికీ సంకుచిత మత దృష్టి మరొకమారు దేశంలో వ్యక్తమగుట, మాతృభూమి కంటెనూ వైయక్తిక స్వార్థ చింతన యధికమగుట—మొదలగునవి దేశ సమైక్యతను భంగపరచెడి శక్తులు. ఇప్పుడిప్పుడే తొంగిచూచుచున్న ఈ అవాంఛనీయమగు పోకడలను అరికట్టి సమైక్యతను చిరస్థాయిగా చేయవలెననెడి సాధ్య (లక్ష్య) సిద్ధికై సాధనంగా ఏక లిపి సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నారు మన నాయకులు కొందరు. ఈ విషయంలో వారి వాదన ఇది :

భారతీయభాష లన్నిటికి ఒకే ఒక లిపిని ఉపయోగించిన, దేశ పౌరులు మాతృభాషేతర భాషలను సులభముగా నేర్చుకోగలరు. అప్పుడు ఆయా భాషలలోని సాహిత్యమును చదివి అమృతం పొందగలరు. ఆయా భాషీయుల మనోగత భావ సంపత్తిని, ఆచార వ్యవహారములను, అలవాట్లను సవ్యముగా తెలిసికొన గలరు. ఈవిధముగా వివిధ రాష్ట్రముల యందలి పౌరులు పొరుగు రాష్ట్రముల ప్రజలతో సాన్నిహిత్యము—భావాత్మకముగా — యేర్పరచుకొనవచ్చును. ఒకరంటే మరొకరికి గిట్టని నైజము నశించిపోగలదు. పొరుగు భాషల వారితో, రాష్ట్రీయులతో సోదరభావమును నెరపుకొనవచ్చు. తత్ఫలితముగా తమ తమ సంకుచిత దృక్పథములను విడనాడి అందరము భారతీయులమనే భావమును పెంపొందించుకొనవచ్చు.

ఈ భావ సమైక్యతను గూర్చి విపులముగా చర్చించబోవు ముందు దీని విషయమై మనం చరిత్రను పరిశీలింపగా చూసిన 'లిపి' కి యీనాడు యిచ్చునంతటి ప్రాధాన్యత యెన్నడూ లేదు. అంటే లిపియే భారతీయ సమైక్యతను రక్షించిన లేక భక్షించిన ఒక్క నిదర్శనము గూడ కాగడా వేసి వెదకినను దొరకదు. దేశ సమైక్యతకు—ఏక లిపి సిద్ధాంతమునకు సంబంధమే లేదు, నా దృష్టియందు. ఇది యెట్లో మనం ముసుముందు చదువగలము.

కన్నడ తెలుగు లిపిని ఉదహరించి యేకలిపి సిద్ధాంతానికి—భావ సమైక్యతకు సంబంధ మెట్లు లేదో నిరూపించవచ్చు. తెలుగు లిపి చదువగల్గినవారు కన్నడ లిపిని (అది తెలిసినవారి సహాయంతో) ఇరువది నిముషములలో చదువగలరు. అది కూడ కన్నడ మాతృభాషగా గలవారు చదువగల్గినంత వేగముగా చదువవచ్చు. కేవలం లిపులకే గాక యీ రెండు భాషలకు గూడ సన్నిహిత సంబంధ మున్నది. తెలుగు కన్నడ భాషల చరిత్ర తెలిసినవారికీ విషయము తెలియనిది కాదు. మరి యింత పరస్పర సాన్నిహిత్యమున్నప్పటికీ (భాష—లిపులకు) తెలుగువారు యెందరు కన్నడము నేర్చుకోగలిగినారు? ఇట్లే కన్నడంవా రెందరు తెలుగు నేర్చుకోగలిగారు? ఇంతేగాక రాష్ట్రాల సరిహద్దు సమస్య వచ్చినప్పుడు ఒకరిపై మరొకరు అసంగతముగా విమర్శలు—ప్రతి విమర్శలు—ఆరోపణలు—ప్రత్యారోపణలు చేసుకొన్నారు. అట్లని తెలుగు నేర్చుకొన్న కర్నాటకీయులు, కన్నడము నేర్చుకొనిన తెలుగువారు లేనేలేరని గాదు. కాని, వా రందరును భావ సమైక్యత కొఱకై తమ మాతృభాషేతర భాషను నేర్చుకొనలేదు. కాగా, అది వారికి అలవడినది. ఎట్లు? సరిహద్దులలో రాష్ట్రంలో నున్న ప్రజలకు చిన్నతనమునుండే ఆ ప్రాంతములో నున్న భాషలన్నీ సహజంగానే అలవడును. ఆ భాషలన్నీ ఒకే భాషావర్గానికి చెందియుండ నవసర మేమాత్రమును లేదు. ఒరియా—తెలుగు, మరాఠీ—తెలుగు మాట్లాడు సరిహద్దు ప్రాంతములను యీ సందర్భములో ఉదహరించవచ్చు). మన పెద్దలు చెప్పే భావ సమైక్యత (ఏక లిపిని ప్రవేశ పెట్టినందున వచ్చెడిది) కనీసం యీ సరిహద్దు ప్రాంతములందైననూ యుండి తీరవలయును గదా!

ఇట్లే మరొక నిదర్శనము గూడ చూడవచ్చు. హిందీ మరాఠీలు ఆర్యభాషా వర్గానికి చెందినవే. లిపులలో గూడ ఒకటి రెండు అక్షరాలు తప్ప పూర్తిగా సామ్యత ఉన్నది. కన్నడ తెలుగు లిపుల కంటే, హిందీ మరాఠీ లిపుల మధ్య ఎక్కువ సామ్యత యున్నది. మరి హిందీ నేర్చుకున్న మహారాష్ట్రు లెందరున్నారు? మరాఠీ నేర్చుకున్న హిందీవా రెంద

# భావసమైక్యత - నాగరలిపి

రున్నారు ? అపవాద రూపంలోనూ, అభిరుచి మూలంగానూ ఒక్కొక్క భాషను లేక ఒకటి కంటే యెక్కువ భాషలను మరొక భాషీయులు నేర్చుకొనడము యీ సందర్భమున ఉదహరించజాలము. వారిని గణనలోకి తీసికొనరాదు.

మానవునిలోని మాతృభాషేతర భాషలను నేర్చుకొనవలెననెడి తహ తహను క్రొత్త లిపి యెన్నటికిని ఆటంకపరచ జాలదు. అభిరుచి యున్న యెందరో వ్యక్తులు, కవులు యితర దేశభాషలను గూడ నేర్చుకున్నారు. అదియును ఏవిధమైన వత్తిడికి లోనుగాకుండానూ, ఉన్నతోద్యోగముల ప్రలోభనము లేకుండనే జరిగినది. అట్టి యభిరుచి గలవారికి క్రొత్త లిపి యొక సమస్యగా పరిణమించలేదు. ఒక భాషతో మరొక భాషకు ఎంతో సన్నిహిత సంబంధ మున్నప్పటికీ ఆయా భాషీయులు మాతృ భాషేతర భాషలను నేర్చుకొనలేరని ముందు చెప్పితిమి. ఇందుకు కారణమేమి ? దీనికి సమాధానంగా నా స్వంత అనుభవాన్ని యిచ్చట పొందుపరచడం అనుచితము కాదనుకుంటాను.

నేను కన్నడోపాధ్యాయుల సాంగత్యములో మూడు సంవత్సరములు పనిచేసితిని. ఒకానొక రోజున కన్నడ దిన పత్రిక చదువ యత్నించితిని. నా సహోపాధ్యాయు లొకరు యిందు సాయపడినారు. 15 నిముషములలో చాలా వేగముగా కన్నడ లిపి చదువ గల్గితిని. కాని భాష మాత్రము మూడు సంవత్సరము లున్నప్పటికీ అలవడలేదు. మరి నాకు యెందుకు అలవడలేదా యని యెన్నోమార్లు ఆలోచించితిని. నాకు దీనికి ఒకే కారణం దొరికినది. ప్రస్తుతం జీవితంలో మానవునికి పూర్వకాలంలోవలె విశ్రాంతి లేదు. సమస్యలు లెక్కకు మించి వచ్చి పడుచున్నవి. తత్ఫలితముగా మానవుడు యాంత్రికముగా పనిచేయుచున్నాడు. ఒక క్రొత్త భాషను నేర్చుకొనుటకు తగిన తీరిక యెక్కువమందికి లేకుండ పోయినది. ఒక క్రొత్త భాషను నేర్చుకొనే సమయ మున్నవారికి క్రొత్త లిపి నేర్చుకొనడ మొక సమస్య యెన్నటికీ కాజాలదు.

భారతవర్షమునందలి అత్యాశ్చర్యకరమగు విషయము భిన్నత్వములోని యేకత్వము. విదేశీయులు గూడ భారతదేశములోని యీ అద్భుతమును వేనోళ్ల ప్రశంసించినారు. ఈ భిన్నత్వములోని ఏకత్వము యీనాటిది కాక తరతరములనుండి వచ్చుచున్నటువంటిది. ఇచ్చట ఒకే రాష్ట్రమునందు వివిధములైన ఆచార వ్యవహారములు, నమ్మకములు, రకరకములైన కట్టు బొట్టు జుట్టు గలవారు ఉన్నారు. అయినను ఐకమత్యమునకు యివేమియు ఆటంకములు కాలేదు. ఇచ్చటనే హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు, క్రిస్టియనులు, బౌద్ధులు, జైనులు—వివిధ మతములకు చెందినవారు ఉన్నారు. ఇచ్చటనే, యీ పవిత్ర ఆధ్యాత్మ ప్రధానమైన పుణ్యభూమియందే చార్వాకులు లాంటి నాస్తికులు జన్మించినారు. దేశంలోని విభిన్న మతముల మధ్య ఎన్నెన్నో ఘర్షణలు వచ్చినవి. ఒక మతస్థుడు మరొక మతస్థుని వైయక్తిక శత్రువుగా భావించినాడు. కాని దేశములోని ఐకమత్యం యెన్నడునూ చెడలేదు. క్రీస్తుశకం మొదటి సహస్రాబ్దమునందు వివిధములైన పర జాతులు భారతావనిలో ప్రవేశించినవి. ప్రారంభములో ఘర్షణలు జరిగినప్పటికిని క్రొత్తగా వచ్చిన జాతులు మెల్లి మెల్లిగా దేశ సమైక్యతకే పాటుబడినవి. ఇక్కడికి వచ్చి యిక్కడి వారితో కలసి మెలసి పోయినవి. తమ సభ్యత కొరకు ప్రత్యేక వ్యక్తిత్వము, తమ సంస్కృతి కొరకు ప్రత్యేకమైన అస్తిత్వమును వారాశించి యుండలేదు. అట్లే యిచ్చటి వారునూ నవాగతుల యొక్క ఆచార వ్యవహారములలోని మంచిని సహృదయములో స్వీకరించారు. (కాని, మహమ్మదీయుల విషయంలో మాత్రం కాదు.) ఇట్లు భారతావనికి వచ్చిన జాతులు విభిన్నములైనప్పటికీ అందరు కలసి మెలసి పోయినారు. అందువల్లనే యిప్పటి సభ్యత—సంస్కృతి "హిందూ సభ్యత—సంస్కృతి" గా కాక "భారతీయ సభ్యత—సంస్కృతి" గా చెప్పబడుచున్నవి. మన దేశము "హిందూ దేశము" గాక "భారత్" యనబడు చున్నది. (మహమ్మదీయులు మాత్రం మత ప్రచారానికై యిచ్చటకు వచ్చి దేశానికి అధిపతు లైనారు. తమ మతమే సర్వ శ్రేష్ఠమన్నారు. అందువలననే యిక్కడి వారిలో నీర క్షీరం వలె కలిసిపోలేక పోయినారు. దాని ఫలితము మనకు సుస్పష్టముగా కనిపిస్తున్నది—పాకిస్తాన్.)

ఇట్లు దేశ చరిత్రయందు భిన్నత్వములో ఏకత్వము గోచరిస్తున్నది. ఈ భిన్నత్వ మనునది క్రీస్తు పూర్వము నుండి భాషల విషయమందును సుస్పష్టము. ఇట్లే దేశములో అనేకమైన లిపులు గూడ కనీసం, క్రీస్తు పూర్వము నుండియే కన్పించుచున్నవి. అయితే ఆనాడు యిప్పుడున్నన్ని లిపులు భాషలు లేవన్నది నిర్వివాదం. అయినను అన్ని రంగముల యందును దేశములో భిన్నత్వము యున్నట్లుగా చరిత్ర చెబుతున్నది. అలాంటప్పుడు యీ విషయంలో ఉన్న విశేషత్వమునకు యీనాడు మనము యెందుకు తిలోదకములు యివ్వాలి ?

ఇంతే కాకుండా, ఈనాడు మనం ఏకలిపి సిద్ధాంతమును స్వీకరించి అమలు జరిపినచో తాళపత్ర గత వాఙ్మయమంతయు కొంతకాలమునకు వెలికి రావడము అసంభవమయి పోగలదు. దీర్ఘకాల పరిశోధనలు యిప్పటివరకు ప్రాచీన గ్రంథముల నన్నిటినీ పరిష్కరించి ప్రచురించలేక పోయినవి. ప్రతి భాషయందును సుమారు కొన్ని వేల గ్రంథములు యిప్పటికీ అపరిష్కృతముగాను, అప్రచురితముగాను ఉండిపోయినవి. ప్రస్తుతానికే ప్రాధాన్యత నిస్తున్న ప్రస్తుత కాలమందు ప్రాచీన కాలంలో యేమి జరిగినదో, దాని మంచి చెడ్డలను గూర్చి యోచించు అవకాశమే లేకుండా పోవు చున్నది. మానవుడు యంత్రంవలె పని చేయాల్సిన సమయం ఆసన్న మగుచున్నది. అలాంటి సమయములో కాలగర్భంలో కలసిపోయిన లిపులను గురించి (ఏక లిపి సిద్ధాంతాన్ని ఆచరణలోకి తెచ్చిన మిగిలిన లిపులన్నియు కాలగర్భంలో కలసిపో

గలవు) (శమపడునంతటి ఓర్పు, శక్తి, తీరిక యెట్లు ఉండ గలవు ?

ఏక లిపిని స్వీకరించినందున మరొక నష్టము కష్టము కూడ ఉంది. అది ఉచ్చారణకు, పరిశుద్ధముగా (వాయుటకు సంబంధించినది. భరతవర్షములోని లిపు లన్ని టికి ఒకే అక్షరమాల కాదు. ఒకేవిధమైన ధ్వని సంకే తాలు లేవు. తెలుగుభాషయందు 56 అక్షరములున్న, మరొక భాషయందు 40 అక్షరములే యుండవచ్చు. మరొక భాష యందు యింకా తక్కువ యుండవచ్చు. మరి యెక్కువ సంఖ్యలో ధ్వని సంకేతాలున్న లిపి యొక్క గతి యేమి కావాలి ? ఏకలిపిగా స్వీకరింపబడ బోయెడి లిపియందు లేని ధ్వని సంకేతములు, అంతకంటెను చిన్న లక్షరమాం గల లిపి యందు గూడ ఉండవచ్చు. ఉదాహరణకు మనం నాగరి లిపినే తీసుకొందము. ఈనాడు మన పెద్దలు దానినే గదా యేక లిపిగా స్వీకరించవలె ననడం. తెలుగు లిపిలో దానికంటె యెక్కువ ధ్వని సంకేతములు (అక్షరములు) ఉన్నవి. మరి తెలుగుభాషను నాగరి లిపిలో (వాయడ మెలా ? దీనికి ఏక లిపి వాదులు నాగరి లిపిలో ధ్వని సంకేతములను పెంచవచ్చు నందురు. ఇది అసంభవము, ఆచరణీయము కాదని నే నంటాను. అది యెట్లు అసంభవమో మనం నాగరి లిపిని గూర్చి చర్చించునప్పుడు చూడగలము. విభిన్న లిపుల యందు విభిన్న ధ్వని సంకేతములుండునని పైన చెప్పితిమి గదా ! తదను సారముగా విభిన్న ఉచ్చారణలును యేర్పడినవి. తమిళులది ఆంధ్రులది ఉచ్చారణ ఒకటే కాదు. అట్లే మహారాష్ట్రులది వంగభాషీయులది ఒకేవిధంగా ఉండదు. ఇట్లు ఒక భాష లోని ఉచ్చారణకు, మరొక భాష యందలి ఉచ్చారణకు చాల భేద మున్నది. మరి ఏకలిపి సిద్ధాంతానికి కట్టుబడినప్పుడు యీ విభిన్న మైన ఉచ్చారణలు ఆ లిపియందు యెట్లు సంభవము కాగలదు ?

ఈ విషయములో నా స్వానుభవము నొక దానిని పేర్కొన డము అనుచితము కాదనుకుందును. మేము కాశీ, హిందూ విశ్వవిద్యాలయమునందు అధ్యయనము చేయు సమయమున రష్యా నుండి ఒక విద్వాంసుడు వచ్చినాడు. ఆయన మాస్కోలో (ప్రాచ్యభాషల విభాగమునకు అధ్యక్షులట. వారు హిందీలోనే ఉపన్యసించిరి. ఆ ఉచ్చారణ ఎం. ఏ (ఫైనలు) చదువుతున్న మాకే త్వరగా అర్థం కాలేదు. మరొక విషయ మేమన రామాయణమును గూర్చి (పసంగించుతూ ''సీత'' (నాగరి లిపిలో ''సీతా'' (వాయుదురు.) యనుటకు బదులు ''సీతే'' అన్నారు. నే నిప్పుడు ఆయన తప్పులను యెన్నడము లేదు. చెప్పవచ్చిన విషయ మేమన హిందీని నాగరి లిపిలోనే చదివి నేర్చుకొన్నవారు తన మాతృభాష లిపి (పభావమును (త్రోసి రాజనలేక పోయిరి. మరి తమ తమ మాతృభాషలను నాగరి లిపిలో నేర్చుకొనెడి యితర భాషీయుల గతేమి కాగలదో !

సమస్త భారతీయ భాషలకు 'ఏకలిపి' ని వాడవలె ననడములోని యుద్దేశ్యం నాగరి లిపికి ఆ పీఠాన్ని కట్టి పెట్టా లనడమే. నాగరిలిపిలో ఆసక్తి లేదని, తెలుగు లిపి ముందు ఆదెందుకును పనికిరాదని లోగడ చెప్పి వచ్చితిమి. మరి యీ విషయమందు ఏకలిపి వాదుల (నాగరిలిపి వాదుల) వాద మెద్ది ?

ఈ వాదులలో కొందరు నాగరిలిపి యందలి అక్షర ముల సంఖ్యను పెంచమంటున్నారు. మరికొందరు (పస్తుత మున్న అక్షరముల పైనను, (కిందను, (పక్కను కొన్ని చిహ్నములను గుర్తించి పని జరుపుకొనవచ్చు నంటున్నారు. ఈ సూచనలు ఎంతవరకు ఆచరణసాధ్యములో మనం పరిశీ లించుదము.

లిపి యనునది సర్వ సామాన్య సులభముగను అన్ని విధములయిన ఉచ్చారణలను (పకటింపగల్గినదిగాను యుండాలి. నాగరిలో యితర భారతీయ లిపులలో ఉన్న అనేక లక్షర ములు లేవని పూర్వమే చెప్పినాము. మరి యితర భాషలను నాగరి లిపిలో (వాయవలె నన్నను, ఉచ్చరించవలయు నన్నను చేయవలసిన దేమి ? ఇందుకు రెండు మార్గములు సూచించ బడు చున్నవని లోగడనే పేర్కొని యుంటిమి. అక్షరముల సంఖ్యను ఎంతవరకు పెంచవలయును ? నాగరి లిపిలో లేని యితర లిపులలో యున్నట్టి అక్షరముల నన్నిటిని తీసికొన వలయును గదా ! భారతదేశపు (పతి లిపి నుండి ఒకటి రెండు లక్షరముల నైనను (గహించవలసి యుండును. అట్లు చేసిన నాగరి యక్షరముల సంఖ్య సుమారు 70—75 వరకు పెరుగ గలదు. అక్షరముల సంఖ్యాధిక్యత యేలిపికిని వాంఛ నీయము కాదు.. ఎందుకన, అక్షరముల సంఖ్య పెరిగిన కొలది అది జనసామాన్యమునకు అందుబాటులో యుండదు. అట్టి సమయమున ఏకలిపిని (పవేశ పెట్టుటచే కలిగెడి లాభమెద్ది ?

అక్షరముల సంఖ్యను పెంచకుండగనే నాగరి లిపిని ఏకలిపిగా (పవేశ పెట్టెద రందురా ? లేదు, ముమ్మాటి కినీ లేదు. నాకు మాత్రం యీ విషయమందు యిసు మంతయు విశ్వాసము లేదు. ఎందుకనగా, యేవిధమైన వత్తిడి లేకుండగనే హిందీవారు ఉర్దూ యందలి క, గ, జ, ఫ మొదలగు యక్షరములను, అట్లే యిగ్లీషు యందలి ఆ, కా మొదలగు ధ్వనులను వాటి (కిందను, పైనను కొన్ని చిహ్న ములను గుర్తించి వేరు అక్షరములుగా లెక్కించుచున్నారు.* మరి యిది (పజాస్వామిక యుగం. (పతి రంగమునందును (పజలు తమ పలుకుబడిని ఉపయోగించుచున్నారు. అట్లే తమ తమ లిపులలోని ఒకటి—రెండు యక్షరముల నైనను పున ర్నిర్మాణము జెందెడి నాగరి లిపియందు చొప్పించమని రాయ బారములు వెళ్లవచ్చును. అట్లు స్వీకరించని పక్షమున వేరు వేరు లిపులవారు నాగరిని ఏకలిపిగా స్వీకరించమని యందురు. ఈనాడు దక్షిణ రాష్ట్రీయులలోని హిందీపట్ల మున్న వ్యతిరే కతను తగ్గించుటకై హిందీ వాదులు ఒకానొక దక్షిణాది

* చూడుడు : హిందీ భాషా కా ఇతిహాస్—డాక్టర్ ధీరేంద్రవర్మ.

భాషను అనివార్యముగ చదువవలసి యుండునని చెప్పుటలేదా! ఇట్లు అక్షరమాల సంఖ్యను పెంచిన నాడు నాగరి భారమయమై అభివృద్ధికి బదులు పతనావస్థకు చేరుకోగలదు.

రెండవ మార్గము అక్షరముల సంఖ్యను పెంచకుండగనే ప్రస్తుత మున్న యక్షరముల క్రిందనో, ప్రక్కనో, పైననో కొన్ని గుర్తులను ఏర్పాటు చేయుటకు సంబంధించినది. నా దృష్టిపథమందు ఇది మొదటి మార్గముకంటెను నిరుపయోగకరమైనట్టిది. ఉర్దూ లిపి తెలిసిన వారికి యీ విషయం వేరుగా చెప్ప నవసరములేదు. ఉర్దూ లిపియం దనేక బిందువు లుండును. "అలీఫ్" యనెడి ప్రథమాక్షరమునకు మూడు గుర్తు లున్నవి. వాటిలో ఒకటి 'ఉ' కారమునకు, మరొకటి 'అ' కారమునకు, ఇంకొకటి 'ఇ' కారమునకు ప్రత్యేకించబడినవి. 'ఇ' కారము గుర్తు వదలిన, అది 'ఉ' కారము కావచ్చు లేక 'అ' కారము కావచ్చును. ఎందుకన 'అలీఫ్' యనెడి అక్షరము వెంట పై జెప్పిన గుర్తులు సర్వ సామాన్యముగా వాడరు. అందువలన క్రొత్తగ నేర్చుకొనువారు 'ఇన్' కు బదులు 'ఉన్' లేక 'అన్' యని గూడ చదువవచ్చును. ఇట్లే బిందువుల విషయంలో గూడ పొరబాటున ఒక్క బిందువును మరచిన అర్థము అనర్థమై పోగలదు. చిహ్నముల మార్గము నవలంభించినప్పుడు నాగరికి కూడ ఉర్దూకు పట్టిన గతి పట్టగలదు. "చదువవేసిన ఉన్న మతి పోయినట్లు" కాగలదు.

ఈనాడు ఇంగ్లీషును సక్రమంగా ఉచ్చరించుటకై యిలాటి గుర్తులనే (నిఘంటువులయందు) ఉపయోగిస్తున్నారు. వీటిని యెందరు తెలిసికొన గలుగుచున్నారు? ఇంగ్లీషు భాషను కొంతవరకు సాధించినవారికి మాత్రమే యివి ఉపయోగపడుచున్నవి గాని, క్రొత్తగ, స్వయముగ నేర్చుకొనువారికి మాత్రం యీ చిహ్నములు నిరుపయోగములే. అందువలననే 150 సం. లు రాజ్యమేలి, రాజభాషగా ఉన్నప్పటికీ, నిన్న మొన్న పుట్టి ప్రచారితమైన హిందీని నేర్చుకొన్నంత మంది దక్షిణ రాష్ట్రాలలో యింగ్లీషు నేర్చుకున్నవారు లేకపోయిరి. చిహ్నములను, బిందువులను ప్రవేశపెట్టి నాగరి లిపిని ఏక లిపిగ బలవంతముగ యితర భాషీయులపై రుద్దిన కొద్ది కాలమునందే యది యపఖ్యాతి పాలు కాగలదు. దానిలో యీనాడు ఉన్న సరళత్వమును, కోమలత్వము మటు మాయమై పోగలవు.

క్లుప్తముగా చెప్పదలచిన, ఏకలిపి సిద్ధాంతము భారతీయ భాషలకు అనుకూలించదు. భారతదేశమందలి (భాషలు) లిపు లన్నియు రమారమి ఒకటిగనే యభివృద్ధి చెందినవి. భారతదేశమునందలి యే ఒక్క లిపి యందును భారతీయ భాషల నన్నిటినీ సక్రమముగా వ్యక్తపరచెడి శక్తి లేదు. ఆ శక్తి యేకొంచెమైనను యున్నదనిన అది ఒక్క తెలుగు లిపి యందే కలదు. పూర్వకాలములో మన దేశమునందు యిన్ని భాషలు లేవు. ఇంతగా అభివృద్ధియు చెంది యుండలేదు. అట్లే యిన్ని లిపులును లేవు. ఏ 4—5 ఉన్నను యిప్పటివలె సమృద్ధిగ లేవు. అందువలననే ఆ కాలమందు సంస్కృతము అవికసితములైన భాషలలో సర్వోపరియై యలరారినది. నాగరిలిపి లేక దీని ప్రాచీన రూపము విషయమందును యిట్లే జరిగినది. కాని, యీనాడు పరిస్థితులు మార్పు చెందినవి. అనేకమైన లిపులు ప్రచారము లోనికి వచ్చినవి. వాటిలో కొన్ని నాగరి కంటెను విశాలములైనవియు, వైజ్ఞానికము లైనవి గూడను. ఇంతేగాక యీనాడు బలవంతముగ యే భాషను, యే లిపిని, మరొకరికి అంటగట్టజాలరు.

ఇక భావ సమైక్యత విషయం—దానిని గూర్చి లోగడ కొంత చర్చించితిమి గదా! దేశంలో భావసమైక్యతకై లిపి నొక సాధనముగా యెన్నడును ఉపయోగించలేదని చరిత్ర చెప్పున్నది. ప్రస్తుత పరిస్థితుల్లో ఏక లిపికి అంతగా ప్రాధాన్యత యివ్వడం విజ్ఞత కాజాలదు.

---

మ. ఉదయ్యత్ప్రాణ విహారమై విహిత వర్ణోద్య ద్విభక్తి క్రియా
సదనంబై సదలం కృతి ప్రభవమై సద్వ్యాకమా వాసమై
విదితార్థాకరమై ప్రసన్నపదమై వృద్ధశ్రవో వైభవా
స్పదమై రాజును బోలె ప్రాలువలదా పద్యంబు హృద్యస్థితిన్.

# పిసినిగొట్టు



శ్రీమతి డి. ఎమ్. లత

రామనాథం పేరు మీరు వినివుండరు.. ఆమాటకొస్తే ఆయన్ను నేను మాత్రం ఎరుగుదునా? ఆయన తనకు తాను వచ్చి 'నాపేరు ఫలానా' అని చెప్పుకున్నాడు. ఆరు నెలల క్రితం ఆయన బంధు వెవరో నా దగ్గర చికిత్స పొంది ఆరోగ్యవంతు డైనాడట ! ఆయన సలహా మీదనే నా వద్దకు వైద్యం చేయించుకొనడానికి వచ్చాడట !

''మీకు జబ్బేమిటో చెప్పారుకాదు !'' లని లడిగాను.

రామనాథం చేతులు రెండూ జోడించి నమస్కరిస్తూ—''అయ్యా ! మీరు ఫీజు ఎంత తీసుకుంటారో తెలవియ్యాలి'' అని అడిగాడు.

''పది రూపాయలు !''

''బాబోయ్ ! పది రూపాయలే ! అంత యిచ్చుకోలేను డాక్టర్‌గారూ ! కనికరించి ఫీజు కొంచెం తగ్గించాలండీ !''

''అంత ఫీజు ఇచ్చుకోలేనంత బీదవాళ్లయితే నా కసలు ఫీజే యివ్వ నవసరంలేదు ! సరేనా ?''

రామనాథం మొహం ఒక్కసారిగా విప్పారింది ! ఆ తరువాత ఏమడగాలో తెలియక గాబోలు—మీసాలు సవరించు కున్నాడు.

ఇంతలో నేను మరొక రోగిని పరీక్షించడంలో మగ్నమైపోయాను. ఆ తరువాత కొంతసేపటికి అలన్ని బయటికి పంపించివేశాను. నేను రామనాథంవైపు చూశాను.

''అయ్యా డాక్టరుగారూ ! మా గుడివాడలో కూడా ఎం. బి. బి. ఎస్. చదివిన డాక్టర్లున్నారండి. అయినా నేను వాళ్ల దగ్గరకు వెళ్లకుండా బస్సుకు రూపాయిన్నర ఖర్చు బెట్టుకుని ఇక్కడికి వచ్చానండి. భోజనానికి, కాఫీ, రిక్షాలకూ అప్పుడే అయిదు రూపాయలు ఖర్చయిపోయాయండి. ఇంటికి చేరుకునేప్పటికి మరొక అయిదు రూపాయలన్నా ఖర్చవుతా యండి. కనుక మీకు నేను రెండు రూపాయల కంటె ఎక్కువ ఫీజు యిచ్చుకోలేనండి !'' అని అన్నాడు రామనాథం, నావైపు తిరిగి.

''మీకంత తాహతు లేకపోతే ఆ రెండు రూపాయలు కూడా నా కివ్వ నవసరంలేదు.''

''మీ దగ్గర వైద్యం చేయించుకున్న మా ఊరి గుల్లా నరసయ్యగారి కిష్టయ్య—మీరెంతో మంచివారని చెప్పాడండి. రోగులు ఎంత యిస్తే అంత మారు మాట్లాడకుండా తీసు కుంటారట !''

''అన్ని వస్తువుల ధరలు యిలా ఆకాశాన్ని అందు కుంటూ ఉంటే—ఏదో ఒకటి తీసుకొనకపోతే గడిచే దెలాగూ?''

రామనాథం బిగ్గరగా నవ్వాడు.

''అవునండీ ! ఎలా గడుస్తుందండీ ? ఎంత చెట్టు కంత గాలి ! .... నాకూ ఏదో కాస్త పొలం, పుట్రా ఉన్న దనుకోండి. పంటలు ఈ సంవత్సరం బాగానే పండినాయి. ధాన్యం ధరలు కూడా ఫరవాలేదు. అయితే .... ''

రామనాథం ఇంకేమేమో చెప్పబోయాడు. కాని, అప్పుడే నా పరిచితు డొకాయన గాభరాగా లోనికి ప్రవేశించాడు. అతని భార్యకు చాలా ప్రమాదంగా ఉన్నదట !

''మీ రిక్కడే కూర్చోండి. ఇప్పుడే వచ్చేస్తాను'' అని రామనాథంతో చెప్పి—బయటికి వెళ్లిపోయాను.

నేను గంట తరువాత గాని తిరిగి రాలేకపోయాను. రామనాథం అలాగే కూర్చొని ఉన్నాడు. వసారాలో మరొక స్త్రీ కూడా కూర్చొని ఉన్నది. ఆమె ముక్కు బాగా వాచింది. రెండు కళ్లూ బాగా ఎర్రగా ఉన్నాయి. మొహంమీద ఖాళీ లేకుండా చిన్న చిన్న కురుపు లున్నాయి. నన్ను చూసి ఆ స్త్రీ లేచి పక్కకు ఒదిగి నిలబడింది.

''అయ్యా ! డాక్టరుగారూ ! నేను మీకు ఐదు రూపా యలు ఇచ్చుకుంటానండి. ఇక పోతే నా జబ్బు విషయం ....''

రామనాథంమీద నాకు చెప్పలేనంత కోపం వచ్చింది. కాని, నా కోపాన్ని లోలోపల దిగ మింగుకొని ''అయితే మీరు ఐదు రూపాయలకంటె ఎక్కువ యిచ్చుకోలేరన్నమాట !'' అని అన్నాను, నవ్వుతూ !

రామనాథం కూడా వచ్చాడు.

"అయ్యా, డాక్టరుగారూ! మాది కూడా బొండపాడే నండి. గుత్తా నరసయ్యగారు మా బంధువేనండి. మరి మీరు ఫీజును మరికొంచెం మాఫీ చేయించాలి."

నేను మారు మాట్లాడలేదు. నవ్వి ఊరుకున్నాను. నేను మాట్లాడకపోయేప్పటికి రామనాథం ఏమనుకున్నాడో ఏమో—"పరే, డాక్టరుగారూ! ఫీజు ఆరు రూపాయలు యిచ్చుకుంటానండి!" అని చెప్పి ఆరు రూపాయలు ఒక్కొక్కటే లెక్కబెట్టి నాముందు ఉంచాడు.

"మీ జబ్బు ఏమిటో చెప్పండి!"

రామనాథం తన జబ్బును గురించిన వివరాలు చెప్పాడు. అతను చెప్పిన వివరాలను విన్నమీదట—రామనాథానికి అతి మూత్రవ్యాధి ఉన్నదని తెలుసుకున్నా. మూత్రం పరీక్ష చేశాను. షుగర్ చాలా పోతున్నట్టు తేలింది.

"ఆహారం విషయంలో మీరు ముందు వెనుకలు చూడ రనుకుంటాను!"

"అవునండి! నాకు తిండి విషయంలో ఎటువంటి పట్టింపులూ లేవండి. నా చిన్నతనంలో తిండిలేక అనేక బాధలు పడ్డానండి. ఇప్పటికి భగవంతుడికి నామీద అనుగ్రహం కలిగింది. ముప్పూటలా లేదనుకోకుండా యింత తినగలుగుతున్నాను. తిండికి తిమ్మరాజు నేననుకోండి."

"మీరు తిండి తగ్గించాలి. ఎక్కువ తినడంవల్లనే మీకీ జబ్బు వచ్చింది."

"తిండి తగ్గించమంటారా? అదెట్లాగండీ డాక్టరుగారూ? .... నా చిన్నప్పుడే మా తండ్రి చనిపోయాడండి. ఉన్న ఆస్తి అమ్మి అప్పులు తీర్చానండి. ఆ తరువాత తినీ, తినక ఎంతో కష్టపడి దమ్మిడి దమ్మిడీ చొప్పున నిలవచేశాను. ఇప్పటికి పరిస్థితి మెరుగయిందండి. మీ దయవల్ల ఇంత పొలం పుట్రా, గొడ్డూ గోదా ఏర్పడ్డాయండి. తిండికి లోటు లేకుండా గడిచిపోతున్నదండి. ఇప్పుడు నన్ను తిండి మానేయమంటే ఎలాగండీ?"

"తప్పదు మరి! కొన్ని రోజులు జాగ్రత్తగా ఉండాలి. పంచదార, అన్నం, బంగాళాదుంపలు—వీటిని ముట్టుకోరాదు."

"ఇవి లేకపోతే ఎలాగండీ?"

"ఏం ఫరవాలేదు. ఇంజెక్షన్ ఇవ్వాలి. పైగా రక్తం కూడా పరీక్ష చెయ్యాలి—మీ రక్తంలో ఎంత పంచదార ఉన్నదో చూడాలి."

"రక్తంలో కూడా పంచదార ఉంటుం దేమి టండీ?"

"ఉంటుంది. రక్తంలో పంచదార ఎక్కువగా ఉంటేనే మూత్రంద్వారా బయటికి వస్తుంది."

"ఓహో! అలాగటండీ!"

రామనాథం మీసాలను సవరించుకుంటూ—"అంటే—ఇంకా నాకు చాలా ఖర్చు ఉన్నదన్నమాట!" అని అన్నాడు.

"అవునవును. రక్తం పరీక్ష చెయ్యాలంటే పదహారు రూపాయ లవుతాయి. పైగా ఇంజెక్షన్ల ఖర్చు అదనం. వీటితోపాటు పథ్యంగా ఉండాలి."

రామనాథం లేచివచ్చి నా రెండు చేతులూ పుచ్చుకొని—"డాక్టరుగారూ! రక్తం పరీక్ష చేసినందుకు ఫీజు ఎనిమిది రూపాయలు తీసుకోండి. అంతకంటే ఎక్కువ నే నిచ్చుకోలేను. కనికరించాలి. నేను ముందే చెప్పాను కదండీ—ఆ గుత్తా నరసయ్య మా బంధువేనండీ!"

చివరకు కనికరించక తప్పలేదు.

రక్తం తీసుకొని రామనాథంతో—మధ్యాహ్నం రమ్మన్నాను. రక్తం పరీక్ష చేసిన తరువాతనే చికిత్స ఆరంభించాలన్నాను.

అంతవరకూ వసారాలో నిల్చున్న ఆ స్త్రీ నా గదిలో ప్రవేశించి—"అయ్యా! డాక్టరుగారూ! నన్ను రక్షించాలి!" అని కాళ్లమీద పడింది.

"కాళ్లు వదులు! విషయ మేమిటో చెప్పు! ఏదీ మొహమిలా తిప్పు!"

ఆమె మొహం పరీక్షగా చూశాను. రామనాథం కూడా అతి శ్రద్ధగా ఆమెను పరిశీలిస్తున్నాడు.

"ఈ జబ్బు నయంకావాలంటే చాలా డబ్బు ఖర్చవుతుంది. మరి భరించుకోగలవా?" అని అడిగాను ఆ స్త్రీని!

ఆమె పమిటచెంగు లోపలినుంచి వెండి కడియాలు రెండు తీసి నా ముందు ఉంచింది.

"నా దగ్గరున్న ఆస్తి యిదేనండి! ఇవి తీసుకొని నా జబ్బు ఎలాగైనా నయం చేయండి డాక్టరుగారూ!"

"ఈ కడియాలు నేనేం చేసుకోను? నువ్వు నాకేమీ యివ్వ నవసరంలేదులే! మందుల ఖర్చు మాత్రం భరించుకో!"

"మందులు ఎంతవుతాయండి?"

"ఏభై రూపాయల మందులు కావాలి. పైగా రక్త పరీక్ష కూడా చేయించుకోవాలి."

"రక్తపరీక్షకు ఎంతవుతుందండీ ?"

"ఆ డబ్బు కూడా నేను వదులుకుంటాను. మందులు మాత్రం కొనుక్కో !"

ఆ స్త్రీ కన్నీళ్లు కారుస్తూ నిలబడిందే గాని మారు మాట్లాడలేదు.

"ఈ కడియాలు ఎంత ఉంటాయి ?"

"ఎప్పుడో చాలాకాలం క్రిందట ముప్ఫై రూపాయలకు కొన్నానండి !"

"వీటిని ఇప్పుడు అమ్మితే పది రూపాయలు కూడా రావు !" అని అన్నాడు రామనాథం.

ఆస్త్రీ మరల నా కాళ్లమీద పడడానికి ప్రయత్నించింది. నువ్వెళ్లి వసారాలో కూర్చో ! నీ కేసు విషయం కొంచెం తీరికగా ఆలోచిస్తా. లేకపోతే పెద్ద ఆస్పత్రికి ఉత్తరం రాసియిస్తా, తీసుకెళ్లు !"

"అక్కడికి వెళ్లి వచ్చానండి. వాళ్లు కూడా డబ్బు అడిగారండి !" అని చెప్పింది. ఆమె కళ్లవెంట కన్నీరు ధారలుగా ప్రవహిస్తున్నది.

"ఏడ్చి ప్రయోజన మేముంది చెప్పు ?—వెళ్లి బయట కూర్చో ! మళ్లీ పిలుస్తాను."

శాంపిల్ మందులు ఏమైనా ఉన్నాయేమోనని అటూ యిటూ చూస్తూఉండగా—రామనాథం నావైపుకు తిరిగి—

"అయ్యా డాక్టరుగారూ ! ఏభై రూపాయలుంటే ఆమె ఆరోగ్యం బాగుపడుతుం దంటారా ?"

"ఆఁ .... బాగుపడుతుంది."

రామనాథం మీసాలను సవరించుకుంటూ—కొంచెం సేపు ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"డాక్టర్‌గారూ ! డబ్బు నేను పెట్టుకుంటాను. ఆమెకు చికిత్స ప్రారంభించండి."

"డబ్బు మీరిస్తారా ?"

నే నడిగినదానికి రామనాథం సమాధానం చెప్పకుండా అవతల గోడకు అనించి ఉంచిన సంచీ చేతిలోకి తీసుకుని దానిలోనుంచి అయిదు పదేసి రూపాయల నోట్లను బయటికి తీశాడు. తీసి నా చేతి కందించాడు.

"డాక్టరుగారూ ! ఈ డబ్బు ఉన్నది చూశారూ చాలా పాపిష్టిదండీ ! ఈ పాపిష్టి డబ్బే నన్ను నాశనం చేసింది."

రామనాథం ఇంతటి వేదాంతపరమైన విషయం మాట్లాడతాడని నే నూహించుకోలేకపోయాను. పైపెచ్చు నా కెందుకో ఒక సందేహం కూడా కలిగింది.

"ఆమె మీ కేమైనా బంధువా ?"

"అబ్బే, లేదండి !" .... అయితే—" రామనాథం అటూ యిటూ చూశాడు.

"విషయ మేమిటో చెప్పండి !"

"విషయమేమీ లేదండి ! ఆమె మొహంలో మా తల్లి పోలిక లున్నాయండి !"

"మా నాన్న చనిపోయిన మాసం రోజులకే మా అమ్మ కూడా కన్ను మూసింది. మా అమ్మకు జబ్బుచేస్తే—డాక్టరుకు చూపించే తాహతు లేకపోయింది !" అన్నాడు రామనాథం—నూతిలోనుంచి మాట్లాడుతున్నట్టు !

నా ఆశ్చర్యానికి మేరలేకపోయింది. రామనాథంవైపు తదేకంగా చూశాను. అతని నేత్రాలు అశ్రుమయమైనాయి.

---

శా. సౌరభ్యంబును బంధచాతురి తగన్ శయ్యాచమత్కారగర్వం
గౌరంబున్ వివిధార్థముల్ సరససాంగత్యంబు నానాకళా
పారీణత్వము మంజువాగ్విభవమున్ బాటించు రీతింపగన్
వారస్త్రీయునుబోలె నొప్పవలదా వర్ణింపగ గావ్యంబిలన్

ప్రౌఢకవి మల్లన-రుక్మాంగద చరిత్ర

# మహోన్నత చిత్రకారుడు - బ్రాక్



**శ్రీ ఎస్. వి. రామారావు**

చాలామందిని చనిపోయిన తర్వాత మృతజీవుల క్రింద పరిగణించి మరచిపోతాం. కాని కొంతమందిని మృతజీవులైనా



శ్రీ బ్రాక్

సజీవులుగనే లెక్కవేస్తుంటాం ఎప్పుడూ. అలా నిలచేది. బహుకొద్ది మంది చరిత్రలో, ఒక్కొక్క కాలం ఒక్కొక్క రకపు తత్త్వవేత్తలను, విజ్ఞానవేత్తలను, కళాభిజ్ఞులను సృష్టిస్తుంది. కొంతమంది అల్లకల్లోలంగా ఉన్న సమయంలో శాంతిని ప్రసాదించేందుకు జనిస్తే మరికొంతమంది శాంతంగా ఉన్న కాలంలో సంచలనాన్ని ఉత్పన్నించేందుకు ఉద్భవిస్తారు. కాని విచిత్రం, ఇవన్నీ కాలగర్భంలో కరిసిపోతాయి. మంచైనా చెడైనా తర్వాత వచ్చేకాలానికి అండగనే నిలుస్తాయి. ఒకందుకు ఇండియాపై చైనా దురాక్రమణ చెడైతే మరొకందుకు మంచిదే అయింది. 'మనం మంచివాళ్ళం గనుక, మనం ఇతరులపై దండెత్తం గనుక ఎవరూ మనపైకి రారు' అనే మత్తు నిద్రపోయి మనం ఒకరిపై దండెత్తకపోయినా ఒకరు మనపైకి వస్తే, మనకు మనం సంరక్షించుకునేందుకు సిద్ధంగా ఉండాలి అనే నిజాన్ని తెలుసుకున్నాం. అందుకే మన 1963వ. సంవత్సరం భావి భారత చరిత్రలో చిరస్థాయిగ నిలుస్తుంది మెఱుస్తూ. కనుక గతంలో జరిగిన చెడైనా మంచైనా భావికి అండగా ఉండడం సంభవం మామూలుగ. ఇటువంటి సమయం ఒక్కసారి చిత్రకళా రంగంలో గూడ వచ్చింది. అప్పటివరకు కడుపులో నీళ్ళు కదలకుండ మెత్తని సోఫాలో కూర్చొని, చూస్తూ ఆనందించవలసిన నున్నటి ఫోటోగ్రాఫులవంటి చిత్రాలను ఇంప్రెషనిజం చిత్రాలు వచ్చి ఆటంబాంబులా తుడిచివేశాయి. ప్రజలు, విమర్శకులు ఈ క్రొత్త కళారంగాన్ని ఇంకా జీర్ణం చేసుకొనే లోపునే ''సిజాన్'' ఒక క్రొత్త పద్ధతిని, 'క్యూబిజమ్' అనే విత్తనాన్ని నాటి మరణించాడు. దీనితో వచ్చింది ప్రళయం కళారంగంలో. అసలు కళా పద్ధతినే పూర్తిగా మార్చివేసింది 'సిజాన్' విత్తనం. ఒకవిధంగా చెప్పాలంటే నేడు ఉన్న అనేక రకాల 'యిజములకు' మూలం ఈతని పద్ధతే. సిజాన్ చనిపోయిన తర్వాత 1907లో పారిస్‌లో సిజాన్ చిత్రాలన్నీ కలిపి పెద్ద ప్రదర్శనం జరిపారు. సిజాన్ బ్రతికి ఉండగా మిత్రుడు ఎమిలి బెర్నార్డ్‌కు వ్రాసిన ఉత్తరాన్ని గూడ ప్రచురించారు. అందులో అంటాడు సిజాన్ ''లోగడనే చెప్పినదాన్ని మరల ఒకసారి చెపుతాను. ప్రకృతిని గోళాకారము, వర్తుల స్థంభాకారము, కూచి ఆకారములలో చూచినట్లయితే, ప్రకృతి స్వభావ సిద్ధమా అన్నట్లు భూమికి

సమాంతరముగ ఉన్న రేఖలు వెడల్పును, నిలువుగ ఉన్న రేఖలు లోతును కల్పిస్తాయి. అందుకే మనకు ప్రకృతి భూమిపై కంటే భూమిలోపలనే ఎక్కువగా ఉంది.'' వస్తువులను ప్రకృతిని గోళాకార, స్తంభాకార, కూచి ఆకారాలలో చూచి చిత్రించే పద్ధతిని పికాసో, బ్రాక్‌లు ఎంతో తీక్షణతతో సాగించారు. అప్పటివరకు చిత్రిస్తున్న వస్తువు ఆకారాన్ని విధ్వంసం చేసి ఒక క్రొత్త పోకడలో చెప్పారు. దానివలన వారు చిత్రాలలో కావలసిన వివిధ కోణాకారాలను తేగలిగారు. అందుకే ముఖ్యంగా ఈ క్రొత్త చిత్రకళా రంగంలో పికాసో బ్రాక్‌లు జంటగా నిలుస్తారు.

బ్రాక్, ప్రపంచాన్ని తన చిత్రాలతో మైమరపింప చేసిన బ్రాక్, 31 ఆగస్టు 1963న తన 81వ యేట పరమపదించారు. ఈ వార్తను ప్రపంచంలోని అన్ని రేడియోలు పేపర్లు ప్రకటించాయి. పారిస్ నగరం మొత్తం దుఃఖించింది. అంతటి వ్యక్తి సాధించిన విషయాన్ని ఆయన జీవితాన్ని సాధ్యమైనంత వివరంగా తెలుపుతాను.

బ్రాక్ మేనెల పదమూడవతేది 1882వ. సంవత్సరంలో అర్జంటెయిల్ పట్టణంలో జన్మించాడు. ఇది పారిస్‌కు చాలా దగ్గర. తండ్రికి ఇండ్లకు రంగులు వేసే వృత్తి. తర్వాత చిన్న షాపు స్వంతంగా పెట్టి రంగులు అమ్మేవాడు. బ్రాక్ తండ్రితో బాటువెళ్ళి ఇండ్లకు రంగులువేసే వాడు చిన్న తనంలో. తండ్రికి ఒక్కగా నొక్క కొడుకు గావడంవల్ల గారాబంగా పెరిగాడు. చిన్నతనంలో మంచి హుషారైన వాడు. రవల్‌డూఫీ (ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారుని) సోదరునితో కలిసి తరచుగా తిరిగేవాడు. ఫ్లూట్ నేర్చుకున్నదికూడా వీరి వద నే. అంత సరదాయైనవాడు తర్వాత తర్వాత ఎందు వల్లనో అంతగా అందరితో తిరిగేవాడుకాదు. చివరి దశలో అసలు దాదాపు ఇల్లు వదలి కదలేవాడుకాదు. దగ్గరగా ఉన్న చిత్రకళాశాలలో కొంతకాలం కళాభ్యాసం చేశాడు. బ్రాక్ ఎనిమిదవ సంవత్సరం వచ్చేసరికి తండ్రి లెహాద్రే ఊరు వచ్చి స్థిరపడ్డాడు. అక్కడే బ్రాక్ కొంతకాలం రంగులు వేసే పురోహితునివద్ద పనిచేశాడు. తండ్రివేసే పద్ధతుల్ని ముఖ్యంగా, పాలరాతి లాంటి రంగుల్ని వెయ్యడం, రాతిలో చారలను చూపడంలాంటి ట్రిక్కులను, సరదాగా ఉండడంవల్ల ఎంతో జాగ్రత్తగా నేర్చుకున్నాడు. ఈ పద్ధతులను తర్వాత తర్వాత తన 'స్టిల్‌లైఫ్' చిత్రాలలో విరివిగా చూపించాడు. అంతగా చదువుపై శ్రద్ధ ఉన్నట్లు, చదివినట్లు కనిపించదు.

1900వ. సంవత్సరం దగ్గర నుండి పారిస్ వచ్చి స్థిర పడ్డాడు. చిత్ర కళాశాలలో, స్టూడియోలలోను, ఎకాడమీలలోను తిరిగి ఎంతో అనుభవాన్ని సంపాదించాడు. బ్రాక్ అదృష్టం అసలు అతనికున్న స్నేహితులవద్ద నుండి వచ్చింది. ఈ నాడు ప్రపంచ ప్రసిద్ధ హేమాహేమీ చిత్రాకారులందరు అతనికి చిన్ననాటి స్నేహితులు. వారందరు కలిసి ప్రదర్శనలు ఏర్పాటు చేస్తే ఇతన్ని గూడ కలుపుకునేవారు. అలా అందరితోబాటు ఇతను గూడ నలుగురికి తెలియడం జరిగింది. రవాల్‌డుఫీ, ఒథాన్‌ఫ్రీజ్ ఫ్రాన్సిస్ పికాబియా, మేరి లారెన్సిన్, మథీస్‌లాంటి వారందరు స్నేహితులు. ఇంక అంతకంటే ఏమి కావాలి ? అటువంటి వాతావరణం, అటువంటి మిత్రబృందంలో ఉండి ఎంతో చురుకైన వాడవడం వల్ల, ఇట్టే పైకి రావడం జరిగింది.

1906 వచ్చింది. ఇది అతని జీవితంలో మొట్ట మొదటిసారిగా ప్రదర్శించడం. 'సెలాన్—డి—ఇన్‌డిపెన్‌డెన్ట్స్' అనే ప్రదర్శనను మిత్రులందరు కలిసి ఏర్పాటు చేశారు. అందులో ఆరు చిత్రాలను ప్రదర్శించాడు బ్రాక్. ఈ ప్రదర్శన 'ఫావ్' చిత్రకారులందరు కలిసి ఏర్పాటు చేసింది. ఈ ఫావ్ పద్ధతిలో రంగులు చాల ముతుకగా ఉంటాయి. ఇంప్రెషనిజమ్ పద్ధతిలోలాగ గాలిలో ఎగురుతున్న చిత్రాలవలె, మంచు తెరలలో కనిపించి కనిపించని చిత్రాలవలె, మసక మసకగా మెరసే పద్ధతి గాదు ఇది. బలాన్నీ, ఒక విధమైన గ్రామీణ చిత్రకళా పద్ధతిని పుణికి పుచ్చుకున్న పద్ధతి. చిత్రాలు చూస్తే మన జమినిరాయ్ చిత్రాలవలె కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. వీరికి చిత్రంలో కాంపొజిషన్ ముఖ్యం, బలం ముఖ్యం. అంతేగాని ఇంప్రెషనిజంలో వారి మాదిరి ఆకార స్వరూపాలుకాదు. దీనిలో ఇంప్రెషనిజం కంటే సౌలభ్యం ఉంది చిత్రీకరణలో. ముఖ్యంగా కొట్టవచ్చే రంగులలో చిత్రించే పద్ధతి బాగా నచ్చింది బ్రాక్‌కు. అందుకే ఎన్నో చిత్రాలు ఆ కాలంలో ఫావిజమ్‌లో చిత్రించాడు. అతనిపై అప్పుడు డుఫీ, ఫ్రీజల ప్రభావం విపరీతంగా కన్పిస్తుంది.

పారిస్ వదిలి ఫ్రాన్స్‌లో చాలచోట్ల తిరిగాడు. ఫావిసమ్‌లో చాల చిత్రాలు వేశాడు. ఎన్నో ప్రకృతి దృశ్యాలను ముఖ్యంగా కొండలను, సముద్రపు ఒడ్డులను, ఓడ రేవులను చిత్రించాడు. అతనిలో మరొక మార్పు తెచ్చింది మిత్రుడు డేనియల్ హెన్రి కాన్ వీలర్. ఇతను క్రొత్తగా చిత్రాలను అమ్మే షాపు ప్రారంభించాడు. పికాసో, డెరైన్, వ్లామ్‌నిక్, వాన్‌డాన్ జన్‌ల చిత్రాలను కొన్నాడు. మొట్టమొదటగ బ్రాక్ చిత్రాన్ని కొన్నది కూడ ఇతనే. తర్వాత కొన్ని మాసాలకు బ్రాక్ చిత్రాలన్నిటిని కొనివేశాడుట. దాన్నిబట్టి బ్రాక్ చిత్రాలు ఎలా అమ్ముడు పోయేవో తెలుస్తుంది. అదృష్ట

# మహోన్నత చిత్రకారుడు బ్రాక్

వంతుడి క్రింద లెక్క. బ్రాక్ మిగిలిన చిత్రకారులతో పోలిస్తే. చిత్రాలు అమ్ముడు పోక ఎప్పుడూ అంతగా బాధపడలేదు. ఈ హెన్రికాన్ వీలరే ఇతన్ని పికాసోకు పరిచయం చేసింది. ఈ పరిచయం బ్రాక్‌ను ప్రపంచ విఖ్యాత చిత్రకారులలో ఒకర్నిగా చేసింది. పికాసో అప్పుడు మిత్రులు లియోస్టీన్, ఆపోల్ నెయిర్, మాక్స్‌జాకబ్, జాన్‌గ్రిస్‌లతో తిరుగుతుండే వాడు. మొట్టమొదటిసారిగా పికాసో చిత్రాలను చూచి సంభ్రమాశ్చర్యాలను పొందాడు బ్రాక్. చిత్రాన్ని చూడగానే అతను పికాసోతో అన్న వాక్యమిది— "చూడవయ్యా! నీ చిత్రాలను గురించి నీవేమి చెప్పుతావో నా కనవసరం. మేము మంటలు గ్రక్కేందుకు పిట్రోలు త్రాగమని చెప్పడానికై చిత్ర రచన చేస్తావు". ఈ సంభ్రమాశ్చర్యాలు, తాను ఇంతవరకు చూడని క్రొత్తపద్ధతి, పికాసోయొక్క రచనా పోకడ ఇతన్ని కలవరపరచినై. తాను చేసే ఫావిసమ్ పద్ధతి ఇంక లాభంలేదు అనుకున్నాడు. ఏదో మార్పు తేవాలి తన చిత్రాలలో అనుకున్నాడు. అందుకై ద్విగుణీకృత నిశ్చయంతో చిత్రాలను వెయ్యడం ప్రారంభించాడు.

1907—1908 లలో బ్రాక్ "ఎల్ ఎస్టాక్ వద్ద గల ఇండ్లు" అనే చిత్రాన్ని చిత్రించాడు. మెథీస్ చూచి మొట్ట మొదటిసారిగా "అవి చిన్న చిన్న క్యూబులుగ అని పిస్తాయి" అన్నాడు. 1909 లో బ్రాక్ చిత్రించిన స్టిల్ లైఫ్స్, ప్రకృతి దృశ్యాలను చూచి ప్రఖ్యాత కళా విమర్శకుడు వీటిని "చిత్రమైన క్యూబు ఆకారా"లని వర్ణించాడు. దానితో ఒక "క్యూబిజమ్" అనే పద్ధతి వాడుకలోనికి వచ్చింది. ఇలాగే పికాసో గూడా చేశాడు కొన్ని చిత్రాలు. కనుక ఎవరు ముందు అసలు ఇలా క్యూబుల పద్ధతిలో చిత్రించింది తెలియదు. దీనికి వీ రిద్దరు మూల కారకులు. చాలమంది విమర్శకులు ఎవరు అసలు క్యూబిజానికి మూల కారకులు అని తలలు బ్రద్దలు కొట్టుకొన్నారు. ఎవరెస్టు ఎక్కినదీ, ముందుగా ఎవరెస్టు శిఖరముపైన కాలు ఉంచినదీ, ఎడ్మండ్ హిల్లరీయా లేక టెన్సింగా అని తలలు బ్రద్దలు కొట్టుకున్నారు చాలమంది. ఏది ఏమైతేనేం ప్రపంచ చిత్ర కళా రంగంలో ఒక వినూత్న చిత్ర శైలిని సృష్టించిన ఇద్దరిలో ఒకడుగ బ్రాక్‌ను ప్రపంచం గుర్తించింది.

సిజాన్ చిత్ర రచన దీనికి ముఖ్యమైనా చాల మార్పులు ఉన్నాయి, అసలు క్యూబిజములో. సిజాన్ క్యూబిజాన్ని సృష్టించాలని వెయ్యలేదు చిత్రాలు. అసలు ఒక శైలి కొరకు గాదు వేసింది చిత్రాలు. తన భావాన్ని క్రొత్త రూపంలో చిత్రించాలని పెట్టిన కృషి. దాన్ని ముందుకు తీసుకుపోయి ఒక ప్రత్యేక ఆకారాన్నిచ్చింది బ్రాక్ పికాసోలు.

బ్రాక్ "1909 నుండి పికాసో నేను ఎంతో సఖ్యతతో, ఒకే విధమైన దృఢ నిశ్చయంతో, మనసుతో కృషి చేశాం. మేము కలిసి ఉండకపోతే అసలు ఈ శైలి ఉద్భవించేదికాదు. ఇలా జరగాలని ఉంది గాబోలు అందుకని జరిగింది ఇలా" అని చెప్పుకున్నాడు.

బ్రాక్ చిత్రంలో ఖాళీస్థలాన్ని అసలు ఉంచలేదు. చిత్రాన్నంతా పూర్తిగా ఆకారాలతో నింపాడు. సిజాన్ చాల భాగాన్ని వదిలివేసేవాడని, చాల రంగులను వాడేవాడని చెప్పాడు ప్రఖ్యాత ఫ్రెంచి కళా విమర్శకుడు, జాక్‌డేవ్స్. ముఖ్యంగా బ్రాక్ చిత్రాల్ని లేత ముదురు ఆకుపచ్చ, ముతుక ఎల్లో ఓకవర్ రంగులలో పూర్తి చేసేవాడు. అప్పటివరకు సిజాన్ మాదిరిగా మోడలును ఉంచుకొని చిత్ర రచన చేశాడు. 1910 నుండి అసలు మోడలును పూర్తిగా వదిలివేసి చిత్ర రచన చేయ నారంభించాడు. అప్పుడు ఉత్పన్నమైన సమస్యలను చెపుతూ, "అసలు మోడలును పూర్తిగా విసర్జించాలని నిర్ణయించుకున్నాను. కాని అంత సులభంగాలేదు. కాని ప్రారంభించాను పట్టుదలతో. చిత్రం ఎలా వస్తుందో పూర్తి అయ్యాకగాని తెలియదు. అది ఒక సాహస కృత్యం. ఇందులో మనసు అసలు పని చెయ్యదు" అన్నాడు. అంటే చిత్రం ఎలా వస్తుందో అతనికే తెలియదు. ఒక ఉద్దేశ్యంతో చిత్ర రచన చెయ్యలేదన్న మాట అతను. తాను చెయ్యి ఎలా సాగితే అలా చిత్రిస్తూ ఇంద్రియాలకు అతీతమైన జ్ఞానంతో సాగించిన చిత్ర రచన అది. 1912 నుండి న్యూస్‌పేపర్లను కాన్వాస్‌పై అతికించి అక్షరాలను పెద్దగా చిత్రంలో ఇమిడ్చి, ఇసుక రంగులలో మిశ్రమంచేసి చిత్రించాడు. తృప్తిగాలేక తాను తండ్రివద్ద చిన్నప్పుడు నేర్చుకున్న పద్ధతులను అనగా పాలరాయి మాదిరిగా చిత్రించడం, పాలరాతిలోని చారలను చిత్రించడం సాగించాడు. అప్పటివరకు చిత్రిస్తున్న ప్రకృతి దృశ్యాలను, మానవకారాలను వదలి పూర్తిగా "స్టిల్ లైఫ్" చిత్రాలను చిత్రించడంలో నిమగ్నమైపోయాడు. స్టిల్ లైఫ్‌లు చిత్రించడంలో దిట్ట అని పేరు పొందాడు.

మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది. ప్రభుత్వం ఇతన్ని సార్జంటుగా నియమించింది యుద్ధంలో. తన బాధ్యతను ఎంతో ప్రజ్ఞతో నిర్వర్తించి మన్నలను పొందాడు. బాగా గాయాలు తగిలాయి యుద్ధంలో. దానితో తిరుగుముఖం పట్టాడు యుద్ధ భూమినుండి. చిరకాలం బట్టింది మరల చిత్ర రచన చేసే స్థితి వచ్చేటప్పటికి.

రంగుల్లో ఎంతో మార్పు వచ్చింది. అప్పటివరకు కండ్లు జిగేలుమనే రంగులు వాడిన అతను, రంగుల వర్ణాన్ని ఎంతో

తగ్గించాడు. దాదాపు 18వ శతాబ్దం చిత్రకారుల మాదిరి రంగులను వాడాడు. కొంతమంది ఈ చిత్రాలు చూచి ఫ్రెంచి ఆర్ట్‌లో మరల ఒక ఓల్డ్ మాస్టర్ని చూచాం అన్నారు. తన ఈ చిత్రాన్ని చూచి "నాకు ఉద్రేకాల్ని అణచే నిబంధనలంటే ఇష్టం" అని చెప్పుకున్నాడు. అందుకనే గాబోలు రంగు వర్ణాల్ని అంతగా అణచి వేశాడు తన చిత్రాల్లో. అయినా ఇది ఎంతో కాలం నిలువలేదు. మరల కాంతివంతమైన రంగులను వాడసాగాడు.

తను కాగితాలను ఎందుకు అతికించేది చిత్రాలలో చెపుతూ, "మేము చేసిన ఈ పద్ధతిని సరిగా అందరు అర్థం చేసుకోలేదు. కాని ఇది చాల సులభం. మేము తలపెట్టిందల్లా రంగుకుగల ప్రాధాన్యతను, ఆకారాలకు సంబంధం లేకుండా, నిలబెట్టి చూపాలని. మేము ఇలా వాడిన కాగితాలను చూచి విమర్శకులు విస్మయం చెందారు. ఇది ఉదాత్తంగా అనిపించలేదు చిత్ర కళలో వారికి". ఎన్ని కాగితాలు అతికించినా నిజానికి రంగుకుగల ప్రాధాన్యతను చూపాలని ఎంతో ప్రయాసపడిన మాట నిజం. దీన్నే చెపుతూ విమర్శకుడు రెబెక్కా వెస్ట్ అంటారు—"బ్రాక్ తన రంగులను భూమినుండి తీసుకున్నాడు. అతని మొదటి చిత్రాలను చూస్తే భూమికిగల బ్రౌను రంగు, గడ్డికిగల ఆకుపచ్చదనం, రాళ్ళకుగల బూడిద రంగు లు కనిపిస్తాయి" తన రంగుల్ని భూమినుండి ఆకాశం వరకు విస్తరింప చేశాడు.

ఇతను వేసిన చిత్రాలు చూస్తే మనుష్యుల చిత్రాలను బహు కొద్దిగ చిత్రించినట్లు కన్పిస్తుంది. ఆ చిత్రించిన వైనా స్తబ్దతతో, చలన రహితంగా ఉంటాయి. మనుష్యుల ఆకారాలు గూడ ఏ స్టిల్ లైఫ్‌ను చిత్రిస్తున్నట్టుగానో చిత్రించాడు. అందుకే గాబోలు అపోలినైర్ "మనిషి ముఖం కంటే రాతిని చూచి చలించాడు ఎక్కువగ బ్రాక్" అన్నాడు. తను వేసిన స్టిల్ లైఫులలో వయోలిన్, పండ్లు, సీసాలు, సీసా మూతలు, నిమ్మపండ్లు, ఆపిల్‌పండ్లు, పేక ముక్కలు ఎన్నో చిత్రించాడు విరివిగా. తన ప్రపంచం అంతా వీటితో నింపేశాడు.

రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. రంగుల కరువు వచ్చింది. శిల్పాల్ని చెయ్యడం సాగించాడు. కాని అంత ప్రజ్ఞావంతుడు గాదు శిల్ప కళలో. ఎక్కువగా చేసిన ముఖాల్ని శిల్పంలో ప్రొఫైల్స్-అంటే ముఖం ప్రక్క భాగం చూపడం. మనం రాజపుత్ర మొగల్ శైలి చిత్రాలలో ఉన్న మాదిరిగా నన్నమాట. చేపలు, గుఱ్రపు తలలు, ఎగిరే పిట్టలు శిల్పంలో మలచాడు. తాను చేసిన చేపల శిల్పాన్ని చూచి "నీటిని శిల్పంగా మలచాను' అన్నాడు.

ఎన్నో స్టిల్ లైఫ్ చిత్రాలలో ఎగురుతున్న పిట్టల్ని చిత్రించాడు. ఆయన చివరి కాలంలో ప్రతి చిత్రంలోను ఒక్క పిట్ట ఉన్నదా అనిపిస్తుంది. ఆయనకు పిట్టలపై అంత మక్కువ ఎందువల్లనంటే అవి భూమికి ఆకాశానికి మధ్య గల స్థలంలో ఎగురుతూ ఉండే విధనమే అనుకుంటాను. ఇతని చిత్రాలు గూడా ఈ స్థలాన్ని పూర్తి చెయ్యాలనే కృషిలో సాగించినవి. సిజాన్ వదిలి వేసిన ఖాళీ స్థలాన్ని ఇతను పూరించాడు.

బ్రాక్‌కు గల స్థానం ఎట్టిది ఈ శతాబ్దంలో అంటే, చాలమంది ముఖ్యమైన విమర్శకులు ఆయన్ని ముగ్గురిలో ఒకరుగ చేర్చారు. పికాసో, బ్రాక్, మతీస్‌లు ముగ్గురు ఈ శతాబ్దంలో అత్యంత ప్రతిభావంతులు. బ్రాక్ స్థానం ముగ్గురిలో చివర వానిగ నిర్ణయించారు. 'టైమ్స్' పత్రిక విమర్శకుడు దీనికి కారణం వ్రాస్తూ, "పికాసో, మెతీస్‌లు ఇద్దరు ఎంతో విభిన్నులైనా, తమ కళా సాధనలో ఈ శతాబ్దపు కళారంగం గమనాన్నే పూర్తిగా మార్చివేశారు. వీ రిద్దరి ప్రభావం లేని చిత్రకారుడు దాదాపు ఎవరూ లేరు. కాని బ్రాక్ 'ఫావిసమ్' సాధన చేసినప్పుడు మతీస్ నీడ క్రింద ఉండవలసి వచ్చినది. క్యూబిజము తర్వాత పికాసో అంచెల లంచెలమీద దాటిపోయాడు బ్రాక్‌ను వదిలి" అన్నాడు. బ్రాక్ నిజంగా ఎవరిని తన ప్రభావంతో ముంచెత్తలేదు. అంతగా అందరు అతని చిత్రాల్ని చూచి ఆనందించి మెచ్చుకున్నారేగాని బ్రాక్‌ను అనుకరించి సాధన చెయ్యలేదు. వెతగ్గా వెతగ్గా మనకు బెన్ నికల్‌సన్ దొరుకుతాడు బ్రాక్ ప్రభావం పడ్డ వ్యక్తిగ. అంతకుమించి బ్రాక్‌కు శిష్యులు లేరు.

నిజానికి ఒక క్రొత్త రంగం సృష్టించాడు స్టిల్ లైఫ్ చిత్రాలతో. ప్రక్కన ప్రచురించబడిన 'స్టిల్ లైఫ్' చిత్రంలో ఆయన ఎంత సులువుగా చిత్రాన్ని పూర్తి చేశారో తెలుస్తుంది. అప్పుడే వండిన చేపలు ఎంతో జాగ్రత్తగా తెచ్చి బల్లపై ఉంచినట్లుంది. చిన్న టవలు రెండంటే రెండే పండ్లు ఉంచబడి, ఇక తినడమే తరువాయి అని అనిపిస్తుంది. చిత్రం చేపలతో ప్రక్కలకు సాగుతూ ఉంది. ఎంతో బలంగా వెడల్పు అధికం అవుతుంది. చిత్రంలో దీన్ని అరికట్టాలని గాబోలు బ్యాక్ గ్రౌండ్‌లో నిలువాటి గీతలను వాడారు బ్రాక్, పైకి వ్రేలాడదీయాలని ఈసాగే చిత్రాన్ని. చాల చిత్రాలు స్టిల్ లైఫ్‌వి గజి బిజిగా ఉంటాయి. ఇది మాత్రం ఎంతో సింపుల్‌గా కొట్టవచ్చినట్లుంటుంది. తను చెప్ప దలచుకున్నది చిత్రంలో తికమకలు లేకుండా చెప్పాడు. టేబులుపై ఉన్న పెద్ద గుడ్డ చిత్రం అంతటికీ ఒక బరువును, హుందాను తెచ్చింది. దీనిలో విపరీతంగా మెథీస్ ప్రభావం కనుపిస్తుంది. అసలు ఇది మెథీస్

# మహోన్నత చిత్రకారుడు బ్రాక్



స్టిల్ లైఫ్

చిత్రమే అంటే గూడా ఎవరు అభ్యంతరం చెప్పకుండ నమ్ముతారు. అయినా రంగులతో బ్రాక్ తన ముద్రను వేశారు ఈ చిత్రంలో.

ఈయన స్టిల్ లైఫ్ చిత్రాలలో వంగపండు రంగును, పసుపు రంగును అత్యంత ఆహ్లాదకరంగా ఉపయోగిస్తారు. వంగపండు రంగులో నిలుపు చారలతో, ముదురు ఆకుపచ్చని పెద్ద పండ్లతో చిత్రించిన చిత్రాలు వగిషీ పని చేసిన వివిధ ఆకారాల కూజాలు, పురాతనమైన మేజాలు, వాటిని తరి బట్టిన కోళ్ళు, చారలు చారలుగల చెక్క తలుపులు ఇలా ఎన్నో అమోఘమైనవి చిత్రించారు. ఈయన 'గదిలోపల' అని చిత్రించిన చిత్రాలు చీకటిగా ఉండి, ఒక వైపు నుండి వెల్తురు తెరచిన కిటికీలోనుండి వస్తూ వస్తువులపై పడుతు ఉన్నవి. చాల పేరు పొందినవి. ఈయన చిత్రాలు చూచిన వారికి ''చార్డిన్'' చిత్రాలు గుర్తుకు వస్తాయి. ''ఇరువదవ శతాబ్దపు చార్డిన్'' అని గూడ కొంతమంది అన్నారు ఇతన్ని. ఇక్కడగల కొన్ని 'చార్డిన్' చిత్రాలను నేషనల్ గ్యాలరీలో చూచాను. పారిస్ లూర్ మ్యూజియమ్‌లో గూడ చూచాను. ఇద్దరికి గల సామ్యం రంగులను మిశ్రమం చేయడంతో ఉంది. కాంతిని బలవంతంగా తగ్గించి రంగులను తమ అధీనంలో ఉంచుకునే పద్ధతి చాలగొప్పది ఈ ఇద్దరిది.

బ్రాక్ చాల రేఖా చిత్రాలను, స్త్రీ మూర్తులను చిత్రించారు. నిజం చెప్పాలంటే చాల నాసికరకంగా ఉన్నాయి రేఖా చిత్రాలు. కాని స్త్రీమూర్తుల చిత్రాలు బాగున్నాయి. రేఖలలో గూడ చిత్రాలంత గొప్ప తనాన్ని చూపే ప్రజ్ఞ పికాసో కొక్కడికే ఉంది. బ్రాక్ తనకుగల బలహీనతను చిత్రాలలో రంగులలో కప్పి పుచ్చుకుంటాడు. ఇతని డ్రాయింగులు చూస్తే మనకు ఈ విషయం చటుక్కున తెలుస్తుంది.

ప్రక్కన ప్రచురించబడిన ''పండ్లు అమ్మే స్త్రీ'' అన్న చిత్రం చాల అందమైన చిత్రం. ఇటువంటివి చాల చిత్రాలు ప్రపంచంలో చాల మ్యూజియములు సేకరించాయి. ఇక్కడ గ్రీకు స్త్రీమూర్తుల ఆకారం కన్పిస్తుంది. స్త్రీ చిత్రం ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌లో మలచినట్లుందిగాని చిత్రించినట్లు లేదు. స్త్రీ శరీరావయవములు నాజూకు తనాన్ని, వయ్యారాన్ని కోల్పోయాయి. దీనత్వం కనిస్తుంది. రేఖలు, వలిగిన పరువులా, స్త్రీ చుట్టూ తిరుగుతాయి.



పండ్లు అమ్మే స్త్రీ

ఈ చిత్రాన్ని రంగులలో చూస్తే ఎంతో అహ్లాదంగా ఉంటుంది. స్త్రీమూర్తి చిత్రాలలో బహుకొద్ది చిత్రాలలో ఇది ఒకటి. సామాన్యంగా స్త్రీని ఇలా ఒంటరిగా చిత్రించే కంటే స్టిల్ లైఫువద్ద కుర్చీలో కూర్చోబెట్టి చిత్రించినవి చాల ఉన్నాయి. తనకుగల స్టిల్ లైఫు చిత్రించడంలో నైపుణ్యాన్ని ఎంతగానో ఒలికిస్తాడు బ్రాక్. ఈమధ్య ఇరువద శతాబ్దపు చిత్రకారులవి కొన్ని చిత్రాలు లండన్‌లో మార్ల్‌బరో గ్యాలరివారు ప్రదర్శించారు. పెద్ద చిత్రం సుమారు 6' × 8' సైజుది ఈ ప్రదర్శనలో ఉంది బ్రాక్‌ది. నిజంగా ఎవరికైనా నోరు తెరిపిస్తుంది.

బ్రాక్ విచిత్రమైన వ్యక్తి. అతనికి అతనే సాటి. అందరు ప్రముఖ చిత్రకారులకు అనుకరణ చేసేవారున్నారు. కాని ఈయనకు లేరు. అంతమాత్రాన ఇతని చిత్రాలలో అంత పస లేదా అంటే నిజంగాదు. రంగుల నైపుణ్యంలో 'మానే' 'సూరే'లనుమించి ఒక ఇంద్రజాలాన్ని సృష్టించగల వ్యక్తి. అతి సామాన్య వస్తువులను స్టిల్ లైఫులో ఇమిడ్చి ఎంతో ఉన్నత స్థానాన్ని తెచ్చాడు. ప్రతి వస్తువులో అందాన్ని చూడగల వ్యక్తి. జోహార్!

మూర్తి చిత్రాలలో కొన్నిటికి రెండు మూడు ముఖాలను ఒకే వ్యక్తికి చూపుతూ చిత్రించినవి గూడా ఉన్నాయి ఇవి పికాసోను చూచిన తర్వాత వేసినవి. తన రంగులతో ప్రత్యేకంగా ఉన్నా, పికాసో వాటికి నాసిరకమనే చెప్పాలి. అసలు ఈ పద్ధతి తనదిగానప్పుడు ఎంత శ్రమపడినా మెప్పించలేడు.

ఈయన పికాసోతో కలిసి స్టిల్ లైఫు, మూర్తి చిత్రాలు చిత్రించే కాలంలో విపరీతంగా ఎల్లో ఓకర్ రంగు, ఇటుక రంగులు వాడాడు. తెలుపు గూడ విపరీతంగానే ఉపయోగించాడు. తర్వాత తన రంగులను ఎంతో జాగరూకతతో ఎంచుకున్నాడు తన ముద్ర పడేటట్లు. ఈయన చిత్రాలలోని రేఖలు నదిలోని చిరు తరంగాలవలె ఉంటాయి. అన్ని వస్తువులను వివిధ కోణాలలో పెనవేసుకొని చలనం లేకుండ ముడుచుకున్న ముత్యంలా మెరుస్తుంటాయి. ఇలా చలనం లేకుండా ఉండడం ఈజిప్షియన్ శిల్పాలలో, చిత్రాలలో చూడవచ్చు. ఈజిప్టు చిత్రాలలోని పిట్టలు ఎగురుతున్నా మనం అచలనాన్ని చూడగలం. అలాగే దుముకుతున్న అస్సీరియన్ సింహాలలో స్థిరత్వాన్ని గమన రాహిత్యాన్ని గ్రహించగలం.

ఇచ్చట ప్రచురించబడిన "శిల్పము" విచిత్రమైనది. రాతిలో చెక్కిన ఈ శిల్పం త్రవ్వకాలలో పురాతన పరిశోధకులు వెలికి



శి ల్ప ము

తెచ్చిన దానిలా ఉంది. ఇద్దరి తలలు ఏదో తీవ్రంగా వాదులాడుకుంటున్నట్లుగ మలచబడినవి. ముక్కాలి పీటల మాదిరిగా ఉండి ఆఫ్రికన్ శిల్పాలను జ్ఞప్తికి తెస్తుంది. శిల్పాలలో ఈయన చేపలను, గుర్రపు తలలను, స్త్రీల ముఖాల ప్రక్క భాగములు కనిపించే లాంటివి మలచారు ఎముకలలో గూడ ఎన్నో శిల్పాలను. ఇవి. ఊసుపోక చేసినవిలా ఉన్నాయి. ఆ మాటకువస్తే గోగాక్, డిగా, పికాసో, మెథీస్‌లు చిత్రకారులైనా వారు చేసిన శిల్పాలు చూస్తే ఆశ్చర్య మేస్తుంది. రంగులు కుంచెలను ఎలా నడపగలరో అలానే మట్టిని, రాయిని గూడ మలచగలిగారు. బ్రాక్ గొప్ప చిత్రకారుడు గనుక అతను చేసిన శిల్పాలు గూడ గొప్పగా ఉన్నాయని విమర్శకులు అన్నా అందులో నిజము సున్న.

ఈయన వేసిన చిత్రాలలో మనం బహు కొద్ది మార్పులను చూడవచ్చు. స్టిల్ లైఫులు, స్త్రీ స్టిల్ లైఫులు అంత గొప్పకానివి కొన్ని ప్రకృతి దృశ్యాలు ఉన్నాయి. అంతే. పికాసోను చూస్తే రోజు కొక క్రొత్త సృష్టి చెయ్యగల అతీతుడు. అది నయాగరా జలపాతం. కాని బ్రాక్ పరిమితి బహు కొద్ది. అయినా ఆ కొద్ది అయినా చిత్ర కళా రంగానికి మణిపూసలాంటి పద్ధతులలో చేసిన మహానుభావుడు. అందులో సందేహంలేదు. బ్రాక్ అంటారు "చూడండి! మనిషి బ్రతకాలిగదా. బ్రతకడం అంటే నా ఉద్దేశంలో రోజు రోజుకు కొద్దిగా మారుతుండడ మన్నమాట". ఇది ఈయనకంటే మిత్రుడు పికాసోకు బాగా వర్తిస్తుంది. అందుకే గాబోలు సంవత్సరం రెండు సంవత్సరాలముందు ఎన్నో డిజైనులతో బంగారు ఆభరణాలను తయారు చేశారు. ఇవి రంగులలో ఈమధ్యనే లైవ్స్ పత్రిక ప్రచురించినది. వీటిని పారిస్‌లో ప్రదర్శించారు. ఎంతో అందంగా డిజైనులు చాల బాగున్నాయి. ఈయన లితోగ్రాఫులు, ఎచింగ్‌లు చాల ముచ్చటగా ఉంటాయి. శిల్పాలకంటే ఈ లితోగ్రాఫులు ఎచింగ్‌లు చాల విజయవంత మయ్యాయి.

బ్రిటన్‌లోని హెన్రిమూర్‌ను బ్రాక్‌తో పోల్చవచ్చును. హెన్రీమూర్ బహుకొద్ది మార్పులతో శిల్పాలు చేశారు బ్రహ్మాండంగా. అలాగే బ్రాక్ బహు కొద్ది మార్పులతో చిత్రాలు చిత్రించారు అమోఘంగా. ఇద్దరు చరిత్రలో చిరస్థాయిగ నిలుస్తారు.

ప్రపంచంలోని ఎన్నో మ్యూజియములు, గ్యాలరీలు, సంపన్నులు ఈయన చిత్రాలు కొన్నారు. ఎంతోమంది ఈయనపై, ఈయన చిత్రాలపై పుస్తకాలు వ్రాశారు. ఇంత గొప్ప వ్యక్తి బహు నిరాడంబరుడు. చిన్నప్పుడు ఎంతో సరదాగా నలుగురితో తిరుగుతుండేవాడు. ఆటల పోటీలలో మంచి పేరు తెచ్చుకున్నాడు యువకుడుగ ఉన్నప్పుడు. అలాంటి వ్యక్తి చిత్రకారుడుగ పేరు పొందుతున్న కొలది సంఘానికి దూరదూరంగా ఉండడం అలవాటు చేసుకున్నాడు. అసలు నలుగురువున్న చోట ఆయన కనిపించడు. ఇంటివద్ద స్నేహితులను పార్టీలకు పిలిచి సరదా చేస్తాడు. పారిస్‌లోని పార్క్ మాన్ సురిస్‌వద్దగల తన ఇంటిలోనో లేక వరెంగెవిల్లె గ్రామంలోని తన ఇంటిలోనో ఉండి కాలక్షేపం చేయడమో, క్రొత్త చిత్రాలను వెయ్యడమో చేస్తుంటాడు.

1912 వ సంవత్సరంలో పెండ్లి అయిన దగ్గర నుండి అతని దశ తిరిగింది. చిత్రకారునిగ ఖ్యాతి రా సారంభించింది. అందువల్లనేమో విడాకులు లేకుండానే జీవితమంతా ఏకపత్నీ వ్రతుడుగనే ఉన్నాడు. సామాన్యంగా పాశ్చాత్య దేశాల్లో ముఖ్యంగా పారిస్ నగరపు చిత్రకారులలో ఇలా ఉండడం అరుదు. మిత్రుడు పికాసోకు ఇప్పటి భార్య అయిదవదనుకుంటాను.

బ్రాక్ మొట్ట మొదటి పెద్ద ప్రదర్శన 1933 లో బాసిల్‌లో జరిగింది. బ్రిటన్‌లో 1934 లో తన చిత్రాలన్నిటిని ప్రదర్శించాడు. చాల చిత్రాలు అమ్మడం జరిగింది లండన్‌లో. 1939 లో కార్నెగ్ ప్రైజు వచ్చి బ్రాక్‌ను ప్రపంచంలో ఒకనిగా ముద్ర వేయడం జరిగింది చిత్ర కళా రంగంలో. 1945 లో అస్వస్థ వల్ల చాలకాలం చిత్ర రచన అసలు చెయ్యలేదు. నెమ్మదిగా కోలుకున్న తర్వాత 1953 లో 3 చిత్రాలను లూర్ మ్యూజియంలో సీలింగుకు వేయడం పూర్తి చేశాడు. 1956 వ సంవత్సరంలో బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది. ఎడిన్‌బరోలో ఎన్నో వేల మంది బ్రిటన్ అంతటనుండి వెళ్ళి చూచి ఆనందించారు. తర్వాత లండన్‌లో టేట్ గ్యాలరిలో ప్రదర్శించారు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ హానరరి డాక్టరేటు బిరుదమునిచ్చి గౌరవించింది బ్రాక్‌ను. 3 సంవత్సరముల క్రితమే గ్రాండ్ ఆఫీసర్ ఆఫ్ ది రీజియన్ ఆఫ్ హానర్ పొందాడు. వీటి అన్నిటికంటె మించినది ఈ సంవత్సరం ఏప్రిల్ నెలలో లూర్ మ్యూజియమ్‌లో ఈయన తయారు చేసిన బంగారు, వెండి, ఆభరణాలను ప్రదర్శించటం జరిగింది. ఇంతవరకు బ్రతికివున్న చిత్రకారునివిగాని, శిల్పకారునివిగాని ప్రదర్శనలు లూర్ మ్యూజియంలో ఏర్పాటు చేయబడలేదు. ఇది మహోన్నత గౌరవంగా ఎంచవచ్చు. ఈ ప్రదర్శన త్వరలో న్యూయార్క్‌లో జరుగబోతున్నది.

బ్రాక్ మరణ వార్తవిని లండన్‌లోని విశ్వ విఖ్యాత నేషనల్ గ్యాలరి డైరెక్టరు సర్. ఫిలిప్ హెండి "ఈ శతాబ్దంలో ప్రతి ఒక్కరు సదా చెప్పుకునే ముగ్గురు చిత్రకారులలో బ్రాక్ ఒకడు. మిగిలిన ఇద్దరు పికాసో, మథీస్, ఇకఇప్పుడు మిగిందల్లా ఒక్క పికాసో మాత్రమే. భావికాలానికి వారు ఓల్డు మాస్టర్స్ అనుకోవడంలో సందేహంలేదు" అన్నారు. "ఈ యుగపు మహోన్నత చిత్రకారుని కోల్పోయాము" అన్నారు శ్రీ హెన్రీమూర్. ఇలా ఎంతోమందో ప్రముఖ చిత్రకారులు, కళాభిమానులు దుఃఖించారు ఈయన మరణానికి.

# తలనొప్పి
# పోగొట్టుకోండి ఇదుగో
# అమృతాంజనము

అమృతాంజన్‌లో 10 రకాల శమనం కల్గించే ఔషధాలు చేరడంచేత ఇది శీఘ్రంగా అమోఘంగా నివారణను కలిగిస్తుంది. ప్రతీసారి పిసరంత చాలు కాబట్టి ఒకే సీసా నెలల తరబడి వస్తుంది. 70 ఏళ్ళ ప్రశస్తినిగన్న ఇంటి మందు. అమృతాంజన కండల నొప్పి, బెణుకు, గుండె జలుబు ఇంకా ఇతర నొప్పులు, జలుబులు మరియు ఇతర బాధలకు అమోఘమైనది.

వాతావరణం మార్పు సంసారంలో తాపత్రయాలు, నొప్పులు, జలుబులు మరియు బాధలు కలిగిస్తాయి. ఎప్పుడూ అవసరానికి అందుబాటుగా అమృతాంజన ఉంచుకోండి.

**అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు**




అమృతాంజన్ క్రొత్తగా అట్ట పెట్టెలో వస్తూంది. సీసా 'అలూ' క్యాప్‌తో సీలు చేయబడింది.

**అమృతాంజన్ లిమిటెడ్**

**మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ**



JWT/AN/2329

# రెండు గట్లు



## శ్రీ దిలీప్‌కుమార్ సేన్‌గుప్త

మానవుని జీవనం నది వంటిది, ఒకవైపు పోత, ఒక వైపు కోత. వీరగుడి పాపయ్యలింగం కథ వినగానే ఈ చిరంతన సత్యం తిరిగి క్రొత్త అర్థంతో నా మనసుకు గుర్తు వచ్చింది. నా కన్నులతో నేను స్వయంగా చూచి ఉండకపోతే 'చంద్రభాను' చెప్పిన మాటలు పూర్తిగా విశ్వసించే వాడినో లేదో సందేహమే. నిజానికి చంద్రభాను పాపయ్యలింగం కథ చెప్ప లేదు. అతడు చెప్పింది పాపయ్యలింగం భార్య కథ. నా ఆఫీసులో చంద్రభాను తన రూములో కూర్చుండి ఉండగా అక్కడే ఆమెతో నాకు పరిచయం చేశారు. చూడగనే నా కాశ్చర్యమయింది. ఆమెతో మాటలాడిన తరువాత మరిన్నీ! అంతకుముందు కొద్ది రోజుల క్రితమే అమరావతి వెళ్లడం, అక్కడ రెండువేల యేండ్ల క్రితం మలచిన కుడ్య చిత్రాలు చూడటం జ్ఞాపకం వచ్చాయి. ఆ చిత్రాలలో ఒక స్త్రీమూర్తి ఆకృతిదార్ఢ్యం ఎదుట నిలిచి ఉన్నట్లుంది. ఆమెకు ఇంగ్లీషు భాష రాదు. హిందీ కొంచెం వచ్చు. ఆ హిందీ అయినా మాటలాడితే తెలుగు యాస. ఆమె ఒక రచయిత్రి యని చంద్రభాను అన్నాడు. ఎన్నో తెలుగు కథలు హిందీలోకి, హిందీ నుండి తెలుగులోకి అనువాదం చేసిందట. కేదార్—బదరీనాథ్ యాత్రలు ముగించుకొని ఏడెనిమిది రోజుల క్రితమే తిరిగి వచ్చి వాళ్ల ఊరిలో సంతర్పణలు, సమారాధనలు చేసింది. ఇదంతా విని నేను మరీ ఆశ్చర్యపోయాను.

"ఇరవై అయిదు, ఇరవైయారు ఏండ్ల వయస్సులో కేదార్—బదరీనాథ్ యాత్ర!"

"తల్లిగారిని తీర్థయాత్రలు చేయించడానికి వెళ్లి వచ్చిందా?"

"లేక అమ్మమ్మగారిని ......"

"ఎవ్వరినీ తీసుకొని వెళ్లలేదు."

"ఎవరి కూడాను వెళ్లలేదు. తాను ఒంటరిగానే వెళ్లి వచ్చింది."

"ఒంటరిగానా ?"

"—ఒంటరిగా ఏముంది? రెండు వందలమంది తోడి యాత్రికుల చీమలబారులో నే నొకదాన్ని. ఒంటరి నెందు కవుతాను ?"—ఆమె సమాధానం.

"—కేదార్—బదరీనాథ్ యాత్రలకు ముందు కాశ్మీరు కూడా వెళ్లి అక్కడ అమరనాథ్ కూడా చూచి వచ్చాను" —అని ఆమె చెప్పబోయింది.

చాల ఆశ్చర్యంగా ఉందే !

రెండు మూడు నిముషాలు ఆఫీసు వ్యవహారాలు చంద్రభాను తో మాటలాడి నేను నా గదిలోకి వచ్చేశాను.

ఆ తర్వాత చంద్రభానుని కలుసుకొన్నప్పుడు అతన్ని అడిగాను.

"ఎవరా అమ్మాయి ?"

"శరత్ సాహిత్యంలో కథానాయిక" అని చంద్రభాను జవాబు.

భారతీయ సాహిత్యములో స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యము కల్పించి ఆ విశాల పరిధులలో ఆమెని ప్రతిష్ఠించి రాణిని చేసిన ప్రథమ రచయిత శరత్‌చంద్రుడు. ఆ అమ్మాయి శరత్‌చంద్రుని కథలకు వాస్తవ రూపాంతరము. అయితే ఆమె పదమూడేండ్ల వయస్సులో తన హృదయం కోరిన హక్కులు సంఘ నియమాల కంటే మూల్యతరం అని ప్రకటించినప్పటికి ఆమె శరత్ సాహిత్యం చదివి ఉండలేదు. శరత్‌చంద్రుని కథలు, నవలలు తెనుగులో అనువాదం పొందాయి. అందుబాటులో ఉన్నాయి. అవన్నీ సంపాదించి ఆమె తర్వాత చదివింది. అందు సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన స్త్రీ శ్రీరాజ్యం. పదమూడవ యేటనే ఆమెను మేనమామ కిచ్చి పెండ్లి చేశారు. దానిలో అస్వాభావికత ఏమీ లేదు. అది ఆంధ్ర దేశపు ఆచారం. కాని పెండ్లినాటి రాత్రి మాత్రం శ్రీరాజ్యం ప్రవర్తన అస్వాభావికంగా ఉంది. పడకగదిలో ఆ రాత్రి పెళ్లికొడుకుచేత ఆమె ఒక శపథం చేయించిందట.

"చూడు మావయ్యా ! లోకం దృష్టిలో మన మిద్దరము భార్యాభర్తలం. కాని స్వయంపక్షములో నీవు నాతో ఎన్నడూ మామగా కోరే మర్యాదలు అతిక్రమించకూడదు."

ఆంధ్ర ప్రదేశ్‌లో మేనమామకీ మేనకోడలికీ పెళ్లిళ్లు ప్రాయికంగా జరుగుతూనే ఉంటాయి. అందుకనే ఈ రైతు

కుటుంబాల్లో మేనమామ తన అక్కకు ఆడపిల్ల జన్మించ గానే తన హక్కు భుక్తంగా భావించుకొంటాడు. ఆ యాచారం ప్రకారమే శ్రీరాజ్యం పుట్టినప్పటినుండి ఆమెపైన పాపయ్యలింగం మనస్సు స్థిరపఱచుకొన్నాడు. కాని, ఆ పెండ్లి నాడు శోభనపు గదిలో శ్రీరాజ్యం మాటలు వినగానే అతని కన్నులు సుస్థిరమై నిశ్చలంగా నిలిచిపోయాయి.

శ్రీరాజ్యం తనంతట తానే చంద్రభాను తో ఈ సంగతి చెప్పింది. ఇది విని ఆమె భర్త ఒకే ఒక్క మాట అన్నాడట, ఇలాంటి కోరిక ఈమె కోరినందుకు ''అలాగే'' అని.

శ్రీరాజ్యం పాపయ్యలింగాన్ని ఇదే మాట రెట్టించి అడిగింది.

''నీ వెన్నడూ ఈ శపథం ఉల్లంఘించకూడదు సుమా! అలాగ చేస్తానని ప్రతిజ్ఞ చెయ్యి.''

ఆ మాటకు కూడా పాపయ్యలింగం ''అలాగే'' అన్నాడు. ఆ రాత్రి అంతా ఆ ఉచ్ఛిన్న యౌవన, ఆ నవ వధువు సరసనే 'కుర్చీ' లో కూర్చుండి, అలాగే గడిపివేశాడు.

*  *  *

కష్టమ్సు డిపార్టుమెంటులో ఉద్యోగం చేస్తూ ఉండడంచేత క్రాసు పరీక్ష చేసే ప్రవృత్తి నాకు వృత్తిధర్మంగా సంక్రమించింది.

''ఈమె భర్త వయస్సెంత అప్పుడు ?'' అంటూ నేను చంద్రభాను ని ప్రశ్న వేశాను.

''పెళ్లినాటికి ఆతని వయస్సు ఇరవైఎనిమిది.''

''ఏమిపని చేసేవాడు !''

''ఇప్పుడేం చేస్తున్నాడో అదే.''

''. . . . . . . . . . .''

''వ్యవసాయం.''

''ఏమంత కమతం ?''

''చాల సంపన్న కుటుంబం. పెద్ద కమతం— కొంచెమో గొప్పో చదువుకొన్నవాడు. మెట్రిక్ ప్యాస్.''

''అయితే యీ అమ్మాయి నాటకీయ ప్రవర్తనకు కారణం ?''

''మనస్సు యిష్టపడకపోవడం.''

''ఎంతోమంది ఆ యీడు పిల్లలు ఇష్టపడతారే ! ఈమె ఎందుకు యిష్టపడలేదు ?''

''పదమూడేండ్ల ప్రాయంలో ఉన్న తాను ఇరవై ఎనిమిదేండ్ల వయస్సు గల మేనమామను భర్తగా స్వీకరించడం ఆమెకి ఏవిధంగానూ సాధ్యంకాలేదు.''

''ఆ వయస్సుగల యువతు లెందరికో సాధ్యమవుతుందే!''

''కావచ్చు ఆమెకు మాత్రం అది సాధ్యపడలేదు.''

''అయితే ఈ ప్రతిజ్ఞకి భర్త ఎలాగు ఒప్పుకొన్నాడు ?''

''ఎలాగో నాకు తెలియదు గాని, పెండ్లినాటి రాత్రి జరిగిన యీ ఒప్పందం భార్యాభర్తలలో ఏ ఒక్కరూ భంగ పఱచలేదు.''

పెండ్లి అయిన తర్వాత శ్రీ రాజ్యం కాపురానికి వచ్చింది. అత్తవారింటిలో ఆమెకు మంచి పేరు ప్రతిష్ఠలు. మనో వాక్కాయ కర్మలలో భర్త యెడల తన విధులు, తన ధర్మము, తన మర్యాద అవిచ్ఛిన్నంగా కాపాడుతూ వచ్చింది. భర్తకూడ భార్య మనోగత వ్యక్తిగత వాంఛలను భంగపఱచే పనులేవీ చేయలేదు. ఆమెపైన ఏరకమైన జులుమ్ ప్రకటించలేదు. పధ్నాలుగు పదిహేనేండ్లు ఈవిధంగా గడిచిపోయింది.

''రాత్రివేళల్లో వీ రిద్దరిమధ్య, జంట మంచాల మధ్య, అయిదు గజాల దూరం వస్తూనే ఉందా?'' అని నేను ప్రశ్నించాను.

''కాక !''

''అయితే భర్త హృదయంలో ఉవ్వెత్తున లేచే వాసనా సముద్రం ఉద్వేలమై పొంగి పొరలి, ఈ అయిదు గజాల తటరేఖను అతిక్రమించి గట్టు తెగలేదంటావా ? అది ముంచుకొని వచ్చి ఆ ముంపులో ఆమెను కూడ కొట్టుకొని పోయేటట్టు చేయలేదూ ?''

''లేదు, ఏ ఆకర్షణ చూచి భర్త హృదయంలో వాసనా సముద్రం ఉద్వేలమై ఉప్పొంగిపోతుందో, ఆ యాకర్షణగల ముఖచంద్రము ఆతనివైపు తుషార హిమానీ శీతలమైన భాగమే త్రిప్పేది. ఇంకే సముద్రం పొంగుతుంది ?''

''సరేకాని, ఇంతకీ అతని యెడల ప్రతిరుద్ధమైనది, శ్రీరాజ్యం మనస్సా శరీరమా ?

''ఆ ప్రశ్న నే నడగలేదు. అడిగితే మాత్రం ఏమిటి ? ప్రయోజనం ? ఒకవేళ చంద్రభాను ఈ ప్రశ్న వేసినా కాని శ్రీరాజ్యం విప్పి చెప్పగల్గుతుందా ''

''చంద్రభాను స్వయంగా తెలుగు సాహిత్యంలో గొప్ప రచయిత. ఈ హైదాబాదులోనే శ్రీరాజ్యం తో ఆతనికి పరిచయం. శ్రీరాజ్యం తన జీవితకథ యెంతవఱకు చెప్పిందో అంతవఱకు మాత్రమే తెలుసు. శ్రీరాజ్యం తా నెలాగు తెలుగు చదువుకొన్నదీ, దాని తరువాత ఎలాగు హిందీ నేర్చుకొన్నదీ, హిందీ నుండి తెలుగు అనువాదాలు ఎలాగు చేస్తున్నదీ, ఇవన్నీ

చంద్రభానుతో చెప్పింది. చంద్రభాను యీమె రచనలు చదివి అప్పుడప్పుడు మరామ్మత్తు చేస్తూ ఉంటాడు.''

''ఎలాగు వ్రాస్తుంది ?''

''సుభాషిణిలాగా ?'' అని నవ్వుతూ ప్రశ్న వేసేటప్పటికి చంద్రభాను బిగ్గరగా నవ్వి ''అలాగు కాదులే'' అని సమాధానం చెప్పాడు. సుభాషిణి ముప్పయి యేండ్ల అల్ప వయస్సు దాటకుండానే ముప్పైఆరు నవలలు వ్రాసింది. అవన్నీ జనాదరణ పొందాయి. చంద్రభాను ఉద్దేశంలో జనాదరణ అంటే, సామాన్య జనతాభిమానం అని. అంటే పురుషులకు అంగీకారయోగ్యమైన నిరావరణ గల విషయాలు సుభాషిణి వ్రాస్తుంది తన రచనల్లో.''

''శ్రీరాజ్యం కూడా అలాగే తన మనస్సులో పొంగుతున్న అగ్నిపర్వతాలలోని లావా ప్రవాహాలను సాహిత్య స్రవంతిలో ఎగిసి వచ్చేటట్టు చేస్తుందా ?''

''చేయదు, అలాగ ఎన్నడూ చేయదు. సుభాషిణికి పూర్తిగా వ్యతిరేకం శ్రీరాజ్యం. హిందీ నుండి తెలుగు చేసిన అనువాదాలు నిజంగా ఉత్తమశ్రేణికి చెందిన సాహిత్య కథలు. శ్రీరాజ్యం హిందీ నుండి రెండు నవలలు అనువాదం చేసింది. ఒకటి ప్రేమచంద్ ''గోదాన్'', రెండు జైనేంద్రకుమార్ ''త్యాగపత్ర.''

''స్వంతంగా ఏమీ వ్రాయలేదా ?''

''ఇంతవరకు అచ్చు కాలేదు, కాని యిప్పుడే నావద్ద వ్రాతప్రతులు వదలివేసి వెళ్ళింది. అందులో ఆమె వ్రాసిన వ్యాసాలు సంపుటీకరించి ఉన్నాయి.''

''దేనిని గూర్చి ?''

''మీరాబాయి, సూరదాస్: సూరదాస్ గూర్చి మూడు వ్యాసాలు. రెండు అతని కవిత్వములోని వాత్సల్య రసమును నిరూపిస్తూ, ఇంకొకటి అతని కృతుల గూర్చి. మరొకటి అసామీయ కవి మహాపురుషుడు శంకరదేవ్‌ని గురించి. ఈ తీర్థయాత్రలో తాను ఒంటరిగా వెళ్ళినందుకు కలిగిన మహా భాగ్యం ఈ భక్త కవిని గూర్చి తెలుసుకోవడమేనని ఆమె చెప్పిందట.''

ఆమెతోపాటు యాత్రలు సేవించిన ఒక అసామీ కుటుంబంతో కలిగిన పరిచయంవలన ''శంకర్‌దేవ్' ''బడా గీతాలు'' వినడం, దానిలోని భక్తిరసామృతాన్ని సేవించడం ఆమె తనకు లభించిన మహా భాగ్యంగా భావించుకొన్నది. ఈ వైష్ణవ భక్త కవి రచనలన్నీ వాత్సల్యరస పూరితాలే. మరో రసం అతని కవిత్వంలో లేనేలేదు. ఈ మాటలు చెప్తూఉంటే ''శ్రీరాజ్యం'' భక్తిరసావేశంతో ఉద్రేజితురాలయి పోయిందని చంద్రభాను అంటాడు.

''అంతా బాగానే ఉంది కాని ఇంతకాలం గడచిపోయినా, ఈ అమ్మాయి విరూప భావన భర్త యెడల ఎందుచేత ప్రసన్న కాలేదో ?'' అని నేను తిరిగి ప్రశ్నించాను. దానికి చంద్రభాను సమాధానం : ''ప్రసన్న అంటే బహుశః ఒక్క ఆ అర్థంలో కాలేదేమో, కాని మిగతా అన్ని విషయాలలోను ఆమె ప్రసన్నురాలే. భర్త ఆమెయెడల ఉదారంగాను, మహనీయంగాను ప్రవర్తించాడు.

''శ్రీరాజ్యం'' కథ వినగానే ఒక్క సంగతి స్పష్టమైంది. ''నారీర్‌మూల్య'' (శరత్‌చంద్రుని వ్యాసం) ''స్త్రీ విలువ'' గూర్చి ఈ పృథ్విలో ఏ పురుషుడు కూడ ఆమె భర్త గ్రహించినట్లు గ్రహించి ఉండడని తోచింది. ఏఒక్క రోజూ కూడ అత డామెను అవమానపరచలేదు. ఏయొక్క క్షణమైనా ఆమెను ఆరడి పెట్టలేదు.''

ఇదీ—నాకు తెలిసినంతవరకు నదికి పొతగట్టు కథ.

*   *   *

వీరగుడి గుంటూరుజిల్లాలోని ఒక కుగ్రామం. నేను ఇన్‌స్పెక్షన్‌కు వెళ్లే యిలాకాలోకి యిది రాదు. ప్రక్కనే నెల్లూరుజిల్లా వరకు నేను తనిఖీకి పోవచ్చును. ఈసారి నెల్లూరి జిల్లాలోని గూడూరు వరకు ఆఫీసు పని ఉండటంచేత వెళ్ళాను. అక్కడనుండి ఒకరోజు సెలవు తీసుకొని నిడుబ్రోలువద్ద డాక్ బంగళాలో మకాము వేశాను. వేసి, వీరగుడి గ్రామం ఉన్న తాలూకా తహశీల్దార్‌కి కబురు పంపించాను. ఒకేసారి పనులన్నీ ముగించుకొని ఆయన వస్తే తిరిగి వెళ్లిపోవచ్చునని ఆయనకు నేను పిలుపు పంపించాను. సాయంకాలం చీకటి పడిన తరువాత వచ్చినా కాని ఫరవాలేదని నా ఆహ్వానం. ఆ తహశీల్దారు అలాగే తన పనులు ముగించుకొని చీకటి పడిన కొంతసేపటికి ట్రావెలర్ బంగళాకి వచ్చాడు. అతనితో పాపయ్యలింగం ప్రసక్తి తెచ్చాను. తీగ కదిలిస్తే డొంక బయట పడినట్లు, ఆ తహశీల్దార్ తనకు తెలిసిన సంగతులన్నీ చెప్పాడు. అతనివల్ల విన్న మాటలే మీకు నేను తిరిగి చెప్తున్నాను.

పాపయ్యలింగం స్వగ్రామం వీరగుడి. అయినా ఆ చుట్టు ప్రక్కల అయిదారు గ్రామాలలోను పేరుమోసినవాడు. మోతుబరి అయిన పెద్ద రైతు. సంపన్న వ్యక్తి. వంద ఎకరాలపై చిల్లర కమతం. మామిడితోటలు, అరటితోటలు వేసి బాగా సంపాదించాడు. అరటితోటల పెంపకంలో ఆరితేరిన మొనగాడని పాపయ్యలింగానికి మంచి పేరు. ఆదర్శ కృషికుడు. కృషి

పండిట్. మన దేశంలో జరిగిన అనేక వ్యవసాయ ఫల ప్రదర్శనలలో ఆతడు పండించిన అరటి గెలలకు ప్రథమ బహుమతులు వచ్చాయి. రాష్ట్రపతి, ప్రధానమంత్రి మొదలు, పశ్చిమబెంగాలు ముఖ్యమంత్రి బిధాన్‌చంద్ర రాయ్, ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి ఏలకు అనేక ముఖ్య నాయకులతోపాటు పాపయ్యలింగం కప్పుటూ, మీల్లలూ అందుకొంటూ తీసుకొన్న ఫోటోలు పత్రికలలో అచ్చు పడ్డాయి. గ్రామ పంచాయితీ అధ్యక్షుడై క్రిందటి సంవత్సరం పంచాయతీ సమితి అధ్యక్షుడుగా కూడ ఎన్నికయ్యాడు. మనిషి చాల మంచివాడు. అజాతశత్రువు. తన స్వంత ధనం పెట్టుబడి పెట్టి ఆ గ్రామంలో బాలికల కోసం ఒక హైస్కూలు స్థాపించాడు. స్త్రీ విద్య అంటే ఆతనికి అపరిమితాభిమానం. భార్యకు తెలుగుతోపాటు హిందీ నేర్పించడానికి బెనారెస్‌లో ఉండి చదువుకొని వచ్చిన హిందీ మున్షీని పెట్టాడు. ఆమె క్షుణ్ణంగా తెలుగు, హిందీ భాషలలో పాండిత్యం సంపాదించడమే కాక హిందీ–తెలుగు అనువాదాలు చేస్తూ వచ్చింది. అప్పుడప్పుడు పత్రికలలో తాను చేసిన అనువాదాలు ప్రకటిస్తూన్నట్లు విన్నాడు. ఆ సంగతి తెలిసి, ఆమె భర్త ఎంతో ఆనందించేవాడు. ఇదంతా బాగానే ఉంది కాని ఈ దంపతులకి పిల్లా జెల్లా ఎవరూ కలుగలేదు. అందుకని ఆమె అత్తగారు, కోడల్ని ఎంద రెందరో వైద్యులకి చూపించింది. ఆయుర్వేద భిషగ్వరులు, యూనానీ హకీంలు, అల్లోపతీ డాక్టర్లు ఎందరెందర్నో చూచారు. ఎవరిచేత ఏమీ కాలేదు.

''హాస్పటల్‌కి తీసికొనివెళ్ళి పరీక్ష చేయించారా ?'' అని నేను ప్రశ్నించాను.

''ఆఁ, గుంటూరు హాస్పటల్‌లో రెండుసారులు పరీక్ష చేయించారు. ఇవన్నీ చేయకుండా ఆ ముసలియామె ఊరికే కోడలిని విడిచిపెట్టివేస్తుందా'' అని తహశీల్దార్ సమాధానం చెప్పాడు.

''పాపయ్యలింగం ఏమంటాడు ?''

''ఏమంటాడు ?'' అంటూ తహశీల్దార్ పెదవి విరిచివేశాడు.

''పాపయ్యలింగం విచిత్రమైన వ్యక్తి. మళ్ళీ పెళ్ళి చేసుకోమని ఆతని బంధువులు, ఆప్తవర్గం ఎన్నోరకాల బలవంతం చేశారట. ఆ యాప్తకోటిలో ఆతని భార్యకూడ ఉన్నదంటే ఆశ్చర్యంలేదు. ఎవ రెన్ని చెప్పినా ఆతడు మళ్ళీ పెళ్ళి చేసుకోవడానికి 'ససేమిరా' సమ్మతించలేదు.'' అంటూ తహశీల్దార్ చెప్పుతున్నాడు.

''తన భార్య మనస్సు నొప్పించకూడదనేమో ? అంతకంటే ఏముంటుంది ?''

''ఇందులో స్త్రీదోష మేముంది ? ఆమెయే చేసుకోమన్నది కదా ! ఇంతకీ విధి విలాసం ! ఇంత అనుకూల దాంపత్యంలో, ఇంత అందమైన యువతి భార్యగా గల కాపురంలో, ఆ సుందర స్త్రీని వంధ్యగా చేయడం, ఈశ్వర చిద్విలాసం కాక మ రేమిటి ?''

''అయితే ఈ దంపతులు ఏ పిల్లవాడినైనా దత్తత చేసుకోలేక పోయారా ?''

''లేదు. దానికి పాపయ్యలింగం సమాధానం—సంతానం కావాలనే కోరిక స్త్రీలనే ఎక్కువ బాధిస్తుంది కదా ? ఈ విషయంలో ఆమెకు పట్టింపు లేనపుడు నే నెందుకు కలుగజేసుకోవాలి అనేవాడట !''

''ఆమెకు కోరిక లేదా ?''

''లేదు. అయితే ఆమె ఏది అడిగితే అది జరిపించే ఉదారత పాపయ్యలింగంలో ఉన్నది. ఉదాహరణకు ఆతని భార్య కావాలన్నది కాబట్టి తండ్రితో దెబ్బలాడి అయినా సరే, బాలగోపాల దేవాలయం కట్టించి అక్కడ కృష్ణ విగ్రహాన్ని ప్రతిష్ఠ చేయించాడు. వాళ్ల కుటుంబానికి పరంపరాగతంగా శివారాధనే ముఖ్యం. పైగా ఈ ప్రాంతాలలో రాధాకృష్ణ విగ్రహాల ప్రతిష్ఠ కాని, బాలగోపాల దేవాలయ నిర్మాణం కాని అంత ఎక్కువగా జరుగవు.''

''ఇంతకీ పాపయ్యలింగం—ఈ రూపవతి అయిన భార్య అంటే అనురక్తుడేనా ?''

''అవును, యథాస్త్రీ తథా పతిః అన్న సామెతలాగ, వ్యక్తిగతంగా పాపయ్యలింగం స్వభావంచేత చాల మంచివాడు. ఆతనిలో వంక పట్టడానికి ఏమీ లేదు. ఒక్కటి మాత్రం—నా దృష్టిలోకి వచ్చింది. అది కూడ చాల యేండ్ల క్రితం జరిగింది. ఎంతవరకు నిజమో చెప్పలేను.''

నేను జిజ్ఞాసగా, వహౌసంగానే, అది తెలుసుకోవాలని కుతూహలం చూపించాను.

''ధనవంతులైన పురుషులు కొంచెం చలించి ఎంగిలి పడడంలో ఆశ్చర్యంలేదు. ఈ ప్రాంతాలలో అలాంటి చంచల స్వభావం పెద్ద లెక్కలోకి తీసుకోరులెండి'', అంటూ ఆ తహశీల్దార్ వికవిక లాడుతూ నవ్వడం మొదలుపెట్టాడు.

''అలాగా ?'' అంటూ నేను కొంత ఆశ్చర్యం ప్రకటించాను. తహశీల్దార్ తన కథ కొనసాగించాడు.

''పదేండ్ల క్రితం మాట. పాపయ్యలింగం పెండ్లి అయిన క్రొత్తలో ఒకటి రెండేళ్లయినా దాటకుండానే ఇది జరిగింది. ఒకరాత్రి వేకువజామున పిరగుడి ప్రక్క ఒక చిన్న గ్రామం 'శంఖ సముద్రం' నుంచి ఒక ముసలి రైతు రొప్పు

కొంటూ వచ్చి మా తలుపు కొట్టాడు. తలుపు తెఱవగానే నేలమీద పడి ఏడవడం మొదలుపెట్టాడు. కారణం ఒక ఘోరం జరిగిపోయింది. అతని కుమార్తె, బాలవితంతువు ఉరి పోసికొని చచ్చిపోయింది. ఆమాట చెప్పడానికే ఆతడు ఆవేశపడి పోతున్నాడు.

''బాబూ ! ఇది ఆత్మహత్య కాదు. హత్య—ఖూనీ'' అంటూ కేకలువేస్తూ రోజుకొంటూ చెప్పాడు. కడచిన రెండు సంవత్సరాలనుండి పాపయ్యలింగం ఈ ముసలిరైతు ఇంటికి వస్తూ పోతూ ఉండేవాడట. ఆతని కుమార్తెతో సంబంధం. ఆ సంగతి వినగానే నేను విస్తుపోయాను. అంటూ తహశీల్దార్ చెప్పబోయాడు.

''మీ కెందుకు ఆశ్చర్యం కలిగింది ?'' అని నేను ప్రశ్నించాను.

''ఏమీలేదు. పాపయ్యలింగం అలాంటివాడు కాడు. అంత వఱకు త్రోవతప్పి ఎఱుగడు. పైగా ఆతనికి పెళ్లి అయింది. త్రిలోకసుందరియైన భార్య క్రొత్తగా కాపురానికి వచ్చింది. వయస్సులో ఏ కొంచెమో తేడా తప్ప, ఆమె చాలా అనుకూల వతి, రూపసి అయిన ధర్మపత్ని. అలాంటివాడు—తప్పటడుగు వేశాడంటే నమ్మలేకపోయాను.''

ఆ వృద్ధుడు బిగ్గరగా రోదన పెడ్తూఉంటే ఆతని ఆవేదన ఆపలేకపోయాను.

''ఎంత పేదవాడయినా తండ్రి తండ్రే కదా ! ఎంత పేదరాలయినా స్త్రీ స్త్రీయే కదా ! ఆమె శక్తిస్వరూపిణి, దుర్గామాత, దేవతాంశ సంభూతురాలు. ఆమె మూల్యం ఐశ్వర్యవంతుల సిరిసంపదలన్నీ యిచ్చినా కాని కొనలేనిది. అలాంటిదాన్ని—అయ్యో—ఈ ఆకతాయి'' అంటూ గుండెల మీద బాదుకొంటూ ఆ ముసలితండ్రి ఏడ్చివేశాడట. అక్కడికి ఆ పేదరైతు పాపయ్యలింగాన్ని ఎన్నోసారులు వేడుకొన్నాడట.

''అయ్యా ! ఈవిధంగా మా అమ్మాయిని అవమాన పఱచవద్దు. నీకు ఆపిల్ల అంటే యిష్టముంటే పెళ్లి చేసుకో. లేకపోతే యింక యీ గుమ్మం తొక్కవద్దు'' అని ఖండితంగా చెప్పివేశాడు. ఆమాట అతని చెవి కెక్కలేదు. మఱి నాలుగు నెలలు గడిచాయి. ఆ అమాయకురాలు గర్భవతి అయింది. అప్పుడుకూడ ఆమెను వివాహం చేసుకోడానికి ఆ పెద్దమనిషి యిష్టపడలేదు.

ఈవేళ అర్ధరాత్రివేళ ఆ యమ్మాయి మెడకి ఉరిపోసుకొని—యీ పృథ్విలో ఆడు పుట్టుక పుట్టినందుకు స్త్రీ విలువను నారీమూల్యాన్ని చెల్లించుకొని వెళ్లిపోయింది. ఇప్పుడేం చేయమంటారు బాబూ, అంటూ ఆ ముసలివాడు గద్గదించాడట. దానికి తహశీల్దారు నయానా భయాన ఆ ముసలి రైతుని బెదిరించి ఆ రైతుకి అనేకవిధాల నచ్చచెప్పాడు.

''చూడు, ముసలయ్యా ! తగిన సాక్ష్యం రుజువు లేకుండా పాపయ్యలింగం వంటి హోదాగల రైతుమీద లేనిపోని అపనిందలు వేస్తే కోర్టు వ్యవహారం చాలా పైకి పోతుంది. సర్కారు చట్టం అతని పక్షాన ఉన్నది. సాక్ష్యం చట్టుబండలు లేకుండా నీ వెన్ని చెప్పినా నీ మాటలు నమ్మరు. పైగా లేనిపోని కట్టుకథలు కల్పించి ఒక పెద్దమనిషి మంచి పేరు వీథిలో పెట్టావని నిన్ను శిక్షిస్తారు'' అంటూ హడలుగొట్టి పంపించివేసిన సంగతి తహశీల్దారు చెప్పాడు. అంతే- అంతకుమించి నేను విశేషంగా తెలిసికోవలసిన అవసరం లేకపోయింది.

ఇదీ, నా మనస్సుకి తోచినంతవఱకు నదికి కోతగట్టు కథ.



# మెర్లిన్ మన్రో మృతి



## శ్రీమతి డయానా ట్రిల్లింగ్

విఖ్యాత అమెరికన్ సినీతార మెర్లిన్ మన్రో గత సంవత్సరం ఆగస్టునెలలో, తన 36 వ ఏట మరణించింది. మరణించడమంటే — లాస్ఏంజెల్సులోవున్న తన సొంత ఇంటి పడక గదిలో ఆమె చనిపోయి పడిఉండటం ఒక ఆదివారం ఉదయం నలుగురూ చూచారు. చనిపొయ్యే సమయానికి ఆమెకు ఎవరో ఫోన్ చేశారో, లేదా ఆమే ఎవరికైనా ఫోన్ చేయబోయి ప్రాణం విడిచిందో అన్నట్లు ఆమె చెయ్యి టెలిఫోన్‌పై ఉంది. ఆమె పడకకు ప్రక్కనవున్న నైట్ టేబిలుపై రక రకాల మందుల సీసాలు ఉన్నాయి. వాటిలో నెంబ్యుటాల్ మాత్రలు 25 ఉండే సీసా కూడా ఒకటి ఉంది. కాని అది ఖాళీ సీసా! ఆమె మృతి జెందడానికి కారణాలేమిటో కనుక్కోవడానికై క్యాలిఫోర్నియా శాసనము ననుసరించి ప్రభుత్వం కొందరు మనస్తత్వ శాస్త్ర ప్రవీణులైన వైద్యులను నియమించగా, వారు ఆమె మరణించిన రెండు వారాలకు తమ నివేదిక సమర్పిస్తూ, ఆమె మరణానికి పూర్వపు సంగతులనూ, మరణించిన పరిస్థితులనూ పేర్కొని ఆమె ఆత్మహత్య చేసుకుందని స్పష్టం చేశారు. ఎవరైనా గిట్టనివారు ఏమైనా చేసిఉంటారా అని అనుమానించడానికి తావేలేదు. చేజేతులా చేసుకున్న ఘోర కృత్యమేననీ, మానసికంగా ఆవిడ అనుభవించిన బాధకు తుది పర్యవసానమేననీ విస్పష్టంగా తెలుస్తూనే ఉండె—శనివారం సాయంకాలం మెర్లిన్‌మన్రో అత్యవసరంగా తన వైద్యుడికి ఫోన్ చేసిందట. ఆ వైద్యుడు ఎవరోకాదు. ఆమెకు నిద్ర పట్టక పోవడానికీ, ఊరికే ఆందోళన చెందుతూ మనోవ్యథతో తీసుకుంటూ, ఎప్పుడూ నిస్పృహతో, నిరాశతో ఉంటున్నందుకూ తరచు ఆమెకు చికిత్స చేస్తూ ఉండే మానసిక శాస్త్ర ప్రవీణుడు. ఆమె పిలుపు నందుకొని ఆయనవచ్చి చూచి వెళ్లాడు. అయితే ఆవిడ కావాలని నిద్ర పట్టేమాత్రలు అమితంగా వేసుకొని తద్వారా ఆత్మహత్య చేసుకుందా, లేక అది ప్రమాద వశాత్తు జరిగిన సంఘటనా అన్నది ప్రవీణుల తీర్పులో ముఖ్య పరిశీలనాంశమై ఉంది. చచ్చిపోదామనే 25 నిద్ర మాత్రలు మ్రింగిందా? అవును, ఆ ఉద్దేశంతోనే ఆమె అలాంటి పని చేసిందని ప్రవీణు లన్నారు. అంటే చనిపోవాలని ప్రబలమైన కోర్కె ఆమెకు కలిగిందన్నమాట.

ప్రవీణులు చెప్పింది కేవలం ఒక అభిప్రాయం మాత్రమే ఐతే, లేదా శాస్త్ర సూత్రీకరణమే అయితే అందులో సవరణలకు అవకాశముంటుంది. నే నిలా అంటున్నానంటే దీని అర్థం మెర్లిన్ ప్రమాద వశాత్తు మరణించిందనిగానీ, ఆ మాత్రలు ఎంత అపాయకరమైనవో తెలీకుండా చేతికి చిక్కినన్ని మ్రింగిందనికాని కాదు. ఇలాంటి మరణాన్ని బుద్ధిపూర్వకంగా తెచ్చి పెట్టుకున్నదని అనడంకంటే, ఆ సందర్భంలో అనుకోకుండా అది అలా జరిగిందని భావించడం సబబేమో! జీవించి ఉన్నప్పుడు కలిగే వ్యథలనుండి తప్పించుకోవాలనే కాంక్ష మనిషికి ఉంటుంది. అలాంటి కాంక్ష ఫలితమే ఆమె మరణమనుకుంటాను. నేను మనోవ్యాధుల నిపుణురాలిని కాను. నాకు మెర్లిన్ మన్రోతో ఎన్నడూ పరిచయం కూడా లేదు. నాకు బొత్తిగా తెలియని వ్యక్తి ఆమె. అయితే ఒక వ్యక్తి అమితంగా ఈతి బాధలు పడుతూ, వాటితో మనస్సు వికలమై పోయినప్పుడు, ఆ బాధనుండి కొంతసేపు విముక్తి కలిగే మార్గాన్ని అన్వేషించడం సహజం. అయితే నిజంగా మరణించకుండా కొంతసేపు చైతన్యం లేకుండాపోయి, అలాగైనా తాత్కాలికంగా విమోచనం లభిస్తే చాలుననుకుంటారు. చనిపోవాలని కోరుకోకుండానే కొంతసేపు జీవించడమనేది లేకుండా ఉంటే బాగు అనుకోవచ్చు. మెర్లిన్ మన్రో విషయంలో సరిగ్గా ఇలాంటిదే జరిగిందని నా భావం. 'చనిపోవాలని ఉంది' అని ఆమె అన్న మాటలో తన జీవితాన్నే తుద ముట్టించుకోవాలన్న అభిలాష కాదు, ఆమె వ్యక్తపరచింది. తన మనోవ్యథను పోగొట్టుకోవాలనే ఆమె తాపత్రయ పడింది. తననే తాను చంపుకోవాలనికాక, తనలో స్పృహను లేకుండా చేసుకోవాలనుకుంది. కాని తీరా మాత్రలు మ్రింగేసిన తర్వాత తాను ఎలాంటి సుఖ నిద్రకైతే ఎంతగా మోజు పడిందో ఆ నిద్ర దీర్ఘనిద్రయై తాను తిరిగి ఈ లోకానికి రాలేనన్న సంగతి గుర్తించి వెంటనే సహాయంకోసం ఫోనుపైకి ఆమె చేయి పోయింది.

# మెర్లిన్ మన్రో మృతి

అయితే ఇదంతా యదార్థంకాదు. ఊహాగానం మాత్రమే. ఆ ఊహించుకోవడం కూడా వైద్యులు చేసుకుందిగాని సామాన్యులకు వీలయ్యేదికాదు. మనబోటి వాళ్ళకు 'ఆమె ఎంతటి ఘోర కృత్యానికి పాల్పడింది, అబ్బా!' అన్న ఒక దిగ్భ్రాంతి కలుగుతుందే తప్ప, ఆమె ఆత్మహత్యకు కారణభూతమైన ఉద్దేశాలు ఎంత ప్రముఖమైనవో అసలు స్ఫురించనే స్ఫురించదు. మెర్లిన్ మన్రో తన జీవితాన్ని తుదముట్టించుకుంది, అని సర్వ ప్రపంచమూ అనుకుంది. ప్రమాద వశాత్తు జరిగిన దానికీ, యదార్థమైన ఆత్మహత్యకూ గల తేడాను వైద్యులు మీమాంసచేస్తూ, ఎవరికి తట్టినట్లు వారు వితర్కిస్తూ ఉంటే, ప్రజలు—'జరుగవలసింది యథావిధిగా జరిగి పోయింది, దాన్ని తప్పించడం ఎవరితరం' అనుకున్నారు. ఈ సంఘటనతో ప్రతివారూ దిగ్భ్రాంతిజెంది కొంత వ్యాకులత జెందడంవల్ల 'ఆమె తన్ను తానే చంపుకుందే' అని ఆశ్చర్యమగ్నులు కాలేదు. ప్రపంచం మొత్తంలోనే అంతగా పేరువడ్డ ఈ నటీమణికి ఇలాంటి పర్యవసానం ఎప్పుడో ఏదో ఒక రూపంలో సంభవించక తప్పదని అంతా కొంతకాలంగా అనుకుంటూనే ఉన్నారు.

మెర్లిన్ మన్రో మరణించిన తర్వాత ఆమె అవసాన దశను గూర్చి ఎన్నో రకాల వార్తలూ, కట్టుకథలూ వెలువడ్డాయి. ప్రతి దానిలోనూ ఆమె తప్పకుండా ఆత్మహత్య చేసుకుందని చెప్పడమో, లేదా మనో వ్యథతో పూర్తిగా క్రుంగి పోయి, చివరకు అలాంటి స్థితికి ఆమె వచ్చిందనో చెప్పడం జరిగింది. ఇలా అనడంలో నా ఉద్దేశం ఆమె ఒక రోజు తన ప్రాణాన్ని తానే తీసుకొంటుందని దైవజ్ఞులు జోశ్యం చెప్పినదిగాని, లేదా మనస్సు లోతులలోనికి ఆమె అదృశ్యమై పోయిందనిగాని కాదు. ఆమెనుగూర్చి ఎంతమంది వ్రాసినా, మతి స్థిమితంలేక, విపరీతమైన ఆవేశాలతో, మానసిక సమస్యలతో సతమతమవుతూ ఉన్నప్పటికీ, ఆమె దృఢంగానే ఉండి, జీవితంలో ఉండే కోర్కెలను కలిగి ఉంటూనే, ప్రమాదాలను ఎదుర్కొంటూనే రోజులు గడిపింది, అని మనకు హామీ ఇస్తూ, ఇంకా ఇలా ఏవేవో చెప్పుకుపొయ్యారే తప్ప, ఆమె వ్యక్తిత్వాన్ని సరిగా అంచెనావేసి, వ్రాసినవారు లేరు. మెర్లిన్ మన్రో సినీ తార. అందులోనూ ఆరంభంనుంచే తారాపథాని కెగసి అద్వితీయమైన స్థానాన్ని పొందాలని ఆశలు పెట్టుకున్నది. దానికి తోడు చాలా పట్టుదల, శ్రద్ధ గల వ్యక్తి. తన నటనాప్రతిభను ఎన్నో రెట్లు పెంచుకోవాలని అభిలషించింది. బహు వివాహాలు చేసుకుంది. అయినా ప్రేమలో కృతార్థురాలు కాలేదు. నిర్మలప్రేమ తన కెప్పుడు అందుబాటులోకి వస్తుందా అని చివరివరకూ ఎదురు తెన్నులు చూచింది. ఆమెకు ఎన్నో గర్భస్రావాలు అయ్యాయి. అయినా పిల్లల్ని కనాలని గాఢంగా వాంఛించింది. ఆ సుదినం ఎప్పుడొస్తుందా అని తపించింది. తన మనస్సును తానే తీవ్రంగా విశ్లేషించుకుంటూ ఉండేది. ఆమె మూర్తి వెనుకటికంటె మరింత సుందరమైంది. చురుకుతనం, ఉత్సాహం తగ్గకూడదని ప్రయత్నించింది. తన చివరి చిత్రం పూర్తి అయ్యేదాకా నిలకడగా ఉండాలనీ, అందుకు అవాంతర మేదైనా వస్తే దాన్ని అధిగమించాలనీ కృతనిశ్చయురాలైంది. ఇదిగో ఈ రకంగా, ఆమెను గూర్చిన వార్తలు వెలువడ్డాయి. చివరిసారిగా ఆమె ఎవరికో ఇచ్చిన ఇంటర్‌వ్యూలో కూడా (ఈ ఇంటర్‌వ్యూ వివరాలు అచ్చు రూపంలో వచ్చేసరికి ఆమె చనిపోయింది) ఆమె ఆశాజీవిగానే ఉందనీ, ఎంతో ఆత్మ విశ్వాసం ఆమెలో కన్పించిందనీ, తన నటనా చాతుర్యాన్ని ఆమె పెంపొందించుకోగలదనీ, తనకు తగిన పాత్ర లేవో తాను తెలుసుకో గలదనీ, అటు కష్టించి పనిచేస్తూ ఇటు తన మనస్సును తాను తెలుసుకుంటూ, ఎంతో కాలంగా లభించకుండా పోతున్న మనశ్శాంతిని పొందగలదనీ వ్రాశారు, పలువురు రచయితలు.

అసలు ఇలాంటి ఆశావాదాన్ని వ్యక్తం చేయవలసిన అవశ్యకత ఎప్పుడైతే కలిగిందో, ప్రమాదం తప్పకుండా ఉందన్నమాటే. ఆ ప్రకారమే చెడు వార్త ప్రజలు విన్నారు. అన్నిటికన్న గమనించదగ్గ విశేష మేమిటంటే—ఒక వైపు కష్టాలు ఒక దానిపై ఒకటి వచ్చిపడుతూవున్న ఆ దశలో సైతం ప్రజల మనస్సులలో ఆమె వ్యక్తిత్వ రూపకల్పన చెక్కు చెదరకుండా ఉంది. జీవితాన్ని ఆమె పకడ్‌బందీ చేసుకోలేక పోయిందనీ, ఆ బలహీనత ఆమెలో ప్రస్ఫుటంగా కన్పించేదనీ కొందరు అన్నప్పటికీ, ఆమె జీవ శక్తులన్నీ మూర్తీభవించిన ముదిత అన్న మన భావం అలాగేవుంది. దానికేమీ విఘాతం కలుగలేదు. ఆమె మరణంవల్ల నాలో కలిగిన భావాలు సాధారణమైన వనుకుంటాను. ఒక వ్యక్తి పోయిందే అన్న తలంపు ప్రభావంవల్ల ఇలాంటి భావాలు నాకు కలిగాయేమో! అయితే ఇది చరిత్రలో, లేదా ప్రకృతిలో విపత్కర సంఘటన అన్న భావం కూడా నాకు కలిగింది. జీవితంలో ఏదో వెలితి, ఏదో లోపం అనిపించింది. కారణ మేమంటే, ఆ వ్యక్తి ఇక లేదు. ఆమెను కోల్పోవడంతో జీవితానికే ఏదో దెబ్బ తగిలినట్లనిపిస్తూ ఉంది.

నేను ఆమెను సినీ తారగా గుర్తించి, చిత్రం కత్తిరించి దగ్గర పెట్టుకోదగ్గ తారలలో ఆమె సరికొత్తది అన్న అభిప్రాయాని కొచ్చేసరికి మెర్లిన్ మన్రో ప్రపంచ ప్రసిద్ధ

తారగా పేరు పడింది. అదేమి చిత్రమోగాని, మనలో చాలా మందిమి, మన మధ్యా, సకల ప్రజాభిమానానికి పాత్రులైన సుప్రసిద్ధ వ్యక్తుల మధ్యా ఇటువంటి తెరను ఏర్పరచుకుంటాము. మొదట్లో నేను మెర్లిన్ చిత్రాన్ని అధిక్షేపించేదాన్ని—ఒక నాటి సాయంకాలం టెలివిజన్‌పై 'బస్‌స్టాప్' ట్రెయిలర్‌లో ఆమెను కాకతాళీయంగా చూడడం తటస్థించింది. నేను ఎవరిని చూస్తూన్నానో తెలుసుకున్నట్లు నమ్మకంగా చెప్పలేను. కాని ఆ చిత్రం అలా ప్రత్యక్షం కావడంతోటే గదిలో ఏదో వెలుగు ప్రసరించింది. అంతకుముందు గది అంతా మసకగా ఉంది. ఆమె చిత్రం కన్పించిన ఆ క్షణమే తళుక్కుమన్పించింది. జ్యోతి వెలిగించినట్లు దీప్తివంతమైంది. మానవాతీతమైన వ్యక్తి ఎవరో ప్రత్యక్షమైనట్లనిపించింది. అది మరువరాని క్షణం. మరియే సినీతార కూడా నన్ను అంతగా ఆకర్షించలేదు. ఒక కళాఖండంలా ఆమె నా స్మృతిపథంలో అలా నిలిచిపోయింది. నా యవ్వనంలో పావ్‌లోవా కూడా మెరుపుతీగె వంటి తన శరీర ప్రదర్శనంతో నన్ను ఇలాగే ఆకర్షించిన సంగతీ, ఇటీవల నిజిన్‌స్కీ కూడా చలన చిత్రంలో అలాగే కన్పించి నన్ను ఆకట్టుకున్న వైనమూ అప్పుడు జ్ఞప్తికి వచ్చాయి. మెర్లిన్ మన్రో కూడా అంతే. చలన చిత్రంలో మాత్రమే విద్యుత్తువంటి ఆమె విలాస సోయగాలు విశదమవుతాయి. స్టిల్ చిత్రంలో ఆ జీవం, ఆ నడక, ఆ హావభావాలు ఎలా వస్తాయి? కెమెరాముందు ఆమె పోజు ఇస్తూ నిలబడితే ఎవరి దృష్టినైనా ముందు ఆకర్షించేవి ఆమె తనువూ, దాని వంపు సొంపులూ! వాటిని ఎక్కువసేపు చూడలేము. మళ్ళీ మళ్ళీ చూడాలన్న కోర్కె కూడా కలుగదు. ఆమెలో కన్పించే విశిష్ట జీవకళను దర్శించలేము. ఆమె శరీరానికి ఎంతటి చైతన్యం ఉందో గ్రహించడం మన వల్లకాదు. గదిలో క్షణకాలపు కాంతి ప్రసరణతో నేను అంతవరకూ వేటిని మనస్సులో పెట్టుకొని పురుషులలో కామేచ్ఛ కలిగించే ఈ బొమ్మను, వినాయింపు లేకుండా అందరి అభిరుచులకూ సరిపడే ఈ వింత వస్తువును గమనించకుండా, దానిచే ఆకర్షింపబడకుండా ఉండటానికి ప్రయత్నించానో అవన్నీ పటాపంచలై పోయాయి. అప్పటినుంచీ ఆమె నాకు ఆరాధనీయమైన కళాఖండంగా నిలిచిపోయింది.

సరే, నా సంగతి అలా ఉంచండి. ఈ విషయంలో నేను అల్ప సంఖ్యాక వర్గానికి చెందిన దాన్నేమో! యావత్ప్రపంచం ఎప్పుడో మెర్లిన్ మన్రోకు గల అనుపమాన శారీరక సౌష్ఠవాన్ని, సౌందర్యాన్ని గుర్తించి సృష్టిలోగల ఇతర సుందర వస్తువులను ప్రశంసిస్తున్నట్లే ఆమెనూ వేనోళ్ళ కొనియాడింది. ఆమె ప్రజల ఎదుట పడ్డప్పటినుంచీ తదితర స్త్రీల నుండి ఈ యువతిని ప్రత్యేకించి చూపే ఆ శరీర శాస్త్రమో లేక రసాయన శాస్త్రమో—ఏమంటారో దాన్ని ఏమో—ఆ విశేషాన్ని లోకం పరిగణించి ఔరా అని మెచ్చుకుంది. ఆమెలో గల ఇంద్రజాలాన్ని ఒకమారు ఆమోదించిన తర్వాత ఈ జీవితంలో మన మెవ్వరమూ ఉండని స్థితిలో ఆమె ఉందనో, లేక ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ఆమెలో కన్పించే జీవకళ జీవితాన్ని గూర్చిన మన ఊహాపోహలను మార్చివేయడానికి కారకమైందనో నమ్మడానికి, ఆమె మానసిక వ్యాధిగాని, తత్సంబంధమైన రుగ్మతగాని ఎలాంటి అవరోధం కల్పించలేదు. అంటే ఒక వ్యక్తి వ్యాధిగ్రస్తమైనదని చూచాయగా తెలిసి ఉండి కూడా, ప్రేక్షక లోకం ఆమెను ఒక అమోఘ వ్యక్తిగా తమ అంతరాంతరాలలో ఎంచుతూ ఉండంటే, అదే కళలోగల అద్భుత విశేషం అని చెప్పాలి.

మెర్లిన్ మన్రో మరణం తర్వాత ఆమెలోగల పరస్పర విరుద్ధమైన రెండు లక్షణాలు నాకు స్ఫుటంగా గోచరించాయి. ఒకటి: ఒక వైపు ఈ జీవితాన్ని ఆమోదించి, దానికి లోబడి జీవించడం. రెండవది: చనిపోవాలని అనిపించడం. ఈ రెండు లక్షణాలూ ఒకదాని కొకటి భిన్నమైనవిగా మనకు కన్పించనే లేదు. అసాధారణమైనదని చెప్పదగ్గ ఆమె జీవితంలో ఈ రెండు లక్షణాలు ఉంటాయనే అనుకున్నాము. వాటి రెండింటికీ సంబంధం కూడా ఉన్నట్లనిపించింది. అయితే రెండూ రెండు దిశలుగా ఉండడంచేత ఒకటి తెలిసిన వారికి మరొకటి కన్పించదు. మెర్లిన్ మన్రోను మెచ్చుకున్న ప్రేక్షకులు ఒక వ్యక్తిలో మానవాతీతంగా కన్పించే శరీర సంపద పుష్కలంగా ఉందంటే అదే తన నిగ్రహాన్ని కూడా సృష్టించుకోవలసిన అగత్యం కలిగి ఉంటుందనీ, జీవితంనుంచి ఎక్కువ కోరుకునే వారినీ, లేదా జీవితంనుంచి అధికంగా పొందిన వారినీ విశాల ప్రకృతో, లేక నాగరికతలోనే ఒక భాగమైన ప్రకృతో ఏదో ఒక రూపంలో శిక్షిస్తుందనీ గ్రహించినట్లు నా కనిపిస్తుంది. శరీరంలో ఒక ఇంద్రియంలో ఏదైనా లోపముంటే, ఆ నష్టాన్ని ప్రకృతి మరో ఇంద్రియానికి హెచ్చు శక్తి నివ్వడం ద్వారా తరచు భర్తీ చేస్తూ ఉంటుందని శారీరక శాస్త్రజ్ఞులు చెబుతారు. గ్రుడ్డివారికి వినే శక్తి బాగా ఉంటుంది. లేదా స్పర్శాజ్ఞానం బాగా ఉంటుంది. ఈ సృష్టి (ప్రకృతి) విధానంలో పరోక్ష నష్ట పరిహార సూత్రం ఒకటి ఉందన్న సంగతి మన కెవ్వరూ చెప్పక పోయినప్పటికీ, అలా అని మనకు అనిపిస్తుంది. దైవప్రసాదితమైన విశిష్ట లక్షణం ఎంత మూల్యానికైనా అర్హమైనదని అంటాము. అత్యధిక ప్రతిభావంతుడైన వ్యక్తిపై జీవితం ఏదో రూపంలో కసి తీర్చుకుంటుంది. కాబట్టి మెర్లిన్ మన్రోలో గల విశేష లక్షణాన్ని గుర్తించడంతోపాటు ఏదో ఒక

# మెర్లిన్ మన్రో స్మృతి

అవలక్షణం—కాదు—అరిష్టం ఆమెకు రానున్నదని కూడా మనం విశ్వసించడానికి పరిస్థితులు దోహదం చేశాయి. పాపం, ఈ యువతికి దైవం ప్రసాదించిన అసాధారణ అంగ సౌష్ఠవంతో పాటు మానసిక క్లేశం కూడా ఉండడంతో, హెచ్చుకి హెచ్చు సున్నకు సున్నా అయినట్లయింది. దానితో కాటా ముల్లు ఎటూ మొగ్గకుండా ఉండి పోయింది. ఒకవేళ ఆమె మనః క్లేశముల సంగతి మన కెవరికీ తెలియదే అనుకుందాము. అప్పుడు ఆమెకు మరో రూపంలో విధి దారుణంగా ప్రత్యక్షమయేదేమో! అంటే ఏదో విమాన ప్రమాదంలో, దయనీయ స్థితిలో ఆమె మరణించడమో, లేదా అంగ వైకల్యం కలిగే జబ్బు రావడమో తటస్థించి ఉండేది. ఒకప్పుడు మూఢ నమ్మకాలుగా తోచేవి కొన్ని సందర్భాలలో జీవిత కఠోర సత్యాలుగా అవగత మవుతూ ఉంటాయికదా!

అయినా దేవతలు ఆమెను చూచి ఇంతగా అసూయ జెందుతారని అనుకోవడం కష్టం. ఆమె జీవితంలో తరువాతి దశలో దురదృష్టానికి గురికాకుండా చేసేందుకు పోనీ, ఆమె బాల్యంలో జీవితం ఆమెను శిక్షించకుండా ఉందా అంటే, అదీలేదు. బాల్యంలో దిక్కులేనిదైన ఈ అనాథ బాలిక అదేమి చిత్రమోగాని అంత ప్రఖ్యాతి కొచ్చింది. అంతర్గతమైవున్న ప్రతిభను ఉపయోగానికి తెచ్చుకొనే ఉన్నత స్థితికి వచ్చింది. అలా ఉవ్వెత్తుగా తారాపథానికి ఎగసిన ఈ తరుణికి ఇక తదాదిగా శాశ్వతానందం చేకూరుగాక అని ఏవో నమ్మకాలున్న మనలాంటి వాళ్ళం కోరుకుంటాము. మెర్లిన్ మన్రోను పాశ్చాత్య కథలలో మనం విన్న సిండ్రెల్లా బాలికగా తప్ప, మరోలా ఊహించుకోవడం దుస్సాధ్యం. అనుపమమైన ఆమె అంగ సౌష్ఠవంలోగల రహస్య మేమిటీ అంటే, కొన్ని అంశాలు మనకు దాన్ని విడమరచి చెప్పుతాయి. ఇంకేం, సహజమేనని కూడా మనం తలలూపుతాము. ఆమె బాల్య జీవితంలోని విపరీత స్థితిగతులే ఆ అంశాలు. ఆమె పుట్టుక అక్రమమైంది. అంటే ఆమెనుకన్న తల్లి దండ్రులు సక్రమ రీతిలో వివాహ మాడినవారుకారు. ఎవరో ఒకరు కాలుజారితే ఈమె పుట్టింది. తల్లి పిచ్చిది. పైగా అనాథాలయంలో పెరిగింది. ఈ పిల్లను పెంచిన గృహాలు దాదాపు పిచ్చి ఆసుపత్రులవంటివి. పైగా ఆమెకు తొలి రక్షకుడుగా ఉన్న వ్యక్తి ఒకడు ఆమెను చెరిచాడు. మెర్లిన్మన్రోలో చక్కని అప్సరసే లేకపోతే, హాలీవుడ్‌వంటి సుందర రాకుమారుడే లేకపోతే అప్సరోలోకపు అద్భుత గాథవంటి ఆమె జీవితం అలా రూపొంది ఉండేది కాదని ఎవరైనా అనుకుంటే, వారు పొరపడ్డారనే చెప్పాలి. స్వయం ప్రతిభతో అత్యున్నత స్థాయికి వచ్చిన మనిషి అని మనం ఆమెను గూర్చి చెప్పుకొనే కథకు మరింత తోడు దొరికినట్లుగా మనం అవలోకించ గలుగుతాము. గ్రేస్‌కెల్లీ అలాంటి కీర్తి కిరీటాన్ని ధరించిందంటే, ఫిలడెల్ఫియాలోని ఆమె కుటుంబం అందుకు మార్గం సుకరం చేసింది. కాని మెర్లిన్ మన్రో తన స్వీయ సౌందర్యంతో, పేదరికంనుంచీ, గాఢాంధకారంనుంచీ బైటపడి రత్నంలాగా ధగద్ధగీయమానంగా ప్రకాశించాలనే గట్టి పట్టుదలతో కీర్తి శిఖరాన్ని అందుకుంది. అందుచేత ఆమె కాంతి పుంజాలు ఎంతగా ప్రకాశమానమవుతూ పొయ్యాయో, ఆమె హద్దులుదాటి పోతూందని గమనించిన ఆ అర్ధరాత్రి ఆమెను ఆ విధంగా అంతం చేసిందంటే మనం దిగ్భ్రాంతి చెంద నక్కరలేదు.

అయితే దిక్కూ మొక్కూలేని బాల్యంనుంచి ప్రపంచ ప్రసిద్ధి పొందేవరకూ మెర్లిన్ మన్రో పయనించిన దూరమే మనకు ప్రధాన విషయంకాదు. కేవలం దాన్ని మాత్రమే ఆధారంగా తీసుకొని వాస్తవాంశాన్నీ, వాస్తవాన్ని శిక్షించిన మరో వాస్తవాన్నీ లెక్కకు తీసుకోలేము. ప్రకృతి (దైవం ఆమెకు ప్రసాదించిన విశేష గుణం నాటక రంగంలోగాని, లేదా సినిమా రంగంలోగాని ఆమె నటనా ప్రతిభ కాదనుకుంటే—నేను అలాగే అనుకుంటాను) ఆమె శరీర నిర్మాణమే ఆమెలో గల గొప్ప విశేషమని మనం గుర్తించగలము. హుందాతనం, దర్పం అంటే ఆమె ముగ్ధురా లయ్యేది. నిజమైన కళాకారుల కోవకు చెందిన మనిషి ఆమె. అంతేగాక ఆమె ప్రతిభ మామూలు ఎల్లలను దాటి ఎంతగా అసాధారణమై పోయిందంటే, మనకు తెలిసిన సమాజం దాన్ని అదుపులో పెట్టజాలదు. అందుచేత ఆ వ్యక్తి తనంతట తానే రద్దుఅయి పోవడానికి తలపడింది. కళా విషయికంగా తక్కిన అమోఘ ప్రతిభ లన్నింటి వలెనే మెర్లిన్ మన్రో శారీరక శక్తి కూడా ఏ క్షణమైనా ప్రేలే మందుగుండు సామగ్రి వంటిది. సృష్ట్యాదిలోని ఆదిమ జీవ పదార్థం అది. ఆటవిక సంబంధమైన మృగప్రాయ శక్తి! అటువంటి శక్తి గల వ్యక్తి తనకు తానే గాక, తాను నివసించే లోకానికి కూడా ప్రమాదకరమైనది. కళ అంతా దాని ప్రాముఖ్యాన్ని బట్టి మహోద్రేక పూరితంగా ఉంటుంది. చివరకు అది తీవ్రమై, ఉగ్రమై, ఉద్రిక్త భరితమై సమాజాన్నే ఢీ కొంటుంది. సమాజంలోని కట్టుబాట్లను ఎదిరిస్తుంది. లేదా తనను ధరించిన వ్యక్తికే ఎసరు పెడుతుంది. అటువంటి వత్తిడిని మానవమాత్రులు భరించలేరు. ఈ కారణం వల్లనే నాగరిక సమాజంలో కళాకారుడు తక్కిన వ్యక్తులకు భిన్నంగా ఉంటూ ఉంటాడు. ఒక వ్యక్తిగా తనపై జరిగే దాడికీ, సమాజంపై పడే దెబ్బకూ మధ్య రాజీ సాధించి, ఆ సంఘర్షణలో ప్రాణాలతో బ్రతికి బైటపడి ఏమాత్రం హాని కలుగకుండా తప్పుకోవడమనేది మహా గొప్ప కార్యం. ఆ ప్రయ

త్వంలో దేనినైతే మనం ఒక వ్యక్తి ప్రతిభ అంటామో అది అతి స్వల్ప విషయం.

ఈ ఘోర సంఘర్షణలో కళాకారుడికిగల ఆయుధం కల్లా కపటంలేని అతని లేక ఆమెయొక్క సహజ స్వభావం. అయితే మెర్లిన్‌మన్రో నటింపులేని వ్యక్తి అన్న అభిప్రాయం నా కెన్నడూ కలుగలేదు. ఆమె కొంతవరకు అమాయకురాలే. అయితే ఆ అమాయకత్వం వేరు. కపటం లేకపోవడమంటే అనుభవం రీత్యా నిరాడంబరంగానో, లేదా తెలివి తక్కువగానో ఉండడం అన్నమాట. కాని మెర్లిన్ మన్రో తెలివి తక్కువదికాదు. తెలివి తక్కువ మనిషి తన సారస్యాన్ని అంత త్వరగా తనపైనే ప్రయోగించుకోలేదు. మరీ అసందర్భంగా, మోటుగా ప్రశ్నలు కురిపించే వారికి ఆమె విచార వదనంతో చింతలతో క్రుంగి ఉన్న మనిషివలె, సమాధానాలు చెబుతూ ఉండేది. అమాయకత్వం అంటే అనుభవం ఉండి కూడా ఆ అనుభవాన్ని స్వీయ రక్షణకు ఉపయోగించుకోవడం నేర్చుకోకుండా, సహించి పోతూ ఉండడమన్నమాట. అమాయకత్వం అనుభవంయొక్క దయా దాక్షిణ్యాలపై ఆధారపడి ఉంటుంది. కాబట్టే అది ప్రతికూల శక్తులను తనకు అనుకూలించే విధంగా సమీకరించుకోలేదు.

మెర్లిన్ మన్రోను గూర్చి నాకు ఎలాంటి అనుభూతులు కలుగుతాయో ప్రసిద్ధ నవలా కారుడైన ఎర్నెస్ట్ హెమింగ్వే గురించి కూడా అలాగే అనిపిస్తుంది. అతను కూడా బాధాకరమైన తన బాల్య సంఘటనలకు వ్యతిరేకంగా తగు రక్షణ శక్తిని సమకూర్చుకోలేక పొయ్యాడు. మళ్ళీ మనిషి దృఢమైనవాడనీ, ధైర్యశాలి అనీ ప్రతీతి. యుద్ధంలో, వేటలో, అతనికిగల ఇతర ప్రమాదకరమైన వ్యసనాలలో చాలా గట్టిగా వ్యవహరించే వాడని చెబుతారు. అతను మనిషి అమాయకుడు. కాని నిర్వ్యాజమైనవాడు కాడు. అన్ని సందర్భాల్లోనూ తెలివిగా వ్యవహరించేవాడని చెప్పలేము. ఇలాంటి వైరుధ్యాలు మెర్లిన్ మన్రోలో కూడా ఉన్నాయి. తీవ్రమైన అనుభవాలకు ఆమె ప్రతీక అయినప్పటికీ విషయ వాంఛలను ఎరిగి అనుభవించి ఎదుటి వ్యక్తికి అనుభవం కలిగించినదైనప్పటికీ జీవితంలో తటస్థపడ్డ ప్రతి కొత్త సంఘటననూ లేదా తాను వెతికి పొందిన జీవితావకాశాన్నీ పసిపిల్లవలె ఎదుర్కొనేది, కనుకనే ఆమె అమాయకత్వం కొట్టవచ్చినట్లుగా కన్పించేది. జీవితంలోని వికారాల అనుభవం ఆమెకు ఉన్నప్పటికీ, ఆమె అమాయకత్వం మాత్రం చెరిగి పోకుండా చివరిదాకా ఉంది. ఇందుకు కారణం నేను అనుకునేది ఏమిటంటే—అలాంటి వికారాల ముసుగులో ఆమె తామరాకుమీది నీటి బిందువులా అంటీ అంటనట్లుండేది.

ఇక మనోవ్యాధుల నిపుణుల దృష్ట్యా పరిశీలిస్తే అతి లమాయకత్వానికీ, ఒక వ్యక్తి జీవితంలో ఎదుర్కొన్న వాటికీ అనుభవం ద్వారా అతడు, లేక ఆమె గ్రహించిన వాటికీ మధ్య హెచ్చు అంతరము ఉన్నదంటే అది మనోవ్యాధికి తగిన ఆధారమేననీ, అందులోనూ అటువంటిది ప్రమాదకర లక్షణమనీ తెలుస్తూ ఉంది. అంటే అందువల్ల ఒక వ్యక్తి తన నుండి తాను మరీ దూరమవుతాడు. ఒకవేళ అతను చికిత్స పొందుతూఉంటే అది నివారణ కావడం కష్టతరం. కారణమేమంటే మానసిక తర్కాన్నిబట్టి అతడు ఏయే సంఘటనల ద్వారా జీవిత పథంలో నడిచాడో వాటి కెంత అభేద్యంగా ఉన్నాడో చికిత్సా విధానానికి కూడా అలాగే లొంగకుండా ఉంటాడు. ఫలిత మేమిటంటే అతని బాధ, వ్యథ అలాగే ఉండిపోతాయి. ఏమాత్రం తగ్గవు. ఇక సృజనాత్మక రంగాలలో అమాయకత్వం అతిగా ఉందంటే దాన్ని చూచి మనం ముగ్ధులమవుతాము. దానివల్ల వ్యక్తీకరణలో స్వచ్ఛత ఉంటుంది. అలాంటి స్వచ్ఛ నిసర్గమైన అభి వ్యక్తీకరణను చూచి మనం అలాంటి కళాత్మక సృజనను లేదా అభినయాన్ని ''ఈ ప్రపంచానికి అతీతమైంది, మహోద్భుతమైంది'' అని శ్లాఘిస్తాము. కాని మనో వ్యాధుల నిపుణుడు దైవదత్తమైన ప్రతిభకూ, రోగ లక్షణానికీ మధ్యగా పరిశీలించి నిర్ణయించవలసిన వాడవుతున్నాడు. ఒక వ్యక్తిలోఉన్న కళా విశేషం లేదా విద్యా విశేషం చివరకు అతని భావుకతను, మనస్సును వాళనం చేయవచ్చు.

మెర్లిన్ మన్రో మనో వ్యాధుల నిపుణులకూ, వాటి విశ్లేషణ చేసేవారికీ చిక్కకుండా తప్పించుకు పోయిందని నా ఊహ. పాపం వాళ్ళు ఆమెకు సహాయపడి ఆమె వ్యథను తగ్గించాలని ప్రయత్నించారు. కాని ఆమె వాళ్ళకు అంతు చిక్కలేదు. మానసికంగా ఆమె వారి కొక తెల్లకాగితంలా కన్పించింది. ఆ కాగితంమీద ఏమీ వ్రాసిలేదు. కనీసం గుర్తులుగా ఉపయోగ పడే రేఖలైనా లేవు. కాబట్టే ఆమెకూ, ప్రవీణులకూ ఎక్కడా కలవనేలేదు. అయినా తన రుగ్మతను ఎవరైనా తొలగించగలిగితే బాగుండునని ఆమె ఎంతగానో తపించింది. కాని రోగికీ, వైద్యుడికీ సంబంధమే లేకపోతే రోగ నివారణ ఎలా సాధ్యం? ఈ సంబంధరాహిత్యం వర ప్రసాదితమైన ఆమె వ్యక్తిత్వంలోని ముఖ్య కీలకమేమో ననుకుంటాను. అదే ఆమె వ్యక్తిత్వంలో గల అందాన్నీ, ఆకర్షణమూ ప్రపంచానికి నిర్వచించి చెప్పింది. హెమింగ్వే కూడా ఇంతే. అతను కూడా తన అనుభవం తనకు పట్టని సంగతి అన్నట్లు నిర్లక్ష్యభావంతో ఉండేవాడు. అదే అతని అంతర్గత ప్రతిభను రూపొందించి బయల్పరచింది.

గడచిన పలు దశాబ్దాలుగా పలువురు రచయితలు హెమింగ్వే రచనా శైలిని అనుకరించ ప్రయత్నించారు. అతని వచన శైలిలో స్వచ్ఛత ఉంది. ఎటుపడితే అటువంగి సందర్భానికి అనువుగాఉండే స్వభావం ఉంది. వ్రాసేటప్పుడు అతను తన వ్యక్తిత్వానికీ, తాను దేన్ని గూరి వ్రాస్తున్నాడో ఆ వస్తువుకూ మధ్య తగు దూరం ఉండేట్టు చూచుకుంటాడు. మరి అతన్ని అనుకరించిన వారిలో ఒక్కరూ సఫలీకృతులు కాలేకపోయ్యారు. ఇందుకు కారణ మేమంటే—నేను అను కొనేది—అతని వచనం బాహ్యమైన వాస్తవికతకూ, అతని మనోభావాలకూ మధ్యగల కలుపరాని దూరంయొక్క ప్రత్యక్ష కథనంలా ఉండేది. ఇదిగాక వేరే ఇతర కారణాలు కూడా ఉంటే ఉండవచ్చు. ఇలాగే మెర్లిన్ మన్రో కూడా అనుకరణీయ మైన వ్యక్తి. హాలీవుడ్, బ్రాడ్‌వే, నైట్‌క్లబ్బులు వాటి వాటి అందాల రాణులను ప్రేక్షక ప్రపంచానికి సమర్పిస్తూనే ఉంటా యి. ప్రజలు వాళ్ళనుచూసి అలా వదిలేస్తారు. ఒక్కొక్క మారు ప్రేక్షకులు వాళ్ళను అంతగా పట్టించుకోకపోవచ్చు కూడా. కాని మెర్లిన్ మన్రో తన మూర్తితో యావత్ప్రపం చాన్నే తనకు బందీగా చేసుకుంది. ఎందుచేతనంటే ఒక పురు షుడు ఒక స్త్రీని చూచినప్పుడు కలుగవలసిన స్వచ్ఛమైన నేత్రోత్సవం మానసికానందం ఆమెను చూడగానే కలిగేవి. స్త్రీత్వం ఇదీ అన్న సంతృప్తి కలిగేది. ఆవిడ ఎంతో ధైర్యంగా అంగ విన్యాసం ప్రదర్శించేది. అయినా మితిమీరి పొయ్యేదికాదు. ఆమె మోహనాంగి. బిబ్బోకవతి. సౌకుమార్యం, లావణ్యం మొదలైనవి లేకపోయినా పురుషునిలో శృంగారభావం రేకెత్తించ గల విలాసిని. అయినా ఆదేమిటో మౌనంగా, ముభావంగా, నిగూ ఢంగా కన్పించేది. ఆమె కంఠంవిప్పి మాట్లాడిందంటే ముదురు గొంతుకలా ఉండేది. తరచు స్వరం ఉచ్చంగా వచ్చేది. రెండు వాక్యాలు పలికిందంటే చాలు విన్న పురుషుడికి శృంగార సంబంధమైన ఉద్రేకం కలిగేది. 'ఏమి ఈవిడ గొంతుక!' అని పరవశం చెందేవారు. అయినా ఇది సిగ్గుపడే పసి బాలిక వాణిలా ఉండేది. ఈ విశేష గుణాలే అసాధారణమైన ఆమె వ్యక్తి త్వానికీ, ప్రకృతి ప్రసాదించిన ప్రతిభకూ విశిష్టాంశాలుగా కన్పట్టేవి. వీటన్నిటినీబట్టి అవలోకిస్తే తెలియని మా లోకం లో పడిపోయిన యువతి పాపం అన్న జాలి కలిగేది!

ఇంతకూ ఇక్కడ నేను చెప్పదలచుకున్న ముఖ్యాంశ మేమిటంటే—కామోద్దీపన కలిగించే స్త్రీ మూర్తిగా మెర్లిన్ మన్రోలో కొంత అస్వాభావికత ఉంది. ఆమె నిజ జీవితంతో పరిచయం కలిగి, ఆమెను పలుమార్లు కలుసుకున్న ముగ్గురు పురుషులు నాకు తెలిసిన వారున్నారు. ఆ ముగ్గురూ ఆమెలో ప్రత్యక్షంగా కామోద్దీపన కలిగించేటంత ప్రభావంలేదని అన్నారు. ఆమె మనిషి మనోహరంగా, ముచ్చటగా, ముద్దుగా, అందంగా ఉండేది. కాని పురుషుణ్ణి తక్షణమే చలింపజేసి అతనిలో ప్రగాఢ వాంఛ కలుగజేయ గలిగినంతటిది కాదనీ, ఆ విషయంలో తాము కొంత నిరాశ చెందామని వారు చెప్పారు. అయితే ఇక్కడ ఒక విషయం ఆలోచించాలి. అసలు నిజమైన లైంగికత్వం అంటే ఏమిటి? దాన్ని నిర్వచించి చెప్పడం కష్టం. విషయ వాంఛలకు లోనుగావించేది అని మనం దేన్నిగూర్చి చెప్పుకుంటామో దాని అసలు మూలం అభూత కల్పనల్లో, చోద్యాలలో, విన్న మాటల్లో ఉంటుంది. దానికీ, సహజమైన లైంగిక వాంఛకూ సంబంధం ఉండదు. ముఖ్యంగా సినీతార అనేసరికి మన ఊహలు, భావాలు మరో లోకంలోకి ప్రవే శిస్తాయి. ఆ తారనుగూర్చి మనం కన్న కలలు, పొందిన భావాలు, ఆమె శరీర సంపదను గూర్చి మనకు కలిగిన మనోవికారాలు— ఇవన్నీ ఒక దానితో ఒకటి కలిసి మనం ఆమెను మామూలు స్త్రీగా కాక, అతిక్రమించిన విశేషంగల వ్యక్తిగా ఊహ పెట్టుకుంటాము. నటించే కళ అంటే, తాను ఆ పాత్ర ఎవరో ఆ వ్యక్తివలె అయినట్లుగా ప్రేక్షకులకు భ్రాంతి కలిగించడ మన్నమాట. అలంకార శాస్త్రంలో ధ్వనిలాగే నటనా రంగంలో అలాంటి భ్రాంతి కలిగించడ మనేది నటనవల్ల ప్రేక్షకులు పొందే అనుభూతి వారిలో అది కలుజేయగల వింత ఊహల పైన ఆధారపడి ఉంటుంది.

మెర్లిన్ మన్రో మన స్వప్నాలతో సంభాషించింది. మనలోగల పాశవికత్వమును పలుకరించింది. కాని ఆ చేసిన వైనం అసాధారణమైనది. 'కల్పనా లోకంనుంచి బైటపడి వాస్త వికతను దర్శించండి' అని ఆమె మౌనంగా మనకు విజ్ఞప్తి చేసింది. మనం కోరుకునేది అదే కదా! అలాగే శృంగార చర్య లేవీ లేకుండా, ఆకర్షణలకు గురి కాకుండా శృంగార కామన లను ఎదుర్కోవాలన్న మన కోర్కెను తృప్తిపరచింది. నేటి మన నాగరికతలో విషయ వాంఛలను తీర్చుకోవడంపై అనేక విధి నిషేధా లున్నాయి. సభ్యతకూ, సంఘానికి వెరచి కొంత మనమే నిగ్రహించుకుంటున్నాము. మెర్లిన్ మన్రో ఇటువంటి నాగరికతలో జీవితం గడుపుతూ కూడా, అసలైన దాన్ని మన కివ్వడంలో ఎంతవరకు పోగలదో అంతదాకా పోయింది. కాని నిజం చెప్పాలంటే అసలైన దాన్ని ఆమె మనకు ఇవ్వనేలేదు. ఇస్తున్నట్లు నటించింది. అంతే! లైంగికత్వంపై గల మోజు నూ, ఆకర్షణనూ ఆమె ఎట్టి దశకు తీసుకు పోయిందంటే— అది మనకు భయహేతువు కాకుండా పోయింది. అంతకు మునుపు అది అంటేనే అదిరిపోయే వాళ్ళం. లైంగిక వాస్త

వికతప్పైగల ఈ మేలి ముసుగును ఆమె తొలగించడంవల్లనే ఆమె పురుషులతోపాటు స్త్రీలకు కూడా అభిలషణీయ వ్యక్తి అయింది. స్త్రీలు కూడా ఆమె అంటే ఇష్టం, ఔదార్యం చూపారు. కారణ మేమంటే, స్త్రీ జాతిలో అందరికంటే హెచ్చుగా లైంగికత్వం వెలుపలికి కన్పరచిన ఈ స్త్రీ తమకు ముప్పు తేదన్న సంగతి వారు గ్రహించారు.

ఈ విధంగా మెర్లిన్ మన్రో పట్టి మిథ్య అని చివరకు తేలింది. అయితే ఆ విషయం మనకు తెలియవచ్చేముందే ఆమె ఆమె మిథ్యకు మించిన మిథ్య అయిపోయింది. మనల్ని స్వప్నాల నుంచి విముక్తంచేసి లైంగిక వాస్తవికతలోకి తీసుకుపోతుందనుకున్న ఈ పడతి మన సంగతి అలా ఉండనిచ్చి, ఆమెకు ఆమే అయథార్థమై పోయింది. తాను అనే వ్యక్తి ఒకటి ఉన్నానన్న సంగతి తనకే అవగాహన కాకుండా జీవితం చాలించింది. ఆమెకు ఆమే లైంగిక వాస్తవికతగా కావడం అసాధ్యం. అయినా తాను లైంగికచేతనగల దాని నన్నట్లు నటించి చూపి ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తి గొప్ప ఇంద్రజాలం చేసింది. స్వీయానుభూతులనుంచి—చివరకు స్వీయ లైంగిక అనుభూతులనుంచి కూడా విడివడి లోపల నిర్మమత్వంతో ఉండడంవల్లనే బాల్యంలో తాను గడపిన దౌర్భాగ్య జీవిత స్మృతులను భరింపగలిగిందనీ, అసహ్యకరమైన తన బాల్యాన్ని గూర్చి ఇతరులతో బహిరంగంగా మామూలుగానే చెప్పుకో గలిగిందనీ మనం ఊహించుకోగలం. మనలో చాలా మందిమి గతంలో పడ్డ ఎంత చిన్న అవమాన్నయినా ఇతరుల కెవ్వరికీ చెప్పకుండా దాచుకుంటాము. అస్థిపంజరం బైట పడిందంటే, మన సొగసు ఎటువంటిదో తెలిసిపోతుందన్న భయంతో దాన్ని సాధ్యమైనంతగా కప్పి పెట్టుకుంటాము. కాని మెర్లిన్ మన్రోకు ఇలాంటి నంగనాచితనం అగత్యమే లేకపోయింది. తన వ్యక్తిగత జీవితంలోని జుగుప్సాకరమైన సంఘటనలను కూడా ఆమె ప్రజలకు చెప్పివేసింది, మనమంతా నమ్మదగ్గ వాళ్ళమన్నట్లు! అయితే మనం ఆమె అమాయకత్వానికి ఆశ్చర్యపడ్డామేతప్ప, అది సాకుగా తీసుకొని ఆమెను మనస్వార్థాలకు అడ్డం పెట్టుకొని అక్రమ ప్రయోజనం పొందలేదు. కళాకారుడినుంచి మనం ఏమి ఆశిస్తాము? మన అందరికి దైవదత్తమైన ప్రతిభ, వ్యక్తిత్వం లేవు. కాని అవి ఉన్న కళాకారుడు సామాన్యులమైన మనల్ని బంధించే సంప్రదాయాలకు అతీతుడుగా వ్యవహరించాలని మనం కోరుకుంటాము. వారిలో అలాంటి సంకల్పబలం, నిర్భీకత ఉండాలని ఆశిస్తాము. ఈ దృష్ట్యా చూచినప్పుడు మెర్లిన్‌మన్రో తన జీవితారంభమును గూర్చి అంత నిష్కపటంగా ఉండడం నిజంగా ప్రశంసార్హమైన విషయం. కాని మరొక దృష్ట్యా చూస్తే ఆత్మరక్షణకు అక్కరకొచ్చే అడ్డు గోడలను అప్పే పడగొట్టుకోవడంచేత, ఆమె పరిస్థితులు తెచ్చిపెట్టే సుడిగాలులకు, తుఫానులకు సులభంగా గురి కావడానికి ఎడమిచ్చిందని ఆమె నిష్కపట్యం మనల్ని హెచ్చరించక పోదు.

ఈ 'ఎడమిచ్చింది' అన్నమాట ఆమె జీవితంలో చాలా ముఖ్యమైంది. ఆమె నటి. తన శరీరాన్నీ, వ్యక్తిత్వాన్నీ ప్రజల ముందు ప్రదర్శించింది. అంతేకాదు. తనకై తానే బాహాటంగా తనను గూర్చిన సంగతులన్నీ చెప్పుకొని గుట్టు బట్టబయలు చేసుకుంది. నటీమణు లందరికంటె ఈమె అధికంగా తన శరీరాన్ని బహిరంగంగా ప్రదర్శించుకుంది. తక్కిన వారికి అలా ప్రదర్శించుకోవడంవల్ల కలిగే పర్యవసానాలైనా తెలుసుకుని ఈమె వాటిని పట్టించుకోలేదు. అసలు వాటిని గ్రహించిందో, లేదో! ఏదో క్యాలెండరుపై బొమ్మ కోసమని ఆమె ఒకమారు నగ్నంగా నిల్చొందని అంతా విడ్డూరంగా చెప్పుకున్నారు. ఇంకా ఏవో వదంతులు పుట్టాయి. ఆ బొమ్మలలో ఆమె ఆశ్చర్య చకితయై ఉన్నట్లూ తాను చేస్తూ ఉన్నది గ్రహించనట్లూ కన్పించింది. ఆ అమాయకత్వం చెప్పనలవి కాదు. "ఎప్పుడో డబ్బుకోసమని ఆ పని చేశాను. ఆ మనిషిని కాదు ఈనాడు. ఇప్పుడు నాకు డబ్బుంది" అని ఆ స్టూడియో వాళ్ళకు చెబుతున్న వ్యక్తివలె గోచరించింది. ఈ నాటికీ, ఆ నాటికీ వరుసక్రమం ఉండనట్లే, ఆమె జీవితంలో కూడా గత కాలానికీ, ఆ పిమ్మట వచ్చిన కాలానికీ సాపత్యమే లేదు. అయినా అన్ని రకాల జీవితాలూ గడపిన ఆ వ్యక్తి మాత్రం ఆమే! అంటే ఎక్కడి కక్కడికి ఆమె ఒక వేరే వ్యక్తి. అయితే పైకి వచ్చి కృతార్థురాలైంది. కాబట్టి ఆమె జీవితపుటలన్నీ తాత్కాలికంగా అతికించబడి, ఒకే జీవిత మన్నటు ద్యోతక మవుతాయి.

తన శరీరం మనుష్యుల్ని ఆకర్షిస్తుందని ఎరిగిన వ్యక్తి కాబట్టే తాను అనుకున్నది సాధించగలిగింది. ప్రజలను తాను ఆకర్షించాననీ, ఎందరో తన్ను మెచ్చుకొని ఆరాధిస్తున్నారనీ తెలుసుకున్నది కాబట్టే, మెర్లిన్ మన్రో తన వ్యక్తిత్వాన్ని గుర్తించి, దానితో తాదాత్మ్యం పొందగ గింది. చనిపోవడానికి కొద్ది రోజుల క్రితమే ఆమె తన ఫోటో తానే నగ్నంగా ఉన్నప్పుడు తీసి పెట్టుకుంది. తన ఛాయా చిత్రాల నెన్నిటినో శ్రద్ధగా సంపాదించి, వాటిలో బాగాలేని వాటిని తొలగించి తక్కిన వాటిని పదిల పరిచింది. తాను ఈ లోకంనుంచి వెళ్ళిపోయినా, తన వ్యక్తిత్వం తర తరాలవారికీ తెలిసి రావాలనే అలా చేసిందా? కావచ్చునేమో! ఆ ఛాయా చిత్రాలన్నీ అడవిని గాచిన వెన్నెలలా ఆమె అందం ఎలా వ్యర్థమైందో తెలియ

# మెర్లిన్ మన్రో స్మృతి

జేస్తాయి. అందం కాదంటారా? పోనీండి. శరీరమే అనుకుందాము. ఆమె ముఖం ఎప్పటివలెనే అందంగా, ఆనంద దాయకంగా ఉంది. అందులో ఆమె జీవితాంతమూ పడ్డ వ్యథలేవీ కన్పించలేదు. వాటి ఛాయలు కూడా కానరాలేదు. కాని ఆమె శరీరం మాత్రం కొల్లగొట్టిన రాజ్యమైంది. రోగగ్రస్తమైనట్లు కన్పడ్డది. అందులోనుంచి జీవమే మాయమైనట్లు తోచింది. ఇటీవల ఆమె ఛాయా చిత్రాలు శృంగారానికి పేరుపడ్డ ఒకానొక పత్రికలో ప్రకటింపబడ్డాయి. ఆ పత్రిక వెల చాలా హెచ్చు. సామాన్య మానవునికి ఆ చిత్రాలు చూచే భాగ్యం కలుగదు. కాబట్టి ఆ మూలకంగానైనా అవి, ఏదో ఒక అల్లరి లేచితే విని వినోదించుదామని వెలికే ప్రేక్షక మహాశయులకు అందుబాటులోకి రాకుండా అడ్డు ఒకటి వచ్చింది. అంతే చాలులే అని ఎవరైనా అనుకుంటే, అలాంటి అడ్డు నిజంగా అనవసరమైంది అని చెప్పాలి. ఎందుచేతనంటే చివరకామె నగ్న చిత్రాలు ఏమాత్రం సభ్యత తెలిసిన వారికైనా జాలి, బిడియము కలిగించాయే తప్ప మరేవిధమైన భావమూ కలుగజేయలేకపోయ్యాయి.

అయితే అంతిమ ఘడియలు రాకపూర్వమే ప్రజలలో ఆమెకుగల పేరు ప్రఖ్యాతులకు ముప్పు రానారంభించింది. ఆ వృత్తిలో తారాపథాన్ని అందుకొన్నటువంటి వ్యక్తి క్రమేణా దిగజారి పోజొచ్చింది. మెర్లిన్ మన్రో నటించిన చిత్రం రాక చాలా రోజులైంది. అప్పటికే, ఆమె నటించిన చివరి చిత్రం ఆమె సరిగా వెళ్ళి పని చేయని కారణంచేత పూర్తి కాకుండా అలాగే ఉండిపోయింది. పోనీ అనుభవించదగ్గ జీవితమైనా ఉందా అంటే అదీ లేదు. వ్యక్తిగత జీవితమనే చట్రమే ఆమెకు ఏర్పడలేదు. పెళ్ళిలేదు. ఒక కుటుంబంలేదు. స్నేహితులులేరు. ప్రపంచంలో అంత ఏకాకి ఎవరైనా ఉంటారా అనిపించింది. కనుకనే ఆమె మరణించిన తర్వాత ఆమెకు సహాయం చెయ్యాలన్న భావం తమ ఒక్కరికేకాక, ఇంకా అనేకులక్కలిగిందన్న విషయం చాలా మంది తెలుసుకున్నారు. చివరకి తమ కాపురాలకి ఎక్కడ ముప్పు తెచ్చి పెడుతుందోనని భయపడవలసిన భామినులు సైతం 'అయ్యో ఆ జీవికి తాము ఏ కొంత సహాయం చేసినా, ఎంత బాగుండేది అనుకొని నిట్టూర్పు విడిచారు. ఇలాంటి వాళ్ళమంతా మిత్రులమే. కాని ఈ మిత్రులు ఆమెకు తెలీరు. తెలిసిన వారిలో అనురాగం ఆప్యాయతా మృగ్యం ఆమెకూ వారికీ యధార్థమైన బాంధవ్యం, రాగబంధం లేవు. అది అంతా ఒక ఎడారి! ఎటు చూచినా శూన్యం!! అనుభూతులు, సానభూతి లేనిచోట శూన్యంగాక మరేమి ఉంటుంది? ఆమె జీవితంలో ఆ తుడి రాత్రిని గూర్చి తలచుకుంటే హృదయం ముక్కలవుతు-ది. నా అన్నవారు ఎవ్వరూ లేని ఏకాకి! కడుపునిండా దుఃఖంతో ఏకాసంగా కుమిలిన జీవి! ఎవరైనా తనను ఓదార్చి తన మనస్సుకు శాంతి చేకూరుస్తారేమోనని దేవులాడిన అనాథ. కాని ఎలాంటి ఊరడింపుకూ నోచుకోని వ్యక్తి. చుట్టూ ఎటు చూచినా మందుల సీసాలు తప్ప మరేమీలేదు. ఇలాంటి వ్యక్తి అంతిమ క్షణాలనుగూర్చి ఆలోచిస్తే ఆమె విషాదాంతాన్ని మించిన విభ్రమము కలుగ. తుంది. పాషాణాలు సైతం కరుణతో కరిగి నీరైపోతాయి

ప్రపంచంలో కోట్లాది ప్రేక్షకుల ప్రశంసలుపొంది వారిచే నిరంతరం ఆరాధింపబడ్డ ప్రఖ్యాత వనిత ఒంటరిదై ఏకాకిగా జీవితం గడపడం, మనసిచ్చి, మనసు పుచ్చుకున్న యువకుడితో కాలక్షేపం చేయడానికి ఆమెకు ఒక్కనాటి భాగ్యమైనా కలుగకపోవడం, అందులోనూ విలాసంగా గడపవలసిన వారం చివరి రోజున-మెర్లిన్ మన్రో శనివారం రాత్రే ఆత్మహత్య చేసుకుంది—జీవితాన్ని అంతం చేసుకోవడం ఎంతటి దురన్యాయం! ఎంతటి ఘోరం! అసలు ఊహించడానికే భయంకరంగా ఉంటుంది. శనివారం తప్ప, ఇతర రోజులలో రాత్రులు ఎవరి మానాన వారు ఏకాంతంగా గడపవచ్చు. కాని శనివారం వచ్చిందంటే ఆ రాత్రి అమెరికాలోని యువతీ యువకులు తామూ సరస సల్లాపాలతో కోర్కెలు తీర కాలక్షేపం చేయగలమని బుజావు పరచుకుంటారు. తనతో స్త్రీ పురుష సహజమైన కామనలున్నాయని వ్యక్తం చేసుకుంటారు. అలా చెయ్యాలి కూడా. ఆ రోజు రాత్రి వారు నిజంగా బైటపడిపోతారు. తమకు ఇష్టులైన వారిమధ్య కాసేపు వినోదంగా గడిపి, జీవితంలోని బాధల్ని మరిచిపోతారు. స్త్రీ పురుషుల మధ్య ఉండే ఆకర్షణను ఆ రాత్రే చూడాలి. స్త్రీ అయి, గొప్ప తార అయి, పురుష జాతినే సమ్మోహనాస్త్రంతో వశపరచుకొని ఆడదాని పుట్టుకకే గొప్ప విజయం సాధించి పెట్టిన ఈ అమెరికా యువతి, తన జీవితంలో చివరి శనివారం రాత్రి ఏకాకిగా పుట్టెడు దుఃఖంతో గడిపిందంటే ఇంతకన్నా ఘోరం ఏమిటి? దేశంలో ప్రతి యువకుడూ మెర్లిన్ మన్రోతో ఒక సాయంకాలం వినోదంగా గడపాలని వాంఛించేవాడే. కాని ఆమె నెరిన యువకు డెవరూ ఆ పని చేయలేదు!!

ఆమె ఏకాకితనాన్ని మనస్సులో పెట్టుకొని మరణానంతరం ఆమె పరిస్థితిని తలచుకొంటే అది కూడా అలాగే ఉందనిపిస్తుంది. ఆమె అంత్యక్రియల సందర్భంలో దుఃఖపడే ముఖ్య వ్యక్తిగా వ్యవహరించిన వాడు ఆదిలో కొన్ని నెలలు మాత్రమే ఆమెకు భర్తగా ఉన్న జోడిమాగ్గియో—అతను గాక ఇంకా వచ్చినవారు వ్రేళ్ళపై లెక్కించదగ్గవారు మాత్ర

మే. అంత్యక్రియలు అతి సామాన్యంగా జరిగాయి. దీనినిబట్టి ఆమెకీ ప్రపంచంతో గల సంబంధం ఎంత పరిమితమ్మైనదో మనం తెలుసుకోవచ్చు. జోడిమాగ్గియోతో ఆమె వివాహం కావడం అసంభవమ్మైన విషయమని ఒక మారు ఆమే అన్నది. అతను మాటకారికాదు. భోజనానికి ఆమె అతనితో కలిసి కూర్చుంటే ఆమెతో ఏమీ మాట్లాడేవాడు కాదట. పత్రిక చదువుతూనో, టెలివిజన్ చూస్తూనో ఉండేవాడట. ఆ తర్వాత మరొక వ్యక్తి ఆమెకు భర్తగా ఉన్నాడు. అతను మాటకారే. కాని ఏ కారణంచేతనో అంత్యక్రియలకు అతను రాలేదు. అతను రాక పోవడం విచారమే కలిగించింది. అంత్యక్రియల తంతు సంద ర్భాన ఏమి చదివారో నాకు తెలియదు. కాని ప్రథమశ్రేణికి చెందిన మేధావి అంత్యక్రియల సందర్భంలో ఎటువంటి మహో దాత్త సారస్వత పఠనం జరుగుతుందో ఆమెకూ అదే చదువ బడి ఉంటుందని నేను ఊహ చేస్తున్నాను.

ఆమెను తారగా ఆరాధించిన ప్రజలు కూడా ఆమెపట్ల కరకుగా ప్రవర్తించారు. ఆమెకు చదువుకోవాలనీ, విషయ పరి జ్ఞానాన్ని సంపాదించి తానూ విద్యాధికురాలనిపించుకోవాలనీ ఉండేది. కాని ఇందుకు ఆమె అభిమానులే ఆమెను ఎగతాళి చేసేవారు. మనం అభిమానించిన సుందరీమణి డాస్టోవిస్కీ రచనలు బాగా లేవని అన్నదంటే అందుకు కొంత తికమక పడే హక్కు మనకు ఉన్న మాట నిజమే. అయితే మన తిక మకకు మూలం డాస్టోవిస్కీ రచనల ప్రాశస్త్యంపై మనకు లోలోనగల అపనమ్మకమో, లేదా మన లైంగికాయాసమో అయిఉంటుంది. గాని అది మెర్లిన్‌మన్రో తప్పుకాదు. తగు లైంగికత్వం గల వ్యక్తికి డాస్టోవిస్కీ రచనలు చదవడం అవసర మవుతుందన్న విషయాన్ని మనం నమ్మము, కాబట్టే మనం అలా ఎగతాళి చేస్తాము. మెర్లిన్‌మన్రోకు గల లైంగికమ్మైన వీళ్ళు మరో వ్యక్తికీఉంటే ఆ వ్యక్తి మన అమూల్య భ్రాంతిని చెర పడం మినహా మరేమ్మైనా కోరుకోవటం జరిగేదనీ, తగు లైంగి కత ఉంటే అదే పదివేలు అనీ భావించడం మన వెర్రి ఊహ తప్ప మరేమీకాదు.

మెర్లిన్ మన్రోకుగల విశిష్టమ్మైన స్త్రీ లైంగికత్వం ఈ ప్రపంచంలో ఆమె పైకి రావడానికి తప్ప మరెందుకైనా ఉపయోగకారి అయిందంటే నేను నమ్మను. ఇందుకు ఆమె జీవితం తొలి దశలో ఆమె గ్రహించిన విషయమే ముఖ్య నిద ర్శనం. తన వయస్సులో ఉన్న సాటి బాలికలకంటే తాను లైంగికంగా విశిష్టమ్మైన దానినని తనకు అనిపిస్తూ ఉండేదని ఆమె ఒకమారు చెప్పుకుంది. మగపిల్లలంతా తేనె పట్టు చుట్టూ ఎలుగుబంట్లవలె తనచుట్టూ మూగి ఈలలువేసి అల్లరి చేసే వాళ్ళట. దీనినిబట్టి తనలో ఏదో ప్రత్యేకత ఉందనీ, దాన్ని వినియో గించుకుంటే తను పేదిరకంనుంచి బైట పడవచ్చుననీ ఆమె అర్థం చేసుకుంది. ఇందువల్ల మనకు ఒక విషయం స్పష్టమవుతూ ఉంది. స్త్రీ లైంగికత్వం తనకు అపారంగా, ప్రచడంగా ఉందని ఆమెకు కలిగిన గ్రహింపు ఆమెలోనుంచి వచ్చిందికాదు. అది బైటనుంచి కలిగినట్టిది. అలా కలిగింది బాహ్యంగానే ఉండి పోయిందిగాని ఎప్పుడూ ఆమె అంతరాంతరాలలోకి చొరలేదు. దీనిచేత అంతరంగికంగా ఆమెలో పెద్ద శూన్య స్థితి ఏర్పడి పోయింది. అది ఆమెలోనుంచి పుట్టుకొచ్చిన అసలైన స్త్రీ లైంగికత్వమ్మైనట్లయితే ఆమెకు తాను నిజంగా గొప్ప వ్యక్తిననీ, తనకు కావలసిన వారున్నారనీ, ఒకరు పోయినా మరొకరు తనకు అంది వస్తూ ఉంటారనీ ఆత్మ విశ్వాసం కలిగి సంతు ష్టితో జీవించి ఉండేదని నా విశ్వాసం.

మరి అల్లా ఏర్పడ్డ శూన్య స్థితిని ఏదో విధంగా ఎదుర్కోవాలికదా. అందుకోసమని ఆమె ప్రాపంచిక సంపద పైన, కీర్తి ప్రతిష్ఠలపైన, ప్రజాకర్షణపైన, వివాహం పైన దృష్టి పెట్టుకుని వాటికోసం తాపత్రయ పడింది. ఇంకా అందరాని వాటికోసం అర్రులు సాచింది. తనకూ ఒక కాపురం, ఇల్లూ వాకిలి, పిల్లలు, కుటుంబం కావాలని వేసారింది. అవేవీ లభించలేదు. ఒక యూదు స్త్రీని అత్తగా చేసుకుంది. యూదుల ఆచారాలనూ, వారి వంటకాలనూ అనుస రించాలని ప్రయత్నించింది. తన తుది భర్త తాలూకు మన్న న్యుల మధ్య తనకు మానసిక సంతుష్టి కలుగుతుందేమోనని చూసింది. పుస్తకాలతో, విజ్ఞాన సముపార్జనతో తన శూన్య స్థితిని తొలగించుకోవడానికి తంటాలు పడింది. తాను ఒక బొమ్మను కాననీ, తవది ఎవరూ లేని శరీరం కాదనీ, తాను నిజంగా దార్ఢ్యంగల వ్యక్తినేననీ, ఆత్మ విశ్వాసం కలిగించ గల సాధనాలను ఆమెకు లభ్యం కాకుండా ఈ లోకం చేయడం ఎంతటి నీచత్వమో మనం అవగాహన చేసుకోవాలి.

విద్యా సముపార్జనకు అవసరమ్మైన మేధ, బుద్ధి కుశ లత ఆమెకున్నాయి. కాని వాటితోపాటు ఆమె మానసికంగా సమర్థురాలైఉంటే అనుకోవలసిన పనేలేదు. మంచి తెలివి తేటలు, సూక్ష్మబుద్ధి లేకపోతే ఆమెలా అంత సొగసుగా అంత ధ్వనిప్రాయంగా పెదవి కదపకుండానే తమాషా చేయడం, అంత చక్కగా విలేఖరుల ప్రశ్నలను దాటవేయడం సాధ్యం కాదు. ఇక ఆమె ఇచ్చిన ఇంటర్‌వ్యూలనుబట్టి, ఆమె వ్యక్తి త్వాన్ని నిర్ణయించాలంటే— నటీ నటులు రంగస్థలం దిగి వచ్చిన తరువాత మాట్లాడేటప్పుడు ఎంత మందకొడి తనం కన్పరుస్తారో అది మెర్లిన్ మన్రో లో కన్పించేది కాదు.

అలాగే ఇతరులు కన్పరచే సౌమ్యం, కపటం, విస్మయం, తెచ్చి పెట్టుకొన్న విలాసం ఆమెలో అగపడేవికావు. తన వృత్తి విషయంలో తాను అవలంబించవలసిన రక్షణ చర్యలపట్ల ఆమె ఎంత నిర్లక్ష్యభావం కలిగి ఉండేదో ఇలాంటి పై మెరుగులంటే కూడా ఆమె అంత అయిష్టత కనపరచేది. సాటి నటీమణులంటే ఆమెలో ఏ కోశానా అసూయా ద్వేషాలు ఉండేవికావు. డైరెక్టర్లను, రచయితలను, భర్తలను చీవాట్లు పెట్టలేదు. వారిని ఏవగించుకున్న సందర్భం కూడా కానరాదు. తన తప్పులకు ఆమె ఎవరినీ నిందించేదికాదు. ఆమె భారం అటువంటిది! అయితే అది అందరినీ కాపాడిందిగాని, ఆమె నొక్కదానిని మాత్రం నాశనం చేసింది. తన్ను తాను బలపరచుకోవడం, తన తప్పులకు తనను సమర్థించుకోవడం ఆమెకు తెలీవు. ఆమె అందరిపట్ల దయ చూపిందిగాని, తన పట్ల దయ చూపుకోలేదు. తనను తానే వేళాకోళ మాడుకుంది. తన భౌతిక శరీరాన్ని అపహాస్యం పాలు చేసుకుంది. జీవితంలో తనకు ఎదురైన పరిస్థితులను చూచి తన్ను తానే వెక్కిరించుకుంది. ఈ స్వభావం ఆమెను, ఇతరులకు ఆరాధనీయమైన వ్యక్తిగా చేసింది. గాని ఆమెకు మాత్రం ఘోరమైన అన్యాయం చేసింది. అసలు ఆమె స్వశక్తిపై నిలబడడానికి తావే లేకుండా చేసింది. ఆమె తనకు గల స్త్రీ లైంగికత్వ సంపదను ప్రదర్శించి అతిశయాన్ని చూపినప్పుడు, తన చేతులారా చేసుకున్న వినాశనంవైపు ఆమె నివ్వెరపోయి చూచినప్పుడు ''భయపడకండి—నా విషయం నేనే అంతగా పట్టించుకోను. మీరు కూడా నన్ను అంతగా పట్టించుకోకండి'' అని అంటూనట్లు ఉండేది. వేళాకోళంలో ఆమెకుగల ప్రతిభ ప్రజలకు ప్రయోజనం కలిగించింది. ఆమెనుమాత్రం వ్యక్తిగతంగా దోచి వేసింది. మానవ జీవితంలో తనకూ ఒక పాత్ర ఉన్నదనీ, తనకూ, పన, యాదార్థ్యం ఉన్నవనీ, ''తానూ గుర్తింపదగ్గ వ్యక్తి'' అనీ తగుయోగ్యతలు తనకూ ఉన్నాయనీ ఆత్మవిశ్వాసం కలుగడం మనవంటివారికంటె ఆమెలో చాలా అవసరం. తాను ఒకరిని యాచించవలసిన స్థితిలో ఉండి కూడా మనందరికీ ఓదార్పు, ఉపశమనం, సుఖానందాలు కలుగజేసింది. తాను నిరుపేద. కాని ఇతరులకు ఉదారంగా దాన ధర్మాలు చేసింది!

సహృదయులైన రచయితలు ఆమె ఆత్మహత్యను, దానికి దారి తీసిన విషాద పరిస్థితులనూ చర్చిస్తూ, దీనికంతటికీ బాధ్యత హాలీవుడ్‌దేనని ఆరోపణ చేశారు. హాలీవుడ్ ఫిలిం పరిశ్రమ ఆమెవల్ల కోట్లు గడించింది. ఆమెను ఎన్ని విధాల ఉపయోగించుకొని డబ్బు చేసుకోవాలో ఆ పద్ధతులన్నిటినీ అవలంబించింది. మెర్లిన్ మన్రో జీవితం అలా భగ్నం కావడానికి పరిశ్రమే ముఖ్య కారణమని పై రచయితలు అన్నారు. అమెరికాలోగల అసభ్యతకూ, చెడువాంఛలకూ, దురాశలకూ ఆమె బలి అయిపోయిందని అన్నారు. హాలీవుడ్ అంటే వారికిగల చీదర, అసహ్యము నాకూ ఉన్నాయి. ఆ రొచ్చునుంచి మెర్లిన్ మన్రోను వేరు చేయవలసిన అగత్యాన్ని నేనూ గుర్తిస్తాను. మన సంస్కృతిలో హాలీవుడ్ పెద్ద ఉన్మాదము. ఇంత పెద్ద వెర్రి మరే నాగరికతలోనైనా ఉంటుందో లేదో! ఒకవేళ హాలీవుడ్ ఇలా మన పెరిగినట్టిదిగా కాక, మరొక రకమైనదైతే ఈ యువతి జీవితం ఇలా అంతంకాక సుఖాంత మవుతుందని అంటే నేను నమ్మను. మహాత్కృష్టమైన పరిస్థితులుండి జీవితం సవ్యంగా గడిచే వీళ్లున్నా, మెర్లిన్ మన్రోవంటి వ్యక్తి జీవితంమాత్రం ఇలా అంతం చెందవలసిందే. ఆ మనిషే అంత!

మెర్లిన్ మన్రోలోగల ఆత్మనాశక స్వభావం అసహ్యకరమైన పరిస్థితుల ప్రభావంవల్ల పుట్టు కొచ్చిందికాదు. ఆమెలోగల మాధుర్యం ఆమె సొంతమైనట్లే అది హాలీవుడ్ ప్రభావాలకు అతీతమైనట్లే, ఆమె దుర్భర భయానక స్థితి కూడా ఆమె స్వీయ విశేషమే. అది ఎక్కడినుంచో తెచ్చి నాటిందికాదు. కాకపోతే గొప్ప సినిమాతార కావడం వల్ల ఆ స్థితి మరికొంత విషమించడానికి అస్కారం కలిగి ఉండవచ్చు. ప్రజా జీవితంలో ఆమెకుగల పాత్రవల్ల ఆమె పరిస్థితి మంచికిగాని, లేదా చెడుకుగాని దారితీయలేదు. ఆ పాత్ర ఆమెను వంకర దారి పట్టించలేదు. ఆమెనుగూర్చి అపార్థాలు తీసే అవకాశ మివ్వలేదు. కాకపోతే తాను కోట్లాది మందిచే గుర్తింపబడేది గనుక తన పరిస్థితులు తెచ్చిపెట్టగల అప్రతిష్ఠను ఆమె తప్పించుకోలేకపోయింది. ఆ రూపేణా బాధలకు లోనయింది. ఆమె సినీ ప్రపంచంలోనే అడుగు పెట్టకుండా ఉండి, ధనవంతురాలై ప్రపంచ విఖ్యాతి నార్జించుకొన్నట్లయితే వ్యధా కలితమైన ఆమె ఆత్మ ఎన్నడో ఆమె పని కట్టించి ఉండేదని నా ఊహ. ఇంకా ఇప్పుడు కొంత నయం. చివరి దశలో కొన్నేండ్లుగా వృత్తిలో విజయ పరంపరలు సాధించి జీవితానికి కొంత పరిహారం, ఉపశమనం పొందింది. అప్పుడైతే ఇంతకంటె ముందు ఏనాడో ఏ విధమైన మనశ్శాంతి, ఊరట, తృప్తి లేకుండా ఇలాగే దిక్కులేని చావు చచ్చి ఉండేది.

అయితే ఆమె పరిస్థితులకు బలి కాలేదని నేను అనడం లేదు. బలి అయింది. కాని, హాలీవుడ్ దమన నీతికీ, వ్యాపార న్యాయానికీ మాత్రమే బలి కాలేదు. పత్రికల క్రౌర్యానికి మాత్రమే బలి అయి చావలేదు. వెండితెరపై గొప్ప తార అయిన వ్యక్తికి దాపురించే బలుపు, మత్తు, మదాంధతవల్ల కూడా ఆమె నాశనం కాలేదు. దైవం ఆమెకు ప్రసాదించిన శరీరంవల్లనే ఆమె నశించి పోయింది. అంటే జీవితమే ఆమెను బలి గొన్నదన్నమాట. ఒక జీవి దైవదత్తమైన శరీరంవల్ల, దానిలోని జీవకళవల్ల నాశనం కావడమే మెర్లిన్ మన్రో జీవితంలోగల విశేషం. మానవుని ఉనికిలోనేగల—అధమం నాగరికతలో జీవించే మానవుని ఉనికిలోగల విషాదానికీ, విషాదపూరిత పర్యవసానానికీ, లోప భూయిష్ఠమైన మన సంస్కృతిని, నాగరికతను నిందించడం మన సమకాలికాభిప్రాయంలోగల 'అతి' అని చెప్పాలి. మెర్లిన్ మన్రో నేటి నాగరికత సృష్టించిన విషాద పాత్ర అని నా అభిప్రాయం. అయితే ఆమె అమెరికన్ నాగరికతలో విషాద పాత్రగా జీవించి మౌనంగా నిష్క్రమించడం అదొక విశేషం—కాబట్టే ఆమెగాథ అంతగా హృదయ విదారకమై కాలగర్భంలో కలిసి విశ్వ మానవ చరిత్రలోకి పోయింది.

('ఎన్‌కౌంటర్' సౌజన్యంతో)

# ప్రత్యేక ప్రాముఖ్యతకల విషయాలు

ఈ క్రింది యథార్థ విషయాలు ముందు ఆలోచనకల ప్రతి భారతీయునికీ ముఖ్యమైనవి. అవి మీకూ, మీ కుటుంబానికికూడా చాలా ముఖ్యమైనవి. ఎందుచేతనంటే చైనీయుల దురాక్రమణ నుండి మన దేశాన్ని రక్షించుకొనడము పైననే మన దేశ ప్రజల భవిష్యత్తు ఆధారపడి వుంది. మనది శాంతిప్రియమైన దేశము, మన ప్రజలు శాంతిప్రియులు. అయినా, పరాయి దురాక్రమణకు ఎన్నడూ మనం తలవంచము.

## చైనీయుల వలని ఉపద్రవం

యుద్ధ రంగములో పోరాటం నిలిచిపోయినా, మన సరిహద్దులలో చైనీయుల దురాక్రమణ కొనసాగుతూనే వుంది. చైనీయులు లదాఖ్‌లో ఇంకా 14,000 చదరపు మైళ్ళ భారత భూభాగాన్ని అన్యాయముగా ఆక్రమించుకొని, మన సరిహద్దులలో తమ సైన్యాలను పెద్దపెట్టున సమీకరిస్తున్నారు. మన దేశమునుండి ఆఖరి దురాక్రమణదారుని తరిమివేసేవరకూ విశ్రమించమని మనం తిరిగి ప్రతిజ్ఞ చేద్దాం

## వెల్లివిరిసిన ప్రజోత్సాహం

మన ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ దేశ రక్షణ నిధిని ప్రారంభించినప్పుడు తరతమ భేదాలను మరచి ప్రజలందరూ సమధికోత్సాహముతో ముందుకు వచ్చారు. ఇది బ్రహ్మాండముగా విజయవంతమైంది.

స్వాతంత్ర్య పరిరక్షణకు ఎంతటి త్యాగాలైనా పెద్దవికావనే ఉద్దేశ్యముతో మనం ఉదారముగా .... హృదయపూర్వకముగా విరాళాలనిచ్చాము.

## స్థిర నిశ్చయము

మన స్వాతంత్ర్యానికి ఆపద తొలగిపోయేవరకూ విరాళాలను ఇస్తూనే వుంటామని ఒక స్థిర నిశ్చయము చేసుకొందాము. బంగారాన్ని ఇద్దాము. రేపు మన మందరమూ ఇనుప సంకెళ్ళలో చిక్కుకోవలసి వస్తే ఈనాడు మనం బంగారపు గాజులు ధరించడంవల్ల ప్రయోజనం ఏముంటుంది? ధనాన్ని విరాళంగా ఇద్దాం. దీని వలన మన రక్షణ శక్తి పెంపొందుతుంది.

## ఇవ్వడానికి మూడు ముఖ్య కారణాలు

1. మీ భవిష్యత్తు, మీ పిల్లల భవిష్యత్తు సురక్షితముగా వుండాలంటే విరాళాలివ్వండి.

2. మీ మాతృదేశపు సరిహద్దుల రక్షణకి విరాళాలివ్వండి.

3. భారతదేశములోను, ప్రపంచములోను శాంతి నెలకొనడానికి విరాళాలివ్వండి.

## వీటిని గురించి యోచించండి

మన బాధ్యతను విస్మరించి మన గౌరవాన్ని మంటపాలు చేసుకొంటామా? మనకోసం మన జవాన్లు ప్రాణాలను అర్పిస్తూంటే చూస్తూ ఊరుకొంటామా? ఈనాడు మనం స్వార్థపరులమై మనక్షేమని చూస్తూవుంటే—మనం అమూల్యమైనవని భావించే వాటిని రేపు మనకు దక్కనిస్తారా? స్వార్థానికి దేశాన్ని, దురాశకు ధైర్యాన్ని, ఆస్తి కోసం స్వాతంత్ర్యాన్ని బలిచేయడం న్యాయమేనా?

<u>బాగా ఆలోచించండి</u>

**దేశ రక్షణ కృషిలో పాల్గొనండి**

# కనిపించిన కైలాసము



శ్రీ యస్వీ జోగారావు

(విజయపురం కొండల్లో దండకారణ్య—అయోమార్గ నిర్మాణాదిక పథకాల్లో పరిశ్రమించే నరులనూ, పరిసరప్రకృతినీ తిలకించి పులకించి)

కొండమీద కోవెలవలె
కొనదేరిన వెండిమబ్బు
వెనుక నదో వేదాంతము!

నరుని దృష్టి తగులకుండ
నగకాంతలు సిగలమేలి
ముసుగేసిన మూడమంచు
ముంగల నదో శృంగారము!

ఉప్పరమున కువ్వెత్తుగ
తల లెత్తిన మలలనుండి
పడగెత్తిన కొండనాగు
పగిదిపడే కొండవాగు
సగసనదో సంగీతము!

కొండలలో కోనలలో
ఆవలలో లోపలలో
ఆకసమే పయ్యెదగా
విరితావుల విహరించే
అప్సరసలు సీతాకోకలు చిలుకల
నడుల నదో సాహిత్యము!

పొగమంచును నీరెండయు
పోటీ డీ పొలుచూపినటు –
కొండమీద ధనుష్కోటి!

# భా ర తి

నింగి నేల నాలింగన మొనరించిన
వలికరువలి తెరువునబడి
ఈ కొండలు నిండిన నీరెండలు
పట్టపగలు పండిన వెన్నెల బయళ్లు!

తమసీమకు తరలివచ్చి
తమవారసులైన నరులు
పడే పాట్లు పడసిన మేల్
పరికించుచు
కిచకిచమను కిలకిలమను
నరజాతి పితామహులకు
నట్టిల్లిది పుట్టిల్లిది!

పాములవలె మెలిమెలికల బాటలతో
జడలవంటి తోటలతో
జలపాతమ్ములతో
శుక్ల పక్ష శుభ తుషల
నెత్తిని నెలవంక దాల్చు
ఈ ప్రాక్తనగిరి దర్శన
మీశ్వర సాక్షాత్కారము!

ఇది లోకోత్తర సుందర
మిది నానాసుమ సురభిళ
మిది సురుచిర ఫల ప్రచుర
మిది శాంతికి స్థాణ్వాశ్రమ
మిది జగజ్జనని నగజా
లావణ్య కళా విలాసమ్ము
ఈగిరి యొక్కొక్కటి యొక
కైలాసము!

ఈకొండల ఋనుపకుండ
చెండి చెండి చేసపిండి
తాను విసము దిగ్రావుచు
తరతరాల తన సంతుకు
పీయూషము పిలిచి యిచ్చు
ప్రతినరుడూ పరాత్పరుడు!!

# శృంగారనైషధము - పాఠభేదములు



శ్రీ నిడుదవోలు వేంకటరావు

ఈనాడు పూర్వకవి రచితములైన తెలుగు కావ్యములు కొన్ని పునర్ముద్రణము నందుటయు, వాని యందలి పాఠభేదములను గూర్చి వాద ప్రతివాదములు పత్రికా ముఖమున జరుగుచుండుటయు విద్వల్లోకమున కీ వరకు సుపరిచితమైన విషయము—వాద ప్రతి వాదముల మాట యటుండగా, నీ పాఠభేద విమర్శనా పరిశ్రమ మాత్రము ప్రస్తుత పరిస్థితులలో నత్యంతావశ్యక మగుచున్నది.

తెలుగు భాష కొక సమగ్రమును, సప్రమాణమునగు నిఘంటువు నిర్మించుటకుగాని—పద కోశములు, సూచికలు ప్రవర్తిల్ల చేయుటకుగాని, సాధు పాఠములతో సమ్యక్పరిశీలితములై, పరిష్కృతములైన ప్రాచీనాంధ్ర కావ్యములే మూలాధారములని యందరు నేకగ్రీవముగా నంగీకరించిన విషయము. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రకటించిన "నన్నయ పద ప్రయోగ కోశము," "నన్నెచోడ పద ప్రయోగ సూచిక"—అను నీ రెండు గ్రంధములపై వచ్చిన విమర్శలను[1] సావధానముగా చూచినచో, ప్రాచీన కావ్యమునకు సప్రామాణికమగు పాఠనిర్ణయము లేకపోయినచో, నవి ఎట్టి యవ్యవస్థకు పాల్పడునో సంస్కారము గల చదువరు లెల్ల గ్రహింపగలరు. అప్రామాణిక పాఠములతో గూడిన అచ్చు పుస్తకము లాధారముగా గొనుటచేత, ఆ గ్రంధ ముద్రణ ఎంత అనర్థకముగా పరిణమించినదో కూడ పై విమర్శనములలో నిరూపితమైనది. ఆ రెండు కోశములును పునర్ముద్రణము కావలిసినవియే యని యందు తీర్మానింపబడినది.

నలువదేండ్లనుండి సాహితీ ప్రపంచము నుర్రూత లూగించుచున్న నన్నెచోడని కుమార సంభవమునకేకాక, నవ శతాబ్దులనుండియు నఖిలాంధ్ర సాహితీ ప్రపంచమునకు ప్రథమ తీర్థమైన నన్నయ భారత భాగమునకు సుసంశోధిత ముద్రణ లేదు.[2] ఈ సందర్భమున భారతమును గూర్చి విషయాంతరమైనను నొక్క విషయము చెప్పుచున్నందులకు పాఠక లోకము మన్నించుగాక.

ఆంధ్రత్వమునకు మూదలయ్యైన భారతము మూడు రీతులుగా వ్యాప్తి జెందించవలసి యున్నది.

(1) ప్రజా సామాన్యము చదువు కొనుటకు సులభ వచన రచన.

(2) చదువరులకందుబాటులోనుండు చౌక ధరతో సంపూర్ణ భారతము నందించుట.

(3) పండితులకు సంస్కారులకుపయుక్తమగు పరిష్కృత ముద్రణ.

పై మూడింటిలో (1) మొదటి దానిని, ఆంధ్రపత్రిక వారు సాధించియే యున్నారు. అవిచ్ఛిన్నముగ నైదేండ్ల కాలము ఆంధ్ర మహా భారత వచనమును ప్రకటించి, ఆంధ్ర లోకమున కందించినారు.

(2) రెండవ విషయమునకు నుద్యోగ పర్వమతి స్వల్ప ధర (25 నయాపైసలు) పెట్టి భారత మంతయు చౌకగా నందించుటకుద్యమించినారు. కాని ప్రజాదరణ పొందలేదు.

(3) సుపరిష్కృత ముద్రణమునకు తల పెట్టక పోయినను, ఆ ముద్రణకు తగిన సాధన సామగ్రిని వ్యాసముల మూలమున (ఆంధ్రపత్రిక, భారతి) సమకూర్చియే యున్నారు—ఆ విషయము స్థలాంతరమున విపులీకరింపబడును.

---

1. నన్నయ ప్రద ప్రయోగ కోశము భారతి సం. 39. సం. 4—ఏప్రియలు 1962—పుటలు 52—59.

నన్నెచోడుని పద ప్రయోగ సూచిక—భారతి సం. 40 సం. 1—జనవరి—1963. పుటలు 70—78.

2. ఆంధ్ర విశ్వ కళా పరిషత్తువారు ముప్పదేండ్ల క్రిందట కీర్తిశేషులు గిడుగువారి అధ్వర్యాన—నన్నయ భారత పరిష్కృత ముద్రణమున కొక సంపాదకీయ వర్గము నేర్పాటు చేసిరి. ఆ సంపాదకీయ వర్గమున నే నొకడను. కాని యది కారణాంతరముచే నాగిపోయినది.

నేడు 'ఉస్మానియా' విశ్వ విద్యాలయమువారు నన్నయ భారతాంధ్రీకరణ భాగమునకు—సుపరిష్కృత ముద్రణము ప్రకటించుటకు ప్రణాళిక నేర్పరచినట్లు వారి కరపత్రమువలన తెలియవచ్చుచున్నది. ఈ విశ్వ విద్యాలయమువారి యుద్యమమమైన ఫలవంతమగు గాక.

సాహిత్య అకాడమీవారు నన్నయ, నన్నెచోడుల పద కోశములేకాక, తిక్కన, శ్రీనాథ పద ప్రయోగ సూచికలను కూడ తయారు చేయించుచున్నట్లుగా కార్యదర్శిగారు 22—2—63 తేదిని తెలిపియున్నారు. వీరి రచన "జరుగుచున్నది" అని వారు ప్రకటించి యుండుటచే నింకను పని కొనసాగుచున్న దనుట స్పష్టము.

సాహిత్య అకాడమీవారి పద సూచికా ప్రణాళికల కొక దారి తెన్ను లేనట్లు కాననగు చున్నది. వారు 'కవిత్రయమును' నన్నయ, తిక్కన, ఎర్రనలను పూర్తి చేసి, ఆ వెనుక శివ కవి త్రయములో ప్రముఖుడైన పాల్కురికి సోమనాథుల గ్రంథ ములకు పదసూచికలు వ్రాయించు ప్రణాళిక నేర్పాటు చేయ వలసి యుండెను. కాలక్రమము ననుసరించినను, కవితా పరిణామము ననువర్తించినను, కావ్య క్రమక్రియా వైవిధ్య మును అవలంబించినను, పై విధములుగా గ్రంథ సూచికలు రచితములైనచో నవి బహుముఖములుగా భాషాభివృద్ధికి వాఙ్మ యాభివృద్ధికి దోహదములై యుండెడివి.3 పాల్కురికి సోమన ఎర్రన వీ రిద్దరి గ్రంథముల పదకోశములు ప్రకటించి, శ్రీనాథుని గ్రంథ పదకోశము ప్రకటించిన నెంతో నమం జసముగ నుండెడిది. కాని యట్టి పని జరుగలేదు. జరుగు తున్న పనిని గూర్చి గాక, జరుగబోవు దానిని గూర్చి విచారణ ఎందులకు?

ప్రస్తుతము శ్రీనాథకవి రచనలలో సగ్ర గ్రంథ మగు శృంగార నైషధమునందలి పాఠ భేదములను గూర్చి తెలుపుదును.

ఇప్పటి కేబదేండ్ల క్రిందట కీ. శే. వేదము వేంకట రాయశాస్త్రిగారు శ్రీనాథ శృంగార నైషధమును, సర్వంకషా వ్యాఖ్యతో ప్రకటించిరి. ఆ ప్రతులు చెల్లిపోవుటచే వారి పౌత్రులు వేదము వేంకటరాయశాస్త్రిగా రేడాది క్రిందట దానిని పునర్ముద్రణముచేసి, 60 పుటల పీఠిక వ్రాసిరి. వా రి గ్రంథము పునర్ముద్రణము చేయునాటికి ఆంధ్ర దేశమున నీ వ్యాఖ్యానముపై ఖండనములు విమర్శలు వ్యాప్తమై యున్నవి.

కీర్తిశేషులు గిడుగు రామమూర్తిపంతులుగారు— ఆంధ్ర పండిత భిషక్కుల4 భాషా భేషజమున శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు సాహిత్య చరిత్రలోను, ప్రస్తుత వ్యాస కర్త ఉదాహరణ వాఙ్మయ చరిత్రలోను దీనిని విమర్శించి యే యున్నారు. వీని యం దెన్నో పునర్ముద్రణమున సంస్క రింపదగిన విషయములు సూచితములైనవి.

కాని పునర్ముద్రణమున వే. వే. గారు పై విమర్శన లను లక్ష్యపెట్టక పోవుటయేగాక, పాఠభేదముల విషయ ములలో తమ తాతగారి గ్రంథము నెవ్వరికి తాకుట కర్హత లేనట్లుగా వ్రాసి, పూర్వ ముద్రణములను యథా మాత్ర కముగ ముద్రించిరి. దీనివలన యా గ్రంథ ముద్రణ మసర్థక మైనది. ఆంధ్ర సాహిత్య ప్రపంచమునకు తీరని 'కళం కము' గలిగినది.

తెలుగు భాషలో నప్పకవీయాది లక్షణ గ్రంథములు కొన్ని యున్నవనియు, వానియందు పూర్వకవి రచిత గ్రంథ ములనుండి యా యా గ్రంథ రచయితలు లక్ష్యముల నిచ్చెదరనియు వే. వే. గారికిగాని, వారి తాతగారికిగాని తెలి యదు. గిడుగువారుగాని, తదితరులుగాని చూపిన పాఠములు, గిడుగు వారివిగావు. తదితరులవిగావు. అవి మూడు వందల ఏండ్లనుండి లక్షణ గ్రంథకర్తలచే నుదాహరింపబడిన పాఠ ములు.

అప్పకవి, కూచిమంచి తిమ్మకవి, అడిదము సూరకవి శ్రీనాథుని నైషధ కావ్యమునుండి లక్ష్యముల నిచ్చియున్నారు. ఈ ముప్పురిలో కూచిమంచి తిమ్మకవి.

"సర్వ లక్షణ సార సంగ్రహమున" నైషధమునుండి ఇచ్చినన్ని లక్ష్యములు—(42) మరియే లాక్షణికుడు నిచ్చి యుండలేదు. ఒక్క నైషధమునుండియేకాదు. శ్రీనాథుని కృత్యంతరములు—హరవిలాసము, భీమఖండము, కాశీఖండము, వీథి నాటకము—వీనినుండి నూటఏబది లక్ష్యముల నిచ్చి యున్నాడు. ప్రాచీన కవులలో లక్షణ గ్రంథకర్తలలో శ్రీనా థుని రచనల నామూలాగ్రముగా బరిశీలించిన కవి తిమ్మకవియే యని స్పష్టముగా నిరూపింపవచ్చును.

తిమ్మకవి పద్య పాదములనేగాక, పద్యమంతయు పూర్తిగ నిచ్చుటచేత, ఒక్క లక్ష్య సందర్భమునేగాక, తక్కిన పద్య

---

3. పాల్కురికి సోమన గ్రంథములలో దేశి పద జాలము మిక్కుటముగా గలదు.

ఎర్రన గ్రంథములు గ్రంథ బాహుళ్యము గలవే— హరివంశములోనే 4686 గద్య పద్యము లున్నవి. అరణ్య పర్వశేష, నృసింహ పురాణము 2465. మొత్తము 7151 గలవు. ఇంకా రామాయణమున నెన్నియున్నవో?

4. పీఠికాకర్త 9 వ పుటలో (ఆక్షేపములు: వ్యావహారిక వాదము) "ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము" అన్న గిడుగువారి గ్రంథ నామమును పేర్కొనకపోవుట విచార కరము. ఆ గ్రంథము క్రీ. శ. 1933 లోను, క్రీ. శ. 1962 లోను రెండు తడవలు ముద్రితమైనను, దానినిగూర్చి తెలిసి కోకుండా వ్రాయుట ఎంతమాత్రము సరికాదు.

పాదములయందు పాదము లెట్లున్నవో తెలుసుకొనుటకు వీలగు చున్నది. కాబట్టి శ్రీనాథ గ్రంథ సంస్కరణమునకు సర్వ లక్షణ సారసంగ్రహము అత్యంతావశ్యకమైనది.

ఈ గ్రంథము శాలివాహన శకము. కర—2 రస—6, అంగ—6, శశి—1—అంకానాం వామతోగతిః—1662+78 =1740 క్రైస్తవ శకమున రచితమైనది. దీనినిబట్టి ఇం దుదాహరింపబడిన నైషధ పాఠములు రెండువందల యేండ్ల నాటివి.

తిమ్మకవి గ్రంథము క్రీ. శ. 1901 లో మంజు వాణి పత్రికలోఁ ప్రకటితమైనది. అనగా వేదము వారు నైషధ వ్యాఖ్య వ్రాయుటకు పుష్కర కాలమునకు ముందుగనే అచ్చు యినది. కాని వారి కాధారము, ప్రమాణము—చిన్నయసూరి, సీతారామాచార్యులుగాని, తిమ్మకవికాదు. వారా నా డట్లు ప్రకటించినను నేడు పునర్ముద్రణమున విస్మరించుట సరి యగు గ్రంథ పరిష్కరణ పద్ధతిగాదు.

క్రీ. శ. 1913 ముద్రణములో వేదమువారు అతః పూర్వ ముద్రణములలోని దోషముల సవరణలు నిచ్చుటేగాక, తాళ పత్ర ప్రతులలోని పాఠముల నుదాహరించి, వానిని తిర స్కరించి, తాము నిర్ణయించిన పాఠములను నుదాహరించి యున్నారు. అవి అనుబంధములుగా గలవు. వాని ప్రస్తావ మిందు వచ్చును.

1. కాల్చిన—గెల్చిన

నైషధము (1—2) లో పద్య మిట్లు గలదు:

మ. కనక క్షోణి ధరంబు కార్ముకముగా, గద్రూత నూజుండుశిం
జినిగా, మాధవు డమ్ముగా, బురముల క్షిక్షైకదోశ్శక్తిగా
ల్చిన జోదీశ్వరుఁ డిచ్చుగాత.........

ఇచట తిమ్మకవి పాఠము—గెల్చినజోదు

ముద్రిత నైషధమున దోషముల సవరణలో ''గెల్చిన—(గాల్చిన''

అవి కలదు. దీనినిబట్టి ''గెల్చిన'' పాఠము దోషము. కాని తిమ్మకవి పాఠమేకాక, వ్రాత ప్రతుల పాఠముకూడ గెల్చిన యనియే. ఇది యొక దోషముకాదు. ఇంతకు అర్థము విచా రింపుడు. దోశ్శక్తితో గాల్చుట యేమి? కాల్చుటకు దోశ్శక్తి మాట యటుండగా, తోకయైనను నా పని సేయునుగదా! త్రిపురముల నీశ్వరుడు కాల్చినాడన్న మాట వాస్తవమే కాని, ప్రకరణము ననుసరించి గెల్చిన పాఠమే యుచితము— కావున దిద్దనావశ్యకత లేదు చూడుడు—

యుద్ధములో జయించుటకు సాధన సామగ్రి—కార్ము కము—శింజిని—అమ్ము వీనిని చెప్పి 'అక్షిక్షైక' అని యొక విశేషణముతో జోడించి శ్రీనాథుడు వ్రాసినపుడు శివుని లోకోత్తర పరాక్రమము వ్యక్తపరచుటకే గెల్చిన అను క్రియ యుపయోగించినాడు. అంతేకాని శైవ వాఙ్మయ నిష్ణా తుడగు శ్రీనాథుని త్రిపురములను 'కాల్చుట' యను సంప్ర దాయములను 'కాల్చుట' తెలియలేదనుట హాస్యాస్పదము. త్రిపుర విజయమున, యుద్ధప్రకరణమును గూర్చి చెప్పు నప్పుడు—'గెల్చు' అను క్రియనే కవు లుపయోగించిరి. గాని 'కాలు' అని యుపయోగింపలేదు. ఈ క్రింది ప్రయో గములు కానవగును.

(1) సీ. సారథి శత వృద్ధ చక్రంబు లొనగూడి
జరగని రథమున సంఘటించి
ఉదకంబు సోకున కోర్వని యరదంబు
చేతికి బిరుసైన రాలివిల్లు
గడితాకు కోర్వక గడగడ వడకుచు
మువ్వంక బోయెడి చివ్వనారి
మేపు నీరును లేక మెదలాడ నోపక
వర్ణహీనంబైన వారువములు.
గీ. నిట్టి సాధనములు నీకు నెట్లు లొదవెఁ
ద్రిపురముల నెట్లు గెలిచితి దేవదేవ!
యనుచు నగజాత చెలులాడ నలరు శివుడు
చిత్త మిగురొత్త మిమ్ము రక్షించుగాత!
చిమ్మపూడి అమరేశ్వరుడు—విక్రమసేనము.

(2) సీ. తివిరి రాశికి నెక్కి తిరుగు చక్రంబులు
మెట్టుల బదిలమై మెరయుతేరు
. . . . . . . . . . . . . .
సరిలేని కోటుల సంఖ్య బలము
గీ. ధనకు నబ్బుటయును బురత్రయము గెలిచి
పృథుల విఖ్యాతి గైకొన్న రథిక వరుడు
కానుకొలను అన్నమయ్య—అమరుకము

---

5. ఇది క్రీ. శ. 1914 లోను, మరి రెండు పరి యాయములు ముద్రితమైనది. ఇది చాల విలువగల లక్షణ గ్రంథము. ఎర్రాప్రెగడ రామాయణము, కవుల షష్ఠము మొదలగువానినుండి లక్ష్యములు గలవు. దీనిని పరిశీలించియే క్రీ. శ. 1940 లో భీమ ఖండ పాఠభేదములను గూర్చి వ్రాసితిని—ఆనాడది విద్వాంసుల మన్నన నందినది. దీనికి సుపరిష్కృతమగు ముద్రణ లేనందున, నేనే కొంతకాలము క్రిందట ఈ పని తలపెటి పూర్తి చేసితిని.

(3) సీ. దేహంబు మిక్కిలి తిరమైన రథముగా

. . . . . . . . . . . .

నలువైన హారంబు నారిగాగ

గీ. అన్నియును నీ మహత్త్వంబయగుట జేసి
వల త్రిపురంబులేసి గెల్చితివిగాక''
అంగ భవ భంగ! తిరుకాళీహస్తి లింగ!

బొడ్డపాటి కొండయ-కాళహస్తి లింగ శతకము.

(4) సీ. కవగూడి నడక సాగని బండి కన్నులు

. . . . . . . . . . . .

గీ. సాధన ప్రకర శక్తి
విషమ శబ్దంబు లైనట్టి—పిమితపురము
రెల్ల సాధించి గెల్చితి వేకహేల!

పెదపాటి సోమయ—శివజ్ఞాన దీపిక.

(5) సీ. భూరి విశ్వంభరా భూతంబు రథము

. . . . . . . . . . . . . . . .

గాగ వేగి వేగఁ గడంకతో బురములు
గెల్చి వచ్చి గెలుపు గిరిజతోడ
చెలఁగి చెలఁగి చెప్పి చెలువొందు శంభుండు

సోమయ—త్రిపుర విజయము.

—ప్రబంధ రత్నావళినుండి

పై వానిలో నొక్క యమరేశ్వరుడు తక్క తక్కిన వారందరు శ్రీనాథుని వెనుకవారే గావున— 'గెల్చి' యను పాఠమునే యనుసరించి పై ప్రయోగ సరళిని బట్టి 'గెల్చి' అని పూర్వ ముద్రణములలోనుండగా దానిని తప్పని సవరించుట తప్పని యెన్నవగును.

2 వెలలడు—వెలుడడు—

ముద్రితమున :

ఉ. చిలుకలు వల్కునో చెవులు చిల్లులు వోవగనంచు
నెన్నడున్
వెలులడు నందనోపవన వీథులకై...... 4—24
కోమలి నీ దెస కూర్మి యెట్టిదో

తిమ్మకవి లడలక భేదము చెప్పు పట్టున నీ పాద మున 'వెలుడడు' అను పాఠ మిచ్చినాడు.

ఆతని పద్యమున :

''ఉ. చిలుకలు గూయునో చెవులు చిందర వోవగ నంచు
నెన్నడున్
వెలుడడు నందనోపవన వీథులకై......
కోమలి నీ దెస కూర్మి పెంపునన్.

అను పాఠములు కలవు.

'వెలుడడు' అను పాఠమునకు ప్రమాణముగా ఆంధ్ర నామ సంగ్రహమున నీ క్రింది పద్య ముదాహరించినాడు.

క. కలవు వివరింపగా నా
ఖ్యలు వరుసన్ నిర్గమించె ననుటకుధరలో
వెలువడియె వెళ్లె వెడలెను
వెలుడె ననం జిత్ప్రకాశ విశ్వాధీశా!

అప్ప కవీయమున నీ పద్యమే తృతీయా శ్వాసమున 'ఉడ'ల కభేద ప్రాసమునకు లక్ష్యముగానుదాహరించినాడు.

''చిలుకలు గూయునో చెవులు సిల్లులు వోవగ నంచు
నెన్నడున్
వెడలడునందనోపవన వీథులకై ''

తిమ్మకవి దీనిని విమర్శించి, ఇది అభేద ప్రాసము కాదని—శ్రీనాథుడు వెలుడె అను ప్రాచీన క్రియా రూపమునే వాడినాడని—సమర్థించినాడు. కావున నీ పాఠమే సరియైనది.

'వెలుడు' అనునది వర్ణ వ్యత్యయముచేత ''వెడలు'' అయినది. తెలుగున యతిప్రాస శబ్ద స్వరూప చరిత్రమునకు దోడ్పడు ననుట కిది యొక మంచి యుదాహరణము

3. చరణంబు ద్రొక్కు

సరసవడి కుదాహరణముగా తిమ్మకవి ఈ క్రింది పద్య పాదము నిచ్చి యున్నాడు.

''అమరపతి న్వరించెదవొ హవ్యవహుం జరణంబు
ద్రొక్కెదో
శమనుని చెట్ట పట్టెదవొ సాగర వల్లభు బెండ్లియా
డెదో (4—48)

దీనికి ముద్రిత పాఠము :

''అమర పతిన్వరించెదవొ హవ్యవహున్వరణం బొన ర్చెదో'' అనునది.

ఇచట తిమ్మకవి పాఠమే సరియైనది. ముద్రిత పాఠమున 'వరించు' 'వరణము' అను నొక్క 'వృ' ధాతు రూపములే యున్నవి. ఇట్టి రచన శ్రీ నాథునిదికాదు. వ్రాత ప్రతులలో చరణంబు ద్రొక్కు అను పాఠమే కలదు. ఇంతేకాదు—చరణంబు'' ద్రొక్కు అను పాఠమున నెంత గంభీరార్థ మిమిడి యున్నదో చూడుడు. చరణంబు ద్రొక్కుట అనగా కాలు ద్రొక్కుట, పెండ్లియాడుట యని యర్థము. పై పద్యమున 'వరించు, చరణము ద్రొక్కు, చెట్టపట్టు' పెండ్లియాడు' అనునవి నాలుగు వివాహ మగుటకు పర్యాయ పదములు.

వివాహ కాలమున నగ్నిహోత్రుని వద్దనే సప్తపదులు త్రొక్కింతురు. ఈ విషయము నైషధమునందే (6—101) ఇట్లు కలదు.

సీ. భక్తి ప్రదక్షిణ ప్రక్రమంబుల జేసి
రా శుశుక్షణికి నుపాసనంబు

దీని వ్యాఖ్యలో భక్తిన్=భక్తితో, ప్రదక్షిణ ప్రక్రమంబులన్=వలగొని (సప్తపది) నడచుటచేత (ఏడు అంజలులు పెట్టుట చేత) ఆశుశుక్షణికిన్=అగ్నికి (శిఖావానాశు శుక్షణీ—అమ) ఉపాసనంబు చేసిరి=సేవ కావించిరి. అగ్ని చుట్టును వధూవరులు కలిసి ఏడడుగులు వల గొనుటకు సప్తపదియని పేరు.

కలసి ఏడడుగులు నడిచిన వారికి సఖ్యము గలుగునని శాస్త్రము. 'సఖ్యం సాప్తపదీ నంస్యాత్' అను నమరోక్తి వలన 'సఖ్యము' నకు పర్యాయ పదమైన 'సాప్తపదీన' శబ్దమే ఈ యర్థము తెలుపుచున్నది. సఖ్యముకై ఈ కర్మాంగము సర్వంకష (521—522) పై వాఖ్యలో చరణంబుద్రొక్కు అను పద బంధమున కర్థము వివృతము కాలేదు.

ప్రఖ్యాత పండితుడు పరవస్తు చిన్నయసూరి6 తన హిందూ ధర్మ శాస్త్ర సంగ్రహమున దీని యర్థమును చక్కగా వివరించి యున్నాడు.

## 'వివాహము' అను శీర్షిక :

"25. వివాహపూర్తికిఁ గన్యాదానమును— తత్పరిగ్రహమును, సప్తపదియును ముఖ్య క్రియలు. ఒక పళ్లెరములో బియ్యము నెఱపి యేడు గీట్లు గీచి యా యేడు గీతలమీద వరుడు పెండ్లి కుమార్తె కాలుపట్టి గీత గీత నొక్కొక్కసారి వరుసగా నుంపించుట సప్తపది యనఁబడును. ఇందుచేతనే ఇద్దఱు చెలిమి యొడంబడికకయి కూడి యేడడుగులు నడచు నాచారము కలిగినది. కాబట్టి సాప్తప దీనమను శబ్దము సఖ్యమునకు వాచక మయినది. ఈ క్రియతోనే వివాహము పూర్ణమవుచున్నది. హోమము మొదలైన ఇతర క్రియలు విశేషములుగావు. వరుఁడు కన్య కంఠమందు మంగళ సూత్రము కట్టుట లోకాచారముగాని శాస్త్రీయముగాదు.
(పుట 19.20)"

కాలుపట్టి గీతఁపై నంపించుట కాలు త్రొక్కించుట, కాలు ద్రొక్కుట—అను తెలుగు క్రియలో నెంత వైదిక సంప్రదాయార్థమున్నదో చూడుడు. ఇట్లే మన కవి సమయములలో, వర్ణనలలో పెక్కు వైదిక సంప్రదాయార్థములు గలవు.

'హవ్యవహాంజరణంబు ద్రొక్కెదో' అనునది సరియైన పాఠమని పండితార్థము.

చరణంబు ద్రొక్కుట—పెండ్లియాడుట అను నర్థమున నడిదము రామకవి7 "చెరువుమీఁది పద్యము"లలో నుపయోగించినాడు.

సీ. సకల రత్నాకర స్థానమై యుప్పొంగు
నంబుధీశుని చరణంబు ద్రొక్కి

చరణము ద్రొక్కు—అను పద బంధమునకు కాలు ద్రొక్కు, అడుగు ద్రొక్కు, అనునవి పర్యాయ పదములు.

గీ. "కలికి నిను రాజహంసంబు కాలు ద్రొక్కె"

అని విజయ విలాసమందలి ప్రయోగము.

'అడుగుద్రొక్కు' అనుదానికి వసు చరిత్రమునం దీ క్రింది ప్రయోగము గలదు.

4 ఐకొ—కదా
హరిహయు డేమి యయ్యెనొ కదా మదనా నలతాప
వేదనన్—తి. పా.
హరిహయు డేమి యయ్యె నొకొ యామద నానల
తాపవేదనన్— ము. పా. (4.65)

తిమ్మకవి సంధి ప్రకరణమున—ఇకార వికల్ప సంధికి లక్ష్యముగా దీని నిచ్చియున్నాడు.

ఈ పట్టున పాఠభేదము కలదు. ఈ పద్య పాదమునే తిమ్మకవి మిశ్రమ ప్రకరణమున సంశయ ప్లుతమునకు గూడ లక్ష్యముగా నిచ్చెను.

---

6. క్రీ. శ. 1858 లో చిన్నయసూరి రచించి ప్రకటించిన ఈ హిందూ ధర్మశాస్త్ర సంగ్రహమునే ఇద్దరు ముగ్గురోతప్ప ఎరుగరు. నాలని ద్వితీయమగు నీ యద్వితీయ వచన రచనను, నీ నడుమనే యాతని జీవితముతో గూడ పునర్ముద్రణము గావించి యున్నాను.

7. కదలుమిట మాని దివిజగంగాభవాని' అను మకుటము గల నాల్గు సీస పద్యములను, అడిదము సూరకవి చెప్పి నట్లు కవి చరిత్రాదులలో నున్నవి. కాని యా పద్యములు చెప్పినవాడు సూరకవియన్న రామకవి. చూడుడు—అడిదము సూరకవి జీవితము—అడిదము రామారావు కృతికర్త
(పుట 32)

ఈ విషయ మింతటితో నాగదు. 'చరణంబుద్రొక్కు' అను పదమును శ్రీనాథుడు కడు జాగరూకతతో సంప్రదాయ్య సిద్ధమైన యర్థము నిమిడించి ప్రయోగించినాడు. 'హవ' వహాంజరణంబు ద్రొక్కెదో' అనినాడు. ఇంద్రాగ్ని యమ వరుణులలో—'అగ్ని'ని గూర్చి చెప్పినపుడే ఈ పదము ప్రయుక్తమైనది. కావున 'చరణంబు ద్రొక్కుట'యే సరియైనది. చూడుడు—తెనుగు నుడికారము—వ్యాసము సాహిత్యవ్యాసము 1.

హరి హాయుడేమి యయ్యెనో కదా? మదనానల తాప
వేదనన్—

ఇచట 'కదా' అను శబ్దమున సంశయప్లుతము (త్రిమాత్రికము) వలన 'హ' కారమునకు 'దా' శబ్దములోని ప్లుత స్వరమునకు యతి.

కాబట్టి ఈ పాఠమే సరియైనది. మరియు, లోక వ్యవహారమున మనము—"అయ్యో! వాడేమై పోనాడోగదా?" అని చివర ప్లుత స్వరమున పలుకుట పరిపాటి. అప్పుడు 'కదా' అను పాఠము సమంజసము.

హరి హాయు డేమి యయ్యె నొకొ యా మదనానల
తాపవేదనన్

అన్న ముద్రిత పాఠమున యతి విశేషమే లేదు.

5. తిక్కించు— తికిరించు.

సీ. పా. తిక్కించు కొనియున్న తెక్క మొత్తము
తోడి
యొడలు జాడించి నెవ్వడి విదుర్చు— (2—5)
ముద్రిత పాఠము.

సీ. పా. తికిరించుకొని యున్న తెక్క మొత్తముతోడి
యొడలు జాడించి నెవ్వడి విదుర్చు—
(తి. పా)

పైవి యుదహరించిన ముద్రిత పాఠముకన్న తిమ్మకవి 'తికిరించు' అనుపాఠము సరియైనది. 'తికిరించు' పాఠము తిమ్మకవికి పరిచితము గావున— తన రసిక జనమనోభిరామములో నీ పదమునుపయోగించి కొన్నాడు.

సీ. పసికట్టి తోఁకలు. విసరి తారుచుఁ జెవుల్
తికిరించుకొని దిశల్ తేసిచూచి. —113

సూర్యారాయ నిఘంటువు — సం 6. 815 పుటలో రికిరించుకొని దిశల్ రేసిచూచి అని ఈ ప్రయోగమునే సాధురేఫతో ముద్రించిరి. తిమ్మకవి దీనిని శకట రేఫక్రిందనే పరిగణించెను.

ఇక వ్యాఖ్యానము గూడ యెంత యవ్యవస్థగా నున్నదో మచ్చున కొక యుదాహరణము జూపుచున్నాను.

శృంగార నైషధమున నే డవయాశ్వాసమున నల దమయంతుల విహార సందర్భమున— సంభోగ వర్ణన పద్యము: సీ. (పతిపాణి పల్లవ.... అయ్యెనపుడు రతము" (7—7) వెను వెంటనే ఈ క్రింది పద్యము గలరదు.

చ. కుతుకమునం గురంగమద కుంకుమ చర్చ వహించి
నీలలో
హితరుచులై స్వయంభులయి ఈ హిత సౌఖ్య
విధాయులైనయ
య్యతివ పయోధరంబులకు నర్థ నిశాసమయం
బునన్ సమం
చితనఖకించు కార్చనము సేసె మహీపతి భక్తి
యేర్పడన్ (7—778)

దీనికి వేదమువారి సర్వంకషా వ్యాఖ్యానమున తాత్పర్య మిట్లు గలదు (పు. 62:)

"అత్యంత శ్రద్ధతో నడికి రేయివేళ నలమహారాజు కస్తూరి కుంకుమ చర్చితములగు నీలలోహిత కాంతులై, స్వయంభువులును, కోరిన సౌఖ్యమును గావించునవియు నయిన యా దమయంతీ స్తనములను గోటినొక్కులనెడి మోదుగుఁ బువ్వులతో పూజించెను."

వేదమువారి పద్యమునకు మూల శ్లోక సంఖ్యనుదాహరించియు, దానిని పరిశీలించియు, శ్రీనాథుని పద్యము వాదములోని గంభీరార్థముగావి, అతఁడు మూల శ్లోకమునకు నెంత మెఱుంగుఁ బెట్టెనో, ఆ ప్రతిభగాని గ్రహించి నట్లు కానరాదు. పద్యార్థము సరిగా గ్రహించినగదా భావమవగతమగుట! ఇచట స్తనములకు పూజ యేమి అను నందేహమే వారికి తట్టలేదు.

మూలమును చూడుడు.

శ్లో. యేకురంగమద కుంకు మాంచితే
నీల లోహిత రుచౌ వధూకుచౌ
సప్రియోగ సితయోః స్వయంభువో
రాచచార నఖకింశు కార్చనం." (18—66)

మూలశ్లోక పదములనే "శబ్దంబనుసరించియు" అనుతన నియమప్రకారము శ్రీ నాథుఁడా పదములను— కురంగ మదము, కుంకుమము, నీలలోహితరుచులు, స్వయంభువులు— కింశుకార్చనము— నట్లే చేకొన్నాడు. ఇక మూలముకంటె నెక్కుఁడుగా—

'అర్థ నిశాసమయంబున' — 'భక్తి' —అను రెండు పదములను జేర్చియున్నాడు. ఈ రెండింటి యందే ఈ పద్యమందలి లోకోత్తరార్థమిడి యున్నది.

శ్రీ వీరమహేశ్వరాచార పారగుడును, శివభక్తి కళా ప్రపూర్ణుడును నగు శ్రీ నాథుఁడీ పద్యమున— తొలుత శైవులకు షట్కాల శివపూజ విధానములోని— అర్థ నిశా సమయ పూజ సూచించినాడు. ఈ షట్కాల శివపూజ శైవు లందరికి విహితమైనది — అరుణోదయ, తపనోదయ,

సంగవ, మధ్యాహ్న సాయంకాల— అర్ధనిశా సమయము లాలు. ఈ యాలు కాలములలోను అర్జునుడు శివపూజ చేసినట్లు హరవిలాసములో నేడవ యాశ్వాసమున కిరాతార్జు నీయ ఘట్టములో వాలు పద్యములు శ్రీనాథుడు రచించి యున్నాడు— అవి ఈ వరకు సుపరిచితములే— ఇది నన్నయ భారతమునలేదు. 9

అయిన నర్ధ నిశాసమయమునకు సంబంధించిన పూజా విధానము దెలుపు పద్యమును నిటయుదాహరించుచున్నాను.10

ఉ. అంచిత భక్తితో శివుని నర్ధనిశాసమయంబు నందుసే
వించు గురూపదేశ పదవీ పరిశుద్ధ సమర్చ నావిధిన్
కాంచన కోరకంబుల, శుక ప్రసవంబులఁ గొండఁ గోగులన్
కాంచన కందరాగుహాముఖంబులఁ బార్థుఁడు సంస్కృతార్థుడై

నైషధ పద్యమున 'భక్తి' అను పదమునకు వ్యాఖ్య ఇట్లున్నది: "భక్తిఃతత్పరత్వము. (రచనయనియు, – భక్తిర్విశేషణే గే రచనాయాన్—శబ్దార్ణవము. (పుట 627). కాని యిచట సామాన్య నిఘంటికార్థము పట్టదు. ఇచట 'పూజ' యున్నది గావున, నది యర్ధ నిశాసమయము గావున పైని చెప్పినట్లు సమయమున పూజ శివపూజ. అచ్చట 'భక్తి' శివభక్తి.

అర్ధ నిశాసమయమున శివపూజ తపస్సులో నొనరించి నట్లు హర విలాసములో వ్రాయుటకు ముందే— శ్రీనాథుడీ పద్యమున శైవ వాఙ్మయమున నత్యంత ప్రసిద్ధమగు నంబెన్న చరిత్రను (ద్రవిడమున మహా ప్రసిద్ధుడగు సుందర మూర్తి నయనారు) సూచించి యున్నాఁడు. ఈతని కథ పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రయందు మహిమా ప్రకరణమున వ్రాసియున్నాడు.11 ఆ కథ సంగ్రహముగా నిట దెలుపుచున్నాను:

సుందర నంబెన్న కథ :

ద్రావిడ దేశమున తిరువారూరిలో జడయారి అనుశివ ద్విజునికి నంబెన్నశివాంశచే జనించెను. ఆతనికి యౌవనోదయ మైనది. అచ్చటనుండు వాల్మీకేశుగుడికి ప్రతి నిత్యము నాట్యము నకు వచ్చు పరమనాచి యను వేశ్యను మోహించెను. కాని, యా వేశ్య తల్లి, దినమునకు వేయేసిమాడ లిమ్మనెను. నంబియు, తన వద్ద ద్రవ్యము లేనందున వాల్మీకేశుని తిరుపాటలచే స్తుతించి, పరమనాచిని తనకు రమణిగా నొనరింప ప్రార్థించెను. శివుడును భక్తుని కోర్కె నెఱవేర్చుటకై యొక బ్రాహ్మణుని రూపముదాల్చి, ప్రతి దినము వేయి మాడ లిత్తునని, కుంటెన నడిపి వేశ్య తల్లి నొద్ద బఱచి వారిద్దరికి సమావేశము గావించెను. శివుడు ప్రతిదినము బ్రాహ్మణ రూపము తోడనే వేయేసి మాడల నిచ్చుచుండెను. ఇట్లుండగా— నొక నాటి రాత్రి జరిగిన యుదంతము సోమనాథుని మాటలతో చెప్పుచున్నాను: 12

"ద్వి. నంబియు సతియు మన్మథ రతిసు
ఖాంబోధి నోలాడ నందొక్కనాఁడు
సురత కేళీ లీలఁ జొక్కుచు నంబి
పరమనాచి కుచంబుపైఁ జేయివైవ
నొనరగా నాలింగనోద్వృత్తి నున్న
చను మొనల్లో జను సమతలంబులుగఁ
దిఘ యుతాష్టమ కళాదప్తాంగ యగుటఁ
బ్రధుకుచకుంభముల్ బిగిసిసొంపారఁ
దమకించి పైన గునుద్గత ఘర్మ జలము
లమరి చన్నుల పొంత నార్ద్రవంబెనగ
నన్నుత స్రగ్వి భూషణ పతనమునఁ
జన్నుల మలయజచ్ఛవియు దోపంగ!
గూడుచో సమరతి గ్రుమ్మడి నెవముఁ
వీడి చన్నుల మీద విడి పూవులమర
వవిదీటు కొను మజ్జనము చేసి గంధ
మలంది పుష్పము లిచ్చినట్టి లింగమును
పరి బరిసముసేయు సౌఖ్యంబు దోప
వరుఁ డాత్మలింగ భావనఁ జంటి మీఁది

---

8. ఈ విశేషణమును శ్రీనాథుడు నలునికే యుపయోగించి యున్నాడు.

గీ. "వీరమాహేశ్వరాచారపారగునకు.... నైషధక్ష్మాధవునకు" (6—95)

9. చూడుడు— హర విలాసము— వీరశైవ సంప్రదాయములు అను నా వ్యాసము— భారతి (ఫిబ్రవరి 1954)

10. ఇట్లు కంఠోక్తిగా శ్రీనాథుడు వీర మహేశ్వరుడు కాగా ఆతడు హరిహరారాధన శీలి యనుట కాధార మూహ్యము.

11. శ్రీనాథుడు నైషధరచనమునకు ముందే పండితారాధ్య చరిత్రమున రచించి యుండుటచేత, నంబెన్న కథ నైషధమున సూచించుట కనువైనది.

12. పండితారాధ్య చరిత్ర— ఆంధ్ర గ్రంథమాల ముద్రణము 2 భాగము 137—138 పుటలు.

హస్తంబు దివియక 'హాలింగ' యనుచుఁ
బ్రస్తుతింపఁగ నంబి వడతి వీక్షించి

ఇట్లు ప్రశ్నించినది:
"లింగ నిరంతరలీలావధాన
సంగతోద్ధతియొ సంస్మరణాభిరతియొ ?
యుచిత క్రియాప్రణోద్యుక్త సంభ్రమమొ?
రచియింపఁ గామగర్వ ప్రకారంబొ ?
చన్ను లింగంబను శబ్దమెట్లయ్యె ?
చన్ను లింగమ యేని జనక, యొక్కడన
యడుగుమా నీకు నిత్యంబునుం బెట్టు
పదివేయి మాడలు భర్గుచే ననుడు.
నాయతి యట్టు'లయ్యా యని నిత్య
వేయేసి మాడలు విభునిచే గొనుచు
యతియును దాను నన్యోన్యానుషక్త
మతిసుఖించుచును.

అర్ధనిశాసమయ శివపూజకై చంటినే లింగముగా భావించి హాలింగ యన్నప్పుడు— పరమనాచి నమ్మక చన్ను లింగమైన నిత్యము వేయేసి మాడల నిచ్చు శివుడిప్పుడు పిలువగానే వచ్చి ఇచ్చునా ? యని ప్రశ్నించినది— శివుడును ప్రత్యక్షమై వారి కోర్కెలనుఁ దీర్చెను. 13

ఈ సుందరమూర్తి (నంబెన్న) కథ యాంధ్ర వాఙ్మయమున మిక్కిలి ప్రచారముగాంచినది—

1. క. కడుచోద్యము భక్తులకును
గడుఁ గూర్చుట నీదు భక్తి గౌరవమునకున్
గడుమెచ్చి యొడయ నంబికి
నెడవోయితిగాదె లంజ ఇంటికి రుద్రా !
శివతత్త్వసారము—407 ప.

2. "నంబివనుపకుంటె నలమ నడచినయెడ కానిచేత" త్రిపురాంత కోదాహరణము— తృతీయావిభక్తి.

3. ఒడిపనుల్ సేయఁగ నొడయ నంబికిని.
నడుగబోయితిగాదె యర్ధరాత్రమున—
సోమనాథస్తవము.

4. నిన్నే రూపముగా భజింతు మదిలో నీరూపు మోకాలొ
చన్నో ? కుంచమొ ? మేక పెంట్రికయొ
ఈ సందేహము ల్మాన్పినా
కన్నారం భవదీయ మూర్తి సగుణాకారంబుగాఁ జూపవే
చిన్నీరేజ విహార మత్తమధుపా ! శ్రీ కాళహస్తీ
శ్వరా 15 ప.

13. ఈ కథనే తెలుగున అజ్జరపు పేరయలింగకవి ప్రత్యేక ప్రబంధముగా "ఒడయనంబి విలాసము" అను పేర రచించి యున్నాడు— ఈ కథ జరిగినది, తెలుగు దేశముననే యని యందు గలదు. తూర్పు గోదావరీ మండలమున 'ఆచంట' అను గ్రామమున కాపేరు వచ్చుటకు పై కథయే కారణము. ఆచంట— ఏ చన్నునందు లింగము ప్రత్యక్షమైనదో— ఆ చంట— ఆచంట యైనది.

---

శా. ......................సంభూతకస్థానమై
ఖ్యాతంబై బుధహృద్య మంగళ కవీంద్రాచార్య సంసేవ్యమై
యాతారార్క సుధాంశువై కమల జాతా కల్పమై యెప్పుడున్
జ్యోతిశ్చక్రము బోలెఁ గ్రాలవలదా సాంధ్ర(పార కావ్యంబిలన్)

శ్రీనాథుడు—శివరాత్రి మాహాత్మ్యము

# నన్నయ వాగనుశాసనుఁడా ?



## శ్రీ ఎ. అరుణాచలశాస్త్రి

పై శీర్షికతో శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు "నన్నయ వాగనుశాసనుఁడు" కాఁడని తెల్పు వ్యాసమును 1963 సం. ఆగస్టు భారతిలో వ్రాసిరి. దాని కిది సమాధానము

"విపులశబ్ద శాసను"—(భార, ఆది 1 ఆ. 9 ప) ప్రాచీన కాలమున, నన్నయభట్టునకు "విపుల శబ్ద శాసన" అను బిరుద మున్నట్లు పై నిదర్శనము వలన స్పష్టము. "శబ్దము—వాక్కు" లనునవి యొకదాని కొకటి పర్యాయము లగుటచేఁ గాలాంతరమునఁ గొందఱు పండితులు "వాగనుశాసనుఁడు" అనియు నింకనుఁ గొందఱు "సకలభాషా వాగనుశాసనుఁడు" అనియు బేర్కొనుచు వచ్చిరి. ఈ యంశమునే యప్ప కవియు చెప్పియున్నాఁడని యూహింపవచ్చును. అప్పకవియే కాదు, పెక్కురు లాక్షణికులు కూడ నన్నయభట్టు నిట్లు పలువిధములుగా పేర్కొని రనుటకు సందేహము లేదు.

నన్నయ భారతము వ్రాయుటచే శబ్దశాసన బిరుదము వచ్చినదో, యాంధ్రశబ్ద చింతామణిని వ్రాయుటచేఁ గల్గినదో నిర్ణయించుకొనఁజాలక కొందఱు విమర్శకులు తర్జన భర్జనలు చేసి యేనిర్ణయమునకు రాలేక విరమించిరి. అయ్యనిర్ణీత విషయమునే పలువురు పలు విధములుగా పేర్కొనుచు వచ్చుటచే దానిని చూచి తరువాతి విమర్శకులు పలువురు నేటికి నే నిర్ణయమునకును రాలేకపోవుటయు, నిరాధార నూత్న నిర్ణయములు చేయుజాలకుండుటయు, నూరకుండను లేకయు పోయిరనుటకు శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు 1963 సం. ఆగస్టు నెల భారతిలో వ్రాసిన వ్యాసమే సాక్ష్యము.

(1) "వాగనుశాసన" బిరుదము భారతమున లేకుండుటచే నన్నయభట్టారకుఁడు "ఆంధ్రశబ్ద చింతామణి" ని వ్రాసెనని అప్పకవి చెప్పినమాట యసంగతమనియు 17 వ శతాబ్దమునకైన నిది (చింతామణి) వ్రాయబడలేదనియు వెంకట్రావుగారు వ్రాసిన వ్రాత వింతు గొల్పుచున్నది.

(2) "ఆంధ్రశబ్ద చింతామణి యప్పకవి మూలమున మనకు తెలిసినదా ? బాలసరస్వతి మూలమున తెలిసినదా ?" అని వెంకటరావుగారి సందేహము. నన్నయ ప్రోక్తమయిన చింతామణి సరియైన పాఠము బాలసరస్వతీయము నుండియే లభించుచున్నది. కావున బాలసరస్వతి మూలమునవే చింతామణి నన్నయ వ్రాసినట్లు నిర్ణయింపవచ్చును.

(3) "ఆలోకనుతుఁడు మున్నటి
కీలకసమమున మతంగ గిరికడ నొసగెన్
బాలసరస్వతులకు నతఁ
డోలి దెలుఁగు టీక దాని కొప్పుగ చేసెన్."
(అప్పకవి—1—50)

ఈ పద్యము బాలసరస్వతి అప్పకవి కంటె ముందువాడనియే చెప్పుచున్నది. బాలసరస్వతియు నన్నయ చింతామణి వ్రాసెనని చెప్పియున్నాడు. చూ. బాల. సర. పీఠిక, అప్పకవీయము. క్రీ. శ. 1656—బాలసరస్వతి క్రీ. శ. 1608 సం."

ఒకవిధముగా శ్రీ వెంకటరావుగారే అప్పకవీయము కన్న బాలసరస్వతీయము సుమా రేబది యేండ్ల ముందు వ్రాయబడెనని చెప్పియు నీరీతిగా వ్రాయుట వింతగా నున్నది—వారి దృష్టిలో బా. స. గ్రంథ రచనా కాలము గంటలతోను, నిమిషములతోను దొరకలేదను నభిప్రాయమై యుండును. అట్టి రీతి కాలనిర్ణయము ప్రాచీన కవులలో గ్రంథకర్తలలో నెవ్వరి విషయమునను దొరకుట దుర్లభము. అట్టిది సందేహగ్రస్తమని వేఱుగ వెంకటరావుగారు పేర్కొన నక్క లేదు.

(4) "బాలసరస్వతి గ్రంథమును పరిశీలించినచో బాలసరస్వతి యాంధ్రశబ్ద చింతామణి టీకగనే గాక తన్మూలమును గూడ బాలసరస్వతియే వ్రాసెనను నూహ తట్టుచున్న"దని వారనిరి.

ఈ విషయమున వెంకటరావుగారు ప్రబలమైన హేతువులను జూపక "బాలసరస్వతి వ్రాసిన గ్రంథముల పౌర్వాపర్య స్థితి సరిగా విశదపడనందున 'ఆంధ్రశబ్ద చిన్తామణి' రచనము 1656 సం. ముందు జరిగినదని మనము నిశ్చయింపగలము" అని వ్రాసిరి.

బాలసరస్వతి మహోదయులు వ్రాసిన గ్రంథములలో పీఠికా పద్యమునుబట్టి తద్గ్రంథ పౌర్వాపర్యము నిశ్చయింప

రాకుండుట వింతగాదు. మనకు దొఱకిన ప్రస్తావిక పద్యములలో చంద్రా పరిణయమని యొకదానియందును, చంద్రికా పరిణయమని యొకదానియందును నగపడుచున్నది. ఆ రెండును నొక్క గ్రంథమే గావలయును, కాని రెండు గ్రంథములుగా నగపడవు—కవి తన గ్రంథమునకు నొక్కటే నామమును నిర్దేశించును గాని రెండు మూడు నామములు నిర్దేశింపఁడు గదా ? లేఖక పాఠకాదులు తమ చిత్తానుసారముగాఁ బ్రక్షిప్తము చేసిన దానివలన నిట్టివి యేర్పడియుండు ననుట స్పష్టము. మఱియు ముందు వ్రాసిన గ్రంథములందు ముందు వ్రాయబోవు గ్రంథనామము లుండుట వింత—ఇట్టి దొకప్పుడు సంభవించును. తా నిట్టి గ్రంథమును రచించుటకు బద్ధకంకణుడై యున్నప్పుడు గాని లేక గ్రంథమును వ్రాసి సాఫు చేయనందున బయట పెట్టుటకు వీలు లేని సమయమునందు గాని యిట్టి విధానము వచ్చుట సహజము, కాబట్టి యిట్టివానిని ప్రమాణముగా గైకొని సుస్థిరముగా నేకొనిన విషయమును తారుమారు చేయ యత్నించుట సరికాదు.

అప్పకవి “ఆంధ్ర శబ్ద చింతామణి వ్యాఖ్యను, పద్యరూపమున వెలయించెను. దానికే యప్పకవీయ మనిపేరు. ఆతఁడు తన గ్రంథమును జింతామణి మూలమును గైకొని దానికి తరువాత వ్యాఖ్యానములుగాఁ బయలువెడలిన గ్రంథములన్నిటియందలి సారమును పరిగ్రహించి తాను పరిశ్రమచేసి సంపాదించిన విషయములతో మేళవించి యాంధ్ర వ్యాకరణ .విషయములను సమగ్రముగా ప్రతిపాదించి యున్నాడు. ఆ కారణముచే తనయొక్క గ్రంథము చూచిన యెడల తక్కిన గ్రంథములను చూడని లోపము గలుగదను—నాశయముతో “ఇది చదివిన పిమ్మట” అని 1—7 లో వ్రాసియున్నాడు. అది—“ఆంధ్ర శబ్ద చింతామణి” 1608 సం. లో వ్రాయుట కెట్లు హేతువగునో తెలియుటలేదు.

అప్పకవీయము 1—7 పద్యమును శ్రీ వెంకట్రావుగారు విచిత్రముగా వ్యాఖ్యానించిరి. దానివలన నిట్టి యర్థము నెట్లూహించిరో దురూహ్యము. అప్పకవి 1—7 పద్యములో అప్పకవీయము చూచినవారికి యితర గ్రంథములు చూడవలసిన యావశ్యకత ఉండదని చెప్పియున్నాఁడు. దానినే స్వమతానుకూలముగ వీరు చమత్కారముగా “అం దాంధ్రశబ్ద చిన్తామణి, లేదు కనుక” యను నర్థము చూపి యిట్టి యర్థము చెప్పినాడు గనుక ఆంధ్రశబ్ద చింతామణి 1608 వ సం. లో వెల్వడి యుండు ననుట వింతగొల్పక మానదు.

అప్పకవీయము గద్యమున “ఆంధ్రశబ్ద చింతామణి యను వ్యాకరణ శాస్త్రంబునందు” అని కలదు. కాబట్టి అప్పకవీయము ఆంధ్రశబ్ద చింతామణి యవతరణమును నొకే కాలమున సంభవించినవి అని వ్రాయుట కెట్లు సాహసించిరో తెలియదు.

అప్పకవి యను నతఁడు “నన్నపార్య విరచితమగు నాంధ్రశబ్ద చింతామణిని తెనుఁగున పద్యరూపమున నవతరింపు జేసి దానికి “ఆంధ్రశబ్ద చింతామణి వివృతి” యని పేరిడి, దీనిని “ఆంధ్రశబ్ద శాసన” మనియు వ్యవహరించినాఁడు. ఆ సంగతి నప్పకవి తన పద్యములలో పెక్కింటిలో ప్రథమాశ్వాసమునఁ జెప్పియుండగా వానిని ప్రమాణముగా గైకొనక తమ కనుకూలించునట్టి గద్యంలోని యొక మాటను తీసికొని శ్రీ వెంకటరావుగారి వంటి విమర్శకులీ రీతిని వ్రాయుట హాస్యాస్పదము గాకపోదు. “ఆంధ్రశబ్ద చింతామణి యను వ్యాకరణ శాస్త్రంబునందు” అని అప్పకవి గద్యలలో వ్రాసిన దానివలన అప్పకవీయము నాంధ్రశబ్ద చింతామణి యొకే కాలమున యవతరించినవను నర్థ మెట్లు లభించుచున్నదో తెలియకున్నది.

చిన్నయసూరి “ఆంధ్రశబ్ద చింతామణిని నన్నయ రచించెనని తలంచి”నట్లు వెంకట్రావుగారే యంగీకరించిరి. అట్లే సూరికి పూర్వులయిన “అహోబల పండితుఁడు—అప్పకవి—బాలసరస్వతి అథర్వణాచార్యులు” అనువా రందఱును దీని నంగీకరించియే యున్నారు. అథర్వణాచార్యులు 13 వ శతాబ్దమున చింతామణిలో వ్రాయబడని యాంధ్ర వ్యాకరణ విషయములను వివరించుట కుద్దేశింపబడిన “వికృత వివేక” మను గ్రంథమును వ్రాసియున్నాఁడు. 13 వ శతాబ్దము నాఁటికే చింతామణి ప్రసిద్ధిలోనికి రాకున్నయెడల దానికి వివరణ మెట్లు బయలు దేరగలదు ?

చింతామణిలో “అనియమాగ్రామ్యంహి యత్త్వపభ్రంశః” అని చెప్పియుండగా నదర్వణాచార్యులు తన వికృతి వివేకములో నా విషయమునే వివరించి యిట్లు వ్రాసెను:

“సమ్మూలవత్వా ద్రూఢత్వా ద్గృహీత త్వాచ్చ సాధుభిః
నా పభ్రంశత్వ మేతస్య నియమాభావతస్తు తత్”

ఇట్లే చింతామణికారికలలో వివరణాపేక్ష గల కారికలే పెక్కు లిందు వివరింపబడినవి. చింతామణి నప్పకవి వ్రాసినచో వికృతి వివేకము అహోబల పండితుఁడో మఱి యెవడో రచించి యుండవలయును గదా ? ఇట్లే పూర్వము శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారును తమ కవుల చరిత్రలో చింతామణి కారికలను బాలసరస్వతి వ్రాసెననియు అథర్వణ కారికల నహోబల పండితుఁడు వ్రాసియున్నాఁడనియు వ్రాసిరి. దానినే కొత్తరంగు పూసి వెంకటరావుగారు నూపుచున్నట్లు తోచుచున్నది.

# నన్నయ వాగనుశాసనుడా ?

చింతామణి రచనము నప్పకవి కంటఁగట్టినపుడు అథర్వణకారికావళి రచనమును మఱి యెవ్వరికేని నంటఁగట్టవలసి యున్నది. ఆపని శ్రీ వెంకటరావుగారింకను జేయలేదు.

సూరి తనకు పూర్వమందున్న వ్యాకరణ గ్రంథము లన్నిటిని పరిశీలించెను. నన్నయ భారత ప్రయోగములను సైతము సమకూర్చుకొనెను. ఈ రెండిటికి పొంతన కుదిరినవానిని మాత్రమే తన లక్షణ గ్రంథమునఁ జేర్చికొనెను. తక్కిన వానిని విసర్జించెను. సూరికిఁ బూర్వమందున్న భారత ప్రతు లన్నియు దాటియాకు గ్రంథములే యగుట వానియందు లేఖక ప్రమాదము లెక్కువ పడియుండుట, ప్రమాణముగా దొరికినవానిని సవరించి గ్రైకొనెను. లేనివానిని విడిచివైచెను. ప్రక్షిప్తమైన వానిని వదలివైచెను. నన్నయ ప్రయోగించెనను నిశ్చయము లేనివానిని గూడ విసర్జించెను. ఈ తీరుగా సూరి వ్యాకరణము వ్రాయుటచే సూరి యుపేక్షించిన భారత ప్రయోగములు కొన్ని మన కగపడుచుండుట సహజమే.. అట్టి వానిని పెక్కింటిని శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులువారు త్రిలింగ లక్షణ శేషమునఁ జూపిరి. కావున సూరి భారత ప్రయోగములను విడుచుట చింతామణి నన్నయ వ్రాయలేదనుటకు సాధనముగా వీరు గ్రైకొనుట న్యాయముగాదు.

ఆంధ్రశబ్ద చింతామణియందు వికృతిపద ముపయోగింపబడుటచే దానిని సూరి మఱల వాడుటచే నాంధ్రశబ్ద చింతామణి దృష్టిలో బెట్టుకొని వ్రాయబడినట్లు గోచరించు చున్నది. కావున వానికి ప్రాచీన భాషా లక్షణములతో నిమిత్తములేదు. అట్టిచో వికృతి పదావశ్యకత వారి కెట్లు గలుగును ?

"కేతనాది వైయాకరణులు "ఆదులు కాదుట" అనిరే కాని నన్నయవలె ననలేదు" అనునదియు హేత్వాభాసమే.

చింతామణియందు సూచితములైన విషయములను తరువాతివా రొక్కొక్కరు ఒక్కొక్కదానిని విస్తరించి వ్రాసిరి. అప్పకవి ఆంధ్రశబ్ద చింతామణి రచించిన ఛందో విషయములను ప్రధానముగా పెట్టుకొని అప్పకవీయమును వ్రాసినాడు. తాళ్లపాక పెద తిరుమలయ్యగారు ఆంధ్రశబ్ద చింతామణి యందు సూచితమైన రేఫ రకార ద్వైవిధ్య విషయమును విస్తరించి వర్ణించినారు. ఇట్లే పెక్కుమంది ఈ రేఫ రకార ద్వైవిధ్యమును వ్రాసినవారు గలరు. ఈరీతిగా నూహింపబడిన విషయమును శ్రీ వెంకటరావుగారు స్వవాదానుకూల్యమునకై తల్లక్రిందులుగా నూహించినారు.

దంత్య తాలవ్య విషయము, రేఫ రకార విషయము గ్రాంథిక భాషకు సంబంధించిన వగుటచేత ఆంగ్ల వ్యాకరణానుసారములైన తెనుగు వ్యాకరణములు చెప్పకుండుట యాశ్చర్యముగాదు. ఇట్టి చర్చ యాంగ్ల వ్యాకరణములలో లేదు. ఇంతయేల, యీ రెండు విషయములను (రేఫ రకార దంత్య తాలవ్య విషయములు రెండును.) 1608 వ సం. మందు వ్రాయబడినదనిరి. ఇదియు సరియైన కారణముగాదు.

వికృతిపదమును కేతనాది వైయాకరణులు లుపయోగింపకుండుట కారణముగా నెంచుటకు వీలులేదు. చింతామణి తత్సమ పదములను నిర్మించుటయే ప్రధానోద్దేశముగా నేర్పడిన గ్రంథము. కేతనాదులు వ్రాసిన గ్రంథము లిట్టి యభిప్రాయముతోఁ జెప్పినవి గావు. ఆ కారణముననే వికృతిపదములను వా రుపయోగింపకుండుట యచ్చతెనుగు పదములే ప్రచురముగా నుండునట్లు వ్రాయుట జరిగినది. సూరికి ముందున్న పెక్కుమంది వైయాకరణులు వాడక విడిచిన వికృతిపదములను సూరి మరల నుపయోగించుట జరిగినది. సూరి వ్రాసినది ప్రాచీన గ్రాంథిక భాషకు వ్యాకరణము. ఆ విషయమునే చెప్పుచున్న ఆంధ్రశబ్ద చింతామణి యాంధ్ర కావ్యముల వాడుక యందున్న వికృతిపదము నుపయోగించుకొనెను.

సూరి ముందున్న యితర వైయాకరణులు పెక్కు వ్యాకరణములను వ్రాసిన మాట నిజమే. వ్యాకరణములు వ్రాయుటలో వారి దృష్టి వేరు. వారి గ్రంథములలో నొక్క గ్రంథమున గల విషయములే తక్కిన గ్రంథము లన్నిటి యందును పలుకుబడి భేదముతో వ్రాయబడినవి. పదిరెండు అవి యాంగ్ల వ్యాకరణముల ధోరణిని నొక్కఁ దెలుపునందు మాత్రమే గలవు. అందును గ్రాంథిక భాషయందు మాత్రమే కలవు. ఈయొక్క విషయమే సూరికిఁ బూర్వమందుండిన పెక్కు వ్యాకరణములు గ్రాంథికభాషను శాసించుట కుద్దేశింపబడలేదనియు నాంగ్ల వ్యాకరణానుసరణముతో బయలుదేరినవనియు నిశ్చయించి చెప్పుచున్నది.

పారిభాషిక పదములు చింతామణియందును తద్వ్యాఖ్యానములందును బేర్కొనబడిన వానికి మాత్రమే సూరి మున్నగు వైయాకరణులు ప్రాచుర్యమును గలిగించిరి. ఈ పారిభాషిక పదములు మిక్కిలి క్లిష్టము లగుటచే ఆంగ్ల వ్యాకరణానుసరణము చేసిన గ్రంథములు వీని పొంతకుఁ బోలేదు. అట్టి గ్రంథములలో వీనిని బేర్కొనకుండుట ఆ గ్రంథముల స్వభావమును తెలియజేయుచున్నది. కాని, చింతామణి యర్వాచీనత నెంతమాత్రము తెలుపలేదు.

చతుర్థీ విభక్తి "కొఱకు" అను దాని చరిత్రను చూచిన చింతామణి యర్వాచీనమని తేలుచున్నదని వెంకటరావుగారి యభిప్రాయము. ఒక్క "కొఱకు" అనునది మాత్రమే గాక తక్కిన విభక్తి ప్రత్యయములలో చాల భాగము వఱకు విభక్తి ప్రత్యయమని చెప్పదగినవిగా నగపడవు. సంస్కృతభాషలో ప్రచురముగా నున్న విభక్తి వ్యవహారము తెనుఁగునందే యేరీతులతో చెప్పబడుచున్నదను విషయము స్పష్టపఱచు నిమిత్తమే తెనుగు విభక్తి ప్రత్యయములు కల్పింపబడిన వనియు, నిజమున కవి వేఱు శబ్దములయొక్క కలయికలే యయి యుండు ననియు నూహింపవలసి యున్నది. తెనుగున మొట్టమొదట బయలుదేఱినవి సంస్కృతభాష ననువదించు గ్రంథము లగుటచే, సంస్కృతభాషా ప్రసిద్ధములగు విషయములను తెనుగునం దెట్లు చెప్పుచున్నారో వాని నన్నిటి నేర్చి కూర్చి చింతామణి చెప్పినది. చింతామణిలోని "డు, ము, వు, లవః ప్రథమాస్యాత్" మున్నగు విభక్తి బోధక ప్రత్యయ కార్యములు మెలకువతో పరిశీలించిన వారికి విషయము స్పష్టమగును.



# ఒకే నిద్ర - ఎన్నో కలలు



శ్రీ బుచ్చిబాబు

సమయం:

స్వాతంత్ర్యం వొచ్చాక — ఎప్పుడైనా కావొచ్చు.
ఒక ఉదయం — సాయంత్రం — రాత్రి

స్థలం:

తెనుగునాట — ఎక్కడైనా కావొచ్చు
రామదాసుగారి ఇంట్లో, హాలు,

## పాత్రలు

| | | |
|---|---|---|
| రామదాసు | — | ఇద్దరు కంపెనీ యజమానులలో వొకడు |
| లక్ష్మణస్వామి | — | కంపెనీ రెండో యజమాని |
| శ్రీనివాసు | — | రామదాసు కొడుకు |
| రాధ | — | రామదాసు కూతురు |
| లక్ష్మీదేవి | — | రామదాసు భార్య |
| విశ్వం | — | పక్కింటి పెద్ద (రామదాసు స్నేహితుడు) |
| సుధీర్ కుమార్ | — | డాక్టరు చదువు పూర్తిచేసిన యువకుడు. |
| చిదంబరం | — | వీణ మేష్టరు |
| నారాయణ | — | నౌకరు |
| పరంధామయ్య | — | వంటాయన |
| రామయోగి | — | శ్రీనివాసు స్నేహితుడు. |

## ఇతరులు

| | |
|---|---|
| మహంతి | కంపెనీలో పనిచేసేవాళ్లు. |
| ఏసూబేగ్ | |
| కాంబ్లె | |
| కురియన్ | |
| మానిక్‌లాల్ | |

1. ఇది కేంద్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖవారి బహుమతి (1962) పొందిన నాటకము.

# ఒకే నిద్ర - ఎన్నో కలలు

## మొదటి రంగం

(తెర లేవగానే రంగస్థలంపై రెండు గదులు కనిపిస్తాయి. ఒకటి చిన్నది. అందులో ఒక భోషాణం, చుట్టూ పెద్ద గొలుసులతో కట్టింది—ఉంటుంది. గోడని రవివర్మ బొమ్మ, భోషాణం ముందుగా ఒక చిన్ని బల్ల, దానిమీద కొన్ని గ్లాసులు, బల్ల ప్రక్కన చిన్ని కర్ర పెట్టె, కింద తివాచీ—అవీ చిన్న గదిలో సామాన్లు—రెండోది పెద్దది, హాలులా కనిపిస్తుంది. సోఫాసెట్టు, ఒక పడక కుర్చీ, గోడని కేలండర్లు, కార్నర్ స్టాండ్‌పై పూలతొట్లు, కాస్త ఉన్నవారుగా సూచించే సరంజామా ఉంటుంది. గోడని గాంధిగారి బొమ్మ, రెండు గ్రూప్ ఫోటోలు, ఇల్లు, స్థలం పరిహద్దులు, కట్టడం చూపే ఒక ప్లాన్ ఉంటాయి. సోఫా సెట్టుముందు మరో తివాచీమీద బట్టతో కప్పిన వీణ ఉంటుంది.

నౌకర్ నారాయణ సామాన్లు దులిపి సర్దుతూ ఉంటాడు. వయస్సు దగ్గర దగ్గర అరవై. పాతకాలం పంచి కట్టు, ఖద్దరు హాఫ్‌షర్ట్, బట్టతల కప్పే ఒక టోపీ.

హాలు శుభ్రంచేసి, తలుపుతోసి చిన్న గదిలోని దులుపుతూంటాడు. భోషాణంకి బిగించిన పెద్ద ఇనప గొలుసులు వికృతంగా వేళ్లాడుతూండడం అతనికి నచ్చనట్లు, నుదురు కొట్టుగుని, బలం అంతా ఉపయోగించి పైకి గొలుసుని లేవనెత్తి గోడవైపు పెద్ద చప్పుడు చేస్తూ పడేస్తాడు. ఇంకా పైకి కనిపిస్తూనే ఉంటాయి గొలుసులు. అవి కనబడకుండా ఒక తెల్ల గుడ్డ తెచ్చి భోషాణంపైన కప్పి, చిన్నగది తలుపులు దగ్గరగా మూసి మళ్లా హాల్లోకొచ్చి సర్దుతుంటాడు.

గొలుసులు చప్పుడు విని ఏమిటోనని చూస్తూ, హాల్లోకి ప్రవేసిస్తుంది రాధ.

అడుగులు మెల్లగా వేస్తూ, ఎడంచెయ్యి కుడి మోకాలు మీద ఆనించి నడవ గలిగినట్లుగా, మళ్లా అది ఎవరూ గమనించకుండా ఉండాలన్నట్లుగా సాఫీగానే నడువగలిగే యత్నం చేస్తూ వస్తుంది. వయస్సు పదిహేడు. పల్చటి కోలమొహం, ఎర్రటి లేత పెదవులు, మెడచుట్టూ రెండు పాయలుగా జారిపడే ఉంగరాల జడ, పెద్ద లోలకులు. ఎర్ర చారల పరికిణీపై తెల్లటి ఓణీ, సన్నటి శరీరం, సన్నటి చిన్ని ముక్కు, పెద్ద కళ్లు—అమాయకత్వం సూచించే కళ్ల చిట్లింపు. ఛాయ ఎరుపే, కాని నీర్సంగా కాస్తలో తేలిపోయిన వర్ఛస్సు)

రాధ:—ఏమిటా చప్పుడు నారాయణ, గొలుసులేనా—వాటి జోలి నీ కెందుకు చెప్పు?

(నారాయణ, ఆమె చెయ్యి పుచ్చుగుని సోఫాలో కూర్చో పెట్టేటందుకు తోడ్పడతాడు) అక్కర్లేదు—నేనే కూర్చో గలను! నువ్వేం సాయ పడొద్దులే—నేనేం కుంటిదాన్నా?

నారాయణ:—అదిరిపాట్లో తొందరగా నడిస్తిరా, పడిపోతారనే దిగులువల్ల నమ్మా. అందులోనూ ఇవాళ మీ పుట్టిన రోజు కదా. కలకాలం మీరు బాగుండాల. ఇంక గొలుసులంటారా— ఆ భోషాణం, గొలుసులు, తతంగం మనింట్లో ఉండవల్సినవిగావు. మీరు రోజల్లా ఆ గదిలోనే కూర్చుంటారాయే. అవి ఎక్కడ తగిలి మీరు పడిపోతారో అవి ఒకటేంటది—భలే బరువు—ఒకపట్టాన ఎత్తితే లెగవందే. తాత ముత్తాతల బలం అంతా ఎరువు తెచ్చుకుని ఈయాల ఎత్తి గోడవైపు పడేసినా రాధమ్మగారు.

రాధ:—నాన్నతో చెప్పా, అది తీయించి వెయ్యమని. వినడు. అదుంటే శుభంట. అచ్చొచ్చిందిట—మనింట్లో నాలుగు మోడరన్ ఆల్మైరా లున్నా, అదీ ఉండాలిట -

నారా:—ఇంతకీ భోషాణంలో ఏముందండి?

రాధ:—ఏమో, ఎవడు తీసిచూశాడు—ఉంటే అన్నయ్య పట్నంనుంచి తెచ్చే సీసాల సరంజాం—ఏమన్నా అందులో దాస్తాడేమో.

నారా:—(నోరు నొక్కుకుని) పైకనమాకండి. అయ్యగారు కంపినీ కెళ్లారు గనక ఫరవాలేదనుకోండి. అప్పుడప్పుడు అదోమాదిరి వాసన వస్తూండేదనుకోండి—అనుమానం తగిలేది గానండి, అంత పరకాయించలా. మనయ్యగారు కూడా......

రాధ:—అప్పుడప్పుడు పార్టీ లిస్తూంటారుగా—సరదాగా ఉన్న వాళ్లకి సప్లై అవుతుందేమో—ఇవన్నీ నీ కెందుకుగాని, ఈ పూట సంగీతం మేష్టరొస్తాడేమో— వద్దని చెప్పి రాగలవా? కార్లో అమ్మ షాపింగ్ కెళ్లింది— వచ్చేటప్పుడు దోవలో మేష్టారుతో చెప్పమని చెప్పాననుకో—అనేక పన్లలో, ఇది తప్పకుండా మరిచిపోతుంది, అమ్మ.

నారాయణ:—వెడతానండి. మరి రాధమ్మగారు—మీ పుట్టిన రోజు—నే నొకటిస్తా, తీసుకుంటారూ?

రాధ:—ఏమిటది నారాయణ?

(దూరంగా వెళ్లి సంచీలోంచి ఒక చిన్ని బొమ్మ రాట్నం తెచ్చి ఇస్తాడు.)

(తీసుకుని) రాట్నమా? చాలా బాగుంది. ఎక్కడిది?

నారాయణ:—మా తమ్ముడు తెచ్చాడు.

రాధ:—చాలా థ్యాంక్స్ నారాయణ.

(నారాయణ వెడతాడు)

(రాధ వీణమీది గుడ్డతీసి, ఏదో కాలక్షేపంలా తీగలు మీటుతూండగా, కాంబ్లె ప్రవేశిస్తాడు. కాంబ్లె వయస్సు నలభై. మహారాష్ట్రుడు—కంపెనీలో పనివాడు. టోపీ, పంచి కట్టు, చొక్కా, వచ్చీ రానీ తెలుగు మాట్లాడతాడు)

కాంబ్లె:—నమస్తే.

రాధ:—యా, యా—నమస్తే. కసకయే.

కాంబ్లె:—(నవ్వుతాడు) బస, బస. కూర్చునండి. మంచి రోజు ఇవాళ—మీకు బహుమానం. (జాకెట్టు గుడ్డ చేతి కిస్తాడు)

రాధ:—థ్యాంక్స్.

కాంబ్లె:—తుమి మరాతి ఎట్లా చెప్తారు?

రాధ:—నాకు రాదు—ఏవో ఒకటి రెండు మాటలు—

(కాంబ్లె వెడతాడు. మళయాళీ యువకుడు కురియన్ వస్తాడు. అతను కంపెనీలో ఎకౌంటెంట్. వయస్సు ముప్పై లోపు. బుట్టతో ఫలాలు ముందు పెట్టి, నమస్కరించి నవ్వి వెడతాడు. తరవాత కంపెనీ మేనేజర్ 'మహంతి'—ఒరియా, వడి వయస్కుడు—'ఏసూబేగ్' అనే ముస్లిమ్ వ్యక్తి (కంపెనీలో పనివాడు) కలిసివచ్చి, క్రమంగా ఏపిల్ ఫలాలూ, పూల సజ్జ బహుమానాలుగా ఆమె కిస్తారు

రాధ:—థ్యాంక్స్—చాలా సంతోషం—మీరంతా ఎందుకు ఇంత శ్రమ తీసుకుని ఇవన్నీ తేవడం? మీ కెవరు చెప్పారు?

ఏసూబేగ్:—మాకు తెలవకుండా ఉంటుందా? లక్ష్మణస్వామి సాబ్ బంగ్లాలో మొన్నటినుండీ చెప్తున్నారు.

మహంతి:—అవును. నారమ్మాయి, మీనాక్షి చెప్పారు. నా కెవరూ చెప్పక్కర్లేదనుకోండి. నాకు మీ పుట్టిన రోజు బాగా గుర్తు.

రాధ:— మీరు నిరుడు కూడా చాలా హడావుడి చేశారు. ఇప్పు డిప్పుడే కాంబ్లె, కురియన్ వచ్చి ఇవేవో ఇచ్చి వెళ్లారు.

మహంతి:- వచ్చారూ? మాకంటే ముందే వచ్చారన్నమాట. అసాధ్యులే.

ఏసూబేగ్:- కాంబ్లె జీతం పెంచమన్నాడా? ఏదేదో పైఎత్తు లేనిదే వాడు ఊరికినే రాడు లెండి.

రాధ:— లేదు పాపం:— అవేవీ ప్రస్తావించలేదు. ఉండండి— మరి, కాస్త టీ తీసుకోరు? అమ్మ అల్లా షాపింగ్‌కి వెళ్లింది. ఇంకా కొట్లు తెరవకుండానే. ఇదిగో పరంధామయ్యగారూ......కాస్త టీ తెస్తారా (తను లేవ బోతుంది)

మహంతి:—మీరు లేవకండి. ఇప్పుడేమీవద్దు.

రాధ:—మీరేమీ తీసుకోకుండా వెళ్లిపోతే నా కెట్లాగో ఉంటుంది.

ఏసూబేగ్:—మీరు గాభరా పడకండి—మీ ఒళ్లు బాగుందా— బాడ్‌గా ఉన్నారు. రోజూ. నాలుగు ఎగ్స్ తీసుకోండి.

రాధ:—బాడ్ ఎగ్‌ని—నాకు ఎగ్సు గిట్టవుగా—ఎల్లానూ అమ్మ ఏదో పార్టీ అంటోంది. సాయంత్రం వస్తారుగా— తప్పకుండా రావాలి. మరీ మరీ థ్యాంక్స్.

(వా రిద్దరూ వెడతారు. వెళ్లగానే ఎడంవైపునుండి బెంగాలీ వ్యక్తి సుధీర్‌కుమార్ చిన్న గదిలోకి ప్రవేశిస్తాడు. మూసివున్న తలుపు సందులోంచి తొంగిచూసి, తలుపుమీద మెల్లగా కొడతాడు. అతని వయస్సు ఇరవై తొమ్మిది.నాజూకుగా ఉంటాడు. బెంగాలీ పద్ధతి పంచికట్టు, లాల్చీ, పైన ఖాదీ షాల్, కండ్లజోడు, మధ్య పాపిడి జుట్టూ, నవ్వుమొహం— చేతిలో చిన్న బాగ్ ఉంటుంది. తలుపు చప్పుడుకి రాధ లేచి మెల్లగా అటువైపు వెడుతుంది. సుధీర్‌కుమార్ గది తలుపుతోసి, హాల్లోకి ప్రవేశించి ఆమెని పరకాయించి చూసి, చెయ్యి పుచ్చుగుని, మెల్లగా నడిపిస్తూ, చిన్న గదిలోకి తీసుకు వెడతాడు.)

రాధ:—(చెయ్యి తోసివేస్తూ) సుధీర్—నువ్వెప్పుడొచ్చావు— ఇల్లా ఎల్లా వచ్చావు—నాకు తెలీనే తెలీదే......!

(సుధీర్‌కుమార్ గబగబ హాల్లోకొచ్చి ఒక కుర్చీ తీసుకెళ్ళి చిన్న గదిలోవేసి ఆమెని దానిమీద కూర్చోబెడతాడు.)

సుధీర్‌కుమార్:—కూర్చో — మాట్లాడొద్దు — కాసేపు చూడనీ......ఛార్మింగ్— నా ఎగు నేళ్లో ఇంత అందంగా ఎదగడం అఖిల భారత్‌లో అందరికీ సాధ్యంకాదు. ఉదయభానుడి కిరణం వెలుగులో కైలాస శిఖరం నుండి జారే మంచులా, రాత్రంతా మంచులో తడిసి ప్రొద్దుటే సిగ్గుతో ముడుచుకున్న మందారం మధ్యలో సొగసు, సంధ్య కాంతి వెన్నమీద పాసుకుపొయ్యే ఇంద్ర ధనుస్సులా మెరిసే నీ సౌందర్యం......

రాధ:—అబ్బ, ఊరుకుందురూ అట్లాగంటే నా కెట్లాగో ఉంటుంది. మీ బెంగాలీలకు ఉద్రేకం జాస్తి. అంతా అతిశయోక్తి.

సుధీర్:—అదుగో, ఆ 'మీ' అంటేనే కోపం వచ్చేది. అతిశయోక్తి కళకి వస్త్రం. అది తీసివేస్తే, నగ్నమైన ప్రకృతి కన్య అనుకో - మీ ఆంధ్రులు ఈ ఆవకాయ, కారం చేమట్లకి తట్టుకోలేక కాబోలు, అతిశయోక్తి వస్త్రం విప్పేసి, కేవలం గద్యలా చెట్టు మోడులా, నీళ్లల్లో పడేసిన నిప్పుకణంలా......

రాధ:—అదుగో మళ్లా మొదలెట్టారూ—మీ ఆంధ్రులనడం బాగుందేం?

సుధీర్:—చూశావా, వెంటనే కోపం తెప్పించేశాను. నీకు కోపంవస్తేనే నాకిష్టం—చిన్ని కోపం—ఇల్లా పెద్ద కోపం వస్తే భరించలేను. మానిక్ బందోపాధ్యాయ పుతుల్ నాచర్ ఇతి కథలో చెప్పినట్లు—పెద్ద కోపంలో మీ నాన్న కోపం ఛాయలు కనిపిస్తే తట్టుకోలేనమ్మా!

రాధ:—(లేవబోతూ) మీరు నుంచునీ—నేను కూర్చోవడం బాగాలేదు.

సుధీర్:—అమ్మయ్యా! సముద్ర కన్య పాటులో పడింది. నువ్వు లేవకూడదు—నువ్వు పేషంటువి—

రాధ:—ఇదుగో అట్లాగంటె నా కిష్టంలేదు. ఏం, నేను మామూలుగా లేను—? నడక చూశావుగా—రెండు మూడు పౌన్లు వైట్ కూడా పెరిగానుగా.

సుధీర్:—నేను డాక్టర్ని. ట్రైనింగ్ పూర్తయింది. నేను సర్టిఫై చేసేటకూ నువ్వు పేషంటువే. ఓ కోట్ల జనం 'మీ రిప్పుడు బాగున్నారు' అని పలకరించారంటే, ఇంకా పూర్తిగా బాగా లేనట్లేనమాట. అసలు ఆరోగ్యం విషయం ప్రస్తావించే అవసరమే ఉండ కూడదనుకో. అందుచేత నువ్వు లేవకూడదు...... నే నిక్కడ—పరిచారకుడనై—కూర్చోనులే — నుంచుంటాను. సరేనా.

రాధ:—మీదంతా తమాషా కబుర్లు. పట్నంనుండి ఎప్పు డొచ్చారు? నాకు కబురే లేదే.

సుధీర్:—నిన్న పొద్దున్నా—అప్పుడే నాలుగుసార్లు నన్ను 'మీరు'— 'అండీ' అని సంబోధించావు. రాధాదేవి గారూ, ఇది ఎంతకాలముండే—

రాధ: (నవ్వుతూనే) పెద్దవాళ్లం అవుతున్నామేమో— డాక్టర్ సుధీర్ కుమార్ ముఖర్జీగారూ—ని సంబోధించ బుద్ధి వేస్తుందేమో—

సుధీర్:—ప్రేమించు అట్లా సంబోధించడానికి నా ఆత్మం ఒప్పు కోదు—నీకు మాత్రం ఉండలేదు—సైగా 'ముఖర్జీ' అని ఎంతో కసిగా అన్నావు—నీ చక్క దనంలోని శక్తినంతా ఆ ఒక్కమాటలోనూ బిగించి (వేళ్లలో బిగించడం అభినయం జరుపుతాడు) అది తీసేస్తే నా పరాయితనం పోతుంది. అంతేనా, దయ రావా, రాదా? నీ కోసం తెలుగు నేర్చుకున్నా డాక్టర్ చదువు పూర్తి చేశా. మీ నాన్నకి బాధ కలుగకుండా నా సరిహద్దు దాటి ఎప్పుడూ లేనప్పుడు చక్కా వచ్చి, ఒక్క క్షణం నువ్వు క్షేమంగా నవ్వుతూ, కిలకిల్లాడుతూ మాట్లాడితే కిలకిల నవ్వి పోదామని వచ్చిన నాకు నా ప్రాంతీయ భావాన్ని, తోకలా పేరుతో తగిల్చి, పరాయివాణ్ణిగా, నీ అంతరంగ జగత్తు లోంచి వెలివేసి, బహిష్కరించి, తలుపులు గడియేసి తాళం వేసి హింసిస్తావా, రాధామణీ!

రాధ:—పేరు పెట్టి నిందగా పిలిస్తే ఎంత గాయం చేశావు. నాకు తెలుసు నీ మనస్సులో ఏముందో. ఎన్నెన్నో చెప్పి చూశాను. అమ్మకీ—నాన్నకీ—ఇల్లాకాదు, నీతో మాట్లాడ్డానికి వీల్లేదంటారు. నీలో ఏ మంచి గుణమూ ఉండకూడదట. ఇదంతా విద్వేషానికి ఫలితం. నాలా, మీరూ మంచి వాళ్లేగదా అని అమ్మతో ఏదేదో చెప్పాను.

సుధీర్:—అది విచిత్ర వృత్తాంతం—ఆనాడు ఇద్దరం అలసి కని ఆ కొండంచు మట్టి దాకా వెళ్లాం. ఆ రాతి బండమీద పడవలు కట్టి నీళ్లల్లో వదిలాం. నీకు, నీకు ఏడో ఏదు. నాకు పదహారో, పదిహేడో— ఆ పడవనాది, ఈ పడవ నీదీ అని తోసుకోడంలో నీ కాలు పడబడి నీళ్లలో జారిపడి, రాళ్లమధ్య నీ నడుం ఇరుక్కుంది.

రాధ:—అతను తోసెయ్యలేదు— నేనే జారి పడ్డానంటే నమ్మరు. అతనే తోసేశాడు—అప్పటినుంచీ ఈ కాలు జబ్బుతో ఇల్లాగై పొయ్యావు అంటారు.

సుధీర్:—ఆట్లాడుకోడంలో ఇద్దరం తోసుకున్న మాట నిజమేనని ఒప్పుకున్నాను ఆనాడు. నాకేం తెలుసు, ఇంతవరకు వస్తుందని?—అమాయకంగా, జరిగింది చెప్పివేశాను. అందుకనే పెద్దలు పూర్తి నిజం చెప్ప వద్దంటారు. నిజం వాడుకవున్న ఏ సంగతినైనా చెప్పగూడదు. అబద్ధం అందానికి, చమత్కారం కావా లంటాడు బెర్నార్డ్షా. ఇప్పుడు తెలిసి వస్తోంది.

రాధ:—(కళ్లు తుడుచుకుంటూ) నాకు తెలుసు సుధీర్, అందరూ ఆ బెంగాలీ అబ్బాయివల్ల నా కీ స్థితి ఏర్ప డిందని సిద్ధాంతం చేశారు, మావాళ్లు నమ్మేటట్లు.

సుధీర్:—ఊళ్లోవాళ్ల ఇంతటి కసికీ కారణం, నే బెంగాలీ వాణ్ణవడం, అన్న మాటేగా— ఇదేం కర్మ—నన్ను బెంగాలీవాణ్ణిగా పుట్టించమని దైవాన్ని ప్రార్థించి ఈ లోకంలోకి రాలేదు. ఆ ప్రాంతంలో పుట్టడానికి నే బాధ్యుణ్ణికాను. మాది చాలా గొప్పజాతి. మా వాళ్లకున్న దేశభక్తి మరెవరికీ ఉండదు. వారంతా కళామూర్తులు. అక్కడ జన్మించినందుకు నే విచా రించడంలేదు. గర్వపడుతున్నాను. మరో ప్రాంతం పిల్ల స్నేహం ఏర్పడిందనీ, కొత్త రంగంలో, కొత్త వ్యక్తుల సహచర్యం బలం, ప్రేమ, ఆదరణ పొంద గలిగాననీ గర్వించడం తప్పా? పేరుతో, ప్రాంతంతో, భాషతో ముడిపడి కొట్టుకుంటుందా మనిషి గుండె? మరోచోట ఊపిరాడదా?

రాధ:—సుధీర్—నీ మొహం ఎల్లాగో ఐపోతోంది. ఎందుకంత ఉద్రేక పడతావు. నా లోపల ఎంత బాధ, ఎంతటి ఆవేదనా ఉందో నువ్వెరుగవు.

సుధీర్:—తప్పకుండా ఎరుగుదును. నే నెక్కడున్నా, ఏం పని చేస్తూ ఉన్నా నీలో ఏమి జరుగుతుందో, గుండెలు, నాడి, కొట్టుకుంటున్నవో—ప్రతిదీ, నా శరీరంలో మనసుతో లయ కలిపి కదులుతాంటాయి. అంటే నువ్వు నమ్మక పోవచ్చు. ఇదుగో చూడు (సంచీ తీసి) ఈ డ్రాయింగ్ సామాన్లు తెచ్చాను కాలక్షేపానికి. కలర్‌బాక్స్ (బైట పెడుతూ), బ్రషెస్, ఇది స్కెచ్ బుక్. నీ బర్త్‌డేకి. ఒక్కసారి చూసి, నవ్వవు? (గడ్డం కింద చెయ్యివేసి కదుపుతాడు)

రాధ:—(మొహం తుడుచుకుని నవ్వుతూ) థ్యాంక్స్, వాటర్ కలర్స్ వెయ్యాలని ఎంతో సరదా. కాని నాకు రాదు. నా కేదీ రాదు—

సుధీర్:—ఇంకేదీ రానివాళ్లకి అబ్బేది వాటర్ కలర్ పెయింటింగ్. కేవలం స్త్రీలకోసం కల్పించబడ్డ లలిత కళ. మొద్దు మొగాడుకోసం ఆయిల్ పెయింటింగ్ కనుక్కున్నారు. ఇదిగో ఈ మెడిసన్ కొత్తగా వచ్చింది—కీళ్ల నెప్పులకి. మీ నాన్న అనుమతిస్తే పట్నం తీసికెళ్లి ట్రీట్‌మెంట్ చేయించాలనుంది.

రాధ:—అమ్మో—మా నాన్నే—చంపేస్తాడు. మనం ఇట్లా మాట్లాడుకున్నట్లు తెలిస్తే ఏ ట్రీట్‌మెంటూ అక్కర్లేకుండానే హరీమంటాను. ఈ టేబ్లెట్స్ వేసుకుంటాను.

సుధీర్:—రాధా, మనం ఇట్లా రహస్యంగా మాట్లాడుకునే ఏర్పాటు నాకు నచ్చలేదు. మీ నాన్నగార్ని అడిగి వేద్దామనుంది—చూద్దాం ఏం జరుగుతుందో.

రాధ:—ఇప్పుడొద్దు. చాలా ప్రమాదం. ఈమధ్య నాన్నగారు కంపెనీ వ్యవహారాల ఒడుదుడుకుల్లో చికాకుగా ఉంటున్నారు.

సుధీర్:—పార్ట్‌నర్ అరవవాడుటడాయె. చికాకు పడడు—? ఒక రహస్యం చెప్పనా? మీ తెలుగు వాళ్లకి ఇతరులతో పొత్తు కుదరదు. మరొకరి వంచ గిట్టదు. ఉన్న చోటే ఉండిపోతారు. స్తబ్దులు—ఉండు, కళ్లు పెద్దవి చేసి, కోపంతో పెదవులు కదుపుకు—ఒక్క రాధ తప్ప. (రాధ విరగబడి నవ్వుతుంది. అతను ఎడమవైపు ద్వారం లోంచి వెడతాడు. వీడ్కోలిస్తూ రాధ నిలబడుతుంది)

రాధ:—మళ్లా ఎప్పుడు?

సుధీర్:—ముఖ్యమైన ప్రశ్న, మధురమైన కంఠంతో అడిగావు. దైవానికి తెలియాలి. (వెడతాడు. రాధ చిన్న గదిలోకి రాగానే, అటూ, ఇటూ పరకాయిస్తూ ఉంటుంది. రాధ తల్లి లక్ష్మమ్మదేవి. వెనకాలే నౌకరు నారాయణ సామాన్లు లోనికి జేరవేస్తూంటాడు. లక్ష్మమ్మదేవి సంసార పక్షం కట్టు, బొట్టు, నగలు— ఖరీదైన చీర. చెవులకి డైమండ్స్ దుద్దులు—మెళ్లో చంద్రహారం. కొంచెం పొట్టి, నడి వయస్సుకి సహజమైన స్థూలకాయం)

లక్ష్మమ్మ:—ఏమిటే—ఎవరివో మాటలు వినబడ్డాయి?

రాధ:—ఎక్కడా—ఏమీ లేదే—నీ భ్రమంతా......

లక్ష్మమ్మ:—ఒక్కదానవు. అసలు ఆ గదిలోకి ఎందుకు నడిచి వెళ్లావు? అల్లా లేవకూడదని డాక్టరు చెప్పింది విని పించుకోపోతే ఎల్లాగే—ఏమీ లేకుండా ఊరికే వెళ్లావా ఆ గదిలోకి—

రాధ:—నేను నడవలేనని కుంటిదాన్నని, ఊరందరూ చేసే ప్రచారం, నా బర్త్‌డే నాడైనా నింద కూడదా ఏమిటి—నాకే బహుమానాలూ వద్దు—అదొక్కటి చెయ్యండి చాలు.

(దిగులుగా మొహంపెడుతుంది. కళ్లల్లో నీళ్లు తిరుగుతాయి.)

లక్ష్మమ్మ:—అంతలో ఎంత కోపం వచ్చేసిందే— కోపం రావడంలో మట్టుకు మీ నాన్న పోలికే. నీ మంచి కోసమే కదటే చెబుతున్నది. మళ్లా ఏదైనా దగిలి పడ్డావంటే, ఎంచాన.........

రాధ:—అదే వద్దంటున్నది. నేను శుభ్రంగా ఉన్నాను. లేనిపోనివన్నీ చెప్పి, చదువు చెప్పించక, జబ్బు దాన్ని—నన్ను నిజంగా మంచాన పడేస్తున్నారు. నాకు పిచ్చెత్తిపోతూంది. ఒక్కసారి ఊళ్లో వాళ్లందరినీ పోగు చేసి, వాళ్లందరిముందూ గంతులేసి ఎగిరి నాట్యం చేసి చూపెట్టాలనుంది. ఇల్లా (అని ఎగరబోయి సోఫాలో కూలిపోతూండగా, తల్లి పట్టుకుని వళ్లో తల ఆనించి, ఆపేక్షతో నిమురుతూ ఉంటుంది. రాధ వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

లక్ష్మమ్మ:—ఊరుకో అమ్మా—మా తల్లివికా—ఇంకెప్పుడూ అననులే.

రాధ:—(ఏడుపు ఆపుగుని లేచి కూర్చుని) ఒక ఆట లేదు, పాట లేదు. స్నేహితులు లేరు. సర్దాలులేవు.....

లక్ష్మమ్మ:—అదేమిటే! కాన్వెంట్ మిస్సమ్మ నెట్టి ఇంట్లో ప్రైవేట్ చెప్పిస్తూంటిమి—సంగీతం మేష్టరున్నాడా మరి. రోజూ కంపెనీ పనివాళ్ల కుర్ర సజ్జంతా మనింట్లోనే ఆటల కుండిరి. ఇంక షికార్లంటావా— ఆ షికారే ఇంత పని చేసింది—ఆ బెంగాలీవాళ్లతో అట్లుకనెళ్లి లందులోపడి ఇంతవరకూ తెచ్చుకుంటివి—

రాధ:—అరసిపన్లంకాదు. నేనే జారి పడ్డాను.

లక్ష్మమ్మ:—నువ్వే కాదుటే—పైకి తీసిన వాళ్లంతా తోసేశాడనే చెప్పారు. ఆ సుధీర్ అకతాయి రకమేట— అదంతా కప్పి పుచ్చేందుకు ట్రీట్‌మెంటిస్తామంటూ

వాళ్ళన్నయ్య—డాక్టర్ అనిల్‌ముఖర్జీ మనింటిచుట్టూ ఏడాది తిరిగాడు. దైవ సంకల్పం అంతే ననుకుని సమాధానపడి, మళ్ళా వాళ్ళ ప్రమేయం లేకుండా, ఎన్నెన్నో ట్రీట్‌మెంట్లు చేయించారు మీ నాన్న—దానివల్లనే ఈ మాత్రంగా ఉన్నావు.

రాధ:—మళ్ళా ఇప్పుడు ఏవో మందు లట్టుకొచ్చాడు.

లక్ష్మి:—ఏమిటి ఆ బెంగాలీ డాక్టర్ అనిలా?

రాధ:—అదేమిటే బెంగాలీవాళ్ళు మనుషులు కానట్లు అంత ఎబ్బెట్టుగా అంటావు. కాదు. అతని తమ్ముడు సుధీర్.

లక్ష్మి:—ఏమిటి—నిన్నింతవాటకూ తెచ్చిన ఆ బెంగాలీ కుర్రాడు మెడిసిన్ చదివే అబ్బాయి, ఇక్కడి కొచ్చాడా?

రాధ:—అదే ఆశ్చర్యమన్నది. నా జబ్బు అంతేమిటో తెల్సుకోవా లనే మెడిసన్ చదివాడుట—మరో నాలుగు నెలల్లో హాస్పిటల్ ట్రైనింగ్ పూర్తయి ప్రాక్టీస్ పెడతా కేర్‌బాక్స్, మందులు తెచ్చిచ్చాడు—నువ్వొచ్చేముందు మాట్లాడింది అతనితోనే.

లక్ష్మి:—వాళ్ళూ వీళ్ళూ అంటూంటే గిట్టక అంటున్నా ననుకునేదాన్ని. వాళ్ళతో పెట్టుకోకే నా తల్లీ. మీ నాన్నకి తెలిస్తే, ఇంకేమన్నా ఉందా! ఉన్న అల్లరి చాలక ఆ లక్ష్మణస్వామి ఏం చేశాడో విన్నావా? ఇన్నాళ్ళూ ఆ కంపెనీ కేసులు బెంగాలీ డాక్టర్ కెళ్ళకుండా అడ్డడుతూ వచ్చారు నాన్న. ఆమధ్య ఈయన క్యాంప్ కెళ్ళగా చూసి, ఓ ఏడాదిపాటు కంపెనీ పేషంట్లను కనిపెట్టమని ఒప్పందం చేసుకున్నాడుట. నాన్నకి తెలిసి మండిపడ్డారు—అసలు నాలుగు విషయాలు అడుగుదామనే వెళ్ళింది ఈ ఉదయం. ఇంతవరకూ రానేలేదు, ఏం రాద్ధాంతా లవుతున్నాయో—

రాధ:—లక్ష్మణస్వామి చాలా నిదానస్తుడు. అనుభవజ్ఞుడు—తెలివైన వాళ్ళకే కంపెనీ పని వప్పగిస్తాడు.

లక్ష్మి:—నీకు మహా తెలుసులే—నారాయణ, ఆ గదిలో పెట్టెలు, రంగులు, ఉన్నాయట. అమ్మాయిగారివి—అవన్నీ భోషాణంలో పెట్టి ఆ గది తలుపుకి తాళం పెట్టు.

నారా:—భోషాణంలో పెట్టడం నావల్లకాదండి. దానికో తాళం వేశారు, అబ్బాయిగారు. మరి గది తలుపుతాళం ఆయన కడే పెట్టుకున్నారండి — అదుగో—ఆ రామయోగి గారొచ్చిన కాడనుండి.

లక్ష్మి:—ఇంతకీ వాళ్ళింత పొద్దున్నే ఎక్కడి కెళ్ళారూ?

రాధ:—ఇవాళైనా పరీక్షా ఫలితాలు పేపర్లో వస్తాయేమో నని పోస్టాఫీసుకి వెళ్ళుంటారు.

నారా:—పొగేల్లా అయ్యలు షికార్లు, రాత్రంతా ఆ భోషాణం గదిలో చేరి, ఓ పేకాట్లూ......

లక్ష్మి:—నోర్మూయ్.

(నారాయణ చిన్న గదిలో కెళతాడు)

రాధ:—ఆ రామయోగి చాలా చమత్కారంగా మాట్లాడుతాడు కాని, అమ్మా అదంతా నిజంగా సీరియస్‌గా అనే మాట్లేనంటావా?

లక్ష్మి:—నాకు మాత్రం ఏం తెలుసు. ఏదో ఫీసిన్‌కోస మని కంపెనీల చోట్లా సేకరించాలని వచ్చాడు అన్నయ్యలో. తెలివైనవాడే—మీ అన్నయ్యకి దగ్గ స్నేహితుడే—చూడు నచ్చినట్లున్నాడు.

(రాధ లేవబోతుంది)

నే చూస్తాలే—అదుగో మీ నాన్నే.

(రామదాసు ప్రవేశిస్తాడు. వయస్సు యాభై రెండు. ఎత్తరి. తెల్లపంచి, సిల్కు చొక్కా, ఖరీదైన కండువా, చేతిలో కర్ర. ఒక్క దక్కడ తెల్లబడి, ఎగదువ్విన క్రాఫ్. సన్న పెదవులు, చిన్న మీసకట్టు, దట్టమైన కనుబొమ్మలు, పట్టుదల సూచించే కొస తేరిన ముక్కు, వెడల్పైన నుదురు. కర్ర దూరంగా పడేస్తాడు)

ఏమండీ ఎప్పుడూ లేంది ఇవాళ ఇంత చప్పునే వచ్చే శారేం కథ? కంపెనీ నుంచేనా?

రామదాసు:—కాదు. అసలు కంపెనీకి వెళ్ళనేలేదు. దోవలో ప్లీడర్‌గా రడ్డం కొట్టి వాళ్ళింటికి లాక్కుపోయ్యాడు. ఏముందీ—ఇన్‌కమ్‌టాక్స్ గొడవ. ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు సింధివాడు. కొత్తగా వచ్చాడుట—కరుకు ఘటంట. ఎంతైతే అంతా చెల్లించమని ఒక్క నమస్కారం పెట్టేద్దా మన్నాను. మన లక్ష్మణస్వామి లేడు—ఎల్లాగైనా అరవ్వాడు అరవ్వాడే—దాన్నంతా రైట్ చేసే మార్గం చూద్దామని ప్లీడర్‌తో మద్దతై గూడుపుఠాణీకి దిగాడుట. సరే కానీమన్నాను.

లక్ష్మి:—వాళ్ళ కిళ్ళాంటి వాటిల్లో మెళకువ జాస్తి. పోనీండి తగ్గితే మనకీ మంచిదేగా.

రామ:—ఇప్పుడు తగ్గినా, ముందు ముందెప్పుడో పీ కట్టుకోక మానదు. వాళ్ళకి తఫీళ్ళిచ్చే గడువు రేపటితో అయిపోతుందిట. ఈపూటే చిట్టాలు తిరిగేద్దాం రమ్మన్నారు. డ్రాయర్—మూడోది— అందులో ఉంటుంది. ఆ గ్రీన్ బాగ్ పట్టుకురా—ఇప్పుడే వెళ్ళొస్తాను. ఏం రాధా—నీ బర్త్‌డేకి ఏం కావాలి? అమ్మ షాపింగ్ ఎంతవరకూ వచ్చింది?—

లక్ష్మి:—బట్టలు తెచ్చాను, చూద్దురుగాని రండి.

రామ:—ఆఁ బట్టలంటే జ్ఞాపకం వచ్చింది—వాళ్ళ మీనాక్షి నీకో పట్టు చీర పంపింది, రాధా—కార్లో ఉంది.

రాధ:—మీనాక్షి —లక్ష్మణస్వామిగారి మీనాక్షి? తనే రావచ్చుగా—మీ కివ్వడం దేనికి?

రామదాసు:—ఆమె ఒంట్లో బాగు లేదుట. వాళ్ల నరసయ్య చేతి కిచ్చి పంపితే, వాడు నాకు అప్పగించాడు.

లక్ష్మి:—ఎంతమంచిది మీనాక్షి. రాధంటే ప్రాణం. ఒంటి కేమొచ్చిందో పాపం. ఉండలేక పోయ్యారూ—సాయంత్రం వెళ్లి చూసొస్తా.

రాధ:—ప్రతిసారి ఏదో వంకెట్టుకుని, వాళ్లు మన కెన్నో ముట్టచెప్తారు......మనం ఏమీ ఇవ్వడంలేదు—

లక్ష్మి:—పార్టీలకీ, వాటికీ నాన్న బోలెడు ఖర్చు పెడు తున్నారు—కట్నో, కార్యమో రావాలిగా—

రాధ:—అన్నయ్య పెళ్ళి చప్పున జరిగితే బాగుండును.

రామదాసు:—వాడు 'ఊ' అంటే చేసెయ్యడానికి ఇప్పుడు సిద్ధం—వాడిష్టం మెచ్చిన పిల్లని—శుభ్రమైన సంబంధం. ఆ విశ్వనాథంగారి చెల్లెలు. బి. ఎస్. సి. పాసైంది, పాతికవేలు కట్నం.

లక్ష్మి:—వా డసలు పెళ్ళే వద్దంటున్నాడు. ప్రేమించ గలగాలిట—ప్రేమించిన పిల్ల కావాలిట—చుట్టరికాలు పనికి రావట—మొన్న ఆ రామయోగీ వాడూ కలిసి గంట సేపు బృందగానం చేశారు......

రామదాసు:—ఆ- రామయోగేడీ—కంపెనీలో చాలా హడావుడి చేస్తున్నాట్ట. పనివాళ్లతో ఇంటర్వ్యూలట—వాళ్ల సౌకర్యాలని గురించి ఉపన్యాసాలట. రేపటి వార్షికోత్స వానికి అతన్ని ఉపన్యాసం ఇమ్మంటున్నారుట. వాగుడు రాయుడు—ఏమంత ఉన్నవాడుగా అగపడ్డం లేదు....

లక్ష్మి:—ఏం? రాధ మాటాలోచిస్తున్నారా—?

రాధ:—నా కింక పెళ్ళేమిటి? నన్నేడిపించడం కోసం కాకపోతే. ఈ ప్రస్తావన ఎందుకు తేవడం—?

లక్ష్మి:—ఇదేమిటే—ఏమన్నానే— ఈడొచ్చిన పిల్లవు—నీ విషయం పట్టించుకోడం తప్పంటే—ఎక్కడేనా ఉందా చోద్యం! బాగా ఉందమ్మా—నోట్లో గుడ్డలు పెట్టుకుని కూర్చుంటాలే. ఇదండీ వరస, చూస్తున్నారుగా ఏమండీ? చూడు, నారాయణ.

(శ్రీనివాసు, రామయోగి ప్రవేశిస్తారు. శ్రీనివాస్ వయస్సు ఇరవై మూడు. చామనచాయ, అందమైన పళ్ల వరస, దట్టమైన ఉంగరాల జుట్టు, లుంగీ, షర్టు పైన టర్కిష్ టవెల్— రామయోగి వయస్సు ఇరవై ఏడు, మధ్య పాపిడి క్రాఫ్. సన్నగా, పొడుగ్గా ఉంటాడు. కాస్తంత పచ్చటి ఛాయ. నవ్వుకి సిద్ధంగా ఉండే నోరు, తీక్ష్ణమైన చూపు. ఖద్దరు పైజామా, లాల్చీ, రబ్బర్ సాండల్స్, రిమ్ లెస్ గ్లాసెస్ ధరిస్తాడు.

రామయోగి:—'ఎవరు ఎవరని ప్రశ్నించనేల' పిన్నిగారూ, 'ఎవ రెవరైనదీ, ఎవరికి వారికే తెలీని ఎవరో, ఎవర్నో ఎవరని అడగనేల, బాబుగారూ—ఖలీల్ జిబ్రాన్ ఖండ కావ్యంనుండి. మరిచి పోకుండా, ముందే మత్తయ్య శుభ వార్త అంద జేస్తాను—మీ వాడు ప్యాసయ్యాడు, అందుకే దిగులుగా ఉన్నాడు.

లక్ష్మి:—అమ్మయ్య—ప్యాసయ్యాడూ—పోనీలెండి. మంచి వార్త తెచ్చారు. దిగులుగా ఉండడం ఏమిటి శ్రీనివాసూ—

రామదాసు:—మూడో ఛాన్స్‌లో పాసైనందుకేమో దిగులు—ఏంరా శ్రీనూ—?

రాధ:—నాకు తెలుసు. ప్యాసైతే ఉద్యోగాలకోసం పై ఊళ్లకి ఎగడే అవకాశం రాదు.

రామదాసు:—ఆ అవసరం ఎప్పుడూ ఉండదు. ఇక్కడేఉండి మన బిజినెస్ చూసుకుంటాడు.

రాధ:—అన్నయ్య కిక్కడుండడం ఇష్టంలేదు. అందుకనే ఫేలయ్యే మార్గా లాలోచిస్తూంటాడు.

రామయోగి:—అద్భుతంగా గ్రహించావ్ రాధగారూ—గారూ అనకూడదేమో—గారూలో పెద్దతనం ఉంది—రాధా—ఫ్రాయిడ్ శిష్యురాలివా? ప్రశ్నార్థకంగా కనుబొమ్మలు ముడి పెట్టకండి రామదాసుగారూ. గతంతో సమకూరని కొన్ని కనీసపు అవసరాలు అంతర్యంతో బంధించబడి, బైట పడక—నాన్నంటే భయం—వాటి ఉనికిని తెలుపుతూ వింత పనులు చేయిస్తూ ఉంటాయి. మీ అన్నయ్య విషయం తీసుకో. జరక్కూడంది ఏదో జరిగింది. దాని ప్రాబల్యం అణచి వెయ్యడానికే ఫేలవడం. జనం దృష్టి అతని అంతర్యం న్నుండి, ప్యాసు, ఫైలు అవడం మీదికి మరలుతుంది. రెడ్ హెర్రింగ్ ఫేలవక ప్యాసై ఊరుకున్నాడు. అతన్నీ నన్నూ కూడా ప్యాస్ చేసిందంటే ఈనాటి విద్యా విధానం ఏ స్థితిలో ఉందో తెల్పకయే తెల్పుచున్నదీ యామై రైట్ ?

రామదాసు:—ఫేలవాలని ఎవరు కోరుకుంటాడయ్యా! ఇదంతా నీ థీసిస్‌లో కెక్కుతుందా ఏమిటి?

రామయోగి:—నా ఫిలాసఫీ ఆఫ్ లైఫ్ అదేనండీ. గతానికీ భవిష్యత్తుకీ, స్థలానికీ మరో స్థలానికీ ఒక లంకె ఉంది. అది నాలుగో పరిమాణం—ది ఫోర్త్ డైమెన్షన్, ఆర్ ది చైన్ రీయాక్షన్—క్లుప్తంగా రామయోగీ యిజమ్. శ్రీనివాస్ ఫేలై వుంటే ప్రపంచ చరిత్రే మరోలా ఉండును.

రాధ:—అదేమిటో, ఎల్లాగో చెప్పండి.

రామయోగి:—ఫేలైతే సమాజంపట్ల ఒక కసి ఏర్పడుతుంది. ఆ కసి కొత్త కార్యానికి పురి గొల్పుతుంది. ఏంగ్రీ ఎంగ్‌మాన్ అవుతాడు. బూజు పట్టిన సంప్రదాయంలో ఇరుక్కుని, కుళ్లిన ఈ సమాజంలో ఇమడలేక, దాడి చేసి విప్లవ వాదిగా, స్వతంత్ర కాంక్షని నిర్మూలించే

శక్తులపై తిరుగుబాటుచేసి, లింకన్, గాంధి, గారి బాల్డి, ఎడ్మండ్‌బర్క్‌లు కన్న కలల్ని యదార్థంచేసి, —ఈలోగా ఏ ప్రియురాలో ఆకల న్న కన్నీటితో కరి గించకపోతేన్మోండి—ఒక మహా వ్యక్తిగా చరిత్రలో కెక్కి ఉండేవాని మీ ఊహ! ఆ పూట భార్య సణు గుడుతో బాధించక విడిచిన క్షణంలో సంతోషం పట్టలేక మరో పది మార్కులు పడేసి ప్యాస్‌చేసి, ఆ అంతర్జాతీయ అవాంతరం తప్పించాడు పరిక్షాకారుడు, కొండొకచో ఎగ్జామినర్!

శ్రీనివాసు:—పాపం టైరయ్యావు—కాస్త కాఫీ పుచ్చుకో.
(వంటాయన పరందామయ్య కాఫీలు తెస్తాడు)

లక్ష్మీదేవి:—మావాడికేం లోటు? వాడిక్కావల్సిన సమస్తం ఉన్నాయి, దైవానుగ్రహంవల్ల.

రామయోగి:—ఏలోటూ లేకపోవడం కూడా ఒక లోటే పిన్నిగారూ, టాల్‌స్టాయ్ యన్నట్టు.

రాధ:—ఏమండీ మీ రస్తమానూ పాశ్చాత్యులనే కోట్‌చేస్తారేం? మన వాళ్ళ మా టెత్తరేం?

రామయోగి:—మన వాళ్ళ వాటితో నా ప్రేక్షక జనానికి పరిచయం ఉందను కుంటే ముఖ స్తుతి అనిపించు కుంటుందేమో తెలవదు— తీరా వారిని గురించి యాక రవు పెడితే తెనుగువాడు తట్టుకోలేడు. ఒక చిన్న లిస్ట్ ఇస్తాను. నిలబడండి. మరాఠీ రైటర్స్—జి. బి. దేవల్, హరి నారాయణ ఆప్టె, అనంతకానేట్కర్, మామావరేర్కర్. ఒరియావారు—ఫకీర్ మోహన్, కాళీచరన్ పట్నాయక్—నీకు రచయిత్రులు కావాలంటే కుంతల కుమారీ సబల్. పంజాబీయులు వీర్‌సింగ్—చిన్ని కొటేషన్ "నామనస్సు బిచ్చగాని పాత్ర—చెంబు". బల్వంత్ గార్గి. తమిళ నవలాకారుడు కల్కి. ఉర్దూలో ఇక్‌బాల్, అక్తార్ షెరాని, ఫైజ్, ఫణీష్‌గజల్స్. ఇంకా (వేళ్ళు మడుస్తూ) అస్సామీయులు—అంబికాగిరి రాయ్ చౌదరి 'నువ్వు' అనే కావ్యం— కవయిత్రి కావాలా? నలిన బాలదేవి. అలాగే హిందీలో నిరాలా, అష్క్, జయశంకర్ ప్రసాద్. కాశ్మీర్ కవి, నదీమ్—అతనిదో అందమైన వాక్యం ఉంది—"ఆమె నుదుటి నుండి గీతలు తీసెయ్యాలి"—ఇంకా రోషన్. పోగా మళయాళ మహా మాంత్రికులు, కుమారన్ ఆశన్, వల్లత్తోల్, శంకర కురుపు—క్షమించాలి. హేళనకాదు—కురూప్, పానిక్కర్.

శ్రీనివాస్:—చాలు నాయనా—ఇంక భరించలేం.

రామయోగి:—ముందే చెప్పానుగా—మీ కెంతసేపు, మీ ఆంధ్రు లకి, నన్నయ, తిక్కన, గురజాడ, వీరే లింగం, పాను ంటి—కాలేజి విద్యార్థుల సింహ స్వప్నం పరవస్తు చిన్నయసూరి—

రామదాసు:—మీరు మీరంటె, మీరు ఆంధ్రులు కారా ఏమిటి?

రామయోగి:—జన్మస్థానం ఆంధ్ర—గమ్యస్థానం అంతర్జాతీయ ప్రజాస్వామ్యం—అంటూ ఉంటే వడ్డించిన విస్తరి మీ జీవితం, కుట్టుడు విస్తరి—మీ ప్రతి వానికి, కపి నోట్లో ముద్దలు దూర్చాలె—అంతటి స్తబ్దత.

శ్రీనివాస్:—ఏమిటి నన్ను పట్టించావే పూట! లేక ఇదంతా రేపటి ఉపన్యాసానికి ప్రెపరేషనా?

రామదాసు:—నాకు టైమయింది—మరి వెళ్ళనా.

(కండువా వేసుకుని, సర్దుకుంటూ ఉండగా సంగీతం మేష్టరు చిదంబరం వస్తాడు.

వయస్సు యాభై పైన. పంచి, కోటు, కండువా, మెడమీది వేళ్ళాడే గిరజాల జుట్టు, ముందుభాగం బట్ట తలమీద టోపి, చాదస్తంగా, కాస్త మతిమరుపుతో మాట్లాడే అలవాటు. అటూ, ఇటూ చూస్తూ వస్తుండగా క్రింది సంభాషణ సాగుతూంటుంది.)

రామదాసు:—ఏం రామయోగి, అన్ని భాషలూ యాకరువు పెట్టావుగాని, కన్నడం వదిలేసి నట్టున్నావు.

రామయోగి:—మీ రసాధ్యులే, ఏమో అనుకున్నా. గుజరాతీ కూడా విడిచేశా—మళ్ళా మరిచి పోకుండా చెప్పేస్తాను. ఉమా శంకర్ జోషి, పన్నాలాల్ పటేల్—అతని అద్భుత నవల 'మళేల జీవ'. ఇంక కన్నడంలో మాస్తి, శ్రీకంఠ య్య, పుట్టన్న......

చిదంబరం:—నమస్కారం స్వాములూ—జ్ఞాపకం వచ్చేసింది—ఆమెపేరు పట్టమ్మ...లేక పొట్టమ్మేనా కానచ్చు—వస్తుదు.

రాధ:—ఏం మేష్టారూ—మా నారాయణ మీ ఇంటికొచ్చి కబురు చెయ్యలేదా—

రామదాసు:—ఆమె పేరు స్మరిస్తూ వస్తున్నారేమిటి చిదం బరంగారు......రండి. మంచి సమయాని కొచ్చారు—అమ్మాయి పుట్టిన రోజు—అబ్బాయి ప్యాసైనాడు.

చిదంబ:—అల్లా ఉండాలి. అదృష్టం అంటే. పిల్లెదురుంగా వచ్చింది. కాసేపాగి వెళ్లండని ఇంటావిడ ఇదైనా, కుంటి పిల్లి పోనీమన్నాను శుభం, సంతోషం. రెండు మంచి వార్తలు విన్నాను. ఇంక మాకు ధప్పళం, పప్పు బెల్లాలూను.

లక్ష్మి:—అయ్యో, తప్పకుండాను. ఏమండీ. సాయంత్రం పార్టీ ఏర్పాట్లు చేయించెయ్యండి, మళ్ళా మీ లెక్కల్లో పడి మరిచిపోక.

చిదంబ:—మరో విశేషం ఏమిటంటారా—ఆవిడ పేరు పట్టమ్మ—పుట్టమ్మ—పేరు చటుక్కున సమయానికి జ్ఞప్తికి రావడం.

లక్ష్మి:—ఎవరం డావిడ?

చిదంబ:—రామదాసుగారితో మనవి చేసుకోవాలి. స్వామీ, మిమ్మలను మరీ మరీ అడిగానని చెప్పమంది.

రామదాసు:—నన్నా—ఎవరండీ?

చిదంబ:—బెంగుళూర్నించి వస్తూంటే అమ్మాయి నొక్కదాన్ని రైల్లో పంపిస్తోంది ఈ ఊరికి—నేను ఈ ఊరికేనని తెల్సుగుని, ఆవిడ స్టేషన్ దగ్గరకొచ్చి, అమ్మాయిని కనిపెట్టండని, కొంత భారం నామీద పడేసి పోయింది.

రాధ:—అమ్మాయా—ఏదీ— వచ్చిందా?

చిదంబ:—అవును. నిస్సందేహంగా అమ్మాయే. ఈనాడు మొగపిల్లలు, ఆడపిల్లల మాదిరిగానూ, ఆడ పిల్లలు మొగ పిల్లల మాదిరిగానూ, వేషాలు వేస్తున్నా, ఆ మాత్రం గ్రహించలేనంటారా. పేరు రాజమ్మ. అమ్మాయికి ఉద్యోగం వేయించే పూచీ మీదట.

రామ:—రాజమ్మ? పేరు కొత్తగాఉందే.

చిదంబ:—కన్నడంవాళ్ళు. వెనక చాలాకాలం క్రింద ఈ ఊళ్లో ఉండేవారుట. మీరు బాగా ఎరుగుదురుట. మరీ మరీ అడిగానని, ఎట్లాగైనా అమ్మాయి రాజమ్మకి మన కంపెనీలో ఏదో చూడాలనీ, తను కష్టంలో ఉన్నాననీ...... పెద్దతనం వచ్చిందనుకోండి—కొందరు అదేం చిత్రమో, పెద్దతనం వచ్చాకే బాగుంటారు—ఆ ఛాయ, ఆ పెద్దకళ్ళు, ఆ హుందాతనం.

రామ:—అవుతే చిదంబరంగారూ, మీరు వర్ణిస్తున్నది తల్లినా, పిల్లనా.........?

చిదం:—పిల్ల—ఆణిముత్తెం. మన రాధలా చక్కని చుక్క.

లక్ష్మి:—ఇంత చక్కటావిడ ఎవరండీ—మీ రెరుగుదురుటగా... ..

రామయోగి:—ఏం రామదాసుగారూ—'ప్రాత చుట్టాలమని వాక్కి పలు ఏమనియె' ఈ చిక్కు మీరు విప్పరా స్వామీ—

రామదాసు:—(నవ్వుతూ) అవును, జ్ఞాపకం వస్తోంది. ఒక కన్నడం ఆమె ఉండేది—చిన్నతనంలోనే భర్త పొయ్యాడుట.

లక్ష్మి:—అదేమిటండి. చిన్నతనంలోనే భర్తపోతే కూతురెట్లా ఉంటుంది—

రామయోగి:—ఇటీవల ఇంతటి చక్కటి ప్రశ్న వినలేదు పిన్నిగారూ—

రామదాసు:—అవును........గడ్డు ప్రశ్నే. ఏం సమాధానం చెప్తారు, చిదంబరంగారూ.

చిదం:—మీబోటి పెద్దలకు సాధ్యపడని సమస్య నా వల్ల నౌతుందా స్వామీ—అయినా యత్నించమన్నాడు.

రాధ—అమ్మాయి వయస్సెంతో చెప్పండి.

రామయోగి:—స్త్రీ వయస్సు కచ్చితంగా ఇంత అని చెప్పిన వాడు సృష్టిలో లేడు—క్షమించాలి పిన్నిగారూ, ఏదో భావనా సదిలో తేలిపోతూంటాను.

చిదం:—రాజమ్మ మనమ్మాయి రాధకంటె రెండు మూడేళ్ల చిన్నదేమో. అబ్బె, ఎక్కడండీ, లేత గుడ్డు—తమలపాకనుకోండి. పదిహేనుకి మించవేమో—

రామదాసు:—జ్ఞప్తి కొస్తోంది. పదిహేనేళ్ళ క్రితం ఇక్కడ ఉండి ఉండాలి. అప్పుడు పిల్ల ఉన్న విషయం ఎరగం.

చిదం:—అంతేనండి, వైధవ్యం సంప్రాప్తించిన ఐదారు మాసాలలో ఈ బిడ్డని కని ఉండాలి.

లక్ష్మి:—ఆవిడను నే నెరగకుండా మీరెల్లా ఎరిగారు?

రామ:—అవును. అప్పుడు నువ్వు మీ పుట్టింటి కెళ్లావు. జ్ఞాపకం లేదూ? నాలుగైదు నెల్లు—ఏదీ అప్పుడప్పుడే స్థలాల ఒమ్మకం, కొనడం బిజినెస్ ప్రారంభం.

లక్ష్మి:—మీ రెట్లా ఎరుగుదురు?

రాము:—ఇప్పుడు నా కసస్సి జ్ఞాపకమా—తరవాత, ఇక్కడ ఎక్కడో కొంతకాలం పని చేసిందనీ......ఏమో స్ఫురణకు రావడంలేదు—ఇంతకీ చెయ్యవల్సిందేమి టంటారు?

చిదం:—ఏదైనా బుల్లి ఉద్యోగంలాంటిది పడైంచి. జీవనోపాధి కల్పించమని.....

రామ:—రైట్. ఇప్పు డక్కడికే వెడుతున్నాను. అక్కడ కలుసుకోమనండి......

లక్ష్మి:—ఏమండీ—వెడుతున్నారా— చప్పున రండేం? అనవసరపు సోదెట్టు క్కూచోక.

రామదాసు:—చాల్లేద్దూ—మహా అవసరమైన వాటికే వ్యవధి దొరక్క మేం చస్తుంటే నీకేం చెప్తావు—అవుతే రామయోగీ—మళ్లా ఎప్పు డెడతావు, కంపెనీకి? నీక్కావల్సిన బోగట్టా అంతా దొరికిందా—ఇంకా ఏమన్నా తరవాయుందా......నువ్వు గేదర్ చేసిన ఇంప్రెషన్స్ ఏమిటి?

రామయోగి:—మొత్తంమీద శేవరబులే. ముఖ్యంగా నాకు తోంచింది చెబుతున్నా, ముఖస్తుతి కాదు. ఆంధ్రుడికి అన్యుడి పంచ గిట్టదంటారు. తోటి ఆంధ్రుడి ఆధిక్యత సహించలేడుటగా. అట్లాంటప్పుడు, పర ప్రాంతం వాడితో సఖ్యత అసలే సాధ్యంగాదు. మీ కంపెనీలో ఈ రకం సఖ్యత, సహకారంతో పురోగమించ గలగడం ఒక పెద్ద విశేషం. ఇద్దరు యజమానులు, వాటాదారులు, తమిళుడు, తెలుగువాడు. అందులో అనేక ప్రాంతాల వారికి స్థానం ఇవ్వడం, జాతి కుల, మత, ప్రాంతీయ భేదాలు లేక.....మిగతాది ఉపన్యాస వేదికప్పైకి రిజర్వ్ చేస్తాను.

చిదంబ:—మంచి మాట చెప్పావు. నాయనా. యదార్థం పలికావు. సంగీత కళ విషయం తీసుకో. అందులో కుల,

మత, ప్రాంతీయతలకి తావు లేనట్లే వ్యవహారంలో కూడా ఉండక పోవడం, దేశ సౌభాగ్యానికి మార్గం కాదు? వెనక మైసూరు, గోవర్ధనరావు గారింట్లో కచ్చేరి చేసినప్పుడు అనేక ప్రాంతాలవారు సభలో ముగ్ధులై కూర్చున్నారు. అది విశేషంకాదు. కచ్చేరి అయిం తర్వాత, బ్రిగ్స్ దొరగారు స్వయంగా అభినం దించి, వా రింట్లో మరో మారు వాయించమనీ, వీలైతే, నన్ను వారి దేశం తీసుకుపోతాననీ చెప్పారను కోండి—ఎందుకు చెబుతున్నానంటే......

శ్రీనివాసన్:—అవును. సంగీత కళకి సరిహద్దులు లేవనీ—

చిదంబరం:—వాక్యం మీరే పూర్తి చేసేశారు గావున, ఇంక నాకు సెలవు.

(వెడతాడు)

లక్ష్మి:—ఏం రాధా, నే నల్లా మీనాక్షిని చూసిరానా... .?

శ్రీనివాసు:—ఏం మీనాక్షికేం—ఒంట్లో బాగాలేదా.......! నే నొక్కణ్ణే ఇక్కడేం జేస్తాను. పద నేనూ వస్తా—రామయోగిని ౦ంపెనీలో దిగ పెడదాం— ఏం?

రామయోగి:—నో అబ్జెక్షన్—కొండొకచో అభ్యంతరం హుళక్కి.

రాధ:—మరి నే నొక్క దాన్నీ ఉండనా........?
అదుగో—బట్టల వాడు— పెట్టె దించండి—నారా యణా—దించు.

(నారాయణ నెత్తిమీద పెట్టె దించి, బట్టల వర్త కుణ్ణి లోనికి ప్రవేశ పెడతాడు. అతను బట్టలన్నీ, తివాచీ మీద పరిచి చూపుతూంటాడు)

మానిక్‌లాల్:—మాది గుజరాతీ—స్వామి ఇక్కడికి పొమ్మని చెప్పారు. వారింట్లో మంచి బట్టలు తీశారు...... ఇదిగో, ఇది సూరత్ సిల్కు......

(చూపెడుతుండగా తెర)

## రెండో రంగం

(అదే సాయంత్రం. ఐదు గంటలకి. అదే స్థలం. టేబిల్‌మీద ఒక అద్దం—దాని ముందు నిలబడి శ్రీనివాసు డ్రెస్ చేసుగుంటూ ఉంటాడు. రాధ స్కెచ్ బుక్‌మీద వాటర్ కలర్స్‌తో బొమ్మ గీస్తూ ఉంటుంది. నారాయణ, పరం ధామయ్య కప్పులు, ప్లేట్లు సర్దుతూ ఉంటాడు. ప్రక్కన చిన్న గదిలో తలుపులు దగ్గరగా వేసుకుని రామయోగి ఉప న్యాసం రిహార్స్ చేస్తూ ఉంటాడు. తెరలేచే టప్పడికి)

రామయోగి:—(ఉపన్యాస ధోరణిలో)—ఇక్కడ ఈనాడు ఒక చీకటి గదిలో, ఒక సామాన్యుడు, మీలో ఎవరైనా కావచ్చు—ఒక ఆలోచనచేసి, ఒక నిర్ణయానికొస్తే— దాని ప్రభావం ప్రపంచమంతటా వ్యాప్తమవుతుంది. దాని ఫలితం ప్రపంచ చరిత్రలో ఒక అధ్యాయంగా వెలువడుతుంది. మీలో ఒకరు, పనిలోకి రానని సెలవు చీటి పంపితే—ఆఁ ఏం పోయిందిలెద్దు, నే నొక్కణ్ణే పనిలోకి వెళ్ళకపోతే—మాటి నీకి చెక్కేస్తాను - అనుకుని పని ఎగకొడితే ఏం జరుగుతుందో ఊహిద్దాం. వాడు లేందీ నే నొక్కణ్ణే చేసేదేముందని తోటి పనివాడు అశ్రద్ధ చేస్తాడు. పోనీలే, ఇవాళ రవాణా అవ్వే బియ్యం బస్తా, రేపు వెడుతుందిలే అనుకుంటాడు యాజమాని. రైల్వే వేగన్ ఒకరో జాలస్యానికి ఏ జంక్షన్‌లోనే పడి ఉంటుంది. అది కలకత్తా వారం ఆలస్యంగా వెడుతుంది. ఆలస్యానికి ధాన్యం ధర తగ్గు తుంది. వ్యాపారులు కొన్నివేలు నష్టపడటాని కిష్టం లేక సంప్రదింపులి కని బైలు దేరుతారు. ప్లేన్లో ంబంధించిన రాజకీయ సలహాకాగితా లున్నాయి. అధికార్లని మంచి చేసుకుని, ప్లేన్ నడిపేవాడి పక్కన కూర్చుని ప్రయాణం అవుతాడు. పక్క వ్యక్తి గొణు గుడికి నడిపేవాడు చిరాకుపడి తద్వారా ప్లేన్‌కి ప్రమాదం సంభవిస్తుంది. రాజకీయ పత్రాలు సకా లానికి చేరవు. సైనికులు రారు. అంగోలాలో యుద్ధం చెలరేగి, ఒక ప్రాంతం ప్రజ రాజకీయ బానిసత్వానికి గురవుతారు. భారతదేశం అశ్రద్ధ అందుకు కారణ మని, అంతర్జాతీయ సమితిలో తీర్మానాలు చేస్తారు. కొందరు కాదంటారు. మరికొందరు ఔనంటారు. ప్రపంచం రెండుగా విభజనై మహా సంగ్రామానికి నాందవుతుంది.—అదీ ఫలితం, ఇక్కడ ఒక అనామ కుడు ఏమరుపాటున చేసిన ఆలోచన ఫలితం.

రాధ:—హియర్ హియర్ (చప్పట్లు కొడుతుంది) ఈ నాడిక్కడ రామయోగిగా రుపన్యసించకపోతే, మీరు, మీ మీ పన్లలోకి పోయి, సక్రమంగా పనులు జరిపి, బియ్యం రవాణా చేసి, అంతర్జాతీయ మహా సంగ్రామం తప్పించి ఉండు రుగా.

శ్రీనివాసు:—వెల్ సెడ్ రాధా. ఈ ఉపన్యాసం బదులు, ఏదన్నా పని చేసుకో గూడదూ—

రామయోగి:—ది పాయింట్ ఈజ్—ఎవరు చేసేవని వారు చెయ్యాలి—నా అంతస్సు, నా విధి— అది ముఖ్యం— థీసిస్ వ్రాయడం నా పని. అన్యులను ప్రచారం ద్వారా పురి గొల్పడం, నా కర్తవ్యం. అది చేస్తూనే ఉన్నా. కలలు కంటాను. కలలు కనలేనివారు కార్యానికి పూనుకుంటారు— టేక్ ఫరెగ్జాంపిల్ రాధ—

శ్రీని:—సరేకాని ఇటొచ్చి టై బిగించు.

రామయోగి:—(ఇవతల కొచ్చి అతని టై బిగిస్తూ) రాధ విషయం చూడు. ఇప్పుడు చిత్రలేఖనం చేస్తోంది— ఆ చిత్రాన్ని ఏ బెంగాలీ యువకుడో చూసి మెచ్చు గుని.......

రాధ:—అదేమిటండోయ్—

శ్రీనివాసు:—చెప్పనీవే—ఖంగారుపడతా వెందుకు?

రామయోగి:—తెలుగు వాడికి చిత్రలేఖనం పట్ల అభిరుచి లేదు గనక, బెంగాలీలకు ఉంది గనక—బెంగాలీ యువకు డన్నాను—అంతే—వెరీ గుడ్‌నెస్, సారీ— శ్రీనివాసు చెప్పేడు. అవును, అదేదో బెంగాలీ డాక్టర్‌తో ఆట్లా డ్తం సుట్సం—విత్‌డ్రాన్—పోనీ ఏ గుజరాతీ యువ కుడో చూసి మెచ్చుగుని చిత్ర లేఖినిని ప్రేమించి, పెండ్లి చేసుగుని ఫ్రెంచి ఎంబెసీలో ఉద్యోగి అవుతే పారిస్ వెళ్లి.......అక్కడి కళారంగంలో రాధిజమ్ అనే ఉద్యమం లేవదీసి, పాల్‌క్లీ పికాసోలు, ఆంద్రిమాల్ రాలు మూర్ఛపోయిననాడు......

(లక్ష్మిదేవిగారు, ఖరీదైన తెల్లసిల్కు పూల డిజైన్ చీర ధరించి, చిరాకు కనబరుస్తూ ప్రవేశిస్తుంది)

లక్ష్మి:—నాన్నేరే—ఏమైనట్లు—? మూడైంది. నాలుగైంది, ఐదు కూడా ఐంది—ఇంతవరకూ భోజనంలేదు—టీ లేదు. కబురన్నా పంపలేదు. శ్రీనివాసూ, ఓసారి వెళ్లొస్తావా ఏమిటి?

రామయోగి:—బిజినెస్సండీ, పిన్నిగారు, బిజినెస్. డబ్బు గడించే వారికి ఆకలి దప్పు లుండవ్. అందుచేతే ప్రపం చంలో వ్యక్తులందరూ, ఏడాదిలో ఒక్కరాజు విశ్రాం తిగా కూర్చుని, ఏ పనీ చెయ్యక పోయిననాడు యుద్ధా లుండవని సిద్ధాంతీకరించారు.

రాధ:—ఏమిటే నీ వెర్రి. ఎక్కడో అక్కడ స్వామిగారిం ట్లోనే తిని ఉంటారు. కంగారు పడకు. అది సరే గాని పార్టీ జనం ఒక్కడూ రాలేదేం—కంపెనీ ముఠా ఏమైనట్లు?

శ్రీని:—రావల్సిన వాళ్లు ఉదయం రానే వచ్చారుగా.

లక్ష్మి:—మన నారాయ ఏడి?

రామయోగి:—కవికి విత్తం, గాలికి పొత్తం అన్నట్లు దరిద్ర నారాయణుడు—ధనిక స్వాము లింట్లో.

లక్ష్మి:—ఏమిటి నాయనా—సరిగ్గా చెప్పు.

శ్రీనివాసు:—ఏం లేదులే—లక్ష్మణస్వామిగారింట్లో కబురు పెడితే వెళ్లాడులే.

లక్ష్మి:—వాళ్లింట్లో నౌకర్లు లేకనా— అయినా వెళ్లవల్సిం దిప్పుడా?— ఎవరదీ? విశ్వంగారా, రండి రండి. పరంధామయ్యా టీ తీసుకురా.

(విశ్వనాథం వయస్సు దగ్గర దగ్గర అరవై. పంచి చొక్కా, కండువా—మీసాలు లేవు. కండ్లజోడు—తెలివైన మొహం)

విశ్వం:—గుడ్‌న్యూస్. శ్రీనివాస్ పాసయ్యాడు. ఇంక వాళ్ల నాన్నకి భగవద్గీత పుటలు తిరగవేసే సావుకాశం చిక్కు తుంది—వ్యవహారాలన్నీ మోడరన్ పద్ధతుల్లో సక్ర మంగా నడిపి ఉద్ధరిస్తాడు శ్రీను. అదృష్టం అల్లా కలిసి రావాలి.

(టీ తీసుకుంటాడు)

లక్ష్మి:—అదంతా దైవానుగ్రహం—మీ బోటి పెద్దల ఆశీ ర్వాదం. అతను, రామయోగి అని మనవాడి స్నేహి తుడు. వీరు విశ్వంగారు. ఊళ్లో పెద్ద. చాలా పలుకుబడి గల సంపన్న గృహస్థు.

శ్రీనివాసు:—నాకంటె రెండు మూడేళ్లు సీనియర్. కంపెనీ మేనేజిమెంట్— భోగట్టా— స్టడీచేసి డాక్టరేట్‌కోసం థీసీస్ తయారు చేస్తున్నాడు— మా నాన్న కంపెనీ వ్యవహారాలు స్టడీ చేద్దువుగాని రమ్మని తీసుకొచ్చా.

రామయోగి:—నమస్కారం. అదంతా ఏం లేదుగానండి, పారి శ్రామిక రంగంలో, మానవమైత్రికున్న ప్రాబల్యం స్టడీ చెయ్యాలని—అది కొత్త విషయం. ముఖ్యంగా మన దేశంలో చూడండి—పోటీ తత్వంవల్ల ప్రైవేట్ రంగంలో ముఖ్యంగా, పరిశ్రమలు అభివృద్ధి చెందు తున్నాయి. మన జీవితంలో పోటీ ఎల్లానూ ఉండనే ఉంది. పోటీ వల్ల అభివృద్ధి జరుగుతోంది—కాని అభివృద్ధికి కొన్ని హద్దు లుండాలి. అవి లేనినాడు పోటీకి బదులు ద్వేషం ప్రబలుతుంది. ఆఖరికి ద్వేషంలో కూడా పోటీ జరుగుతుంది. మనం ద్వేషించిన వ్యక్తిని మరోడు ద్వేషిస్తే భరించలేము. ఈ ఈర్ష్యలు, కక్షలు, ఆధునిక ప్రపంచంలో అరిష్టాలకి కారణం. అభివృద్ధికి హద్దు లేవో కనుక్కోడమే నాథీసిస్.

విశ్వ:—బాగుంది నాయనా—కొత్త విషయమే ఇది. లక్ష్మి దేవమ్మగారు నన్ను సంపన్న గృహస్థుగా పరిచయం చేసింది—భాగ్యవంతుణ్ణే—పదివేలు బాకీ ఉన్నాను. కాబట్టి, ఆ రహస్యం ఏమిటో చెబితివా......(రామ దాసు కోపంగా కనబడుతూ, వేగిరపాటున ప్రవేశించి, కర్ర దూరంగా పడేసి, నలుగుర్నీ పరకాయించి, దృష్టి విశ్వంపై నిల్పి)

రామదాసు:—ఇంకా రహస్యం ఏమిటి. ఊరంతా పాక్కి పోయింది.

విశ్వం:—అదేమిటి రామదాసు—ఏమిటి జరిగింది?

లక్ష్మిదేవి:—అల్లాగున్నారేమండీ—ఆ చెమట్లు, హైరానాను, భోజనానికేనా రాలేదు—ఏమిటండదీ—

రామదాసు:—రొంపిలోంచి బైట పడ్డాను—రాద్ధాంతమైంది.

శ్రీనివాసు:—ఏమిటినాన్నా—సరిగ్గా చెప్పు.

రామదాసు:—ఇవాళతో కంపెనీకి మనకీ రాంరాం.

లక్ష్మిదేవి:—అంటే?

రామదాసు:—ఇంక కంపెనీలో మనం భాగస్వాములంకాము.

రాధ:—కాకపోవడమేమిటి? సరిగ్గా చెప్పు.

రామదాసు:—చెప్పాను కదుటే. ప్లీడరింటి కెళ్ళి నే నింక వాటాదారుణ్ణి కాననీ, లక్ష్మణస్వామే చూసుగోవా లనీ, నా పార్ట్నర్‌షిప్ రద్దు చేయించి, నోటీసు స్వయంగా చేతి కిచ్చి చక్కా వచ్చాను. ఇంక నిష్పేచీ జీవితం.

రామయోగి:—నిష్పేచీ జీవితం నిర్వీర్యం అన్నారు. అదేమిటి రామదాసుగారూ, అంతటి ప్రమాదం ఏ మొచ్చిం దండీ—

విశ్వం:—మీరు కాస్త నిదానించి, అతన్ని తేరుకో నివ్వండి. రామదాసుని ఎన్నాళ్లనుంచో ఎరుగుదును. నిదానం మనిషి. ఏదో ప్రబలమైన కారణం ఉండందే— ఇదంతా........

లక్ష్మీదేవి:—మీకేం తెలుసు విశ్వంగారూ—నిదాన మేమిటి మైదానం—ఆయనకి లేనిదే నిదానం. చెప్పండి— కాస్త ఫలాహారం తెప్పించనా—పరంధామయ్యా, కాస్త టీ తీసుకురా.

రామదాసు:—నాకేమీవద్దు. (లేచి అటూ, ఇటూ పచార్లు చేస్తాడు) రాజమ్మ ఉద్యోగం విషయం.

రామయోగి:—అనుకున్నట్లే దీని వెనక ఒక స్త్రీ ఉంది.

రామదాసు:—కూతురు రాజమ్మ ఉద్యోగం విషయం......

రామయోగి:—ఇద్దరు స్త్రీ లున్నారన్నమాట!

శ్రీనివాసు:—కాసేపూరుకుండు. (కళ్లు చిట్లిస్తాడు)

రామదాసు:—వాళ్లమ్మ పుట్టమ్మని వెనక ఎరుగుదును. కష్టం లోఉండి, అమ్మాయి కేదేనా చూడమనడిగింది స్కూల్ ఫైనల్ చదివింది. టైపింగ్ వచ్చుట. టైపిస్టుగా వేద్దామన్నాను. ఏం చేశాడో ఎరుగుదువా, లక్ష్మణ స్వామి? తన కంతా తెలుసునట. ఆ రాజమ్మ నే నింకా వెళ్లకముందే, కంపెనీ కెళ్లి అతన్ని కలుసుకుందిట. అతను ఆ పిల్లని ఎరుగునుట. ఉద్యోగంలేదు, గిద్యో గంలేదు, అని బైటకి పంపెయ్యడమే కాక.ండా, స్టేషన్‌కెళ్లి తిరుగు రైల్లో ఇంటికి పంపించి వేశా డుట. టెలిగ్రాం ఇచ్చి పిలిపించి, ఉద్యోగం ఇచ్చి తీరాలన్నాను. వీల్లేదన్నాడు. ఎందుకన్నాను. అదంతా నా కనవసరం అన్నాడు. భాగస్వామినైన నా కనవసరమై నప్పుడు నా కక్కడింక స్థానం లేదన్నాను. దానికేనా ఒప్పుకుంటాగాని, ఆపని మాత్రం చెయ్యడానికి వీల్లే దన్నాడు. అవుతే నా భాగం రద్దు చేస్తా నన్నాను. నీ ఇష్టం చేసుకోమన్నాడు. ఒళ్లు మండిపోయింది.

విశ్వం:—చిత్రంగాఉందే! లక్ష్మణస్వామి నిదానస్థుడే—అంతల్లో పేట్రేగి పొయ్యాడా?

రామయోగి:—మీరు ఉభయుల్నీ నిదానస్థులనే వ్యవహరిస్తు న్నారు. మీ నిఘంటువులో నిదానం అంటే నిష్పేట్ట డమా విశ్వంగారు?

విశ్వం:—నే నెరుగుదును. లక్ష్మణస్వామి చాలా నిదానస్థుడు.

రామదాసు:—ఇప్పుడు నాకు తెలిసొస్తోంది. అప్పుడప్పుడు వేధించుకు తినే అనుమానాలు, ఇప్పటితో తీరిపొయ్యాయి. ఒక నిశ్చయాని కొచ్చేశాను. చస్తే అరవ్వాణ్ణి నమ్మ కూడదు.

శ్రీని:—ఆ!

రామదాసు:—నీకేం తెలుసునోయ్. అరవవాడి స్వభావం— మంచిగా, నేర్పుగా కుట్ర పన్నడం, గోతులు తియడం, కుబేరుడవడం. మా నాన్న అంటూండేవాడు. ఇత్తడి చెంబు, చాప చుట్టలో ఆంధ్రదేశంలో చేరి, పదేళ్లల్లో ఒక్కొక్కడు కుబేరుడై కూర్చున్నాడు. ఏ శాఖలో చూసినా, పెద్ద ఉద్యోగాలన్నీ వాళ్లవే— మన డబ్బంతా పట్టుకుపోయి, మద్రాసులో భవనాలు నిర్మించుకున్నారు—తుదకి మద్రాసు కూడా లాగేసు కున్నారు.

రామయోగి:—అది వారి తెలివికీ, నైపుణ్యానికీ, బుద్ధి కుశల తకీ, ధైర్య సాహసాలకు తార్కాణం. మన తెలుగు వాడు ఇల్లు కదలడు. కష్టపడి చదవడు, పని చెయ్యడు. అరుగుమీద చుట్ట కాలుస్తూ, చదరంగం ఆడుతూ, ఉన్నతోద్యోగం వెలిగించాలంటాడు. ఏ బస్తీలో, క్లబ్బుల్లో చూసినా, పేకాట దురంధరులే—ఇంటర్ వల్స్‌లో, స్కాండల్ మాంగరింగ్, పైకొచ్చేవాడికి డాకులు కట్టడం, అన్య ప్రాంతాల వాళ్లని దుయ్య బట్టడం, తమకంటె ఘనులు లేరనుకుని దగాపడటం. ఈర్ష్య, ద్వేషం, పగ, సంకుచితభావం, స్తబ్దత, డబక్కులు—ఇది ఆంధ్రుల చరిత్ర—'హృదయముం చీల్చి చదువుడో సదయులారా.'

శ్రీని:—ఏమిటి, లక్ష్మణస్వామిగారితో ఓ అమ్మాయి విషయం తగవులాడి, తమిళనాడుని మొత్తం దుమ్మెత్తి పోస్తు న్నావు నాన్నా.

విశ్వం:—నేను మొదట్లోనే అన్నా, జ్ఞాపకం ఉందా రామ దాసు—అరవ్వాడితో నీకు వాటా ఏమిటీ వాళ్లతో కలిసి భా.స్వామ్యత్వం ఏమిటి— ఆలోచించూ అన్నాను.

రామయోగి:—ఇందులో—అరవ్వాణ్ణి, పరాయి వాణ్ణిగా వ్యవహ రించడానికి నా అభ్యంతరం, భాషవల్ల తమిళులైనారు గాని, వారికీ మనకీ నిజంగా తేడా ఉందంటారా? ఒకే మతం, ఒకే సంస్కృతి, ఒకే సంప్రదాయం, చరిత్ర—మనలాగే వారూ భారత ప్రజ.

రామదాసు:—లేదు రామయోగి- నువ్వన్నట్లు ప్రతి జాతిలోనూ కొన్ని గుణాలు ప్రత్యేకంగా ప్రధానంగా ఉంటాయి. వాటి సంఘర్షణవల్ల న్యూనత ఏర్పడి వాళ్లతో మనకి పొత్తు కుదరదు—కుట్రలో, చాకచక్యంలో, మెల్లి మెల్లిగా సందు చేసుకుని, బొమ్మజెముడులా లోకం అంతటా వ్యాపిస్తారు తమిళులు. ఎంత నమ్రత,

నమ్మకం, నిదానం కనబరిచేవాడు! అసలు అవతారం ఇవాళ ప్రదర్శించాడు. నే అన్నది కాదంటాడా—నాతో సంప్రదించకుండా, లేదని పంపించి వేస్తాడా—పిలిపిస్తానంటే వల్ల కాదంటాడా! విడిపోతానంటే, అది నీ ఇష్టం అంటాడా—తప్పకుండా విడిపోతాను—పొయ్యాను—నాది నాకు పడెయ్యమన్నాను.

విశ్వం—శ్రేష్టమైన పని చేశావు. ఏం, ఆంధ్రులంత తెలివి తక్కువ దద్దమ్మలనీ అన్నీ తమకే తెలుసునని విర్ర వీగితే, ఇక్క డెవ్వరూ గాజులు తొడిగించుకుని కూర్చోలేదు. ఇది కాకపోతే, దీనబ్బలాంటి మరో బిజినెస్ పెడతాం.

రాధ:—మరో పదివే లప్పుచేసి—

రామదాసు:—నీ కెందుకు రాధా—నువ్వింట్లో కెళ్ళు.

లక్ష్మి:—కొంపముంచే పని చేసొచ్చి, విషయం చెప్పకుండా, మమ్మల్ని పొమ్మంటా రేమిటి—ఎక్కడికి వెళ్లడం, ఏట్లో కెళ్లాలి.

శ్రీని:—అమ్మా—నువ్వు కాసేపు ఊరుకో.

రామదాసు:—మనకేమిటే వెర్రిదానా. అన్ని తెగతెంపులు చేసుకోమూ—తన భవంతి పీకించేసి, వెంటనే నా స్థలం నాకు స్వాధీనం చెయ్యమన్నాను.

రామయోగి:—ఇంటరెస్టింగ్—నా కిచ్చిన ప్లాన్‌లో ఈ వివరాలేవీ లేవే—అంతా ఉమ్మడిగా ఉన్నట్లే సూచించారే—చెప్పండి—రసవత్తర ఘట్టం.

రామదాసు:—అంతా పన్నెండెకరాల స్థలం నాది. మొదట్లో చిన్న చిన్న షెడ్స్‌తో ఒక్కణ్ణీ బిజినెస్ ప్రారంభించా. స్థలా లమ్మడం కొనడం, ఇంటి కంట్రాక్టులూ అవీని. తరవాత, లక్ష్మణస్వామి దాపురించాడు. రైసు మిల్లన్నాడు—ఆయిల్ మిల్ అన్నాడు—బోలెడు లాభాలు, పెద్ద బిజినెస్ చేద్దామన్నాడు. ఆ రోజుల్లో చిన్న క్రైసిస్‌వచ్చి, ఓ ఇరవై వేలు కావాలంటే నోటు లేకుండా ఇచ్చేశాడు. పెద్ద మనిషి, నమ్మకస్తుడని. సరేనని, పార్ట్నర్‌గా చేరాను. తరవాత ఏం చేశాడు—తన స్వంత డబ్బుతో, ఓ ఆరవై వేలవుతుందేమో, బిల్డింగ్, వేశాడు. ఆ బిల్డింగు పీకేసి నా స్థలం నా కిచ్చెయ్యమన్నాను.

విశ్వం:—అది సబబుగానే ఉంది. అవును. స్థలం నీది. నీది నీకిమ్మన్నావు. తప్పులేదు.

రామయోగి:—తప్పులేదు? భలేవారే. బిల్డింగ్ ఎల్లా పీకేస్తాడండీ—అతని కొంప తియ్యడంకాదూ? బాగానేవుంది మీ తందాన తాన పదం. చిన్నప్పుడు బుర్ర కథ దళంలో పని చేశారా?

రామదాసు:—నీకు తెలియదు—నువ్వూరుకో నాయనా. తన బిల్డింగ్ ఉన్నంతమేరా—స్థలానికి వెలకట్టి—అది చెల్లించి, బిల్డింగు స్థలం, తన కిందే అట్టే పెట్టుకుంటానంటే, వల్ల కాదన్నాను. నా ఇష్టం మెచ్చినట్లు వాడుకుంటూ—అంత స్థలం కావాల్సిందే—వీల్లేదన్నాను.

లక్ష్మి:—అంతవరకూ ఎందుకు రానిచ్చారండీ?

రామదాసు:—నేను రానివ్వడం ఏమిటి—వాడే మీదపడి కరిస్తేను.

శ్రీని:—నేను నమ్మను నాన్నా. వారంట్లాంటివారు కారు.

విశ్వం:—ఇంకా వారు కూడా ఏమిటి నాయనా, ఇంత తెగించిన అరవ్వాణ్ణి—

రామయోగి:—అయ్యా, దెబ్బలాటలో కూడా నాజూకు, మర్యాద, నాగరికత విడిచెయ్యాలంటారా?

రామదాసు:—పైగా, స్థలం ధర ఇంత అని ఎవడు కట్టగలడు? వెనకటిది— తా గారిది—ఈనాడు దాని ధర ఎకరం పదివేలంటే, కాదనేవాడిని రమ్మనండి. నాకా బిల్డింగ్ ఉన్న—అమూల స్థలం కూడా కావాలన్నా—ఏమో ద్రాక్ష వేస్తానో, కొబ్బరే వేస్తానో—మరో కాలవ తవ్వించి, వంతెనే కడతానో, మూడు రోజులు గడువిచ్చాను—మేడ పీకెయ్యమని. చూద్దాం ఏం చేస్తాడో.

శ్రీనివాసు:—అదన్యాయం నాన్న. ఇల్లు వదిలి ఎక్కడికి పోతారు? పైగా వాళ్ల మీనాక్షి వంట్లో బాగుండలేదుట. పోనీ ఆ బిల్డింగ్‌కి ఇంత ధర అని నిర్ణయించి ఆ డబ్బిచ్చేసి, బిల్డింగు, స్థలం కూడా నువ్వే తీసుకోరాదు?

రామ:—నువ్వుట్రా సలహా చెప్పేది. అడిగినప్పుడు చెబుదువుగానిలే. కంపెనీకోసం, నే కొన్నవాటికీ, కాంట్రాక్టులకీ, జీతాలకీ, ఓవర్‌హెడ్స్‌కి సగం సగం కట్టి, లెక్కలు పంపమన్నాను. సరే నన్నాడు.

లక్ష్మి:—ఇంత జరిగిందిటండీ—ఇంకేముంది? ఏమిటి చెయ్యడం—

విశ్వం:—మరి మాటా మాటా వచ్చాక, మనం వెనక్కి తగ్గిపోతామా—ప్రెస్టిజ్ ఉండొద్దూ.

రామయోగి:—మీరూ అల్లా అంటారేమిటి విశ్వంగారూ—ఏవన్నా పొరబాట్లు ఉండొచ్చు. పొరబాట్లు క్షమించరానివికావు. కాని వాటిని కప్పి పుచ్చేటందుకు మనం చేసే యత్నాలు క్షమించరానివి. ఇంక ప్రెస్టిజ్ అంటారా—ప్రెస్టిజ్ దిగమింగుకుని సూర్యుడస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యపు కిరీటంలో మణి అయిన భారత దేశాన్ని విడిచి వెళ్లలేదుటండీ ఆంగ్లేయులు—! ఈ మారుమూల, పదెకరాల మధ్యలో వెయ్యి గజాల స్థలంకోసం ప్రజాక్షేమం, దేశ సౌభాగ్యం కైంకర్యం అయిపోవాల్సిందే?—మీ ప్రెస్టిజ్ కోసం యూనెస్కో ఫియాస్కో అవాల్సిందే!

రామదాసు:—నీ ఉపన్యాసం, నువ్వు ఏ పట్నంలో చదువు వెలిగించావో ఆ పట్నవాసి అరవ సోదరుడి కియ్యి—

విశ్వం:—బాగా అన్నావ్.

(నారాయణ ప్రవేశిస్తాడు. మెల్లగా సంచీలోంచి వడ్డాణం తీసి లక్ష్మీదేవి కిస్తాడు)

నారాయణ:—మిమ్మల్నోసారి వీలైతే రమ్మన్నారండి—ఆ మీనాక్షమ్మగారు.

లక్ష్మి:—ఏం, ఎందుకుట.....?

నారా:—మంచంపైన పండుకు నుండారండి దిగులుగా......

రామదాసు:—అదేమిటే—ఆ వడ్డాణం ఎక్కడిది?—

లక్ష్మి:—మందే. వాళ్లెవళ్లకో చూపించాలంటె పంపించాను. మళ్లా అందజేసింది.

విశ్వం:—ఇకనేమమ్మా—ఎవరివి వారికి అందజెయ్యాలిగా.

శ్రీని:—పోనీ, ఓసారి వెళ్లి రాకూడదటే అమ్మా.

రామదాసు:—వల్లకాదు. ఏ మొహం పెట్టుకుని వెడుతుందిరా సిగ్గుండొద్దూ—గడప తొక్కడానికి వీల్లేదు.

రామయోగి:—ఆ నిషేధం నాకూ వర్తిస్తుందాండి—బోలెడు స్టడీ చెయ్యాలనుకుంటున్నాను. ఇంకేమిటీ స్టడీ చెయ్యడం.

రామదాసు:—నీ క్కావల్సిందంతా నే చెప్పలేనా.

(మహంతి ప్రవేశిస్తాడు.)

రామదాసు:—ఏం మహంతీ, ఎల్లా ఉన్నాయి మీ కంపెనీ వ్యవహారాలు?

(మహంతి కొన్ని కాగితాలు చేతికిస్తాడు)

మహంతి:—ఏం చెప్పమంటారు. మా ఐదుగురికీ ఉద్వాసన చెప్పాడు.

విశ్వం:—పంచపాండవులకూనా—దుర్యోధనుడల్లే ఉన్నాడే ఎక్కడో—ఎందుకుట?

మహంతి:—మేం మొదట్నుంచీ ఉన్నవాళ్లం. రామదాసుగారు మమ్మల్ని మొదట్లో తీసుకున్నారు. వారే నియమించారు. కాంట్రాక్టులు ఇచ్చిందీవారే—ఇంక బిజినెస్ తనొక్కడే నడుపుకునే పరిస్థితి ఏర్పడింది గనక మమ్మల్ని భరించలేడుట—అందుచేత రామదాసుగారి దగ్గరకే పొమ్మన్నాడు, స్వామి.

రామదాసు:—(కాగితాలు చూసి, దూరంగా పడేసి) విభజన లెక్కలు. మనకి రావల్సినవీ, ఇయ్యవల్సినవీ, నేనను కోలేదు— పెద్ద మొత్తమే తగిలింది. ఆడిటర్లని పిలిపించి, నేనూ పంపుతాను కాగితాలు.

మహంతి:—రామదాసుగారు ఇట్లా చేస్తారని కలలోకూడా ఎవ్వరూ అనుకోలేదు.

రామయోగి:—అసలు మీకు కలలు కనే శక్తి ఉందా అని అనుమానం. స్వప్నాలు కనడం సోమరికే సాధ్యం. మీరంతా కార్యశూరులు. కార్యానికి పూనుకోడంలో చిలిపితనం ఉంది. సృష్టికర్త ఊహా జగత్తులో కేళి స్పృక కార్యానికి పూనుకుని, లోకాన్ని సృష్టించి, వారి కాట్లాటలు చూసి వినోదిస్తున్నాడు. రెండు వందల మిలియన్ల జనాన్ని కన్న భారతమాతకి, కలలు కనే ఓపిక ఉంటుందా మరి?

రాధ:—అదేమిటి రామయోగిగారు—ఎందుకోనో పడి కొట్టుకు పోతున్నారు?

రామదాసు:—ఏదో అంటూఉంటాడు—నేను మాత్రం అనుకున్నానా మహంతీ—నే నింక బిజినెస్‌లో లేను. విడి పొయ్యాను. స్వామితోనే చెప్పుకోండి. హాయిగా కృష్ణా, రామా అని కూర్చుంటాను. రామయోగి 'సలహా' ప్రకారం, సోమరిగా.

రామయోగి:—సోమరిగా కూర్చుని స్వప్నాలు కనమంటాను— అందమైన కలలు—

లక్ష్మి:—కూర్చుంటే బువ్వెల్లా వస్తుందీ—

మహంతి:—వారితో మాట్లాడి లాభంలేదు. మాకు నోటీసు లిస్తున్నాడు. మీరే ఏదో చెయ్యాలి.

రామదాసు:—ఏం చెయ్యమంటావు. భాగస్వామిగా, కాంట్రాక్టు లిచ్చింది నేనే, కాదనను. అది రద్దయింది. ఇప్పుడత నొక్కడే యజమాని. అతని కక్కర్లేకపోతే నే చేసే దేముంది!

మహంతి:—అంతేనా, మరి మార్గం లేదంటారా. మీ రిచ్చిన కాంట్రాక్టులు మరి మూడు సంవత్సరాల వరకూ అమలులో ఉంటాయి. సంతకాలు పెట్టింది మీరు గనక, మీరే భరించాల్సి ఉంటుంది.

రామదాసు:—ఇదేం బెదిరింపా?

మహంతి:—బతిమాలుతూన్నాం—అది బెదిరింపు కింద మార్చే పూచీమీదే అవుతుంది. (వెడతాడు)

శ్రీని:—అవును నాన్నా. మూడేళ్లవరకూ నువ్వే పెట్టుగోవాలి.

రామదాసు:—నీ మొహం నీకేం తెల్సురా—ప్లీడర్ని కనుక్కోనూ (సిద్దప్ప, కాంబ్లే, ఏసూబేగ్, కురియన్ వస్తారు. దిగులుగా ఉంటారు)

సిద్దప్ప:—నోటీసు లిస్తారట. ఇంక పనిలోకి రానక్కర్లే దన్నారు, లక్ష్మణస్వామి. మరి మీరే చూడాలి.

రామదాసు:—అదంతా మహంతితో మాట్లాడాను. చేసే దేమీ లేదు.

ఏసూబేగ్:—అట్లాగైతే మేం బ్రదగ్గలమా, మహరాజ్.

రామయోగి:—మహారాజులు, రాజ్యాలు రద్దై చాలా కాలమైంది. ఇది విశాల అఖిల భారత ప్రజా స్వామ్య రాజ్యాంగం.

విశ్వం:—నవ్వారుకో నాయనా—వాళ్లకివన్నీ ఏం తెలుస్తాయి.

రామయోగి:—తెలియకపోతే, చెప్పడం నా విధి, నా కర్తవ్యం.

ఏసూబేగ్:—ఎవరో ఒక పిల్లకోసం మమ్మల్నందర్నీ తీసివేస్తే, బ్రతకడం ఎట్లా—మీరు మీరు కలిసి ఉండాలి—మా తప్పు ఏదన్నా ఉంటే దండించండి—రోడ్డు మీదికి పోతాం.

విశ్వం:—అదంతా మీ యజమానిగారితో చెప్పుకోండి.

రామదాసు:—తనేసిన బంగ్లా పీకెయ్యించమని మూడు రోజులు టైమిచ్చాను.

ఏసూబేగ్:—ఎట్లాగ పీకురారు—మీరు చెప్పండి. అది పీకేస్తే మమ్మల్ని పనిలో ఉంచుతారా—?

రామదాసు:—మళ్లా ఏదన్నా కొత్తది పెడితే ఆలోచించాలి. ద్రాక్ష వేద్దామా అనుంది. గవర్నమెంటువారు సాయపడితే, ఇండస్ట్రియల్ ఎస్టేట్ పెట్టించాలి. అదంతా నిదానంగా ఆలోచించి చెయ్యాలి. ప్రస్తుతం పొలానిక్కి.

రామయోగి:—బోస్, నా దో సలహా ఉంది. అల్లా చేస్తారా?

రాధ:—ఏమిటండదీ—వయో జనులకు పాఠశాల?

రామయోగి:—ఓవిధంగా అదీ మంచిదే. కాని నా సలహా ఒక కర్మాగారం పెట్టమని.

విశ్వం:—వేటిని తయారుచేసే కర్మాగారమూ కూడా చెప్పు.

రామయోగి:—సత్యాన్ని పరిశోధించే కర్మాగారం.

(మొగతావారు నవ్వుతారు. రామదాసు తప్ప)

విశ్వం:—అదేమిటి—వేళాకోళమా?

రామయోగి:—కలలు కనడం నా వ్యాసంగం అని చెప్పాను కదు టండీ. మీరుత్త కార్యశూరులు గనక, వాటేని అమలు జరిపే భారం మీది. మీరంతా డబ్బు, పలుకుబడి, పరపతి, అధికారం గలవారు. దేశంలో ఎన్నెన్నో నిర్మాణ కార్యక్రమాలు, ప్రోజెక్టులు, పారిశ్రామిక కర్మకాండా కొనసాగుతూంది. కాని సత్యాన్ని తయారు చేసే ఫ్యాక్టరీకాని, పరిశోధించే పరిశోధనాలయంగాని ఇంతవరకూ లేదు. అదెందుకు పెట్టకూడదూ అని.

లక్ష్మి:—ఇప్పుడేమిటి నాయనా, వేళాకోళం.

రామయోగి:—క్షమించాలి పిన్నిగారూ—కష్ట సమయంలోనే ఓర్పు, హాస్యదృష్టి, పనికొస్తాయి. మనల్ని చూసి మనం కాసేపు నవ్వుకో గలిగినవాళ్లే ఉత్తమశ్రేణి మానవులు. ఇందులో నవ్వవల్సింది ఏమీలేదు. సౌతాఫ్రికాలో గాంధీగారు అట్లాంటి పరిశోధనాలయం నడిపి, కొంత కృషి చేసి, సాధించాడు. సత్యాగ్రహం అనే వస్తువుని మార్కెట్లో పెట్టాడు. అది ఈ నాడంతగా చెలామణి అవడంలేదు. యుద్ధ సమయంలో దాని విలువ తగ్గుతుంది. లోకంలో అస్తమానూ ఎక్కడో అక్కడ యుద్ధం జరుగుతూనే ఉంది గనక, ఏ ఒకరిద్దరో తప్ప, దాన్నికొనేవారు లేకపోయారు. పొట్టి శ్రీరాములు తన ప్రాణాల నిచ్చి దాన్ని కొన్నాడు. అందుకనే గాంధీగారు దరిద్ర నారాయణుడుగా, అంగవస్త్రంతో రంగస్థలంపైకొచ్చి లైమ్‌లైట్‌లో నిలబడ్డాడు. ఆ వస్తువుని జనం కొనడంలేదని తెలుసుకున్నాడు. దాన్ని కొన్నా, ఎల్లా వాడుకోవాలో తెలీక అది మూలపడుతుందని గ్రహించి, మరికొన్ని ఎక్కువ ధరలేని వాటిని మార్కెట్లో పెట్టాడు. మూడు కోతులు, రాట్నం, టోపీ, వగైరాలు. అవి చలామణి అయిపొయ్యాయి. కుబేరుడైనాడు ఆయన.

రామదాసు:—(నవ్వి) దాని ఫలితం ఏమిటో నీకు తెల్సుగా, కుబేరుణ్ణి బీద ప్రజ బ్రదక నివ్వరుగా. నన్నో పదేళ్ల బాటు ఉండనీ—

(ఏసూబేగ్, కాంబ్లె ఏదో గుస గుస లాడుతూంటారు)

ఏసూబేగ్:— మరిమాకు ఏం చెప్తారు? లక్ష్మణస్వామి బంగ్లాకి నిప్పు ముట్టించమంటారా—మూడు రోజుల్లో పడగొట్టకపోతే (కాంబ్లె నిప్పుపుల్ల గీసి, ముట్టించే తతంగంచేసి చూపుతాడు, చిరునవ్వుతో)

లక్ష్మి:—ఇంకా నయం—ఏమిటి నాయనా మీ సలహా—వాళ్ళ కొంపకి నిప్పు పెడతారూ? ఈ పాపం కూడా చుడతారా మా పీకలకి—బాగానే ఉంది సలహా. వెళ్లండి, వెళ్లండి......

రామదాసు:—ప్రస్తుతాని కేమీలేదు. వెళ్ళండి.

ఏసూబేగ్:—ఎందుకు లేదో, మేం అడిగిచూస్తాం. (వెడతారు.)

(ఇది జరుగుతున్నప్పుడు, నారాయణ చిన్న గదిలోకెళ్ళి లక్ష్మీదేవిని రమ్మన్నట్లు సంజ్ఞ చేస్తాడు. ఆమె లేచి అటు వెడుతుంది. ఒకసంచీ ఆమె చేతి కిచ్చి, అందులో ఏదో ఉంది చూడమన్నట్లు సంజ్ఞ చేస్తూండగా అది రామదాసు గమనిస్తాడు)

రామదాసు:—ఏమిటది నారాయణా—ఆ సంచీ ఏమిటి—ఏమిటిదంతా?

లక్ష్మి:—ఏదీ ఇంకా చూడందే—మీ చిరాకంతా ఈ నారాయణ మీదనా—

(సంచీలో చీటి తీసుకుని) రా, రాధా మిషనువాడొచ్చి నట్లున్నాడు, లోపలికి వెడదాం.

(ఇద్దరూ లోపలి కెడతారు)

రామదాసు:—ఏమిటది నారాయణా—

నారాయణ:—ఏం లేదండి— ఆ బట్టల కొట్టువాడు—అదే ఆ గుజరాతీ మానిక్‌లాల్, బిల్లు చీటీ పంపించాడు.

రామదాసు:—ఓస్ అంతేగదా—దానికింత రహస్యం దేనికి?

నారా:—మీరు కూక లెడతారనీ......

[సశేషం]

# త్యాగవినోద విచిత్ర ప్రబంధము



శ్రీ కె. జోగయ్యశర్మ

ఆంధ్రదేశంలోని వ్యక్తులూ, సంస్థలూ తమ ఇచ్ఛాశక్తుల ననుసరించి ప్రచురించినవి ప్రచురించగా, వెలుతురులోని కొచ్చి ముద్రణ భాగ్యం పొందదగిన ఆంధ్ర వాఙ్మయ ప్రక్రియలు చాలావరకూ ఇంకా తాటాకు ప్రతుల్లో ఉండి పోయాయి. తంజావూరి యక్షగాన సాహిత్యం వాటిలో ఒకటి. ఆ రచనలలో కొన్నిటిని ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారు యథావకాశంగా ప్రచురిస్తున్నారు. మిగిలిన వాటిలో రసవత్తరమైన రచనలు ఇంకా కొన్ని ఉన్నాయి. అట్లాంటి వాటిలో త్యాగ వినోద విచిత్ర ప్రబంధం ఒకటి.

దీన్ని సంతరించిన మహాసుభావుడు శాహజీ. ఇతడు తంజావూరు పాలించిన మహారాష్ట్ర రాజులలో రెండవ వాడు (1684—1712). నాయక రాజుల తరువాత తంజాపురాస్థానంలో తెలుగు సంప్రదాయాన్ని పరిరక్షించడమే కాక శాహజీ మాతృభాషయైన మహారాష్ట్రంతో పాటు తెనుగూ, సంస్కృతమూ నేర్చుకొని, ఆ రెండు భాషల్లోనూ మంచి పాండిత్యం సంపాదించి, చక్కని రచనలను సంతరించిన కవి చక్రవర్తి.

ఇతని పేరుమీదుగా తెనుగులో సుమారు 23 యక్షగానాలు కనిపిస్తున్నవి. వానిలో కొన్నిటిని నాటకాలనీ, కొన్నిటిని ప్రబంధాలనీ పేర్కొన్నాడు. విష్ణుపల్లకి, శివపల్లకి, పంచరత్నం, త్యాగ వినోద విచిత్రము అనేవి ప్రబంధ నామాంకితాలు. తక్కినవి నాటకాలు. ఈవిధంగా కొన్నిటిని నాటకాలనీ, కొన్నిటిని మాత్రం ప్రత్యేకించి ప్రబంధాలనీ పేర్కొనడంలో అతని ఉద్దేశం ఏమై యుంటుందో చూద్దాం.

సంస్కృతకవుల చమత్కారజనకములైన రసవద్రచనల నన్నిటినీ, ఒక్క వాక్యాన్ని కూడా కావ్య ప్రబంధ శబ్దాలతో వ్యవహరించేరు. విద్యానాథుడు తన అలంకార రచనను "అలంకార ప్రబంధీయం" అని పేర్కొన్నాడు. ప్రాచీనాంధ్ర కవులు కూడా కావ్య ప్రబంధ శబ్దాలను పర్యాయాలుగానే వాడినట్టు తోస్తుంది. మధ్యాంధ్రకవులు మాత్రం శృంగారాది రసాంచితమూ, ధీరోదాత్తాది నాయక సంశోభితమూ, అష్టాదశ వర్ణన సంకలితమూ అయిన కావ్య విశేషాన్నే ఆ పదంతో వాడారు. అది రాను రాను తెనుగులో రూఢమై పోయింది కూడాను.

యక్షగాన కవులు తత్రాపి శాహజీ, చమత్కారజనకమైన రచనా విశేషాన్ని—అందులోనూ సంగీత సాహిత్య ప్రధానమైన నాట్య విద్యా ప్రచురణమైన విచిత్ర రచనను ప్రబంధ శబ్దంతో వ్యవహరించినట్లు కనిపిస్తుంది. దానికి ఉదాహరణం ప్రస్తుత ప్రసంగోపయుక్తమైన త్యాగ వినోద విచిత్ర ప్రబంధమే. దీని స్వరూప స్వభావాలను గూర్చి కొంచెం వివరిస్తాను.

ఇది ఒక విచిత్రమైన రచన: ఇటు యక్షగాన ఫక్కీ కనబడుతుంది. ఇటు నాటక విధానమూ ఉంది. అందులో ప్రబంధ ధోరణి, తత్రాపి సంగీత సాహిత్యముల ప్రాచుర్యము. ఇన్ని ప్రక్రియా వైవిధ్యములు ప్రదర్శించుటవల్లనే దీనిని 'విచిత్ర ప్రబంధ' మని గ్రంథకర్త అంకాంత గద్యలో పేర్కొన్నారు.

గ్రంథమంతా ఆరంకాలుగా విభజింపబడింది. ఒక్కొక్క నాడు ప్రదర్శనయోగ్యములైన సన్నివేశాలు గాని, లేదా ప్రత్యేక ప్రత్యేక నాట్య సంగీతాది భరత విద్యా విధానాలు గాని ఆయా అంకాల్లో ప్రదర్శించబడడంవల్ల ఆ విభాగం చేసినట్లు తోస్తుంది. అనుస్యూతమైన కథావస్తువేదీ ఇందులో అట్టే కనిపించదు.

"ఇహ ఖలు చరాచర వందిత పాదారవిందే! నిత్య మహానందే! కరకలిత వీణావాదనశీలే! బాలేందుఫాలే!" ఇత్యాదిగా లలిత లలిత సంస్కృత పదబంధురమైన చూర్ణికలో దేవ స్తోత్రంతో గ్రంథారంభం కావించబడింది. భద్రకాళి సభా వర్ణన, నారదుని ప్రవేశం, సలాముదరువూ అయిన తరువాత "ఆకర్ణయంతు సభాసదః" అని సూత్రధారుడు హెచ్చరిక చేస్తాడు. ఆటుపై "శ్రుణు నారద! విద్యావైపుణ్యేన సౌందర్యాతిశయేన నాట్య చాతుర్యేణ మయాసహ వాదం కర్తుం త్రిజగతేహ తోవాస్తి వద" అని భద్రకాళి సగర్వంగా చెప్పుకోగా, "శ్రుణు దేవి, యథార్థ ముచ్యతే.... శాహేంద్రపాలిత చోళదేశే సకల స్థలాధిక తారుణ్యే శ్వేతారణ్యే త్యాగేశో నాట్య చాతుర్యేణ త్వదధికో వర్తతే." అని నారదు డామెకు సమాధానం చెప్పి రెచ్చగొడతారు. ఆ మాటకు దేవి: "శ్రుణ నారద! వాదే మమ అపేక్షా వర్తతే. వాదాయతం శీఘ్రమానయ" అని ప్రగల్భంగా ప్రతి సమాధానం యిస్తుంది. అంతట నారదుడు త్యాగేశుని వద్దకు వచ్చి భద్రకాళి గర్వోక్తులను ఆ పరమ శివునకు వినిపించి అతణ్ణి కలహోన్ముఖుణ్ణి చేస్తాడు. ఈ సన్నివేశమే భద్రకాళీ పరమశివులను భరతవిద్యయందు తమ బలాబలాలు తేల్చుకోవాలనే పట్టుదల కలవారినిగా చేస్తుంది.

అంతతో త్యాగేశుడు భద్రకాళి ఆస్థానానికి వేంచేస్తాడు. ఇద్దరకూ కొంత వాగ్వాదమైన తరువాత, దేవ—రాజ—దేశ్య భేదాలచే నాట్యం త్రివిధమనీ, వాటిలో రాజనాట్యం చాలా ప్రశస్తమూ, బహువిధమూ అనీ, దానికి లక్ష్యంగా శ్రీ శాహాజీ రచించిన "త్యాగ వినోద విచిత్ర ప్రబంధ"న్ని నటించి చూపిస్తానని భద్రకాళి ప్రగల్భాలు పలుకుతుంది. ఆ మాటలు విని, ఆ నట చక్రవర్తి నవ్వుతూ: "భవరు, దస్మిన్ ప్రబంధే మమాపి పరిచయోస్తి. అవశ్యం భవద్భి స్తత్ ప్రదర్శనీయం మయాపి ప్రదర్శ్యతే" అని సమాధానం చెప్పగా, ఆమె తన తౌర్యత్రిక విద్యా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తుంది.

త్యాగేశుని అఘటన ఘటనా సామర్థ్యాన్ని వివరించే మహారాష్ట్ర దరువును ఆదితాళంతోనూ, సంగీతకలాపాన్ని వివరించే ప్రబంధదరువులను సూళాది తాళాలతోనూ శంకరాభరణంలో వినిపించి, శ్రీరామచరిత్రను ఆధ్యాత్మ తత్త్వంతో సంపుటీకరించి సౌరాష్ట్ర రాగంలో ఒక పదాన్ని లభిన యించి ప్రదర్శించడంతో ప్రథమాంకం పరిసమాప్తమవుతుంది.

వినాయక ప్రార్థనతో ఉపక్రమింపబడిన ద్వితీయ తృతీయాంకాలు రెండూ, భద్రకాళి ప్రదర్శించిన స్వరూప అను పేరుగల దరువులతో నిండియున్నవి. వీని లీలలు స్వభావాలను గూర్చి నారదుడు శిష్యునకు ఎప్పటికప్పుడే వివరించి బోధిస్తున్న తీరు కూడా గోచరిస్తుంది. వీనిలో పర బ్రహ్మకథాను చిత్రలీల, పంచతాళ ప్రబంధలీల, ముక్తపద గ్రస్త లీల, అత్యుక్తి శబ్ద చిత్రలీల, చతుర్దశ భువన అను రాగమాలిక, బహు భావానుక్రమం, ఏకశబ్ద ప్రాస భిన్నార్థము, లుప్త పదవర్ణన, మణిప్రవాళము, విపరీతప్రశ్న, చిత్రఫల ప్రదానము, చతురశ్రజాతి దిగ్గజ సంఖ్యానువర్తిత ప్రబంధలీల, నిందాస్తుతి, విద్వత్ ప్రశ్న అనే దరువులు ప్రధానంగా పేర్కొనదగ్గవి. కొన్ని దరువులకు స్వరకల్పన కూడా ఉంది. వీనిని విమర్శించి చూడగా, కవి తనకు గల శబ్దాలంకార ప్రావీణ్యాన్నంతా చిత్ర విచిత్ర రాగతాళాదిగతులతో సంగీత సాధనగా ఉపయోగించుకొని, అక్షరరూపమైన నాద బ్రహ్మాన్ని సాక్షాత్కరింపజేసుకున్నాడా అనిపిస్తుంది.

నాలుగో అంకం మళ్లీ గజానన ప్రార్థనాత్మకమైన సంస్కృతగీతంతో ఆరంభం అవుతుంది. ఇది ముక్త పద గ్రస్త లీలాదరువుగా పేర్కొనబడింది. తరువాత సురటి రాగంలో అంతర్లాపిక, రేగుప్తిలో బహిర్లాపిక, కల్యాణిలో కుసుమ సుకుమారాంగి, పంతువరాళిలో ద్విప్రాస రతిరణ నవ్వ దరువు, హిందోళ వసంతంలో విషమ సమస్యాపూర్ణ క్రమా లంకారము, మధ్యమావతిలో సర్వాంగ సఫల—భోగినీ సంవాద ములు, కల్యాణిలో అనూఢ—పూఢాత్వవాదములు, నాదనామ క్రియలో పొంగ పతంగ తులిత మృగాంగ సుందరి, బేగడలో షడ్భాషా భిన్న చరణము అనే దరువులు ప్రదర్శించి భద్రకాళి, సవ్యాపసవ్య సమపద లీలను రేగుప్తిలో అందుకొని, క్రమంగా రాగాంతర కల్పన చేసి, సురటిలోనికి విన్యసించి, త్రికాలము లలో సప్తతాళములతో విస్తరించి, వివిధ రీతులతో ఆడి పాడి వినిపిస్తుంది. ఈ సందర్భంలో తురంగలీల, రాజచూడామణి, మదన, వీరవిక్రమ, హంసనాద, అనంగ, జయశ్రీ మొదలైనవి అంతుతాళాలుగా పేర్కొనబడ్డాయి. ఈ అంకం చివర శాహాజీ : "సకలభాషా కవన నిర్వాహక యశఃకర్పూర సారక రండప త్పద్మజాండః" అని తన్ను గూర్చి చెప్పుకున్నాడు.

పంచమాంకంలో భద్రకాళి త్యాగేశుల వాదోపవాద రూపమైన కథావస్తువు మళ్లీ కొంచెం గోచరిస్తుంది. ఇందులో ఏక, ద్వి, త్రి, చతుః పంచాక్షరాత్మకములగు దరువులు శృంగార వైరాగ్యాలను వేర్వేరు రీతులలో ప్రబోధించేవి ఉన్నవి. వీనిలో కొన్నిటికి త్యాగేశుడు 'స్వరజతి' వినిపింపగా వానికే భద్రకాళి 'స్వరసొల్లు' వినిపిస్తుంది. రమారమి ఈ అంకం చివర 'సవ్యాపసవ్య బిన్నార్థదరువూ', 'సర్వ శబ్దార్థ లాక్షత్రింశ త్సవర్ణ ప్రబంధపేలా' ప్రదర్శింపబడ్డాయి. వీనిలో మొదటిది సకళగిలియందు భాషాద్వయ అర్థద్వయ రాగ ద్వయములలో స్వర మొక్కటిగా అనులోమ, ప్రతిలోమ ప్రక్రియలలో ప్రదర్శింపబడింది. రెండోదాన్ని విన్యసించే సందర్భంలో సింహలీల, హంసలీల, మల్లికామోద, అంతరక్రీడ, తురంగలీల, దీపకం మొదలైన రాగాలూ, కుడుక్క, ముకుంద, షట్పితాపుత్ర, సంపద్వేష్టు, బసవశంకర, హసుమత్కుంభము మొదలైన తాళాలూ పేర్కొనబడ్డాయి. 'రస శివాఖ్య నమపద లీల ఉత్తర ప్రత్యుత్తర దరువు' తో ఈ అంకం పరిసమాప్త మవుతుంది.

'సమనుక్రమ త్రిమూర్తి వందవలీలా సమర్పణదరువు, పంతువరాళి రాగంలోనూ ఆదితాళంలోనూ ఎత్తుకోవడంతో ఆరోఅంకం ఆరంభం అవుతుంది. ఇందులో కవితా లతా సుమామోద ప్రకటనము, సంపూర్ణ పాదైక యమకము, అనేక కోశ శబ్దార్థ సంగ్రహణ పదార్థమూ, భావ నిగూఢ వ్యంగ్యార్థమూ, అంత్య స్వరద్వయ సమవర్ణార్థము, పదైక దేశాక్షరాన్యార్థము, క్రమసప్త స్వర వర్ణలీల, సవ్యాపసవ్య భాషా ద్వయ దరుద్వయ తాళద్వయ లీల అనేవి ముఖ్యంగా పేర్కొనదగ్గవి. పరమశివుని 'దండపాద తాండవం' వివిధ స్వరకల్పనలలో ప్రదర్శించిన అనంతరం భద్రకాళి త్యాగేశుల వివాహ మంగళంలో గ్రంథం పరిసమాప్త మవుతుంది.

ఇందులోని దరువులూ, చూర్ణికలూ, ప్రసంగాలూ చాలావరకూ సంస్కృత మహారాష్ట్ర భాషలలో రచించబడ్డాయి. మధ్య మధ్య అరవము, తెలుగూ, కన్నడమూ కూడా ఉపయోగింపబడ్డాయి. దరువులను వేర్వేరు భాషలలో వివిధములైన రాగతాళ భేదాలలో విస్తరించి ప్రసరించడం, ఒక్క దరువులోనే అనేక భాషలతోపాటు రాగతాళ వైవిధ్యాన్ని ప్రదర్శించడం, ఆ రచనలో అనులోమ, విలోమ ప్రక్రియల నేర్పరచి స్వరకల్పనలు కూడా చూపడం, శబ్దాలంకార వైచిత్రీ ప్రదర్శన మొదలైనవన్నీ చూడగా శాహజీ కేవల

చోళ సామ్రాజ్యాధినేతగానే గాక, సంగీత సాహిత్య చక్రవర్తిగా కూడా గోచరిస్తాడు. ఇందులో ఉన్న భరత విద్యా ప్రక్రియా వైవిధ్యాన్ని నిదానంగా పరిశీలించి చూస్తే ఈ గ్రంథం యక్షగానాల్లోనే కాదు, మొత్తం ఆంధ్ర వాఙ్మయంలోనే అపూర్వ రమణీయంగా కనిపిస్తుంది.

(ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రమువారి సౌజన్యముతో)

# తగ్గుతున్న తారలసంఖ్య

తెరమీద సాటిలేని ''ప్రియుడు''గా ఉంటూ ఉండడం వల్ల మీ కేమనిపిస్తున్నదని ఒక విలేఖరి క్లార్క్ గేబిల్‌ను అడిగాడు. ''అది బ్రతుకు తెరువు'' అని ఆయన ముక్తసరిగా సమాధాన మిచ్చాడు. తన స్టూడియోకి అది బ్రతుకు తెరువు చూపించిందని కూడా ఆయన చెప్పి ఉండవలసింది. ఎందుకనంటే నేడు నటులనేవారు కొద్దిమంది. వారిలో ఈ అపరూప లక్షణం కలవారు బహు కొద్దిమంది. అందువల్ల ఆ లక్షణాన్ని ఉపయోగించుకున్నవారికి అశేష లాభాలు ప్రాప్తించాయి.

1920—30 సంవత్సరాలలో ముఖ్యంగా హాలీవుడ్‌లో సినిమా పరిశ్రమ ఒక రూపం పొందింది. అలా రూపం పొందడానికి ''తారలను తయారు చేసి, ప్రజలకు చూపే పద్ధతి'' కారణమైంది. నూతన కథా ప్రదర్శన పద్ధతిలో నైపుణ్యం గల నటుణ్ణి తీసుకు రావాలనేది ప్రాధాన్యము కాదని పెద్ద పెద్ద ఫిల్ము నిర్మాతలు తెలుసుకొనడం జరిగింది.

రోజు రోజుకూ పెరుగుతున్న ప్రేక్షకులను ఆకర్షించేది కేవలం తారల రూపు రేఖలు అని తేలింది. నటనా శక్తి లేకపోవడం ఒక లోటుగా కనబడలేదు. ఎందుకనంటే చిన్న చిన్న ''టేక్స్'' ద్వారా సన్నివేశాలను గుది గుచ్చే వింత పద్ధతిలో ఫిల్ము తయారు అవుతుంది. అందువల్ల ఆ క్రమంలో నూతన నటునికి డైరెక్టరు ప్రతి సన్నివేశంలోను మార్గదర్శకుడుగా ఉండి, అతనిని రూపొందించడానికి అవకాశం కలిగింది. ఈ విధంగా నటనా నైపుణ్యం అనేది తక్కువగా ఉన్న వారిలో కూడా తారల లక్షణాలు తయారు చేయడానికి సాధ్యపడింది.

ప్రథమంగా స్టూడియో అధిపతులను ఎదుర్కొన్న సమస్యలు రెండు. ఒకటి—తార లక్షణ మేమిటి? రెండు—మొదటి దానికన్నా ముఖ్యమైనది—దానిని అసలు కనుక్కోటం ఎట్లాగు? ఈ ప్రశ్నలు ఫిల్ము పరిశ్రమ పుట్టినప్పటినుంచి పీడిస్తున్నవే. నైపుణ్యానికి లోటు ఎప్పుడూ లేదు. పోతే, నైపుణ్యాన్ని గుర్తించగల నైపుణ్యమే లోపం.

తారత్వం నిర్వచన చేయడానికి ప్రయత్నించేముందు నటునికి ప్రేక్షకునికి మధ్యగల బాంధవ్యాన్ని గ్రహించడం అవసరం. ఈ సంబంధం సన్నిహితమైన వ్యక్తిగత సంబంధం. అందుకని నాటకం ప్రదర్శించేటప్పుడు సహృదయులైన ప్రేక్షకులు నాటకం జయప్రదమవడానికి తోడ్పడతారు. ప్రేక్షకుల ఉత్సాహము రంగస్థలంమీద నటులకు ఎంతో ఉత్తేజాన్నిస్తుంది. ప్రేక్షకుల ధోరణిని బట్టి నటుడు తన నటనా విధానాన్ని దిద్దుకుంటాడు.

అయితే సినిమా నటునికి అలాంటి వీలులేదు. అతను తన నటనంతా నిర్జీవమైన కెమెరా కన్నుముందు ప్రదర్శించాలి. అది ఏమనుకునేది చెప్పదు.

కాబట్టి సినీ నటుడు తారగా ప్రకాశించాలంటే నిర్జీవము, వర్ణ రహితము అయిన తెరనుండి తన వ్యక్తిత్వాన్ని ప్రేక్షకుల మీద ప్రసరించి, నాటకంలో రంగస్థలంమీద నటునివలె ప్రేక్షకులకు తనకు మధ్య అనుబంధాన్ని సాధించాలి. ''ఆవిడ కెమెరాను పెళ్ళి చేసుకుంది,'' అని మార్లిన్ మన్రోను గురించి మాట్లాడుతూ సైబిల్‌థారం డైక్ అన్నాడు. దీనిని అర్థం చేసుకుంటే ఆవిడ పైకి రావడానికి కారణం తెలుస్తుంది. ఆవిడకు కెమెరా కేవలం జీవ రహితమైన యంత్ర పరికరం కాదు. ఆమె కెమెరాను ప్రియుడుగా భావిస్తుంది. ప్రజ్ఞావంతులైన డైరెక్టర్లు కూడా తరచు ఈ విషయం గ్రహించలేకపోతూ ఉండేవారు. సెట్టుమీద బాగాలేని ఆమె నటన, తీరా తెరమీద చూసేసరికి ఎంతో బాగా ఉండడం జరిగేది.

కెమెరాతో ఈ విధమైన అనుబంధం పెద్ద తారలందరికీ ఉండేది. ఈ నైపుణ్యం చాలావరకు స్వతహాగా ఉంటుంది. అందుకని తారగా వికసించే లక్షణం అసాధారణ సౌందర్యవతులలో ఉన్నప్పటికి వెంటనే గుర్తించడం కష్టం అవుతుంది. కెమెరాతో వివాహం వెంటనే నిశ్చయించడం జరగదు.

సినిమా చరిత్రలో పేరు పొందిన పెద్ద తార లెవ్వరూ ఒక్క రోజులో ప్రసిద్ధి కెక్కలేదు. చార్లీ చాప్లిన్, మేరీ పిక్‌ఫర్డ్, రుడాల్ఫ్ వాలెంటైన్, గ్రేటాగార్బో మొదలైనవారు మొదటినుంచి ఒక్కొక్కటీ నేర్చుకున్నవారే. మొదటవచ్చిన చిత్రాలలో చాప్లిన్‌ను చూచినవారు ఎవ్వరూ అతన్ని హాస్య నటునిగా అనుకోలేదు. జూనియర్ స్క్రిప్టు రైటర్ జూన్‌మాతిస్ అకస్మాత్తుగా Four horsemen అనే చిత్రంలో నాయక పాత్ర ఇచ్చేవరకు రుడాల్ఫ్ వాలెంటైన్ ఎక్స్‌ట్రాగా పని చేస్తూ ఉండేవాడు. ఆ చిత్రంతో విశ్వ విఖ్యాతుడైనాడు.

కాబట్టి నైపుణ్యం అనేది స్వతహాగా ఉండేదైనా, సాధనచేసి సాధించవలసినదే. కెమెరాతో ప్రేమబంధం మొదటి క్షణంలోనే పడదు. కాని అది సాధ్యము అని తెలిసినప్పుడు ఆత్మ విశ్వాసం అనేది కలుగుతుంది. నటునికి ఒక విధమైన బరువు తీరినట్లు అనిపిస్తుంది. స్వాభావికమైన అతని వ్యక్తిత్వము బయటపడి ప్రకాశిస్తుంది. స్వతహాగా ఉన్న నైపుణ్యము పట్టి సాధనతో వచ్చిన నైపుణ్యంకంటె ఎప్పుడూ బాగా ఉంటుంది. ఇలా అనడం అన్యాయం కావచ్చు! గ్యారీ కూపర్ కెమెరా ముందు ఏమీ నటించినట్లే ఉండేవాడు

కాదు. అలా చేయాలని ఛార్లస్ లాటన్ ఎంత ప్రయత్నించినా తనకు రాదని తెలుసుకున్నాడు. లాటన్ చివరదాకాకూడా కెమెరాతో యుద్ధం చేశాడు. నాటకం నటుడు కాబట్టి, కెమెరా ముందు హెూరు పెట్టి నటించేవాడు. అందుకని కెమెరాతో ఆయనకు స్నేహం కుదరలేదు. ఎప్పుడూ అతిగా నటించేవాడు. గ్యారీకూపర్, మార్లిన్ మన్రో లాంటివారు కెమెరాముందు నటించేవారు కాదు. కాని వారి పద్ధతి అప్రయత్నంగాను, నిర్దుష్టంగాను ఉండేది.

వారి విజయానికి కొంతవరకు డైరెక్టరు ప్రావీణ్యత కారణమని చెప్పాలి. చాలామంది డైరెక్టర్లు స్వంత అభిప్రాయాలువున్న పెద్ద నటులకు బదులు, అదివరకు నటుడు కాకపోయినా, అతనిలో ఏకాస్త నైపుణ్యం ఉందనుకున్నా వారిని తీసుకొనడానికి ఎక్కువ ఇష్టపడతారు. తారగా పెరిగే లక్షణంఉన్న నటుడు, తనకి నటనా చాతుర్యము తక్కువ అనే భావనలో పడి నటనను గురించి పాఠాలు నేర్చుకొనడం మొదలిడితే, వచ్చే ఫలితం ఎల్లప్పుడూ బాగా ఉండదు. ఎందుకనంటే స్వత హాగాఉన్న నైపుణ్యం పాఠ్య పుస్తకాల నిబంధనల నడుమ నలిగిపోతుంది. మార్లిన్ మన్రో విషయంలో ఇలా జరిగింది. ఏ నిబంధనలకు లొంగక, వాటిని ధిక్కరించి పైకి వచ్చినవారు ప్రతి రంగంలోను ఉన్నారు.

వారిలోవున్న తారా లక్షణం పైకి రావడానికి అదృష్టమనేది తప్పకుండా పని చేస్తుంది. ప్రతిభ అనేది చివరక్కెప్పుడూ గుర్తింపబడుతుందనీ, నిజమైన ప్రతిభను అణచి ఉంచడం సాధ్యం కాదనీ అనే తీయని నమ్మకానికి ఆధారం లేదు. మహామహులైన కళాకారులు ఎవ్వరికీ తెలియకుండా తిండిలేక బాధపడ్డారు. ఉత్కృష్టమైన నవలలు, పద్యాలు ఎవ్వరికీ తెలియకుండా పోయినాయి. ప్రజాభిమానం అనేది రావటం తరచు తగిన సమయంలో పుట్టినప్పుడే లభిస్తుంది.

ఈ సూత్రం సినిమా విషయంలో ముఖ్యంగా వర్తిస్తుంది. చార్లీ చాప్లిన్ సరియైన కాలంలో వచ్చాడు. ఆయన హాస్య నటన ముఖ్యంగా కంటితో చూచి ఆనందించవలసినది. శబ్దానికి ఎక్కువ ప్రాముఖ్యతలేదు. టాకీ రానికాలంలో ఆయన ఉన్నత శిఖరాలకు వెళ్లాడు. సాంప్రదాయంగా వచ్చే ఉత్తమ నాయకుని పాత్ర స్త్రీ జనానికి విసుగు కలిగించే కాలంలో రుడాల్ఫ వాలెన్టైన్‌ను ముందుకు తీసుకువచ్చారు. ప్రేమ, చమత్కారంతో కూడిన ఆతని ఆధునిక రసికుని పాత్ర వారికి నచ్చింది.

తర్వాత అనేక సంవత్సరాలకు జేమ్స్ డీన్ నచ్చడం మొదలు పెట్టాడు. ఇది మరొక రకమైన అభిరుచికి నిదర్శనం. యుద్ధానంతరం యువకులలో వచ్చిన తిరుగుబాటు భావనకు ఈయన పాత్రలు ప్రతినిధులుగా రూపొందాయి. అందుకని అమాంతం తారాపథాన్ని అందుకున్నాడు.

తారకు ప్రేక్షకునికి బలియమైన బంధం ఏర్పరుస్తుందని సినిమాను తరచు ఖండిస్తూ ఉండడం జరిగేది. కాని ఈ బంధం దేనికీ తోడ్పడకుండా ఉంది. అందుకని నేడు చిత్రాలలో వాస్తవికతను పచ్చిగా చిత్రించడం జరుగుతోంది. ఈ పద్ధతిని అనుసరించేవారు చివరికి తప్పు చేశామని విచారిస్తారు. ఎందుకనంటే సినిమా కథను చెప్పడానికి ఒక సాధనం. కథ అనేది అనాదినుంచి ఎప్పుడూ వాస్తవికతనుంచి తప్పించుకొనడానికే సాధనంగా ఉపయోగపడింది. గొప్ప వనుకున్న ప్రేమ గాథలు, సాహస పరాక్రమములతో నిండిన కథలు వాస్తవికతనుండి తప్పించేవే. యుగ యుగాలుగా మామూలు మనిషి బాధ పడేది తన జీవితం దుఃఖ దౌర్జన్య భరితమైనదనికాదు. నిస్సారంగా ఉన్నదని. కాబట్టి వాస్తవికతనుంచి మళ్లిస్తున్నదని సినిమాను నిరసించేవారు ఈ విషయాన్ని మరచిపోతున్నారు. గత దశాబ్దంపైగా సినిమా పరిశ్రమ నానాటికి తక్కువమంది తారలను తయారు చేస్తున్నది. ముఫ్ఫయ్ ఏళ్ల క్రిందట అయితే ఎవ్వరైనా వెంటనే ఒక డజను తారలపేర్లు చెప్పేవారు. ఇప్పుడు వారి సంఖ్య వేళ్లమీద లెక్కపెట్టవచ్చు. ఎలిజబత్ టైలర్, ఆడరి హేప్బరన్, బర్ట్ లాంకస్టర్, గ్రెగరిపెక్, మార్లిన్ బ్రాండో మొదలైన వారున్నారు. వీరుకాక మరికొంత మంది పేర్లు తల్చవచ్చు. వారు ఏ ఫిలింలో నటించినా ఆ ఫిలిం ప్రదర్శించినపుడు హాలు నిండిపోతుంది. కాని వీరి కోవకు చెందిన వారి సంఖ్య క్రమంగా సన్నగిలుతోంది.

వెనుకటి రోజులలో మెట్రోగోల్డ్విన్ మేయరు కంపెనీవారు తారలుగా పనికివస్తారనుకునేవారికోసం, ఎంతో ధనం వెచ్చించి తిరిగేవారు. సామ్రాజా లను పోలిన ఈ కంపెనీలు దిగజారడంవల్ల ఆ పనిని విరమించుకున్నాయి. వారికి వెనకటి డబ్బులేదు. ఓప్పులేదు.

వయస్సు మళ్లినను వారైనా అదృష్టవశాత్తు పాతవారు ఇంకా ఉన్నారు. వారి నటనా కౌశల్యం మొక్కపోకుండా ఉండి మనకు లభ్యమవుతున్నది.

నటన అనిపించకుండా ఉండే పద్ధతిని మొదట, బహుశః విల్ రోగార్సు ప్రారంభించాడు. దానిని గారికూపర్ బాగా పెంచాడు. స్పెన్సర్ ట్రేసి. జేమ్సు స్టీవర్టు ఈ పంథాను ఇంకా అనుసరిస్తున్నారు. వీరి నటన చూసి కెమెరాముందు ఉన్నామనే అనుకున్నట్లు తోచదు. నిర్మాణ పద్ధతులలో అద్భుతమైన వాటిని సాధించినా, పూర్వముండే అభిరుచి, అభిలాష ఇప్పుడు కొంతవరకు అంతరించాయి. వాస్తవికత అనేది వచ్చి ఆడంబరానికి స్థానం లేకుండా చేసింది. ఆకారణంగానేమో కొత్త తారలు రావటానికి తోడ్పడటంలేదు. పెద్ద సినిమానటి అని ఎప్పుడైనా ఎవ్వరైనా ఉన్నారా అంటే, గ్లోరియా స్వాన్సన్ పేరు చెప్పి తీరాలి. ఆవిడను నీవు ఎప్పుడో వెనక పెద్ద నటీమణివి అని ఒక రన్నారు. ఆవిడ దాని కిచ్చిన క్రింది సమా

ధానం అక్షరాలా నిజమని అనుకోవలసి వస్తున్నది. "నే నిప్పుడూ పెద నటినే. కాని తీసేచిత్రాలే చిన్నవి."

(లండన్ "టైమ్సు" సౌజన్యంతో)

# గీతాంజలి: నోబెల్ బహుమతి సువర్ణోత్సవము

## శ్రీ వాత్సవ

ప్రపంచ సాహిత్యములో ప్రథమ బహుమతి యన దగిన నోబెల్ పురస్కారము ఒక భారతీయ రచయితకు లభించడం అపూర్వం. నాటికి నేటికి ఈ మహాసన్మానము పొందిన గౌరవము ఆ రచయితకి మాత్రమే దక్కినది. ఆ పురస్కృతి పొందిన కవి రవీంద్రనాథ ఠాకూర్. ఆ బహుమతి ఆయనకు లభింప జేసిన కృతి 'గీతాంజలి'. ఇది జరిగిన ముహూర్తము 1913 నవంబరు 13. యేభై యేండ్ల క్రితం భారతీయ కవికి ప్రపంచ వాఙ్మయములో ప్రథమశ్రేణి గౌరవమిచ్చిన ఈ నోబెల్ బహుమతి ప్రదానము ఈ నెలలో సువర్ణోత్సవము జరుపుకొనుట శ్లాఘింప వలసినదే.

రవీంద్రుడు తన కవితాగానము చేసినది 'వంగభాష'లో. 1911 నుండి రెండు సంవత్సరముల వరకు ఆయన రకరకాల గీతములు రచించి గానముచేసికొనేవాడు. వానికి సంగీతము కూడా తానే యేర్పరచుకొని, ప్రార్థనా సమయంలో ఈ పాటలు పాడుకొనేవాడు. 'నైవేద్య' 'ఖేయ' 'గీతాంజలి,' 'గీతమాల్య' మొదలయిన పేరులుంచి తన ఇష్ట దైవమునకు సమర్పించి, నిర్గుణ పరబ్రహ్మ కీర్తనలుగా ఆ పాటలు పాడుకొనేవాడు. ఈ పాటలలోనే కొన్ని ఎన్నిక చేసి తన మనసుకు నచ్చినవి— ఇంగ్లీషు వచనములోనికి అనువాదం చేశాడు.

ఆ సంవత్సరం గురుదేవుడు లండన్‌లో ఉండగా కొందరి కవి మిత్రులతో ఆయనకు పరిచయం కలిగింది. వారి సమక్షంలో తన వచన గీతికలు చదివి వినిపించాడు. ఆ నాటి కవితా గోష్ఠిలో పాల్గొన్నవారు ప్రసిద్ధ చిత్రకారుడు రోథిన్‌స్టీన్, ప్రసిద్ధ కవి డబ్ల్యూ. బి. ఈట్స్. ఈ పద్యాలలో భావాలు, శబ్దచిత్రాలు, ఆలోచనా ధోరణి ఆ నాటి గోష్ఠిలో పాల్గొన్న వారికి అపూర్వముగా కనిపించాయి. వీనిని వెంటనే పుస్తకముగా మాక్మిలన్ కంపెనీ వారు ముద్రించి ఇంగ్లీషులో ప్రకటించారు. నవంబరు మాసంలో అదే సంవత్సరం రవీంద్ర కవీంద్రునికి నోబెల్ బహుమానం ప్రకటించారు. భారతీయ కవి కిట్టి పారితోషికము లభించడం నాటికి నేటికి చరిత్రాత్మకంగా నిలిచిపోయింది.

'గీతాంజలి' ఆంగ్ల మూలములో 103 గీతికలున్నవి. అవి యన్నియును ప్రార్థనా గీతముల వంటివే. ఆ ప్రార్థన —ప్రియుడు ప్రేయసికి, ప్రేయసి తన మనోనాథునకు చేసికొన్న విన్నపం వంటిది. ఇట్టిది, మన దేశంలో వారికి క్రొత్తకాదు. ఇక్కడ చైతన్య మహాప్రభువు, వల్లభాచార్యులు మున్నగువారు ప్రబోధించిన శుద్ధాద్వైత మతములోని ప్రకృతి—పురుష సమన్వయ దృష్టి యున్నది. అదే రాధాకృష్ణ ప్రేమగాను, పార్వతీ పరమేశ్వర పారమ్యముగాను భావించుకొంటూ, ఎందరో భక్త కవులు పాటలుగా పాడుకున్నారు. విద్యాపతి, ఛండీదాస్ వంటి కవులు కీర్తించిన 'పదావళి' రవీంద్రునకు పరిచితమైనవే. కబీర్ పాడిన పాటలు ఆయన స్వయంగా ముచ్చటతీరునట్లుగా అనువాదం చేసికొన్నాడు. అదిగాక వంగదేశంలో పల్లెవాళ్లు, జానపదులు పాడుకొనే బాటియాలీ 'బావుల్' గీతాలున్నవి. రామదాసు కీర్తనలు, తత్వములు ఉన్నవి. ఇవన్నీ గురుదేవునికి కంఠస్థమే. ఈ పాటలు ఆకళింపు చేసికొని తన గొంతు విప్పి, ఈ వరుసలలో, ఈ బాణీలలో క్రొత్త పాటలు పాడుకొన్నాడు. అందుచేతనే ఈ పాటలలో పాశ్చాత్య లోకానికి ఎంత మాత్రము పరిచయంకాని నిగూఢ సంకేతాలు, మార్మికతలు ఛాయా రహస్యములు గోచరిస్తాయి. సముద్ర సంగీతము, ప్రళయ వర్షరాత్రి, నావలలో ప్రయాణము, నిత్య పథికుని దూరయాత్ర ఇలాంటివెన్నో వస్తాయి. ప్రేయసీ, పేదమటీరము, ప్రేమికుని చరణ ధ్వనుల మౌన సంగీతము, దేవాలయములో ఆరాధన, భక్తి కీర్తనల ప్రార్థన, హృదయ విపంచికా గానము, నైవేద్య ఘంటలు, రథములో ఊరేగు రాజ పరమేశ్వరుని రాక, బిచ్చగాని ఆతిధ్యము, మేఘమాలికలపైన మేదుర సంగీతము ఇట్టివి క్రొత్తవి. వీనికి రూపకల్పన చేసి, ఒక గోపన విద్యగా సుందరమైన భక్తి భావనలు, ప్రేయసీ ప్రేమికుల ప్రణయ మిలనముగా చూపుట, విదేశస్థులకే కాదు—మన దేశస్థులకు కూడ నూతనముగానే కనిపించినది. చకితుల్ని చేసింది.

రవీంద్రుని గీతికలలో ప్రణయభావన అపరాధము కాదు. నిషిద్ధ ప్రేమలు లేవు. పంచేంద్రియానుభూతితో కూడిన శరీర కామనల పరితృప్తి ఒక పాప కర్మగా భావింపక, పారమార్థికమైన ప్రణయ వాల్లభ్యముతో పాటు ప్రకృతి సిద్ధమైన ప్రేయసీ ప్రియ సమాగమము సైతము ఎంతో మాననీయముగా నిరూపించెను. ఇక్కడ జరుగు బంధు పరిష్వంగము— పరమ పవిత్రమైనది. ఆధ్యాత్మికమైన అంతరంగమిలన మెంత నిర్మలమైనదో, భౌతికమైన దేహస్పర్శ సుఖానందముతో కూడిన మధుర మిలనరాత్రికూడ అంత సుందరమైనదని ఆ సంయోగ వియోగముల గూర్చి, ఆ విరహానల వ్యథల గూర్చి పాడుకొన్నాడు. ఇట్టి పాటలు భారతీయులకు క్రొత్త కావు. అంతా రాధాదేవిపై నిందలు కురిపిస్తే, ఆమె గురించి పాడుకున్న విద్యాపతివలె, గిరిధర శ్యామ సుందరుని ముందు నృత్య మొనరించిన రాజారాణి మీరాబాయివలె

రవీంద్రనాథుడు కూడ ఒక నూతన భావలహరితో ఉత్తేజితుడై గానం చేశాడు. ఆ గాన పారవశ్యంలో ఆత్మనివేదనం చేసికొన్నాడు. అదే 'గీతాంజలి'. రవీంద్రుడంత క్రితము పద్యాలు వ్రాయక పోలేదు. క్రొత్తగా కవిత్వం మొదలుపెట్టే కవి కుమారసంభవం వలెనే రవీంద్రుడు కూడ ప్రకృతిని గూర్చి ప్రణయమునుగూర్చి గానం చేశాడు. ప్రభాత సంగీతం, సాయం సంగీతం, చిత్ర—ఓ—గాన్ వంటి కావ్య సంపుటాలు అంటు మూడు రచించి ప్రచురించుకున్నాడు. వాటితో పాటు పూర్వ కవుల సంప్రదాయము ననుసరించి భాను సింహుడనే పట్టనామంతో 'భానుసింహేర్ పదావళి' యను పేరున రాధాకృష్ణ ప్రణయ కీర్తనలు కూడ రచించి పత్రికలలో ప్రకటించి గొప్ప ప్రఖ్యాతి ఆ భానుసింహుడికి సంపాదించి పెట్టాడు. కాని ఆ రచనలన్నీ ఒకతీరు, 'గీతాంజలి'లో సంపుటీకరించిన రచనలొకతీరు. ప్రయోగాలెన్నో జరిగినా కాని ఈ రచనా సంపుటాలేవీ రవీంద్రునికి తగిన మనస్తృప్తి నీయలేదు. ఒకానొక సమయంలో కలకత్తాలోని అన్నగారి గృహంలో ఉండగా ఒక వింత దృశ్యం రవీంద్రునికి గోచరమైనది. వారుండే నివాసం సముద్రమైన ఒక వీధిలో మూడంతస్తుల మేడ. రెండవ అంతస్తులో పడకగదిలో ఒక యువకుడు నిద్రిస్తున్నాడు. సూర్యోదయ మయింది. ఆ ప్రభాత కిరణ మాలికలు ప్రక్కన చెట్ల చాటునుండి వీల్చుకొని ఆ శయ్యమీద పడుతున్నవి. ఆ యువకుడులేచి చూచుకొన్నాడు. ఎదురుగా ప్రశాంతమైన కాసారం. సూర్యోదయ కిరణకాంతులు చెట్ల చాటునుండి కిటికీ చువ్వల నీదుగా, శయ్యపైన పడుతూ ఉండడంకాక, ఆ చిన్న కాసారంలోని జలాంతర వీచికలలో ప్రతిఫలిస్తూ ఉన్నవి. ఆ దృశ్యం చూడగానే ఎన్నో భావపరంపరలు వెలువడ్డాయి. చిన్ననాటి జ్ఞాపకాలు చప్పున స్ఫురణకు వచ్చాయి. తండ్రితో తాను హిమాలయ శృంగాలలో పయనించినపుడు, ఒకానొక అరుణోదయవేళ, దినమణి కాంతులు మంచు ఫలకముల పైన పడి రంగురంగులుగా మారి ఒక కాంతి వెల్లువ ప్రవహించుట, ఆ మంచుగడ్డలో దాగియున్న మహా మానసి మేల్కొన్నట్లు ఏవేవో పగటికలలు కనిపించాయి. ఈ దివ్య స్వప్నానుభూతి నొందినయువకుడే 'గీతాంజలి' కర్త రవీంద్రుడు.

ఆ అనుభవాలన్నీ సేకరించి ఆతడొక గీతం పాడుకొన్నాడు. అదే నిర్ఝరిణీ స్వప్న భంగము. ఆ గీతమే ఆతని కవితా రంగంలోనే కాక జీవిత రంగములోనే క్రొత్త మలుపు తీసికొని వచ్చినది. నాటినుండి ఆతని జీవన దృక్పథమే మాడిపోయినది. ఇదివరకు కోపదారిగా విసుగుగా అందరినీ ఈసడించుకునే మనిషి అందరినీ ఆప్యాయంగా అనురాగంగా చూడటం మొదలుపెట్టాడు. ఇదివరకు మారుమూల చెత్తగా తోచిన గడ్డిపరక కూడ మంచు ముత్యాలు దాల్చి, మనోహర తృణ కంకణముగా కనిపించిన దతని క్రొత్త చూపులకు.

ఈ సమయంలోనే రవి జీవితంలో జరిగిన ఒక చిన్న సంఘటన గూర్చి వ్రాస్తూ "నిర్ఝరిణీ స్వప్న భంగము" తన జీవితములో తెచ్చిన నిర్మల వాతావరణమును గూర్చి వర్ణించుకొన్నాడు. ఒక పిల్లవాడు మనశ్శాంతిలేక తిరుగుతూ ఎవరి దగ్గరకో వెళ్లితే, ఆ సాధువు చెప్పాడు, 'కాళికామాత భవతారిణీ దేవిగా అవతరించింది, ప్రొద్దున్నే లేచి ఆమెను ఆరాధిస్తే నీకు మనశ్శాంతి లభిస్తుంది. వెళ్లు" అని. ఆ ప్రకారమే ఆ కుర్రవాడు రవీంద్రుని వద్దకు వచ్చాడు. అర్థించాడు. సామాన్యముగా అలాంటి వాళ్లు వస్తే రవీంద్రుడు దర్శనమే ఇచ్చేవాడుకాడు, ఇచ్చినా నాలుగు కేకలువేసి పొమ్మనేవాడు. అటువంటి మనిషి ఈ పిల్లవానిని చూచి ఆదరించి తమ ఇంట్లో ఒక గదిలో ఉండుమని వసతి ఇచ్చాడు. ఆ పిల్లవాడు కొన్నాళ్లుండి, చివరికి ఆ ఇంటిలో ఏదో కాజేసి వెళ్లిపోయాడట. రవీంద్రుని మనస్సులో వచ్చిన పరివర్తనకిది నిదర్శనము.

నాటినుండి ఆతడు గొప్ప నిష్ఠతో గేయములు రచించి పాడటం మొదలుపెట్టాడు. ఈ పాటలలో పూర్వ ఋషి పుంగవులు చెప్తూ వచ్చిన ఉపనిషత్ సుధాధార, సాధువులు ప్రవచించిన వేదాంత తత్త్వ రహస్యములు, భక్త కవులు కీర్తించిన ప్రణయ గీతాలు, సూఫీతత్త్వ విశారదులు వినిపించిన సాకీ—రుబాయీలూ. ఇవన్నీ ఒక వినూతన సౌందర్యంతో, ఒక మనోహర దివ్య సంగీతంతో కవి హృదయానికి తోచినవి. వీటిని మనస్సుతో పూర్తిగా అనుభవించి తన కేర్పరచుకున్న పరిభాషలో, తన పాటలకు కుదిరిన సంగీతముతో, తన భావాలకు సరిపోయిన భాషామృతముతో చక్కని రచనలు చేయడం మొదలు పెట్టాడు. అవి చూడగానే ఒక ఆనందంతో, అవి చూడగానే ఒక తన్మయత్వంతో కవిగాయక భక్త శిరోమణి అయిన రవీంద్రుడు 'గీతాంజలి' ఘటించి నిలువబడ్డాడు. ఇది, పాశ్చాత్యులకు, ఆ సభ్యలోకమున వెంపసిన విమర్శకులకు అపూర్వంగా లోచింది. ఈ రసమాధురి వారికి మొగము మొత్తించి నట్లయింది. ఈ సంగీత మాధుర్యం వారిని లోలుపుల్ని చేసి, అన్ని చోట్లను అన్ని వేళలను వెంటాడిస్తూన్నట్లు తోచింది. ప్రఖ్యాతకవి, విమర్శకుడు అధ్యాపకుడు అయిన ఎడ్వర్డ్ థాంప్సన్‌ను ఈ మధురిమము (Haunting Melody). వెంబడిస్తూ ఎప్పటికీ విడువలేదట.

అయితే దీనిలోని వేదాంతము, ప్రణయ రహస్యము ప్రకృతి భావన, అధ్యాత్మిక సౌందర్యము యూరపులోని వారికి అర్థంకాలేదు. అందుచేత వారికి అవగాహన అయ్యేటట్టు ఒక వ్యాఖ్యానం కావలసి వచ్చింది. అది సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు చేసి, 'ది ఫిలాసఫీ ఆఫ్ రవీంద్రనాథ్ ఠాకూర్' అనుపేరున ఒక విపుల గ్రంథం ప్రకటించారు. దీనిని 'గీతాంజలి' వంటి రచనలు ప్రకటించిన ప్రకాశకులే ప్రకటించి, గొప్ప ప్రచారంలోనికి తీసికొని వచ్చారు. రవీంద్రుని ప్రభావం వలన రాధాకృష్ణన్ వలన రవీంద్రుడు పాశ్చాత్య లోకానికి మరింత పరిచితులయ్యారు. అప్పటి నుండి, యూరపులోని అన్ని భాషలలోనికి 'గీతాంజలి' అనువాదం

పొందినది. ఇటీవల— యూరపులోనే కాక ప్రపంచములో అన్ని భాషలలోనికి 'గీతాంజలి' అనువాదం పొందినది. చీనా, జపాను, ఇండోనీషియా, లంక, బర్మా, థాయిలెండు భాష లలో సైతము గీతాంజలి వెలువడినదంటే దాని ప్రాశస్త్యము మనము ఊహించుకొనవచ్చును.

భారతీయ భాషలలోనికి కూడ—ఇంచుమించు అన్ని ప్రాంతీయ భాషలలోను రవీంద్రుని గీతాంజలి వెలువడి నది. మూడేండ్ల క్రితం జరిగిన రవీంద్ర శతజయంతి సందర్భమున దేశముతో అన్ని భాషలలోనికి "ఏకోత్తర శతి" పేరున 101 పద్యములు భాషాంతరీకరణము చేయించి కేంద్రసాహిత్య అకాడమీ ప్రచురించినది. అంతేకాక వంగ ప్రభుత్వం రవీంద్రుని సంపూర్ణ గ్రంథావళి ప్రచురించు టతో పాటు, 'గీతాంజలి' చౌక ప్రతి ముప్పావలా వెలకు ప్రచురించి, ఒక లక్ష ప్రతులకు పైగా విడుదలచేశారు.

## తెనుగులో గీతాంజలి

తెనుగులో—'గీతాంజలి' వెలువడిన ఈ యేబది యేండ్ల లోను పాతిక మంది అయినా అనువాదాలు చేసి ఉంటారు. వానిలో ఎక్కువభాగం ఇంగ్లీషు నుండి చేసిన కారణం చేత మూలానికి చాలా దూరమైపోయి, అసలే నిగూఢమైన అర్థాన్ని మరింత క్లిష్టతరం చేసివేశారు. ఇలాగే పలువురు రచయితలు, ఇంగ్లీషుకి వెలువడిన హిందీ, తెనుగు అనువాదా లకు తిరిగి తెనుగు చేశారు. ఇన్ని విధాలుగా రూపాంతరాలు పొందిన కారణంచేత మాతృకలోని భావ పరంపరగాని, భాషా మాధుర్యం కాని, రాగసుధారసము కాని తెలుగువారికి అందకుండానే అల్లంత దూరములో శిలా మాత్రం గానే ఉండిపోయినవి, ఇవన్నీ యింత నికృష్టస్థితిలో ఉండ టానికి కారణం, వంగ భాషలోని భావధారకాని, అది చేపట్టిన పరిభాషలోని సంకేతములు కాని అనువాదకు లెంత మాత్రము అర్థము చేసికోక పోవడమే. నిజానికి ఇలాంటి అనువాదాలు సాధించే ప్రయోజనం ఉండదు. అయినా ప్రతి సంవత్సరను ఒకటి రెండు క్రొత్త అనువాదాలు వస్తూనే ఉన్నవి. కేంద్ర సాహిత్య అకాడమీ వంటి సంస్థల పోషణ వల్ల ఆర్థికలాభం పొందిన అనువాదాలు కూడ అర్థహీన స్థితిలోనే ఉన్నవి. తెనుగువారు, ఆంగ్ల, వంగ భాషలలో చదువకుండ సరాసరి ఈ 'గీతాంజలి'ని తెలుగులో చదువు కొంటె, ఇట్టి యసంగతమైన యవ్యక్త గీతాలకు నోబెల్ బహుమతి యెవరిచ్చారన్న ప్రశ్నతో ఆశ్చర్యపడవచ్చును. పొందిక లేని ఈ పునరుక్తులలో పొదివిన కవిత్వ గాంభీర్య మేమి యనవచ్చు. ఇంత వరకు వచ్చిన అనువాదాల స్థాయిని బట్టి రవీంద్రుని గీతాంజలికి మించిన కృతిక, ఈ మహో న్నతుని భావములను ఆంగ్ల, వంగ హిందీ భాషలలో దేని నైన చదివి తెలిసికోవచ్చును. ఈ మూడు భాషలలో [illegible] తెలియనివారు, మాతృ భాషలోనే [illegible] సిపిక అవసరమేమో! రవీంద్రుని [illegible] అనువాదములు చెప్పి [illegible], ఆ భావాలను స్వంతము చేసికొని [illegible] కనిపిస్తుంది.

ఈ విధముగా అనువాదములు [illegible] పుణికి పుచ్చుకొన్న ఒక గీతము [illegible].

కోసి కొనుము ఈ కోమల కుసుమము
కోరి విరిసె నీకోసమె స్వామీ
తేనెల సోనలు చిలకుచునుండె
తీయని వలపులు [illegible]
కోసి కొనుము ఈ కోమల కుసుమము
కోరి విరిసె నీ కోసమె స్వామీ
విడిన రేకులను వడలి పోవునో
తొడిమ వీడి పెనుధూళి రాలునో
చెడునో వికసించిన శోభలు
ఒడలు పులకరింపగ నిపుడే
కోసి కొనుము ఈ కోమల కుసుమము
కోరి విరిసె నీకోసమె స్వామీ— !

—వేదుల వారి దీపావళి నుండి

దీనికి మాతృక

ఛిన్నకరేలావు మోరే
ఆర్ విలంబ్ నాయ్
ధులాయ్ పడే ఝరే పడి
ఏయ్ జాగే మోర్ భయే

రవీంద్రుని గీతాంజలిలోని గీతికలు పలువురు తమ కావ్య మాలికలో గ్రుచ్చుకున్నారు. అట్టి వారిలో దేవుల పల్లి కృష్ణశాస్త్రి గారొకరు. కొన్ని పదములుబదులు మాస చిత్రాలు రవీంద్రుని గీతాంజలిని తలపించును. ఇట్టి రచ యితల ఛాయానువాదముల వలన తప్ప రవీంద్రకవి రచనలకు— ముఖ్యముగా గీతాంజలికి తగిన మంచి అనువాదము తెనుగులో రాలేదు. నాడు, బ్రహ్మసమాజ కవులయిన ఆది పూడి సోమనాథరావుగారు, కృష్ణశాస్త్రిగారు ఛాయానుకరణలో చేసిన ప్రార్థనా గీతములు కొంతవరకు రవీంద్రుని గీత సౌందర్యమును తెనుగువారికి అందించినవేమో! కాని నేడు విఫణి వీథుల లభించే అనువాదాలేవీ—రవీంద్రుని భావ పరంపరకు అంచుల పరిసరాల నయినా ముట్టుకోలేకపోయినవి. ఉదాహరణముగా 'చిత్త జెథా

భయ శూన్యా' (where the mind is without fear) అనే గీతానికి తెనుగు అనువాదాలు చేసిన ధోరణులు పర్యాలోకన చేస్తూ 'భారతి'లోనే[1] ఒక వ్యాసము ప్రకటితమైనది. మరియొక గీతిక అనువాదమును పరామర్శ చేసిన యెడల తెనుగులో రవీంద్రుని గీతములు పొందిన రూపాంతరములు విశదము కాగలవు. ఇది ఇంగ్లీషు గీతాంజలి లోని చివరి గీతము. (In one salutation to My God) అని ప్రారంభమగును. ఇది బెంగాలీలో పాటగా ఒక పల్లవితోను, అనుపల్లవితోను చరణములతోను ఉన్నది.

ఏక్‌టె నమస్కార్ ప్రభూ
ఏక్‌టె నమస్కారే
సకల దేహ లుటియే ఽడూక్
తోమార్ ఏ సంసారే!
ఘన శ్రావణ మేఘేర్‌మతో
రసేర్ భరెనమ్రనతో
ఏక్‌టె నమస్కారె ప్రభు
ఏక్‌టె నమస్కారె
సమస్త మన్‌పడి యాథాక్
తవ భవన ద్వారే
నానా సురేర్ ఆకుల్ ధారా
మిలియెదియే, ఆత్మహారా
ఏక్‌టె నమస్కారే ప్రభు
ఏకటె నమస్కారే
సమస్తగాన్ సమాప్తహోక్
నీరవ పారావారే
హంస జేమన్ మానస—యాత్రీ
తేమ్‌నీ సారా దివస—రాత్రి
ఏక్‌టె నమస్కారే, ప్రభూ
ఏక్‌టె నమస్కారే
సమస్తప్రాణ్ ఉడే చలూక్
మహా మరణ పారే.

ఇది చరమ గీతి. మహా మరణ తీరములో సమస్త ప్రాణములు ఎగిరి వచ్చిపడునట్లు ఒక్క నమస్కారముతో ఒకే నమస్కారముతో ప్రభూ! నీ జగత్తులో తన సమస్త దేహమును రాలి పడనిమ్మని భక్తుని ప్రార్థన. ఈ పాటలో సంస్కృత శబ్దములన్నీ తెలుగు వారికి తెలిసినవే. పల్లవిలో 'నమస్కారము' తెలుగు వారికి పరిచితమే! అయినా అను వాదకులలో చాలమంది ఆ మాటే వాడలేదు. చూడండి ఈ యనువాదం.

ఒక ప్రణామమున ఇంకొక ప్రణామమున ప్రభు!
తనువెల్ల యీ యిలాతల మందె నీ పదాం
చలమందె ఆనందపుల కోల్లసితమగుత !
శ్రవణాంబుదము గతి రస బాష్ప భారనతి
మనము నీ మందిర ద్వార తోరణ మగుత !
నాగానమున సర్వ రాగాళి ఏకాపగాగతిని
నీరవాన సాగరము చొరు గాక !
హంస మానస యాత్ర నహర్నిశ మెగురు గతి
ప్రాణమా మరణము యాత్రా ప్రవణమగుత !

—బి. వి. సింగరాచార్య.

మాతృకలోలేని 'పదాంచలము', 'ఆనంద పులకోల్లసితము' 'భాష్పభారనతి', 'ద్వారతోరణము', 'యాత్రా ప్రవణము' ఇటువంటివి వచ్చాయి. భావము మంరిత క్లిష్టము చేయ్య డానికి ఈ వ్యర్థ పదాలు యథాశక్తి పనిచేశాయి. మరొక అనువాదం చూడండి.

'హే ప్రభో ! వరం మే దేహి
ఏకైక ప్రణిపాతేన యేన
మమేంద్రియాణి సర్వాణ్యభిసరంతు
సర్వం విశ్వం సంస్పృశ్యత్వా మభిసరంతు.
యథా వ్యపగత నివాసాః శ్వేతహంసా నక్తం దిన ముడ్డీయమానాః
నిజ శైలాంతర్గత కులాయేష్వుపవిశంతి
తథ్యై వేదం మమ జీవనం ప్రభు
నిజగృహం ప్రాక్తన ముపైతు—ఏకైక ప్రణిపాతేన!

—దుర్గానంద్.

తెలుగుభాష సరిపోనట్లు సంస్కృతంలో చెప్ప పోయి గీర్వాణంలో కూడా అపార్థం చేసుకొన్న అనువాదం ఇది.

ఇంకొకటి తెలుగు వచనంలో చేసింది, 'చెలం' గారిది.

''ఒక్క నమస్కారంతో, ఈశ్వరా ! నా ఇంద్రియా లన్నీ విస్తరించి యీ ప్రపంచాన్ని నీ పాద సన్నిధిలో స్పృశించనీ !

కురియని నీటి భారంతో, వాలిన ఆషాడ వర్ష మేఘం వలె ఒక్క నమస్కారంతో నీ ద్వారం వద్ద నా మనస్సు కిందికి వంగిపోనీ ! వివిధ రాగాల్ని ఏకం చేసుకుని నా పాటల్ని ఒక్క నమస్కారంలో నీరవార్ణవంలోనికి ఏకవాహినిగా ప్రవ హించనీ.

---

1. భారతి ఫిబ్రవరి 1961

ఇంటిపై మరులుగొని తమ పర్వత నికేతనాల్లోకి రాత్రిం బవళ్లు ఎగిరిపోయే కొంగల గుంపు మళ్లీ ఒక్క నమస్కారంలో నా జీవితం సంపూర్ణంగా తన అంతరహిత నివాసానికి ప్రయాణం కానీ—'' ఈ యనువాదంలో శ్రావణ మేఘాలు ఆషాడ మేఘా లయ్యాయి. హంసలు కొంగ లయ్యాయి. మహామరణ పారము ఎగిరి చక్కా పోయింది.

ఇలాగ తెలుగులో వచ్చిన అనువాదాలన్నీ చూపించ వచ్చును. మూలములోని భాష భావము తెలిస్తే ఈ యనువాదము లింత అర్ధరహితంగా ఉండేవి కావు. కాని ఏ సంకోచము లేకుండా అనువాదకులు 'గీతాంజలి' కి క్రొత్త అనువాదాలు వ్రాస్తూనే ఉన్నారు. నేల విడిచిన సాము చేస్తూనే ఉన్నారు. కవీంద్రుడు రవీంద్రుని రచనలు యథాశక్తి చిత్రవధ గావిస్తూనే ఉన్నారు. ఈ యనువాదకుల నుండి రవీంద్రుని రక్షించే ఉపాయం లేదేమో !

'గీతాంజలి' కి సువర్ణోత్సవము జరుగుతూన్న సమయంలోనైనా ఒక మంచి అనువాదం తెలుగులో వస్తే బాగుండును అని సహృదయులకు అనిపించక తప్పదు. రవీంద్ర సారస్వతాభిమానుల ముచ్చట తీర్చడానికి, రవిని ప్రదీపముతో చూపించే ప్రయత్నమైనా ఒకటి జరుగవలసి యున్నది. అది ఎవరివల్ల జరుగుతుందో ఎప్పటికో !

# జాజ్ సంగీతము*

## శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు

దక్షిణ భారతదేశమునందు, అందునను మదరాసు నగరమునందు రసికులకు తమ దేశియ సంగీతమును వినడమేకాకుండ పరదేశముల సంగీతమును విని ఆనందించు రసజ్ఞతకూడ బాగుగా అలవడినదని చెప్పవచ్చును. హిందుస్థానీ సంగీత కచ్చేరిని మదరాసులో దాక్షిణాత్యులు విని ఆదరించు రీతులను బాగుగా పొగడి, తృప్తి చెందినవారు శ్రీ రవిశంకర్, బడే గులామ్ ఆలీ మొదలగు ఉద్దండులు. ఇట్టి అలవాటు ఉత్తర హిందుస్థానపు రసికులలో చాల అరుదు. కర్నాటక సంగీతములోని అనుస్వరములు, గమక ప్రాధాన్యత, సర్వ లఘు పోషణ వారికింకా అంతగా బోధపడలేదు. ఎవరికయిన ఇతరుల సంగీత పద్ధతులు తటాలున నచ్చవు. కొంత పరిశ్రమ కావలయును. ఓపికగా విని ఆ సంగీతము పద్ధతులలోని విశేషములను ముందుగా తెలుసుకొని ఆ సంగీత ప్రదర్శనలకు వెళ్లుట మంచిది. హిందూస్థానీ సంగీతములోని రాగము, శృతిపక్వత, వాద్య విద్వాంసుల నిపుణత, వారి తబలా—మనకు బాగా అర్థము కాగలవు. కొంత విలంబమునకు అలవాటు పడిన వారి సంగీతము శ్రోత్రానందకరము లయి, ఆత్మను వశపరచుకోగలవు. కాని పాశ్చాత్య సంగీతమును వినడం అంత తేలికకాదు. భారతీయ సంగీతమునందు అతి ముఖ్యములనదగునవి అచ్చట మనకు గోచరించవు. గాత్ర సంగీతము మాట అటుండనిండు. వాద్యముల సంగీతము ముందుగా వినడం మంచిది. ఆధార శృతి మనకు ఎంత ముఖ్యముగా నుండునో—వారియందు అంత కంత అంతర్థానమయ్యి యుండును. ఇక 'రాగప్రధానం సంగీతం' అన్న అలవాటుకు స్వస్తి చెప్పవలయును. మనము మన సంగీతమును వినే అలవాట్లను పూర్తిగా ఒక మూలకు కట్టిపెట్టిన తరువాతగాని పాశ్చాత్య సంగీతమును వినజాలము. కాని సంగీతము అనిపించుకొనుటకు కావలసిన నాద శిల్పము అందరికీ అన్ని పద్ధతులకు సమన్వయించి తీరవలసినదే గదా. స్వరపారిశుద్ధ్యము, చక్కని సాధనా బలము, అనేక స్థాయిలందు నానా విధములయిన మార్పులతో కష్ట సాధ్యములగు సంగతులను అవలీలగా, ఇంపుగా, నిండుగా వాయించు నేర్పు అందరికీ గుర్తింప వీలుండును. తాళములందలి బిగువు, వారికీ కద్దు. కాని పాశ్చాత్య సంగీతమునకు రాగము ముఖ్యముకాదు. వారికి 'హార్మనీ' ముఖ్యము. హార్మనీ అన్నది మన సంగీతమునందు తంబూరవల్ల కలుగుతుంది. స—ప, స—మ, స—గా (అంతర గాంధారము) ఒకే సమయమందు ధ్వనించినా అవి బాగా కలిసి చెవికి ఇంపు నివ్వగలవు. తంబూర తీగయందు కొన్ని తావులయందు వ్రేలితో కొద్దిగా తాకిన 'ప', 'గ', 'ద', 'రి'—స్వరులు, తార, అతి తార స్థాయిలో వినడం అందరికీ అనుభవమే. వాటిని Upper particls అంటారు. అట్టి ధ్వని విశేషములను ఏర్చి కూర్చి ఒకే సమయమందు సమ్మేళవింపజేయు పద్ధతి Harmonisation (హార్మనైజేషన్). అట్టి స్వరములను ఒకటి తరువాత నొకటిగా వాయించుటకయి ఏర్పడిన పద్ధతి, రాగ పథకము, నాధారముగా గొన్నది Melody system.

పాశ్చాత్య సంగీతమునందు శాస్త్రీయ సంగీతము, లలిత సంగీతము, జానపద సంగీతము, భక్తి గీతము, జానపద సంగీతము, భక్తిగేయములు, గేయ నాటకపు రీతులు అన్నియూ కలవు. మన ఆధార శృతిని, రాగ ధోరణిని పూర్తిగా మరచి వారి సంగీతమును వినవలయును. అనేక స్వరములను ఒక సమయమునందే విని, గుర్తించి. ఆనందించు అలవాటు అలవర్చుకోవలయును. అట్టి ప్రయత్నము లేనప్పుడు పాశ్చాత్య సంగీతము అగమ్య గోచరముగా నుండును. మరీ ఆ శాస్త్రము తెలియనివారికి వారి ప్రదర్శనలందు శంకరాభరణము, అందులోని అన్య అప–స్వరములు చెవికి కరుకు మనును. రాగధోరణికి—చెందనివి గనుక—అవి అప స్వరములను కోవడము మన అలవాటులోని పొరబాటు. శంకరాభరణమును గ్రహభేదము చేసిన మన ౧, ఖరహర ప్రియ, తోడి, కల్యాణి, హరికాంభోజి రాగాలు ధ్వనించును. కాని పాశ్చాత్య రీత్యా అవన్నీ శంకరాభరణ స్వరాలే. స. ప— రెండు స్వరాలకు ఇతర స్వరములకు వచ్చు కంపనము, తదితర గమకాలు రావడమువల్ల మనకు కొంత

* మద్రాసులో అక్టోబరు 6, 7 తేదీలలో అమెరికా నుంచి వచ్చిన డ్యూక్ ఎల్లింగ్టన్ బృందం జాజ్ సంగీత కచ్చేరీ జరిగింది. అది విన్న తర్వాత వ్రాసిన వ్యాసము ఇది.

నెగటు కల్గవచ్చును. ఇదీ మన అలవాటు మూలమున వచ్చిన లోపమే. మన పద్ధతిలో 'స', 'పా' లకు గమకము లుండరాదు.

ఇక పాశ్చాత్య సంగీత పద్ధతిలో మన గమకాలుండవు. పూర్ణత్వమును, ప్రణవత్వమును ఉద్దీపించు స్వరములతో వారి నాద ఘోష ప్రజ్వరిల్లును. మనోధర్మమునకు తావు తక్కువ, అసలులేదు. వీలులేక పోవడము తప్పనిసరి. ముందు యోచించి, ఎవ రెవరు ఏ స్వర సమూహములను ఏరీతిగా ఒకసారి ధ్వనింప చేసిన, అవన్నీ సమ్మేళన మొందునో ఊహించి వ్రాసి— దిద్ది తీర్చవలయును. ఇక అట్టి సంగీత రచనలోని వాద్యమ్ము లకై ఏర్పడిన భాగములను సంగీత రచనల కర్త ముందుగా నిర్ధరించియుండును. మనో ధర్మము పనికిరాదు. కాని ఆ రచయిత నిర్దేశములను మెప్పుతో, దక్షతతో వాయించుటకు ఆయా వాద్యములపైన పూర్తిగా స్వాధీనత తప్పనిసరిగా నుండి తీర వలయును. మనోధర్మమునందు వారి వారి శక్త్యానుసారము, వారి వీలునుబట్టి వాయించు సుళువు ఉన్నది. ఇట్టిది ఆ పద్ధతిలోలేదు. అందుకే, వారి సంగీత కచ్చేరిలో వాయించు వాద్య గాళ్ళు అతి దక్షులు. అన్ని స్థాయిలందు, ఇంపు సొంపయిన నాదాన్ని పుట్టించుటకు రోజూ కొన్ని గంటలు సాధన చేయుదురు. వారి క్రమ శిక్షణ మనకు ఆదర్శనీయము.

ఇక వారి సంగీతములో అనేక రీతులు కలవు. మదరాసు మ్యూజికల్ అసోసియేషన్ తరఫున అక్టోబరు 6, 7 తేదీలలో పాశ్చాత్య సంగీత ప్రదర్శనలలో Duke Ellington కూర్చిన జాజ్ బ్యాండు వాయిద్య కచ్చేరీలు జరిగినవి. మ్యూజిక్ అకాడమీ హాలు క్రిక్కిరిసి పోయినది. అన్నీ బ్యాండు రకములే. డబుల్ బాస్, (తలక్రిందుగా వాయించే వయలిన్), పియానో, ప్రళయ ధ్వనులను పుట్టించు తాళ వాద్య సమూహము అనదగు 'డ్రమ్' సాక్సోఫోను, క్లారినెట్, ట్రాంబోను కలసిన జట్టు రెండు కచ్చేరీలు చేసిరి. ప్రజలు ఒక్కొక్క (పాట) సంగీత రచనకు మితి మీరి తమ హర్షమును కనబరచిరి. మన 'టైగర్' బిరుదు వలెనే నీగ్రో సంగీత రచనా నిపుణుడగు ఎల్లింగ్టన్‌కు డ్యూక్ అన్న బిరుదు లభించినది. ఒక్కొక్క వాద్యమునందు ప్రపంచ ఖ్యాతిని గాంచి, ఎవరికి వారే స్వయంగా సోలో ప్రదర్శనలు చేయగల తాహతు గల వారితో ఏర్పరచబడిన ఈ జట్టుకు అసమానమయిన ఖ్యాతి రావడములో ఆశ్చర్యములేదు. ఈ సంగీతమును విన్న వెంటనే ఆవేశము, అలజడి కలుగును. మన దేశములోని వీరభద్ర నటన, మారెమ్మ ఊరేగునప్పటి భయంకర ధ్వనులు వారి సంగీతముల కానవచ్చినవి. 'రుంజ'ను మరపించునది వారి డ్రమ్ము. తాళ నైపుణ్యము అసామాన్యము. తాళ విన్యాసములతో ఒకరితో నొకరు 'సై'యని గుంజుకొని వాయించినట్లు వీరును అతీత, అనాగత ప్రస్తారములతో ఒక చిన్నముక్కను తీసి, తర్జన భర్జన చేసి వాయించెదరు. "పాశ్చాత్యులకే చాల మందికి జాజ్ వచ్చదు. శాస్త్రీయ సంగీతము వినే వారికిది నచ్చదు. అందునను ఈ డ్యూక్ ఎల్లింగ్టన్ వాయించు విధానము అమెరికను జాజ్ రసికులకే తెలుసుకొనుట కష్టము" అన్నా రొక రసజ్ఞులు.

'జాజ్' సంగీతము (Ragtime) రాగ్‌టైము సంగీతమని వాడుకలో నుండెడిది. "Syncopacted music of U. S. Negroism" ఆఫ్రికా ఖండములోని నీగ్రో జాతి వారలను దండ్లు దండ్లుగా ఉత్తర అమెరికా రాష్ట్రము లందు బానిసలుగా గొని పోబడిరి. ఆ నీగ్రో జాతివారి సంగీతము యునైటెడ్ స్టేట్సులో క్రమంగా పునర్భవించి, అచ్చటి సదుపాయములను చేకూర్చుకొని నేటి జాజ్ రూపమును పొందినది. ఇది యువకులకు, అతి ఉత్సాహముతో గెంతులేసి నాట్యమాడు చిన్న పెద్ద జన సమూహాలకి ఎక్కువగా నచ్చును. ధ్వని చెవులు ఎగిరి పోవునంత తీవ్రముగా నుండును.

తీవ్రమయిన ధ్వనితోబాటు మరొక ఇబ్బంది కలదు. ఆ జాజ్ సంగీతమునందు భయానకరసమును, జాలిని కనిపించుటకు (Discord) అను స్వర సమూహములు కూడ విరివిగా నుండును. స, అంతర గాంధారము పంచమము, చతుశ్శృతి దైవతము—ఒక్క సమయమందు ధ్వనింపజేసిన అవి సమ్మిళితమయి హార్మనీ అను రసము నిచ్చును. కాని అంతర గాంధారము, పంచమముతో బాటు శుద్ధ దైవతమును, కాకలి నిషాదమును ఒకసారి ధ్వనించిన మనకు వేపరసమువలె చేదు నిచ్చును. జాజ్ వినువారు ఇట్టి అనుభవమునకు సంసిద్ధులై యుండవలయును. శాస్త్రీయ సంగీత రసికులకు జాజ్‌పట్ల విముఖత రావడానికి ఈ (Discord) ప్రయోగము ఒక ముఖ్యకారణమని చెప్పవచ్చును. శాంతిరస రాహిత్యము మరొక కారణమేమో.

సాక్సో, ట్రాంబోన్, క్లారినెట్, చెవులకు పిడుగు ముక్కల సందిచ్చు లయ ప్రళయ వాద్య మనదగు డ్రమ్ము— ఈ సంగీతమునందు అతి ప్రాముఖ్యమును వహించును. కాని 'జాజ్' జట్టులలో వయొలిన్, గిటార్ మొదలగు తంత్రీ వాద్య ప్రధానము లయినవి కూడ కలవు. ఆ పాటలు కొంత ఇంపుగా నుండవచ్చును. కొన్ని సులభగ్రాహ్యములు 'ఇంపు' గల్గిన పాటలూ కలవు. కాని డ్యూక్ ఎలింగ్టన్ బాండ్ జట్టులో అట్టి లాలిత్యమునకు తావేలేదు. పాశ్చాత్య శాస్త్రీయ సంగీతములోని వాద్యగాండ్రవలె కట్టు దిట్టములు 'జాజ్' వాద్య గాండ్రు పాటించరు. ఒక్కపాట పంక్తిని పుచ్చుకు కొంత ఒకరు వాయించడమే తరవాయి, అప్పగతి అను త్వరితగతిలో అందరూ ఆ పంక్తిని సమ, విషమ, అతీత, అనాగత ప్రస్తార ములో మనోధర్మము మేరకు నియమితమయిన అవకాశము నందే బాగ స్వతంత్రించిన మనో ధర్మమును చూపెట్టెదరు. ఇట్టి కల్పనను సింకోపేషన్ అందురు. దానిని మన 'నెరవలు' అనుకోవచ్చును. ఒక్కొక్క వాద్యమును వాయించువారు సుమారు రెండు నిముసములపాటు నాభినుండి ఊపిరిని పోసి, అతి కష్ట సాధనతోగాని పలికించరాని స్వరాలు దక్షతతో

మనాయసంగా పలికింతురు. వారి వారి సోకడలకు కొంత తావు నిచ్చుచునే వారిని మరీ విచ్చల విడిగా పోనివ్వక—శాస్త్రీయ సంగీతములో హార్మోని సూత్రములను యుక్తిగా ప్రయోగించి తనదే ఒక ప్రత్యేక బాణిగా డ్యూక్ ఎలింగ్‌టన్ ప్రతిభా యుతమయిన జాజ్ సంగీతం రూపొందించిరి. రచన అప్పుడి హార్మోని పద్ధతికి తప్పదు. ముందుగా యోచనచేసి వ్రాయడము ఆ పద్ధతికి అవసరము. కాని మనోధర్మ సంగీతమునకు ఎప్పటికప్పుడు సమయస్ఫూర్తి మేరకు ఎవరికి తోచినట్లు వారు 'నెరవలు' లాంటి ప్రస్తారాన్ని చేయడము ముఖ్యము. ఇట్టి అపూర్వ అవకాశము వల్లనే జాజ్ తన ప్రత్యేకతను నిలుపుకొన్నది. హార్మోని రచన కొంతవరకు ఆ మనో ధర్మమునకు హద్దు లేర్పరచినట్లగును.

ఇక వీరి పాటల ధోరణి, భీభత్సము, భయానకము. 'హోలీ' లేక గంగమ్మ జాతరల వాతావరణము, చెవులు బ్రద్దలు చేయు ధ్వనులు—మన చెవులకు రణ వాద్యములుగా దోచును. ఆనాటి ప్రదర్శనమునందు రెండు నిముసములలో సభికులందరూ ఆ తాళ గతులకు ఉద్రూత లూగిరి. ఇదే మన భారతీయులకు అర్థము కాని అంశము. ఇక ఆ స్వరముల కూర్పులో గల్గు సంగీత రసము అగమ్య గోచరము. భాంశీర భషకును మించిన సై శాచికపు అరపులు "హే! రైరై" అన్నవి ఆ పాటలలో కలియును. 'సొగులాడి' 'ఎక్కులైలు' 'Johan with sam', 'Take thee A Train' మొదలగు విషయములను సూచించు రచనలు వాయించినప్పుడు తాళ ప్రాధాన్యత, వాద్యముల దక్షతా యుతమయిన వాదన తప్ప చెవికి హాయి నిచ్చి మనశ్శాంతి చేకూర్చు అంశములు వెదకినా కానరావు. రేకెత్తించి గెంతులు వేయించు సంగీతము జాజ్. లోకోభిన్నరుచిః'. అయినా, 'Solitude' అన్న రచనలో దీర్ఘ స్వరాలు వాయించినప్పుడు సాక్సో, ట్రాంబోన్ వాద్యములందు వెలువడిన సరి పక్వ నాదము విరస్మరణీయము. ఆ వాద్యములను వాయించువారు హావ భావములతో వినువారికి వారి సంగీతమును విను ఉత్సాహపు మనోవృత్తిని కలిగింతురు. ఏమయినా భారతదేశమునందు పాశ్చాత్య సంగీత కచ్చేరీలు, శాస్త్రీయ సంగీతమును ప్రదర్శించుననే వాంఛనీయము. వేమన పద్యము ఎంత నిజము!

"అనగ నవగ రాగ మతిశయిల్లుచు నుండు
తినగ తినగ వేము తియ్యనుండు"

అలవాటు, శ్రద్ధ కొంత ఓపికతో విన్న అన్య సంగీత పద్ధతుల బాగోగులు క్రమంగా బోధపడగలవు. మహాకవి కాళిదాసే హెచ్చరించిరి కదా— "సన్తః పరీక్ష్యాన్యతర ద్భజంతే"

# బహుకర్తృక క్రియ

## శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

బహు కర్తృక క్రియా ప్రయోగము విషయమున నేను పడిన పొరపాటును శ్రీ కుంగిపూడి కృష్ణమూర్తిగారు (1963 అక్టోబరు 'భారతి' లో) అనేక ప్రయోగములు చూపి నాకు తెలియజెప్పినారు. అందుకు వారికి కృతజ్ఞతను తెల్పుకొనుచున్నాను.

కాని, వారు "శ్రీ శాస్త్రిగారు పెద్ద పొరపాటనెడు పంకమున బడినారు" అన్నారు. నేనే కాదు, వారును, ఆ పంకమున బడ్డవారే.

"ఇది ఎట్లు చెప్పు మని యడిగిన జె
ప్పని వాడును, సత్యము నె
ప్పని వాడును ఘోర నరక పంకమునం బడున్"
(ఆది. 1—137)

అన్న పాఠములోని 'వాడు' కర్తృ వాచక మనుకొని రా వారు పాఠము త ప్పన్నారు. అది పొరపాటుకాదా? పొరపడనివారెవరు? సర్వజ్ఞు లెవరు?

శ్రీ తిరుపతి వేంకట కవులు 'భారత విశేషము'లను విమర్శ గ్రంథములో, ఆ పద్యమును 'వాడును' అను పాఠముతోనే ఉదాహరించియున్నారు.

శ్రీ చదలువాడ సుందర రామశాస్త్రిగారును, ఆ పాఠమునే గ్రహించి—

"చెప్పని వాడును=చెప్పనియెడ—తనకుం దెలిసిన విషయమును ఎవరేని చెప్పుమని యడిగినప్పుడు చెప్పకున్నను, అసత్యము చెప్పినను వాడు నరకము నొందును" అని అర్థ తాత్పర్యములు వ్రాసి, 'వాడును'—పాఠాంతరము— అని తెలిపియున్నారు.

కాబట్టి 'వాడును' పాఠము తప్పుకాదు. వారా పాఠము త ప్పనుకొన్నారు. నేను 'వాడును' అను పాఠము త ప్పను కొన్నాను. ఈ విధముగా, ఈ పద్యము విషయమున ఇద్దరమును పొరపాటు పంకమున బడ్డవారమే.

"విప్రకులుండ వెల్వడుము వేగను నీవును నీ నిషాదియున్" (ఆది 2—64)

"బ్రతుకు దీవుం దమ్ములు సుతులున్ (ఉద్యో 2—321)

ఇత్యాది ప్రయోగములను చూచి, నా పొరపాటును నే నింతకుముందే తెలిసికొనియున్నాను. తామును పొరపడియున్నట్లు శ్రీ కృష్ణమూర్తిగారు ఇప్పుడైనను తెలిసికొందురు గాక.

# 'లోపడు' సాధువు కాదు



శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు తమ గ్రంథములలో 'లోఁబడు' అను క్రియను, 'లోపడు' అని ప్రాసస్థానములలో ఒకటికి రెండు మూఁడుమార్లు ప్రయోగించియున్నారు. ఆ గ్రంథములను సమీక్షించిన పండితులు 'గాంఢీవి' శ్రీ వి. రామకృష్ణారావుగారును, శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారును 'లోపడు' అనుట సరికా దన్నారు.

క్రొత్తగా అచ్చుపడి వచ్చిన కాళహస్తి మహాత్మ్యములోని పాఠములను పరామర్శించుచు 'గాంఢీవి'—'లోపడని' 'లోపడి' అనునవి అపపాఠము లన్నారు. నే నవి 'లోఁబడని' 'లోఁబడి' అని సవరింపఁబడఁదగు నన్నాను.

ఇది ఒకటిన్నర సంవత్సరము క్రిందటి వృత్తాంతము.

1963 సెప్టెంబరు 'భారతి'లో శ్రీ సీతా రామమూర్తిగారు "లోపడు--సాధువు కాదా?" అని ప్రశ్నించుచు, సాధువనుటకు తాము సంతరించిన ఉపపత్తులను చూపుచు ఒక వ్యాసము ప్రచురించినారు.

అందలి తొలి వాక్య మిది:

"ధూర్జటియు, నేనును అంగీకరించిన 'లోపడు' అను ధాతు రూపము అసాధువని, దానిని 'లోఁబడు' అని సవరించుట అవశ్యకమని పైన చెప్పిన విమర్శకులు శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు శ్రీ శ్రీరామమూర్తిగారును నమ్మినట్లు తెలిసెది. వీరు సామాన్యులు కారు. విశేషించి శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు జగమెరిగిన సారస్వత విమర్శకులు."

నేను తుమ్మలవారి ప్రయోగము నాక్షేపించిన వాఁడను కాకపోయినను, 'లోపడు' అను రూపము సరికా దన్నవాఁడ నగుటచేత, అందుకుఁగల కారణము లేవో నేను చెప్పవలసి యున్నది. కనుక శ్రీ సీతారామమూర్తిగారి వ్యాసములను వారు చూపిన యుపపత్తులను ఉదాహరించి, నా యభిప్రాయములను తెల్పెదను.

(1) వారు—"ధూర్జటియు, నేనును అంగీకరించిన 'లోపడు' అను రూపము" అన్నారు.

'లోపడు' అను రూపమును ధూర్జటి అంగీకరించినాఁ డనుట కాధారము లేదు. అతఁ డా పదమును వాడినది యతి స్థానమున. (వారివలె) ప్రాస స్థానమునఁ గాదు. అక్కడ లోపడు' అను రూపమే ఉండ నక్కర లేదు. 'లోఁబడు' అను రూపమును ఉండవచ్చును. యతికి క్షతి కలుగదు. కాఁబట్టి అతఁడు 'లోపడు'నే వాడినాఁ డనుట కది సాధకము కాదు.

అందువలన ధూర్జటితో పొత్తు కలుపు కొనుటయు "ధూర్జటియు, నేను అంగీకరించిన రూప"మనుటయు సంగతముకాదు.

(2) "లోఁబడు—అని సవరించుట ఆవశ్యక మని నమ్మినట్లు తెలిసెది" అన్నారు.

'లోఁబడు' అను రూపము సాధువుగా మేము సరసాటున నమ్మినామనియు, సవరించుట అనవసర మనియు వారి వాక్యములోని భావము. అది యట్లుండనిండు. వారు 'లోపడు' అనునదే సాధు రూప మని నమ్మినారుఁగదా! అందు కాధారమేమి? "లోపడు—సాధువుకాదా?" అన్నారే గాని, "ఇదిగో! ఈ ప్రయోగమునుబట్టి సాధువే అనలేదు. మరి యది సాధు వెట్లగును?

తెనుఁగునకున్న ప్రసిద్ధ నిఘంటువులలో నొక్కటియును 'లోపడు' అను రూపమును గ్రహింపలేదు. అన్నియును 'లోఁబడు' అను రూపమునే గ్రహించినవి. అందుచేత, అదే సాధు రూపమని నేను నమ్మినాను. సరిపోలా?

(3) భీష్మపర్వము (వావిళ్ల ప్రతి)లో—"అడరిన దానవుండు గండాకృతిఁ గైకొని సాయకతోడ లోపడ భుజగంబులన్ బొదివి పట్టె" (3–105) అని యున్నది. కాఁబట్టి తిక్కనయు 'లోపడు' అను రూపమునే వాడినాఁ" డన్నారు.

1924 వేమూరివారి ప్రతిలో "లోఁబడ భుజగంబులన్" అని యున్నది. తిక్కన వాడినది 'లోఁబడు' ఎందుకు కాఁగూడదు? వారు చూపిన యుపపత్తి కేవలము దుర్బలము. ఇట్టివి మరికొన్నియుఁ గలవు. వాటిని విమర్శించుట అనవసర మని వదలివేసినాను.

(4) "మద్గురువులు శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారి లేఖనుండి అని ఈ క్రింది పంక్తు లుదాహరించినారు.

"లోపడు—అన్నదే నాకు సమ్మతమయిన రూపము. లోన్+పడు=లోఁబడు—అనునది అర్థము కుదురుపాటునకు అంతగా అనుకూలించు మార్గము కాదు. 'లోను' అని ప్రత్యేకముగా విశేష్య రూపము, ఔపవిభక్తికము సుప్రసిద్ధము కదా! లోనన్, లోనికిన్—ఇత్యాదులు ప్రచురములు కదా!"

శ్రీ శాస్త్రిగారు వ్యాకరణ శాస్త్ర పండితులు. కావున వారు 'లోఁబడు' తత్త్వమును గుర్తించి యుండరపో రనియు గుర్తించియు శిష్యుని మనస్తృప్తికై సూత్రప్రాయముగా అట్లు లిఖించియుందు రనియు నేను భావించుచున్నాను

ఏ శబ్దమైనగాని మనకు సమ్మతమైనంత మాత్రమున సాధువు కాదు. అది శాస్త్ర సమ్మతము కావలె. కాదేని యసాధువే.

'లోపడు' శాస్త్ర సమ్మతము కాదు. ఎందువల్లననగా:

లోను+పడు—వృత్తియందు 'ను' వర్ణమునకు లోపము, సాగాగమము రాదు. కాఁబట్టి 'లోఁబడు' అగునుగాని 'లోపడు' కాదు. 'ప్రాఁబడు' ఎట్టిదో ఈ 'లోఁబడు'ను అట్టిదే.

ప్రాఁబడు, లోఁబడు—అను క్రియలను విడదీసినచో ప్రాఁతపడు—లోనుపడు—అగునుగాని, 'ప్రాన్—పడు' 'లోన్—పడు' కావు. కనుక లోన్=లోపల, పడు—అని యర్థము చెప్పరాదు. 'లోఁబడుము' అనుచో ధాతువు 'పడు' అగును కాని 'లోఁబడు' కాదు.

'లోఁబడు' శబ్ద పల్లవ క్రియ శ. ప. క్రియల లోని పదములను వేరుచేసి అర్థము చెప్పనొప్పదు. ప్రాఁబడు = ప్రాఁతవడియును—లోఁబడు=వశమగు—అనియే చెప్పవలె.

''లోఁ గామిని తన కాతఁడు
లోఁగామిని పంతఁ జింతిలుచు''

(సారంగ 2—135)

లోఁగామిని=వశపడక పోవుటచేత—అని యర్థము. లోన్=లోపల, కామిని=కాకపోవుటచేత—అని కాదు.

'లోపడు' సాధువుకా దనియు, 'లోఁబడు' అనినవేగాని అర్థము సరిపడ దనియు సారాంశము.

(5) ''జిజ్ఞాసువు లీ సందర్భమున—లోచిక్కు, లోచెడు మున్నగు శబ్ద పల్లవములను, లోతట్టు, లోపిరికి మున్నగు సమాస ములను పరిశీలింతురుగాక! శబ్ద పల్లవములకు సమాస ధర్మము కొంత (వర్ణలోపము, ద్రుతలోపము) కలదని గుర్తింతురుగాక'' అని హెచ్చరించినారు.

లోను+చిక్కు=లోచిక్కు లోను+తట్టు=లోతట్టు అయిన వనియు, అట్లే 'లోను+పడు=లోపడు' అగుననియు వా రన్నమాట.

ఇది ప్రామాదికము. లోచిక్కు, లోతట్టు మున్నగు వానిలోని 'లో' లోపల శబ్దముయొక్క లుప్త శేషము, 'లోను'కు సంబంధించినది కాదు. లోపల+చిక్కు=లోచిక్కు. లోపల+తట్టు=లోతట్టు అయినవి. లోకడుపు, లోకాక, లోచూపు, లోఁటిమి, లోదక్కువ, లోసగటుఁడు మొదలైన వన్నియు అట్లేర్పడినవే. వీనిలో సాగాగమములేదు.

శ. ర.—'లో' క్రింద ఇట్లు తెలిపినది.

''లో—వృత్తియందు లోను, లోపల శబ్దములకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము (లోఁబడు, లోచూపు మొ.)''

'లోను+పడు=లోఁబడు' అగు ననియు, 'లోపల+చూపు=లోచూపు' అగుననియు—శ. ర. ఇచ్చిన లక్ష్యముల కర్థము.

కాఁబట్టి 'లోను+చిక్కు=లోచిక్కు' అయిన దనుటయు, అట్లే 'లోను+పడు=లోపడు' అగు ననుటయు సరికాదు.

(6) ''తోఁబాటు, లోఁబడు—ఒక జాతిలోని వని యెరుంగుదురుగాక'' అని ఇంకొక హెచ్చరిక.

ఇదియును సరికాదు. 'తోఁబాటు' తప్పు. 'లోఁబడు' ఒప్పు. రెండును ఒక జాతిలోని వెట్లగును?

వారు తోపాటు; లోపడు—ఒక జాతిలోని వనుకొన్నట్లున్నది. అట్లనుకొనరాదు.

(7) ''లాక్షణికులు ఇప్పట్ల వెలువరించిన యభిప్రాయమును పెద్దల ఎదుట నుంతును'' అని వావిరి కొలను సుబ్బారావుగారి సులభ వ్యాకరణములోని ఈ క్రింది చర్చను చూపించినారు.

''లోపడు—ఈ శబ్దమును సీతా రామాచార్యులవారు—డొకారము పొచ్చు అడఁగు, మస్తరించు లోనగు శబ్దముల కడ లక్ష్యంబులలో 'లోపడు' అని వ్రాసియు, వానిని మరల సవరింపకయు శబ్దమును 'లోఁబడు' అనియే వ్రాసిరి. దీనికిఁ గారణము వారు—''తే. గీ. కినిసి పాణి నాళీకంబు సొనుపుటయును,నంతలోఁబడ కదియు''(అంతలోన్+పడక,అంతన్+లోఁబడక అని భేదము హ. న. 2 ఆ.) అని వ్రాయుటగాఁ దోఁచెడి. రెం డర్థము లందును 'లోపడు' శబ్దమే ఏల గ్రహింపలేదో! లోను+పడు=లోపడు అని యయ్యెను. ఈ 'లోను' ద్రుత ప్రకృతికముకాదు. ఇది దేశ్యము—విశేష్యము అనియు, విశేషణ మనియు వారే వ్రాసియున్నారు—చిన్నయసూరిగారి నీతిచంద్రిక యందును 'లోపడు' అనియే ప్రయోగింపఁబడియున్నది. (కాబట్టి లోభమునకు బుద్ధిమంతుండు లోపడఁడు) ''నా పతులగు గంధర్వుల చేపడి''—''ఒరు చేపడ నెన్నడును'' ఇత్యాది తిక్కన ప్రయోగములు చూచిన నిట్టి శబ్దంబుల రూప నిష్పత్తి యందు సందేహ ముండదు'' (సంధి పారా.121)

ఈ చర్చ భాషా లక్షణ విరుద్ధము. ప్రమాణముగా చూపఁదగినదికాదు. వావిలి కొలనువారు లాక్షణికులే. కాని ఈ పట్టున ప్రమాదపడ్డారు. వారి ప్రమాదముల నొక్కొక్కటిగా వివరించెదన (1)శబ్దవిషయమున చూడవలసినది నిఘంటువును గావి, నిఘంటుకర్త పీఠికను గాదు. పీఠికలోని భాష యెట్లయిన నుండు గాక. అది మనకు ప్రమాణముకాదు. బహుజనపల్లి వారి పీఠిక భాష ఇంచుమించుగా వ్యావహారికము. ఆయనగా రందు వాడుక పదములను విరివిగా వాడియున్నారు. పీఠికలోని, ఆ యా పదముల కడ వ్రాసిన అర్థములలోను—లేఖరి; విత్తనష్టము; కమ్మ (=కవియు); పియ్యూషము; బుద్ధిశాలురు మున్నగు అపరూపము లున్నవి. 'లోపడు' ఆ తరగతి లోనిదే. (వాడుక లోని మాట) నిఘంటువులో—లేకరి; నష్టి; క్రమ్ము; పీయూషము, లోఁబడు—అను సాధు రూపము లియ్యఁబడినవి.

వావిలికొలనువారు పీఠికలోని అసాధు రూపమును సాధువుగా సంభావించి, నిఘంటువులోని సాధు రూపమును అసాధు వని యాక్షేపించినారు. ఇది పద్ధతిగాదు.

(2) శ. ర. కర్త, 'లోఁబడు'కు ''కినిసి పాణి నాళీకంబు సొనుపుటయును, నంతలోఁ బడ కదియును'' అను హ. న. ప్రయోగము నిచ్చి—''అంతలోన్+పడక; అంతన్+లోఁబడక అని భేదము'' అని తెలిపియున్నను, పూర్వోత్తరములు

# 'లోపడు' సాధువు కాదు

విచారింపక, రెండర్థములందును 'లోపడు' శబ్దమే యేల గ్రహింపలేదో?'' అని శంక చేసినారు.

అట్లు గ్రహించుట సరిపడదు. ఎందువల్ల ననగా

'అదియున్—పడక—అంతలోన్' అని హరిశ్చంద్రా రమున అన్వయక్రమము. ఈ క్రమములో—'లోపడక' అను క్రియ యెట్లేర్పడును? బాణముతో కొట్టఁగా—'అదియున్= ఆ మాయలేడి, పడక=అంబు దెబ్బకు పడిపోక, అంతలోన్= అంతలోనే (ఆ నిమిషముననే) అదృశ్యమయ్యెను' అని యర్థము.

ఈ యర్థమున 'లోపడక=అధీనముకాక' అను క్రియకు ప్రసక్తి యేమి?

పద్యమున—'అంతలోన్ + పడక=అంతలోఁ బడక' అగునే గాని 'అంతలోపడక' ఎట్లగును?

కాఁబట్టి, ''రెండర్థములందును 'లోపడు' శబ్దమే యేల గ్రహింపలేదో?'' అను శంక సరియైనది కాదు.

(3) ''చిన్నయసూరి నీతి చంద్రికయందు 'లోపడు' అనియే ప్రయోగింపబడి యున్న'' దన్నారు.

ఉండుగాక. అదేమి ప్రాసస్థానమున నున్నదా? లేదు' వచనమున నున్నది. సూరి హస్త లిఖితమా? కాదు. అచ్చులో నున్నది. అచ్చులో 'లోఁబడు'—'లోపడు' అయి యుండఁగూడదా! అది వాదమున నెట్లునిలుచును! కాఁబట్టి అది ప్రమాణముకాదు.

(4) ''పైన్ + పడు=పైపడు; చేన్ + పడు=చేపడు అని ఏక శబ్దము లగుచో ద్రుతములకే లోప మగుచుండ, లోను + పడు=లోపడు ఏల కానేరదు?'' అన్నారు.

ప్రశ్న సరియైనది కాదు. 'మెచ్చక' అనుట కలదు గదా! అట్లే 'వచ్చక', 'తెచ్చక' అని ఎందుకనగూడదు? అనుట వంటిది. అది యట్లుండగా, వారు—పైపడు, చేపడు అను క్రియలలోని 'పై'—'చే' ద్రుతాంతము లనియు, ఆ ద్రుతములు లోపించిన వనియు నన్నారు. అదియును సరికాదు.

అవి శబ్ద పల్లవ క్రియలు. శ. ప. క్రియలలోని విశేష్యములు ప్రథమాంతములు. కావున కళలు గాని ద్రుత ప్రకృతికములు కావు. 'పై + పడు=పైపడు' అయినది. చే + పడు=చేపడు' అయినది. ఆ రెంటను ద్రుతము లున్నట్లును, అవి లోపించినట్లును చెప్పుట సరికాదు.

ఇంకను నయము. వారు ద్రుతము లోపించు నన్నారు గాని, 'పైన్ + పడు=పైఁబడు' 'చేన్ + పడు=చేఁబడు' అగు ననలేదు. ఎంత మేలు!

వేదం వారు 'చేకొను' అను క్రియను 'చే గొను'గా మార్చివేసినారు. ఆముక్తమాల్యదలో—

''క్షితి దున నేటికిన్ హలము చేఁగొని''(4.28)

అని ముద్రించి, ''హలము=నాఁగటినే, చేన్=చేతియందు, కొని= గ్రహించి'' అని వ్యాఖ్య వ్రాసినారు. (దీనిని గూర్చిన వివరములకు నా 'సాహిత్య సమీక్ష' పు. 353—చూచునది)

పెద్దల గ్రంథములలోని ఇట్టి పొరపాటులు పిన్నలకు అపకారకములు. ప్రమాద మెంత వా కైనను ఉండును, గావున పండితుల వ్రాతల నైనను బాగుగా పరికింపక గ్రహించుట శ్రేయముకాదు.

(5) వాలికికోలను వారు 'చేపడు' అని తిక్కన ప్రయోగించినా డని తెలిపి, ''ఈ ప్రయోగములను బట్టి చూచిన 'లోపడు' శబ్ద నిష్పత్తి తెలియు'' నన్నారు.

అంతేగాని, 'లోపడు' కు ప్రయోగము చూపలేదు. 'చేపడు' ను చూపి, 'లోపడు'ను అట్టిదే యనుట పొసఁగఁ దగిన మాట కాదు.

ఈ విధముగా వారి వ్రాఁతయంతయు ప్రమాదములతో నిండి యున్నది. అది ప్రమాణముగా చూపఁబడినది. ప్రయోజన మేమి?

శ్రీ సీతారామమూర్తిగారు కేవల కవులు గారు. విద్వత్కవులు. 'అభినవ తిక్కన' యని పించుకొన్నవారు. విశేషించి—వ్యాకరణ సమ్మతముగాని శబ్దమును ప్రయోగింపరాదను తీవ్ర దీక్ష వహించిన వారు. అయ్యును ఈ 'లోపడు' విషయమున నించుక ప్రమాదమునకు లోనైనారు. ప్రమాదము లేనివా రెవరు? సర్వజ్ఞులు కలవా రెవరు? ఆ చిన్న పొరపాటు చేత వారి పాండితి కళంకితమగునా? వారి కీర్తి వాసియుఁ జెడదు. కాని, వారు ప్రమాద ప్రయుక్తమైన ఆ యసాధు శబ్దమును సాధువుగా సాధింప దొరకొన్నారు. ఎట్లు సాధ్యమగును? అది వారు త్రొక్కఁదగిన త్రోవ కాదు.

వారు సంతరించినయుపపత్తులలో నొకటియు వారి యత్నమున కుపకరింపలేదు. అందువలన 'లోపడు—సాధువని ఏర్పడలేదు.

వ్యాకరణశాస్త్రమును బట్టియు, కవుల ప్రయోగములను బట్టియు 'లోఁబడు' అనునదే సాధురూపమని యేర్పడ్డది.

ఇందుకు శ. ర. కర్త ఇచ్చిన ప్రయోగ మొకటియే చాలును. అయినను నేనును మఱి రెండు ప్రయోగము లిచ్చుచున్నాను.

(1) ''ప్రాఁబడిన పిదప మరునకు
లోఁబడియున్ డిందు వారరో లొక్కుటమిన్''
(ఉద్భటా. 2—142)

ఇది ప్రాసస్థాన ప్రయోగము. ప్రయోక్త తెనాలి రామకృష్ణ కవి.

(2) ఈ క్రిందిది శ. సం. 1462లో శిలమీఁద చెక్కఁబడిన పద్యము.

''గరళంబు దనలోనం గరిగి లంగక యున్న
నొక వేల లోంబడి యుండకున్న
జలధి సరివచ్చు'' (శాసన. మంజరి. ప్ర. భా. పు. 103)

వేల లోంబడి యుండకున్నన్=చెలియలి కట్టకు లోఁబడి యుండకున్న యెడల అని యర్థము.

ఈ శిలమీది వ్రాతను బట్టి 'లోంబడు' ప్రాచీన రూపమనియు, అది 'లోఁబడు'గా వ్యవహృత మగుచున్నదనియు విశద మగుట లేదా?

'లోఁబడు'— సాధు వనుటకును, 'లోపడు'—సాధువుకా దనుటకును ఈ ప్రయోగములు చాలవా!

భా. సం.)

# సాముదాయిక కృషితో నాస్తి దుర్భిక్షమ్



ఉత్పత్తికి సహకార వ్యవసాయం ఒక ఆయుధం. సహకార వ్యవసాయం ఒక జీవన విధానం. స్థానికవనరులన్నీ సాముదాయికంగా ఉపయోగించుకుని అధికతమ ప్రయోజనాలు పొందడమే ఈ పద్ధతి యొక్క లక్ష్యం. సహకార వ్యవసాయానికి రాష్ట్రీ తృతీయ ప్రణాళికలో నలభై లక్షలు కేటాయించబడ్డాయి.

సహకార వ్యవసాయ సంఘాలకు ప్రభుత్వం ఈ క్రింది సహాయం చేస్తుంది. పైలట్ ప్రాంతంలోఉన్న ప్రతి సంఘానికి వాటాధనంలో రెండు వేల రూపాయలవరకు ప్రభుత్వం ఇస్తుంది. అయితే సంఘం రెండు వేలు సమకూర్చుకోవాలి. గిడ్డంగి నిర్మాణానికి ప్రభుత్వం అయిదు వేలు ఇస్తుంది.

## సామ్యవాద లక్ష్య సాధనకు సాముదాయిక కృషి

ఆం. ప్ర. స. పౌ. సం. శా.

# గ్రంథ విమర్శనము

## మానవుని మరొక మజిలీ

(సంగీత నృత్య నాటకం. రచన : బోయి భీమన్న, ప్రచురణ : సుశీలా నికేతనం, 92/2 ఆర్. టి. విజయనగర్ కాలనీ, హైదరాబాదు. వెల : రు. 5.00 పేజీలు : 220.)

"నలభై ఏండ్ల క్రితం ప్రారంభించి, ఐదేండ్ల క్రితం వరకు తోచినప్పుడెల్లా మార్పులు చేసుకొంటూ వచ్చిన నాటకం ఇది. సంగీత సాహిత్యాలకు సమానమైన ప్రాధాన్యం యిచ్చానిందులో. సృష్టి జరిగిన తీరును ఊహించి, మానవుని క్రమ వికాసాన్ని వైజ్ఞానిక దృష్టితో అణుయుగం వరకు వర్ణించి చెప్పాను నేను దర్శించిన విధంగా" అని పీఠికలో రచయిత చెప్పుకున్నారు. రవీంద్ర సంప్రదాయాన్ననుసరించి యాయన రచించిన యితర సంగీత నృత్య నాటికల ("చిత్ర కళా ప్రదర్శనం") వలె కాకుండా, భాషకూ, ఔచిత్యానికీ, భావనకూ—అంటే సాహిత్య గుణాలకూ, నిజంగానే ప్రాముఖ్యత యిచ్చారు ఈ నాటకంలో.

మానవుని క్రమ వికాసాన్ని సుదీర్ఘంగా 16 రంగాలలో సూచించిన యీ నాటకంలో పదిమంది పాత్ర లున్నారు. మానవునిలోని మంచినీ చెడుతనాన్నీ విడదీసి, మంచికి క్షేత్రయ్య భూలక్ష్మి దంపతుల్నీ, చెడుతనానికి భోగయ్య ఆశావతి దంపతుల్నీ, ప్రతినిధులుగా చేసి, యితివృత్తానికి రూపకల్పన చేయబడింది. క్షేత్రయ్య దంపతులు మానవునికి ప్రకృతితో, దైవభక్తితో, సృష్ట్యాది నుంచీ ఉన్న సంబంధాన్నీ, క్రమంగా వ్యవసాయాన్నీ, గ్రామీణ జీవితాన్నీ, ఋజు ప్రవర్తననూ, ఆధ్యాత్మిక దృష్టినీ సూచిస్తారు. భోగయ్య దంపతులు మానవుని స్వార్థపరతనూ, భోగలాలసనూ, కార్పణ్యాన్నీ, చరిత్రలో పారిశ్రామిక విప్లవాన్నీ, సామ్రాజ్యవాదాన్నీ, వైజ్ఞానిక విప్లవాన్నీ సూచిస్తారు. సస్య క్షేత్రయ్య దంపతుల యొక్క కొమార్తె. మేధానిధి భోగయ్య దంపతుల కొమారుడు. వీ రిద్దరి సంబంధం—మనిషిలో చైతన్యానికీ, సంకల్పానికీ, హృదయానుభూతికీ, మేధాశక్తికీ ఉండే సంబంధం. అటుపైన బాహ్యంగా సస్య గ్రామజీవన సౌభాగ్యము, మేధానిధి నాగరక జీవన కృత్రిమత్వము. సస్య మేధానిధివల్ల ఆకర్షింపబడుతుంది. క్షేత్రయ్య దంపతులు భోగయ్య దంపతులను బంధువులని చేరదీసి, క్రమంగా వాళ్ల దౌష్ట్యానికి లొంగి పెత్తనం అప్పగిస్తారు. ఫలితంగా వాళ్లచేత కొంటి పెయ్యబడతారు. మేధానిధి సస్యను చెరబట్టి తీసుకుపోతాడు. ఆ సమయంలో సృష్టికి మూలకారణమైన శక్తి, 'స్వయంప్రభ' ను భూలక్ష్మి ప్రార్థిస్తుంది రక్షించమంటూ. ఆ దేవి 'శ్యామల' రూపంలో యిలా సమాధాన మిస్తుంది. "శక్తి ననుసరించి సహకరింతును నేను .... బలుకనేర్చినవాని పక్షమే నేను ..... ప్రగతియే నా స్వభావము.... కాలబీజము నేను, కాలపత్త్రిక నేను.. ......" ఇది బలం కలవాళ్లదే రాజ్యం అన్న కాలం. తర్వాత కాలం మారుతుంది. మేధానిధి సస్యను ప్రేమిస్తాడు. కాని, అది నిసర్గమైన ప్రేమ కాదు. ఆమెను లొంగదీసుకొనే ఉపాయం మాత్రమే. ఇది మధ్యకాలం. తర్వాత ఆశావతి భోగయ్యలు సామ్రాజ్య స్థాపకు లయ్యారు. సస్య కృత్రిమ నాగరికతలో బందీకృతయై బ్రతుకుతోంది. మేధానిధి చూపించే సౌఖ్యము లామెకు రుచించవు. ఇంతలో 'కాంతామణి' (స్వయంప్రభ యొక్క మరొక రూపం) ప్రవేశించి మేధానిధిని నూత్నశాస్త్ర జ్ఞానం వైపు మళ్లిస్తుంది. సస్య కూడా ఈ నూత్న పరిణామంవైపు దృష్టి సారించి పగటి కలలు కంటూ ఉంటుంది. ఆ స్థితిలో ఆమె ధనికునిచేత చిక్కుతుంది. ఇది సామ్రాజ్యవాదం నుంచి ధనిక వాదానికి మార్పు. తర్వాత రంగంలో క్షేత్రయ్య శాంతి సందేశం వినిపిస్తూ ఋషిగా ప్రవేశిస్తాడు. పాలకుడైన భోగయ్య యుద్ధాలతో విసిగి ఉన్నాడు. మానవుని నైతిక పునరుద్ధరణకు మార్గ మేమిటో భోగయ్యతో క్షేత్రయ్య చెబుతాడు. సస్య కనిపించక దుఃఖిస్తున్న భూలక్ష్మితో సస్యను వెదకి తీసుకువస్తానంటాడు క్షేత్రయ్య. సస్య ధాన్యపు కొట్టులో చీకట్లో బందీగా ఉంటుంది. ధనికుడు స్వర్ణ, రత్నాభరణాలు చూపించి ఆమెను లొంగదీసుకో బోతాడు. "ఆసలతో, బాసలతో, మీసలతో మెలకువగా, పై మెరుగులు చూపి స్త్రీని, పట్టి భుజము తట్టవలయు" ననుకుంటాడు. ధనలక్ష్మి (స్వయంప్రభ) యిక్కడ ప్రత్యక్షమై, పారిపోతున్న సస్యకు కర్తవ్యం బోధిస్తుంది. "మనుజాడు నా ప్రియసుతుడు .... నీ వాతని జీవితసుఖ జీవనమవు .... కావున నీ ప్రణయము పత డాసించును ...... వరు డంతగా స్వార్థపరుడౌట కేది హేతువు ..., వీవె కారణ, మాతడు నీ కొరకె యిన్ని గొడవలు పడును.

యున్ని త్రోవలు త్రొక్కి.... నీవు పూర్తిగ లభ్యమైనంత.... ప్రేమరాజ్య మేలునే, సత్య !'' ధనలక్ష్మి తనను గూర్చి కూడా చెబుతుంది : ''పల్లె పొలమున, పాత గుడిసెను, ప్రమిదలో చిరువత్తి నేనే, నగరమున మణిదీప మేనే, జగతి కంతకు రవిని నేనే''. అంటూ, పైన ''మంచితన మొక్కటియె కాదున్నాడు శక్తియు (?) కొంత వలయును, సత్యమును రక్షించుకొనవలె సత్త్వము వలయు'' అని ప్రబోధిస్తూ సత్యను తనలో లీనం చేసుకొంటుంది ధనలక్ష్మి. అంటే మానవుని అన్వేషణకు లక్ష్యమైన సత్య, మానవుని నిరంతర ప్రయత్నమూ, సాధించే ప్రగతీ, వీనిలో ప్రత్యక్షమయ్యే స్వయంప్రభ తప్ప వేరు కాదనీ, అన్వేషణకు ఫలితం అన్వేషణ మాత్రమే ననీ సూచింపబడింది. సత్య కోసం చింతిస్తున్న భూలక్ష్మికీ, క్షేత్రయ్య మానవుడు నిర్మించిన నాగరకతను చూపించి అందులోని మంచియే సత్య, ''సత్య ఎప్పుడు నున్న అచట సకల సంపద లుండు'' అంటూ ఓదార్పు చెబుతాడు. మేధానిధి సత్యను అన్వేషిస్తూ వచ్చి ధనరాజును నిలవదీస్తాడు. ధనరాజే ఆమెను మాయం చేశాడని అతనిపై తిరుగుబాటు చేస్తాడు. ఈ తిరుగుబాటు ఫలితమే వర్గ విభేదము నశించిన వసుధైక కుటుంబ వ్యవస్థ. ధనరాజు లొంగటంలో జగత్కల్యాణము. ''ఇప్పటి కొక్క చుట్టు చుట్టి ఏతెంచె జగచ్చక్రము....పాశవశక్తుల జయించి ప్రగతి సాధించినారు'' అంటుంది స్వయంప్రభ ప్రవేశించి.

పై కథలో మొదలూ తుదీ కొంత అసంతృప్తిని కలిగిస్తున్నాయి. మొదట సృష్టి జరిగిన తీరును వివరించటంలోనూ, చివర వసుధైక కుటుంబ వ్యవస్థ ఏర్పడింది అనటంలోనూ రచయిత గారి ఊహా, ఆశాభావమూ తప్ప తాత్త్వికమైన సమర్థన లేదు. నాటకంలో సత్యపాత్ర పోషణలో రచయిత నైపుణ్యం ప్రదర్శించారు. ఇతివృత్తం మలచటంలో చాల వరకు కృతకృత్యు లయ్యారు. ఆశావతి, భూలక్ష్మి పాత్రలు ప్రతీకల కంటే స్త్రీలుగా రాణించారు. ఈ యిద్దరి స్వభావాల్లో భిన్నత్వం, ఆయా సందర్భాల్లో ఆహ్లాదకరంగా ఉంటుంది. భూలక్ష్మి ఓర్పుతో అంటుంది :

''లోకమంతా తిండి లోపించనిమ్మా
కరుణ కీ ధరణిలో కరువు లేదమ్మా !
ఊహాపోహాలు నిల్చి యున్నంతవరకు
గుండె బండగ మారకున్నంతవరకు
బ్రతుకలేనని భీతి పడవద్దు మనిషి !
ఆకటికి దాసోహ మనవద్దు మనిషి !''

ఆశావతి చీదరిస్తుంది :

''ఏడ్చినట్టే ఉంది ఈ యీ తి బాధ
కడుపుమండే జీవికా నీతిబోధ ?''

ఆశావతి భర్తమీద స్వారీచేసే భార్య :

''కోతలకు మొనగాడు కూతలకు గిజిగాడు
చేతలకు ఏమీ జావ కేతిగాడోయ్, చేవ !
తెలియకుండా వచ్చి దిగ మ్రింగుతున్నాడు
పొట్ట పెండ్లామయ్యె పిట్ట బావికు నేడు !''

అంటూ పొదవ విచ్చిన భార్యను :

''పొదవరాకే నాతి, ముదవకే మురారి !
నీకన్న లోకాన నా కెవ్వరే, చాన !''

అంటూ అనునయిస్తాడు భోగయ్య. ఆశావతి గయ్యాళి :

''ఏమేమే, భూలక్ష్మి ! హీనురాల ! ఏమంటివి ?
నీదా యీ రాజ్యమెల్ల ? నిరూపించుకోగలవా ?
ఇదిగో విను యింకొకమారి టట్టే కూత కూతువేని
పళ్ళు రాలగొట్టి, నెట్టి, నరకలోకి త్రోయింతును!''

అని భూలక్ష్మిని బెదిరిస్తుంది. కొడుకు మేధా నిధికి సత్యను ఎలా పొందగలడో ఒకనాటి లాలిలో చెబుతుంది కూడా :

''పెరిగిపెరిగి పెద్ద నిన్ను ఒదిలికొట్టి పోతే—?
వెర్రివానివలె నంబులువేస్తూ, చూస్తూ ఉంటివే
నిన్ను తెచ్చుకోయీ ? మగసిరి యిదేనటోయీ ?
సాగివెళ్ళు, మదిగో సత్య యిటే వస్తున్నది
తలవిరుచు ప్రదర్శిస్తే బలమింత ప్రయోగింపుము
రాక్షస పద్ధతి పెంపొందియె నాశించును మగవానికి....''

పల్లెపాటలు, పిల్లల పద్యాలు సహజ కవిత్వ ప్రభకు గీటురాయిగా ఉన్నాయి.

''వానదేవుడి పళ్ళు నాచిందిరా !
గాలిదేవుడు మేడ కట్టాడురా !

''కురిసి కురిసీ ఎండ కూలబడి పోయాడో
విసివిసి యెండు నిగనిగబడుతున్నాడో !
''తెలిమబ్బు కొండల్లో తిరుగుతున్నాడో !
తలిరాకు సంకాల కులుకుతున్నాడో !''

''పల్లె మెరిగిన నీరు ప్రజలనే మెరుగు
అడ్డు కట్టలు వేసి ఆపండి వాగు !
అగిసి కంపలు కోసి బిగుసున్న పోసి
వెడద గోదెలు తీసివెయ్యండి గూడ !
ఆశతో కనుచున్న దా రక్తశాలి
సొట్టతో నున్నదా మెట్ట పొలమంత !
కష్ట మారేగించి క్రతువు లోసరించి
చిక్కిపోయెను రైతు చినుకైన పడక

# గ్రంథ విమర్శనము

కొండ కోనల మేసి పండుకొన్నది మొగిలు
నెమరు నురుగున వాగు నిండి పరువెత్తు !''

ఇటువంటి తియ్యని పాటలు గ్రంథంలో చాల ఉన్నాయి.

## చిత్రకళా ప్రదర్శనం

(రచన : బోయి భీమన్న. ప్రచురణ : సుఖేలా నికేతనం, హైదరాబాదు. పేజీలు : 176. వెల : రు. 4.00)

చిత్రకళా ప్రదర్శనం, వసంత స్వయంవరం, గులాబి ప్రసవించింది, దేవయాని, మేడదులో మెరుపు, ప్రేయసి, పాత ఊరు—క్రొత్త దారి, సుభాస చంద్రుడు, చాండాలిక, అంధకారంపై విజయం అను 'పది సంగీత నృత్య నాటికల' సంపుటి యీ పుస్తకం. నాటక ప్రదర్శనలకై ఏర్పడిన సంస్థ, సుఖేలా నికేతనం, ఇందులో కొన్నింటిని యిదివరకే ప్రదర్శించింది. మిగిలినవి కూడా ప్రదర్శనయోగ్యాలని వారి అభిప్రాయం. అటుపైన ''వాస్తవ సాహిత్య రంగానికి కూడా కొంత సేవ చేయాలన్న నిర్ణయానికి వచ్చి'' యీ నాటికలను వారు ప్రచురించటం జరిగిందని ముున్నుడిలో సంస్థవారు చెప్పుకున్నారు. కాని, ''వాస్తవ సాహిత్యరంగం'' అనటంలో ఉద్దేశ్యమేమిటో బోధపడలేదు. ఏవిధంగా చూచినా యీ నాటికల్ని 'వాస్తవికతను' లక్ష్యంగా పెట్టుకొన్న రచనలు అనటానికి వీల్లేదు.

రవీంద్రుని 'గీతాంజలి' ప్రభావం తెలుగులో భావకవిత్వంమీద ప్రసరించినంతగా, ఆయన 'సంగీత నృత్య నాటికల' ప్రభావం తెలుగు నాటక రచనమీద ప్రసరించలేదని తోస్తుంది. చలం వ్రాసిన కొన్ని గద్య నాటికలు, రవీంద్రుని నాటికలతో పోల్చదగినవి ఉన్నాయి. భీమన్నగారు రవీంద్రుని సంప్రదాయాన్ని అనుసరించారు. రవీంద్రుని శత జయంతి యిటీవలే జరిగింది. ఆయన స్మృతికీ, ఆయన కవిత్వానికీ నిర్దిష్ట స్థానం ఉంది—కాళిదాసాది కవులకు వలెనే. కాని, నేటి సాహిత్యం రవీంద్రుని ప్రభావాన్ని దాటి క్రొత్త దారిని వెదుతోంది. ఇది వాస్తవం. భీమన్నగారు రవీంద్ర సంప్రదాయాన్ని పునరుద్ధరిస్తున్నారా ? అయితే వారెంత వరకు కృతకృత్యులు ?

సంగీత నృత్య నాటికల ప్రదర్శనంలో సంగీతానికీ నృత్యానికీ ఉన్న ప్రభావం సాహిత్యం యొక్క లోటుపాట్లను కప్పిపుచ్చుతుంది. కాని ఆ నాటికలే అచ్చు పుటలలో కేవలం సాహిత్యంగా నిలబడటానికి ప్రయత్నిస్తే పరిస్థితి తారుమారయ్యే ప్రమాదం ఉన్నది. ఉదాహరణకు మొదటి నాటికలో 'చిత్రదత్తు' నృత్యం చేస్తూ పాడుతూ ప్రవేశిస్తాడు.

''ఇవిగో యివి తొలి గీతలు
అవిగో అవి మలి రేఖలు,
తొలిగీతలు దున్న లివి !
మలిరేఖలు మధుపము లివి !''

'తొలిగీతలు దున్న లివి' అనే వాక్యాన్ని పాడుతూంటే ప్రేక్షకులు సరిగా వింటారో లేదో కాని పుస్తకంలో చదువుతూంటే మాత్రం అది భోజన సమయంలో పంటిక్రింద రాయి పడినట్లుగా ఉంది. తొలిగీతల్ని 'దున్నల'కు పోల్చడం హాస్యమా ? లేక యతి మైత్రికోసం ప్రాకులాటా ? ఈ నాటికలో చిత్రకళకూ చిత్రకారునికీ గల సంబంధాన్ని, అంటే ఒక గంభీరమైన మనస్తత్వ విషయాన్ని, ప్రతీకల సాయంతో దృశ్యం, వాచ్యం చేస్తున్నప్పుడు హాస్యానికి చోటేది ? అదే నాటికలో మరొకచోట :

''సౌందర్యమ్ముల ఉత్తమము కళా
సౌందర్యమె అని అంటారు !
ఎవతో, ఎవడో కనిపించగనే
కువకువమంటూ పోతారు !''

ఇది చదివితే ఎవరికి మాత్రం నవ్వురాదు ''సుభాస చంద్రుడు'' నాటికలో నేపథ్యం నుంచి నేతాజీకి భక్తిపురస్సరంగా నివాళిసల్పే సందర్భంలో పద్యం :

''దేశమందుండి సాధించు ఆశలేక
మారువేషాన బైటికి పారిపోయి
'హిందు ఫౌజ' ను సేన నిర్మించి, బ్రిటను
నదరగొట్టిన నేతాజి కంజలింతు.''

ఔచిత్యంమీద గౌరవం ఉన్న కవి 'పారిపోయి' అనే ప్రయోగం ఆ సందర్భంలో చేసేది కాదు. బౌద్ధభిక్షువు, గంభీరమూర్తి, ఆనందుడు చాండాలికలో అంటాడు :

''నీళ్ళు పోయనా ? ఏల కన్నీళ్ళు నింతు ?
నీళ్ళు నములుచు ఎందుకు నిల్చితివట్లు ?''

ఇక్కడ కూడా కవి ఉద్దేశించని హాస్యమే ఎదురౌతోంది! ''అంధకారంపై విజయం'' నాటికలో :

''ప్రాణదేవత పంచశీలకు
పక్కటెముకలు విరిగెను.''

ఇలాంటి హాస్యం పాలల్లో కలిసిన విషం !

ఈయన భావనాశక్తి పోయిన పోకడలకు ఉదాహరణలు : రాజుల విషయ లాలసతత్వాన్ని గూర్చి చాండాలిక అంటోంది :

"యౌవన తైలంలో ఉడికిన గుండెకాయల్ని
అందంలో నంజుకుతింటారే వాళ్లు !
తింటారు వాళ్లు—తిననివ్వరు మనల్ని …. "

కోపార్తె హృదయాన్ని చూరగొన్న భిక్షువును గూర్చి చాండాలిక తర్జనపాటలు :

"ఎవరే ఆ దయలేని దయాసముద్రుడు ?
కిన్నెరవంటి నీ హృదయాన్ని పగిల్చి
డప్పుకట్టి, తిరుగుబాటు
దండోరా పలికిస్తున్న భౌతికుడు ?"

చండాలిక అంటుంది :

"పెళ్లేమిటే, నా మొఖం పెళ్లి ?
పేడపురుగు పెట్టడం లేదటే పిల్లల్ని ?"

కాని ఇందులో ఒక ఔచిత్యం ఉంది. చండాలుర జీవిత పరిస్థితులకు, సంస్కారానికి, అలవాట్లకు, అనుభవాలకు తగినట్లు 'వాస్తవికంగా' ఉన్నాయి—ఆ "నంజుకుతినడం", 'డప్పుకట్టడం', 'పేడపురుగు పిల్లల్ని పెట్టడం'.

ఈయన వాగ్వైచిత్రికి ఉదాహరణలు : "నాల్కచాచెను రక్తదాహం", ఉమానాథుని కాటపట్టొ హిమగిరీంద్రుడు జబ్బు పడెను, "ప్రతీ హృదయం దీపహర్మ్యం, ప్రభాకర తీక్ష్ణం." "నడిచి పారేస్తార ?", "నరక దుష్ట దురాక్రమణమును పెరికివైచిన బాణసంచా."

ఈ నాటికలలో ప్రధాన భావాలు : 'చాండాలిక', 'దేవయాని' ప్రసిద్ధములైన కథలు. 'సుభాస చంద్రుడు' నేతాజీ జీవిత విశేషాల క్లుప్తీకరణ. మిగిలినవి వీరి స్వకపోల కల్పితాలు. 'చిత్రకళా ప్రదర్శనం' లో చెప్పదలచిం దేమిటో స్పష్టంగా లేదు. కళాదృష్టికీ, ఏకదేశమైన స్త్రీ పురుష ప్రేమకూ వైరుధ్యం ఉందా ? అనే ప్రశ్నకు కాబోలు సమాధానం అన్వేషించారు. "మానవుని కానంద మార్గా లనేకం ! ఒండొరుల జూచుకొని ఉల్లములు పెంచుకొని ఆనందపారమ్య మందుకొని తరియింప కళ అందులో ఆత్మకలశం …. జడములైన రేఖలకు, రంగులకు చైతన్యంబిడి మానవులు తమ అందాలను ప్రదర్శింత్రు…." అంతేకాని కళాదృష్టి కామదృష్టి కాదని చెప్పటానికి ప్రయత్నించారు. "వసంత స్వయంవరం" లో వసంతుడు కోకిలనూ, రసాలినీ, నింబలతనూ, ఇక్షుకాంతను విడివిడిగా కాదని 'గోపిక' యిచ్చిన తెలుగు ఉగాది పచ్చడిని—అది 'కష్ట సుఖముల నిగ్గు' అనే భావంతో—స్వీకరించటం యితివృత్తం. "గులాబి ప్రసవించింది" అనే నాటికలో 'అందమంతర్వర్తిదే గద వృష్టిలోన' అనే భావాన్ని విస్తృతం చేశారు. పోతే "మెదడులో మెరుపు" వ్యవసాయంలో ఆధునిక పద్ధతులను గూర్చి, "శ్రేయసి" ప్రజాస్వామ్యాన్ని గూర్చి, "పాతఊరు—కొత్తదారి" గ్రామాలకు రోడ్లు వెయ్యటం మొదలగు పంచవర్ష ప్రణాళికా లక్ష్యాలను గూర్చి ప్రచారం చేసే నాటికలు. చివరి నాటికలో చైనాను నోరార తిట్టడం చైనా నరకాసురుణ్ణి చంపటానికి 'యువకు లందరు కృష్ణులే. ప్రతి యువతి తా నొక సత్యభామే, కోట్లకొలదిగ …. కృష్ణులు సత్యల్' లేచిరావడం, 'బాణసంచాతో అంధతమమును చీల్చి చెండటం'—"అంధకారంపై విజయం" …. రవీంద్రుని ఆత్మ శాంతించుగాక !

## బ్రతుకు బాట

(రచయిత : ఇసుకపల్లి దక్షిణామూర్తి. ప్రకాశకులు : నవ్యభారతి, 760, హిమాయత్‌నగర్, హైదరాబాద్—29. పేజీలు : 162. వెల : రు. 3.00)

గ్రామంలో బడిపంతులు రామయ్యకు నారాయణ అనే కొడుకు పుట్టటంతో ప్రారంభించి, ఆ కొడుకు మళ్లీ అక్కడే బడిపంతులు కావటంతో ముగుస్తుంది నవలలో కథ. తల్లిదండ్రుల అభిమానంలో లోపం ఉండదు. కొడుకు చదువుకుని పైకి రావాలనే ఆకాంక్ష తల్లికి ఉంటుంది. దైనందిన జీవితంలో తండ్రి మాత్రం కొడుకు సంగతి పట్టించుకోడు. తల్లి మాటమీద పిల్లవానికి ఖాతరు ఉండదు. తన ధోరణిలో తను పెరుగుతాడు. ఏదైనా జరిగినప్పుడు తల్లీ తండ్రీ ఒకరిమీద ఒకరు బాధ్యత వేస్తూ వాదించుకుంటారు. ఈ పరిస్థితిలో నారాయణ ఒకసారి తన జట్టు పిల్లవాడు చని పోగా మనస్సు చెదరి యింటినుంచి పారిపోతాడు. నాటకాల వాళ్లతో కొన్నాళ్లు గడిపి మళ్లీ ఎలాగో ఇంటికి చేరుకుంటాడు. అప్పుడు మల్లి అనే చిన్నపిల్లతో కలిసిన స్నేహం అతని మనస్సులో నిలిచిపోతుంది. గ్రామంలో ఉంటే చెడిపోతాడని తండ్రి నారాయణని బందరులో మేనమామ దగ్గర చదువుకోసం ఉంచుతాడు. నారాయణ అక్కయ్య పెళ్లి జరుగుతుంది. నారాయణ మేనమామ కుటుంబంతో కలిసి శ్రీశైలం వెళ్లి వస్తాడు. జబ్బుపడి బందరులో స్కూలు మానేసి స్వగ్రామంలో కొత్తగా పెట్టిన హైస్కూలులో చేరుతాడు. స్కూలుఫైనలు పరీక్ష పాడుచేసి చదువుకు స్వస్తి చెబుతాడు. ఆడపిల్లలమీద ఆసక్తి పొటమరిస్తుంది. ఊళ్లో డాక్టరు దగ్గర కాంపౌండరుగా కుదిరి కొన్నాళ్లకే మానేస్తాడు. అక్కయ్య పార్వతికి డబ్బు అందజేయటానికి తండ్రి పంపగా గుంటూరు వెడతాడు. అక్కడ చిన్ననాటి నేస్తం మల్లి కనిపిస్తుంది. మల్లిని పెళ్లి చేసుకోవాలని ఆలో

చిస్తాడు. కాని, మళ్లీ వడుపు వృత్తిలో ఉందని తెలుస్తుంది. ఇది మామూలుకంగా ఒక పెద్ద ఆఘాతం, నారాయణని ఒక్క కుదుపుతో కళ్లు తెరిచేటట్టు చేసి అతనికి జీవితంలో యిది వరకు కలుగని ఒక పట్టుదలను, ఆసక్తిని కలిగిస్తుంది. నిర్వ్యాపారంగా, బాధ్యతారహితంగా బ్రతకటం అసహ్య మనిపించి గ్రామంలో బడిపంతులు ఉద్యోగం స్వీకరిస్తాడు. ఉద్యోగం చేస్తూనే చదివి పరీక్షలు ప్యాసై పైకి పోవాలనే ఆశారేఖ తొలిసారిగా అతనిలో కనిపించటంతో అంతం అవుతుంది నవల.

ఈ నవల గ్రామీణ జీవితంలో ఉన్న మందకొడి తనాన్ని, వ్యక్తుల్లోని స్తబ్దతనీ నిర్దేశించి చూపుతుంది. కారణం ఆర్థిక పరిస్థితి కాదు. ఉత్సాహం, జిగీష లేకపోవటమే! నారాయణకు చదువుకునే అవకాశాలు ఉన్నా అశ్రద్ధ వహిస్తాడు. బహుశా అది తండ్రి మనస్తత్వ ప్రభావం అనుకోవాలి. రచయిత కథను గాడి తప్పకుండా చెబుతూ ఎక్కడా వ్యాఖ్యానించక పోవటం యీ నవలలో సుగుణం. వ్యాఖ్యానమూ ఆలోచనా పాఠకులకే వదిలిపెట్టి మంచిపని చేశాడు. చిత్రించిన వస్తువు అల్పమూ, అసమగ్రమూ. యథాతథంగా సామాన్య జీవితాన్ని (సాంఘిక, ఆర్థిక, రాజకీయ వగైరా సమస్యల జోలికి పోకుండా) చిత్రించే నవల కూడా ఒక ప్రాథమిక ప్రయోజనాన్ని సాధిస్తుందనే చెప్పాలి.

## రాగవల్లరి

(కథలు. రచయిత: ''కిన్నెర''. ప్రచురణ: జయా పబ్లికేషన్సు, విజయవాడ—4. వెల : రు. 1.25. పేజీలు : 71).

ఆరు కథల సంపుటి. మొదటి కథ పేరే 'రాగవల్లరి'. నలభై పేజీలు సాగిన మొదటి కథలో రచయిత చెప్పదలచుకున్న దేమిటో రచయితకే తెలిసినట్లు లేదు. కులం చెడిన బీద పిల్ల సరోజను గోపాలరావు అనే యువకుడు తల్లి ప్రోత్సాహంతో వివాహమాడటం ఇతివృత్తం. మొదటినుంచీ తల్లీ కొడుకులు ఆ అమ్మాయిని ఆదరిస్తూ ఇంట్లో కోడలుగా చూస్తూనే ఉంటారు. పెళ్లికీ అంతే అవుతుంది. పోతే ఆలస్యం ఎందుకు జరిగినట్లు? పాత్రల మాటలకీ, చేతలకీ పొంతనాలు కుదరని కథనమే కారణం అనాలి. ఇందువల్ల కథారచనలో రచయితకు కనీసపు సామర్థ్యం (Minimum Competence) కూడా లేదని తెలుస్తోంది మిగిలిన అయిదూ కథలు కావు, చిన్న చిన్న నగటికలు: తనొక కళాజీవి, బీదవాడు, ఒక ధనికురాలిని పెళ్లాడుతాడు .... తనొక శిల్పి. తను కళారాధనలో మునిగి ఉండగా ప్రేయసి తనకోసం తపించి వాడి, రాలిపోతుంది .... కళాదేవత, 'తరంగిణి' నటూ తనకు సాక్షాత్కరించి తనలో లీనమౌతుంది..... తనొక పోలీసు ఆఫీసరు. ఒక యువతిని యాదృచ్ఛికంగా రైల్వే వెయిటింగ్ రూములో చెఱిచి, చంపి, ఆ నేరం ఇంకొకడిమీద రుద్దుతాడు.... తన భార్య బిడ్డను కని, అధునిక యువతి కాబట్టి 'స్వేచ్ఛకోసం' ఏదేళ్లు ఎక్కడికో వెళ్లియుండి, తిరిగి వస్తానంటే క్షమించగల శక్తి లేనివాడుగా ఉండలేకుంటాడు.... ప్రచురణకర్తలు కాని యీ పుస్తకం ఎలాగో అచ్చయినందుకు రచయితను అభినందించవలసిందే!

## గాడి తప్పిన జీవితాలు

(కథల సంపుటి. రచయిత : పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు, ప్రచురణ : విజ్ఞానసమితి, ఖమ్మం. వెల : రు. 1.50. పేజీలు : 98.)

విధిబలీయం, గాడితప్పిన జీవితాలు, గుణదోషములు అనే మూడు కథలు ఇందులో ఉన్నాయి. వాస్తవిక జీవితాన్ని గూర్చి కథలు (జానపద కథలు, పిట్టకథలు, పౌరాణికాలు కావివి) వ్రాసే రచయితకు యథార్థ ప్రపంచ పరిజ్ఞానం, పరిశీలనా అవసరం. అవే లోపించాయి యీ కథల్లో. మొదటి కథలో హీరో ఒక గుమాస్తా. 'ఇంట్లో బియ్యం లేవు, తీసుకు వెళ్లాల' ని ఆఫీసరు అనుమతి పొంది, రెండుమైళ్ల దూరంలో ఇంటికని సైకిలుమీద చీకటి పడుతూండగా బయలుదేరుతాడు. దారిలో గాలివాన సూచనలు ప్రారంభమై ఎలెక్ట్రిక్ దీపాలు, సైకిలు దీపం ఆరిపోగా సైకిలు దిగి నడుపుకుంటూ వెళ్తాడు. వెళ్లి నది దగ్గర ఆగుతాడు నీళ్ల ఉరవడికి జడిసి. ఇంతలో ఆ చీకటిలో ఒక ఆడమనిషి తార పిల్లి నది దాటి వస్తుంటుంది. 'నన్ను గట్టిగా పట్టుకో' అని వంతెనమీదుగా నడుము లోతు నీళ్లలో నడిచి ఒడ్డుకి చేరుతాడు. ఇక్కడ సైకిలు ఏమైంది? అనే ప్రశ్నకు సమాధానం లేదు. ఇంటినీ, ఇల్లాలినీ మరచి హీరో ఆ మనిషి వద్దంటున్నా వినకుండా దాని గుడిసెదాకా వెళ్లాడు. ఇందులో పెద్ద ఉద్దేశమేమీ లేదు. జాలి! అక్కడినుంచి అలానే ఒక తాత గుడిసె దగ్గరకు వెళ్తాడు. తర్వాత తాతను గురించిన కథనం. తాత ఇల్లు కూలి మరణించాడు. అక్కడ హీరో ఒక సుదీర్ఘమైన ఉత్తరం చదువుతూ ఉండిపోతాడు. ఆ తాత ఎప్పుడో విడిపోయిన తన తండ్రే అని తెలుసుకొని బయటికి వచ్చేటప్పటికి, తను ఏరు దాటించిన స్త్రీ యిల్లు కూలి చనిపోయిన బిడ్డతో ఏడుస్తూ కనిపిస్తుంది. చనిపోయిన

వారికోసం దుఃఖించటం అట్టే మంచిది కాదనుకుంటూ హీరో తన ఊరివైపు నడుస్తాడు! కథలో గాలివాన సూచనలే కాని, గాలివాన ఎప్పుడు వచ్చిందీ, ఇళ్లెప్పుడు కూలిందీ లేదు. గుడిసెలు కూలినంత గాలివాన వస్తే ఆ సమయంలో కథానాయకుడు నది ఒడ్డున ఎలా ఉన్నాడు? ఇంతకీ అతని సైకిలు ఏమైంది? ఆ పరిస్థితిలో ఇంటికి వెళ్లకుండా గుడిసెలవైపు షికారేమిటి? జానపద కథలు, పిట్ట కథలు ఇంతకంటే సహేతుకంగా ఉంటాయి.

రెండవ కథ 'గాడితప్పిన జీవితాలు.' సామాన్య మానవుని నైతిక ప్రమాణం ఎంతలో ఉంటుంది పరిస్థితులు బలీయమైనప్పుడు? అనే విషయం చాలావరకు సహజంగానే చిత్రించబడింది. కాని, కథ ముగింపుకు వచ్చేటప్పటికి రచయిత తత్తరపాటు చివరిపేరాలో బయటపడి, రచయితకు తను వ్రాసినదేమిటో తనకే సరిగా బోధపడలేదేమో అనిపిస్తోంది! ఇందులో శ్రీధర్, విశ్వం, జ్యోతి అనే పాత్రలు ముగ్గురూ నైతికంగా ఒకేవిధమైన పతనం చెందారు. విశ్వం ఒక్కడే ఏదో మహాపాపం చేసినట్లూ, మిగతా యిద్దరికంటె నికృష్టుడు అయినట్లూ చివర ఉటంకించటంలో అర్థం లేదు. కథ ప్రధానోద్దేశం పాత్రలను నైతికంగా విమర్శించటమే అయితే ఆ ధోరణి మొదటినుంచే ఉండి ఉండాలి. రచయిత కథ వ్రాసిన తీరు అలా లేదు. వాస్తవికతను చిత్రిస్తూ, సామాన్యులైన ఆ ముగ్గురూ పరిస్థితుల ప్రభావాన్ని అధిగమింపలేక జీవితంలో గాడితప్పి పోయారనే సానుభూతినీ, గంభీరమైన కరుణనూ వ్యక్తంచేయాలనుకున్నట్లయితే ముగింపు మరోవిధంగా ఉండాలి. అప్పుడు చివరి పేరాకు స్థానం లేదు.

'గురుదంపతులు' అనే కథ అచ్చంగా ఉపాధ్యాయుడైన యీ రచయిత తీర్చిదిద్దుకున్న ఒక పగటికల తప్ప, దీనికి వాస్తవికతతో, సంభవా సంభవాలతో సంబంధంలేదు. ప్రస్తుత సంఘ ధర్మాన్ని అనుసరించి ఉపాధ్యాయుడు శిష్యులమీద యిలాంటి ఆశలు పెట్టుకోవటం క్షేమంకాదు, న్యాయమూ కాదు!

మొత్తంమీద ఈ కథల్లో రచనా కౌశలమూ, ధారణ రెండూ లోపంగా ఉన్నాయి.

—ఆర్. ఎస్.

## ఆంధ్రనాటక సమీక్ష

(రచన: శ్రీ శ్రీనివాస చక్రవర్తి. 1/8 క్రౌను సైజులో 108 పుటలు. వెల: రూపాయిన్నర. ప్రచురణ: జయంతి పబ్లికేషన్స్, గోపాలరెడ్డి రోడ్, విజయవాడ—2.)

ఆంధ్రదేశంలో నాటకములు నన్నయ నుండి నవ్య రంగభూమి వరకు వ్యాప్తిలో ఉన్నట్లు నిదర్శనము లున్నవి. అయినను 1860 నుండి 1962 వరకు ఆంధ్ర నాటక రచనలో వచ్చిన పరిణామములను స్థాలీపులాకంగా పరిశీలిస్తూ వ్రాసిన చరిత్రనే ఈ పుస్తకరూపంగా శ్రీనివాస చక్రవర్తి ప్రకటించారు. 108 పుటలలో కుదించిన ఈ చరిత్రలో, నాటకరచనలోని ముఖ్య ఘట్టాలు మాత్రం దిఙ్మాత్రంగా సూచించారు. సాహిత్యరీత్యా వానికి గల ప్రత్యేక స్థానమును గూర్చి సమగ్రంగా చర్చింపలేకపోయారు. అక్కడక్కడ చదువుకోవడానికి మాత్రం పనికివచ్చే నాటకాల మాట చెప్పినా, ఈ చరిత్రలో రంగస్థలంమీద ప్రదర్శించిన నాటకములు, వాటి రచయితల పేరులు మాత్రం చెప్పారు అంతే. 'ఇదీ గత రేనూళ్ల ఆంధ్ర నాటక సాహిత్య ప్రగతి!'' అని పుస్తకం చివర వ్రాస్తూ ''ఆ ప్రగతిలో ప్రబలిన వివిధ ధోరణులను, ఆ ధోరణుల అవతరణకు కారణాలయిన పరిస్థితులకు, ఆ ధోరణులకు ప్రాతినిధ్యం వహించే నాటకాలను, ఇతివృత్తాలను, రచనా విధానాలను దిఙ్మాత్రంగా సమీక్షించి పాఠకులకు పరిచయం చేయడమే నా లక్ష్యం'' అన్నారు అందుచేత ప్రాతకాలంలోనివే కాక ఇటీవల వచ్చిన నాటకాల ప్రసక్తి కూడ దీనిలో లేదు. నాటక రచనలో విప్లవం తెచ్చిన శతాధికమైన రేడియో నాటికలు, ఏకాంక నాటికల మాట దీనిలో రాలేదు. ఇటీవల బహుమతులు పొందిన 'కీర్తిశేషులు' 'చిల్లరకొట్టు చిట్టెమ్మ', 'నాలుగిళ్ల చావడి' వంటి నాటకాల ప్రస్తావనేలేదు. అచ్చు తప్పులు కోకొల్లలుగా ఉన్నవి. ఇన్ని నాటకాలను పేర్కొనడంవల్ల ఇదొక క్యాటలాగు వలె ఉన్నది. కాని, సమగ్ర నాటక సాహిత్య సమీక్షగా లేదు. అయినా ఇట్టి చరిత్ర ఆంధ్ర నాటకాభిమానులకు ఎంతో ఉపయోగకరమైనది..

## నా ట క పో టీ లు

(రచన: శ్రీ శ్రీనివాస చక్రవర్తి, 86 పుటల పుస్తకం. వెల: రూపాయిన్నర. ప్రచురణ: జయంతి పబ్లికేషన్స్, గోపాలరెడ్డి రోడ్డు, విజయవాడ—2.)

ఈ పుస్తకము ప్రస్తుతము ఆంధ్రదేశములో వేలంవెర్రిగా జరుగుతూన్న నాటకాల పోటీలను గూర్చి సమగ్రముగా తెలియజేసే కరపత్రము వంటిది. ఇది వ్రాయుటకు శ్రీనివాస చక్రవర్తిగారికున్న అర్హత మరీ యెవ్వరికిని లేదు. ఆయన చాల పోటీలకు నిర్ణయాధికారిగా పనిచేశారు. కొన్ని సంస్థల పక్షాన ఎన్నో పోటీలు నిర్వహించారు. మరీ కొన్నింటికి సలహాదారు. 1944 లో ఆంధ్ర నాటక కళా పరిషత్ ఈ పోటీలు ప్రారంభంచేసిన తర్వాత ఈ యిరవైయేండ్లలోను దేశమంతటా ఊరూర పోటీలు జరుపుతున్నారు. వీని నియమావళి, మార్కులువేసే పద్ధతి, సామాన్య దోషాలు, సలహాలు మొదలైనవానితోపాటు మొదటలో చరిత్ర తెలియజేశారు. పుస్తకం చివర—రంగస్థలం నిర్మించడానికి కొన్ని నమూనా చిత్రా లిచ్చారు. తెనుగు దేశంలో నేడు సర్వత్ర జరుగుతూన్న యీ నాటకాల పోటీలను గూర్చి తెలిసికొనగోరేవారికి, ముఖ్యంగా అమెచ్యూర్ నాటక సమాజాల వారికి ఈ పుస్తకం ఎంతో ఉపయోగంగా ఉంటుంది.

—శ్రీ వాత్సవ.

# లేఖలు

# 'రాజావళి' చరిత్ర



హస్నాబాద నాగలింగ శివయోగి

ఆర్యా,

1963 అక్టోబరునెల భారతియందు పై శీర్షికతో నొక వ్యాసము ప్రకటించిరి. అందు గల విషయము లివి : ఢిల్లీ రాజధానిగా పాండవ వంశీకుడైన యుధిష్ఠిర చక్రవర్తి మొదలు 4834 సంవత్సరాల మూడు నెలల పదకొండు రోజుల వరకు దేశపాలనము చేసిన రాజుల చరిత్ర సొంతముగ ఆయారాజుల వంశచరిత్ర, పరిపాలనాదిక విషయములు, తెచ్చిన సంస్కరణలు, మొదలైన అనేక వివరములు గల 'రాజావళి' అను పురాతన గ్రంథము లభించినది. కాంగ్రి భాషలో గల ఈ గ్రంథమును కాంగ్రి మాజీ రాజా శ్రీ బలదేవ్‌సింగ్‌గారిచే సంపాదింపబడినది. పంజాబు ప్రభుత్వపు హిందీ విభాగంవారి ప్రోత్సాహంబున, ఆచార్య గౌరీశంకర్, ఆచార్య యదునందవ శాస్త్రిగార్ల పరిష్కరణముతో ప్రకటించబడుచున్నది. దీని వలన భారత చరిత్రలో అజ్ఞాతంగా ఉండిపోయిన అనేక విషయాలు బైటపడగలవని చరిత్రకారులు భావించుచున్నారు. ఇట్టి చారిత్రక గ్రంథమగు 'రాజావళి' యందు గల ప్రత్యంశము నిజమనియే తోచుచున్నది.

అదెట్లన :—"ధర్మరాజా అనంతరం పాండవ వంశీకులైన రాజులు 30 మంది పరిపాలించారు. వీరి పరిపాలనా కాలం 1745 సంవత్సరాల రెండు నెలల రెండు రోజులు"— అను వివరము రాజావళిలో గలదు గదా! చంద్రవంశమునకు మూలపురుషుడు అత్రి. చివరివాడగు బ్రహ్మక్షత్రుడను వానితో నీ చంద్రవంశ మంతరించినది. ఇతడు కలియుగపు రాజుల లోనివాడే నని తెలియుచున్నది. అత్రి మొదలుకొని బ్రహ్మక్షత్రుని వరకు గల రాజుల సంఖ్య చాల పరిమితిలో నున్నది. అయిన ధర్మరాజు తరువాతివాడైన అభిమన్యుడు గూడ యుద్ధములో నిహతుడయ్యెను. కాన పరీక్షిత్తునుండి చివరి రాజగు బ్రహ్మక్షత్రుని వరకు లెక్కించిన సరిగా 30 మంది రాజులే గలరు. వీరి కాలము 1745 సంవత్సరాల 2 నెలల 2 రోజులట.

చూడుడు :—1. పరీక్షితుడు, 2. జనమేజయుడు, 3. శతానీకుడు, 4. సహస్రానీకుడు. 5. అశ్వమేధజుడు, 6. వాసీకృష్ణుడు, 7. నిచకుడు, 8. అప్తుడు, 9. చిత్రరథుడు, 10. శుచిరథుడు, 11. వృష్టిమంతుడు, 12. సుషేణుడు, 13. సునీతుడు., 14. నృచకుడు, 15. సుఖానుడు, 16. బరిప్లవుడు, 17. మేధావి, 18. సునయుడు, 19. నృపంజకుడు, 20. దూర్వుడు, 21. నిమి, 22. బృహద్రథుడు, 23. సుధాంసుడు, 24. శతానీకుడు, 25. దుర్దముడు, 26. విహీనరుడు, 27. దండపాణి, 28. మితుండు 29. క్షేమకుడు, 30. బ్రహ్మక్షత్రుడు.

దీనినిబట్టి రాజావళిలో గల ఆ వివరము సరియైనదే నని తెలియుచున్నది. అందుచేత రాజావళిలో గల పాండవ (చంద్ర) వంశీకులైన 30 మంది రాజులు పై నుదహరింపబడినవారే అయియుందురు. అది వెలువడిన తరువాత తెలిసి వస్తుంది. వేచి చూతాం. ప్రస్తుతము మనకీ వివరము అనగా యుధిష్ఠిర మహారాజా తరువాత 30 మంది పరిపాలనతో నీ చంద్రవంశ మంతరించిన విషయము (1) భాగవతమునకు సరిపోయినందువలన, మిగతాగల వివరము లన్ని సత్యములనియే భావింప వీలుగలదు. ఇట్టి 'రాజావళి చరిత్ర' అను గ్రంథము

---

(1) గ్రంథమును బట్టి కల్యాద్యబ్దాః 1745, కాలమున బ్రహ్మక్షత్రుడను రాజు పాలించుచుండెనని తెలియుచున్నది. నేటికి 3319 సంవత్సరాల క్రితము వ్యాసభగవానులవారు జీవించియుండవచ్చును.

లభించుట యావద్భారతీయుల యదృష్టమే.

చరిత్రకారు లన్నట్లుగా దీనివలన నెన్నియో చరిత్రాంశములు బయటికి రాగలవు. కావున అత్యుత్తమ చారిత్రక గ్రంథమనుట న్యాయము.

## చిత్రకవి సింగరాచార్యుడు నియోగియా?

ఆర్యా,

కందుకూరు వీరేశలింగం పంతులుగారు తమ కవుల చరిత్ర తృతీయ భాగమున "ఈ కవి యారువేల నియోగి బ్రాహ్మణుడు." అని వ్రాసి యున్నారు. వారా నాటివఱకు పలబద్ధములైన యాధారములతో, అనేకమంది కవుల కుల స్థల నిర్ణయములలో శ్రీ పంతులుగా అనేక శ్రమలు పడినారనుటలో నావంతయు సందియము లేదని సర్వు లెరింగినదే. అయ్యును వారు నూటికి తొంబదిమంది కవులను నియోగులనుగాఁ జేసిరి. ఆ గోష్టిలో నతని గూడా కలపిరనుకొందును. పైగ నా కాలమున చరిత్ర వ్రాయువారే మతస్థులైన కవులందరా మతస్థులైరనుట కావంతయు సందియములేదు. ఈ బాధ నన్నయభట్టారకుని నుండి ప్రారంభమైనది. ఆతఁడే కదా! ఆంధ్రకవి ముక్తాహార హారమణి. అందులకని తప్పు లేదేమో? అది యటులుండనిండు. 1956 న పండితులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు 'ఆంధ్ర కవిసప్తశతి' యని సంగ్రహ ఆంధ్రకవుల చరిత్రను రచించిరి. ఇందునను పాడినదే పాటగా నున్నదే కాని సరియగు విమర్శతో కూడియుండ లేదు. అసలీ చిత్రకవి సింగరాచార్యుడు.—నెల్లూరుజిల్లా, కందుకూరు తాలూకా—చిత్రకవివారిపాళెం నివాసం. శ్రీవైష్ణవ బ్రాహ్మణుడు. చక్కని విశిష్టాద్వైత సాంప్రదాయము కల వంశము. నేటికిని వీరి బంధువర్గమే గాక పుత్ర పౌత్రులును ఉన్నారు. శ్రీమాన్ పండిత విక్రాల రామచంద్రాచార్యులవారు వీరి బంధువర్గములో నొకరు. ఇంకను కలికివాయి సింగరాయకొండ మున్నగు జనపదముల వీరి బాంధవ్యమంతయు తామర తంపరయై యున్నది. పైగ నీ కవి పూర్వులెల్లరు సదాచారసంపన్నులై, విద్యాభూషణులై ఆయా దేవాయతనములలో ఆచార్య స్థాన మాశ్రయించియు—అధ్యాపక, వేద పారాయణాది వివిధ కైంకర్యపరులై యున్నట్లు తద్వంశీకులు చెప్పుచున్నారు. యథార్థ మిట్లుండగా కవి చరిత్రకారులెల్లరు మూక యుమ్మడిగ నొకటే త్రోవన నీతనిని నియోగియని వ్రాయ సాహసించిరి. ఆధునిక రచయితయైన శ్రీ బులుసు పండితులుకూడా ఆ మార్గమునే ననుసరించిరి.

(కనిగిరి) కొమండూరి రామానుజాచార్యులు.

---

క. మూలగ్రంథ పరిత్యా
గాలోచనమీఱ వ్యాఖ్యాన కట్టలుగా
పోలంగఁ గట్టి బహు భా
షాళుల కాలువలఁ దీయు నాధ్యుల నెంతున్.

కొక్కొండ.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor : S. Sambhu Prasad.

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

డిసెంబరు 1963

సంపుటము 40 : : సంచిక 12

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1963

# ముక్తకాలు



శ్రీ మాదిరాజు రంగారావు

వెలుగులో తమ వ్యక్తిత్వం స్ఫురింపజేసి
చీకటిలో పరిలీనమౌ ఆకాశం భూమి సర్వం
బ్రతుకులో దీపశిఖవంటి మనసునంటి
ముందు వెనుక మలగు సుఖదుఃఖపు వెల్గునీడలు !

మహాకాల కాసారంలో విరిసిన
కనక శతపత్రం సూర్యుడు. కాదు !
అంధకార వలయంలో సహస్రాబ్దాలుగా
పరిభ్రమించు మానవహృదయాగ్ని గోళం.

కాలదేవత మనస్సులో విరిసిన మల్లెలు
ఉబికిన సంతోషతరంగాలు చుక్కలు. కాదు !
ఒక భాగ్యహీనుడు రాల్చిన బాష్పకణాలు-
హృదయం ఎగజిమ్మిన అగ్ని శలాకలు.

దుఃఖమయ జీవితంలో హ్లాదైక బింబం
తమోగగనపథంలో పారాడే శిశుశశి !
అవును పాషాణ హృదయం భేదించుకొని
ఉద్గమించిన సౌందర్య కళాశిల్పాకృతి.

ఒక్కమారు వీచింది గాలి తరగలు తరగలుగా
కొన్నిపూలు ఊగి రాలి పడిపోయినవి గుసులుగా
కొన్ని మొగ్గలు పరిమళించినవి దరహాసంతో
ఒకస్థితి చిన్నదశలలో చిన్నపరిణామాలు
(మరణం, ఉదయం, అభ్యుదయం ఎట్లాటరా)

1

# భారతి

చెట్లు కనే కలలు పూలు పండ్లు
వాని ఆలోచనలకు ప్రతిరూపాలు నీడలు
నదులు కనే కలలు పొలాలు ఎడారులు
వాని ఆలోచనలకు ప్రతినిధులు తరంగాలు,

మనిషి కనే కలలు ఇతరులకు కన్పించక
అతని ఆలోచనలకు ప్రతిబింబాలు
అజంతా, హిరోషిమా, ఋక్కులు, స్పుత్నిక్కులు,
దేవతలు, రాక్షసులు, తాను మరి ఇతరులు.

పగలు రాత్రులు పైబడివచ్చి పోతున్నవి
యుద్ధాలు క్షామాలు సైపక వెలిగిపోయినవి,
ఇంకా మేల్కొనని జనం! గుండెల్లోని
గాయాల బాధ ఎరుగని శవసందోహం!

చీకటిలో చిలికిన బ్రతుకు నెత్తి చూపు దీపకళిక
భాగ్యహీనుని కంటినుండి జారిపడు బాష్పకణం
బాష్పకణంలో వినదించు బడబాగ్ని సంగీతం
శిథిల మనశ్చిత్రపుటడుగుల చప్పుడులు.



# నవ్యాధునికులు



శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

## 14

శ్రీశ్రీ ప్రయోగాలుచేస్తూ మారిపోతూండిన కాలంలో ఆయనలాగే సాహితీసమితి కవుల రచనలవంటివి వ్రాస్తూ మారుతూండిన వారిలో మల్లవరపు విశ్వేశ్వరరావుగారు ఒకరు. వీరు 'కరుణ విరహిత జన తిరస్కారముల' ఘాత అనుభవించారట. 'క్రుంగి కుమిలిన కుళ్లిన సంఘ కూపముల సహింపని కార ణమువేత .... సంఘశత్రున్నై కరుణలేక దరుమబడి' రట. కృష్ణశాస్త్రి, వేదులా వెలిబుచ్చిన వేదనను ''చురచుర కాలి పోవు బ్రతుకు టిసుక యెడారిలో బాహులెత్తి దాహమని మ్రోగు నా మహత్తర పిపాస'' అని ఈయన వెలిబుచ్చారు. కృష్ణశాస్త్రి 'నిశి కడుపులో తారలు' ఈయన రచనలో నొక ఖండికగా తయారయినాయి. వేదుల సుధాకరాది వెన్నెల గీతము లీయనలో 'పున్నమ' ను ధ్వనింపివవి. దీక్షితులుగారి 'చక్రవాక మిథునము, తాగూరు వనశుక పంజరశుకములూ ఇంచుకంత మారి వీరి రచనలలో స్ఫురిస్తాయి. ప్రేయసీ కటాక్షము కొఱకు ఈయన కూడా బాధపడినారు. ఈయన ఊహలు సౌందర్యము చుట్టూ మంచు మేలి ముసుగు అల్లు తాయి. ఈ ముసుగు వెనుకనే అందని సౌందర్యము, 'తెర వెనుక జ్యోతి వెల్తు'' రు కరణి, జాపుమేర కావల మిన్కను తారపోల్కి కరము సాచిన దూరవౌ మెరుగు బురుగు భాతి' భ్రమియించి మాయమౌతుంది. 'అందని సుమమ్మ ఆమె నా కంచు నెరచి' నా రీయన. 'కంటి రెప్పలు మింటి కప్పుల నంటి పోయే నిరీక్షణంబున', 'ఆమె ప్రేమార్ద్ర గౌరవాహ్వాన గీతి నేడా రేపా దిగంతాల బాడి పిలుచు—' ననే యాశతో 'రెక్క తెగయుచు గడియల లెక్క గొనుచు' వేచియున్నా నంటారు.

ఆధునికుల రచనలతో వీరి రచనలకు కావచ్చే పోలిక కేవల మనుకరణవల్ల వచ్చినది కాదు. వారి ఆశను మించినది వీరి ఆశ. ''బంధనమ్ముల విదిలిచి, యంధ లోకమే విడిచి, ఏక తమ నిర్భరము నెడంద సందన సీమలయందె మసలునాడు— చంద్రుడే చుక్కల వీడి యాడు నీ వదనసీమ! ఇంద్రుడే నీకు నాకు నాకరాజ్యాభిషేకమ్మొనర్చి వీడు దేవ సింహాసనమె' అంటారు. కనుక నిజమ్మైన వేదన నడిపింది వీరి రచనల్ని కొంత వరకూ. అంతవరకూ చుర్రుమంటుంది వీరి రచన ...... ఆధునికుల అలవాట్లను దాటి జంపె వరుసలను వీరు ఛంద స్సుగా స్వీకరించి 'కల్లోల పాదోధి కడుపు పూచిన పంట, కరడు పొంగిన బ్రదుకు కడలిలో పెనుమంట' 'సోగ కన్నుల కొనల సుమియించెనో సఖీ! వేయి తారల మిన్కులూ తళుకులూ నాకు'' అని రచించారూ, రూపకములో 'ఒక తారక తన కన్నులు వికసించుకు వసు పోల్చెను' అని రచిం చారు. ఆధునిక కవుల కల్పనలను దాటి అందని ఒక చిరు నవ్వును పొందగోరె నొక కోరిక, ఆశాహస్తము లెత్తుకు ఆలసి, అలసి నిదురించెను. కికురించిన ఒక చూపున కొక యెద బాష్పము రాల్చెను .... దూరపు కల నొకదానిని జేర బోయే నొక మహాశ భావాంచలముల నంటుకు పరచి పరచి కృశియించెను. నిద్రించిన కోరికనే, నిట్టూర్చిన హృదయమునే కృశియించిన పేరాసనె, క్రుంగిన దీనుని ప్రేమనె, తెలిమబ్బుల వలువలతో, తారామణిహారముతో, పసివాడని వలపులతో విరసి వలచె నొక యప్సర'' అని ఛాయా దృశ్యాలు చూపి చూపి 'క్రుంగిన దీనుని' తో మానవత్వాన్ని లేపి, దృశ్యాన్నంతటినీ హృదయ జ్యోతిర్మయము చేశారు. ఆశకు ఈ లోకము దాటిన సాఫల్యత—'అమరత'—ఇచ్చి నిత్య జ్యోతినిగా నిల్పారు. 'ప్రతిఫలము' విశ్వసాహిత్యానికి విశ్వేశ్వరరావుగారి కానుక.

పద్యమూ వ్యాకరణమూ ఈయనకు తరుచు అడ్డు పడి అల్లరి పెట్టేయి. మొదటలోనే తన్ని పారవేయ వలసింది. ''కోరికే, అలరనీయుము, పురి నెగయబోసి, దోబూచాడి, వెర్గెను, ఈయలే నొక కౌగిలేనా ? 'భూమి నెగసి' 'నన్ను నీ వెన్నలే నైతి' 'వికసితుండవు' 'యేలా' 'పుష్పించవమ్మా' 'శీనమ్మైనాయి' 'అలపన'' 'నిధ్వనించె' నంటూ సాగించారు

రచన. అయితే సంకెళ్ళు సడలించి వ్యావహారికమును వాడిన ఘట్టా లున్నాయి. మాత్రా చ్ఛందస్సులలో శక్తి కావలసిన చోట నియమాలు దాటేరు. 'సామ్యము' 'యుగలక్ష్మి' లలో వెలుగూ చీకటీ లాగ వ్యావహారికమూ, గ్రాంథికమూ కన పడుతున్నాయి. ఈ కలవరములో వీయనకు గణ ఛందస్సులు స్వాధీనము కాలేదన్న సత్యము తెలియలేదు.

కల్యాణ కింకిణి ఈయన రెండో ప్రచురణము. దానిలో మాత్రా చ్ఛందస్సులే ఎక్కువ. అంతమాత్రము చెపితే చాలదు. వచనాలలాగున్న రచనలే ఎక్కువ. 'ఓ నవ యువతీ! ఎవతెవు నీ వీ రాత్రి నన్ను మేలుకొల్పావు? ఏ తారా కోమలాంగివో నీవు ఏ తేజస్స్నిగ్ధ దేహవో కాని నా స్వప్న ప్రాంత రాంతరాళంలో నీ స్వర్ణాంకిత కింకిణీ క్వణాహ్వానం రేకెత్తించి నదించి, ప్రజ్వలించావే నా కామం!'' అని తమ పద్యాల ధోరణిలోనే ఛందస్సును మాత్రం మాని రచించారు. క్రింద గీత గీసిన మాటలన్నీ ఎత్తెత్తి వేసిన అడుగులే. ఛందస్సు సడలింది కాని అన్వయం తిన్నబడలేదు మిగిలిన భాగంలో కూడా. 'ఏనాటిదీ రత్నపేటి కావాసిత దివ్యవీణ?' అని ప్రారంభిస్తూ దీ అనడముతో ఎంచుకున్న తకకిటతక గతి తెగుతోందని చూసుకోలే దీయన. భావాల్ని నిశ్శ్రేణీగా తీర్చే యత్నమూ కానరాదు. 'ధిక్కరింపుము శోక కర్కశా వేదనల' 'దరిసెనమ్మీయవే వరగాయనీ మణీ' 'నాగసర్ప పడగలా గ్రైతి నీ మ్రోల' 'నటియింపుము నదియింపుము' అంటూ కవి నాయకుని పల్కులే ఎక్కువ పలికేరు. ''కవిత్వం కవి ప్రకృతిని ఆవరించిన అవ్యక్తమైన కాంతి. చిరంతనమైన కాంతి కవి హృదయాన్ని ఆవరించి, హృదయ ప్రవృత్తులను ప్రకాశమానం చేసి కేంద్రీకరించి వివేచితమైన అనుభూతులకు సార్ధక రూపకల్పన చేసి తద్వారా అభివ్యక్తమై మూర్తీభవిస్తుంది'' అని కవిత్వమంటే కవి తయారుచేసే వ్యంజనమే అంటారు.

అయితే వీరే—ఏమారి రచించారేమో చైత్రము, ఏనాడు, పిచ్చిపాట, ప్రవాహోల్లాగ సాగిపోతాయి. పిచ్చి పాటలో పలుకులు 'గుడుగుడు గుంచం గుండారావం తిరగడము మాని, పిట్టకూత లాగ ప్రసరించాయి. 'నా కవితా కుంజంలో, భీకర కరవాలందిగి ''ఆకలి ఆకలి'' అంటూ దూకి తరిమికొట్టింది. ఆ కరవాలం పట్టిన రాకాసి కఠోరాకృతి నీకు నాకూ తెలిసిన లోకమే'. ఇది చదివి విశ్వేశ్వరరావుగారికి కవిగారి పూనం కోటు భ్రమ వదిలిందిరా బాబూ అనుకున్నాను. ''విచ్చుకత్తి విరిదండని పిచ్చి ప్రేమతో పుచ్చుకు బిచ్చగాడి నా కుత్తుక వెచ్చిస్తే ....'' ''కరకు కత్తి కామించే గర్విష్ఠికి పిచ్చా? కవిగారికి బిచ్చమా? కంఠమొడ్డి పుచ్చుకో'' మంటారా? మహా మంచిది. కవిత్వం ఉవాచించే విశ్వేశ్వరరావుగారి కంఠం విడిపోయింది. చదవండి ''తాతకు దగ్గు'' వాహినిలాగ పారింది. శబ్దాలంకారాలు అనుప్రాస అలంకారాలు ఏవీ లేవు. ఏదీ కవి గారిలో తాత్విక సుడిగుండాలు తిరగడానికి వీలేదీ? 'ఏమన్నానూ?' అని అడిగే ఆక్రోశం వచ్చింది. ఆ ఉత్క్రోషంతో వచ్చింది జల. ఆయనచేత ఇలాంటి రచనలు చేయించడానికి ఆయన కవిత్వాన్ని తిట్టాలి. ఏమని తిట్టనూ? .... ఇదుగో తిడుతున్నా. తాను సరళ కవిత్వం వ్రాసిన 'గురు దేవుడు' ఈయనకు మొదట గరళ కవిత్వం వ్రాయమని ఉపదేశించాడు.

పిలకా గణపతిశాస్త్రిగారు పండితులు. చాలా ఖండకావ్యాలూ, రత్నోపహారమూ, అమరుకమూ వ్రాశారు. అయితే ఈయన గొంతు కూడా 'గట్టు' 'మాదా కబళం' 'వాన' లాంటి రచనల్లోనే విడింది. ''జూలు హుమ్మ మని విదిలించే ఆ గాలివాన సింహంపై పిడుగులు రాలే మెరుపుల కమ్చీ ఖణేల్ ఖణేలని పిస్తూ సవారి చేదాం'' అన్న రచనలోని శక్తి, కథతో కాక వర్ణనతో చదువరినిలాగ యత్నించే అమరుకంలోకి ఎలాగ వస్తుందీ? ''గట్టుమీద ఉంటే నీకేమి తెలిసినట్టు లోతు, వట్టిమాట నేస్తంరా! అట్టడుగు సముద్రంలో కంటా మరి మునిగి చూడు'' అన్న గేయం రెండేసిమారులు చదువరెవరూ. గణపతిశాస్త్రిగారు ఒకమారు చదివితే తెలిసే రచనలు చేస్తే మెఱుపు కొరడా ఆయన చేతికొస్తుంది. 'చీకటిలో ఎవరో ఆ నీడలు! ఆకలితో ఏవేవో ఘోషలు! వినబడునో వినబడదో! తరతరాల ఈ జనసామాన్యం తరగని గుండెల బరువులలో .... చిరవేదనలో ''అట్టడుగుకు దిగి పలుకు'' మంటాను వారిని.

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారి దారి నివృత్తిలో నుంచి ప్రవృత్తిలోకి వచ్చింది. వారు విమర్శకులుగా కలము పట్టేరు. వ్యాకరణ నియమాలూ సంప్రదాయ ఛందస్సులూ విడిచేసి గేయాలు రచించారు. 'కత్తి ఎత్తినా కలం ఎత్తినా కదలని మనిషి కళ్ళు మూసుకో' మన్నారు. 'దరిద్రదేవత ఇనుపగజ్జెలకు తాళంవేస్తూ .... నడిచే ఎముకల గలగల వింటూ కునుకు తీయమని ఈసడించారు. కవికుమారుని కలంమీద కుట్రచేసిన వారిని విసిరికొట్టారు. 'పగులదన్నుము వజ్ర కవాటములను, ఆవులించి తీండ్రించు సింహాల నదిమి బొబ్బలెత్తించమన్నారు మళ్ళీ వేదనలతో విసిగే యువకుల్ని''. జీవితమంటే చేదంటావా, హృదయం అంటే పుండంటావా, తోడి మానవుడు దొంగంటావా! అయితే పోదాం పద స్వర్గానికి' అని అచ్చమైన భావాన్ని దాని నైసర్గికశక్తితో

# నవ్యాధునికులు

ఇచ్చారు. అయితే ఇవన్నీ చిన్నపిల్లలవలె నైసర్గిక సౌందర్యముతో, చిట్టి భావాలతో భవిష్యత్తులో ఆశతోనే వెలిగేయి. ఆ దశాంతములోనే కాబోలు "ఒకపరి దీనమానవుం నొత్తిడి జీవనభార తీవ్ర బాధకు, దురదృష్టరాగ బహుదాక్షత చిత్త విషాద గాథకున్ సకల జగమ్ము నంటిన యశాంతికి విప్లవ రక్త కాంతికిన్ తుకతుక వేగిపోవు నెద దుఃఖ మయమ్మయి పల్కు నేదియో!' అన్నారూ, 'రగిలించుసు నా యెద కొత్త పాటకై' అన్నారు. తరిమి బ్రదుకెల్ల కాల్చు సౌందర్య చింతా శాంతికి విసిగే కాబోలు 'బ్రదుకులో తెగ మోసిన బరువు దించి నడువలేక నడువలేక బడలి వచ్చు మానవుల నాదరించెడి మసనమందు .... విశ్రమించిన శాంతి దేవికి నతు లర్పించారు. అయితే 'ప్రతి హృదయంలో ప్రతి సదనంలో జ్వాలల రగిలించని జ్యోతులు వెలిగించని పాటెందుకు? పద మెందుకు? తేనెపాట కవిగారూ! ఈనాడా మీ కోతలు? మీ చావని (మహోజ్వల) చరిత్రకేంలే—మా జీవన యాత్రా యాతన కలిగించుకు వెలిగించని మహాకవి జహాపనా. మోయలేమయ్యా నీ పల్లకి మొహమాటం దేనికి?' అని కావ్యరచన కొక లక్ష్యం నిర్దేశిస్తూ ప్రబోధాలు చెయ్యడము మానివేయలేదు. "జ్ఞాపకశక్తిని ప్రదర్శించే రచనలు కాక అనుభవాన్ని కరగించి పోతపోసే కావ్యాల్ని వ్రాయండి" అని ఆధునిక కవిత్వ సందేశమైతే 'జీవిత సమస్యల నెదుర్కొనే, ఎదిరింప శక్తినిచ్చే రచనలు చెయ్య' మన్న అభ్యుదయవాదుల సందేశాన్ని నవ్యాధునికులు ఆమోదించారు. హనుమచ్ఛాస్త్రిగారి తొలి రచనలన్నీ ఈ ఆశయాన్ని పాలించినట్టివే.

శంఖవరము రాఘవాచార్యులుగారు పండితులు. ఎక్కువగా మాత్రాచ్ఛందాలనూ స్వేచ్ఛారచననూ వాడేరు. అనుప్రాసా, క్రమాలంకారమూ, ఉపన్యాస ధోరణి వీరి రచనలలో అల్లుకుపోయి కనబడతాయి. "హే మృత్యో! నీ శక్తికి రూపం కల్పిస్తే, నే భావించే ఆకారం విరచిస్తే, నీ వక్త్రం ఈ భువనభోంతరాళానికి సన్నిహితం, నీ వక్షం రౌరవరక్త గంధ పరిదిగ్ధం" అంటూ వర్ణనా పటుత్వాన్ని ఎక్కువగా స్ఫురింపజేస్తుంది వీరి రచన. "కర్పూర పాండుర కపోల అధరప్రవాళ మధుర ప్రమీల, హృదయాంతర స్వప్నశీల ఓ సుధాబాల" అని ప్రబంధకవి లాగ ఆహ్వానిస్తారు వలపులబాలను. "ఎద లోని పదముతో కదలి నీ కాలు కరగె లోకాలు, గంధర్వులే కలసి పాడ పాడ అప్సరస లాడ," నంటారు. ఊహాచిత్రాలే పద్య బంధాల్లో కాక వెండితెర మీద వచ్చినట్లు వచ్చాయి. అనుభవంకన్న ఆలోచనే ఈయన కావ్యాలకు వస్తువు చేకూరుస్తుంది. "కృతయుగము 'ఇదియేమి' పొగలు మిసి సెగ లెగసి భువి కవతరించినది కైలాసగంగ' అంటే, కలియుగం అంటుందిటూ. 'కాదు, యుగ యుగ హృదయ శోణిత తరంగ'— అని వ్యతిరేక భావనను గుచ్చి రచన చేస్తారు. ఈ వైరుధ్యాన్ని సమన్వయించేది గంగ మాత్రమే కాక కవి భావమేనో అయితే బాగుండు ననిపించింది. కవి భావాలు కవిత్వము కాదు, ఆ భావాలు చదువరికి అందించే రచన కవిత్వము. "గాత్ర భస్మం చల్లుకుంటూ, కపాలంవలె చంద్రబింబం, కార్తికాకాశ స్మశానం, కదలిపోయింది. కుపిత రుద్రాక్ష తాండవ, రభస నిశ్వాసానిలమ్ముల, కాలకూట విషాగ్ని ధూమం పురులు విప్పింది. గగన సౌధాంగణ మహాజ్వాల తారకా బాలికలు ధాత్రిరక్త నేత్రం చూచి కన్నులు మూసుకున్నారు" అన్నారు. భావగతి లేని ఊహలు చేర్చి అనయాన్ని ధ్వనించకపోతే ఈ వివర్శన పరంపరకు కావ్యత్వసిద్ధి రాదు. పర్వత పరీక్షలో రుద్ర నేత్రం తెరచి చూస్తేనూ, వ్యాస నేత్రం తెరచి చూస్తేనూ జరిగే వ్యతిరేక ఫలితాలు ఇంచుమించు కావ్యాభిజము పద్యంలో ఇచ్చారు. పంక్తులలోని ఊహలూ, క్రమాలంకారమూ, వైరుధ్యమూ చేరి కెలైడాస్కోపు దృశ్యంలాగ తిరిగింది కావ్యం. వైచిత్రి కావ్యానికి ఆకర్షణ కూరుస్తుంది. రచనను చూచి చదువరి ఆశ్చర్యపడతాడు.

సంపత్ రచనలలో రచనావైచిత్రి బలమే ఎక్కువ. 'గాలిస్తే జీవిత కాంక్షలు, తేలిం దొక నిగూఢ సత్యం పుస్తకమూ వనితా విత్తం, ఇవి మూడే నరుని కగత్యం' అంటారు. జీవిత కాంక్షల్ని గాలించడమా, నానుడిని మారించడమా? ఏది చేశారు కవిగారు?

వీరందరూ పద్యాన్ని వదలి స్వేచ్ఛారీతినీ, మాత్రాచ్ఛందాల్నీ పట్టి రచించారు. తిక్కవరపు పట్టాభిరామిరెడ్డిగారు యత్నించి 'నా వచన పద్యాలనే దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరగదంతాను' అన్నారు. అయితే వీరికి సమ లయ మీద కోప మున్నట్లు లేదు. బంగాళీ పాటల వరసలు కాబోలు కొత్తగా నడిచే పాటలు వీరు చాలా వ్రాశారు. (ఇవి 'కైత నాదైత' అన్న వారి వ్రాతప్రతిలోనివి. ఈ పరిచయ వ్యాస సంపూర్ణతకు లోభించి వారి యుపేక్ష ననురోధిస్తూ కొన్ని ఇస్తున్నాను.) అంత్యప్రాసలు వీటి ప్రత్యేకపు టందము. నాయికల భేదములు వీటి వస్తువు. "ప్రియుని గలయు కోరిక లాగగ, సుడి రీతిని, రయమున నభిసారిక, పోవు రాజవీథిని సంతోషితాత్మ స్వాధీనపతిక, రమణీయ నవ్య లావణ్యలతిక. విదియ రాతిరి జాబిల్లి, విధముగ గడు సన్నగిల్లి తగ్గియుండ తనూవల్లి. విడివి ప్రణయకోపము, సఖి!, చంద్రముఖి! నీదు, నవ్వుమోము జూపుము. పుడమియంత పుష్య మాస, రాత్రకాలిక, శీతమందణంగియుంది, శవము పోలిక.

శ్రీ శ్రీ ప్రాసక్రీడలలో 'తురాయి కంపె ల, కురాయి కంపెకీ, చురాయి కంపె హిమాంతురాయి గొప్పవాడు'లో లాగ ప్రాసలు క్రీడ కోసమే ప్రవేశిస్తాయి గాని అర్థాన్ని సాగించవు. పఠాభిగారి ప్రాస క్రీడలలో అర్థము ఇరుకున పడదు. "రా శ్రవణము, లా జీవనము, లోజాంగలము, నా జీవనము" అంటా రీయన. లాఘవము పాలపై నురుగులాగ పైపైనే కాని, లోతులలో ఉండదు. వీరి రచనలలో. 'దేవా, నీ సేవా శ్రీనివా ?, నీ చిత్తమందు గ్రావా, మయి భావా ల్విడ వేలర ? ఎన్నేలర?" అంటారు ఈ క్రీడలలో అందము సాధించా రీయన శ్రీ శ్రీ కంటె జాస్తిగా. "కురుస్తూంది కురుస్తూంది, కుంభవర్షం కురుస్తూంది, గగనమే దగ్గరకు వచ్చి, బిగ్గరగా నరుస్తూంది" ట! "సఖి ! నీ కలహా, సమాలి కలహా ! వసంత కుసుమా, లసంతలు సుమా, "బతుకు ముళ్ల బాటలలో చీకటిరో చిచ్చులలో, పాటుబడీ, నాటుబడీ, పోతున్నవి నా బండీ, ప్రయాణమున బడలియున్న వాడనయా భగవంతుడ ! కరుణతోడ గ్రహియింపుము పగ్గాలను నానుండి" వచ్చి వచ్చి అనిబద్ధ కవిత్వానికి చేరేరు. ఇది చదువరి గుండెకు అనుభవపు ఇంజెక్షను.

పట్టాభిరామరెడ్డిగారు మేధావులు. ఆధునిక కవిత్వపు రీతుల్ని పరిశీలించుకుంటున్నారు. కవుల యత్నా లన్నిటి మంచి చెడ్డలూ గుర్తించుకున్నారు. పద్యం తెలుగు కవిత్వంలో హక్కులేని అధికారం చెలాయించింది. పంద్రెండు శతాబ్దాల పాటు. ఈ అడ్డును తీసివెయ్యాలని వచన పద్యాలు రచించారు. ఇతరులు చెప్పని ఆశయాన్ని వీరు చెప్పేరు. పద్యం కవిత్వానికి అడ్డా ? ఆహా అడ్డే. అయితే తిక్కనాదు లెందుకు రాశారూ ? 'ఆ అడ్డుతో రాయడం గొప్ప అనుకుని.' నిర్వచనోత్తర రామాయణం వ్రాశారుకదా ఆయన ? మళ్లీ పాత పద్ధతికి ఎందుకు దిగేరూ ? వ్యర్థ పదాలూ అక్కరలేని విశేషణాలూ వాడకుండా ఏ తెలుగు కవైనా వ్రాశాడూ ? సంస్కృత కవులు వ్రాశారు వాల్మీకాదులు. మరి సంస్కృతంలో లేని వ్యర్థపదాలూ, పద్యమంతా ఆక్రమించే సమాసాలూ, యతి ప్రాసల సంకెళ్ళూ, గణ ఛందస్సులూ తెలుగు నెత్తిమీదికి ఎందుకు తెచ్చిపెట్టారూ ?

ఎప్పుడు తెలివిడి వస్తే అప్పటినుంచి మారడము చైతన్యవంతుల లక్షణం. పఠాభిగారు "ఫిడేలు రాగాల డజన్" లో వచన పద్యాలు వ్రాశారు. (ఇక్కడ 'పద్యాలు' అన్నది 'కావ్యరచనా సాధనము' అన్న అర్థముతో వాడేరు. కులకము (Poem) అన్న పేరు పెట్టుకున్నా సరే.) వాటిలో పద్యాని కున్నట్టుగా నడక ఎక్కడైనా స్ఫురించిందా, వెంటనే ఆ నడకని విరిచిపెట్టారు. "ఫిడేలు రాగాస్ ఫిడేలు రాగాస్ అన్నారు. 'ఏదో నడక స్ఫురించింది. 'ఫిడేలు రాగంబులు' అని విరిచారు. "వినూత్న పద ప్రేమికులు మహాకాముకులు అన గానే మళ్లీ నడక స్ఫురించింది, అన్యోన్యమగు దంపతులు గూడ" అని మళ్లీ విరిచారు. అయితే వీరి పద్ధతి వీరిదే కనుక వచన పద్యాల శైలి కోసము కాబోలు 'కాన్వెను' 'కవి న్వెను' నాకున్, బందిపోటున్, మోమందము, వంటి పదాల్ని వాడేరు.

వీరి కవిత్వములోని పోలికలు నగరవాసుల అనుభవము లోనివి. చూచే ఎరుగని రాజహంసలూ, అప్సరోరమణులూ వంటి ఊహా సామగ్రి కాక అనుభవములో ఉన్న బాదంఫీరూ, డీలక్సు కుషన్ సోఫా, అమృతాంజనపు పూతా, కన్నిమారాలో టీపార్టీ వంటి సామగ్రినే వాడినా రీయన. కామాక్షి స్పర్శ వల్ల 'పఠాభి' కి కలిగేది గగుర్పాటు కాదు, 'అపూర్వంబగు మజా', మైమరపు కలుగదు 'నోరూరు' తుంది. లిల్ అధరాలలో సుధారసము కాదు ఆయనకు గోచరించేది, జహంగీరు బీడి. బ్రహ్మానందము కాదు ఆయనకు కలిగేది బలే సరదా, బలే గమ్మత్తు ! నయనోత్సవమూ పులకరింతలూ కామాక్షి కోకకి ఆరోపించా రాయన. నగరవాసులకు "తగిలింపబడి యున్నది జాబిల్లి చైనా బజారు గగనంలో పైన అనవసరంగా" అనిపిస్తుంది. హంసయానల్నీ గజగమనల్నీ కాదు వారు చూచేది 'హాయి హీలుయానల్ని'. వారికి వసంతము ఎప్పుడూ ?' "అదుగో చూడుము చెల్లారామ్సు షాపు ముందు వసంతకాలంపు టఖండ అమ్మకా" లని "ఖరీదుల ఫనా ఫనా" అని ఎలా అడ్వర్టయిజు చేయంబడియుందో !"

వీరి రచన అంతా ఆధునిక నగరవాసి ధనికస్వామి కళ్ల జోడు ధరించి చూచి రచించినట్టిది. పఠాభి కన్నుల టెలిస్కోపులు, మైక్రోస్కోపు లున్నవి. ముఖరింపుచున్నది..... కర్ణాలలో వెండి రూపాయి ఘలంఘలా శ్రావ్య సంగీతము. రగులు నలుసులు గల తారులాగ రాత్రి పడుతుంది. మర్యాదస్తుల మంద చేసే పనులకు తరంగాలు బిగ్గరగా తమయ సమ్మతి ప్రకటిస్తాయి. వర్షం పడుతుంటే 'అంగళ్లందున కళ్లకు అగపడిన వరండాలందున నొదుక్కుంటారు తమ దుస్తులు తడుస్తాయని మర్యాదస్తులు గూడ. పాతబడినటువంటి బస్సులలాగ బడబడ అను .... నల్ల మబ్బుల గుంపు. చీలు దారుల్లోన నిల్చోనున్నాడు పోలీసు భటుడు. భరత నాట్యం బాడుచున్న ప్రశాంత ప్రకాశ ముఖంబుతోడి నటర్ని చూడామణిలాగ కన్పిస్తున్నాడు. బల్బు హారన్ల తాళాంతోడి యులక్ట్రికు హారన్ల రాగానికిన్నీ మోటారు సయికిళ్ల

మృదంగానికినీ అనుగుణ్యంగా నర్తిస్తుంటాడు తటాల్మని ఇటూ అటూ తిరుగుచూ హస్తాల నందమ్ముగ త్రిప్పుచు.

పట్టాభిరామరెడ్డిగారితో కవితా సంప్రదాయాలమీది తిరుగుబాటు చాలామట్టుకు పూర్తి అయిపోయింది. సామవేదంవారూ, కవుకొండలవారూ వృత్తాల్ని అర్థానికి అనుగుణంగా విరిచి అచ్చు వేశారూ, కృష్ణశాస్త్రిగారు పుటకి ఒక గీత పద్యమూ, పూర్తిగాని పద్యాలూ అచ్చు వేశారూ, నండూరివారు వ్యాకరణాన్నీ పద్యాల్నీ వదిలేశారూ, పలువురు కవులు వచన పద్యాలు వ్రాశారూ, శ్రీ శ్రీ న న న నత్తి మాటలూ క క కవిత్వంలో ఉండవచ్చన్నారూ, గడ్డిపరక మొదలు గగన కుసుమాలు దాకా పదార్థాలన్నీ—కామాక్షి కోకతో సహా—సామగ్రి అయినాయీ, అలంకార సంప్రదాయాలూ, అనుభవ సంప్రదాయాలూ అచ్చువేసే సమ్‌ప్రదద్ అయ్ ఆల్ ఊ ఇంకా నేను మరిచిపోయి చెప్పని సంప్రదాయాలూ అన్నీ విరిగేయి. ఇకముందు ? ఇకముందేమిటి ?

ఏ నియమాలూ లేవు కనుక అనిబద్ధమైన శుద్ధమైన కవిత్వం రావాలి. దాని మచ్చు పటాకీలు పేలేయి యిదివరకే. చిరకాలం నుంచి ఉన్నదే ఆ కవిత్వము. నాకు తెలిసినంత వివరిస్తాను. వరూధినితో చెలికత్తెలు అంటారు'' పూత పసిండి వంటి వలపుం బచరించు కులంబు నీతికిన్ లేత గదమ్మయీ తెఱగులేమ సురాంగన లెల్ల యిట్టి నీ చేతకు మెత్తురమ్మ ? దయసేయక మెత్తని మేను వెన్నెలన్ వేతురటమ్మ? ఇంత కనువేదురు చెల్లునటమ్మ యింతికిన్''. ప్రవరుడు వరూధినితో అంటాడు ''ఈ పాండిత్యము నీకు దక్క.....'' అని సంస్కృత రామడోళ్లూ శబ్ద లాషామర్వాలూ ఏమీ లేవు. ఆనాటి ఆచారము కనక పద్యములో వ్రాశారు. అది మానినా నష్టములేదు. అలాగు వ్రాయాలి కవులు ఇక ముందు. ఈ రచన ఎన్నిమారులు చదివినా విసుగు పుట్టదు.. ''అనఘ యిదె హేమరత్న సింహాసనంబు ఇచ్చగలదేని కూర్చుండు మిందు వచ్చి, కాక కార్యాంత రాసక్తి కారణముగ నేగదలచిన వాడవో ఎచటికేని ?'' అంటుంది శ్రీనాథుని దమయంతి. 'ఏ వేదంబు పఠించె లూత భుజంగంబే శాస్త్రములు్చాచె, తానే విద్యాభ్యసం బొనర్చె కరి చెంచే మంత్ర మూహించె బోధా విర్భావ నిదానము ల్చదువులయ్యా కావు నీ పాద సంసేవాశక్తియె గాక జీవులకు ?'' అంటాడు ధూర్జటి. (ఇక్కడ గాథలు భక్తుల చిహ్నాలుగా గ్రహించండి.) కైలాస నగమునుండి మంచు కరిగి భాగీరథీ నీరముగా దిగి వచ్చినది. అలాటి అనిబద్ధ కవిత్వము రచించండి.. రవీంద్రు డంటాడు ''నా గీతమ నగలన్నిటినీ తీసి పెట్టేసింది. వాటి గలగల నీ గుసగుసలను వినపడనీయదు'' అని. ఆయనదంతా అనిబద్ధ కవిత్వమే. సూటిగా శక్తివంతంగా మానవత్వ స్పర్శతో చెప్పే కవిత్వానికి అలంకారాలూ, శ్లేషలూ, అనుప్రాసలూ, ఛందస్సులూ, ఆర్భాటాలూ అనవసరము. అక్కరలేనివి బరువులూ బొంతలూను. ''పద్యాన్ని పాడితే ఆ పాట పద్యానికి ఏదో చేర్పనైనా చేర్చుతుంది, అడ్డైనా అవుతుంది'' అని వెనక ఒక గోష్ఠిలో నేనంటే మొదలి శివకామయ్యగా రడిగేరు ''కవిత్వానికి ఛందస్సులు అడ్డు కాదా'' అని. ''అవును అడ్డే'' నంటిని. విశ్వనాథవారు 'ఏకవీర' ను పద్యాంలో వ్రాస్తే ఎంతమందిమి చదివేవారమూ ?

అలాగ అనుకుని చక్కగా రచించేవారు ఎవరేనా ఉన్నారా అని అడిగేరు హనుమజ్జానకీరామశర్మగారు. ఉన్నారు నవ్యాధునికులలోనూ నవీనులలోనూ పెక్కు రున్నారు. అయితే, ఆ రచనలన్నీ తునకల్నీ ఎంచుకుని చూడవలసి ఉంటుంది. నవ్యాధునికులలో ఒకరైన కుందుర్తి నరసింహారావుగారు ఇలాంటి రచనలు వ్రాశారు. కసితో ఛందస్సుని తన్ని పారేసి రచించాలనే కుందుర్తివారి యత్నం. 'ఛందస్సు బంధాలకు పక్షవాతాన్ని' వర్ణిస్తాను అన్నారు. 'అసత్యం కర్రీలేని బంగారం మాటను' అని అనిబద్ధ రచనను ఉద్దేశించారో లేదో కాని, వర్ణించారు. అయితే వీరి పరమార్థం కవిత్వ రచన కాదు, మరి జీవన వర్ణన. కనక అంత్యప్రాసలు తలచు దిగేయి రచనలోనికి. ''దేవుణ్ణి కడుపులనూ, తిట్టుకునే క్షుధాపరులు, అడుగడుగునా ఒరిగిపడే ఆజన్మ దరిద్రజీవులు, కూలివాడు కుష్ఠురోగి వికలాంగులు ఒకరేమిటి ? సామాన్య మానవుడికి స్వరాజ్యం వస్తుంది'' అన్నారు 'జగజ్జ్యోతకంలో'. కడుపులను తిట్టుకునేవారా ? అడుగడుగున ఒరిగి పడేవారా ? 'గుమాస్తా ప్రలాపాలు' ట. నెలలో ప్రథమ పక్షం బహుశా అంత బాధ ఉండదు, రెండోది ఉందిరా బాబూ దానిపేరే అధమ పక్షం. నెలలో వెన్నెల గడచిపోయాక, కృష్ణ కృష్ణ మేమంతా నీ పక్షం, రచనలో నిరాశ సుతరామూ ఒప్పుకోను. నిజమే—బ్రతుకు బాధ ఎవరితో చెప్పుకోను ?'' చెప్పబోయే కల్తీలేని సత్యంతో బంగారం మాట చెబుదామన్న యత్నం కుందుర్తివారిలో వన్నె తేరాలి ఇంకా. ''అందరూ లోకాన్ని తిడతారు, అందులో తప్పు చూపెడతారు, అందరినీ ఖరిస్తుంది లోకం, అందరితో చీవాట్లు తింటూ. అందలం మోసే కూలీ, అందులో కూర్చున్న రాజు, అందరూ లోకాన్ని తిడతారు, అందులో తప్పు చూపెడతారు.'' బాగుంది ఇలాగ రానీవయ్యా స్వామీ రచనలు .... ఈ రకపు రచనలలో ఈనాటి వారిలో సిద్ధహస్తులు దేవర కొండ బాలగంగాధర తిలక్. ఈయన పద్యాలూ పాటలూ వ్రాశారూ అనిబద్ధ రచనలు

చేశారు. అయితే పద్యాలూ పాటలూ ఈయన రచనకు ఉక్కు పంజరాలే అయిన వంటాను. "ఛాయ" లో నిదుర మునింగిన నా కనుం గవలపై నీ అందెల రవళి రవళించు పదము మెల్ల మెల్ల మెత్తగా నడిచిందిలే!' అన్నప్పుడు చివ్వరి 'లే' పాట వరసని లేపి కవిత్వాన్ని ఒక తోపు తోసింది. తర వాతి 'ప్రవహించెలే' కవిత్వానికి మడికట్టింది. 'ఒక సంధ్యా రుణ పాదపద్మ నగరిన్ ఓహోనుతారంపు తారక నర్తించెను' అనగానే 'ఓహో' అంటాము. పద్యాలూ పాటలూ వ్రాస్తూనే వీరు అనిబద్ధ కావ్యాలూ రచించారు. 1943 నాటి "టులాన్" లో కొంత : 'అది నవంబరు పంద్రెండవ తేదీ! దెబ్బతిన్న ఫ్రెంచి దేశం విప్పిచూపిన, రక్తపు మరకల ఛాతీ, మండి దాడబమ్మై సాగే రేగే, లవజ్ఞా జ్యోతి! నిశ్శబ్దపు పరుపులపైన, నిదురించినది పట్టణమంతా. కొండ చివర ఎర్రని నక్షత్రం, రాలి పడింది సముద్రపు నీలంలో. చీకటి కుంపటిలో అస్పష్ట భవిష్యత్తు, రాజుకొంటూన్నది రవ్వలు రవ్వలై, చుక్కలు చుక్కలై. నాలుగు కొట్టింది చర్చి గంట! నిదురించే టులాన్ పట్టణపు గుండెల్లో పగిలింది జర్మన్ శతఘ్ని. శత్రు యంత్రాల లోహ చక్రాల రాపిడిలో, మూర్ఛినవి ఫ్రెంచి భూములలోని, అవమానపు నెరదలు. చలువ రాల గోరీలలో, మాతృధాత్రి మట్టిపొరలలో, స్వతంత్ర మృత వీరుల గాలి గుండెలలో, తిరిగి స్పందించినవి వేడి రక్తపు సిరలు." అక్కరలేని రంగుల ఈకలను దులుపుకుని కవితా విహంగము ఆకాశ విహారానికి లేచే చిన్నెలు "టులాన్" లో కనవడతాయి. ('బాడబమ్మై' అంటే పెద్ద మంటయ్యై' అని అర్థము. పోలిక ఏమీ కాదు. 'కడుపు మండుతోంది' అన్న మాటలకు 'ఆ కలి' ధ్వనిస్తుంది. కాని, మంట పోలిక కన్నుల కట్టదు కదా?) 1953 నాటి 'గుండె కింద నవ్వు' వినండి: 'చేతిలోని కలం అలాగే నిల్చిపోయింది, చివర లేని ఆలోచన సాగిపోయింది. ఏదో రహస్యం నన్నావరించుకుంది, అప్పుడే నీ నవ్వూ నా గుండెకింద వినపడింది.....ఆకాశపు వంపులో ఆర్ద్ర వెనుక నీ నవ్వు పాతాళంలోతులలో ప్రతిధ్వనించి సాగింది. అంధకారపు సముద్రానికి అవతలి ఒడ్డున నీ రూపం అందుకోలేని నా చూపులకి ఆశఆశగా సోకింది' ట. (కలం నిల్చి పోయింది అనగానే నిలువుగా జరిగే కలము ఆగిపోయింది' అని స్ఫురిస్తుంది కాని, 'కాలుతీసి కాలు వేసి నడిచే' అన్న పోలిక రాదు. పోలిక చెప్పగానే కవికి కావలసిన గుణం మాత్రవే ధ్వనించదు. చదువరి ఏరుకోవలసి వస్తుంది. "రైలు నిల్చి పోయింది", "పెండ్లి నిలిచిపోయింది" లాంటి వాడుకలతో నిల్చిపోయింది అన్నమాటకి ఒక ఛాయ ఆవరించింది. ఆ ఛాయని ఉపయోగించుకుంటాడు కవి.) 'సైనికుని ఉత్తరం' చదవండి: "ఇక్కడ నేను క్షేమం, అక్కడ నువ్వు కూడా, ముసలి అమ్మా, పాత మంచంకోడూ, మన చిన్న అబ్బాయీ చెరు వులో కొంగ .... ఇపుడు రాత్రి, అర్ధరాత్రి. నాకేం తోచదు, నాలో ఒక భయం! తెల్లని దళసరి మంచు రాత్రి చీకటికి అంచు..... పోదు నాలో భయం, మళ్లి రేపు ఉదయం, ఎడార్లూ, నదులూ, అరణ్యాలూ, దాటాలి ట్రెంచెస్‌లో దాగాలి, పైన ఏరోప్లేన్, చేతిలో స్టెన్ గన్, కీ యిస్తే తిరిగే అట్టముక్క సైనికులం, మార్చ్! వన్ టూ త్రీ షూట్ డెడ్ ఎవడ్, నువ్వా నేనా!, ..... యుద్ధం, యుద్ధం, లిబియాలో, బెర్లిన్‌లో, స్టాలిన్‌గ్రాడ్‌లో స్వార్థం పిచ్చి కుక్కలా పరుగెత్తింది. .... అడుగో సెంట్రీ! డేరాముందు గోరీలా నిలబడ్డాడు ...... చలిగాలి గుండెలమీద కత్తిలా తెగింది, నీ రూపం నా దేహానికి వెచ్చగా తగిలింది!" ఛందస్సు లేదు, అలంకారం లేదు, గళ ఘోర గంభీర ఘేళఘేళార్భటులూ, హిమవ ద్ప్రాంతపుం బొడుపుటేళ్ల గదల్చు హంసములూ లేవు. కాని, సైనికుడిలోని మానవత్వం ఉందీ, శక్తివంతంగా పలికింది. ఈ కవిత్వానికి సామగ్రి నిబద్ధంకాదు. 'ప్రకటన' వినండి : "స్టేషన్లలో టిక్కెట్లను జారీ చెయ్యకండి, ఎక్కడిరైళ్లక్కడ ఆపివేయండి, దేశదేశాలకీ కేబిలు గ్రామ్సు పంపించండి, దేవాలయాల్లో నిత్యం పూజలు చేయండి, వెతకి తీసుకురండి పరారీ అయిన వ్యక్తిని, ఆమె పేరు శాంతి" పై అడావిడి అంతా చివ్వరి మాటలతో అన్వయమై పోతుంది. ఆ 'వ్యక్తికోసం' అన్నీ చేయవలసినవే. 1962 నాటి "అమృతం కురిసిన రాత్రి" ట! "అమృతం కురిసిన రాత్రి, అందరూ నిద్రపోతున్నారు, నేను మాత్రం తలుపు తెరచి యిల్లు విడిచి ఎక్కడికో దూరంగా, కొండ దాటి, కోన దాటి వెన్నెల మైదా నంలోకి వెళ్లి నిలుచున్నాను". అలా అలా వెళ్లి నిలుచున్న మనిషి కనబడడము లేదూ? 'ఆటవెలది' అని రాస్తూ ఈయన 'తోట ఆకుపచ్చ పైట తొలగి జార పూలరొమ్ము నిక్కపొడిచి నిలచె' నన్నారు. గురజాడ అప్పారావుగారి కాలంనించీ కమ్ముకుంటూ వచ్చిన విప్లవపు పైట తొలగి జారి, తెలుగు కవిత్వపు అనిబద్ధ సౌందర్యము నేటికి నిక్కబొడిచి నిలచినది.

కుందర్తి, బాలగంగాధర తిలక్ మాత్రమే కాదు. ఈ అనిబద్ధ కవిత్వము రచించ యత్నించేవారు ఈనాటివారిలో 'గోపాల చక్రవర్తి' ఇంకొక రున్నారు. 'కలంకలలు' చూడిండి. 'అంగీ లోపల అగ్నిపర్వతం ఉన్నా, చిరునవ్వు మనసారగా నవ్వు, సగటుమనిషి!' అన్నారు. "అభాగ్యుడు శ్రామికు డొకడు మరణించాడు నిన్న సాయంకాలం. కారుకింద పడి నలిగింది కళేబరం. విశ్వనాథ చెప్పింది నిజం. ఆగలేదు సుమా రథం! కర్మ బాబూ పూర్వజన్మకృతం.... అని శుష్కవేదాంతి. ఒళ్లు

# న వ్యా ధు ని కు లు

పొగరేం .... అని తాళింఖానా మనిషి. 'ఇది ఈ మానవుని తుది నిశ్వాసంకాదు, అడుగు మెట్టనాథ లందరిదీ' .... దయానిధి .... అభాగ్యుని అంతిమ ఘట్టమైనా అద్భుతంగా జరగాలి' అన్నాడు దయానిధి.'' అక్కడక్కడ కవి ప్రవేశమూ, అక్కరలేని వర్ణనలూ కొంచెం ప్రక్కదాట్లు వేసినా, ఇది చక్కని రచన. 'చీకటీ దుఃఖం కరువూ కాటకం లేని దేశం ఎక్కడ ఉంది ? సదా అమృతం వెలుతురు ఉన్న రమ్య బృందావన మెక్కడ ఉంది ?' అని అడిగే రీయన. భోజనం చెయ్యనివాడి మాటల్లాగ కొన్ని రచనలు ఉన్నా యనుకుంటాను. ఓ ఆశావాదీ ఛోంచేసి రాయి .... అబ్బూరి రామకృష్ణారావుగారి 'పయనమైన పది నాళ్లకె, పదినాళ్లకె దారి తప్పి పోయావా నా నేస్తం ! ఆఁ, యేదీ నీ హస్తం ? పొరపాటే తిరుగుబాటు, తిరుగుబాటు తిరిగి చాటు.' అన్న రచనకు ఛందస్సు బంధము కాలేదు. అన్వయము కాలిబాటలాగు సాగింది.

అయితే కవిత్వానికి ఛందస్సుతో పనిలేదా ? అంటారేమో పాఠకులు. పనిలేదు. ఛందస్సువల్ల కవిత్వానికి అందము రాదా ? ఛందస్సువల్ల విశిష్టమైన నడక వస్తుంది. ఆ నడక ఒకచోట కవి చేసిన వర్ణనకు అనుకూలముగా ఉండవచ్చును. అంతటా ఉండదు. రచన కనుకూలముకాని కట్టుబాటు ఏల ? కవిత్వానికి అలంకారముతో పనిలేదా ? లేదు. శక్తివంతంగా, అందంగా చెప్పడము సాగకపోతేనే అలంకారము. అలంకార కవిత్వము రెండో రకమే. అలంకార సామగ్రి తాళీదళ సంపుటాలలో ఉంటుంది. దాన్ని తెచ్చుకుని ప్రతీ పండితుడూ రచనచేసెయ్య వచ్చును. రాయల తర్వాత చాలామంది చేశారు కూడాను. పద్యము అల్లగలవా రంతా, అల్లినవారంతా కవులు గానే జమ. అయితే నష్ట మేమిటీ అంటారా ? వారంతా పద్యాలు వ్రాయకపోతే నష్ట మేమిటీ అని. ఆధునిక కాలంలో కూడా ఎందరో వ్రాస్తున్నారని తాము కూడా వ్రాసేవాళ్ళూ, లేని ప్రేయసినీ సౌందర్యాభిలాషనీ వేదననీ తెచ్చిపెట్టుకునే వాళ్ళూ ఎందరో ఉన్నారు. వీ రందరివల్లా—భూభారంమాట నాకు తెలియదు గానీ—వాఙ్మయము భారమౌతోంది. నాలుగు వాక్యాలు సూటిగా వ్రాసి 'హాయి' గొల్పలేనివారు సలక్షైపద్యాలు వ్రాసి బయలుదేరుతున్నారు. కాబట్టి చదివేవారు నిశితమైన విమర్శ చేసుకుని నిర్ణయించుకోవాలి మంచి చెడ్డలు. కవిత్వానికి ఛందస్సుతో, అలంకారంలో, శ్లేషలో, ప్రాసతో, సమాసంతో పనిలేదు. తెచ్చిపెట్టుకున్న ఇనుప నగలు కవిత్వానికి ఇవన్నీ. అన్వయము వంకర తిరగవలసిన అగత్యమూ, దాన్ని ఇక్కడా, దీన్ని అక్కడా అతుకుకుని చదువుకోవలసిన అగత్యమూ ఎందుకు రావాలీ అని. ఎన్నో నియమాలు పెట్టుకుని వాటిని పాలిస్తూ గారడీ చేసి కవిత్వము వ్రాశామంటారేమీ ? అయితే ఏ నియమాలూ లేకుండా వ్రాస్తే కవిత్వమా ? అని అడుగుతారేమో. నియమాలన్నీ పాలించి వ్రాస్తే కవిత్వ మౌతుందా ? అప్పుడు ఏది ఉంటే కవిత మౌతుందో నియమాల్లేకుండా వ్రాసినప్పుడు అది ఉంటేనే కవిత్వ మౌతుంది. మన చర్చ నియమాలమీద కవిత్వము మీద కాదు. కవిత్వానికి నియమా లక్కర్లేదు. ఆ సత్యం గ్రహించి వ్రాత ఆరంభించడానికి తెలుగువారికి ఇన్ని శతాబ్దాలు పట్టిందీ, ఇంతమంది యత్నమూ అవసరమైంది. గద్యలో కూడా కవిత్వం ఉండవచ్చునని ఉపదేశాలు చేసేవారు వచన పద్యాలు వ్రాసేవారిని చూచి మూతి విరుస్తున్నారు. వారి మూతు లట్లే ఉండనివ్వండి. వారు రిపేరుకు కూడా పనికి రారు. మీరు సాగిపొండి

---

గురునాథుఁడును ముముక్షులకును దీక్ష,
కరుణించి గతిఁ జూపఁగలవాఁడు గాక
వివరింపఁ గులగోత్ర విద్యలేమిటికి
శివునట్లు మాయఁ బాసిన మహాత్మునకు.

—పిడుపర్తి బసవన.

# ప్రయాణీకులు



'త్రిపుర'

శివరామన్ వెళ్లిపోతుంటే చూడడానికి ఏర్‌పోర్టుకి వెళ్లేను. శివరామన్‌ని కలకత్తాలో ఈరాష్ట్రం స్పెషల్ ఆఫీసర్‌గా బదిలీ చేశాను. ఇక్కడ అతనికి 'వేడి' ఎక్కువయిపోయింది.

మూడేళ్లనుంచీ కలిసి ఉంటూ, నా చేతికింద పనిచేస్తూ, నాతో స్నేహంగా గడిపిన శివరామన్‌తో ఈ సమయంలో ఏమిటి మాట్లాడగలను ? అతని జీవనం అంతా బాహ్యంగానే ఉంటుంది. కలకత్తాలో దిగగానే మెట్రో, లైట్‌హౌస్, న్యూ ఎంపైర్‌లలో ఏది ఉంటే అది రెండు రోజుల్లో చూసేస్తాను..... రాత్రి గ్రేండ్‌లో కెబేరే .... ఫ్లోర్ షోలో యుజిష్షన్ .... కర్ఫ్యెన్ .... మెంటల్‌కాలు ఒకటి అప్పుడే చోరింఘీలో పెట్టి మాట్లాడుకు పోతున్నాడు.

అతన్ని దిగపెట్టడానికి వచ్చేనే గాని నాకు మనస్సు కుదురుగా లేదు. రాత్రంతా ఫోన్ దగ్గరే గడిపేను. నిద్ర లేదు. సాయంత్రం హఠాత్తుగా వచ్చిన మూడు బీహార్ మిలిటరీ పోలీస్ కంపెనీలకి ట్రాన్స్‌పోర్ట్ కావలసి వచ్చింది. నిలబడ్డ పాటుగా వచ్చేశారు. బూతులు తిట్టేను చూడవచ్చిన వాళ్ల కమాండంట్‌ని. రాత్రంతా ఫోన్ దగ్గర కూర్చుని పట్నంలో ఉన్న గవర్నమెంట్, ప్రైవేట్ జీప్‌లూ, లారీలూ కమాండీర్ చేసి, వాళ్ల నందర్నీ బోర్డర్ దగ్గరికి పంపించేను. మెడికల్ కవర్ కోసం ముగ్గురు డాక్టర్లని తయారుగా ఉంచమని హాస్పిటల్ సూపరింటెండెంట్‌కి ఆర్డర్ పంపించేను. అప్పుడే ఆఖరి లారీలో అందరూ చేరేరని కబురొచ్చింది.

పైని యింకా కొంచెం చీకటిగా ఉంది. ఫోన్ దగ్గర నుంచి లేచి, షేవ్, షవర్, డ్రెస్ చేసుకుని బయటికి వచ్చేను. సుశీల గాఢంగా నిద్రపోతూంది. ఏనుగులు వచ్చి తొండాలతో యింటిని కదిపేస్తున్నా మేలుకోదు. అదృష్టవంతురాలు సుశీల. ఆధారం దొరికితే అద్భుతంగా, అందంగా పాకుతూ చాలాదూరం ప్రయాణం చేస్తుంది. లేకపోతే ......

స్టేషన్ వాగన్ పైకి తీసి, మోగ్రారోడ్‌మీద కొంత దూరం పోయి, కుంజబన్ పక్క నుంచి ఏర్‌పోర్టు రోడ్డులోకి మళ్లించేను. ప్రకృతి అంటే చెట్లు, కొండలూ, హాలీవుడ్ రంగులూ. రివ్వున చలిగాలి చెంపలమీద కొట్టుంటే, కోట్ లేపెల్స్ పైకెత్తి మెడ కప్పుకుంటే వచ్చేది దేహానికి ఒక వింతైన హాయి, అన్‌కాన్షస్ ఆనందం. ప్రకృతి కళ్లల్లో మెదుల్తూ వెనక్కి పోతుంటే, వాగన్ రోడ్‌ని తుడిచేస్తూ ముందుకు పోతూంటే వచ్చే హాయిని గురించి కాన్షస్‌గా ఆలోచిస్తూ ఉంటే, పాత జీవితంలో అక్కడక్కడ మైలు రాళ్లలాగ పాతుకుపోయి స్థిరంగా ఉండిపోయిన విషపూరిత క్షణాలు ఆనందంతో నిండిపోయిన మనస్సులో ఒక్క చిలుకు చిలుకుతాయి. కలవరపడిపోతుంది మనస్సు ఆ క్షణాన్ని. దేహం గగుర్పొడుస్తుంది.

గౌహతి వెళ్లే ఫాకర్ అప్పుడే దిగుతూంది. లౌంజ్‌లో హారిస్ ట్వీడ్ ఎడ్వర్టైజ్‌మెంట్ మోడల్ లాగ శివరామన్. ఆలివ్‌గ్రీన్ యూనిఫార్మ్సలో మిలిటరీ ఆఫీసర్స్ చాలామంది కూచున్నారు. చెట్టు ఆకుల్లో ఒకే పువ్వులా నేవీబ్లూ సూట్‌లో శివరామన్. మిలిటరీ భుజాలమీద బ్రాస్‌పిప్స్ మెరుస్తున్నాయి .... డామిట్ .... బ్లడీ .... లు కౌట్.... డిప్లాయ్.... ఏర్ సుపీరియారిటీ .... చైనీస్ బగ్గర్స్ .... మిలిటరీ మాటలు వడగళ్లలాగ పడుతున్నాయి. శివరామన్‌ని పిలిచి రెస్తరంట్‌కి తీసుకువచ్చేను.

ఇక్కడ వెచ్చగా ఉంది. నియాన్ దీపాలు ఇంకా వెలిగించే ఉన్నాయి. గ్లాస్ కిటికీలోంచి పైకి చూస్తే, భయపడుతూ రోడ్‌మీద నడచే కన్నెపిల్లలాగ వెలుతురు అప్పుడే వస్తోంది. శివరామన్‌ని ఎందుకు లైక్ చేస్తానో బాగా తెలియదు. ఉత్తర ధ్రువం, దక్షిణ ధ్రువంకీ మధ్య ఏదో ఆకర్షణ ? నాలో ఉన్న ఏవో గుణాలు అతనిలో లేకపోవడంవల్ల నాలో సుపీరియారిటీ కాంప్లెక్స్ ఏర్పడి అతన్ని ఎప్పుడూ రక్షిద్దామన్న ఆత్రుత నాలో ఉందా ? నే నిక్కడకు వచ్చిన తరువాత శివరామన్ ఫైల్లో ఉన్న బ్లాక్ మార్క్స్ చాలా మట్టుకు స్వయంగా చెరిపేశాను. శివరామన్‌కి కళ్లకి కనిపించేదే ప్రపంచం. కాళ్లు ఏ బాటమీద నడుస్తుంటే అదే దోవ. వేరే రాస్తాలున్నట్లు తెలియదు అతనికి. వేరే గమ్యస్థానాలు అతనికి కనిపించవు. దోవ కనిపించకపోతే అలాగే నిలబడిపోతాడు అమాయకంగా.

లౌడ్‌స్పీకర్‌లో కరకర వినిపించింది. గౌహతి వెళ్లే ప్రయాణికుల్ని ప్లేన్ దగ్గరకు వెళ్లమని ఎనౌన్స్‌మెంట్ వచ్చింది. ఆలివ్‌గ్రీన్ గుంపూ, నలుగురు సివిలియన్సూ కిటికీ పక్కనుంచి వేగంగా నడుస్తూ వెళ్లిపోయారు ప్లేన్ దగ్గరికి.

శివరామన్‌తో ఆఖరి మాటలు ఎలా ఉండాలో ఆలోచిస్తున్నాను. కృతజ్ఞుడిగా, కుక్కపిల్లలాగ నావెంట తిరిగే శివరామన్‌కి నా హృదయంలోని ఏదో ఒక మూలని బయట పెట్టాలి.

# ప్రయాణీకులు

మేఘాల్లో దాగుడుమూత లాడుతూ పెద్ద ప్లేన్ ఒకటి కోపంగా ఉన్న కందిరీగలాగ తిరుగుతూంది. ఆశ్చర్యం వేసింది. ఈ ఏర్‌పోర్ట్‌లో అంత పెద్ద విమానాలు దిగడానికి సదుపాయాలు లేవు. పైని ఏర్‌పోర్ట్ అఫీషల్స్ కొంతమంది ఖంగారుగా తిరుగుతున్నారు. గౌహతి వెళ్లే ఫాకర్ బుద్ధిగా నియమ ప్రకారం లేచి ఉత్తరంవేపు వలకా, పుస్తకం పట్టుకుని రోడ్డు పక్కగా స్కూల్‌కి వెళ్లే రామా ది గుడ్ బాయ్ లాగ వెళ్లిపోయింది..

పైకి వచ్చేము. ఫైర్ ఎంజిన్లు రెండు గడగడ లాడుతూ వచ్చి నిలబడ్డాయి. లేండింగ్ సిగ్నల్ యిచ్చేరని వెనకని ఎవరో అన్నారు. ఆకాశంమీంచి, దక్షిణం నుంచి తిక్క తిరగని గుడ్డింలా రెక్క విరిగిన పక్షిలాగ గెంతుకుంటూ, తన్నుకుంటూ రెండు వందల మైళ్ల వేగంతో ఎలా దిగి ఎలా టార్మాక్ చివరదాకా వెళ్లి, ఇంకా ముందుకుపోయి ధ్వంసం అయిపోకుండా ఆగిందో .... ఒళ్లు జలదరించింది. కాక్‌పిట్ పక్కనుంచి మంటలు వస్తున్నాయి. ఫైర్ ఇంజన్లు పరుగెత్తేయి బాణాల్లాగ.

వెనక తలుపు తెరుచుకుని, ముగ్గురు బ్లూ అండ్ వైట్ యూనిఫార్మ్స్‌లో రేంప్ లేకుండానే పైకి గెంతేరు. దూరాన నిలబడ్డ మాలో కొందరు అక్కడికి వెళ్లడానికి ప్రయత్నించేరు. సెక్యూరిటీ పోలీస్ అడ్డేరు. గ్రౌండ్ ఇంజినీర్ స్టాఫ్ కొంతమంది జీప్‌లో అక్కడికి చేరారు.

మంట లారిపోయాయి.

క్రూ ముగ్గురూ మెల్లగా నడుచుకుంటూ దగ్గరికి వచ్చేరు. ముందు నడుస్తున్న పైలట్ నడక ఎక్కడో ఇంతకుముందు చూసినట్లు అనిపించింది. పీక్ కేప్ నుదురుని బాగా కప్పింది. పొడుగ్గా, లావుగా, మార్షల్ బేరింగ్‌తో ఏమీ అవనట్లుగా, ఖాతర్ లేనట్లు నడక. గేట్ దగ్గరకువచ్చి పీక్ కేప్ తలమీంచి తీసి జుత్తు సద్దుకుంటుంటే .....

శేషా ........

శేషాచలపతి !

'శేషియో !' అంటూ ఒక్కసారి పరుగెత్తేను.

రెండు చేతులూ వీపు వెనక్కి విసిరి కౌగిలించుకున్నాను.

'శేషియో !'

''మైటీ క్రైస్ట్ ! భాస్కరం !'

''శేషూ !''

నీట్లో పడి మునుగుతూ వచ్చిపోయేవాడికి తన జీవితంలోని ముఖ్యమైన ఘట్టాలన్నీ ఒక్క క్షణంలో ఫిల్మ్ రీల్ లాగ తిరుగుతాయిట. నాకూ శేషాచలపతికీ సంబంధించిన జీవితంలోని ఘట్టాలు—అన్నీ కాకపోయినా—కొన్ని పేర్లూ, కొన్ని స్థలాలూ మనస్సులో స్పార్క్స్‌లాగ మెరుస్తూ మాయమయేయి.

మిగతా యిద్దరితో ఏదో టెక్నికల్ జార్గన్‌లో చెప్పేడు. వాళ్లిద్దరూ హేంగార్ వేపు నడిచేరు. రెస్టరెంట్‌కి తీసుకువెళ్లేను. శివరామన్ వెనకనే వచ్చేడు.

ఎదురుగా శేషూ కూర్చున్నాడు. పక్కని శివరామన్. కూర్చోగానే పరిచయం చేశాను. కుర్చీలోంచి లేచి, నిలబడి చెయ్యి జాపి భుజాం దగ్గర నుంచే హేండ్‌షేక్ యిస్తూ 'హౌడీడూ' అన్నాడు శేషూ.

ఉద్రేకాన్ని అణుచుకోవడం, భావాల్ని కప్పిపుచ్చి మాట్లాడడం ఉద్యోగం కొంత అలవాటు చేసింది. కాని, శేషూని యీ ఎడ్వెంచర్ తరువాత యిక్కడ, ఈవిధంగా కలుసుకోవడం నన్ను కదిలించివేసింది. కాళ్లల్లో శక్తి లేనట్లుగా, నిలకడ పోయినట్లుగా అనిపించింది. మోచేతులు టేబుల్‌మీద ఆన్చి అదే పనిగా శేషూ ముఖంలోకే చూడడం మొదలుపెట్టేను.

శేషూ ముఖం రాతితో చెక్కినట్లుంది. మెరిసే బాకుల్లాంటి కళ్లు. రెండు బాకులు.

''బేరక్‌పూర్‌లో చెక్ చెయ్యలేదు, బాస్టర్డ్స్. నారాయణ్‌గంజ్ వచ్చేటప్పటికి అనుమానం వచ్చింది. సిల్చర్ నుంచి ఏమీ చెయ్యలేనని జవాబు. గౌహతి బ్లేంక్. ఇక్కడ నుంచి మాత్రం ఒ. కె. సిగ్నల్ వచ్చింది. రాకపోతే కర్నల్ భట్టాచార్జీ లాగ పాకిస్తాన్ జైలులో పడిఉందును. అసలు ఎక్కడో క్రేష్ అవును. అనాథరైజ్ ఫ్లయిట్ కాదనుకో. ఫుడ్ డ్రాపింగ్ మిషన్. పెళ్లి చేసుకున్నావేంటి కొంపతీసి. శాంత విశాఖపట్నంలో ఉందిట. ఏదో కాలేజ్. నువ్విక్కడేం చేస్తున్నావు. ఏదో పని. పురుగులుకి ఏమిటి పని ? దొలవడం, గొలకడం, కుట్టడం.''

శివరామన్ వేపు తిరిగి ''మాంటీ క్లిఫ్ట్ లాగున్నావు. ఎంతమంది ఆడపిల్లల్ని పట్టేవు ? నైఫ్ వాడడం తెలుసా ?'' అన్నాడు శివరామన్ గుండెమీద అరచెయ్యి పరిచి ''నీది పిజన్ చెస్ట్. పెల్మనిజమ్ ప్రాక్టీస్ చెయ్యి.''

శివరామన్ ముఖంలో 'అయోమయం.'

''నైథానీ .... నేవిగేటర్. చూశావు కదూ యిప్పుడే. యూస్‌లెస్ బగర్. తేజ్‌పూర్ వెళ్లిన తరువాత గుండు గీయిస్తాను వాడికి. లేండ్ అవుతుంటే ట్రౌజర్ తడిసిపోయింది. స్కాలక్‌కి. కిందటిసారి మనం కలుసుకున్నప్పుడు ఏం చేస్తూ ఉండేవాడిని ? బర్మాషెల్ ? రిషివాలీ స్కూల్ ? ఎక్కడ ? జ్ఞాపకం రావడంలేదు.''

''కటక్‌డాక్ బంగాళాలో. నువ్వు బర్మాషెల్‌లో.''

''డిస్మిస్ చేశారు. రోగ్స్. ఫకీరులాగ కలకత్తాలో మూడు నెలలు తిరిగేను.

గౌహతి నుంచి ఫాకర్ దిగింది. శివరామన్ అందులో పోవాలి. ఎనౌన్స్‌మెంట్ వచ్చింది.

శివరామన్ లేచేడు.

''జాగ్రత్తగా ఉండు. నేను రాసి యిచ్చిన సూచనలన్నీ అనుసరించు.'' అన్నాను. శేషూ లేకపోతే శివరామన్‌తో ఆఖరి క్షణాలు ఎంత సెంటిమెంటల్‌గా ఉండేవో. శివరామన్ బాగా హర్ట్ అయి ఉంటాడు. ఇంత పొడిగా అన్న మాటలతో. ప్లేన్ దాకా కూడా వెళ్లలేదు. రెస్టారంట్ తలుపు దగ్గరే హేండ్‌షేక్ చేసి పంపించేశాను.

''ట్రెమెండస్‌గా ఆకలివేస్తోంది. లేత లేతగా ఉన్న ఆడపిల్లల్ని తినాలని ఉంది. 'దొరకరు గాబోలు.''

''దొరకరు.''

''బేరర్‌ని పిలిచి ఆమ్లేట్స్, ఫిష్ ఛాప్స్ తెమ్మన్నాను.

''బనారస్ జ్ఞాపకం ఉందా ?''

బనారస్ !

జ్ఞాపకాల భారాన్ని ఏడా దేడాదికీ పెరిగే నా సామాన్లతో కూడా నాతోనే తీసుక వస్తున్నాను. నా సామాన్లని నేను మొయ్యను. జ్ఞాపకాల్ని కూడా ఆబ్జెక్టివ్‌గా చూడడం నా స్వంత శిక్షణలో ఒక భాగం. నాకు సంబంధించిన సంఘటనలు ఎవరికో అయినట్లు అనుకోవడం నా మెంటల్ మేకప్‌తో యిమిడిపోయింది.. నిజమేనా ?

''మొగల్‌సరాయ్ వెయిటింగ్ రూమ్ జ్ఞాపకం ఉందా?'' అన్నాడు...... తెల్లవారుజామున మొగల్‌సరాయ్ స్టేషన్. దూరంగా, భారంగా, గుడ్స్ వేగన్ల షంటింగ్ .... అవతల ప్లాట్‌ఫార్మ్‌లో నగ్నంగా వెలిగే ఎలక్ట్రిక్ బల్బ్ కాంతిలో స్టిల్ లైఫ్ చిత్రంలో మనుషుల్లాగ టీ స్టాల్ దగ్గర తలలు బాగా వంచి టీ తాగుతున్న వ్యక్తులు ..... యీజీ చైర్స్ ఏవీ ఖాళీ లేకపోతే రెండు కుర్చీలు కలిపి, సరిపోక, ఐదడుగుల పది కొండున్నర అంగుళాల దేహాన్ని పాములాగ మెలికలు తిప్పుతూ నిద్రపట్టని ఎర్రటి కళ్లు అప్పుడప్పుడు విప్పి మూడు భాషల్లో రైల్వేస్‌ని బూతులు తిడుతూ బాధపడుతూన్న శేషు .... తుఫాన్‌లో దిగిన శాంతకి సర్ గలాహడ్‌లాగ నడుం దాకా దేహం వంచి 'బౌ' చేసి, శాంత నావేపు చూసి పకపక నవ్వుతుంటే, చెయ్యి పట్టుకుని అవతల ప్లాట్‌ఫార్మ్‌కి తీసుక వెళ్లడం .......

ఆ తీసుకువెళ్లడం, అలాగే శాంతని నా జీవితంలోంచి కూడా తీసుకు పోయాడు శేషూ. ఈ ఉద్యోగ భారం ఎటువంటి స్మృతులైనా మనస్సు అడుక్కి తోసి నొక్కి ఉంచుతుంది.

''జ్ఞాపకం ఉంది. నువ్వేదో నా రొమాంటిక్ రహస్యాల్ని ఛేదిద్దామని నా వెంటనే నీడలాగ నాకు తెలియకుండా కాశీ నుంచి మొగల్‌సరాయ్‌దాకా వచ్చి, తరువాత విసుగుపుట్టి, నన్ను కలిసి ......''

''శాంత యిప్పుడొక గ్లోరిఫైడ్ స్పిన్‌స్టర్. లక్కీ బ్లోక్‌వి నువ్వు. శాంత ఒక జబ్బు. దాన్నుంచి నిన్ను విడుదల చేశాను. ఆ జబ్బుని నేను త్వరలోనే వదలగొట్టించుకున్నాను.''

కలకత్తా వెళ్లే ఫాకర్ ఎగిరిపోతోంది. శివరామన్ బాగా నొచ్చుకొని ఉంటాడు.

''ఏం చేస్తున్నా విక్కడ ?

సాధారణంగా చాలాకాలం తరువాత అకస్మాత్తుగా కలిస్తే ఒకరొకరు అడిగే మొట్టమొదటి ప్రశ్న యిది. అడుగుతా డనుకున్న ప్రశ్నలు అడక్కపోవడం శేషూ ప్రత్యేకత.

చెప్పేను.

నవ్వేడు. నవ్వితే దానిమ్మపండు గింజలు. తెల్లగా అమాయకత్వం.

''నీకు సరిపోయిందిలే. కాన్సరెన్సెస్, మీటింగ్స్, మినిట్స్, రోల్‌టాప్ డెస్క్, ఎడ్మినిస్ట్రేటివ్ జీనియస్.... గవర్నింగ్.... అడుగుమీద అడుగు వేసుకుంటూ గవర్నమెంట్ రథాన్ని లాయ్యడం.''

బేరర్ ప్లేట్లు తెచ్చిపెట్టేడు.

చకచక తినడం మొదలుపెట్టేడు.

నైథానీ, రెండో అతనూ మాట్లాడుకుంటూ శేషూ ప్లేన్ దగ్గరికి వెళ్తున్నారు. ...... కటక్ డాక్ బంగళాలో అనుకోకుండా కలిశాం యిలాగే. పక్క గదిలోనే దిగేడు కలకత్తానుంచి పూరీ బిజినెస్‌మీద వెళ్తూ. వరాండాలో చీకటి పడుతూంటే పైని నగర దీపాలు మెల్లమెల్లగా వెలుగుతుంటే, కలుసుకున్న రెండు నిముషాల తరువాతే 'ఆల్బర్ట్ కామూ చదివేవా' అని అడిగి, ఆత్మహత్య గురించి కామూ, షోపెన్ హావర్ అభిప్రాయాలు నాతో కోపంగా చెప్పి ..... బిజినెస్‌లోని సోల్‌ని పరీక్షిస్తున్నానని అన్నాడు. తరువాత, ''బనారస్‌లో లపురానందతో కలిసి హఠయోగం చేసేవాడిని తెలుసా. గట్టర్ స్నైప్ .... ఉన్న తల చెడిపోయింది. వాడు ఎక్స్‌పర్ట్. కాని, వాడి ముఖం కుక్కలు పీకిన ఎముకలాగుండేది. రోత పుట్టుకొచ్చి మానేశాను. కాని, వాడి ప్రభావం యింకా పోలేదు. సాయంకాలం నా నోట్లో వేదాంతం పువ్వుపూస్తుంది మరచిపో .... ''

తెల్లవారుజామున నేను బాలసోర్ పోవాలి. స్టేషన్‌కి నడిచేం యిద్దరమూ.

''నేను ఏకాకిని. తల్లి లేదు. తండ్రి జైల్లో లైఫ్ టెర్మ్. నామీద దయ ఉంచు. మరిచిపోకు'' అన్నాడు రైలు కదలబోతూ ఉంటే.

నవ్వేను.

''నవ్వకు. నిజం. నా చిన్నప్పుడే ఒక మెత్తని కల.... పచ్చటి కల కరిగిపోయి అంతమయి పోయింది. అప్పటినుంచీ నా జీవితం ఒక పీడ కలగా మారింది.''

రైలు కదలిపోతుంటే, కుడిచేతి ఉంగరంవేలూ, చూపుడువేలూ విప్పి 'వి'—సైన్ చేశాడు పగలబడి నవ్వుతూ ......

ప్లేట్లు పక్కకి నెట్టి అన్నాడు : ఇంకా ఎన్నాళ్లో ఉండడం కష్టం. పని అయిపోగానే గేటు దాటేయడమే. కాని పని ఏమిటో, అది ఎప్పుడు అయిపోతుందో ఎలా తెలుసుకోవడం ?

కొంచెంసేపు ఆగి, ఫోర్క్ తీసి టేబుల్‌మీద గుచ్చుతూ

# ప్ర యా ణీ కు లు

''కడుపు నిండితే యిలాంటి ప్రశ్నలే వస్తాయి. [illegible] షెల్ వదిలి, మూడు నెలలు పార్క్‌బెంచ్ జీవితం కలకత్తాలో గొప్పగా ఉండేది. ఒకటే ప్రశ్న. రేపటి ఖానా ఎలా వస్తుంది? ఆఖరికి పట్నాయక్‌ని ఖూనీ చేస్తానని బెదిరించి పాత రికార్డు అంతా మాపు చేయించి, వాడి సిఫారస్‌తోనే ఈ ప్రైవేట్ ఏర్‌లైన్స్‌లో చేరేను. నా వయస్సు తెలుసు కదూ. ముప్పయి తొమ్మిది. అయితే ఫిజికల్‌గా 'ఏ' క్లాస్ ఫిట్‌నెస్. పాత 'సీ' లైసెన్స్ పనికొచ్చింది. నీ పనిలో వర్రీ ? కిడ్నీ జబ్బులు ? కళ్లక్రింద నల్లటి చక్రాలు ?

శేషూని చూస్తుంటే, ఏదో టానిక్‌కి ఎడ్వర్‌టైజ్‌మెంట్ లాగ ఉన్నాడు. దేహం అంతటిలోంచి ఆరోగ్యం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. రోమన్ ముక్కూ, గ్రీషియన్ నుదురూ, ఇరానీ కళ్లు .... తెలుసువాడి తెలివైన వాడి చూపూ .... అవధులులేని అందం.

నైథానీ వచ్చాడు తలుపు తోసుకుని. సెల్యూట్‌చేసి కుర్చీ లాక్కుని కూర్చోబోతూంటే,—

''కూర్చోకు, కూర్చోమనక ముందే. నిలబడే మాట్లాడు ఏం కావాలి ?'' అన్నాడు శేషూ.

పాము కుట్టినట్లు కుర్చీ వదిలి, నిటారుగా నిలబడి నైథానీ ''ఇంకో గంటలో బాగయిపోతుంది. మేజర్ డామేజ్ ఏమీ అవలేదు.'' అన్నాడు. ఏదో పుస్తకంలోంచి చదువుతున్నట్లు మాటలు. కోపం అసూయ, అసహాయత్వం.

''సరే వెళ్లు. తొమ్మిది గంటలకి టేకాఫ్. కేరీ ఆన్.''

నైథానీ బొంగరంలాగ వెనక్కి తిరిగి తల వంచుకుని పైకి పోయాడు..... కటక్ డాక్ బంగాళాలో శేషూ అన్న మాటలు కొన్ని జ్ఞాపకం వచ్చాయి. ''నువ్వేమైనా అను. అన్నిటికంటె ముఖ్యమైన ఫిలాసాఫికల్ ప్రాబ్లమ్ ఆత్మహత్య. కాలం, ఖర్మ, ఏర్పరచిన జీవిత పరిమితుల్ని ఒక్క దుముకుతో దాటేయాలి. తలుచుకున్నప్పుడు చావు—మనకే ఉంది. ఎవరో, ఏ జబ్బో, ఏ క్రిములో చంపేముందే దర్జాగా మనమే మనల్ని చంపుకోవాలి. బాత్‌టబ్‌లో వేడినీళ్లు నింపి అందులో పడుకుని రిస్ట్ దగ్గర బ్లేడ్‌తో కోసుకుంటే గంటలో తియ్యగా చావు. కాని, నా కలా యిష్టంలేదు. స్కై స్క్రేపర్ పదమూడో అంతస్తుమీదినుంచి పేవ్‌మెంట్ మీదకి ఆర్క్‌లాగ దుమికి రక్తం కక్కుకుని చావాలి .....''

బేరర్ కాఫీ తెచ్చాడు. పాట్ లోంచి లిక్కర్ కప్పుల్లో పోసి పాలూ, చీనీ వేసి కలిపి శేషూవే పొకటి జరిపి నే నొకటి దగ్గరగా లాగి సిప్ చెయ్యడం మొదలుపెట్టేను.

పోస్టర్ ఏర్‌మైల్ వాన్ జోరుగా దూరంనుంచి వస్తోంది.

రెండు గెద్దలు కిందికీ, మీదికీ చక్కర్లు కొట్టున్నాయి.

ఏర్‌పోర్ట్ అంతా అలికిడిలేక నిశ్శబ్దంగా ఉంది.

''శేషూ, నీ బ్రేక్ ఫ్లూయిడ్ సంగతి ఏమిటయింది ?''

ఉప్పెనగా నవ్వు. ''జ్ఞాపకం ఉందా యింకా ? ఆవిరయి పోయింది అలాగే. నరహరి చెట్టియార్‌కి ముప్పయివేల నష్టం మిగిలించి వచ్చేశాను మెడ్రాస్ నుంచి ''

[illegible] యార్ చేత మొదలుపెట్టించి, ఓసేదో స్పెషల్‌గా తయారు చేసిన హైడ్రాలిక్ బ్రేక్ ఫ్లూయిడ్ అన్ని కోట్లకుమిన్ని చేస్తుందని నమ్మించి ....

ఆవిరి చేశాడన్నమాట.

ఎక్కడ, ఎలా ఏ పరిస్థితుల్లో ఎవరితో పరిచయం చేసుకుంటాడో అతనికే తెలియాలి. రైళ్లల్లో రెండు నిముషాల్లో ఇతరులవేర దీర్ఘమైన ఆత్మకథలు చెప్పిస్తాడు. ఆత్మబంధువుల దగ్గర కూడా నిర్భయంగా ఉండాల్సిన ఉల్లిక చేస్తాడు.

నైథానీ వస్తున్నాడు. చాలా కృంగిపోయినట్లుగా ఉన్నాడు. శేషూతో ఉన్నవాళ్లకి భయంకరమైన డిప్రెషన్ వస్తుంది. లేకపోతే మేఘాల్లో హమేషా విహరింపచేస్తాడు. మధ్యరకంగా, సహజంగా, ఉండడు. నైథానీ దురదృష్టవంతుడు.

''శేషూ. మళ్లీ ఎప్పుడు కనిపిస్తావో. రొటీన్ జీవితంలో తుఫాన్‌లాగో, హైడల్‌వేవ్ లాగో వస్తావు. నాతో వచ్చి రెండు రోజులుండగలవా'' అని అడిగేను.

అర నిముషం ఆలోచించాడు. ఆలోచించాడా ?

''ఉండలేను. ఉండను తెలుసు నీకు. ఇలాంటి పిల్లి ప్రశ్న లెప్పుడూ అడగలేదు నువ్వు.''

నైథానీ వచ్చేడు లోపలకు. సెల్యూట్‌చేసి, ''మీరొచ్చి చెక్ చెయ్యండి. అంతా ఒ. కే. అనుకుంటాను.'' అన్నాడు.

శేషూ లేచాడు.

బేరర్‌కి డబ్బు యిచ్చేసి బయటకు వచ్చేం.

తొమ్మిది గంట అవుతున్నా ఎండ లేలగా, కొత్తగా ఉంది. ఉత్తరాన్ని మాత్రం దట్టంగా నల్లగా మేఘాలు సుళ్లు తిరుగుతున్నాయి. శేషూ ఏరోడ్రోమ్ ఆఫీసర్ గదిలోకి వెళ్లి ఏదో మాట్లాడి, సంతకాలు చేసి తిరిగి వచ్చేడు. ముగ్గురం ప్లేన్ దగ్గరికి వెళ్లేము.

ఫార్మాలిటీలు అలవాటయిపోయిన నేను ఉండబట్టలేక ''సుశీలని చూడలేదు నువ్వు. ఎంతో 'యిద'వు తుంది'' అన్నాను.

''ఎవరా బిచ్ ? నీ భార్యా ?'' అని నా తలమీద అరచేత్తో గట్టిగా కొట్టి లోపలకు వెళ్లిపోయాడు. కాక్‌పిట్‌లో కూర్చుని, రెండు ఎంజిన్లూ ఒకదాని తరువాత ఒకటి స్టార్ట్ చేశాడు.

ముందుకు వంగి, విక్టరీ సైన్ చేసి, నవ్వి నాలికపైకి పెట్టి వెక్కిరించి, మెల్లగా టేకాఫ్ పాయింట్ దగ్గరికి తీసుకుపోయాడు ప్లేన్‌ని. ప్రచండ వేగంతో టార్మాక్‌మీద చివరదాకా పోయి, పైకి లేచిపోయింది. దూకుడుగా పైకి దరిదాపు నిలువుగా లేస్తూ పోయి ఉత్తరాన్ని ఆవరించిన నల్లటి మేఘాల్లోకి దూసుకుంటూ పోయాడు శేషూ.

నీరెండలో మేఘాల నీడ పడడం మొదలుపెట్టింది, దూరాన పైని ఉరుములు.

# "చిత్రకళా తపస్వి" శ్రీ వరదా వెంకటరత్నం



శ్రీ నేదునూరి గంగాధరం

ఆంధ్ర చిత్రకళను, ఆంధ్రావని నలుమూలలా ప్రాచుర్యం కలిగించి, ప్రచారం కావించుటకు ఎందరో శిష్యులను తీర్చి దిద్దిన మహోన్నత చిత్రకళోపాసకుడు కీ. శే. శ్రీ వరదా వెంకటరత్నంగారు. చిత్రకళాపేక్షాన్వేషులైన విద్యార్థులను తన చిత్రకళాశాలలో చేర్చుకొని, బీద విద్యార్థులకు సాదరపూర్వకమైన ఆర్థిక సహాయం చేస్తూ, చిత్ర రూప రేఖలో, వర్ణ ప్రయోగంలో, చతురతలూ, కళా మెళకువలూ బోధిస్తూ ఉత్తమ శిష్యులుగా నిలవరించుకోగల శక్తి గలవారినిగా తయారుచేసిన చిత్రకళా తపస్వి శ్రీ వరదా వెంకటరత్నంగారు.

వీరు విశాఖపట్నంజిల్లా ఆలమండ గ్రామంలో వరదా సూర్యనారాయణ, అమ్మడు అనే పుణ్య దంపతులకు 1895 సంవత్సరం అక్టోబరు 10 న జన్మించారు. చిన్నతనంలోనే వీరి తల్లి మరణించింది. తరువాత కొన్ని సంవత్సరాలకు సూర్యనారాయణగారి అన్నగారగు తమ్మయ్యగారు తమ్మయ్యగారి సతీమణి చిట్టెమ్మగారు తల్లిలేని యీ బిడ్డను చేరదీసి పెంచారు. తమయ్యగారు అలమండ నుండి కుటుంబసమేతంగా రాజమహేంద్రవరం కాపురం వచ్చారు. వెంకటరత్నంగారి తండ్రిగారైన సూర్యనారాయణగారు ద్వితీయ వివాహం చేసుకొని అలమండ గ్రామంలోనే స్థిరపడినారు.

శ్రీ వెంకటరత్నంగారు శ్రీ వీరేశలింగంగారి స్కూలులో మెట్రిక్ వరకు చదివి ప్యాసయినారు. వీరిని పందొమ్మిది సంవత్సరముల ప్రాయముననే అనగా 1914 సంవత్సరంలో అప్పటి రాజమహేంద్రవర మునిసిపల్ చైర్మన్ శ్రీ జయరామస్వామిగారు శ్రీ కూల్డ్రేగారి ప్రోత్సాహంవలన మునిసిపల్ గరల్సు స్కూలులో డ్రాయింగు మాస్టరుగా నియమించారు. చిన్ననాడే వెంకటరత్నంగారికి శ్రీ దామెర్ల రామారావుగారితో సాహచర్య మేర్పడింది. చిత్రాలు గీస్తుండేవారు. గవర్నమెంటు మోడల్ స్కూలు చదువు పూర్తిచేసుకొనేటప్పటికీ ఈ మిత్రద్వయానికి వి. ఎస్. రాం గారితో పరిచయభాగ్యం కలిగింది. శ్రీ సత్యవోలు గున్నేశ్వరరావుగారి నాటక కంపెనీకి వెనుక తెరలు పెయింటింగు వేయటానికి మద్రాసునుంచి శ్రీరాంగారు ప్రత్యేకించి వచ్చారు.

రామారావుగారు వెంకటరత్నంగారు శ్రీరామ్‌గారి చిత్రకళా వైదుష్యాన్ని తిలకించే కాలంలోనే నేటి ప్రఖ్యాతిగల చిత్రకారులు వేమకూర భాష్యకారులుగారు, వేమకూర సత్యనారాయణగారు వీరి జనుంగు మిత్రులై సంచరించేవారు.



శ్రీ ఒ. జె. కూల్డ్రే అప్పుడు ప్రభుత్వ కళాశాలకు ప్రిన్సిపాలుగా ఉండేవారు. ఆ కాలేజీలో విద్యార్థిగ ఉన్న శ్రీ దామెర్ల వెంకట్రావుగారు, తన తమ్ముడగు రామారావుగారినీ, వెంకటరత్నంగారినీ శ్రీ కూల్డ్రేగారికి పరిచయం చేశారు. తదాదిగా వీ రిద్దరూ వ్రాసి తెచ్చిన చిత్రాలన

## "చిత్రకళా తపస్వి" శ్రీ వరదా వెంకటరత్నం

శ్రీ కూర్లేడ్డే పరిశీలించేవారు. అనుకరణ చిత్రాలు వ్రాయు వద్దని, ప్రత్యక్షంగా చూచిన వాటినే వ్రాయుమని, యథా తథంగా ఉన్న రంగులలోనే చిత్రించండని సూచన లిచ్చేవారు. ఈ సూచనల మేరకు మిత్రు లిద్దరూ రచించిన చిత్రాలను వారు పరిశీలించి, తగిన సలహాలిస్తూ ప్రోత్సాహపరిచే వారు. ఈ ప్రోత్సాహమే వీరి చిత్రకళా విజ్ఞానానికి మెరుగులు దిద్దింది. సృజనాత్మకభావ ప్రకటన, రంగుల కూర్పుతో జాతీయత ఉట్టిపడే తెలుగు చిత్రకళకు మార్గదర్శక మయి నది.

శ్రీ కూర్లేడ్డేగారు దామెర్లవారి కుటుంబముతో పరిచయం ఉండుటవల్ల అప్పుడప్పుడు వారింటికి వస్తూ ఉండేవారు. శ్రీ రామారావుగారిని బొంబాయిలో నున్న చిత్రకళాశాలలో చిత్రకళాభ్యాసానికి పంపమని ప్రోత్సహించారు. శ్రీ రామా రావుగారు బొంబాయి వెళ్లారు. శ్రీ వెంకటరత్నంగారి ఆర్థిక పరిస్థితి సరిలేనందువలన రామారావుతో బొంబాయి వెళ్లే అదృష్టం లేకపోయింది.

రాజమహేంద్రవర వాస్తవ్యులు శ్రీ ఇంజరపు వీరేశ లింగంగారి కుమార్తె పాపాయమ్మను శ్రీ వెంకటరత్నంగారి కిచ్చి వివాహం చేశారు. 1920 సంవత్సరంలో శ్రీ వెంకట రత్నంగారు గవర్నమెంటు కాలేజిలో డ్రాయింగు మాష్టా రుగా చేరినారు. అనారోగ్యంతో బాధపడుతూ ఉండేవారు. కుటుంబపోషణ, సంసార తపనతో శ్రీ వెంకటరత్నంగారు ఆర్థిక దుర్బలతతో సతమత మవుతూ ఉండేవారు. దానికి తోడు ప్రాణమిత్రుడు రామారావు దగ్గర లేని లోటు మరింతగా కలత పెట్టేది. ఈ పరిస్థితులలో కుంచె మూల బెట్టేరు మాష్టారుగారు. బొంబాయినుండి శ్రీ రామారావుగారు వ్రాసే ఉత్తరాలు శ్రీ వెంకటరత్నంగారిలో ఉద్దీపనం కలిగించేయి.

1921 సం. లో శ్రీ రామారావుగారు చిత్రకళలో ఉత్తీర్ణులై బొంబాయినుండి తిరిగి రాజమండ్రి చేరుకొన్నారు. రాజమండ్రి వచ్చేటప్పుడు శ్రీ రామారావుగారు ఉత్తర భారత దేశంలో గల ప్రముఖ చిత్ర కళాకేంద్రాలను పరిశీలించి వచ్చారు. అసహాయుడై, విషణ్ణుడై, నిర్వీర్యుడై, దుర్బలుడై క్రుంగి కృశించివున్న వెంకటరత్నంగారిని చూచి శ్రీ రామా రావుగారు ఎంతో తపించారు. వారి పరిస్థితులను విని పరిత పించారు. తాను అండగా ఉండి మిత్రునకు తిరిగి కుంచెను అందించి ప్రోత్సాహపరచి తిరిగి చిత్రకళా వ్యాసంగం ప్రారం భించారు. వేకువజాముననే ఆరు బయలుకు వెళ్లి ప్రకృతి దృశ్యాల ప్రతికృతులు, ఇంటివద్ద రేఖావర్ణ చిత్రాలు, సాయంత్రం తిరిగి ప్రకృతిదృశ్యాల పరిశీలనమూ చేస్తూ చిత్ర రచనను పెంపొందించుకుంటూ ఉండేవారు.

శ్రీ దామెర్ల రమణరావుగారి పుత్రుడు రామారావు. దిగుమర్తి శ్రీనివాసరావుగారి పుత్రిక సత్యవాణి. శ్రీ రామారావు గారి జననము 8—3—1897, సత్యవాణిగారి జననము 8—10—1908. వీరి వివాహము 1—6—1919 లో జరిగినది. రామారావుగారు 1923 సంవత్సరంలో "ఆంధ్ర స్కూలు ఆఫ్ ఆర్ట్సు" అనే పేరున చిత్రకళా పాఠశాలను స్థాపించారు. ఈ స్కూలులో మాష్టారూ, చామకూర సత్య నారాయణగారు, సత్యవాణిగారు, బుచ్చి కృష్ణమ్మగారూ, అంతాల వెంకటసుబ్బారావుగారూ శ్రీ రామారావుగారి వద్ద చిత్రకళను నేర్చుకొన్నారు.

అప్పుడు వెంకటరత్నంగారు ఉబ్బస వ్యాధిచేత తీవ్ర మైన అస్వస్థతకు లోనైనారు. ఆ సందర్భంలో వెంకటరత్నం గారి ముఖ్య శిష్యులు (పాలకొల్లు వాస్తవ్యులు) బంగారు వరాహ నరసింహారావుగారు తమ గురువు గారిని మద్రాసు, బెంగుళూరు ప్రాంతాలకు గాలి మార్పుకై తీసుకు వెళ్లినారు. అప్పుడే వెంకటరత్నంగారు ఆయా ప్రాంతాలలోని చిత్రకళా విధానములను పరిశీలిస్తూ తాను తన శిష్యులు చిత్రాలు వ్రాస్తూ ఉండేవారు. ఆయన ఆరోగ్యం కుదుటబడక స్వస్థలం తిరిగి వచ్చివేశారు. వెంకటరత్నంగారు తమ ఆరోగ్య స్థితిపై నిస్పృహ ప్రకటించారు.

విధివైపరీత్యం — శ్రీ రామారావుగారే మశూచి వ్యాధి గ్రస్తులై 8—3—1925 తేదీని దివంగతు లయ్యారు. రామారావుగారి భార్య శ్రీమతి సత్యవాణి గారిని శ్రీ వెంకట రత్నంగారు చిత్రకళోన్నతురాలుగా చేశారు. 1938 సం. లో ప్రభుత్వ స్త్రీల బోధనా పాఠశాలలో చిత్రకారిణిగా ఉద్యోగం వచ్చింది. శ్రీమతి సత్యవాణిగారు శ్రీ రామారావుగారి ఒరవడి లోనే అనేక చిత్రాలు నేటికీ చిత్రిస్తున్నారు. ఈమె చిత్రాలు అనేక పత్రికలలో ప్రకటించబడి బహు ప్రశంసలు నందు కొన్నాయి. చిత్రప్రదర్శనములలో బహుమతులు పొందినాయి.

శ్రీ వెంకటరత్నంగారికి యిద్దరు మగపిల్లలు జన్మిం చారు. పురిటిలో ఆ యమ్మకు మశూచి వ్యాధి సోకింది. పిల్లలూ, ఆమె కూడా 1926 లో పరమపదించారు. అప్ప టికే అస్తవ్యస్తమై యున్న వెంకటరత్నంగారి జీవిత గమనము నకు వీరి సతీమణి నిర్యాణము తీవ్రమైన అశాంతికి, ఆత్మీ యత లేని లోటుకు కారణములైనాయి. నాటినుండి నేటి వరకు వెంకటరత్నంగారు నడుం గట్టుకొని, జీవితపు వ్యథలు గడచిన విషాదస్మృతుల నుండి దూరమగుటకు, ఏకాగ్రత నిలవ రించుకొనుటకున్నూ, చిత్రకళమీద నిరంతరం దృష్టిని కేంద్రీకరించుకొన్నారు.

శ్రీ వెంకటరత్నంగారు చిత్రకళా బోధనాచార్యులుగా ఉద్యోగము నిర్వహించుకొంటూ, ఇంటివద్ద తీరిక వేళలలో తన శిష్యులకు చిత్రకళ నేర్పుతుండేవారు. బీద విద్యార్థులకు ఆర్థిక సహాయం కూడా చేసిన వదాన్యులు.

మిత్రుడు రామారావు కీర్తిశేషులైనసహా వారి పేరు చిరస్థాయిగా ఉంచాలనే దృఢసంకల్పంతో "రామారావు ఆర్టు గ్యాలరీ" అనే పేరుతో చిత్ర ప్రదర్శనశాలను 1925 సం. లో ఏర్పాటు చేశారు. తదాదిగా యీ చిత్ర ప్రదర్శన శాల నేటికీ కళాకేంద్రంగా రాజమండ్రికి వన్నె తెచ్చింది. దీనికి ముందుగా శ్రీ రామారావుగారిచే స్థాపింపబడిన స్కూలు "రామారావు స్కూలు ఆఫ్ ఆర్ట్సు" అను పేరుననే శ్రీ వెంకట రత్నంగారు ప్రిన్సిపాలుగా ఉంటూ, సుమారు నాలుగు దశాబ్దాలుగా తన మిత్రుని శాంతికీ, ఆశయసిద్ధికీ, అనవరతం శ్రమిస్తూ వందలాది శిష్యులకు గురువులుగా—విజ్ఞాన మహా మనీషిగా ఆదర్శజీవి అయినారు.

1925 సం. ఫిబ్రవరి భారతిలో ఆంధ్ర చిత్రకారులు అనే శీర్షికతో శ్రీ రామారావుగారు, శ్రీ చేమకూర భాష్యకార్లుగారు, శ్రీ వరదా వెంకటరత్నంగారు అంటూ వారి ఛాయాచిత్రాలు స్వరచిత చిత్రాలు ప్రకటించారు. అందులో వెంకటరత్నంగారు ఏకమూర్తి చిత్రాలు వ్రాయుటలో బహు ప్రసిద్ధులని ప్రశంసించారు. వెంకటరత్నంగారి చిత్రాలు భారతి 1925 ఏప్రియలు, 1927 నవంబరు, 1931 జనవరి, 1933 అక్టోబరు, మాసములందు ప్రముఖముగా ప్రచురించబడ్డాయి.

1. విరహిణి. 2. గంధర్వులు. 3. విలాసిని. 4. సముద్రుడు. 5. గోదావరి ఘాటు. 6. ద్రాక్షారామ దేవాలయము. 7. నటరాజు. 8. దశరథ క్షీరభంగము. 9. విశ్వామిత్ర తపోభంగము. 10. గంధర్వ శాప విమోచనము. 11. కైలాసనాథ్. 12. వసంతము. 13. సైరంధ్రి. 14. నిశాగమనము. 15. దమయంతి, కిరాతుడు. 16. గోపీకృష్ణ. 17. దేవదాస్. 18. అజంతాసుందరి. 19. బ్రహ్మ. 20. విద్యాధరి. 21. విష్ణువు. 22. స్ప్రింగ్. 23. ఎల్. డి. ఫీల్డ్సు మొదలగు చిత్రాలేగాక, స్కెచ్‌లు, ప్రకృతిదృశ్యాల ప్రతికృతులు మొదలైనవి లెక్కకు మిక్కుటముగా ఉన్నాయి. వీరి చిత్రాలు స్వదేశంలోనే గాక, కొన్ని విదేశాలలో కూడా ప్రదర్శింపబడి ఎన్నో బహుమతీగ్రహీత లైనాయి. సౌత్ కెన్సింగ్‌టన్‌లో చిత్రకళా ఖండముల ప్రదర్శనమునకై 1937 సం. లో బ్రిటిషు ప్రభుత్వమువారు అనేక దేశాల నుండి ఎన్నుకొన్న పన్నెండు చిత్రాలలో మాష్టరుగారి చిత్రం ఒకటి.

శ్రీ వెంకటరత్నంగారికి పురప్రముఖులు 4 వేలు నిధి సేకరించి 1962 సం. లో ఇచ్చారు. కాని, వారు దానిని తిరిగి స్కూలుకే ఇచ్చేశారు. కేంద్రప్రభుత్వంవారు నెలకి రు. 100 —లు భరణం ఇస్తూవచ్చారు.

ఆంధ్ర చిత్రకళాచార్యుడు, నిస్స్వార్థపరాయణుడు, నిగర్వ చూడామణి, నిరాడంబరుడు, నిరంతర దీక్షాదక్షత గల చిత్రకళా తపస్వి, మహోదారుడు, అగు శ్రీ వరదా వెంకటరత్నంగారి ఆత్మకు పరమేశ్వరుడు శాంతిని ప్రసాదించుగాక.

---

గీ. దేవభాష వ్రాయ దేవనాగర లిపి
బాలబంధు లిపిని బరఁగ గ్రంథ
లిపి గ్రహింతు రొరులు లీల స్వలిపి వ్రాయు
వారలాంధ్రు లాంధ్రభాష యనదె.

కొక్కొండ.

# చాళుక్య జయసింహవల్లభుని పిష్టపుర శాసనములు



శ్రీ యస్వీ జోగారావు

(ఇటీవల తూర్పు గోదావరి మండలమున పిఠాపురమునకు మూడుమైళ్ల దూరములో నున్న విరవాడ గ్రామమున ఆ గ్రామ వాస్తవ్యులు వ్యవసాయదారులు నైన శ్రీ మల్లె పుడుగుల రామచంద్రముగారు తమ నివేశన స్థలమున త్రవ్వకము సాగించుచుండగా చక్కగా కడియములతో నమర్పబడిన రెండు తామ్ర శాసనములు వారికి లభించినవి. విరవాడ వాస్తవ్యులు, ప్రకృతము ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో తెలుగు శాఖలో ఎం. ఏ (సీనియరు) చదువుచున్న భాషాప్రవీణ శ్రీ మిరియాల రామకృష్ణ బి. ఏ. ఆ శాసనముల విషయము నాతో చెప్పగా శాసనలిపి శాస్త్రమున మద్గురుస్థానము చరిత్ర చతురాననులు కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మగారి కడ నేర్చిన రెండు ముక్కలకును వినియోగ మేర్పడును గద యను నాశతో వారి నా శాసనములు కోరితిని. కోరినదే తడవుగా శ్రీ రామకృష్ణ తీసుకొనివచ్చిరి. శ్రీరామచంద్రముగారికిని, శ్రీరామకృష్ణగారికిని నా కృతజ్ఞతాభివాదములు. ఎక్కడ రామకీర్తన వినిపించునో అక్కడ హనుమంతు డుండు నందురు. అట్లే మనసార శాసనము పేరు చెప్పునరికి శర్మగారు స్మరణకు వత్తురు నాకు. వారిని స్మరించి శాసనముల పట్టుకొనునరికి అందలి లిపి క్లిష్టమై క్రీ. శ. 7 వ శతాబ్ది నాటి శాలంకాయన చాళుక్య సంధికాలపు తెలుగు—కన్నడ లిపి యైనప్పటికిని వెంటనే నా అలవికి వచ్చినది. సోమశేఖరులకు మనః పూర్వకముగ నొక నమస్కారము.)

మొదటి కీర్తివర్మ పుత్రుడును, రెండవ పులకేశిమహారాజునకు తమ్ముడును అగు కుబ్జవిష్ణువర్ధనుని కాలమున తెలుగు గడ్డపై చాళుక్య ప్రభుత్వ మేర్పడినది. ఆ కుబ్జ విష్ణువర్ధనుని తరువాత రాజ్యమునకు వచ్చినవా డతని జ్యేష్ఠ పుత్రుడగు మొదటి జయసింహవల్లభుడు. రాబర్ట్ స్వ్యూయల్ గారి Historical Inscriptions of Southern India ప్రకార మాయన రాజ్యకాలము క్రీ. శ. 633—663 (చూ. పుట. 336). డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్య గారి "The Eastern Chalukyas of Vengi" (పుట. 64) ప్రకార మది క్రీ. శ. 641—73. ఈ "జయసింహ వల్లభుని దాన శాసనములందు పేర్కొనబడియుండు దానోద్దిష్ట స్థలములనుబట్టి చూడగా అతని పాలన క్రింది రాష్ట్రము విశాఖపట్టణ ప్రాంతమునుండి గుంటూరు మండలములోని ఒంగోలు పరిసరముల వరకును వ్యాపించి యుండెనని తోచుచున్నది" అని సెలవిచ్చినారు డాక్టరు వెంకటరమణయ్యగారు. (చూ. తెలుగు విజ్ఞాన సర్వస్వము సం. 3, పుట. 144).

ఈ జయసింహవల్లభుని నిడుప్రరు శాసనము (Epigraphia Indica XVII. 5), పులిబ్రుమ శాసనము (E. I. XIX. 42), పెదవేగి శాసనము (E. I. XIX, 43), పెదమద్దాలి శాసనము (Indian Antiquary.. XIII—P. 137) అను నీ నాలుగు శాసనములందును "శ్రీ సర్వసిద్ధి" బిరుదము కన్పట్టుచున్నది.

"ప్రిధివి జయసింహవల్లభ" అను మాట పులిబ్రుమ శాసనమున గలదు. "పృథ్వీవల్లభ" అను బిరుదము మొదటి కీర్తివర్మకును, రెండవ పులికేశికిని గలదు. (చూ. E. I. XIX. 42 P. 254—258: "The term. Prithvi-vallabha, it Should be noted, was a title of Kirtivarman I as well as of his 'on Pulakesin II" — Sri V. Rangachari.) ఈ జయసింహవల్లభుని విప్పర్ల శాసనము తప్ప (ఇది తెలుగు గద్యము, శిలా శాసనము) తక్కినవన్నియు సంస్కృత గద్య ఘటితములు.

ఇక ప్రకృత మీ పిష్టపుర శాసనముల స్వరూపము. రెండును మూడేసి రాగిరేకు లొక్కొక్క గుండ్రని కడియములో సమర్పబడి ఆ కడియము లుబ్బెత్తుగా నున్న రాగి దిమ్మలతో నతుకబడి ఆ దిమ్మలపై నిడుపగు శాసనపు సీలు (ముద్ర) సందు వలె నడుమ "శ్రీ సర్వ్వ సిద్ధి" అను అక్షర పంపుటియు, మీద అర్ధ చంద్రుడు, క్రింద పద్మపత్రములు నున్నవి. ఇవి పెద్ద శాసనము (నం. 1) మీదనే స్పష్టముగ కానవచ్చుచున్నవి. చిన్నదాని (నం. 2) యందు సుష్టుగా చెరిగి పోయినవి. ఒకదాని బరువు సుమారు 75 తులములు; రెండవది సుమారు 35 తు. వీనిని క్రమముగా 1 వ, 2 వ శాసనములని వ్యవహరింతము. 1 వ శా. రేకు పొడవు, వెడల్పులు : 6.9" × 2.6", కడియపు వ్యాసము 2.8", ఎడమ ప్రక్కగా రేకుల రంధ్రము 0.6", సీలు కొలత నున్నది—పొ × వె : 1.8" × 1.4", మందము 1.2". రేకున కొక్కొకవైపు ఏడేసి పంక్తులు, పంక్తికి 24—25 చొ. అక్షరములును గలవు. వ్రాత చక్కనిది. 2 వ శా. రేకు పొ × వె : 6.6" × 1.6", కడియపు వ్యాసము 2.3", ఎడమప్రక్క రేకుల రంధ్రము 0.4", సీలు కొలత నున్నది, మట్టము 1.5", మందము 0.9". 1 వ రేకు మొదటివైపు లిపి లేదు. ఆ రెండవ వైపు, 2 వ రేకు రెండు వైపులను నాలుగేసి పంక్తులును, 3 వ రేకు మొదటివైపున ఐదు పంక్తులును గలవు. పంక్తికి 18—24 చొ. అక్షరములు గలవు. వ్రాత అంత అందమైనది కాదు గాని బోధపడుచున్నది. రెండింటను లిపి శాలంకాయన కాలపు శాసనలిపికి గూడ సరిపోవు నట్టిది. రెండును సంస్కృత గద్య ఘటితములు.

## 1 వ శాసనము: పాఠము

1 వ రేకు రెండవ వైపు :

స్వస్తి శ్రీ మదసన పురవాసకాత్ స్వశక్తిముఖక్షపితదస్యు తనయ మహాసేనేన మహాసేనాభి వర్ద్ధితాధి రాజ్యానాం హారితి పుత్రాణాం మాతృగణపరి పాలితానాం మానవ్యస గోత్రాణాం అశ్వమేధావ భృథస్నాన విధ్వంసిత జగత్కల్మషాణాం చలుక్యానాం కుల జల నిధి సముద్భూత రాజరత్నస్య సకల జగదార్త్తి హర కర్మణః శ్రీ కీర్త్తి వర్మణః ప్రియసప్తా సత్యపి కలియుగే కృత యుగ ఇవ ప్రజా పరిపాలనార్థ మవతారిత మనుష్య జన్మనః (ఐ) దం యుగీన మహావిష్ణోః విష్ణువర్ద్ధన మహారాజస్య ప్రియతనయః ప్రవర్ద్ధ మానః.

2 వ రేకు మొదటివైపు :

ప్రతాపోపనత సమస్త సామన్త మణ్డలః స్వభుజాగ్రస్థితలస దసిముఖ ప్రథా ప్రసవాహోపజ్జిత రిపు నృపలి మకుట తటఘటిత ఏణి మరీచిమఞ్జరీపుఞ్జపిఞ్జరిత చరణ కమల యుగళః స్వశక్తిత్రయ త్రిశూల భిన్న పర నరపతి సకల బల చేతనః అనేక సమర సంఘట్ట విజయా వాప్త యశో విశేష భూషణః స్వమనోభిప్రేత సమకాలాధిగత కార్య్య సిద్ధి ధృత శ్రీ సర్వ్వ సిద్ధిః స్వభుజబల విజయోపపాదిత రాజ్యకాన్తి త్థః విజయాభిరామః స్వకులోదయ గిరి శిఖరావ భాసిత మహోదయత్వాత్ శ్రీ.

2 వ రేకు రెండవ వైపు :

నరేన్ద్రాదిత్య స్య ... ప. ర. వీత. పకర.... దిపపు ....
రసప .... జ్జ్వల దనధాన్య సముదయాబివర్ద్ధిత వప్ర...
గ్రహః యుధిష్ఠిర ఇవ ధర్మ్మ పరాయణః బృహస్పతి
రివన యజ్ఞః మ
ను రివ వినయజ్ఞః ఐరావణవ దనవరత దానోచ్చహస్తః రామ
ఇవ దాశరథి రప్రతిహత శాసనః స్వజన పరిజన వత్సలః ప
రమ బ్రహ్మణో మాతాపితృ పాదానుధ్యాతః శ్రీ ప్రిథివి
. జయసింహవల్లభ
మహారాజః పిష్టపుర పథ వసతో ధర్మ్మాధికరణ
ప్రముఖా (నధికారిణః)

3 వ రేకు మొదటివైపు :

....సమాజ్ఞాపయతి విదితమస్తు వో యథాస్మాభిరస్మి
న్నగరసీమ్ని (వేదద్వ)
యాలంకృత ముఖారి విష్ణస్య అనేక శాస్త్రార్థ విదో
రుద్ర శర్మణో
పౌత్రాయ స్వశాఖాధ్యయన తత్పరస్య స్వకర్మ్మ నిరతస్య
పుష్పశర్మ్మణః
పుత్రాయ స్వశాఖాధ్యాయినే గౌతమసగోత్రాయ కతస
బ్రహ్మ
చారి ఆచిర్య వర్మ్మణే మూల కెరియన్నాసు క్షేత్రం
సర్వకర
పరిహారేణాగ్రహారీకృత్య సముప పాదితం తథాభవద్భి
రన్యైశ్చ
ధర్మ్మాధిగత బుద్ధిభి రస్మద్వంశ్యై రాజన్యైర్వ్వా
బాధాకరణీయా.

గమనిక : 1 వ రేకు మొదటివైపు సాధారణముగ లిపి యుండదు. ఇందును లేదు. 3 వ రేకు 2 వ వైపు గలదు కాని అరిగి అరిగి చెరిగిపోయినది. "జయసింహ నరాధిప" అను అక్షరములు మాత్రము కనిపించినవి. (రెండవ పంక్తిలో.)

## 2 వ శాసనము: పాఠము

1 వ రేకు రెండవ వైపు:

స్వస్తి శ్రీ విజయస్కన్ధావారాత్ హారితి పుత్రాణాం మానవ్యస గోత్రాణాం

అశ్వమేధావ భృథస్నాన విధ్వస్త జగత్కల్మషాణాం

చాలుక్యానాం కులజల నిధి సముద్భూత రాజరత్నస్య

శ్రీ కీర్తివర్మణః పౌత్రః అనేక సమర సంఘట్ట విజ

2 వ రేకు మొదటివైపు:

యినః శ్రీ విష్ణువర్ద్ధన మహారాజస్య ప్రియతనయః ప్రవర్ద్ధ

మానః ప్రతాపావనమిత పర నరపతి మకు

ట మణి మరీచి మఞ్జరీ పుఞ్జ పిఞ్జరిత చరణ యుగలః

చాలుక్యార్యాణ్ణవ వంశద్వయాలయైకః పరమబ్రహ్మణో

2 వ రేకు రెండవ వైపు:

మాతాపితృ పాదానుధ్యాతః శ్రీ ప్రిథివీ జయసింహవల్లభ మహా

రాజః పిష్టపుర నగర కుటుమ్బినః విషయాధి

కారిణశ్చ సమాజ్ఞాపయతి విదితమస్తువో యథాస్మాభి

రస్మిన్నగర సీమ్ని వేదవేదాంగ విదః కుమారశర్మణః పౌత్రాయ

3 వ రేకు మొదటివైపు:

(పితుర) ధిక గుణ విశేషస్య భో(భ?)వ శర్మణః పుత్రాయ గౌతమస

గోత్రాయ కఠిన బ్రహ్మచారిణే స్వకర్మ నిరతాయ సామి శర్మణే

(పిష్టపు) ర పశ్చిమ దిశ్యాగే లొమ్బొది యన్నామక్షేత్రం సర్వ్వకర (పరి)

హారేణా గ్రహారీకృత్య సమ్ప్రత్తం తథాభవద్భిరన్యైశ్చ పరిపాలనీ

యః స కైశ్చిద్బాధాకరణీయా అత్రన్యాస .... శ్రేయసే.

3 వ రేకు రెండవ వైపు:

బహుభిర్వసుధా దత్తా బహుభిశ్చాను పాలితా

యస్య యస్య యదాభూమిస్తస్య తస్య తదా ఫలమ్

(ఇది సాధారణముగా చాళుక్యరాజుల అనేక దానశాసనముల చివర "తథా వ్యాసేన ప్రోక్తమ్" అని ఉదహరింపబడు శ్లోకమే. "స్వదత్తాం పరదత్తాంవా" అను శ్లోకము నిట్టిదే.)

## 1 వ శాసనము అర్థము

అసనపుర నివాసమునుండి : తన శక్తి ముఖముచే దానవ సేనను నాశనముచేసిన కుమారస్వామిచే అభివృద్ధిపొందిన రాజ్యము గలవారు, హారీతిపుత్రులును, మాతృగణ పరిపాలితులును, మాన వ్యస గోత్రులును, అశ్వమేధ యాగములు చేసి జగత్కల్మషము నరించినవారు నైన చాళుక్యుల కుల జలనిధియందు ప్రభ వించిన రాజరత్నము, జగదార్తిహరములగు పనులు చేసినవాడు నగు శ్రీ కీర్తివర్మకు ప్రియ పౌత్రుడును, కలియుగమున కృతయుగమునకు ప్రజా పరిపాలనార్థము మనుష్యావతార మెత్తినవాడు, ఈ కాలపు మహావిష్ణువు నైన విష్ణువర్ధన మహారాజునకు ప్రియ తనయుడును, ప్రవర్ధమానుడును, తన ప్రతాపముచే సమస్త సామంత మండలమును సాధించిన వాడును, తన బాహువుకు లొంగిన శత్రురాజుల మకుట మణి కాంతుల ప్రకాశించిన పాద కమలములు గలవాడును, స్వశక్తి త్రయ ప్రతాపముచే పర నరపాల బలమును భేదించిన వాడును, పలు పోరుల గెలుపు వలని కీర్తినే విశేష భూషణ ముగా ధరించినవాడును, తన యుద్ధోద్యమము ప్రకారము సకాల మున కార్యసిద్ధి పొందినవాడును "శ్రీ సర్వసిద్ధి" బిరుదమును ధరించినవాడును, తన భుజబల విజయలబ్ధమైన రాజ్య కాంతిచే ప్రశస్తికెక్కిన వాడును, విజయాభిరాముడును, తన వంశపు పొడుపుమలపై మహోదయము నందుటచే నరేం ద్రులం దాదిత్యుడైన వాడును .... ధర్మజుని వలె ధర్మపరాయ ణుడును, బృహస్పతివలె నయజ్ఞుడును, మనువు వలె విన యజ్ఞుడును, ఐరావతమువలె అనవరత దానోత్సాహుడును, దాశరథియైన రామునివలె అప్రతిహత శాసనుడును, స్వజన పరిజన వత్సలుడును, పరమ బ్రాహ్మణ్యుడును, మాతాపితృ భక్తుడును నైన శ్రీ పృథివీ జయసింహవల్లభ మహారాజు పిష్టపురమున అధివసించి ధర్మాధికరణ ప్రముఖుల నాజ్ఞా పించు చున్నాడు. ఏవిధముగా ననగా మాచే ఈ నగరసీమ యందు వేదద్వయ పండితుడును, బహు శాస్త్రవేత్తయు నైన రుద్రశర్మకు పౌత్రుడును, స్వశాఖాధ్యయన తత్పరు డును, స్వకర్మ నిరతుడును నైన పుష్పశర్మకు పుత్రుడును, స్వశాఖాధ్యాయియు, గౌతమస గోత్రుడును, కఠిన బ్రహ్మచారియు నైన ఆదిత్య శర్మకు 'మాల కెరియం' అను క్షేత్ర మును సర్వకర పరిహారముగా అగ్రహారము చేసి యిచ్చుట జరిగినదో ఆ వైనము తెల్లమగు గాక! మీచే గాని, యిత రులచే గాని, ధర్మాధిగత బుద్ధులగు మా వంశపు రాజులచేగాని బాధ కలుగరాదు.

## 2 వ శాసనము అర్థము

విజయస్కంధా వారమునుండి :—(సంగ్రహముగ).... ఆ కీర్తివర్మ పౌత్రుడును, విష్ణువర్ధనుని పుత్రుడును ....నైన శ్రీ పృథివీ జయసింహవల్లభ మహారాజు పిష్టపుర నగర వాస్తవ్య

లను విషయాధికారుల ని ట్లాజ్ఞాపించుచున్నాడు : ఏవిధముగా నయితే మాచేత ఈ నగరసీమయందు వేదవేదాంగ విదుడైన కుమారశర్మకు పౌత్రుడును, తండ్రికంటె ఘనుడైన భోవ శర్మకు పుత్రుడును, గౌతమసగోత్రుడును, స్వకర్మ నిరతుడును నైన సామిశర్మకు పిష్టపుర పశ్చిమ దిగ్భాగమునందలి "తొంబదియం" అను క్షేత్రమును సర్వకర పరిహారముగా అగ్రహారముగా చేసి యిచ్చుట యైనదో ఆ వైనము తెల్లమగుగాక ! మీ చేతను, ఇతరుల చేతను (ఈ మర్యాద) పాలింపబడును గాక ! ఎవ్వరి వలనను హాని కలుగకుండుగాక !

రెండింటను చాళుక్య ప్రశస్తి, జయసింహవల్లభుడు అతని తండ్రి తాతల పేర్లను పేర్కొనబడినవి. రెండును దాన శాసనములే. దత్త క్షేత్రములు పిష్టపుర సీమలోనివని పేర్కొనబడినవి. మొదటిదానియందు రాజు పిష్టపురమున అధివసించి యున్నట్లు చెప్పబడినది. రెండవ పులకేశి "ఐహోల్" శాసనము (క్రీ. శ. 634—35) పిష్టపురముపై నతని విజయమును పేర్కొనుచున్నది. శ్రీ డి. సి. సర్కార్ తన "The Successors of the Satavahanas" (పుట. 117) లో—"they (Eastern Chalukyas) ruled first probably from Pishtapura, next from Vengi and then from Rajahmundry." అని చేసిన యూహ సరియైనదని తోచును. అయితే ఇందలి 1 వ శాసనమున పేర్కొనబడిన "అసన పురము" సంగతి యేమిటను ప్రశ్న వచ్చును. ఈ శాసనము వలెనే ఈ జయసింహుని 'నిడుప్రరు' దాన శాసనము గూడ అసన పురము నుండియే వేయబడినది. ఈతని 'పులిబుమ్ర' దాన శాసనము నందలి ప్రతిగ్రహీతయైన గౌతమసగోత్రుడు రుద్రశర్మ మీది 1 వ శాసనమున ప్రతిగ్రహీతకు పితామహుడుగా పేర్కొనబడిన రుద్రశర్మయు గౌతమస గోత్రుడే ('అసనపుర వాస్తవ్య' డని పేర్కొనబడినది. రెండవ విష్ణువర్ధనుని యొక దానశాసనమున గూడ (Ind. Ant. VII-P. 192) ప్రతిగ్రహీత యొక్క పితామహుడు అసనపుర వాస్తవ్యుడని చెప్పబడినది. ఆనాటి చాళుక్య చరిత్రలో ఈ అసనపురమునకేదో ప్రాముఖ్య ముండినట్లు తోచును. "పులిబుమ్ర" (పులింబూరు—పాలమూరు, భీమవరం తాలూకా) శాసనమునకు వ్యాఖ్య వ్రాయుచు శ్రీ వి. రంగాచారిగారు : "Asanapura which Seems to have Played an important Part in the Cultural history of this Period. I am Unable to identify. Might it be "Annavaram" of the Same taluk (ie.. Bhimavaram of Godavari Dt) అని యన్నారు. మరి అసనపురము గూడ తూర్పు చాళుక్యప్రభువుల తొలినాటి రాజధానులలో నొకటి యగునో! విడిదియగునో ! సరిహద్దు మకా మగునో ! పై 1 వ శాసనమున ఎత్తుగడలో అది అసనపుర నివాసమునుండి వేయబడినట్లును నడుమ రాజుగారు పిష్టపురమున అధివసించియున్నట్లును చెప్పబడినది. అనగా ఆనాటి కందొకటి రాజధానియు, నొకటి తాత్కాలికమైన విడిదియునై యుండు ననిపించును.

ఇక 2 వ శాసనము "విజయస్కంధావారము" నుండి వేయబడినట్లున్నది. ఇతని "పులిబుమ్ర" శాసనము గూడా విజయస్కంధావారము నుండి అనగా యుద్ధపు విడిది నుండి వేయబడినదే. అట్లు యుద్ధ శిబిరముల నుండి కూడ దానశాసనములు వేయు నాచారము గలదు. అయితే ఈ జయసింహుడు చేసిన యుద్ధముల వివరము తెలియదు.

---

ఘనుఁడైన నల్పుఁడైనను
జననింద్యుండైన లోక సమ్మతుఁడైనన్
ధనియైనఁ బేదయైనను
దనతండ్రియె మంచివాఁడు తనయున కెపుడన్.

—చిలకమర్తి

నాటకము:

# ఒకే నిద్ర - ఎన్నో కలలు



శ్రీ బుచ్చిబాబు

(గత సంచిక తరువాయి)

(శ్రీనివాసు లోపలికెడుతాడు. సుధీర్‌కుమార్ మెల్లగా ప్రవేశిస్తాడు. పాంటు, బుష్‌కోటు (తెల్లది) ధరిస్తాడు. చేతులో బాగ్ ఉంటుంది. ఎవరూ పలకరించరు)

సుధీర్‌కుమార్:—నమస్తే......నేను......సుధీర్‌కుమార్....

రామయోగి:—డాక్టర్ సుధీర్?

సుధీర్:—అవునండి—నమస్తే— నన్ను మీరు ఎరుగుదురా— ఎట్లా ఎరుగుదురు?

రామయోగి:—మెడ్రాస్ మెడికల్ కాలేజి మేగజీన్‌లో మీ ఫోటో చూశాను. బర్త్‌కంట్రోల్ గురించి మీ దొక వ్యాసం చదివాను. మంచి విషయం—మెడికల్ జార్గన్ వాడకుండా, సామాన్యుడికి తెలిసొచ్చేటట్లు కచ్చితంగా చెప్పారు, నాలుగు ముక్కలూను. ఒక రోజుకి లక్షా డబ్భైవేలు చొప్పున ప్రపంచ జనాభా పెరిగిపోతూందంటే ప్రతి ప్రపంచ పౌరుడూ గుండెపై చెయ్యివేసుకుని—ముఖ్యంగా పుస్తి కట్టేముందు—మరీ సిద్ధపడాలి. పిల్లల అభివృద్ధి పథకం—అమలు జరపడానికి, ఇన్ అదర్ వర్డ్స్, మారేజి ప్రాజెక్ట్స్!

సుధీర్:—థ్యాంక్స్......మరి.......మీరు.......

రామయోగి:—నేను—రామయోగి అంటారు—థీసిస్ వ్రాస్తున్నాను— తీరా డిగ్రీ రాకపోవచ్చు—అంద చేత ఇప్పట్లో గుంభనంగా—ఉంచాల్సిన విషయం. ఎక్స్‌క్యూజ్ అజ్ — విలబడే ఉన్నారు......రండి. కూర్చోండి.

సుధీర్:—థ్యాంక్స్. మీరు చెప్పినట్లు జనాభా పెరిగి పోతున్నది నిజమే. కాని, నిమిషానికి ఇద్దరు చొప్పున హత్యకాబడుతున్నారుట—ముఖ్యంగా పాశ్చాత్య దేశాలలో— సొ—బాలెన్స్ ఆఫ్ నేచర్‌ని రెస్టోర్ చేస్తూనే ఉన్నాడు, మానవుడు. (తనే నవ్వుతాడు—కుర్చీలో కూర్చోబోతూ దానిమీద సగం గీసివున్న వాటర్ కలర్ చిత్రం పైకెత్తి చూస్తూ......) ఛార్మింగ్ వాటర్ కలర్—అబ్‌స్ట్రాక్ట్ మానర్—షివాక్స్ ఛావ్‌డా.....

విశ్వం:—ఏదీ చూడనివ్వండి—అమ్మాయి రాధ గీస్తోంది.

సుధీర్:—ఆల్ మోస్ట్ పర్‌ఫెక్ట్—రాధ — మన రాధ— (రాధ, లక్ష్మమ్మ ప్రవేశిస్తారు.) కంగ్రాట్యులేషన్స్. ఛార్మింగ్‌గా ఉంది.

రాధ:—(అటూ, ఇటూ వెదుకుతూ చూస్తుంది) ఓ— వచ్చారే........మీరు.....మీ రెప్పుడొచ్చారు?......నాన్నా.. నాన్నగారూ......సుధీర్‌కుమార్.....గారు, అదే డాక్టర్ ముఖర్జీ.....గారి....తమ్ముడు.......గారు డాక్టర్......

లక్ష్మమ్మ:—కాస్త కాఫీ తీసుకురానా........అమ్మాయి బర్త్‌డే.....

సుధీర్:—అక్కర్లేదండి—థ్యాంక్స్.

రాధ:—కాఫీ కాకపోతే......టీ.....పుచ్చుగుం....టా.....రే— వారు, గారు.....

రామయోగి:—రాధా డిజప్పాయింట్స్‌మి......చాలా గారెలు వడేసింది—వళ్లొంతో ఒక్కటీలేదు......

సుధీర్:—(గొంతు సవరించి) నమస్తే రామదాసుగారు.....

రామదాసు:—ఏమిటి విశేషం? ఎప్పుడూలేంది......ఇవాళ వచ్చారేం కథ?

సుధీర్:—లేకపోవడమేం......ఈ ఉదయం.....(నాలుక కొరుక్కుని) ఈ ఉదయం దిస్ మార్నింగ్..... ఐ యామ్ సారీ,.....నిన్న మార్నింగ్ నే.......వచ్చాను.......అంటే పట్నంనుంచి... ..

విశ్వం:—ఏమయ్యా సుధీరు—నాకో సందేహం. కలకత్తాలో మంచి మెడికల్ కాలేజెస్—ఎల్. ఎమ్. ఎఫ్. బెంగాలీ డిగ్రీ పుచ్చుకున్నాడులే మా పినతండ్రి ఒకాయన— అక్కడ మంచి కాలేజీ లుండగా, మీరంతా మద్రాస్‌లో చదవడం ఎందుకో......

సుధీర్:—నాకు తెలీదండీ...... మా బ్రదర్....... అంటే మా అన్న.....ముప్ఫై ఏళ్లక్రితం చిన్నతనంలోనే ఇక్కడికి వచ్చేశాడు. మా అంకుల్‌తో.....ఎరుగుదురుగా, నరేంద్రకుమార్......బ్యాంక్‌లో పని.....వారు పోయారు......అక్కడ—కలకత్తాలో మా కెవ్వరూలేరు. ఇక్కడే ఉండిపొయ్యాడు అన్న.....

రామయోగి:—ఓ ఐసి......అట్లా ఎడ్జస్ట్ అయిపోవాలి..... ఇప్పుడు....... ఏం పనిలో......

సుధీర్:—వచ్చిన పనాండి....... బిజినెస్ ప్లన్స్‌ప్లైజర్...... (బాగ్‌లోంచి కాగితాలు తీసి రామదాసుగారి కిస్తాడు) ఇవి మీ కిమ్మని చెప్పారు, లక్ష్మణస్వామిజీ.

రామదాసు:—(వాటిని చూసి) వాట్—నాన్సెన్స్—ఇన్‌కమ్ టాక్స్ ఫారమ్స్......పైగా.....వరల్డ్ ఇన్‌కమ్‌టాక్స్‌ట, అతన్నే కట్టుకోమనండి.

రామయోగి:—ఐ లైక్ దట్. వరల్డ్ ఇన్‌కమ్ బిజినెస్—ఇక్కడ ఈనాడు మీకు పదమూడు వేలు లాభా లొచ్చాయంటే, కొరియాలో వందమంది కూలీలు పస్తు. ఆస్ట్రియాలో అరవైమందికి ఒంటిపూట భోజనం—ఇరాన్ ఆయిల్ కంపెనీలో—ఆరుగురి స్ట్రైక్.......అన్నీ ఒక దాని కొకటి లింకే—ఒక గొలుసు—ఆ పన్ను చెల్లించకపోతే, నే చెప్పిన అఘా యిత్యాలన్నీ—మీరు చెల్లించేవరకూ కొనసాగుతూం టాయి—వారి కోసం చెల్లించి తీరాలి—ఇదే గొలుసు తత్వం—కొండొకచో రామయోగీయిజమ్!

రామాదాసు:—పైగా వచ్చే సంవత్సరాని క్కూడా కట్టా లిట.

రామయోగి:—అదంతా ముందు ముందు పర ప్రాంతాలలో కొందరు తిండిలేక పడి ఉండకుండా జాగ్రత్తపడే పీడింపు చర్య. వ్రాసుకోండి కొత్త సామెత. అసలు పన్నాడందే రాబడి పన్ను రాలుతుందా!

విశ్వం:—ఇప్పు డింక నువ్వు భాగస్వామివికావుగా—అందుచేత అతనే కట్టుగోవాలి ఆ పన్ను.

రామయోగి:—అదేమన్న ముక్క— లాభ నష్టలు సమంగా పంచుకుంటున్నప్పుడు—ఇవాళ వరకూ, రాబడెంతో చిట్టావేసి, దానిమీద టాక్స్, ఇద్దరూ కట్టుకోవా లని, స్వామీజీ సూచన కాబోలు. యా మై రైట్ డాక్టర్—?

సుధీర్:—నాకు తెలీదండి. టాక్స్ అంత పడకుండా వారేదో మార్గం ఆలోచించారట. అది కూడదన్నారుట మీరు—అంటే—రామదాస్‌జీ...... అందుకని ఆఫీసర్ కోరి నట్లు కట్టుకోవాలిట—ఇద్దరూ. కంపెనీ ద్వారా—ఇతరత్రా ఎంతెంత రాబడో చూపి, ఫారమ్‌మీద సంతకాలు పెట్టాలిట.

రామదాసు:—ఇతరత్రా రాబడేముంటుంది నా తలకాయ.

రామయోగి:—ఉంటుందని వారనలేదే— ఉంటేమటుకు చూపాలన్నారు—నాకు తెలవ కడుగుతానూ—ఇతి రత్రా ఎందుకుండకూడదండీ. ఒకడి దగ్గర ఓ పదో వరకో పుచ్చుగుని ఉద్యోగం వేయిస్తే అది రాబడి. రాధమ్మ వేసిన చిత్రం ఆర్టెగ్జిబిషన్‌లో ఆరొంద లికి అమ్ముడుపోతే,—మైనర్ గనక— అది రాబడి. శ్రీనివాసు ఇన్సూర్ చేయిస్తే రాబడి....

లక్ష్మి:—అదేమిటి అట్లాగనేస్తున్నావ్. మావారు అట్లాం టివి ఎన్నడూ తలబెట్టరు.

రామదాసు:—వాళ్లకీ వీళ్లకీ లంచంపోసి, ఇప్పట్లో టాక్స్ తగ్గించుకున్నా, ముందు ముందు ఇంతకి రెండిం తలు గుద్దుకోక మానదు. కాబట్టి, రహస్య పద్ధతు లొద్దు, రాజమార్గాన వెడదామన్నాను.

విశ్వం:—ఇహనేం—నీ సలహా ప్రకారమే చేశాడు.....

రామదాసు:—అవులేమాత్రం—కంపెనీ వ్యవహారాల్లో నా పూచీ లేదు—ప్లీడర్ని కనుక్కునే ఫారమ్ పంపుతానని చెప్పు—

సుధీర్:—దానికి గడువు రేపేనట. రేపట్లోగా పూర్తి చేసి పంకపోతే......

రామదాసు:—చెప్పావుగా—చూస్తాను, ఏం జరుగుతుందో—ఇంక నువ్వెళ్ళు—

రామయోగి:—మనం చాలా మాట్లాడుకోవాలి డాక్టర్—ఎప్పుడు మళ్లా కలుసుకోవడం?

రామదాసు:—సుధీర్ వచ్చాడంటే భయమే. ఏదో అవాంతరం జరుగుతుంది.

సుధీర్:—నే నింకెప్పుడూ రాను— రామదాసుగారూ—మీకంత అయిష్టంగా ఉంటె. కాని ఒక్కమాట చెప్పనివ్వండి. నావల్ల మీకు ఏ అవాంతరమూ జరగలేదు.

విశ్వం:—రాధని చిన్నప్పుడు తిల్లాకి తీసుకెళ్లి.....

సుధీర్:—క్షమించాలి. చిన్నతనం—ఆటల్లో ఏమి తెలుస్తుంది. ఏదో జరిగిపోయింది. రాధ నా బాల్య స్నేహితురాలు....

రామదాసు:—ఇదంతా అపచారం చేసినవాడు చూపే గిల్టీ కాన్షన్స్.

సుధీర్:—మాతో ఏ అపచారమూ చేసిన బాధ లేదు. చెయ్య లేదు కూడా. అందుకోసం మీ ఇంటి కొస్తున్నాను. లేకుంటే చాలా పొరబాటు. నేను రానేరాను—దూరంగా ఉంటాను.

రామదాసు:—ఎంత దూరంగా ఉంటే అంత మంచిది.

సుధీర్:—వెడతాను. వెడతాను—రా.....

రామయోగి:—అన్యాయం బెంగాలీలంటే తెలుగు వారికి మోజు. వారు కళాప్రియులని ప్రతీతి. ఎటొచ్చీ వారు దూరం గా ఉండాలి. ఆంధ్రుడు చిత్రమైన వ్యక్తి—ఇతర ప్రాంతాలలో ఏ రంగంలో విపరీతం బైలుదేరినా వెంటనే అనుకరిస్తాడు— కాని వారితో కలిసి ఉండ లేడు. దేశాన్ని ప్రేమిస్తాడు. దేశంలో ప్రజలంటే గిట్టదు. ఒక ఆదర్శంకోసం, ఉద్రేకంతో ఎగిరి పడతాడు. దానికోసం ఏ త్యాగమైనా చేస్తాడు—ఆ ఆదర్శంమాత్రం ఫలానా అని తెలిసుండకూడదు.

రామదాసు:—నీ లెక్చర్లు థీసిస్ లోకెక్కేదు వుగాని, సందర్భం లేకుండా మమ్మల్ని బోర్ చెయ్యడం మానెయ్యి రామయోగి. నా తల నేడెక్కి పోతోంది.

రామయోగి:—రైట్. ఆలోచించేటట్లు చేశాసన్న మాట. ఇన్నాళ్లకి ఐ కంగ్రాట్యులేట్ మై సెల్ఫ్.

సుధీర్:—నే వెడతాను—కాని మీతో ఒక్కమాట చెప్పాలి.

రామయోగి:—నాతోనా. నాకు రహస్యాలులేవు. ఆకాశంలాంటిది నా మనస్సు.

సుధీర్:—మీతోకాదు. రామదాసుగారి భార్యతో.

రామదాసు:—వాట్! ఆవిడతోనా—ఆవిడతో ఎందుకు నాకే చెప్పు.

లక్ష్మి:—ఏమిటండదీ— ఇట్లా రండి, చెప్పండి.

సుధీర్:—ఇది స్త్రీలకి కాని చెప్పకూడదు. ఎటికెట్‌కాదు.

రామదాసు:—అదేం కుదరదు—నాకు చెప్పకూడని దేదీ లేదు— ఏమిటో చెప్పు.

సుధీర్:—నాకు సిగ్గుగానూ, భయంగానూ ఉంది చెప్ప డానికి—పోనీ, మరోమారు చెప్తాను.

విశ్వం:—ఏమిటయ్యా, నీదంతా చిత్రంగా ఉంది.

రామయోగి —ఊహించే ఆట ఆడుదమా ? మొగాడితో చెప్ప కూడనిది—స్త్రీతో ఏకాంతంగా చెప్పవల్సిందీ— ఏమిటై ఉంటుంది— ఆలోచించండి పిన్నిగారూ— యు ట్రై రాధా—

లక్ష్మి:—ఇప్పుడీ ఆటలకి సమయమూకాదు, ఓపికలేదు. సుధీర్—ఇట్లారా—(లోపలికి వెడుతుంది. సుధీర్ వెనకాల వెళ్లబోతాడు. రామదాసు అటకాయిస్తాడు)

రాధ:—అదేమిటి నాన్నా అమ్మతో చెప్పనీ—ఎవరితో చెబి తేనేం? అమ్మ నీకు చెప్పదా ఏమిటి?

రామదాసు:—వల్లకాదు—ఏమిటి ఈ నాటకం అంతా—నీ కెన్నిసార్లో చెప్పాను. వీళ్లతో ఏమి పెట్టుకోవద్దని— జ్ఞానం వచ్చిన దానవు. నువ్వూ అమ్మతో మద్దతై ఈ చుట్టరికాలు సాగిస్తే ఏం జరిగినా నే బాధ్యుణ్ణి కాను.

రామయోగి:—పురుషుడి చివరి అస్త్రం ప్రయోగించేశారు. వెరి చీప్—రామదాసుగారు—చటుక్కున నోటి కొచ్చిం దనకూడదు. భర్తృహరి చెప్పినట్లు.

రామదాసు:—యు ఆర్ గెటింగ్ ఆన్ మై నెర్వ్స్. శ్రీనూ— ఇటురా—అతను నువ్వూ అల్లా ఎక్కడైనా షికారు పొండి.

(శ్రీనివాసు ముస్తాబై వస్తాడు)

శ్రీనివాసు:—కమాన్ రామయోగి—బైటికి పోదాం.

సుధీర్:—శ్రీనివాసు—నువ్వూ ఉండాలి.

శ్రీని:—ఎందుకు ?

సుధీర్:—చెప్పమంటారా:—

రామదాసు:—చెప్పి తీరాల్సిందే—

సుధీర్:—తర్వాత విచారిస్తారు.

రామదాసు:—ఫరవాలేదు. అందరం ఇక్కడే ఉన్నాం. కలిసే విచారిస్తాం.

సుధీర్:—రెండు కుటుంబాలకీ ఫామిలీ డాక్టర్— ఉమ్మడి హోదాలో చెప్తున్నాను లక్ష్మణస్వామిగారి—

లక్ష్మి, రాధ:—(ఒకసారిగా) ఏమైంది ?

సుధీర్:—లక్ష్మణస్వామిగా రమ్మాయి మీనాక్షికి (వేళ్లు మడుస్తూ) మూడోమాసం.

లక్ష్మి, రాధ:— ఆ! ఆ—!

సుధీర్:—అవును. మా అన్నయ్య, నేనూ ఇందాకనే చూశాము ఆమెని. సందేహంలేదు—అది—మూడోమాసం.

రామదాసు:—(విరగబడి వెకిలిగా, దీర్ఘంగా నవ్వుతాడు)....మీనాక్షికి మూడో మాసంట......మా బాగా అయింది. కావల్సిందే ........ (ఇంకా నవ్వుతాడు.)

విశ్వం:—అవును. లక్ష్మణస్వామికి ఒక్కతే కూతురు. పాపం. తల్లిలేదు— వివాహం కాలేదు......మూడోమాసమా... చిత్రంగానే ఉందే.

లక్ష్మి:—ఒంట్లో బాగాలేదు—వచ్చి చూసి పొమ్మంది— ఇదే కాబోలు, పాపం......

రామదాసు:—పాపం ఏమిటే.......లక్ష్మణస్వామి మనవణ్ణి ఎత్తుతాడు......

విశ్వం:—మనమరాలు కాకూడదూ?

రామదాసు:—(ఇంకా నవ్వుతాడు) మనమరాలు....

రామయోగి:—స్త్రీ కర్తవ్యం మాత కావడం. ఆమె సృష్టి కర్త. ప్రాణం అనే మిరకిల్‌ని సృష్టించి, మానవ ప్రపంచాన్ని శూన్యంలో నశింపకుండా తిప్పి నడపడంలో సృష్టికర్తతోబాటు శ్రమించి సాధించిన ఘటానికి విస్తుపోయి, భక్తితో చేతులు మోకరించి నమస్కరించి, పూజించడానికి బదులు విరగబడి వెకిలిగా నవ్వేస్తున్నారా రామదాసుగారు. మీ హేళనంతా లక్ష్మణస్వామి గారిపై పగ చిహ్నమేనా—?

రామదాసు:—(కాస్త తేరుకొని) కాదు. బర్త్ కంట్రోల్‌పై వ్యాసాలు వ్రాసిన డాక్టర్ ద్వారా ఆ వార్త విన్నందుకు నవ్వొస్తోంది...ఆ అదృష్టవంతుడు—అల్లుడుగా ఆస్తంతా స్వాధీనం చేసుకోబోతున్న ఆ మహత్తర వ్యక్తి మళయాళీ కురియన్నా, ఒరియా మహంతా, గుజరాతీ మానిక్‌లాలా, మహారాష్ట్రం కాంబ్లేయా......బెంగాలీ...

సుధీర్:—కల్తీలేని ఆంధ్ర పిల్లకాయ శ్రీనివాసు.....

రామదాసు:—(ఉక్కిరి బిక్కిరై) ఆ, ఆ—ఆ, ఆ—ఏమిటదీ. ఎవడూ—ఎవడూ మళ్లా చెప్పు.

సుధీర్:— మీ ఏకైక పుత్ర రత్నం— అల్లారు ముద్దు బిడ్డడు—శ్రీ....ని ...వా....సు....

రామదాసు:—ఛీప్—ఏమిటా కూత. తెలిసే మాట్లాడు తున్నావా—

లక్ష్మి:—అవునుట

రామదాసు:—కచటతపలు కట్టిపెట్టు—ట, ట—ఏమిటే?

లక్ష్మి:—అవును. మీనాక్షి చీటీ పంపింది. అదే, ఇందాక నారాయణ తెచ్చింది.

రామదాసు:—ఆ దరిద్ర నారాయుడు తెచ్చిందా— ఏడీ వాణ్ణిల్లా రమ్మను. చీరి ఎండేస్తాను.

రాధ:—వాడిక మనింట్లో పని చెయ్యడుట.

రామ:—ఏమొచ్చింది?

రాధ:—ఫ్యాక్టరీలో పనికని పెట్టుగుని, దాని బదులు ఇంటి పనులు చేయించుకుంటున్నాంట. లక్ష్మణస్వామిగారు, ఫ్యాక్టరీలోనే ఉంచుతా నన్నారుట. అక్కడికి పొయ్యాడు.

రామదాసు:—హోరి పీడ—ఎంతకు తెగించాడు.

విశ్వం:—అవునుమరి. వాడికీ తెల్సింది, కంపెనీ యాజమాన్యం నీకు లేదని—

రామదాసు:—ఏరా శ్రీనూ... .మాట్లాడవేం.

శ్రీని:—ఏమో నాన్నా......నాకేం తెలుసు. ఇంతవరకూ వస్తుం దని......

రామదాసు:—నీకు మీనాక్షితో అంతటి పరిచయం ఉందిట్రా?

లక్ష్మి:—వస్తూ పోతూండడమేగాని, ఇంతవరకొస్తుందని నాకు మాత్రం ఏం తెలుసు. పట్నంలో చదువులుగా... ఇద్దరూను. ...

రామదాసు:—ఇదిట్రా నీ మద్రాస్ చదువు. ఏమయ్యా, రామ యోగి—ఇంతేనా మాట్లాడవేం.

రామయోగి:—అతన్ని ప్రశ్నడిగి, నన్ను సమాధానం చెప్పమం టారా—?నాతో శ్రీనివాస్ ఈ విషయం ముచ్చటించ లేదు. నా కంటె, రెండు మూడేళ్ళు జ్యూనియర్ కదు టండీ. చెప్పి ఉన్నా, నేను హర్షించి ఉందును...... యువకుడు ప్రేమించడం, మొగ్గ వికసించడం, గాలి వీచడం, మేఘం వర్షించడం, విడోస్పైన్ కావడం, ఎండిన ఆకు రాలడం, ఫలం పండడం—స్త్రీ సంతానం కనడం అదంతా ప్రకృతి చర్య. సృష్టిమాయ. ది గ్రేట్ మిస్టెరి ఆఫ్ లైఫ్ దాన్నెవ్వరూ ఆపలేరు ప్రభూ. ఖండించేటందుకు, ఆక్షేపించేటందుకు నే నెవ్వణ్ణి. హాయామై? ఇందులో ఏది జరక్కపోయినా, మీరూ నేనూ ఉండం—ఈ పంచాయతీ జరగదు. దూరపు తారక నన్వేషించే మిణుగుడు పురుగు కాదా యువక హృదయం!

(సంగీతం మేస్టరు, చిదంబరం ప్రవేశిస్తాడు)

చిదంబరం:—మంచి సమయానికే వచ్చాను. అందరికీ నమ స్కారాలు.

రాధ:— ఏం మేష్టారూ, ఇల్లా వచ్చారేం......

చిదం:—బాబుగారితో ఒక్కమాట చెప్పిపోదామని....

రామదాసు:—తరవాత చెబుదురు గాన్లెండి.

చిదం:—చిత్తం, చిత్తం (భయపడుతూ ఒక మూలగా కూర్చుం టాడు)

రామయోగి:—ఎంతవరకూ వచ్చాను? ఇంక—కామాక్షి మాట.

విశ్వం:—కామాక్షి కాదయ్యా, మీనాక్షి—తనూ చదువుకుంటున్న పిల్లేగా. పాపం కుర్రవాణ్ణి ప్రోత్సహించి.....

రామయోగి:—ఈ విషయాల్లో ఎవరు ఎవర్ని ప్రోత్సహిం చేదీ బ్రహ్మదేవుడు కూడా చెప్పలేడు—నాకు బ్రహ్మంటే నమ్మకం లేదనుకోండి — అదల్లా సహజంగా, వింతగా జరిగిపోతుంది. ఆ ఐక్యతలోంచి మరో ప్రాణి అవతరిస్తుంది. ఆ ప్రాణి మరో ప్రాణిని వెదుక్కుని ఐక్యత సాధిస్తుంది—ఈనాటికి ఆ ప్రేమ ఒక్కటే ఐక్యతను సాధించకల్గింది—ఎన్నెన్ని యుద్ధాలు, కష్టలు, ద్వేషాలు, కుట్రలు, విప్లవాలు, ప్రళయాలు వచ్చినా నశించక, నిలబడి, జెండా పట్టుకున్నది—ఆ ప్రేమ ఒక్కటే.

రామదాసు:—ఏమిట్రా శ్రీనివాసూ—దొరక్క దొరక్కయిా అరవపిల్ల దొరికిందట్రా.

శ్రీనివాసు:—ఏమిటా ప్రశ్నలు—మీ కందరికీ మతులు పోయి నట్లుంది!

చిదంబరం:—ఏదో పిల్ల విషయం అంటున్నారు. అది చెప్పాలనే.

విశ్వం —నువ్వు కాసేపు ఊరుకో చిదంబరం.

రామయోగి:—అరవపిల్ల అనడానికి నా అభ్యంతరం— కుల, మత, గోత్ర వ్యత్యాసాలకి రాజ్యాంగంలో తావులేదు. మనం అంతా ప్రమాణం చేశాం. ఇక్క డనడం ఓవిధంగా దేశ ద్రోహమే. ప్రేమ దైవ సమానం—నాకు దైవం లో నమ్మకం లేకపోయినా—అది పవిత్రమైంది. దానికి కుల గోత్ర, నామాలతో నిమిత్తంలేదు— ఏమన్నా కొంచెం ఉంటే వయస్సుతో ఉంటుంది. ఇందులో దొరకడం ప్రశంసలేదు. మనం ఉన్న స్థానం లో మన దృష్టిలో, మన అందుబాట్లో ఎవరుంటే వార్నే ప్రేమిస్తాం. నేను హాలీవుడ్‌లో ఫిలిం తారని ఎడ్మెయిర్ చెయ్యొచ్చు. ప్రేమించడం దుర్లభం. అట్లా ప్రేమించిన వాళ్ళు పిచ్చాస్పత్రిలో ఉన్నారు. శ్రీనివాసు మీనాక్షిని వెదుక్కుంటూ, మధురలో మీనాక్షి ఆలయం దగ్గర తిష్ట వెయ్యలేదు. ఆమె అక్కడ ఆ ఇంట్లో తను ఇక్కడ ఈ ఇంట్లో— కలిసి ఉండడంతో కాస్తంత ఖాళీ—మిస్సింగ్‌లింక్ ఇన్ ది చైన్—ప్యూర్ రామయోగియిజమ్!

శ్రీనివాసు:—నే నిక్కడుండను—పోతాను.

సుధీర్:—నేనూ పోతాను. వారు చెప్పింది చివరిమాట చెప్పి పోతాను—మీనాక్షిని శ్రీనివాసు పెండ్లిచేసుకోక తప్ప దుట.

రామదాసు:—ఏమిటి పెండ్లా—పెండ్లి—

రామయోగి:—కాకపోతే అగ్ని సాక్షిగా వైవాహిక బంధనం...... అనండి.

రామదాసు:—విడిపోయిన వాడితో వియ్యమా—ఆ పిల్లతో మా వాడి పెండ్లా? మీ అందరికీ మతులు పోయినట్లున్నాయి. ఎందుకు చేసుకోవాలి? ఏమిట్రా శ్రీనూ, సిగ్గు లేదుట్రా.

లక్ష్మి:—వాడేం చెప్పగలడండీ—వాడి మనస్సులో ఏముందో.

రామయోగి:—చేసుకోడం కనీసపు ధర్మం.

రామదాసు:—మూడోమాసం అయినంత మాత్రాన పెండ్లే— ఇందరు డాక్టర్లుండీ—మరి మార్గంలేదు ?

విశ్వం:—ఏమిటి నువ్వనేది?

రామదాసు:—అమాత్రం తెలీదుటయ్యా? డాక్టర్ తల్చుకుంటే అదెంతసేపు. పైగా ఈ సుధీర్, బర్త్ కంట్రోల్ మీద వ్యాసాలు వ్రాశాడు. స్పెషలైజు చేశాడు.

రామయోగి:—వాట్?—వైద్యం చేసి మాతృత్వానికి అంత రాయం కలిగిస్తారా—అది హత్య! మర్డర్!

లక్ష్మి:—ఇవేం ఆలోచనలండీ— నే పోతాను. (లక్ష్మి రాధను తీసుకొని వెడుతుంది)

సుధీర్:—అది డాక్టర్ చెయ్యకూడదు. నేరం—మీరు అది తల పెట్టడం కూడా నేరమే—ఎవరికేనా తెలిస్తే, చర్య తీసుకుంటారు కూడా.

రామదాసు:—ఎవడూ చర్య తీసుకునేది? ఎందరు చెయ్యడంలేదు?

రామయోగి:—నేరం చెయ్యి—పట్టుబడకు—అదీ మీ నైతిక నిర్వచనం—వెరీ మాడరన్—(చప్పట్లు కొడతాడు)

సుధీర్:—ఐయాామ్ సారి—నావల్లకాదు—

రామదాసు:—నువ్వు కాకపోతే మరొకడు. మొదటినుంచీ పరాయి పక్షమే. నువ్వు వెళ్ళు.

సుధీర్:—లక్ష్మణస్వామి ఆదేశం—మీనాక్షిని పెండ్లాడటం తప్ప మార్గంలేదు.

రామదాసు:—అది చస్తే జరగదు.

రామయోగి:—రామ రామ—పుట్టకుండానే చావడమా—ఇది బర్త్ కంట్రోల్.

శ్రీనివాసు:—నేను........ఆమెను—లవ్ చేశాను.

రామదాసు:—నోర్ముయ్—నువ్వు లవ్ చేశావూ ?

శ్రీని:—పోనీ—ఆమె నన్ను......లవ్ చేసింది.

రామయోగి:—సృష్టి రహస్యం పరిశోధిస్తూ రెండు ప్రాణులు దగ్గరకొచ్చి మరో ప్రాణికి కారణమయాయి. ఆ జనించబోయేది గొప్ప నర్తకి కావచ్చు, గాయకురాలు కావచ్చు—డాక్టరై వెయ్యి భారతీయ ప్రాణుల రాకకు సాయపడొచ్చు. ఇఫ్ ఇటీజు ఎ మేల్ — మహావ్యక్తి — ప్రబోధకుడు, యోగి, మేధావి కావచ్చు — అక్కడ ఆనాడు రహస్యం, చీకట్లో ఆలోచించక చేసిన కార్యం ప్రపంచ చరిత్రే మార్చి వెయ్యవచ్చు. దజ్ స్పేక్ జరతుష్ట్ర—యోగిరావ్.

రామదాసు:—పెండ్లి చేసుకోడానికి వీల్లేదు.

సుధీర్:—వీల్లేకపోతే, చాలా చిక్కుల్లో పడతారు—(వెడుతూ)

రామదాసు:—ఎట్లాంటి చిక్కు?

సుధీర్:—అది స్పీడర్నడిగి తెలుసుకోండి ?

(వెడతాడు)

చిదంబరం:—నాదొక చిన్నమాట. ఇందాకటినుంచీ చెప్పాలను కుంటున్నాను.

రామదాసు:—వెళ్లవయ్యా—మధ్యలో నువ్వేమిటి ?

(చిదంబరం వెడతాడు)

ఏం చిక్కులో చూస్తాను.

శ్రీని:—ఎట్లా నాన్నా—చేసుకుంటాను పోనీ.

రామదాసు:—చేసుకో—గంగలో దిగు......

రామయోగి:—గంగ—బెంగాల్ గుండా ప్రవహిస్తుంది. మన గోదావర్ని విడిచి గంగమీద మీకెందు కంత మోజు— మీ ఆంధ్ర భక్తికీ—ప్రాంతీయ దృక్పథానికీ విరుద్ధ మీ నిర్వచనం.

రామదాసు:—స్టాపిట్ (బిగ్గరగా)

అది నా ఇంట్లో జరగడానికి వీల్లేదు.

రామయోగి:—మీ ఇంట్లో ఎందుకు? తిరుపతి వెంకటేశ్వర స్వామి ఆలయంలో చేద్దాం. అసలందుకే తిరుపతిని మనం లాగేశాం. లేదా, మధుర మీనాక్షి ఆలయంలో —దాని శిల్పాలు ప్రపంచ ఖ్యాతి పొందినవి.

రామదాసు:—గెటవుట్—పొండి—అందరూ పొండి....లేచిపొండి.

శ్రీనివాసు:—పోతాను—పోక ఉంటానా ?

(చరచర వెడతాడు—లక్ష్మీదేవి బైట కొస్తుంది)

లక్ష్మి:—ఎక్కడికి పోతావురా—ఏమి టండిదంతా—పోనీ ఆ అమ్మాయిని చేసుకుంటే ఏం తప్పు? చిన్నప్పటినుండీ కలిసి మెలిసి తిరిగారు.

రామదాసు:—దీనికంతకీ కారణం నువ్వు— కివన్నీ తెలిసే ఊరుకుని, ఎంకరేజుచేసి ఇంత దాకా తెచ్చావు.

లక్ష్మి:—మీ రిట్లా కన్నడం పిల్ల ఉద్యోగంకోసం పట్టింపు లకుపోయి, ఇంతటి అఘాయిత్యం చేస్తారని కల గన్నానా?

రామదాసు:—ఆ బెంగాలీ కుటుంబంతో స్నేహాలు చేసి, అమ్మాయిని అల్లా తయారు చేశావు.

రాధ:—(గబగబ బైట కొచ్చి) అమ్మని ఏమి అనకు నాన్నా. నా స్నేహితుడు నా కోసం తెలుగు నేర్చుకున్నాడు— ఇక్కడ ఉండిపొయ్యాడు—నా కోసం మెడిసిన్ చదివి డాక్టరయ్యాడు.....నాకోసం......తను....తను.... పెండ్లి చేసుకోలేదు.

రామదాసు:—ఛీ! ఛీ! ఈ కొంపలో క్షణం ఉండను.

రాధ:—ఇదిగో ఈ రంగులు.....(ప్రక్క గదిలో కెళ్లి) ఇవిగో ఈ మందులు—నా కోసం......

రామదాసు:—మందులు—విషంతాగి చావండంచరూ (తొంద రగా వెడతాడు)

లక్ష్మి:—ఎక్కడి కెడతారో—ఏం చేస్తారో—పట్టుదల• కోపం జాస్తి—ఆయన కేమీ తెలియదు. నాయనా, రామయోగి—నువ్వు కూడా వెళ్ళి ఆయన కూడా ఉండు.......విశ్వంగారు మీరూను......

విశ్వం:—ఎంత గొడవైంది—అనుకోలేదుస్మా.

రామయోగి:—మీరు లేకపోతే ఎట్లా — అసలు కీలకం మీరే గనక, మీరూ రండి.

(వెళ్ళబోతూండగా తెర పడుతుంది)

## మూ డో రం గం

(ఆ రాత్రి పదకొండు దాటుతుంది. పెద్ద గదిలో ఒక మూల ఈజీచైర్‌లో కండ్లు మూసుకుని పడుకుసుం టాడు రామదాసు. లక్ష్మీదేవి మెల్లగా అవీ, ఇవీ సర్దుతూ ఉంటుంది. కార్నర్ స్టాండ్‌మీదనున్న ఫ్లవర్‌వేజు చెయ్యితాకిడికి కిందపడి చప్పుడవుతుంది. రామదాసు ఉలిక్కిపడి కళ్ళు తెరిచి కూర్చుని, ఎదురుగా చూస్తాడు. ఎదురుగా చిన్ని గదిలో మహంతి, ఏనూబేగ్, కురియన్, నారాయణ, కాంబ్లె, భోషేణానికి ఆనుకుని ఒదిగి కూర్చుని ఏదో రహస్యంగా మాట్లాడుకుంటూంటారు.)

రామదాసు:—ఆగ్రహ లింకా ఇక్కడే తగుండ్లారా— తలుపులు వేసెయ్యి.

లక్ష్మి:—ఇంతవరకూ తిండి తినలేదు. పచ్చి మంచినీళ్లు కూడా పుచ్చుగోలేదు. సత్యాగ్రహం చేస్తున్నారుట. తలుపులుకూడా బిగించామంటే ఊపిరాడక చస్తారు. ఉండనివ్వండి.

రామదాసు:—ఈ నారాయణ కూడా వాళ్లతో మద్దత్తై నట్లున్నాడు. వీడికేం పొయ్యేకాలం మొచ్చింది—

లక్ష్మి:—ఒరే నారాయణా—ఇల్లారా

(నారాయణ వస్తాడు)

ఇక్కడెందుకు. వాళ్లని బైటికిపోయి మరోచోట ఎక్కడైనా చెయ్యమను ఆ సత్యాగ్రహం.

నారాయణ:—చెప్పి చూశానండి. అయ్యగారు స్వామిగారితో కలసి మళ్లా కంపెనీలో జేరే వరకూ తిండి తిప్పలు మాని, ఇక్కడే చస్తారుట.

లక్ష్మి:—అయ్యో కర్మా.

రామదాసు:—అక్కడి కెళ్ళిన వాడవు మళ్ళా ఇక్కడి కెందు కొచ్చావు నువ్వు? మీరంతా గూడపురాణీయే—ఆ లక్ష్మణస్వామి, ఇలా చెయ్యండని లిరెక్కించి పంపా డు—అవునా—

నారాయణ:—చాలా కసిగా ఉండారండి. వీళ్లు ఇక్కడుంటవే నయంలెండి—లేకుంటే వెళ్ళి, కంపెనీకి నిప్పంటించే రకాలు వీళ్ళు.

(మళ్లా చిన్న గదిలో కెడతాడు)

లక్ష్మి:—అదీ నిజమే. ఆ సలహా కూడా ఇచ్చారుగా, మీరు.

రామదాసు:—నే నిచ్చానా ఆ సలహా— ఇంకా నయం. నువ్వా ఇల్లా తయారయ్యావేం?

లక్ష్మి:—మీరేం తక్కువా—ఆ కన్నడంది—పట్టమ్మతో కొంత గ్రంధం జరిపే ఉంటారు—వెనక—లేకపోతే ఆ రాజమ్మ ఉద్యోగం విషయం మీ కెందుకు పడుతుంది.

రామదాసు:—నిజంగా—ఏమీలేదు స్మా. అప్పు డెరుగుదు—మనిషి అందంగా ఉండేది—బాగుంది అనుకునేవాళ్లం• అంతమటుకే.

లక్ష్మి:—నేను నమ్మకేం. మొగాళ్లు ఇవన్నీ పైకి చెప్తారా ఏమిటి—

రామదాసు:—నిజం. నమ్ము—ఈ ఒక్క విషయమూ నమ్ము. ఆమె చుట్టూ చాలామంది తిరిగేవారు. రక రకాలుగా ఆమె స్నేహం ఆశించేవారు. లక్ష్మణస్వామి—కొంత కాలం తన బిజినెస్‌లో ఉంచాడనే చెప్పుకునేవారు. బాగా వివరాలు తెలియవు.

లక్ష్మి: అట్లాగైతే ఆ పిల్లకి ఉద్యోగం ఇవ్వకుండా ఎందుకు వెనక్కి పంపుతాడు?

రామదాసు:—ఏమో ఎవడికి తెలుసు. వెర్రి వేషం. పట్టుదం—అందుకనే విడిపోయాను. కన్హయలాల్ తో కబురంపాడు, నునకి రావల్సింది ,నలభై వేలుట. ఇవ్వవల్సిందితాంభై. స్థలానికి ముదరా, ఆ మిగదా యాభైవేలు ఇవ్వకుండాట.

లక్ష్మి:—నాకేమీ నచ్చలేదు. విషంతాగి చావాలి. మీ బుద్ధులే ఎచ్చాయి అబ్బాయికీ.

రామదాసు:—ఛప్—నోరుముయ్యి—వాడూ, మీరూ అంతా కలిసి ఎక్కడికేనా పొండి—నాకు నిద్ర పట్టదు —

లక్ష్మి:—హాయిగా నిద్రపొండి—ఆ పట్టమ్మని స్మరించు గుంటూ—నేనే పోతాను.

(వెడుతుంది. రామదాసు లోపలికెళ్లి ఒక బాగ్ తీసు కొచ్చి అందులోంచి సీసాతీసి, సీసాలో టేబ్లెట్ ఒకటి వేసు కుని, నీళ్లు త్రాగి ఈజీచైర్‌లో జేర్లబడి పడుకుంటాడు. పక్క గదిలో ఐదుగురు కలిసి, ఆ భోషేణాన్ని దూరంగా జరిపి ఖాళీ చేసుకునే యత్నంలో ఉండగా, రామదాసు నిద్రలో పడ తాడు. గదిలో గొలుసులు, భోషేణం కదిపే చప్పుడు మెల్లగా నిలిచిపోతాయి. భోషేణం దూరంగా ఉంచి, చోటు చేసు గుని, ఆ ఐదుగురూ పడుకునే ఏర్పాట్లు చేస్తూ ఉంటారు. చిన్న గదిలో దీపం తీసేస్తారు. పెద్ద గదిలోబ్లూలైట్ మసగగా వెలుగుతూ ఉంటుంది. తెరపడుతుంది. క్షణం చీకటి, నిశ్శబ్దం. తెర మెల్లగా లేచిం తర్వాత, బ్లూలైట్ వెలిగి ఉంటుంది. పెద్ద గదిలో రామదాసు పడుకున్న కుర్చీ దగ్గరగా చిన్న గదిలో

పెద్ద వెలుగుంటుంది. గదుల మధ్య గోడ బదులు ఒక గేట్ (గొలుసులతో బిగించి) ఉంటుంది. అంగవస్త్రం ధరించి, చేతిలో కర్ర పక్కన పడేసి, వృద్ధుడుగా నారాయణ కనబడ లాడు. ఇంకెవ్వరూ ఉండరు. నారాయణ పడుకుని ఉండగా బెంగాలీ డాక్టర్ సుధీర్ లాల్చీ, పంచి, శాలువా వేసుకుని గేటు దగ్గర కొస్తాడు. అతని వెనకాల రాధ వస్తుంది—మామూలు వేషమే. అదనంగా నెత్తిమీద చీర కొంగు ముసుగులా కప్పు గుంటుంది. ఇదంతా 'స్వప్నం' అని సూచిస్తూ సన్నటి వాద్య సంగీతం ఉండాలి)

సుధీర్:—నా మనస్సు మేఘంలాంటిది రాధా—దానికి ఆకృతి లేదు—అందులో ప్రేమ అనే వరపు చుక్క ఉంది. వర్షిస్తుంది—

రాధ:—మీరు కవులు—నేనా—కుంటిదాన్ని.

సుధీర్:—నీ మనస్సు మెత్తనిది—నిన్నిల్లా చేసినందు కుప హారంగా నిన్ను ప్రేమిస్తున్నానంటే పొరబాటు...... నాకు చిన్ననాటినుండీ—నువ్వంటే......ఆరాధనాభావం— నీ కిష్టంలేదు—నాకు తెలుసు. నేను పరాయివాణ్ణి..... దూరంగా వెళ్ళి ఆరాధించడం తప్పా—

రాధ:—నేను మాత్రం దూరంగా వెళ్లలేనా—వెడతాను. మా వాళ్లు కనిపెట్టుకుని ఉంటారు......వెడతాను. (చరచర ముందు కెళ్లి తలుపు తోస్తుంది. గొలుసు కదలదు. తలుపు రాదు)

రాధ:—అబ్బ—రాదేం బాబు—చయ్యంలా ఈ తలుపు.

సుధీర్:—ఎందుకురాదు. చూస్తాను. ఇదేమిటిరాదేం?

(గొలుసులు తొలిగించే యత్నంచేసి, తియ్యలేక విడి చేస్తాడు) ఇంతలో పనివాడు కాంబ్లె వస్తాడు—)

కాంబ్లె:—కూంత లెగండి—ఇటు పోవాల—పనిలోకి.

సుధీర్:—ఆ గేటు తలుపు రావడంలేదు.

కాంబ్లె:—ఎందుకురాదు—గంజికూటి బలం ఏటనుకున్నారు. (తలుపు తోస్తాడు. రాదు. తరవాత రామయోగి వస్తాడు కవిలా, పెద్దజుట్టూ. లాల్చీ, సిల్కు కండువా—) దీని తస్స—రావడంలేదే!

రామయోగి:—తొందరగా వెళ్లాలి—నన్ను సన్మానిస్తారుట. ప్రభువులు—ఏనుగుపై ఊరేగిస్తారుట

(తలుపు తోస్తాడు—రాదు) రావడంలేదే—

(లక్ష్మణస్వామి—ధనికుడుగా— జరీపాగా, మూసిన పొడు గాటి సిల్కు కోటు ధరించి గేటు దగ్గర కొస్తాడు. అతను ఎత్తరి—వర్చస్సు గల మొహం—కాస్త క్రాపింగ్ పాగా దిగువున కనిపిస్తుంది.)

లక్ష్మణస్వామి:—తొలగండి. అర్జెంటుగా పోవాలి.

సుధీర్:—తలుపు రావడంలేదు.

లక్ష్మణస్వామి:—ఎందుకురాదు.

(గేటు తోస్తాడు. రాదు)

ఊహు—రావడంలేదు. ఇక్కడెవడూ గేట్ కీపర్ లేడా? (వెనక్కి తిరిగి) డ్రైవర్—నువ్వెళ్లి మన ఇంజనీర్, ఇజకెయిల్‌ని పిల్చుకురా.

(సంఘ సంస్కర్తగా మహంతి ఏస్తాడు.)

మహంతి:—సంఘ సంస్కర్తకి క్షణం తీరుబడి దొరకదు. తొందరగా వెళ్లాలి—కాస్త తొలగండి......ఎవరో కనికి సన్మానంట—అధ్యక్షత వహించే భారం పడేశారు. (తలుపు నెట్టుతాడు—రాదు.) రావడంలేదే ఇక్కడెవడో పడి ఉన్నాడే—ఎవరబ్బి నువ్వు (క్రింద పడు కుని ఉన్న నారాయణని లేపుతాడు)

లక్ష్మణ:—ఎవడా దరిద్రుడు—గేట్ తీయడేమో. లేవండి— ఏయ్—ముసిలి—లే. లే.....నువ్వేనా కాపలా వాడివి?

నారాయణ:—(దగ్గుతూ లేస్తాడు) నేను.....నేనే.

లక్ష్మణ:—నీ పేరు ?

నారా:—నారాయణ. ఇంటిపేరు దరిద్రవారు.

(అందరూ నవ్వుతారు.)

రామయోగి:—తలుపు తియ్యి.

నారా:—మీరు వెళ్లే త్రోవ కాదిది.

సుధీర్:—అదేమిటి ?

నారా:—ఈ దోవ పేరు మీకు తెలుసా?

కాంబ్లె:—ఇది మిల్లు రోడ్డు బాబయ్యా.

లక్ష్మణ:—నాకు తెలిసినంతవరకూ బ్యాంక్ రోడ్.

రామయోగి:—ఇది స్వేచ్ఛాలాంస విహార విహాయసవీథి.

నారా:—మీరంతా దోవ తప్పి వచ్చారు. ఇది రాజమార్గం.

కాంబ్లె:—అంటె?

నారా:—పూర్వం యోగి పుంగవులు, ఋషులు, రాజాధిరాజులు, మత ప్రవక్తలు నడిచిన రాచబాట ఇది. వెళ్ళినవారు తిరిగిరాలేదు.

రాధ:—అయ్యో—అదేమిటి—నాకు భయంగా ఉంది.

లక్ష్మణ:—ఎవళ్లా వెళ్ళిన వాళ్ళు ?

నారా:—పేర్లు చెప్పనా? వినండి. వేటగాని అంబుకి బలైన కృష్ణుడు, సోక్రటీసు, క్రైస్ట్, శాస్త్ర పరిశోధకుడు బ్రూనో, లింకన్, ఐరిష్ ప్రజా నాయకుడు మైకేల్ కాలిన్స్, ఇస్లామ్ చతుర్థ కాలిఫ్ హజరత్,పొట్టి శ్రీరాములు మరో పేరుంది—ఆ పేరు ఉచ్చరించే అర్హత నాకు లేదు— మనెవ్వరికీలేదు.

మహంతి:—ఆ—ఆ ఎందుకులేదు.

నారా:—మనం చూస్తుండగా ఆయన ఇల్లా వెళ్లాడు. మనలో ఒక్కళ్లం ఆయనతో వెళ్లలేదు.....మనకి ఆయనతో నిమిత్తం లేకపోయింది.

రాధ:—ఏమిటి చిత్రంగా చెబుతున్నాడు. ఏముందయ్యా, ఈ గేటవతల—ఇటు వెళ్ళిన వారు, వెళ్లి చేసిన పనే మిటి?

నారాయణ:—అటు చూడండి—దూరంగా—అక్కడ గొప్ప పరిశోధనాలయంవుంది. అక్కడ సత్యాన్ని పరిశోధిస్తూ ఉంటారు.

(ప్లీడర్‌లా, నల్లకోటు వేసుకుని విశ్వం ప్రవేశిస్తాడు)

లక్ష్మి —రండి ప్లీడరుగారు. ఈ అబ్బేవడో ఇటు వెళ్లడానికి వీల్లేదని బెదిరిస్తున్నాడు. కాస్త కనుక్కోండి.

విశ్వం:—ఎందుకు పోలేరయ్యా. వెర్రివాడా?

నారా:—మీరందరూ మీ మీపన్లమీద వెళ్లేవారు—ఒకరి భాష ఒకరి కర్థంకాదు—శతృత్వంతో, ఈర్ష్యలతో, జాత్యహం కారంతో, ప్రాంతీయ ప్రగల్భంతో విడి విడిగా నడు స్తారు—సత్యంతో ఎవ్వరికీ నిమిత్తంలేదు. ఎవరికి వారే......

లక్ష్మణ:—నువ్వు మాత్రం—

నారా:—నేను మృత్యువుకై వేచి ఇక్కడే ఉండిపొయ్యాను.

రామయోగి:—(పాడతాడు)

చదివితి నెన్నెన్నొ మహా కావ్యముల,
చేసితి గీతా పారాయణమ్ము
చవి చూచితి కష్టార్జిత ధానముల
కొంపకేగి స్వతంత్ర రచనకై కలము దీసి వ్రాయ
ఎవరి విషాదగాథనో రచించిన మందభాగ్యుడనైతిని
గులాబిలో ఎరుపుని సృష్టించి,
మంచు ముద్దలో ముత్యపు నైర్మల్యము కూర్చి
ఎవరిచావో నన్నేల చావనివ్వవు?

మహంతి:—వీడె వడో ఇంద్ర జాలికుడులా ఉన్నాడు.

కాంబ్లె:—ఊరుకుంటె లాభంలేదు—తలుపు తీస్తావా— తన్నమంటావా?

(ఇంజనీర్‌లాగా, స్కూృడ్రైవర్లు, మగలు, మేకులు పట్టుగుని ఏసూబేగ్ వస్తాడు) గొలుసులు తెరవడానికి యత్నిస్తాడు. రాదు)

ఏసూబేగ్:—ఈ గొలుసులో ఏదైనా కిటుకుందా—తాళంలేదు చూస్తే.

నారాయణ:—రాదు నాయనలారా—మీలో ద్వేషాలు, కక్షలు ఉన్నంతవరకూ ఆ తలుపులు రావు.

లక్ష్మ:—మాలో ఏ ద్వేషమూలేదు.—తెనుగు వాడితోచేరి బిజినెస్ పెట్టానె.

సుధీర్:—తెనుగు కన్యని ప్రేమించానే.....

రామయోగి:—అందరు ఇంగ్లండ్ అమెరికాలు వెళ్లడం శేషనైన ఈ రోజుల్లో వెళ్లక ఉండిపొయ్యానే, నేను.

నారాయణ:—మీలోమీరు చూసుకోండి—సర్కారువారికి, తెలంగాణా వారంటె గిట్టదు— ఇద్దరికీ తమిళులంటె పడదు—వారికి కన్నడం వారంటె పడదు. మహా రాష్ట్రకు, గుజరాతీవారంటే గిట్టదు. వారికి పంజాబీ యులు పరాయివారు. ఒరియా వారికి బెంగాలీలంటే ద్వేషం—మీ ద్వేషానికి హద్దులులేవు—ఈ గేటా క్కాటే హద్దు. ఇది దాటలేరు.

రామయోగి:—మేమంతా ఏకమై దొరలని తరిమి వెయ్యలా—

నారాయణ:—ఆ రోజుల్లో ఈ గేటు తలుపులు తెరిచే ఉండేవి. చూడండి—అటు, ఆ పెద్దమంటలు—సత్యాన్ని పరి శోధిస్తున్నారు—ప్రేమ అనే యంత్రంతో శీలం గల మనుషులు.

లక్ష్మి:—మాలో శీలం లే దంటావా?

సుధీర్:—అసలు ప్రేమే లేదంటావా—

విశ్వం:—సత్యం అంటె ఏమిటో తెలీదంటావా—

కాంబ్లె:—నీ ఒక్కడికేనా తెలిసింది—

ఏసూ:—నువ్వెవడవురా......

లక్ష్మి:—తన్నండి.

సుధీర్:—కొట్టండి.

నారాయణ:—ఆగండి—క్షణం ఆగండి. ఈ మూసిన తలుపుకి కారణం నేనని నన్ను ద్వేషించారు. హింసించబోతు న్నారు. మధ్య నే నెవర్ని—సరే—ముందు, నాతో రాదల్చిన వారెవరో నిర్ణయించి చెప్పండి.

కాంబ్లె:—నేను.

రామ:—క్షుద్రలోకం గుర్తించని చక్రవర్తి కవి.....అతనిదే ముందు నడక.

విశ్వం:—మనం కోర్టుకెళ్లకపోతే న్యాయం నిల్చిపోతుంది.

మహంతి:—నే వెళ్లకపోతే సంఘం దురాచారాలతో కుళ్లిపోతుంది.

లక్ష్మి:—నే వెళ్లకపోతే బ్యాంక్ దివాలా తీస్తుంది.

(అందరూ ఒక్కసారిగా, నేను, ముందు నేను ముందు— అని ఎవరికి వారు తలుపు తోసి, అది రాక వెనక్కి తగ్గుతారు)

నారాయణ:—రావడంలేదా—ఇంతేనా ఈ చిన్ని విషయం తెలుసు కోలేరా?

అందరూ:—ఏమిట్రా దరిద్ర నారాయణా—చెప్పి తగులడు. (కేకలు వేస్తారు)

నారాయణ:—నా వెనకాల—నాతో అందరూ ఒక్కసారి రండి— చేతులు కలిపి గొలుసు తియ్యండి—తలుపులు తొయ్యండి— (గొలుసులు ఊడతాయి—తలుపులు విడిపోతాయి. ఒక్కరొక్కరే చిన్న గది తలుపుగుండా రామదాసు పడుకున్న ఈజీచైర్ పక్కనుంచే నడిచి లోపలికెళ్లి పోతారు. అంతా నిశ్శబ్దం—రామదాసు కుర్చీలోంచి చివాలున లేచి "నే నొక్కణ్ణే ఉండిపొయ్యాను, తలుపు తియ్యండి, నే నొక్కణ్ణే ఉండిపొయ్యాను" అని కేకలు

వేస్తూ, అటూ, ఇటూ వెర్రి వాడివలె పరుగులెడుతూ ఉండగా బ్లూ దీపం ఆరిపోయి తెర మెల్లగా పడుతుంది)

*　　　*　　　*

(తెర లేచేటప్పటికి—అదే దృశ్యం. రామదాసుగారు ఈజీ చైర్‌లో పడుకుని ఉంటాడు. పైన బ్లూలైట్ సన్నగా వెలుగుతూంటుంది. ప్రక్కన చిన్న గదిలో ఆ నలుగురు, కాంబ్లె, మహంతీ, ఏసూబేగ్, కురియన్ చాపలమీద పడుకుని ఉంటారు. భోషాణంకి జార్లబడి నారాయణ కునికిపాట్లు పడుతూ ఉంటాడు. రెండు మూడు క్షణాల తర్వాత రామ దాసు పెద్ద పెద్ద కేకలు పెడుతూ చివాలున లేస్తాడు)

రామదాసు:—నే నొక్కణ్ణే—ఒక్కణ్ణే—తలుపు తియ్యండి—తలుపుతియ్యండి—నే నొక్కణ్ణే ఉండిపొయ్యాను.

(లోపల్నుండి లక్ష్మీదేవి "ఏమిటండీ అది—" అని కేక లేస్తూ వస్తుంది. రాధ కూడా "ఏమిటినాన్నా—'బాబోయ్—బాబోయ్—నాన్న—నాన్న" అని కేకలు పెడుతూ గాభరాగా పరుగెత్తుగుంటూ వచ్చి పడక కుర్చీ కాలు తగిలి అమ్మోయి, చచ్చాను" అని పెద్ద కేకతో కిందపడిపోతుంది. చిన్న గదిలో జనం ఉలిక్కిపడిలేచి, అన్ని వైపులా పరుగెడుతారు)

లక్ష్మి:—అయ్యో—పిల్లపడిపోయింది—ఇంకేముందీ—ఏమండీ—ఏమిటదీ—ఏం జరిగిందీ—రండర్రా—డాక్టర్ని పిలవండీ—వీళ్లేరీ—రాధా, అమ్మాయి రాధా.....

(లక్ష్మీదేవి, నారాయణ, ఏసూబేగ్ రాధని లేవదీసి' సోఫాలో పడుకోపెట్టి సపర్యలు చేస్తూ ఉంటారు. మహంతి పరుగెత్తుకుని బైట కెడతాడు)

లక్ష్మి:—ఎట్లా ఉందమ్మా— తెలివొచ్చిందా — కాసిని మంచి నీళ్లు తాగు—మరేం అవలేదుకదా—చూడనీ (కాళ్లు నడుం సర్దుతుంది) ఏమిటండీ— ఆ కేక లేమిటి...... మతోయినట్లు.......ఇదుగో మంచి నీళ్లు త్రాగండి.

రామదాసు:—ఏం రాధకేం....పడిందా! వీళ్లంతా ఇంక ఇక్కడే ఉన్నారా! పొండి మీరంతా (కసురుతాడు) పోతారా పోరా—మీరే కారణం దీని కంతకీ—వెళ్లండి— సత్యాగ్రహంట—వేషాలు (కాంబ్లె, కురియన్ పరుగెత్తుకు పోతారు. నారాయణ, ఏసూబేగ్ లక్ష్మీదేవి సహాయంతో, మెల్లగా రాధని లేవనెత్తి, లోపలికి తీసుకు వెడతారు. రామదాసు మళ్లాఈజీచైర్‌లో కూలబడతాడు. లక్ష్మీదేవి బైటి కొస్తుంది.)

లక్ష్మి:—ఏమిటండి ఆ కేకలు—నిద్రలో.

రామదాసు:—ఏమీలేదు. ఏదో కలొచ్చింది.

లక్ష్మి:—ఏం కల? ఆ పెద్ద పెద్ద కేక లేమిటి?

రామదాసు:—కేకలు పెట్టానా? కల కర్థ మేమిటి....

లక్ష్మి:—అమ్మాయేమిటి, నేనే హడలిపోతే ఆ కేకలకి! ఏం కలో చెప్పకూడద `

రామదాసు:—కలకి అర్థం లేదన్నావా. రాధ కెట్లా ఉంది. ఏమీ లేదుగా. పడిందా—

లక్ష్మి: —పరుగెత్తడంతో ఈ కుర్చీ కాలు తగిలినట్లుంది. గాయం ఏమీ తగలలేదులెండి. అమ్మాయి రాధా!

రామదాసు:—పద చూద్దాం.

(ఇద్దరూ లోపలి కెడతారు—నారాయణ బైట కొచ్చి అవీ ఇవీ సర్దుతాడు. పెద్ద లైట్ వేస్తాడు. రామదాసు ఇవతల కొచ్చి సోఫాలో కూర్చుని, గోడని ఫొటోల కేసి వెర్రిగా చూస్తాడు. గోడనున్న కంపెనీ గ్రూప్ ఫొటో తీస్తాడు— విసుగ్గా— దూరంగా పడేస్తాడు)

రామదాసు:—నారాయణ—కంపెనిలో జేరి లక్ష్మణస్వామి దగ్గర పని చేస్తానన్న వాడవు. మళ్లా ఎందుకొచ్చావురా—?

నారాయణ:—అరేవెళ్లమన్నారండీ—ఈ ముఠాగాళ్లు ఇక్కడచేరి ఏ అల్లరి పెడతారో కనిపెట్టి ఉండమన్నారండీ—అందుకని వారి పనిమీదే—

రామదాసు:—నా జోలేమైతే ఆయన కెందుకురా.

నారా:—ఆయ నట్లాంటి వాడండి.

(లక్ష్మణస్వామి తొందరగా వస్తాడు. ఎత్తుగా ఉంటాడు. గూడకట్టు, చొక్కా, పైన తుండు—కండ్లకి జోడు, మధ్య పాపిటిక్రాప్, అక్కడక్కడ నెరసిన వెంట్రుకలు—వెడల్పు మొహం, దీనంగా చూసే కళ్లు—నాలుగైదు రోజులు క్షవరం చేసుకోని గడ్డం)

లక్ష్మణస్వామి:—ఎక్కడ రాధమ్మ—మీరేమీ కేకలు పెడ్తూ ఉండారుట— నిద్దట్లో అరిస్తిరంట—

రాధ:—ఎవరదీ—లక్ష్మణస్వామిగారా— (బైటకి రాబోతుంది—లక్ష్మణస్వామి, నారాయణ, ఆమె దగ్గర కెళ్లి చూసి మళ్లా లోనికి తీసుకెడరారు. కాసేపటికి లక్ష్మణ స్వామి బైట కొస్తాడు)

లక్ష్మణస్వామి:—మంచికాలం. మరేమి అవలేదు— పిల్లకి—కాంబ్లె చెప్పాడు—రాధ పడిపోయిందని— పరుగెత్తుకొచ్చా. అమ్మాయిమీన కూడా వస్తానంది. చూపొస్తా. పండుకోమని డాక్టర్‌కి కారు పంపి చక్కా వచ్చా. మీకేమి— బాగుండారుకదా.

రామ:—ఏమీలేదు. నిద్రలో—ఏదో కల.

లక్ష్మణ:—ఏం కల—ఇంకా ఆ పట్టమ్మ—రాజమ్మ ఉద్యోగం—అదేనా ?

రామదాసు:—అదికాదు.

లక్ష్మీస్వామి:—ఎందుక్కాదు—మీ సంగతి నాకు తెలవదా. మీకు భలే పట్టింపు. కోపం'జాస్తి—ఎందుకు—మీ సావాసం—పది పదిహేనేళ్ళుగా మీలాగై పొయ్యాను. వాకూ పట్టు దల, కోపం పెరుగుతున్నాయి. పొద్దున్న మీకంటె లావుగానే అరిస్తిని—కదూ.....మీ కెందుకంత కోపం—ఆ రాజమ్మ మీకేం తెలుసు?

(నవ్వుతాడు)

రామ:—ఏం తెలియాలి. చిక్కుల్లో ఉంది— చదువుకుంది. పై పై వచ్చునట. పట్టమ్మ కబురంపింది—ఏదో సాయం చేద్దామని. మన కంపెనీలో—అదే ఇంక నీ కంపెనీలో—అప్పుడు మన కంపెనీయేగా—స్త్రీలు లేరు——పోనీ ఒకమ్మాయి ఉంటుంది.

లక్ష్మణ:—మీకు పట్టమ్మ కబురు పెట్టిందా ?

రామ:—అవును.

లక్ష్మణ:—మీరు ఆమెను బాగా ఎరుగుదురా ?

రామ:—వెనక—చాలాకాలం క్రిందట—కొంచెం ఎరుగుదును.

లక్ష్మణ:—పొరబాటు. మీరు బాగా ఎరుగరు. పట్టమ్మ, మీకు కాదు, నాకు కబురు పెట్టింది. స్వామిగారి దగ్గర కెళ్లమని చీటి యిచ్చి పంపింది. మేష్టారు చిదంబరం తెలీక మీరే 'స్వామి' అనుకుని—తెనుగుభాషలో తికమకలు జాస్తి—స్వామి, అంటె అయ్యవారు—అయ్యవారంటే అయ్యర్‌గారు—అయ్యగారు—సంతులుగారు—ప్రభువులు—అసాములు—యజమానులు — చూస్తివా, తెలుగు ఎంత బాగా చెప్తానో—అట్లాగ ఆ స్వామి మీరే ననుకుని మీతో చెప్పాడు. కాని, చెప్పవల్సింది నాకు. రాజమ్మ తిన్నగా నా దగ్గిరకే వచ్చింది.

రామ:—నువ్వు రాజమ్మని ఎరుగుదువా ?

లక్ష్మణ:—ఇవ్వాళ చూస్తిని. చిన్నపిల్లగా ఉండగా చూస్తిని—అమ్మ బాగా తెలుసు. పట్టమ్మ.

రామ:—పట్టమ్మని—బాగా ఎరుగుదువా ?

(లక్ష్మణస్వామి అటూ, ఇటూ చూసి దగ్గిరగా జరిగి)

లక్ష్మణ:—నేనొకటి చెప్తా—కడుపులో పెట్టుకో –

రామ:—(దగ్గరగా వచ్చి) చెప్పు.

లక్ష్మణ:—పట్టమ్మని చేరదీశాను—చాలా అందంగా ఉండేది. రాజమ్మ నా బిడ్డ.

రామ:—ఆ—ఆ (తెల్లబోతాడు.)

లక్ష్మణ:—ఇష్. మెల్లగా.... పై కుమోక (కళ్లల్లో నీళ్లు తిరుగుతాయి) ఎవ్వరితో అనమాక. లక్ష్మీదేవికి తెలియ కూడదుస్మా—అప్పుడు చిన్నతనం. ఆమె బ్యాటికి పడి పొయ్యాను.... తరవాత వాళ్ల వారిదగ్గరకు వెళ్లి పోయింది. అప్పుడప్పుడు, కష్టంలో ఉండి ఉత్తరం వ్రాస్తే డబ్బు కూడా పంపేవాణ్ణి. (రామదాసు చెయ్యి పట్టుగుంటాడు.) పొరబాటే—కాని ఏం చెయ్యాలి ? రాజమ్మని కంపెనీలో చేరిస్తే, అప వాదు—పెద్ద స్కాండల్—అదంతా నలుగురికీ తెలుస్తుంది. కంపెనీకి, మీకు, నాకు పరపతి పోతుంది. అవునా—అందుకని వీల్లేదన్నాను. కావి, అందరి ముందూ ఎట్లా చెప్పి చచ్చేది. నువ్వేమో వినిపించుకోవాయె. ఎగిరి ఆడుతున్నావు—నీ కోపం నాకు పట్టె. నేనూ ఎగిరి ఆడాను—సరా ?

రామ:—(ఆశ్చర్యం దిగ్మించి) నిజంగా—నా కిదంతా కలలా ఉంది—ఇందాక కూడా భయమేసే పిచ్చకల—అందరూ, గేటుదాటి వెళ్లినట్లు, నే ఒక్కణ్ణే దిగడిపోయినట్లు.

లక్ష్మణ:—మీ తెలుగువాళ్లు అవకాశం జారవిడుస్తారుగా—ఒదే కల.

రామ:—ఒకటి చెప్పనా—ఎవ్వరితోనూ అనకు.

లక్ష్మణ:—రహస్యాలు, పికటితప్పులూ పంచుకునేవాడే స్నేహితుడు.

రామ:—ఒకప్పుడు పట్టమ్మంటే నాకూ లోపల ఇష్టముండేది. అందరూ ఆమె వెంట పడేటట్లు చేసుకోడం చూసి, నే నది వదులుకున్నాను.

లక్ష్మణ:—చూస్తివా—అవకాశం జారవిడిస్తిని—ఒక్కడవూ, ఉండిపొయ్యావు కలలో మాదిరి. అవకాశం దొరికి నప్పుడు చెయ్యని చెడ్డపనులకి పశ్చాత్తాప పడతారుట మనుషులు—మీ రామయోగి ఒక లెక్చర్లో అన్నాడు.

రామ:—శీలంలేని మనిషిలో స్నేహం ....

లక్ష్మణ:—మనకి శీలం ఉంటే ఆమె జోలికే వెళ్లంగ ! శీలం నీ కుండక్కర్లేదు—ఆమెకు మాత్రం ఉండాలా? బలే కోరికే.

రామ:—శీలం కనబరిచి దూరంగా ఉంటే, మెచ్చుకున్నా రెవరు ? లక్ష్మీదేవి ఏమీ లేకుండానే అనుమానిస్తు తోంది.

లక్ష్మణ:—అది నే సరిగా చేస్తా—రాజమ్మకి మరో కంపెనీలో— బెంగుళూర్— నా ఫ్రెండ్ ఒకడున్నాడులే. అందులో పనిదొరికే ఏర్పాటుచేశా—సరేనా ?

రామ:—అంతా బాగానే ఉంది. నువ్విట్లా ఆమెని వదిలెయ్యడం బాగాలేదు.

లక్ష్మణ:—ఏదో చిన్నతనంలో పొరబాటు జరిగిపోయింది. ఏం చెయ్యను. చెడిపొయ్యే ఓపిక, ధైర్యంలేక, పెద్దయింతర్వాత, పిన్నలకి మంచి సలహా యిస్తాడు మనిషి. నా కిప్పుడు పట్టమ్మని చేసుకోవాలనే ఉంది—మీనాక్షి పెండ్లయ్యాక—చేసిన పాపాలు చాలుట. తను ఆశ్రమంలో జేరిపోతుందిట—రాజమ్మకి ఏదో మార్గం చూపి అందుకనే రాజమ్మని పంపింది—ఆ పొరబాట్లే నీ సంతానం, నా సంతానం చేస్తున్నట్లుగా ఉంది.

రామ:—శ్రీనివాసు ప్రేమించానంటున్నాడు మీనాక్షిని.

లక్ష్మణ:—తప్పుచెయ్యటం తమ ఒక్కరి హక్కే అనుకుంటారు పిన్నలు. ఏమిటో ఒకరితో ఒకరు, ఇద్దరం కలసి పంచుకోలేని భావాలొస్తాయి— కాని, అవి కార్య రూపం చెందవుగా.

రామ:—ఇంతవరకూ వచ్చాక నా అభ్యంతరం ఉండకూడదు—వాళ్లు పెళ్లి చేసుకోవాలి. చేసేద్దాం.

లక్ష్మణ:—(రెండు చేతులూ తీసుకుని) ఎంత మంచిమాట అన్నావు రామదాసు. నా భారం తీరిపోయింది. పరువు దక్కింది. ఇంక నాకు జీవితంలో ఏమీ అక్కర్లేదు. ఆబిల్డింగు, కంపెనీ—అన్నీ నీవే—

రాము:—నాకు మాత్రం ఎందుకు—ఏదో మాట పట్టింపు కోసం—కోపంలో అనేశాను. మరి కొంత డబ్బు చేరాక, ఓ బిజినెస్ అబ్బాయికి ఒప్పగించి, ఆ బిల్డింగ్ ఏ పయోజన పాఠశాలకో ఇచ్చేసి, నేనూ ఆశ్రమంలో జేరి.....

లక్ష్మణ:—ఆ పాఠశాల కిచ్చివేస్తే, రామయోగిని ప్రిన్సిపాల్‌గా వేస్తావా ? (నవ్వులాడు).

(రామయోగి, శ్రీనివాసు లొస్తారు.)

రాము:—వాటెస్పైట్ ! వండర్స్ నెవ్వర్ సీ ! ఇది కలయో, వైష్ణవ మాయయో— ఏమిటి— మీరు— లక్ష్మణ స్వామి లవర్‌గోళ్—అఖిలాంధ్ర పారిశ్రామిక రంగ ప్రతినిధి రామదాసు—ఈ ఏకాంతంలో మంతనాలా—లోకానికి కీడు తప్పదు—ఇక్కడ ఈ కుట్ర—వెస్టు జర్మనీలో అల్లరులకు దారితీయదా—

రాము:—నిన్ను పాఠశాలకు ప్రిన్సిపాలుగా వెయ్యాలని లక్ష్మణ స్వామి సలహా.

రామయోగి:—పాఠశాలకి చేసేది, హెడ్మాస్టర్‌గాని, ప్రిన్సిపాలవడు—అయినా, ఆలోచించి చూస్తాను. మీ బరువ్సు ఏవో పెంచెయ్యండి—

లక్ష్మణ:—పయోజన పాఠశాల యజమానంటే, ఉచితవిద్య గనుక, వాలంటరీ సర్వీస్— జీతం, బత్తెం ఉండదు. ఎక్కడినుండి వస్తున్నారు?

శ్రీని:—సినిమాకెళ్ళి.

రామయోగి:—మాట తప్పించకండి—మీ ప్లానంతా అవహాయకపు పయోజనులను పోగుచేసి, తెలుగుభాష, ఇటాలియన్ లవ్ ది బెస్ట్, గరపాలనా ? నే నొప్పను. నా చర్మం, నా దేశం అన్నట్లు నా భాష నాది. ఎవడిది వాడిది—ప్రజ కలసి ఉండడంలో కాస్త ఖాళీ ఉంచండి—ఆ ఖాళీ మాతృభాష. మీరు మతం మార్చుకోగలరు, వేషం మార్చుకోగలరు, రాజకీయాలు మార్చుకోగలరు—ఇట్లా తను తానుగా కాక, మరొకరిలా ఉండగలగడంలో ఆంధ్రుడు అందెవేసిన చెయ్యి—కాని, భాష మాత్రం ఎవ్వరూ మార్చుకోలేరు. అది ఎముకలకి పట్టిపోయి, గుండెకాయ కొట్టుకోడానికి యంత్రం—అది మాత్రం మార్చుకోలేడు.

బట్—కాని— అది చిన్నప్పుడే సాధ్యం. పసితనంలో భాష తొందరగా వస్తుంది. దేర్‌ఫోర్, పయోజనపాఠశాల బదులు, బాలబాలికా పాఠశాలే మంచిదిమీ ఎక్స్‌పెరిమెంటల్—(సుధీర్ డాక్టర్ బాగ్ తీసుకొని తొందరగా వస్తాడు.)

సుధీర్:—రాధ ఎక్కడ ? చూడండి.

రామదాసు:—మరేం ప్రమాదంలేదు.

సుధీర్:—కారు చెడిపోయింది— నడిచే వచ్చాను. అందుకు ఆలస్యం....

రాధ:—ఎవరు ? సుధీర్ ......

(తొందరగా బైట కొస్తుంటే, వెనకాలే లక్ష్మీదేవి పడిపోకుండా పట్టుకుంటూ)

వచ్చారా—నాకేమీ భయంలేదు. నాన్న ఏదో కేకలు పెడితే......

(సుధీర్ రామదాసుని పరీక్ష చెయ్యబోతాడు.)

రాము:—నాకేమీ లేదన్నాను—ఏదో కలొచ్చింది. ఆ కలలో నువ్వూ, రాధా ఉన్నారు. మన కంపెనీ జనం అంతా ఉన్నారు. అందరూ గేటు తోస్తారు—విడివిడిగా తోస్తే రాదు—కలిసి తోస్తే వస్తుంది. అంతా వెళ్ళాక తలుపులు వేసేస్తారు—చివరలో నేనూ వస్తాను. నాకా తలుపు రాదు—ఒక్కణ్ణీ దిగడిపోయినట్లయి, కేకలు వేశానుట. అది స్వప్నం. రాధని చూడు.

సుధీర్:—(రాధని పరీక్షచేసి) షి ఈజ్ ఆల్‌రైట్. బాగా నడిచి వచ్చింది. నేనొక ఎడ్వయిజ్ ఇచ్చిపోతాను. రాధకి ఏ రకమైన అనారోగ్యమూ లేదు—అన్ని అవయవాలు శుభ్రంగా ఉన్నాయి—మా అన్నా చెప్పాడు. చిన్నతనంలో జరిగింది—కొన్ని రోజులు ఎముక నలిగి నెప్పిచేసి ఉండొచ్చు. అన్న ట్రీట్ చేశాడుగా. మీకు బిడ్డంటే గారాం ఎక్కువ. లేవకు తల్లీ—నీ నడుం చెడింది—పండుకో—అదంతా ఆ బెంగాలి పిల్లకాయ చేశాడు—లేవకమ్మా—ఇంకెప్పుడూ ఇల్లాగే ఉంటావమ్మా—తొందరగా నడవకమ్మా—మంచంమీదే ఉండు తల్లీ—అని (లక్ష్మీదేవి లన్న ధోరణిలో అంటాడు) గారాంచేసి ఇదంతా, ఊళ్ళోవాళ్ళు నలుగురూ నమ్మేటట్లు చేసి, ఆమెను మంచాన పడేశారు. అంతకంటె ఆమెకు ఏబాధా లేదు—అవునా రాధా.

రాధ:—చెబితే వినరు. మామూలుగా నడవగలన్రా అంటే నమ్మరు కర్మ.

సుధీర్:—గుడ్‌నైట్. నమస్తే—వెడతాను.

రామయోగి:—మంచి ఎనాలిసిస్. కంగ్రాట్యులేషన్స్.

సుధీర్:—ఆరు సంవత్సరాలు మెడిసిన్ చదివి పూర్తిచేస్తే, బాగున్నారని చెప్పేటందుకు ఉపయోగించింది.

రామదాసు:—ముందు, ముందు ఉపయోగపడుతుంది. బెంగపెట్టుకోకు—రాధ ఆరోగ్యం—అన్నీ .... నువ్వే చూసుకోవాలి.

రాధ,సుధీర్:—(ఒక్కసారిగా) ఆ, ఆ—నిజంగానా—

రామదాసు:—అవును. కంపెనీ వెనక మూలగా, స్థలం ఉందే—అందులో పెట్టుకోవచ్చు, నీ డిస్పెన్సరీ.

రామయోగి:—వాట్—నా గుండె నిలిచిపోతూంది. సుధీర్—వెంటనే పరీక్ష చెయ్యి. (సోఫాలో కూలిపోతాడు) ఈ రాజీ, ఈ సంధి తతంగం ...... వింతగా ఉంది.

లక్ష్మణ:—నా బిల్డింగ్ కూడా, మీనాక్షి, శ్రీనివాసుల వివాహం కాగానే, మంచికార్యాని కిచ్చివేసి, నేను ఆశ్రమంలోకి పోతున్నాను.

లక్ష్మి:—అమ్మయ్య, ఎంత మంచిమాట విన్నానండి—

శ్రీనివాసు:—పరంధామయ్యా—అందరికీ టీలు పెట్టు. (లోనికి వెడతాడు.)

రామయోగి:—అమ్మయ్య, తేరుకున్నాను. ఇంతకీ ఏమైందో—విడి పొయ్యా మన్నారుగా—నోటీసు కూడా ఇచ్చామన్నారు.

లక్ష్మణ:—అది అడగకద్దు. రాజమ్మకి పరోపకారాంట్లో పని వేయించే ఏర్పాటు చేశాను.

(చిదంబరం ప్రవేశిస్తాడు.)

చిదం:—మంచికాలం, అందరూ ఇక్కడే ఉన్నారు—రామదాసు స్వాములూ—మీతో ఆ రాజమ్మ మాటే చెప్పిపోదామని సాయంత్రం వచ్చాను. కేకలువేస్తే హడలిపోయి, వెళ్లి పొయ్యాను. మళ్లా మరిచిపోకుండా, చెప్పివేస్తాను. రాజమ్మ విషయం చెప్పమన్నది, మీతో కాదు—అరుగో ఆ లక్ష్మణస్వామిగారితో—మీరూ యజమానులే గనుక, మీరే అనుకుని చెప్పివేశాను. క్షమించాలి.

రామదాసు:—చూశావా లక్ష్మీ—నన్ను వానా ననుగుళ్లూ సణిగావు —(లక్ష్మణస్వామి, ఆ విషయం వద్దన్నట్లు సంజ్ఞ చేశాడు.)

(కాంబ్లె, కురియన్, మహంతి, ఏసూబేగ్, నారాయణ వస్తారు.)

ఏసూబేగ్:—ఎట్లా ఉన్నారండి—అమ్మాయిగారూ.

రాధ:—బాగున్నాను. మరేం లేదు.

సుధీర్:—ఆ ప్రశ్న కొన్ని రోజులు వెయ్యడం మానివేస్తే మంచిది.

రామదాసు:—మీరింక సత్యాగ్రహం మానండి. రేపణ్ణుంచి పని లోకి రండి.

లక్ష్మి:—వాళ్లకి తిళ్లూ తిప్పలూ లేవు. ఏం, భోజనాలు చేస్తారా?—పరంధామయ్యని అత్తిసరెయ్యమననా ?

మహంతి:—ఎందుకండీ—ఐదుగురం పంటింట్లో కలబడ్డామంటే ఐదు నిమిషాల్లో అవదూ, పంట—

రామయోగి:—ఇంక నా డాక్టరేట్ డిగ్రీ రావడం తథ్యం—

(కంపెనీ గ్రూప్ ఫోటో, మాప్ గోడకి తగులుస్తాడు.)

రేపు ఉదయం వస్తా—మిగత విషయాలు కూడా తెలుసు కుందాం. మీ రుభయులూ (రామదాసుని లక్ష్మణస్వామినీ ఉద్దేశించి.) మీ రుభయులూ, అఖిలభారత్‌లో ఆర్టిస్టులు—పారి శ్రామిక రంగంలో—వ్యక్తిత్వాన్ని రద్దుచేస్తూ రావడమే గొప్ప ఆర్టిస్టు లక్షణం. వ్యక్తిత్వం రద్దయిం తర్వాత, ఆర్టిస్టు ప్రపంచానికి చెందుతాడు. అల్లాగే, ఒక ప్రాంతం ప్రజలు, ప్రాంతీయ తత్వాన్ని రద్దుచేసుకుంటూ వస్తే, దేశానికి చెందుతారు—ప్రపంచానికి చెందుతారు.

లక్ష్మణ:—చెప్పడం సులువే—అది జరగడం ఎట్లాగ ?

(పరంధామయ్య టీ కప్పులు తెస్తాడు.)

రామయోగి:—ఎట్లాగంటారా— ? వాళ్లందరికీ కాఫీపొయ్యండి. నాకు మాత్రం టీ, ఉత్తర దక్షిణాల ఐక్యత, టీ, కాఫీలు.

(అందరూ నవ్వుతూండగా తెర పడుతుంది.)

---

కన్నులుండియు దీనుల గాంచలేడు
వీనులుండియు మనవుల వినఁగలేడు
చేతులుండియు సంత్కృతుల్ చేయలేడు
గర్వియగురాజు శవతుల్యుఁ డుర్వియందు.

—విక్రమదేవవర్మ

# శ ర ణా గ తి !



శ్రీ కె. సఖా

చిన్ని చిటికెన వ్రేలితో కన్నతండ్రి
కొండనెత్తి గాచితివట గోగణముల
ఆలపై నీకు నెంతటి జాలి గలదొ
పల్లెసీముల గొల్లల పాలిదేవ !

నాదు హృదయాన విరిసిన నందనమున
విరుల గంధంబు పాదార విందములకు
నలుది సాహిత్య కుసుమాల నర్చనలను
పూజ సేసెద సద్భక్తి పొంగులెత్త !

బలరాముని సోదరుడై
పొలములలో నాలగాచు బుడుతండై మా
యిలవేలుపువై నిలచిన
చెలికాడ గోపబాల జేజే కృష్ణా !

కాళియుందెల నటునిటు కదలనీక
నమర వందిత నీపాద కమలములను
హృదయ పీఠంబుపై నుంచి నిదురవదలి
విశ్వరూపంబు చూపగా వినుతి సేతు !

యమున పరవళ్లువార గాయకులు సేయు
గానమున మున్గినావు, దిక్కైన లేక
నే విలాపించు చున్నాను నిన్ను గూర్చి-
మానమున నీకు వినిపించు మార్గమెద్ది ?

వేణువొత్తిన పదహారువేలమంది
తన్మయత్వాన దేలిన త్రనము సలుప
నతులితానంద మగువారి నుతులయుందు
నాదు గొంతును విన్పించనగునె కృష్ణ !

ఆ కుచేలుడు తెచ్చిన యటుకు లెంత
తియ్యనై తోచెనో గదా ! నెయ్యమారా
మార్గదర్శకమైన నీ మహిత గాథ
విస్మరించిరి యీ నాటి విబుధులకట !

ద్వారక నగరం బిటకున్
దూరంబని నెంచుకొంటి దొంగవు నాలో
ద్వారముతీసి యథేచ్ఛగ
దూరిమి విరజిమ్మినావు గోపకుమారా !

నగుమోమున కన్పించెడు
నగధర! నిన్నాశ్రయించినాను మహాత్మా,
భగవాన్! హే కృష్ణా ! హరి !
జగదోద్ధరణా ! మురారి ! శరణాగతుడన్.



శిల్పం : నిద్రపోతున్న దూడ — చిత్రకారుడు : జార్జిహెర్లిక్.

# నేటి అమెరికన్ బ్రిటిష్ శిల్పాలు



శ్రీ ఎస్. వి. రామారావు

చిత్రాలను చూడడం వేరు, శిల్పాలను చూడడం వేరు. వాటిని ప్రదర్శనాలయాలలో చూస్తాం సామాన్యంగా. లేకపోతే భవన నిర్మాణంలో కలిసిఉండగా చూస్తాం. అజంతా, లేపాక్షిలోని చిత్రాలున్నచోటికి మనం వెళ్లి చూడాల్సిందే. అవి కదలవు. ఎల్లోరాలోని బ్రహ్మాండమైన శిల్పాలు మనల్ని చిన్ని సామాన్య మానవులుగా చేస్తాయి. ఎంత అధికులమైనా మనం మన ప్రపంచంలో వాటి దగ్గరకు వెళ్తే ఆ శిల్పాలు ఎంతో ఎత్తునుండి క్రిందికి చూస్తాయి. మ్యూజియంలలోను, ప్రదర్శనలలోనూ అయితే మనం చిత్రాలను, శిల్పాలను తెచ్చి మనకు యిష్టమైన, అంగీకారమైన వెలుగు నీడలలో ఉంచి చూసి ఆనందిస్తాం. చిత్రాలను మనం ఏర్పరచిన వెలుగులో చూడాలి, శిల్పాలకంటే. దీనికి చాల కారణాలు ఉన్నాయి. చిత్రాలు ఆరు బయట ఉంచితే ఎక్కువ కాలం శిల్పాలు మన్నినట్లు మన్నవు. చిత్రాలను మనం ఒకచోట నుంచుండి చూడవచ్చు. కాని, శిల్పాలను చుట్టూ తిరుగుతూ చూడాలి. అందువల్ల ఆరు బయట కంటె చిత్రాలను భవంతులలో ఉంచితేనే ఎక్కువ ఆనందించగలము. శిల్పాలలో రెండు రకాలున్నాయి. ఆరు బయట ఉంచి చూచి ఆనందించవలసినవి— భవంతులలో ఉంచి ఆనందించవలసినవి. మన దేవుని విగ్రహాలు రాగి, కంచు, లోహాలలో పోత పోసినవి చిన్నవి గనుక గుడులలో ఉంచి ఆరాధిస్తాము. ఇవి పెద్దవిగా చేయవచ్చు. కాని, చిన్నవైతే వీలుగ ఉంటుంది ప్రతిష్ఠించి పూజించడానికి, ఎంత చిన్న గుడైనా. మైసూర్‌లోని సోమేశ్వర విగ్రహముల లాంటివి బహు కొద్ది మాత్రమే ఉన్నాయి శిల్పాలు, ఆరు బయట ఇండియాలో. ఎక్కువగ చిన్నవే మన శిల్పాలు, గుహాలయాలలోనివి మినహాయించితే. శిల్పాలను చేసేటప్పుడే

శిల్పకారులు నిర్ణయించుకుంటారు, వారు ఆరుబయట ఉంచవలసినవో లేక భవంతులలో ఉంచవలసినవో. ఆరు బయట ఉంచవలసినవి పెద్దవిగను స్టైలులో, వెలుతురు వాటిపై పడినప్పుడు మరింత శోభించేవిగను, పరిసర ప్రాంతాలకు సరిపోయేవిగను ఉంటాయి. ఇటువంటి శిల్పాల్ని చూడడం ప్రకృతి మధ్య ఎంతో అందంగా ఉంటుంది. ఆ అవకాశం ఇండియాలో నాకు ఎప్పుడు కలుగలేదు.

ఇలా శిల్పాల్ని ఆరు బయట ప్రదర్శించారు పార్కుల్లో. ఇది లరవ ప్రదర్శన లండన్‌లో. ఏమాట కామాట చెప్పుకుంటే ఇంగ్లీషువారికి కళలంటే చాల ప్రీతి. క్రొత్త క్రొత్త పోకడలను పోవడంలో కాస్త ఎక్కువ చురుకుదనం కలవారు. 1948 లో మొట్టమొదటిసారిగా లండన్ కౌంటీ కౌన్సిలు (అంటే కార్పొరేషన్ అన్నమాట) శిల్పాన్ని ఆరు బయట పార్కులో ప్రదర్శించింది. ఆ ప్రదర్శన ఎంతో దిగ్విజయవంతమైంది. సుమారు లయిదు లక్షల మంది ప్రదర్శనను చూశారు. అప్పటినుండి ప్రతి మూడు సంవత్సరములకొకసారి ఇలాంటి పెద్ద ప్రదర్శనలను ఏర్పాటు చేస్తున్నది లండన్ కౌంటి కౌన్సిలు. ఇది చూచి మిగిలిన నగరాలు ప్రపంచంలో పలుచోట్ల ప్రదర్శనలను ప్రారంభించాయి. ఇండియాలో ఏ మునిసిపాలిటీగాని, కార్పొరేషను గాని ఇలా శిల్ప ప్రదర్శనలను—కనీసం జాతీయ శిల్ప ప్రదర్శనలను—ఏర్పాటు చేసినట్లు నాకు తెలియదు. ఏమైతే నేం ఒక క్రొత్త పోకడలో లండన్ నగరం ముందడుగువేసి మార్గదర్శకమైనది ప్రపంచంలోని యితర నగరాలకు.

ఈ శిల్ప ప్రదర్శన చాల ప్రాముఖ్యత గలది. ఇంగ్లండులో ప్రస్తుతం ఉన్న హేమాహేమీలైన శిల్పకారులవి, అమెరికాలో గల హేమాహేమీలవి ఎంచి తెచ్చిఉంటారు ప్రదర్శనలో. ఈ రెండు దేశాలలోని ప్రస్తుత శిల్పకళా స్థాయి తెలియజేస్తుంది యీ ప్రదర్శన. దీనికి కౌన్సిల్ ఎంతో శ్రమ తీసుకున్నది. ఎంతో ఖర్చుపెట్టింది. ఇటువంటి మహోత్తర కార్యక్రమాన్ని దిగ్విజయంగా సాగించినందుకు కౌన్సిల్‌ను శ్లాఘించవలసిందె తప్పక.

లండన్ కౌంటి కౌన్సిల్ క్రింద పెద్దవి, చిన్నవి పార్కులు ఎన్నో ఉన్నాయి. అందులో పెద్దది ప్రసిద్ధి చెందినది బెటర్సీపార్కు. ఇది నగరంలో దాదాపు మధ్యన ఉంది. చెల్సీ ఏరియాలోనికి వస్తుందనుకుంటాను ఈ పార్కు. చెల్సీ ఏరియాలో పెద్ద పెద్ద హోదాలు కలవారు, ధనవంతులు నివసిస్తారు. చాలా ఖరీదైన ప్రాంతం. ఈ బెటర్సీ పార్కు థేమ్స్ నది ఒడ్డునే ఉంది. పార్కులో కూర్చుని థేమ్సును, నగరమందలి బ్రహ్మాండమైన భవంతులను చూస్తూ జీవితం గడపవచ్చు. అంత అందమైన పార్కు యిది. అలాంటి పార్కును ఎన్నుకొనడంలోనే ఉంది ఎంతో రమ్యత ప్రదర్శనకు. పార్కులో ఎన్నో చిన్న చిన్న కొలనులు. వీటిలో చేపలు పట్టుతూ గంటలు గడుపుతారు పిల్లలు, పెద్దలు గాలాలు ముందుంచుకుని. పార్కు అంతా ఎత్తు పల్లాలతోనిండి ఉంటుంది. మధ్య మధ్య సన్నని బాటలు వంకరలు తిరుగుతూ పార్కంతా నడిపిస్తాయి మనల్ని. ఇలా నడుచుకుంటూపోతే పార్కు మధ్య శిల్పాలు తలలెత్తి మనల్ని చూస్తుంటాయి, ఎవరా, ఎంతమంచివా వచ్చేది అని.

అమెరికాలోని శిల్పాలను న్యూయార్కులోని మ్యూజియమ్ ఆఫ్ మోడరన్ ఆర్ట్సు వారు సెలక్టుచేసి పంపారు. ఈ ఆర్ట్సు మ్యూజియం ప్రపంచ సుప్రసిద్ధ మ్యూజియమ్‌లలో ఒకటి. దాదాపు ప్రపంచంలోని ప్రసిద్ధ చిత్ర శిల్పకారులందరి శిల్పాలు, చిత్రాలు ఈ మ్యూజియమ్‌లో ఉన్నాయి. గనుక మ్యూజియమ్ ఆఫ్ మోడరన్ ఆర్ట్‌వారు సెలక్టు చేశారూ అంటే అమెరికాలోని హేమాహేమీల శిల్పాల్ని పంపారు అన్నమాట ప్రదర్శనకు. మొత్తం ఇరవై అమెరికన్‌లవి. బ్రిటిష్ వారివి యిరవై. బ్రిటిష్ ఆర్ట్సు కౌన్సిల్ అఫ్ గ్రేట్ బ్రిటన్ ఎన్నిక చేసింది శిల్పాలను.

లండన్‌లో ఎక్కువగ అమెరికన్ చిత్రాలను చూస్తాం. ఎప్పుడూ ప్రదర్శనలు వారివి జరుగుతూనే ఉంటవి. ఈమధ్య అమెరికన్ ప్రదర్శనలు ఎక్కువగ సాగుతున్నాయి యూరప్, ఇంగ్లండులలో. కాల్డర్, గాబో, లెప్పిడ్జ్ ఆర్కిపెంకో మొదలగు బహు కొద్దిమంది అమెరికన్ శిల్పకారుల శిల్పాలు తప్పితే మిగిలినవారివి అంతగా తెలియవు బ్రిటన్‌లో. అందుకే గాబోలు మ్యూజియం ఆఫ్ మోడరన్ ఆర్ట్సు డైరెక్టర్‌గారు ఈ ప్రదర్శనకు శిల్పాలు పంపుతూ "ఈ ప్రదర్శన నేటి అమెరికన్ శిల్పకళను, శిల్పకారులను బ్రిటన్‌కు పరిచయం చేస్తుంది" అన్నారు. ముఖ్యంగా ఈ ప్రదర్శనలో బ్రతికిఉన్న శిల్పకారులవి, ఈమధ్యనే చేసినవి ప్రదర్శించడం జరిగింది. అమెరికన్ ప్రదర్శకులు తమ శిల్పాల గురించి చెపుతూ "మా శిల్పాల ఎన్నిక రెండు పద్ధతులపై జరిగింది. ఒకటి : ప్లాస్టిక్‌లోను, ప్రత్యేకమైన లోహములలోను చేసిన నూతన శిల్పాలను ప్రదర్శించడం వీలుపడలేదు. ఆరు బయట ప్రదర్శనకు వీలైనవే ప్రదర్శనకు తెచ్చాము. రెండు : శిల్పాలు అన్నీ క్రొత్తగా చేసినవే శిల్పకారులు."

ఈ ప్రదర్శన రెండు దేశాలలోని ప్రముఖ శిల్పకారుల నూత్న శిల్పాలను చూపుతుంది. ఇది ఒక విధంగా రెండ

# నేటి అమెరికన్ బ్రిటిష్ శిల్పాలు

దేశాల మధ్య భేటి అని చెప్పవచ్చు. ఇంగ్లీషువారి హెన్రీ మూర్, బార్బారా హెప్‌వర్త్‌లు అమెరికన్ మార్కెట్‌లో అమెరికన్ శిల్పకారుల కంటే పెద్ద డిమాండ్‌లో ఉన్నారు. వీరి విగ్రహాలు పెద్ద పెద్ద వ్యాపార సంస్థలు మ్యూజియములు కొంటున్నాయి. క్రితం మే నెలలో హెన్రీమూర్‌కు ఇటలీలో ''ఆంటోనియో ఫెల్ట్రినెల్లి ఫౌండేషనువారు తమ అంతర్జాతీయ బహుమతిని రు. 2,10,000 యిచ్చారు. ఈ బహుమతి ఎన్నిక ఏకగ్రీవంగా జరిగింది. అంటే మూర్‌కు ప్రపంచంలో ఉన్న స్థానం చూడండి! ఇటీవల బ్రిటన్‌లో అమెరికన్‌లు తమ అధునాతన శిల్పాలను ప్రదర్శించి తమ పోకడలు ఎంత బలమైనవో వినూత్నమైనవో తెలియపర్చాలనే గట్టి పట్టుదల ఉన్నట్లు కన్పిస్తుంది ప్రదర్శనలో. ఏమైతే నేం ఇదొక మహత్తర అవకాశం లండన్‌లో ప్రదర్శన చూడడం.

ప్రదర్శనకు వెళ్తుంటే ముందుగా మనల్ని చూచేది హెన్రీమూర్ ''నిలుచున్న స్త్రీ''. దీన్ని లోగడ జరిగిన కామన్ వెల్త్ ప్రదర్శనలో ప్రదర్శించారు. నేను ''భారతి ఏప్రిల్ 1963'' లో ఈ శిల్పాన్ని గురించి వివరంగా వ్రాశాను. ఈ శిల్పాన్ని ఎత్తుగా ఉన్న చిన్న గుట్టపై ఉంచారు. అసలే నిలువుగా పొడుగ్గా ఉన్న (9 అడుగుల నాలుగు అంగుళాలు) ఈ సోయగపు వయ్యారి భామ, గుట్ట ఎక్కించితే మరీ పొడవై రంగులాకాశాన్నంటినట్లుంటుంది. ఏదో చేతులు విరిగిపోయిన గ్రీకు మూర్తిలా ఉంది. ఆరు బయట, పార్కులో విహరిస్తూ పార్కుకు అందం తెచ్చింది ఈ కంచు మూర్తి. నిజానికి ఎంతో అదృష్టవంతుడు మూర్. ప్రతిభాశాలు లెంతమంది ఉన్నా ఈయన ఈ ఇరువదవ శతాబ్దంలో పెట్టని కోటై నిలచారు. అసలు ఇంగ్లండుకే మకుటాయమానం. అందుకే కాబోలు ఈమధ్య లండన్ వచ్చిన అమెరికన్ వాస్తు శాస్త్రజ్ఞుడు గోర్డన్ బంకర్ ''ఎనిమిది వందల సంవత్సరాల నుండి వచ్చిన ఇంగ్లీషు శిల్పకారులలో మొట్టమొదటి గొప్ప శిల్పకారుడు హెన్రీ మూర్.'' ఇక నాలాంటివాడేమి వ్రాయగలడు. హెన్రీ మూర్ గురించి!

మరొక విచిత్రమైన శిల్పం బార్బారా హెప్‌వర్త్‌ది. మూర్‌ది ప్రదర్శనకు రాగానే మొదటగా కనిపించేదైతే హెప్‌వర్త్‌ది వెతగ్గా వెతగ్గా ఓమూల కుప్పలో, చిన్న కొలను ప్రక్క కునుకులు తీస్తుంటుంది. ఏదో పర్వతంముక్క విరిగి ఒరిగిపోయి ఉన్నది కాబోలు అనిపిస్తుంది. విచిత్ర మేమంటే ఇది చాల చాల సింపుల్‌గా మలచిన కంచు శిల్పం. ఇంతకంటె సింపుల్‌గా చేసినది మరోటి లేదు ప్రదర్శనలో. దీన్ని కీ. శే. హామర్‌షెల్డ్‌కు అంకితంచేసి ఆయన మెమోరియల్ కోసం చేసిన శిల్ప మిది. పది అంగుళాల మందం పది అడుగుల మూడు అంగుళాల ఎత్తు, ఆరు అడుగుల ఆరు అంగుళాల బ్రహ్మాండమైన పట్టు పలక. బియ్యపుగింజను ఒల క్రిందుగ ఉంచినట్లు ఉంటుంది. శిల్పం పై భాగంలో పెద్ద గుండ్రని కన్నము తొలచబడింది. ప్రత్యేక తరహా పలకలోని గుండ్రని రంధ్రము చల, ముఖము ఆకారముగ మనల్ని ఊహింపజేస్తుంది. ఎంతో నిర్మలమైన, గంభీరమైన శిల్పం. హామర్‌షెల్డ్ ఎంత అనిపాహ్య వ్యక్తో శిల్పం కూడ అంత సౌమ్యంగాను, నిర్మలంగా, పవిత్రంగా, పదార్యంగాను లేకుండా స్థిరంగా, ప్రశాంతంగా ఉన్న గంభీరమైన శిల్పం. ప్రదర్శన అంతా చిన్ని రాయి, గుట్టల మధ్య ఉంచే దానిని ప్రత్యేకంగా దూరంగా ప్రశాంతమైన స్థానంలో, నీటిలో కొలను ప్రక్క ఉంచారు. ఇది మెమోరియల్‌కు తగ్గ శిల్పము.

మూడవ వ్యక్తి ఇటీవల అకస్మాత్తుగా పేరులోనికి వచ్చిన రెజ్ బట్లర్. ఈయన చాలా ఆర్కిటెక్చర్ చదివి, కొంతకాలం ఆర్కిటెక్ట్‌గా ఉన్నాడు. తర్వాత ''ఆర్కిటెక్ట్స జర్నల్''కు టెక్నికల్ ఎడిటరుగా ఉద్యోగం చేశాడు. 1950 నుండి శిల్పాలను చేస్తూ శిల్పకారుడుగా మిగిలిపోయాడు. ప్రపంచ ప్రసిద్ధ ఆర్కిటెక్ట్, మన చండీఘర్ నగర నిర్మాత అసలు చిత్రకారుడు, తర్వాత ఆర్కిటెక్ట్‌గా మారి ప్రసిద్ధి పొందాడు. బట్లర్ ఆర్కిటెక్ట్‌గా ఉండి శిల్పకారుడయ్యాడు. ఇద్దరికి చాల పోలిక ఉన్నాయి. బట్లర్ నే ఉన్న లండన్ యూనివర్శిటీలో శిల్పకళలో అధ్యాపకుడు. ఆయన్ని చాల సార్లు కలుసుకున్నాను. విమర్శనాపూర్వక దృష్టి ఉన్న వ్యక్తి. ఈ మాట ఎందుకు వ్రాస్తున్నానంటే చాలామంది చిత్ర శిల్పకారులకు విమర్శనాజ్ఞానం అంతగా ఉండదు. ఈ విమర్శనాదృష్టి కళా విమర్శకులకు వదిలివేస్తారు. ఏదో అది తమ వృత్తి కాదు అన్నట్లు. మన ఇండియన్ శిల్పాల గురించి ఎంతో ఆసక్తి చూపారు. హిందూ బౌద్ధ శిల్పాలంటే ఎంతో గౌరవం ఉన్నది. 1953 లో అంతర్జాతీయ ప్రదర్శనలో ''అన్‌నోన్ పొలిటికల్ ప్రిజనర్'' కు బహుమతి వచ్చింది. అప్పటినుండి ఈయన చాల ప్రసిద్ధి కెక్కాడు. ఈయన నిలుచుండి చేతులు పైకెత్తి జారుతున్న బరువైన జుట్టును ఎగసెట్టుతున్నట్లున్న స్త్రీ శిల్పాన్ని ప్రదర్శించారు. 8 అడుగుల ఎత్తు గల కంచు శిల్పం. ఈ శిల్పాన్ని చూస్తే మన ఇండియన్ శిల్పానికి ఏదో చవుక రకం నమూనాగా ఉంది. తన స్వంత పద్ధతిని మార్చి మరో రకం పద్ధతి కొరకు వెతుకుతున్న స్థితి ఈయనది. బట్లర్ శిల్పాన్ని చూచి నిరుత్సాహపడతాం. ఏదో ఊసుపోక చేసిన శిల్పమా యిది అనిపిస్తుంది.

రాల్ఫ్ బ్రౌన్ యిప్పుడే పైకి వస్తున్న శిల్పకారుడు. ప్రస్తుతం రాయల్ కాలేజిలో ట్యూటరుగా ఉంటున్నాడు. చాల బలమైన శిల్పాలను చేస్తాడు. ఈయన శిల్పాలు ''నిలు

చున్న స్త్రీ'', ''కూర్చున్న స్త్రీ'' లాంటివే ఉన్నా. అయినా ఎంతో బాధ, జీవితంలో గల విషాదాన్ని ఒలకబోస్తాయి. పగిలిపోయిన జీవితాల్ని సూచిస్తుందా అన్నట్లు శరీరం, ముఖం అంతా పెద్ద పెద్ద గాట్లతో పగిలిపోయి ఉంటుంది శిల్పం. అవయవ నిర్మాణంలో ఎంతో భేదాలతో, ఎత్తు పల్లాలతో, విచిత్రమైన జబ్బులో ఉడికిన శరీరాలను చేస్తాడు శిల్పంలో. నిజంగా అవి దీనంగా మనల్ని పలకరిస్తాయి. శిల్పకారుడు ఎంతగానో జీవితాన్ని పరిశోధించిన వ్యక్తిగా అగుపిస్తాడు. ఈ సంవత్సరం బియునాలె ప్రదర్శనకు ఈయన శిల్పాన్ని పారిస్‌కు సెలక్టుచేసి బ్రిటన్ పంపిన పంపారు. ఇచ్చట ప్రచురించిన ''తిరిగిఉన్న స్త్రీ'' అన్న శిల్పం అయిదు అడుగుల రెండు అంగుళాలది. ఎంతోమందిని ఆకర్షించింది.



తిరిగివున్న స్త్రీ
చిత్రకారుడు : రాల్ఫ్ బ్రౌన్

జార్జి హెర్లిక్ అన్న అతను ఎయిన్నార్‌లో జన్మించాడు. అసలు చిత్రకారుడు. ముప్పది ఏండ్ల తదనంతరం చిత్రలేఖనాన్ని వదలి శిల్పాన్ని సాధన చేశాడు. 1937 లో పారిస్‌లో జరిగిన అంతర్జాతీయ కళా ప్రదర్శనలో గోల్డు మెడల్ సంపాదించడంతో పేరులోకి వచ్చాడు. 1947 నుండి ఇంగ్లండులో స్థిరపడిపోయాడు. సహజ రూప చిత్రణలో మంచి ప్రావీణ్యత ఉన్న వ్యక్తి. ఇచ్చట ప్రచురించిన శిల్పం ''నిద్రపోతున్న దూడ'' అన్నది చిన్నది. ఏమంత పెద్ద సైజుది కాదు. ప్రపంచం అంతా ఒక కోలిన పోయుంటే తను మాత్రం కదలక మెదలక తాను ఉన్నచోటే అంటిపెట్టుకుని ఉండే తత్వం గలవాడుగ అగుపిస్తాడు శిల్పం చూస్తుంటే. శిల్పంలో ఉన్న గొప్పతనం ఏమిటి ? ఎందుకు చేసినట్లు అని ప్రశ్నించుకుంటే నేను, ఏమి సమాధానం దొరకదు. ఆయన దృష్టికి, ఆయన మలచుకొన్న సహజరూప శైలి శిల్పం. మన నంది చూస్తే ఎంత గంభీరంగా ఉంటుంది! ఆకారం సహజంగా ఉన్నట్లు ఉన్నా నిజానికి అది ప్రతి రూపం కాదు దేనికీ. గజ్జెలు, మెడకి గల పగ్గాలు, ఆకులవంటి చెవులు ఏవో శిల్పకారుని ఆనందాన్ని, సందర్శకునిలో తను పొందుతున్న ఉన్మాదాన్ని చూడగల్గుతాం. అటువంటి స్వతంత్ర విధానం ఉంది మన శిల్పంలో. అందుకే మన ప్రతిమలు, రూపాల వలె ప్రకృతి వస్తువులకు నమూనాలు గాక, మనసుకు ఆనందాన్నిచ్చే శిల్పాలుగా ప్రసిద్ధి పొందినాయి. ఈ నిద్రిస్తున్న దూడను చూస్తే చిత్రకళాశాలలో నేర్చుకొంటున్న నాలుగవ లేక ఐదవ సంవత్సరపు విద్యార్థి పరీక్షల కొరకు జాగ్రత్తగా మలచిన శిల్పంలాగ ఉన్నది. ఒకటి మాత్రం అగుపిస్తుంది శిల్పంలో. అదే శిల్పం మలచడంలో గల నునుపు. ఈ నునుపు అందాన్ని ఇచ్చి వస్తుంది. ఇదొక్కటే సహజత్వానికి దగ్గరగా ఉన్న శిల్పం ప్రదర్శనలో—బ్రిటిషువారి విభాగంలో.

రాబర్ట్ క్లాట్‌వర్తీ ''నిలుచున్న ఆకారము'', వార్ విలియమ్ ''పడుకున్న స్త్రీ'', బెర్నార్డ్ మెడోస్ ''నిలుచున్న సైనికుడు'' లాంటివి ఎన్నో ఉన్నాయి. బ్రిటిష్‌వారు అన్నీ నిలుచున్న ఆకారములు తప్పితే మరోటి చెయ్యలేరా అనిపిస్తుంది. ప్రపంచంలోని ఎన్నో ఆకారాలను శిల్పంలోకి తేవచ్చు ఎన్నో లోహములలో చేయవచ్చు. ఇప్పుడు వస్తున్న ప్లాస్టిక్ రబ్బరును ఉపయోగించవచ్చు శిల్పంలో. ఆ విధమైన ప్రయోగాలను వదలి ఇంకా హెన్రీ మూర్ చుట్టూ తిరగడం ఏమంత అభివృద్ధికరంగా ఉన్నట్లు కన్పించదు. హాస్కిన్ యొక్క బోల్టులతో బిగించిన పెద్ద ఇనుప పలకలు, బ్రియాన్ వీల్ 'క్రూసి ఫెక్షన్', చాడ్విక్ ''రెక్కలతో ఉన్న ఆకారము''ఎంతో

# నేటి అమెరికన్ బ్రిటిష్ శిల్పాలు

బాగున్నాయి. ఏమైనా క్రొత్త ఆకారాలను, పద్ధతులను తెస్తే నీరిలో ఎవరైనా తేవాలి. మధ్య వయస్కులు వయస్సు మీరిన హెన్రీమూర్ లాంటి వారినుండి ఇక ఏమంత క్రొత్తదనం ఆశించలేం. యువకులైన బ్రియాన్‌నీల్ లాంటివారు ఎంతో ఉత్సాహంగా శిల్పాలను మలుస్తున్నారు.

మొత్తంమీద క్రొత్తదనం ఏమంత లేకపోయినా అందరి ఇంగ్లీషు పెద్ద తలకాయల శిల్పాలను ఒక్కసారి చూడడం ఎంతో ఆనందం కల్గిస్తుంది..

అమెరికన్ విభాగం నిజానికి చాలమందిని ఆకర్షించింది. ఎంతో ఉత్తమమైనవి ఎన్నికచేసి తెచ్చారు అమెరికా నుండి. చెప్పాలంటే "క్రొత్త ఒక వింత". వారి ఊహలు, చేష్టలు చంద్రమండలంలో విహరిస్తాయి. ఎన్నో రకాల లోహాలను శిల్పంలో ఇమిడ్చారు. వారికి కావలసిన ఆకారాలను, ఆకుల నుండి, గడ్డిపరకల ఆకారాల నుండి, చెట్టు బోదెం నుండి, స్తంభాల నుండి, ఇది అది అని ఏమిటి—ప్రకృతిలో ఉన్న ప్రతి దానినుండి గ్రహించారు. అంటే ఎంతగా వారు తమ మనో నేత్రాలను తెరచి వెదుకుతున్నారో తెలుస్తుంది. అమెరికా గూడ ఒక 'యిజాన్ని' సృష్టించగలదు అని చెప్పాలని వారు తీవ్రంగా కృషిపెట్టిన వైనం తెలుస్తుంది. "అబ్‌స్ట్రాక్ట్ ఎక్స్‌ప్రెషనిజమ్, ఆక్సిడెంటలిజమ్, ఇప్పుడు క్రొత్తగా "పాప్ ఆర్ట్" అనే వివిధ పద్ధతులను చిత్రలేఖనంలో యిరువదవ శతాబ్దాన్ని ఒక్కసారి ఊపివేసింది. వీరి ఈ తాకిడి ప్రపంచం లోని ప్రతి యువ చిత్రకారునిమీద పడింది, బలంగా—ఎంతో బలంగా.

జార్జి రికే యొక్క శిల్పం "వేసవికాలం" అన్నది ఎంతో రమ్యంగా ఉంది. ఇది కదలే శిల్పం. గాలికి ఊగే రేకుల శిల్పం. 13 అడుగుల బారు గల సన్నని రేకులు ఆరు కట్టబడి ఉన్నాయి. కొద్దికొద్ది దూరంలో. ఈ బారు రేకులు మొదలు కొద్దిగా వెడల్పుగా ఉండి పైకి పోనుపోను అతి సన్నవై ఆకారంలో మొగలిరేకుల లాగ ఉన్నాయి. సన్నని తీగలతో బంధించారు, మొదలుకు కొద్ది పైభాగంలో. గాలి ఏమాత్రం వీచినా ఇవి ఒకదానిలో మరొకటి ఇరుక్కుని ఒకదానికి మరొకటి తగిలి సన్నగా సంగీతాన్ని వినిపిస్తాయి. వెండిలాంటి తెల్లని రంగులో ఉన్న యివి సూర్యరశ్మిలో మరింతగా తళుక్కు తళుక్కున మెరుస్తూ ఎంతో ఆహ్లాదంగా కంటికి వీనులకు విన సొంపుగ ఉన్నాయి. సన్నని చిరు చలిగాలిలో అక్కడ విసరిన శిల్పాల మధ్య గల పచ్చ గడ్డిపై కూర్చొని శిల్పాలను చూస్తూ ఆనందిస్తుంటే ప్రతి అయిదు నిముషాలకు ఒక విమానం పైనుండి పోతూ మ్రోతచేస్తూ పలుకరిస్తాయి. ఇటువంటి శిల్ప ప్రదర్శన ఒక అనుభవం. మరువలేని ఆనందం. ముఖ్యంగా ఈ "వేసవి కాలం" అన్న శిల్పం ప్రకృతికి సరిగ్గా సరిపోయిన శిల్పం.

నిజానికి ఈ కదలే శిల్పాలను సృష్టించింది అలగ్జాండర్ కాల్డర్. ఇవి సృష్టించి శిల్ప కళారంగంలో ఒక నాన్ని తెచ్చిన వ్యక్తి. వీటిని "మోబైల్" అంటారు. అసలు "మోబైల్" అని నామకరణం చేసింది ఈ శిల్పాలకు అమెరికా ప్రఖ్యాత చిత్రకారుడు డచ్‌హాంప్. అప్పటినుండి అలగ్జాండర్ కాల్డర్‌కు మరొకపేరు "మోబైల్" అయింది. విచిత్రం ఏమంటే ఈ "మోబైల్" మనిషి ఈ దఫా "స్టబైల్" ప్రదర్శించాడు. అంటే ఇవి కదలవు అన్నమాట. ఆకారాలు, రంగులు అన్నీ మోబైల్స్ లాగే ఉంటాయి ఒక్క కదలిక తప్ప. పెద్ద (అంటే 14 అడుగుల పొడవైన) స్టబైల్‌ను గొల్లభామ పురుగులాంటి దాన్ని ప్రదర్శించాడు ఈ దఫా. నల్లని రంగు వేసిఉన్నదేమో, యిది ఏదో పెద్ద పురుగు ప్రాకుతున్నది పార్కులో గడ్డిలో అనిపిస్తుంది దూరానికి. కదలిక లేక పోయినా కదులుతున్నట్లు అనిపిస్తుంది ఆ వంచిన తీరు. పల్చటి రేకులకు కత్తిరించి చేసినది. ముచ్చటగా అసలు ఏ శిల్పానికి సంబంధం లేకుండ ప్రత్యేకంగా ఉంది. చూడ గానే కాల్డర్‌ది అని తప్పక చెప్పుతుంది. కాని, ఈయన మోబైల్స్ బాగుంటాయి స్టబైల్స్ కంటే. వారి శిల్పాలను ప్రదర్శించడం ఒక ప్రత్యేకత. వీటిని త్రాడులో వ్రేలాడ దీయాలి, అన్ని శిల్పాల మాదిరి ఒక దిమ్మపై ప్రదర్శించడం గాక. అలా వ్రేలాడదీస్తే గాలికి కదులుతూ, రంగు రంగులతో ఉన్న చిన్న చిన్న రేకులు, పువ్వులు వాటి కవి తిర్గుతూ చిన్న రంగులరాట్నంలా సరదాగా ఉంటుంది. నిజానికి ఏ ప్రదర్శనకైనా సరే జీవాన్ని తెస్తాయి ఈయన శిల్పాలు. ఈయన స్టబైల్స్‌కు పేరు పెట్టింది ప్రఖ్యాత శిల్పకారుడు జీన్ ఆర్ప్. కాల్డర్‌ను కలిసినప్పుడు ఒకసారి జీన్ ఆర్ప్ అడిగాడు "నిరుడు నువ్వు ప్రదర్శించినవాటిని ఏమన్నావ్— స్టబైల్సా ?" అప్పటినుండి వీటికి స్టబైల్స్ అన్నమాట ఖాయంగా నిల్చింది.

మరొక ప్రఖ్యాత శిల్పకారుడు లియనార్డ్ బాస్కిన్ "చనిపోయిన మనిషి" అన్న అరడుగుల పది అంగుళాల కంచు శిల్పాన్ని ప్రదర్శించాడు. అప్పుడే ఎక్కడో భూగర్భంనుండి త్రవ్వి తీసినదిలాగ ఉంది. ఆకారాలు అస్పష్టంగా మలచ బడి లిస్సగా పరుండబెట్టిన శిల్పం. ఈయన గ్రాఫిక్స్ చాల బాగుంటాయి. దారు శిల్పాలు గూడ ఎంతో బాగుంటాయి. అసలు వీటిని చూడగనే మనం చెప్పగలం ఇవి బాస్కిన్‌వి అని. కాని, ఎందువల్లనో ఈ 'చనిపోయిన మనిషి' అన్న శిల్పం

సునిశితంగా ఉంది. ఆకు లోపలిభాగం పాలిష్ చేశారు. బయట వైపు కిలిము పట్టింది. ఎండలో మెరుస్తూన్న లోపలిభాగం అప్పుడే నీటిలో మునిగి తేలిన ఆకులాగ ఉంది.

ఇక్కడ ప్రచురించినది జాసన్ సెలీ శిల్పం ఎనిమిది అడుగులు ఎత్తుయినది. ఇది క్రోమ్ ప్లేటెడ్ స్టీల్‌లో చేసినది. శిల్పం అంతా రేకులతో చేసినదే. ఈ రేకులు కారు ముందు బారుగ పాలిష్ చేసివుండే నికిల్ బంపర్. వీటిని బాగా మండే మంటలో కాలిస్తే రకరకాల పంచ వర్ణాలుగ నికిల్ పై భాగం కనిపిస్తుంది. కరిగి వర్షాకాలంలో పారే కాలువలో నీటిపై పెద్ద పెద్ద మచ్చలు కనిపిస్తాయి రంగు రంగులుగా. రోడ్లపై గల మట్టి నూనె మొదలగునవి అన్నీ కలిసిన ఈ జిడ్డు నీటిపై తేలుతూ సూర్యరశ్మి పై బడగానే ఇంద్రధనుస్సులోని రంగులలాగ కనుపిస్తుంది. దూరానికి ఈ శిల్పం రంగు రంగులుగా మెరుస్తూ చుట్టూ ఉన్న శిల్పాన్ని కప్పివేసింది. దీనిలో ముఖ్యంగా చూడవలసినది ఆకార నిర్మాణం. అడవి దున్నపోతు కొమ్ముల కుండే నాజూకైన, బారైన తత్వం, ఆ జంతువుకున్న బలం కనిపిస్తుంది. అసలు బలం చూపడానికై చేసిన శిల్ప మిది. జంతువుయొక్క ప్రక్క ఎముకల తీరుగ ఉన్న శిల్పం మధ్య భాగం, దానిపై నుండి ప్రక్కలకు, పైకి సాగిన తీక్షణమైన కత్తిలాంటి మొనల, వంపుల ఆకారాలు ప్రత్యేకత. చొరచుకుపోతున్నదా తన చుట్టూ ఉన్న వాతావరణాన్ని అనిపిస్తుంది. నాకు బాగా నచ్చిన శిల్పాలలో ఇది ఒకటి.

మరొక బహు చక్కటిది డిమిత్రి హాద్జి యొక్క సైనికుడు తలపై ఉంచుకొనే ఇనుప టోపీ. దీనికి డిమిత్రి పుట్టగొడుగు నుండి ఆకారాన్ని మలుచుకున్నట్లుగ అగుపిస్తుంది. పెక్కు కప్పులతో ఒకదానిపై మరొకటి చేరి నిలువుగ ఉన్న బారైన శరీరానికి రక్షణగా నిలుస్తుంది.

ప్రదర్శన చూస్తే ప్రపంచంలో ఉన్న యిప్పటి రెండు రకాల అభిప్రాయాలు తెలుస్తాయి. ఒకటి భావం కోసరం ఆకారాన్ని పూర్తిగా విస్మరించింది. కాలానికి తగినట్లుగ భావాల్ని వ్యక్తపరుస్తూ, ఆ భావానికిగాను ఈ కాలంలో దొరకే నూత్న లోహాలు, పదార్థాలతో శిల్పాలను మలచడం. ఇది అమెరికన్ పద్ధతి. మరొకటి రూపాన్ని పూర్తిగ ధ్వంసం చెయ్యకుండ దాన్ని తమకు అనుకూలంగా, కాలానికి సరిపోయేలా సరి పెట్టడం. ఇది ఇంగ్లీషు పద్ధతి. నిజానికి ఇంగ్లీషువారికి ఒక సంస్కృతి, ఒక సంప్రదాయసిద్ధ పద్ధతి ఉంది. దాన్ని పూర్తిగ విధ్వంసం చెయ్యడం అంటే జరిగే పనే కాదు అంత సులువుగా. అమెరికన్‌లకు ఒక సంప్రదాయం, ఒక సంస్కృతి లేదు. అందువల్ల సులువుగ వారు క్రొత్త మార్గాలను, తాము పోగొట్టుకుంటున్నామే తమకున్న దానిని అనే మథన మనసులో లేకుండా, త్రొక్కగలరు. ఈ విభిన్న మార్గం కూడలి ఈ ప్రదర్శన.

మైకొలాంజెలోని ''ఏమయ్యా! ఒక మంచి శిల్పానికి నిదర్శన ఏమిటి?'' అని అడిగితే అన్నాడు: ''పొరపాటున కొండపై నుండి శిల్పం జారిపడితే ఏమాత్రం చెక్కు చెదర కుండా ఉండేదే మంచి శిల్పం'' అని. ఈ సూత్రం ఎంత వరకు ఉపయోగిస్తుంది ఇప్పుడు? గాజుతో, రేకులతో చేసిన శిల్పాలు, ఈ యుగపు నిదర్శనాలు. ఆ మైకొలాంజెలో పెట్టిన పరీక్షకు నిలుస్తాయా? విచిత్రం! కాలానికి తగినట్లు పద్ధతులు, పద్ధతులకు తగినట్లు శిల్పాలు మారుతున్నాయి.

ఈలాంటి ప్రదర్శనలను మన ఏకాడమి ఏర్పాటు చేస్తే ఎంతో బాగుంటుంది. మన హైద్రాబాదులోని పబ్లిక్ గార్డెన్ లో ఏర్పాటుచేస్తే ఒక నూత్న ప్రయోగాన్ని చేసినవార మవుతాము ఇండియాలో మనం. మన అనుభవాన్ని ఇతర రాష్ట్రాలు పంచుకుంటాయి. ఆంధ్రప్రదేశ్ లలితకళా ఏకాడమీ ఈ నూత్న ప్రయోగాన్ని తలపెడ్తే విజయవంతం తప్పక అవుతుందని భావిస్తాను.



# సంకల్పా - వికల్పాలు



## శ్రీమతి అచ్యుతవల్లి

"నీకీ చదువెందుకు ?"

"మీ కోసం."

"అబ్బ !"

"నిజం ! ఈ చదువుకోసం ఈ కాలేజీలో జేరటం, అక్కడ మన కళ్ళు కలుసుకోవటం."

"మన పెదాలు నవ్వుకోవటం, ఆపయిన ......"

"ఆపయిన ?"

"ఆకాశంలో శరత్కాల మేఘాల చివర్లలోంచి వినపడే రహస్యమయ అదృశ్య సంగీతం మన ఇరువురి హృదయాలనూ, రసప్లావితం చేయటమూ."

ఆకాశము చుక్కల చీర సింగారించుకోవటము మొదలు పెట్టింది. పార్కులో పూ పొదల మాటునున్న జంట జంటలని చూస్తూన్న మెర్క్యురీ దీపాలు, వాళ్ల అనిశ్చిత ప్రణయ సంభాషణలని వింటూ తెల్లమొఖా లేసుకుని నిలబడ్డాయి. సన్నగా మస్తుగా వస్తూన్న మాధవీ పూల పరిమళం 'అర్చన' కళ్ళు అరమూతలు పడేట్లు చేసింది. వివశత్వంతో అర్చన అర మూసిన కలువరేకలను ముద్దు పెట్టుకోబోయాడు ప్రొఫెసర్ విశ్వనాథం. చటుక్కున అతని హృదయంమీద అర చేతులుంచి తోస్తూ లేచి నిలబడింది అర్చన.

"వాట్ హేపెన్డ్ !" ఆశ్చర్యపోతూ విశ్వనాథం కూడా లేచి నించున్నాడు. అటువెంపుగా "కమల' చేతులో ఒక లావాటి పుస్తకం పుచ్చుకుని రావటం గమనించారు ఇద్దరూ. కమల వచ్చి వచ్చి ఆ మాధవీలత ప్రక్కనే ఉన్న సిమెంటు బెంచీమీద చతికిల బడింది. కమల కూర్చున్న బెంచీ మీదకు చక్కని మెర్క్యురీ దీపకాంతి పడుతూంది. "అర్చన" అదిరిపోయింది. కమల "అర్చన" కి లెక్చరరే కాకుండా హాస్టలు వార్డెన్ కూడా. విశ్వనాథం తేలు కుట్టిన దొంగలా వెనుకకు జారుకున్నాడు. "అర్చన" కమ లతన్ని చూసి ఉంటుందా, ఉండదా, అన్న కుశంకతో కొట్టుకలాడుతూ, ఏది ఏమయినా ఫార్మల్‌గా విష్ చేసి కాస్సేపు మాట్లాడుకోవటంవల్ల తను చెప్పా పెట కుండా పార్కులమ్మట తిరుగుతూంటం కొంచెం అనంగీకారమైనప్పటికీ, ఆమె క్షమించటానికి ఆస్కారం ఉండొచ్చు కదా ! అన్న భ్రమతో కమల ప్రక్కగా వచ్చి—

"నమస్తే మాడం !" అన్నది.

"కూర్చో !" అంది కమల. చదువుతూన్న పుస్తకం మూసేసింది. అర్చన కుదురుగా కూర్చుంది. ఒకరినొకరు దీక్షగా చూసుకున్నారు. "అర్చన", "కమల" ల అందానికి వైవిధ్యం ఎంచాలంటే ఇంకో విక్రముడు ఉద్భవించాల్సిందే !

"సువ్వొక్కర్తివే వచ్చావా ?"

పార్కు కెదురుగానే కాలేజీ హాస్టలు భవనా లున్నాయి. రోడ్డుమీదకున్న బాయ్స్ హాస్టల్ భవనాలు వెనుకనున్న గర్ల్సు హాస్టల్ భవనాలకి, కాపలాగా ఉన్నయ్. మేరు నగధీరులైన యువకులు కాంపౌండులేని ఆ భవనాలకి స్వయం రక్షకులు.

"లేదండి ! సుమతి, నేనూ వచ్చాము !"

అబద్ధం ఆపద్ధర్మం అంటారు. ఆడది లబద్ధా లాడితే గోడ కట్టినట్లుంటుం దంటారు. కాని "అర్చన" ఆడిన లబద్ధం పల్చని వెదురు తడికలా ఉంది.

"పిచ్చిపిల్లా !" గలగలా నవ్వింది కమల. అర్చన పెదాలు అదురుతుండగా తల వంచుకుని, కమల చేతిలోని పుస్తకం తన చేతిలోకి తీసుకుని మౌనంగా పేజీలు తిరగ వేయ సాగింది.

"బుద్ధి జీవులది ఆలోచన !
హృదయజీవులది అనుభూతి !"

ఆ వాక్యాలమీద, "అర్చన" కళ్ళు ఆగేయి. అది "లామా గోవింద" గురించి, సంజీవదేవ్ వ్యాసం వ్రాయబోతూ ముందు వ్రాసిన వాక్యాలు ! ఆ పుస్తకం రసరేఖలు !

ఇంకా చదువబోయింది అర్చన. ఆమె కళ్ళు ఆ వాక్యాల వెంట తొందర తొందరగా పరుగెట్టుతోన్నయ్ !

"రూం కెళ్ళాక చదువుదువులే ! నీ కిస్తా ఆ పుస్తకం." కృతజ్ఞతగా తలెత్తి కమల కళ్లల్లోకి చూడబోయి చిన్న

బోయింది అర్చన. కమల కళ్లు సానపట్టిన కత్తుల్లా అర్చన హృదయగత రహస్యాన్ని ఛేదిస్తున్నాయ్ !

''విశ్వనాథం చాలా అందమైనవాడు కదూ !'' జల్లుమంది అర్చన లేగ హృదయం. తడి కళ్లతో మేకపిల్లలా చూసింది కమలవైపు.

''నిజం ! చాలా అందమైనవాడు ! చురుకైనవాడు. ఎంత చురుకు అంటే తుమ్మెదల కంటే, సీతాకోక చిలుకల కంటె కూడా చురుకైనవాడు. అవి సంపూర్ణంగా విరిసిన పుష్పాలనే ఆస్వాదిస్తాయ్ ! ఇతను విరిసీ విరియని పువ్వుల్లాంటి మొగ్గలనీ, తెలిసీ తెలియని మనసులతో నుండే వయస్సునీ కూడా'' గుండె ఆగిపోయినంత పనైంది అర్చనకి. అందంగా తళతళ మెరిసే ఆనందదీప్తి లయిన మెరుపుల్లోంచి ఉరుములూ, పిడుగులూ ఉద్భవిస్తాయ్.

''ఏం ? చదివావు కద !''

''ఊఁ.'' కళ్లమ్మట నీరు చెంపలమీదుగా జారుతోంది. కమల ప్రేమగా ''అర్చన'' కళ్లనీరు తన చేతి రుమాలుతో తుడిచింది. అయినా, ఆమె కన్నీరు మున్నీరుగా మారుతోనే ఉంది.

''పిచ్చిపిల్లా !'' మళ్లీ అంది.

''మనస్సు పాడుచేసుకోకు ! కొన్ని నిజాలు మనకి ఎప్పటికీ తెలియకుండా ఉంటే బాగుంటుంది అన్పిస్తుంది. అదొక ప్రలోభం. నిజాన్ని నిజంగానమ్మ బుద్ధవదు. అంత ఆత్మశక్తి, స్త్రీలు ఎప్పటికీ సంతరించుకోలేరు !''

ప్రశ్నార్థకంగా కమలకేసి చూసింది అర్చన.

''విశ్వనాథాన్ని నేను చిన్నప్పటినుంచీ ఎరుగుదును.'' అతనికి ఇరవై నాలుగోఏట వివాహమైంది. అతని భార్య నీకన్నా, నాకన్నా అందమైనది.''

కమల చెప్పబోతోంది. అర్చన చీర చెంగుతో చెంపలు అద్దుకొని, దృఢంగా కూర్చుంది.

''భాగ్యమతి అదే విశ్వనాథం భార్య, చాలా తెలివైనది. ఆమె కాపురానికొచ్చిన మూడో రోజుకి తన భర్తయొక్క లాలసత్వం గమనించేసింది. అతని రహస్య ప్రణయాలన్నీ గ్రహించేసింది. కాని, అందరి భార్యల్లా ''నాలో ఏ లోపం ఉందని నన్ను నిర్లక్ష్యం చేస్తున్నారు ?'' అంటూ అతని కాళ్లమీద పడి విలపిస్తూ అడిగేది కాదు. ఏమీ తెలియనట్లే సంచరించేది.''

''అంతటి క్షమావతి కాబోల్ను !'' అన్నది అర్చన.

''కాదు, అభిమానవతి ! తెలిసినది తెలిసినట్లు తెలియపరచకూడదు. అందువల్ల ఎదుటివారితో ఒకవిధమైన మొండితనం ప్రబలటానికి అవకాశం ఉంది. పైగా తెలుసుకున్నవారిమీద కచ్చ కూడా పెంచుకుంటారు. సోమసుందరం నీకు తెలుసుగా !''

''తెలుస'' న్నట్లు తలాడించింది.

సోమసుందరం మాథమెటిక్స్ లెక్చరర్. అతను కమలకి పినతండ్రి కొడుకు.

''సోమసుందరానికి భార్య అంటే చెప్పలేనంత ప్రేమ. కాని, ఆ సంగతి ఇతరులు గుర్తించినట్లు ప్రకటిస్తే బాధపడతాడు. వాళ్ల చెల్లెలు అనురాధకి అతని తత్వం బాగా తెలుసును. అంచేత ఆపిల్ల వాళ్ల ''వదిన'' ఏపని చేసినా, చేయకపోయినా ఏమీ అనదు. సోమసుందరం తన భార్య విధేయతని అనూరాధ ఎక్కడ గుర్తిస్తుందో అని ప్రతి క్షణం అప్రమత్తతతో సంచరిస్తూంటాడు. నా కెల్లా తెలిసింది అని నువ్వడుగుతావు. ఒకసారి ''కనకదుర్గ'' పుట్టినరోజు వచ్చింది. అనూరాధ మంచి పార్టీ ఒకటి వదిన జన్మదిన సందర్భంలో ఇదామనుకుంది. నాతో కూడా చెప్పింది. ఇద్దరం ఎవరెవరిని పిలవాలో, ఒక పట్టీ తయారు చేసుకున్నాం. ఇంక అందర్నీ పిలుద్దాం అని బయలుదేరబోతూండగా సోమసుందరం హడావుడిగా వచ్చాడు.

''ఇల్లాంటి లేనిపోని బడాయిలు నాకు నచ్చవ్. పార్టీ లేదు. ఏంలేదు. ఊరుకోండి'' అన్నాడు.

అనూరాధ చిన్నబోయింది. ''కనకదుర్గ'' ముఖం కూడా చిన్నబోయింది.

''పోనీలే ! ఆ విలవపెట్టి మంచి ధర్మవరం చీర కొనుక్కుంటే సరిపోతుంది'' అన్నాను. సోమసుందరాని కింకా కోపమొచ్చింది.

''నేను దాని పుట్టినరోజు కోసం ''వందలు'' జేబులో పోసుకు కూర్చున్నా ననుకున్నారా ? చీరా లేదు. సారే లేదు. ఊరుకోండి'' విసుగ్గా అన్నాడు. నేను సజెస్ట్ చేసినదానిలోని తప్పేమిటో నా కర్థంకాలేదు.

అవూ దూడా ఉండగా గుంజ అరిచినట్లు నాకెందుకులే .... అని ఊరుకున్నాను. కనకదుర్గ మొహం ధుమధుమ లాడింది. అయినా ఏం చేయగలదు. ఆడది ?

మర్నాడు అనూరాధ నాతో చెప్పింది. విని ఆశ్చర్యపోయాను.

''నిజం ?'' అన్నాను.

''నిజం అక్కా ! అన్నయ్యకి వాడికి వదినమీద అమిత ప్రేమ ఉన్నట్లు మనం గుర్తించటం ఇష్టంలేదు. అందుకని మన ఎదురుగా అల్లా విసవిస లాడుతున్నట్లు నటిస్తాడు. లేకపోతే అల్లా ఎందుకు చేస్తాడు !'' అంది అనూరాధ. అది నిజమే అన్పించింది. మేము పార్టీ ఇస్తామన్నా, చీర కొంటామన్నా, ధాంధూంలు చేసినవాడు ఆరోజ ప్రొద్దుటే ''నెక్లస్'' ఎందుకు కొంటాడు.? చీరకీ, పార్టీకి వందలు లేనివాడికి అయిదారు వందలు ''నెక్లస్'' కొందామనుకునే పెరికి ఎక్కడ్నించి రాలాయ్ !

''భాగ్యమతి చాలా వేర్పుగా ఓర్పుగా సంచరించేది. అయినా విశ్వనాథం మనస్సుని నిలపలేకపోయింది. ఇల్లా ఉండగానే విశ్వనాథం కళ్లకి ఇంకో అందమైన అమ్మాయి కన్పించింది. ఆమె అతని స్టూడెంటే !''

ఝల్లిపడింది ''అర్చన''. తనూ అతని స్టూడెంటే !

''అర్చన'' పద్దెనిమిది వసంతాలను కుతూహలంతో గమనించిన కుమారి. బరువు బాధ్యత అంటే ఎల్లా ఉంటాయో తెలియని సంసారపు ముద్దుబిడ్డ. ఆర్థికలోప మన్నది ఆరు తరాల వరకూ తెలియనంతటి భాగ్యవతి !

అల్లాంటి అర్చన ఇల్లాంటి విశ్వనాథాన్ని ఆకర్షించిందంటే అది స్త్రీ పురుషుల మధ్య విపరీతమైన వాంఛలని సృష్టించిన ఆదిదేవుడి తప్పు కాని, వా రిద్దరిదీ కాదు.

విశ్వనాథం అందమైనవాడంటే చాలదు. ఇంకా ఇంకా సాహిత్యలోకంలో ప్రచారంలో ఉన్న మాట లన్నిటినీ పోగుచేసి వర్ణించినా ఏదో ఒక లోపం ఉండనే ఉంటుంది. విద్యావంతుడు ! రెండు చేతులా సంపాయిస్తున్నాడు. ''కన్యా వరయతే రూపం'' అన్నట్లుగానే అతనికి రూపసంపద కోకొల్లలుగా ఉన్నది. ''అర్చన'' అతనిని అర్చించకపోతే ఇంకెవర్ని అర్చిస్తుంది !

అర్చిస్తూన్న విగ్రహం పగులు విచ్చితే అర్చకులకి ఎంత బాధ కలుగుతుందో ''అర్చన'' కీ అంత బాధా కలిగింది. ''వయస్సు'' అన్నది ఎంత క్రూరంగా మనస్సుల్ని వంచించి నవ్వుకుంటుదో ఇప్పుడు తెలిసివస్తూంది ''అర్చన''కి. తాను హృదయజీవి అన్నమాట ! బుద్ధిజీవి కాదు. అనుభూతి యొక్క ఆనందం, తాత్కాలికమని తెలిసుండీ అనుభూతినే వాంఛించడం అల్పబుద్ధికి నిదర్శనం కాక మరేమిటి ! తను గొప్పగా చదువుకుని వివేకవంతమైన జీవితం గడపగల్గాలనే ఆశయంతో ఇక్కడికి వచ్చింది కాని, రాసక్రీడలు నేర్చుకుందుకు కాదుగా ! పులి తన పిల్లల్ని తింటుందట ఆకలేస్తే ! అనాలోచిత అయిన యువతియొక్క వయస్సు తన నీతిని, నిజాయితీని పులిలా తినేస్తుందన్నమాట !

స్తబ్ధుగా వింటూంది అర్చన.

''ఆమెకి అతను వివాహితుడని తెలియక కాదు. తెలుసుండీ, తన సర్వస్వం అర్పించింది. అంటే ఆమెకి అతని పట్ల ఎంత వ్యామోహమో చూడు.''

''నిజం మాడం ! నాకు ఆయన వివాహితుడని తెలీదు!'' చటుక్కుని అంది అర్చన.

''పిచ్చిపిల్లా ! నీమాట కాదు. అతని ప్రేయసుల్లో ఒకరి గురించి నీకు తెలియకపోవచ్చును. అతను చెప్పడు కూడా ! మామూలు కుర్రాళ్లల్లే ప్రేమ సంభాషణలు వల్లెవేస్తాడు. కాస్త కథలూ అవీ వ్రాస్తాడు కనుక కవిత్వంగా కూడా మాట్లాడుతాడు.''

''ఆయన కథకులా !'' కళ్లు పెద్దవిచేసి అడిగింది.

''గౌరవం పెంచుకోకు ! కథకుడే ! ''అభయ'' అనే పెన్ నేంతో వ్రాస్తాడు.

''అభయ !''

ఎంత వద్దనుకున్నా విశ్వనాథం రూపం చెరిగిపోతున్న ''అర్చన'' హృదయ ఫలకంమీద 'అభయ' కథలుగాఢంగా ముద్ర వేసుకున్నాయి.

''అతనంటే అభిలాష కలగటానికి అదీ ఒక కారణంగానే ఉంటుంది. తన కళ్లల్లోకి చూస్తూ మాట్లాడలేని స్త్రీని అతను అనాగరిక యువతిగా జమకట్టాడు. వాళ్లకి సౌందర్యదృష్టి లోపించిం దంటాడు.''

బాగా చీకటి పడిపోయింది. పార్కు అంతా ఖాళీ అయిపోతోంది. కమల కూడా కూర్చోవటం నించి ''అర్చన'' ధైర్యంగా కూర్చుంది కానీ లేకపోతే అంత ధైర్యంగా కూర్చోదు. హాస్టల్‌లో మీల్స్ రెడీ అయ్యాయని సూచించే గంట గణగణా మ్రోగింది. ఇంక వెళ్లాలి. కాని, పూర్తిగా తెలుసుకోందే అర్చన ఎల్లా వెళ్లుతుంది ? పూర్తిగా తెలియచెప్పందే కమల మటుకు ''అర్చన'' ని గాలికి ఎల్లా వదిలిపెడ్తుంది ?

అర్చన పెదాలు కదిలాయ్ ! అది గమనించింది కమల.

''భాగ్యమతి గురించి తెలుసుకోవాలనుకున్నావు కదూ. అదే చెప్తాను. అంత తెలివైన భాగ్యమతీ కూడా ఒక్కసారి పప్పులో కాలు వేసింది. అదే ఆమె చావుకి మూలకారణమైంది. తన భర్తని ప్రేమించిన విద్యార్థిని దగ్గరకు వెళ్లింది. నీ ప్రేమకు హక్కు లేదంది. ఆ విద్యార్థిని గడుసరి కూడాను.

# సంకల్పాలు - వికల్పాలు

"నీలో ఆకర్షణ లేదు కనుక నీ భర్త నన్ను ఆరాధిస్తున్నాడు. ఆదిలక్ష్మి ముక్కు మూసుకుని కూర్చోవటం వల్లనే చెంచులక్ష్మి వెంటపడ్డాడు నరసింహుడు" అంది.

"నిజమే ! అయితే మీకు ఈ చాటు ప్రతుకెందుకు ? హాయిగా మాయింటికొచ్చి ఉండరాదూ !"

"..... లా .... ఒప్పదుగా !"

"మనుష్యులు ఒప్పుకోకపోతే "లా" కోసం పరుగెట్టాలి కాని, నా అంత నేను స్వాధీనం చేస్తోంటే ఇంకా అనుమాన మెందుకు ?"

అంత ఉదారంగా ఆమె చెప్తోంటే చిన్నబోయింది ఆ విద్యార్థిని. ఏదయినా అంతే ! బలవంతంగా మనం కష్టపడి పొందిన దాంట్లో ఉన్న తృప్తి ఒకరు అయాచితంగా ధార పోస్తే అనుభవించటంలో ఉండదు. ఆ విద్యార్థినికి తన ప్రేమ కలాపం విసుగనిపించింది. విశ్వనాథాన్ని నిరసించింది. అతని చర్యలని విమర్శించింది. తను చదువుకుందుకు వచ్చానన్న జ్ఞానం తనచేత విస్మరింపబడ్డందుకు కుమిలిపోయింది. "అర్చన" బిక్కగా చూసింది కమల వెంపు. కమల చెప్తోన్న దంతా అక్షరం పొల్లుపోకుండా తనమీదకే వర్తిస్తోంది.

"అది గ్రహించాడు విశ్వనాథం. అప్పటికింకా ఆ విద్యార్థిని అతనికి అందలేదు. అంచేత ఆ నిరాకరణ అతను భరించలేకపోయాడు. అది భార్యమీద కచ్చగా రూపాంతరం చెందింది. అంతే ! ఆమెని గొంతు నులిమి చంపాడు !" అతనిలోని క్షీరని రూప తృష్ణకి ఒక యౌవన అనురాగ ప్రాణం బలి అయ్యింది."

"ఛీ ! ఛీ !" అంది అర్చన.

"హంతకుడు విశ్వనాథం ! అందమైన అమ్మాయిల ఆనందాన్ని తన అందంతో హత్య చేస్తాడు విశ్వనాథం ! అతన్ని ప్రేమించకోరేవారికి దుర్భర దుఃఖం మిగులుతుంది." కమల లేచి నించుంది. అర్చన కూడా లేచి నించుంది. ఇద్దరూ బరువుగా హాస్టల్ వెంపు నడిచారు. హాస్టలులో అప్పుడే ఒక జట్టువారి భోజనాలు అయిపోయాయి కాబోల్ను. ఎవళ్ల గదుల్లోకి వాళ్ళు సర్దుకుంటున్నారు.

"ఇంతకీ ఆ విద్యార్థినిని ఈయన పొందగల్గారా !" తెలుసుకోవాలన్న దుగ్దతో అడిగింది అర్చన.

"ఆ అమ్మాయి, ఎంతో ప్రాధేయపడితేనేగాని ఒప్పుకోలేదు. చివరికి రిజిష్టర్ మారేజ్ చేసుకున్నాక అప్పుడు లొంబడింది. కాని, ఇతను కొన్నాళ్ళయ్యాక మళ్లీ మామూలు ధోరణిలో పడటంతో విసుగెత్తి విడాకు లిచ్చేసింది. పిచ్చిపిల్లా! కుక్కతోక వంకర ఎవరు తీయగలరు ! గంటసేపు బండరాతి క్రింద పెట్టి మళ్లీ తీసినా యథాప్రకారం అలాగే అల్లా వంకరగానే ఉంటుంది !"

"ఆ అమ్మాయి యేంచేస్తోంది ?"

"ఇక్కడ్నే లెక్చరర్‌గా పనిచేస్తోంది!" అన్నది కమల.

"ఇక్కడ్నా !"

"అవును ఇక్కడ్నే !"

విసవిసా లోపలికి వెళ్ళిపోయింది కమల. వరండాలో అల్లానే నిలబడింది అర్చన.

"ఏమోయ్ ! భోజనం అయ్యిందా !" అంటూ మూతి ముడుచుకుంటూ వచ్చింది రూంమేటు సుమతి.

"లేదు సుమా ! విశ్వనాథంగారికి పెళ్ళయిందట !" అంది గదిలోకి వెళ్తూనే. అదే ముఖ్యవార్త అయినట్లు చెప్పింది అర్చన.

"నాకు ముందే తెలుసు ! ఏం ! అతనింకా పెళ్ళికాదు కనుకున్నావా ఏమిటి ! గుడ్ హెవెన్స్ !" అంది సుమతి. సుమతి నల్లగా, పొడుగ్గా ఉంటుంది. వకవకా మాట్లాడుతుంది.

"ఆవిడ ! ఇక్కడ్నే వర్కు చేస్తున్నారట కూడా !"

"అవునా ! ఇంతకీ ఇవ్వాళ నువ్వు ఒంటిపూట చేయ దల్చుకున్నావా ఏమిటి ? లే నడు ! ఆఖరిజట్టు కూడా వచ్చేస్తోంది" అంది సుమతి.

"నా కివ్వాళ ఏమీ తినాలని లేదు సుమా ! ఇంతకీ ఆయన భార్యని నువ్వెరుగుదువా ?"

"ఏమిటా క్యూరియాసిటీ నీకు ! కొంపదీసి అతన్ని ప్రేమించటం లేదుకదా !"

"చెప్పవోయ్ ! వంపక !"

"చంపేది నేను కాదు ! వాడి తూపులతో ఆ పంచ బాణుడే చంపుతున్నాడు నిన్ను !"

"పోన్లే !" మూతి ముడుచుకు కూర్చుంది అర్చన.

"తెలియకనే నిన్నడగటం ?"

"తెలుస్తే ఎందు కడుగుతాను !"

"నువ్విప్పుడు ఎవరితోనో వస్తోంటే చూశాను. ఎవరావిడ ?" కవ్విస్తూ అడిగింది సుమతి.

"మన కమలాదేవిగారు !"

"ఆవిడే !"

"ఆఁ ! నిజం ?!"

"పాపం !" నిట్టూర్చింది అర్చన బాధగా.

"ఆవిడ కేమొచ్చిందని ఇప్పుడు నీకు బాధ ?" అంది సుమతి.

"ఆవిడ విడాకు లిచ్చేసిందటనా !"

"ఎవరన్నారు ఆమాట !"

"ఆవిడే అన్నది నాతో !"

"ఈ నాటకం ఇక్కడ కూడా మొదలెట్టారన్నమాట"

"నాటకమా !"

"కాక !"

"నా కర్థం కావటంలేదే సుమా !"

"నీ కర్థం అవ్వాలంటే నేను మరాఠీ భాష నేర్చుకోవాలి. ఇంతకీ కమల నీతో ఏమని చెప్పింది !"

కమల చెప్పిందంతా చెప్పింది అర్చన. అంతా విని, సుమతి నవ్వింది.

"పాత కథే ! ఇంకా మార్చలేదన్నమాట !"

"నా కంతా చెప్పు సుమా !"

"వాళ్ళిద్దరూ విడాకు లివ్వకోలేదు. నలుగురు పిల్లలు కూడా ఉన్నారు వాళ్ళకి. ఆ పిల్లల్ని స్విట్జర్లెండులో చదివిస్తున్నారు. ఇద్దరూ కలిసి ఆడుతోన్న నాటకం ఇదంతా. కమలకి, తన భర్త అందగాడనీ ఆకర్షణశక్తి కలవాడనీ తెలుసును. అతనిలోని లాలసత్వమూ తెలుసును. అతని లాలసత్వంతో ఆమె ధనం సంపాదించాలని వేసిన ఎత్తు."

"ధనమూ ! ఎల్లాగ వస్తుంది !"

"ఎల్లాగ వస్తుందా ! ఎంత అమాయకురాలివే అర్చనా! ఉదాహరణకి నువ్వున్నావనుకో ! నువ్వు గొప్పింటి అమ్మాయివి కదా ! ముందు నిన్నాకర్షిస్తాడు. నువ్వు అతనికి లోబడ్డాక పెళ్ళి చేసుకుందాం అంటావు. అప్పుడు మీ నాన్నగారి నడిగి మీ స్టేటస్‌కి తగినట్లు కట్నం పుచ్చుకుంటాడు. కట్నంతో ఇతని కిచ్చి పెళ్ళి చేయటాని కి నిరాకరిస్తే, కొద్దో గొప్పో డబ్బు ఇస్తే ఇంక నీ జోలికి రాకుండా ఉంటా నంటాడు. "కల్యాణమో, కలహమో" తేల్చుకోవాల్సింది మీరు!"

అర్చన నీరసపడి పోయింది. ఒకళ్ల కథనానికి ఇంకోళ్ల కథనానికి పొత్తు కుదరటంలేదు. అల్లానే నీరసంగా మంచం మీదకు వాలిపోయింది.

తరువాత వారంరోజులూ విశ్వనాథం ఎంత ప్రయత్నించినా అర్చన ఒంటిగా దొరకలేదు.

విశ్వనాథం హతాశుడైనాడు. అతనికి కోపం వచ్చింది. అర్చనకి తనపట్ల విముఖత కలిగించిన దెవరో అతనికి తెలియనిది కాదు. కాని, వాళ్లతో పేచీపడటం అతని స్వభావానికే విరుద్ధం ! అంచేత నిశ్శబ్దంగా తండ్రి ఆజ్ఞ మేరకు తల వంచాడు ముప్పైనాలుగేళ్ల విశ్వనాథం. ప్రొఫెసర్ విశ్వనాథం ! జీవితంలో అతను ప్రేమను పోగొట్టుకున్నాడు. ప్రేమించిన యువతి కానప్పుడు ఇంకెవరైతే నేం ? అన్న విర్లిప్తతలో యాభైవేల రూపాయల కట్నంతో, సర్వ లాంఛనాలతో వచ్చిన తండ్రి నిర్ణయించిన రాజ్యలక్ష్మిని పెళ్ళాడాడు.

అర్చన ఆశ్చర్యపోయింది. ఈ "మిష్టరీ" ఏమిటో అర్థంకాలేదు అర్చనకి. హంతకుడూ, దగాకోరూ అయిన విశ్వనాథానికి అంత బహిరంగంగా రాజ్యలక్ష్మి నిచ్చి ఎల్లా పెళ్లిచేశారో ఆమెకి అయోమయంగా ఉంది.

అంచేత నేరుగా రాజ్యలక్ష్మినే అడిగేసింది. రాజ్యలక్ష్మి సుమతికి మేనమామ కూతురు.

"ఎల్లా ఒప్పుకున్నావే రాజం ! ఆయన కారెక్టరు తెలిసుండీ !" అన్నది అర్చన.

"తెలుసున్నదాన్ని కనుకే ఒప్పుకున్నాను !" అంది రాజ్యలక్ష్మి. ఆమె చెంపలు సిగ్గుతో కెంపెక్కాయ్ !

"అది కాదే ఇది తెలుసా !" అని తనతో సుమతి చెప్పిన విషయం చెప్పింది.

"ఛీ ! ఛీ ! కమల కింకా పెళ్లికాందే ! బలే అల్లింపే కథ ! సుమతి ! కానయితే ఒక విషయం ఉంది. కమలా, సుమతీ కూడా ఆయన్ని ప్రేమించారు. ఆయన ఒప్పుకోక పోవటంతో ఇల్లా కథ లల్లి ప్రచారం చేశారు అన్నమాట !" అంది రాజ్యలక్ష్మి భర్తమీద అభిమానంతో. రాజ్యలక్ష్మి కళ్లు నక్షత్రాలల్లె మెరవసాగాయ్ !

"అయితే ఇద్దరి కిద్దరూ ఆయన ప్రేమకోసం పోటీ పడ్డారన్నమాట !"

"వీళ్లన్నమాటేమిటి ! కాలేజీలో చేరిన ప్రతి కన్యా ఆయనకోసం తహతహ లాడిందే ! ఆయన అందం అల్లాంటిది! అంది రాజ్యలక్ష్మి. తనేదో అవమానించినట్లు భావించింది అర్చన.

వెళ్లబోతూ—

"మా ఆయన్ని "డోరియన్ గ్రే" అని అభివర్ణించింది కమల" అన్నది అర్చన.

"అందనివారికి "డోరియన్ గ్రే" అందినవారికి అమృతమూర్తి" స్థిరంగా, దృఢంగా అన్నది రాజ్యలక్ష్మి.

"అర్చన" గబగబా గుమ్మందిగి నడవబోతూ ఎదురుగా వస్తూన్న విశ్వనాథాన్ని చూసి ఆగిపోయింది. విశ్వనాథం ఒక్కసారి నిర్లిప్తతగా చూశాడు అర్చన వెంపు. అతని కళ్లల్లో ఆరిపోయిన ప్రేమజ్యోతిని మొదటిసారిగా గుర్తించి చిన్నబోయింది అర్చన మనస్సు ! ముఖం దించుకుని గబాల్న నడిచి వెళ్లిపోయింది అర్చన.

గాఢంగా నిట్టూర్చాడు విశ్వనాథం.

# పోచిరాజు వీరన



**"రావు"**

ఆంధ్ర వాఙ్మయమున పదునెనిమిదవ శతాబ్ది అంతమున పందొమ్మిదవ శతాబ్ది ప్రథమ పాదమున నెన్నదగిన కవులలో వీరన గణనీయుడు. విశేషముగా శైవ సాహిత్యమునకు సంబంధించిన గ్రంథములను చాల రచియించియున్నాడు. తన కాలమున బందరునందు ప్రసిద్ధుడైన "దాము మొగ్గన్న" అను చిత్రకార కులస్థునికి తన భల్లాణ చరిత్రము నంకితము చేయుచు నందు బందరు నిట్లు వర్ణించియున్నాడు.

సీ. శ్రీకంఠ వైకుంఠ సేవా వికుంఠ వం
        దారు మందిరము బందారుపురము
    నిరతోత్స వైశ్వర్య నికరాభి భూత బృం
        దారకపురము బందారు పురము
    సంత తాయాత యాచక జన వ్రాతమం
        దార భాసురము బందారపురము
    సకల వర్ణాశ్రమాచార సంపత్యమం
        దారతి భరము బందారు పురము

గీ. శిల్పి నర్తన వర్తక చిత్రకార
    సూత్ర కారాది వివిధ విచిత్ర కృత్య
    దాన ధర్మ పర ప్రజోత్కర చకోర
    కార విందారికరము బందారు పురము

పోచిరాజా వీరన చరిత్రనుబట్టి చూడగా నా త డీ భల్లాణ చరిత్రము తన 37 వ యేట రచించినట్లు తెలియుచున్నది. అతడు క్రీ. శ. 1770—1840 ప్రాంతమున నున్నవాడు కావున నీ కృతి రచనము క్రీ. శ. 1807 ప్రాంతము కావచ్చును. ఇందలి విశేష మేమనగా భల్లాణ చరిత్ర మచ్చుకాక పోయినను—పై పద్యము మాత్రము ముద్రణ భాగ్యము నందినది. నా వద్దనున్న ప్రాత గ్రంథ సంచయమున నీ నడుమనే లభించినది — దానిని ప్రక్క పుటలో నిచ్చుచున్నాను.

దీనిలో "తెనుగు చప్పా వెయ్యడం ఆరంభించిన తారీకూ" అని యుండుటయే ఈ ముద్రణ దమారమి నూట ఏబది యేండ్ల నాటిది యని చెప్పవచ్చును. అచ్చు వేయుట అనే పదానికి, చాపా వేయడం అనే మాట పూర్వము వాడుకలో నున్నట్లు శ్రీ సీతారామపండితుని మిశ్ర భాషా నిఘంటువు నుండి తెలియ వచ్చుచున్నది.

ఛాపా N. S. ఉర్దూ — **Chhapa a seal, a print or stamp** ముద్ర. అచ్చు చాపా వేయుట **to seal or print** ఛాపా కాగితము **Stamp paper, stamps.**

**Dictionary of Mixed Telugu p. 35.**

క్రీ. శ. 1854 నాటికి 'చాపా వేయుట' అనునది లచ్చువేయుట అను దానికి పర్యాయ పదముగా నున్నను తెనుగులో నంతకుముందు అనగా క్రీ. శ. 1854 కు ముందు ముద్రితములైన గ్రంథములలో నీ మాట కానరాదు.

1819 రావిపాటి గురుమూర్తి శాస్త్రి విక్రమార్కుని కథలు: "చెన్న పట్టణ పాఠశాలయం <u>దచ్చువేయించ</u> బడ్డది."

1836 "చర్చి మిసయోన్ ప్రెస్సులో వ్యాకరణము <u>అచ్చు వేయించబడ్డది.</u>

1849 దశావతార చరిత్ర ముద్రణములో— నాగరాజా శేషగిరిరావుచేత <u>అచ్చు వేయించబడ్డది.</u>

ఇంతకును నిదియే ముద్రిత గ్రంథమునకు సంబంధించినదో తెలియలేదు—భల్లాణ చరిత్ర రచనానంతరముననే ఇది ముద్రణ కెక్కుట వాస్తవము—కాబట్టి యీ ముద్రణము నూట ఏబది ఏండ్ల క్రిందటిది అని చెప్పవచ్చును.

తెలుగు గ్రంథ ముద్రణ ప్రారంభ దినములలో 'అచ్చు వేయించు'—'అచ్చు కూర్పించు' అచ్చగు—అను క్రియలే విశేష వ్యాప్తిలో నుండెడివి—అచ్చొత్తించు—అను క్రియకు బదులు 'అచ్చొత్తు' అని వాడెడివారు.

ఒకసారి కీ. శే. మండపాక పార్వతీశ్వరశాస్త్రులవారు కొక్కొండ వారికి లేఖ వ్రాయుచు నం దీ క్రియ నుపయోగించిరి. మ. పటుధాటీ పరిపాటి యందు, కవితా ప్రాగల్భ మందింకన

చైత్ర బళ్ళ లనంగు బప్ప వయ్యాఢంలారంబిద్దినతారి
కాం
యాదృశీ పుస్తకం దృష్ట్వా తాదృశీ లిఖితం మయా
అబద్ధంవా సుబద్ధంవా మమదోషో నవిద్యతే
శ్రావతత్పుర్వ ల నవాచకులలు గకలప్పగలిగనైన
గని ...ంములు శిల్పిత ...ంగ జటుపుడు
వ్యా శ్లై నవాగుసు రదిరముగా
శ్రీకంఠ శ్లై శంకర సేవావినుంర వందారు బృందేరష్ణు
బందారు పుర ముా। నిరతోత్స శ్లై శ్చర్య నికరాభిసూత
దారకా పుర ము బందారు పు... । సం...
...తయా రకదని శ్రావతమరిద ంభాసంంము బాదారు పుర
ము। సకలవనా శ్రీ నూచారసంపత్యామందారతిభరము
బందారుపుర ముా। శిల్పి నత కవత కదిత్రకార।పుత్ర
కాపాదివివిధవిదిత్రవృత్యా।దానధర్మ పర ప్రజోత్తరబకో
తకాదవిందారి కరము బందారువర ముా

ప్పటి యుండెన్నినగస్ప చెప్పపురిలో నెక్కొన్న కొక్కొండ వేం
కట రర్నాఖ్య కవీశ్వరుండు సరస గ్రంథంబు
లచ్చొత్తుచుం[1]

ప్రస్తుత కాలమున ముద్రితము—ముద్రణ పదములు
వ్యాప్తిలో నున్నవి.

## వీ ర న క వి చ రి త్ర

పోచిరాజు వీరన యారువేల నియోగి—ఆపస్తంబ
సూత్రుడు. కౌండిల్య గోత్రుడు. వీరి వంశమున తొలుత పోచి
రాజు అను మహనీయుడుండెను, అతడు 'శమని' మొద
లగు పది గ్రామములు కరణీకములుగా సంపాదించెను. అతని
నుండి యీ వంశీయులు పోచిరాజు వింటిపేరు గలవారైరి.
వారి వంశ వృక్ష ...

పోచిరాజు
|
భద్రయ్య—ఎల్లాంబ
|
వీరన్న — కొండాంబ
|
వీరభద్రుడు (మూర్తమాంబ) — భద్రుడు
|
వీరన (గ్రంథకర్త)

1. ఆ కాలమున పండితకవులు లేఖలను, సంధారణముగ పద్యములతోను, లేని యెడల శుద్ధ గ్రాంధిక భాషలోను వ్రాసె వారు.

వీరన తొలుత కొలకులూరి వీరన్న యని పేరు పడినాడు. ఈమనికి రెండు క్రోసుల దూరమున నున్న కొలకులూరిలో వీరభద్రుని కొలుచుటచేతనే నారడు కొలకులూరి వీరన్న యైనాడు—ఈతడు 'ఈమని' గ్రామమున చాలకాలము నివసించుటచేత ఈమని వీరన్న అనియు వ్యవహృతుడైనాడు.

ఈతడు నియోగి యైనను, బెజవాడలో నా కాలమున శ్రీపతి పండితారాధ్య పీఠమునకు నధిపతియైన శంభులింగ గురునిచేత వీర మహేశ్వర దీక్ష నందినవాడు—ఇక నితని కృతులు:

## గ్రంథ రచన

పోచిరాజు వీరన శ్రీనాథమహాకవివలె తానేయే గ్రంథములనేయే వయస్సున రచించెనో వానిని భల్లాణ చరిత్రమున జెప్పియున్నాడు. ఆ పద్య వివరము నిట వ్రాయుచున్నాను:

14 వ యేట: కృష్ణార్జున సంవాదము—ప్రబంధము. ఇది యలభ్యము.

18 వ యేట: పంచ కావ్యాంధ్రీకరణము—సంస్కృత పంచ కావ్యములైన[2] (1) రఘు వంశము. (2) కుమారసంభవము (3) మేఘసందేశము, (4) కిరాతార్జునీయము (5) శిశుపాలవధ (మాఘ కావ్యము) లకు నీతడు పద్యాను వాదము గావించి యున్నాడు. పై వానిలో మొదటి నాల్గు లభించలేదు. అయిదవది—లభించినది.

22 వ యేట: విభూతి మహాత్మ్యము—ద్విపద.

26 వ యేట: మార్కండేయ చరిత్ర—పద్య కావ్యము.

30 వ యేట: మనువంశ పురాణము ,,

36 వ యేట: ముక్త దేవ చరిత్రము ,,

ఆ వెనుక ఆనంద లహరి, సౌందర్యలహరి, భర్తృహరి సుభాషితములు భాషాంతరీకరణము.

వీని వెనుక—భల్లాణ చరిత్ర, పద్యకృతి (రి 600)

ఈతని గద్య:-ఇది శ్రీ యగస్త్యేశ్వర వర ప్రసాద లబ్ధ కవిత్వ ప్రసిద్ధ శాండిల్యస గోత్ర పవిత్ర వీరభద్ర మంత్రి పుత్ర సహజ పాండిత్య వీరనామాత్య ప్రణీతంబైన భల్లాణ చరిత్రంబను మహా ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

## కవి - పరిశోధకుడు

సాధారణముగా కవు లెవ్వరును తమ్ముగూర్చి చెప్పుకొనని విషయ మీత డొకటి తెల్పియున్నాడు. కృతిపతి దాము మొగ్గన్న తనను బిలిచి ఇట్లన్నాడట.

గీ. ఆంధ్ర గీర్వాణ కావ్యంబులందు నధిక
శోధితుండవు సకలార్థ సాధకుడవు
నీవు చెప్పెడి బల్లాణ నృపుని కథ మ
హేశ్వరాంకితముగ రచియింపవలయు

లధిక శోధన యనగా—పరిశోధన. ఇదియే ఈనాడు విశ్వ విద్యాలయములలో రీసెర్చి—తొలుత తెలుగు వారిలో ప్రథమ చారిత్రక పరిశోధకుడు కావలి వెంకట బొర్రయ్య కాగా వీరన ప్రథమ సాహిత్య పరిశోధకుడని చెప్పవచ్చును. ఇరువురు సమకాలీనులు—వీరన బొర్రయ (1776–1803) కన్న హెచ్చు కాలము జీవించెను.

వీరన తాళపత్ర గ్రంథ పరిశోధన చేసినట్లుగా నాడు పత్రికలు వ్రాసిన తాళపత్ర ప్రతుల మూలముగా నిర్ణయింప వచ్చును—ఈతడు పరిశోధకుడే గాక ప్రశస్త లేఖరి—తాను వ్రాసిన గ్రంథములకు చివర లిఖిత కాలము పద్యముతో చెప్పి యున్నాడు. వానిలో మూడు మనకు లభ్యమైనవి.

ఉద్యోగపర్వము :

మ. అనఘుండీవని పోచిరాజకుల వీరామాత్య పుత్రుండు వీ
ర నయజ్ఞస్వర్కవి వ్రాసె మామిడి కుల గ్రామీణుడౌ నూర్వై
శ్యుని మాపుండగు వెంక యార్యు కొరకీ యుద్యోగ
పర్వంబు ప్రే
మను శుక్లాబ్దనభస్యమాస బహుళా మావాస్యయౌనాటికిన్

(R. 169) a ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార నివేదికలో నీప్రతిని గూర్చి ఇట్లు వ్రాయబడినది.

వ్రాత చక్కనిది—నిర్దుష్టము—శైథిల్యము గలదు. విలేఖకుడు సత్కవి గావున నీ ప్రతి విలువ గలది యగును. మను చరిత్ర: గీ. శుక్ల వర్ష తపోమాస......

వరకు మామిడి వెంకార్య వైశ్యవరున
కీ మను చరిత మీవని ధాముడైన
పోచి రాజ్వీర కవి వల్లభుడు లిఖించె (169)

మహా దేవకవి పద్య బసవ పురాణమును నీతడే లిఖియించి యున్నాడు.

చ. రసికుండు పోచిరాజకులరంజను డీమని నామ పట్టణా
వసథుండు వీరమంత్రి వ్యయ వత్సర ఫాల్గున మాసమందు నీ

---

2. ఇది లడయారు దివ్యజ్ఞాన సమాజ పుస్తక భాండాగారములో నున్నది. మాఘ కావ్యాంధ్రీకరణ చాల కష్టతమమైనది. వీరకవి రచన వెనుక—శ్రీ గోపీనాథ వెంకట కవీంద్రులు దీని నాంధ్రీకరించిరి. (మాఘే మేఘేగతం వయః మల్లినాథ సూక్తి)

బసవ పురాణ మాంధ్రకృతి పద్య కవిత్వము వ్రాపించ్చె ధ
ర్మ సుగుణ కీర్తి శాలియగు మామిడి వెంకయ వైశ్యపాళికిన్

పై మూడు పద్యములయందు పేర్కొనబడిన మామిడి వేంకయ, ఆర్య వైశ్యకులోద్ధారకుడని, శ్రీహూణ చక్రవర్తినీ (విక్టోరియా) దత్త సహస్ర దీనార పండిత రాయ బిరుదాంకితుడై ప్రఖ్యాతి జెందిన వెంకటార్యుడు—ఈతని కృతులలో 'సంస్కృత శబ్దార్థ కల్పతరువును—ఆంధ్ర దీపిక, విశేషమరము' చాల ప్రఖ్యాతములు. ఈతని జీవిత కాలము 1764–1834 మామిడి వెంకయ జీవిత కాలమునుబట్టి పై గ్రంథ విలేఖన కాలమును నిర్ణయింపవచ్చును.

ఉద్యోగ పర్వము, మను చరిత్ర—శుక్ల—సంవత్సరమున ననగా క్రీ. శ. 1809 లో లిఖిత మైనవి.

బసవ పురాణము— వ్యయ—సంవత్సరమున ననగా క్రీ.శ. 1826 లో లిఖిత మైనది.

ఈ పద్య బసవ పురాణ మెనిమిది యాశ్వాసముల మహా గ్రంథము. పిడువర్తి సోమనాథుని రచనకన్న చాల విపులముగా నున్నది. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారముననున్న ప్రతి శిథిలము అసమగ్రము; సంపూర్ణ ప్రతి అడయారు లైబ్రరీలో నున్నది.

వీరేశలింగముగారు తమ కవుల చరిత్ర మూడవ భాగములో పోచిరాజు వీరన కృతులుకే భల్లాణ చరిత్ర—మను వంశపురాణము రెండే లభించినవని వ్రాసియున్నారు. కాని తక్కిన విషయములందు లేవు—పై గ్రంథములలో ఖండ కపాలాఖ్యానము—అను నామాంతరముగల మను వంశ పురాణము ఆంధ్ర దేశ సాంఘిక చరిత్రకు ననుకూలించు పద్య కృతి. అందు—'తెలికి వేవురు' అని శాసనములయందు కానబడు దేవ తెలుకుల జాతి వారికి, వృత్తుల నిమిత్తమై వీర ప్రతాప భల్లాణ చోళరాజు భూములను దాన మొసంగెనను వృత్తాంతము గలదు. అందే వీర ప్రతాప భల్లాణ చోళరాజు శ్రీ బెజవాడ పట్టణ వాస్తవ్యుడు మహా మహిమోపేతులు నైన శ్రీపతి పండితారాధ్యుల శిష్యుడని కూడ తెలుపబడి యున్నది—ఇది యొక చారిత్రక గ్రంథముగా పరిశీలింపదగి యున్నది. మనము కేవలము ప్రబంధములని పరిగణించుచున్న పూర్వకవి కృతులలో అపూర్వ సాంఘిక చరిత్రాంశము లున్నవి. ఖండకపాలాఖ్యాన మట్టి దృష్టితో సాహిత్య చరిత్రకులు పరిశీలింతురు గాక!

---

3. ఇది ఈ నడుమ ననగా రెండేండ్ల క్రిందట ముద్రిత మైనది.

---

అవని నేదానమున నఘంబు బవఘుళించు
నట్టి దానంబుఁ జేయ రాదంద్రు బుధులు
కొదుక కొసఁగిన వాఘును గినన వాఁడు
మేలుఁ జెంద రనెడు సుద్ధి మీరు వినరే.

—పురాణం పిచ్చయ్యశాస్త్రి

# ప్రేమ లేఖ



శ్రీ పిరాజీ

ప్రేయసీ! నాకు తెలుసు
  నువ్వు భారత స్త్రీ మూర్తివి—
కష్టాలు పంచుకుంటూ
సుఖాలు నంచుకుంటూ వుంటానంటావ్.

కాని ఋణానుబంధాలను
తెంచుకోలేని నేను
అనుబంధాలు పెంచుకోలేను—
సంసారయాత్ర సాగించలేము.

అడ్డేకున్న నాలుగ్గోడల మధ్య
పాపం చేస్తున్నట్లు ప్రేమ—
శిక్ష ననుభవిస్తున్నట్లు
ఇద్దరం కలిసి మూడో ప్రాణి కిచ్చేజన్మ.

ఈ అనుబంధాల వ్యూహం
మధ్య నన్నిరికించకు—
మధ్యతరగతి అయినందున
కూలీనాలీ చేత కాని బ్రతుకు!

అందుకే స్వప్నాల లోకాలు
అందమైన ఊహా తల్పాలు
అనంతమైన ఆకాశ హార్మ్యాలు
కడుతూ వుంటాను-దయవుంటే పల్కరించి పో!

---

# లోను - శబ్దవిచారము



శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

క్రిందటి సెప్టెంబరు, అక్టోబరు భారతి పత్రికలలో లోపడు శబ్దముయొక్క సాధుత్వాసాధుత్వములను గురించి శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు, శ్రీ వంతరాం రామకృష్ణరావుగారు వ్రాసిన వ్యాసములను చదివిన మీదట లోను శబ్దమును గురించి కొన్ని యంశములు పండిత లోకమునకు విన్నవించుట అవసరమని తోచినది. చిన్నయసూరి: 'నిర్ధారణ షష్ఠికి లోపల వర్ణకము' విధించినాడు. "లోపల" సంగ్రహ రూపము 'లో'. ఈ 'లోపల' వర్ణకములో ప్రథమాక్షరములను శేషింప జేసి 'ను' గాగమము విధింపగా 'లోను' అని షష్ఠీ విభక్తి ప్రత్యయము సిద్ధించుచున్నది. ఇది ద్రుతాంతమనుటలో వివాదము లేదు. దీనికంటె భిన్నముగా సప్తమ్యర్థమున ప్రయుక్తమగుచున్న లోను యొక్క స్వరూపమేమి? అని పండితులు విచారింపవలసి యున్నది. బాల వ్యాకరణ తత్సమ పరిచ్ఛేదమునందు 'చేత తోడ లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికముగా శేషించు', అను సూత్రముక్రింద రామునిచే, రామునితో, వనములలో నని చిన్నయసూరి యుదాహరించెను. 'వనములో' నని భిన్నముగా నుదహరించుటవల్ల నీ యుదాహరణము నిర్ధారణ షష్ఠికి విషయముగాని సప్తమికి విషయముగాదు. దూసివారు "వనములలోను బరగె అనునట్టి సప్తమ్యర్థరూపము లరుదని తోచెడి" నని వ్రాయుటవల్ల వారు దీనిని సప్తమికి విషయమని భావించినట్లు స్పష్టమే. అట్లు భావించుట ప్రామాదికమని వేఱ చెప్పనక్కరలేదను కొందును. చిన్నయసూరి మతమున బా. సా. పే. కర్త మొదలైనవారు భావించినట్లు సప్తమ్యర్థకమగు 'లోను' ప్రత్యయము కాదు. మరి ఏమి కావలెను? విభక్తి ప్రతిరూపకమగు అవ్యయము కావలెనా? లేక విశేష్యము కావలెనా? విశేష్యమన్నచో చిన్నయసూరి మతము ననుసరించి యది కళయగును గాని ద్రుత ప్రకృతికముగాదు. ఆవయవిక 'ను' వర్ణమునకు చిన్నయసూరి మతము నద్రుతత్వ సిద్ధి లేదు. ప్రత్యయ, ఆగమ, అవ్యయాత్మకమైన 'ను' వర్ణమే చిన్నయసూరి మతమున ద్రుతము. కాబట్టి 'లోను' విశేష్యమన్నచో సప్తమ్యర్థమున వచ్చిన 'లోను' శబ్దమునందలి ను—వర్ణము సరళ పరకత్వమున లోపించుటయు, పరుష పరకత్వమున బిందు సంశ్లేషాది పరిణామమును పొందుటయు చిన్నయసూరి మతమునకు విరుద్ధ మనవలెను. నన్నయ్యగారి భారతమునందు గూడ సప్తమ్యర్థకమగు లోనునకు సరళ పరకత్వమున—ను—వర్ణ లోపమును, పరుష పరకత్వమున సరళాదేశాది ద్రుత కార్యములును నిత్యముగా ప్రయోగము లన్నింటను గల్గుచున్నవి. తగదని యెదలో వగవక—ఎదలో దీనికి నలుగంగ దగునె—క్రంచర నీరితో ముంచుచు—ఎదలో మన్నించి—ఘోరాజిలో నిన్ను మొనసి—మొ. వి.

అగ్నిలోఁ ద్రెళ్ళగ—ఈ వనరాశిలోఁ జొరవె—వనంబులోఁ గ్రుమ్మరువాడ—ఉగ్ర వనంబులోఁ దపో భారంబుదాల్చి— మొదలైన ప్రయోగములు కొల్లలుగా నున్నవి. మరియును విశేష్యము న కనుప్రయుక్తముకాక స్వతంత్రముగా ప్రయోగించబడిన సందర్భములందును ను—వర్ణ లోపాదులు కనబడుచున్నవి. "అగ్నియపోలె లో దహించును". మఱియును నన్నయగారిలో నీ శబ్దము 'లోను' అని ఉత్వ విశిష్టముగా ప్రయుక్తమైనట్లు కన్పింపదు. 'లోఁ, లోన్', 'లోన', 'లోనన్', 'లోనం', 'లోను', 'లోనను', 'లోని', 'లోనికి', 'లోనందు' ఇత్యాది రూపములలో దీని ప్రయోగము కన్పించుచున్నది.

అడవిలో నేకాంతమతి, వనంబులో నొక్కరుండ చనువాడు— ఇత్యాది ప్రయోగములందు లోన్, లోను, అని రెండు విధముల విడదీయవచ్చు గాని నిర్ధారకముగా 'లోను' అని ఉత్వ విశిష్ట రూపము ప్రయుక్తమైన సందర్భముగానరాలేదు గావునను 'లోన్' అని. 'అర్ధ్యానుడై వహ్నిలోన్', 'ఉత్సుకుడయ్యె నాత్మలోన్'—ఇత్యాది ప్రయోగములందు నిర్ధారకముగా ప్రయుక్తమైనది కావునను, పైన చూపిన అచ్చరకోదాహరణములందు ఉత్వ విశిష్టముగా కాక హల్మాత్రముగనే విడదీయుట యుక్తము. సీతారామమూర్తిగారి వ్యాసమునం దుదాహృతమైన శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి లేఖ యందలి 'ఇంద్రుడు లోనుగా గల దేవతలు' అన్న ప్రయోగ మెక్కడిదో తెలియదు. అర్వాచీనము గావచ్చు ననుకొందును.

# 'లోను' శబ్దవిచారము

ఈ పై నుదాహరణములనుబట్టి కాలక్రమమున లోన్ అన్న శబ్దమునకు ఉత్వము చేర్పబడి 'లోను'అని వ్యవహారము కలిగియుండునని నా యూహ. అది 'లోన్'—ఐనను, 'లోను'—ఐనను నిర్ధారణ షష్ఠ్యేతర స్థలములయందు అది ద్రుత ప్రకృతికముగనే అభిన్నమై కానవచ్చుచున్న దనుట ప్రకృతము. 'లోను పరుపక'— 'లోపడ'—అను తిక్కనగారి రెండు ప్రయోగములు నిర్ధారకములుగా లేవు. అచట సరళాదేశాదులు చేసినను ఛందోభంగాదులు రావు. ప్రయోగ బాహుళ్యమునుబట్టి తిక్కనగారివని చూపిన పై రెండు ప్రయోగములు లేఖకప్రమాదములని భావించుట దోషము కాదు. పై నన్నయగారి ప్రయోగములు చిన్నయసూరి యెఱుగడందుమా? కాన, సప్తమ్యర్థకమగు లోన్—లేక లోను శబ్దము ద్రుత ప్రకృతిక మనియే చిన్నయసూరి భావించి యుండునని మన మనుకొనవచ్చును గదా! అది ద్రుత ప్రకృతిక మైనపుడు చిన్నయసూరి మతమును బట్టి అది విభక్తి ప్రతిరూప కావ్యయము కావలసి యున్నది. పదము కాదు. మఱి 'లోని చూపున, 'లోని చూపు, లోచూపు, లోనికి, లోనన్ మొదలైన రూపములు ఔపవిభక్తిక ప్రత్యయాదులు చేరినవి కన్పించుచున్నవి. ఈ కారణమునుబట్టి 'లోను' విశేష్య రూపము, ఔపవిభక్తికమని శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు వ్రాసిరి. వారు వ్రాసినది జాగ్రత్తగా విచారింపవలసిన యంశము.

కాని సంస్కృతమునందును, తెన్గునందును కూడ కొన్ని అవ్యయములు విభక్త్యంత సదృశములుగా కన్పించు చుండుట ప్రసిద్ధమే. 'లోని'—లోని 'ఇ' వర్ణము చేత, లోడ, వలన—ల పైని చేరు 'ఇ' వర్ణము వంటి దనియు, 'లోనన్' అనునది 'లోనందు' వలె లోన్+నన్—అని విడదీసికొనుట యుక్తమనియు నా భావన. అప్పుడు లోన్—(ను) 'అందు' 'ఇందు', 'ఎందు' మొదలైన శబ్దములవలె విభక్తి ప్రతిరూప కావ్యయమని నిర్ధరించుటకు వీలుండును. ఆ+అందు, ఈ+అందు, ఎ+అందు—ఇత్యాదిగా విడదీసి వీనిని సప్తమ్యంతము లని దూసి వారు వ్యాఖ్యానించిరి. కాని స్థలాంతరమున వారే వీనిని విభక్తి ప్రతిరూపకములని వ్రాసిరి.

చిన్నయసూరి పరరూప సంధినే నిరూపించెను. తెలుగున పూర్వ రూపసంధి లేదు. అందుచేత నిట్లు విడదీయుట సరి కాదు. శ్రీ సీతారామమూర్తి చౌదరిగారు శబ్ద పల్లవముల మొదట నామవాచకము మాత్రమే నిలుచునని శ్రీ దూసివారి వ్యాఖ్య నుదాహరించిరి. దానిపైన శ్రీవంతరాం రామకృష్ణారావుగారు 'ద్రుతప్రకృతికము శబ్దపల్లవ పూర్వావయవము కానేరదు—శబ్దపల్లవ పూర్వావయవము ధాతువును కావచ్చు నను చిన్నయసూరి ఆశయము సరికాదనవలసి యున్నది. శబ్ద పల్లవ పూర్వ రూపము ద్రుతప్రకృతికముగా నుండు నుదాహరణము సూరియైనను నిచ్చియుండలేదు. శబ్దపల్లవ పూర్వావయవము ప్రథమాంతముగాని, ద్వితీయార్థక ప్రథమాంతముగాని, సప్తమ్యాద్యర్థక ప్రథమాంతముగాని అగునామమై యుండవలెనని వ్రాసిరి. శ్రీ వంతరాం రామకృష్ణారావుగారి అభిప్రాయము ప్రకారము 'లోబడు'—లో 'లోన్' ద్రుతప్రకృతికమే.

ఈ క్రింది ప్రయోగములను పండితులు పరిశీలింతురు' గాక.

నన్నయగారివి:

"తన్నిసిఁ దోఁబుట్టినవారి విడిచి—
విద్వజ్జనులను దోఁ జనుదేరఁగ—
వసుధాధిప జనులయుఁ దోడరాఁగ—
తపస్వినులై తోడదా నుత్తరాభిముఖుండై—

పోతనగారివి:

ఏ లోకంబులకైన వెంటబడి లో నేతెంచు చక్రాయుధ జ్వాలల్—
తోడంబుట్టిన వాని భంగమునకై దుఃఖించి—

వీనిలో తక్కిన వానిని లోడకు ప్రత్యేక ప్రయోగంబు కలదను ప్రౌఢ వ్యాకర్త మతము ననుసరించి శబ్ద పల్లవములు కాదన్నను తోఁబుట్టు, తోడంబుట్టు అను వానికి అవయవార్థము గాక రూఢార్థము కలదు, గావున శబ్ద పల్లవములు కాదనుటకు వీలుండదు. అందుచేత శబ్ద పల్లవ మునకు తొలి యవయవము ధాతువుకాని, నామవాచకము గాని మాత్రమే కావలయునన్న వ్యాఖ్య సరికాదు. వంతరాం రామకృష్ణారావుగారు ద్రుతప్రకృతికము శబ్దపల్లవమునకు మొదట నిలువదని వ్రాయుటలో ఒక ప్రత్యేక ప్రక్రియ యవలంబించిరి, కాన ఆ పద్ధతిలో వారి వాదము నాకు ప్రతికూలము కాదు. మఱి చిన్నయసూరి ప్రయోగ మొకటి 'లోపడు' నీతిచంద్రికయం దున్నట్లు శ్రీ సీతారామ మూర్తి చౌదరిగా రుదాహరించిరి.

ఇది అచ్చు తప్పు కావచ్చు. లేనిచో ప్రమాద పతితము కావచ్చును. చిన్నయసూరి బాలవ్యాకరణముచే సాధువులు కాని ప్రయోగములను కొన్నిటిని చేసినాడు. వల్ల—మొ. వి. (బాల కవి శరణ్యము చూడగలరు). లోపడు అను ప్రయోగము వ్యాకరణ విరుద్ధమనియే ఇప్పటికిని నా తలంపు. కాని, నాకు మహాకవి ప్రయోగము లున్నచో చాలును. వ్యాకరణమును

గుఱించి నా కంత పట్టుదల లేదు. లోఁబడు—అని కృష్ణా మండలమునందును, గుంటూరు మండలమున కొంత భాగమందును వ్యవహారమున గలదు. గుంటూరు మండలమునందు కొంతభాగమున, నెల్లూరు మండలమునను లోపడు అని వ్యవహరింతురు. వ్యవహార బలమువల్ల క్వాచిత్కముగానీ ప్రయోగము 'లోపడు' అని పండితుల రచనమునందు చేరియుండునని నా భావన. దానిని వ్యాకరణ ప్రక్రియతో సాధింపక పోయినను వచ్చిన లోపములేదు.

# 'లోపడు' అసాధువు కాదు



శ్రీ రావూరి దొరసామిశర్మ

లోపడు శబ్ద సాధుత్వమును గూర్చి కొంతకాలముగా భారతిలో విమర్శ సాగుచున్నది. సాధువనువారికి అసాధువను వారికి ఉభయులకుఁ గారణములు లేకపోలేదు. కట్టుదిట్టములుగల సంస్కృత భాషా వ్యాకరణములోనే విశేష విధులు, వికల్ప కార్యములు, అపవాదములు, నిపాతములు, యథోపదేశ్యములు పెక్కులు కలవు. ఇఁక ప్రయోగైక శరణమై, పర్యాప్త శబ్దానుశాసనములేని జీవద్భాషయగు తెనుఁగు భాషా విషయము చెప్పనక్కరలేదు. ఇది సహృదయైక వేద్యము. ఇఁక ప్రకృతము—లోపడు శబ్దము ప్రాసస్థానమున శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారిచే ఆత్మకథలోఁ బ్రయుక్తమయినది.

"మా పొత్తున కల్లర్గ్న లోఁపడిరి"

'లోఁబడు' అనవలెఁగాని 'లోపడు' అనరాదని పై ప్రయోగ మొక పత్రికలో నాక్షేపింపఁబడెను. మరియు ఈ శబ్దమే వారి తెనుఁగు నీతి యను రచనలోఁ బ్రయుక్తమై యుండఁగా, దానిని భారతిలో విమర్శకు లొకరు నిరాకరించిరి. తరువాత దీనిపై మరికొంత చర్చ భారతి ముఖమున జరిగెను. (చూ. 1963 సెప్టెంబరు, అక్టోబరు సంచికలు) ఈ శబ్ద సాధుత్వమును గూర్చి ఇంచుక నా యభిప్రాయము నిందుమూలమునఁ దెలుపఁ దలఁచితి.

శబ్ద రూప నిర్ణయమున మన కిప్పుడు నిఘంటువులే యాధారములు. కాని యా రూపములును మార్పరాని యతి ప్రాసాది నిబద్ధ స్థలములలో నున్ననే, ప్రమాణముగా గ్రహింపఁబడును.

'లోన్ + పడు=లోఁబడు, అను పదచ్ఛేదమును జూపినది సూర్యరాయాంధ్ర నిఘంటువు. లోఁగొను అనుచోటఁ గూడా 'లోన్ + కొను' అను భేదమే యందు చూపఁబడినది. ఇట్టి భేదముగల పక్షమున సంధియందు సరళాదేశము ద్రుతమునకు అర్ధబిందుత్వము సమీచీనమే యగును.

'లో' అను శబ్దమునకు ఇది—లోను—లోపల శబ్దముల యొక్క అర్థమును, పర్యాయము (అంతఃకరణము, అంతర్భాగము—అర్థములు) అని సూర్యరాయాంధ్ర నిఘంటువు లోను, వృత్తియందు లోను, లోపల శబ్దములకు మీది వర్ణములు లోపింపఁగా నిలిచిన రూపము (లోఁబడు, లోచూపు మొ) అని శబ్దరత్నాకరములోను తెలుపఁబడి యున్నది.

'లోఁగొను' అనుచోట 'లోను + కొను' అను భేదము చూపినది శబ్దరత్నాకరము.

దీనింబట్టి లోన్ + పడు, లోను + పడు' అని యిరు తెరంగుల భేదము చేయవచ్చునని తోఁచెడు. 'లోన్ + పడు' అను భేదము పక్షమున 'లోఁబడు' అను రూప మేర్పడును. 'లోను + పడు' అను పక్షమున 'లోఁబడు' అను రూపమే కలుగుననవలసి యున్నది. ప్రాఁతాది సంధి సూత్రములఁ బట్టి (బాల.వ్యా-సంధి—36,37)—'లోను + పడు—లో + పడు—లోన్ + పడు—లోఁబడు'— అని ఆద్యక్షర శేషముగాఁగ ద్రుత కార్యములు జరుగును. ఇది దీని ప్రక్రియ.

గడచిన అక్టోబరు భారతి సంచికలో శ్రీ రామకృష్ణారావుగారు 'లోను + పడు' అనుచోట లోను శబ్దమునందలి ఉత్త్వము లోపించి పరిశిష్ట నకారము ద్రుత కార్యమునందగా 'లోఁబడు' అను రూప మేర్పడును. అంతేకాక లోఁగడ, లోఁగన్ను......లోఁబెయ్యి' అను రూపములలో 'లోను' శబ్దమునందలి ఉత్వము లోపించుటయు ద్రుత కార్యములు జరుగుటయు కన్పట్టుచున్నది—అని వ్రాసిరి. వీరి ఈ సంధి ప్రక్రియ సక్రమమని కన్పట్టుచున్నది. 'లోను' ఉత్వ లోపముచే

ద్రుతాంతము కాఁజాలదు. లోను—విశేష్యము, కళ 'లో' సప్తమ్యర్థమున ద్రుతాంతమై 'లోన్' అగును. లోను—మ్రాను వంటిది. మ్రాను + పడు— 'మ్రాన్పడు' అగునుగాని 'మ్రాన్పడు, మ్రాఁబడు' అని కాదుగదా? అట్లే 'లోను + పడు' ఉత్వలోపముచే 'లోఁబడు' అని కాఁజాలదు.

ఘట్టకుటీ ప్రభాత న్యాయమున ప్రాంతాది సంధి ప్రక్రియ లోనైన 'లోఁబడు' అను రూపమే సిద్ధించును గాని 'లోవడు' కాదుగదా యని యడుగవచ్చును. ఈ సంధి బహుళముగాన అనేక రీతుల నుండును. యథా ప్రయోగముగా గ్రాహ్యము. ఆగమ శాస్త్ర మనిత్యమని వైయాకరణ మతము. కాన లుప్త శేషమునకు నుగాగమము రాకపోవచ్చు. అప్పట్టున 'లోను + పడు=లోవడు' అగుననుటలో వింత లేదు.

మరి'లోఁజెయ్యి—లోను + చెయ్యి,లోచూపు—లోపల + చూపు' అను రీతి భిన్నముగా భేదము సూర్యరాయ నిఘంటువులోఁ జూపఁబడినది. ఇందు మొదటి దానిలో లోపనుగాగమములు, రెండవదాన లోపము మాత్రము సంభవించెను. 'లోపల + చూపు' అను పదచ్ఛేదమున మాత్రమేల ప్రాంతాది సంధి నుగాగమ విధి ప్రవర్తింపదో ? అట్లే 'లోపల + చెయ్యి లోఁజెయ్యి' అని విడదీయుటలో దోషమేమో? లోను, లోపల ఈ రెండు సమానార్థకములే కదా? లోఁజెయ్యి, లోచూపులకుఁ బ్రాసస్థిత ప్రయోగములు గలవు. లోచెయ్యి లోఁజూపులకు లభింపలేదు కావలె. ఆదిలో చెప్పినట్లు మన వ్యాకరణము ప్రయోగములకు కదా?

లోవడు శబ్ద పల్లవము. అనేక విధములగు వర్ణలోపాగమాదేశ కార్యములు ఆచ్ఛిక సమాసములందువలె శబ్ద పల్లవములందును గలుగును. శబ్ద పల్లవము సంయుతము వృత్తి విశేషమే యనఁదగును. సమాసమున ద్రుతమునకు లోపమగును. అట్టే లోపము రాని తలంబ్రాలు లోనగు సమాసములున్న గలవు. దేశ్య శబ్దములలో వర్ణ లోపాది కార్యములు పెక్కు తెరగుల నుండుననుట కీ క్రింది యధర్వణ కారికలు ప్రమాణము·

''భూయసీ దేశ్య శబ్దేషు లోప వర్ణాగమ శ్రుతిః
తత్తత్పదం పరిగ్రాహ్యం యద్యత్స హృదయేహితమ్.'

మరియుఁ బ్రకారాంతరముగా దీని రూప నిష్పత్తి ఇట్లు చేయనగు. లో—లోను—ఈ రెండు విశేష్యములు కళలు గాన వీనికి సప్తమ్యర్థమున లోన్, లోనన్ అను రూపములు గలుగును. శబ్ద పల్లవమగు 'లోవడు' లోని 'లో' ప్రథమాంత శబ్దముగా గ్రహింపవలెను. అట్లేని 'లో + పడు—లోవడు' అను రూపము నిష్పన్న మగును. లో, లోను ప్రథమాంతము లనుటకు 'లోకి—లోనికి' అను ప్రయోగములు ప్రమాణములు. లోనుపడు, లోను చేయు అను రూపములును గలవు.

ఇట్లే పైన్ + పడు—పైఁబడు, పైఁదేలు అనియు పై + పడు—పైవడు, పైచేయు, అనియు రూప భేదములుండును. శబ్ద పల్లవ పూర్వ పదములు ప్రథమాంతము లగుచో ద్రుతమునకు లోపమగును. పైవెట్టు' అని గసడదవాదేశ రూపమును గలదు.

సాహిత్య సమీక్షలో శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 'చే-గొను' అను రూపమునఁ గావించిన సమీక్ష ఈ సందర్భమున గమనింపఁదగును.

''క్షితి మన నేటికిన్ హలము చేఁగొని.....'చేకొని' అను పాఠమున్నను, ఆ పాఠమున 'చేన్ = చేతియందు, కొని = గ్రహించి' అనే అర్థము సిద్ధింపదని 'చే-గొని' అని సవరించినారు. (సంజీవనీ వ్యాఖ్యాకారులు) తప్పు. 'చేకొను, కైకొను' వాకొను, పైకొను' అను క్రియలను 'చేఁగొను' కైఁగొను, వాఁకొను, పైఁగొను అని దిద్దుట సరికాదు. 'క్వచిన్నైవ వికారస్యాద్రూఢత్వాచ్ఛబ్ద పల్లవః (అధర్వణ— క్రి—32), (పు 353) 'లోఁబడు' అను శబ్ద రూపమునకు హరిశ్చంద్ర నలోపాఖ్యాన ప్రయోగము శబ్ద రత్నాకరములోఁ జూపఁబడినది. (కినిసి పాణి నాళీకంబు సొనుపుటయును, నంతలోఁ బడకదియు) ఏతద్గ్రంథ వ్యాఖ్యాత 'అంతలోన్ + పడక, అంత + లోఁబడక' అను భేదములను జేసెను. ఉభయార్థములందును 'లోఁబడు' శబ్దమును గ్రహింపవచ్చునని సులభ వ్యాకరణ రచయిత మతము. ఇందలి 'లోఁబడు' శబ్దము మార్పరాని ప్రాసనిబద్ధ స్థలముగాదు. 'లోవడు' అను రూపమును బెక్కురు మహా పండితులు వాడి యున్నారు. ఈ రెంటికిఁ బ్రాస స్థలఘటిత ప్రయోగములన్వేషణీయములు.

ఈ ప్రసంగము ననుసరించి 'లోనువడు, లోవడు, లోఁబడు' అను మూఁడు రూపములు సాధువు లనుటలో విప్రతిపత్తి యుండదని సారాంశము.

# గ్రీక్ కవీశ్వరుడు జార్జ్ సెఫెరిస్ 

★

## శ్రీ రోడిస్ రూఫస్

జార్జ్ సెఫెరిస్‌ను నేను మొట్టమొదట కలుసుకొన్నది 1946 వేసవిలో. గ్రీక్ దీవులలో ఒకటైన పోరస్‌లో సముద్ర తీరాన్ని ఉన్న ఒక స్నాన ఘట్టంలో నాకు అతనితో పరిచయం అయినది. కొండమీద నించున్న ఒక వ్యక్తికేసి చూపించి, ''అత నెవరో ఎరుగుదువా? అతనే సెఫెరిస్'' అన్నాడు నాస్నేహితు డొకాయన. ఎంతో ఆతురతతో నాకు అతనితో పరిచయం చెయ్యమని కోరాను నా స్నేహితుని. పదిహేనేళ్ళుగా అతన్ని గురించి నేను వింటూ వచ్చాను కాని



అంతవరకు చూడలేదు. నేను కాలేజిలో చదువుకొనే రోజులలో మేము అతని కవిత్వాన్ని చదివి, చర్చించి, కంఠస్థం చేసేవాళ్లం. అతని కవిత్వంమీద ఉండే అభిమానంవలన అతడొక మహా పురుషునిగా మేం గణించేవాళ్లం. ఈ స్థితిలో 45 ఏండ్ల వయస్సుగల బట్టతలగల ఒక మనిషిని చూపించి ఇతనే సెఫెరిస్ అని చెప్పేసరికి నేను నిజంగానే మొట్ట మొదట ఆశ్చర్య పడ్డాను. మధ్య మధ్యన మునకలు ములుగుతూ నాతో చాలా సుముఖంగా మాట్లాడాడు అతను. కాని నేను కవిత్వాన్నిగురించి అతనిచేత మాట్లాడించబోవడం గమనించి అతను కొంచెం చిరాకు పడ్డాడు. సర్వ సాధారణమైన విషయాలు మాట్లాడబోయాడేకాని కవిత్వపు విషయాలను గురించి మాట్లాడడానికి ఇష్టగించలేదు. పోగా, నేనెప్పుడు నావికుడుగా పని చేస్తున్నానని తెలిసి దేశ సేవకు అది ఎంత వరకు ఉపయోగిస్తుందో తెలిసికొనగోరాడు. అవేళ నేను నా పని ఎగవేసి స్నానఘట్టానికి వచ్చిన సంగతి విని ముఖం చిట్లించాడు; సైన్యంలో చేరినవాళ్లు క్రమపద్ధతిని అతిక్రమించకూడదని హెచ్చరించాడు.

నాకు ఆశ్చర్యం వేసింది. ఇతనేనా భావోద్రేకంతో తొణికిసలాడుతూ, అతి సుందరమైన స్వేచ్ఛా ప్రేమను గురించి ఎన్నో ఖండ కావ్యాలు వ్రాసిన స్వేచ్ఛామూర్తి అనిపించినది. జీవితంలో ఏమాత్రమూ తప్పుత్రోవ ఒప్పని వ్యక్తి అని అతని కవిత్వం వలన నాకు ఎప్పుడూ స్ఫురించలేదు. కొన్ని వారాల పాటు నేను ఆ చోటనే ఉండవలసి వుండటంవలన నేను అతనిని ఆ తర్వాత బాగా గమనించడం తటస్థించినది. సెఫెరిస్ ఒక పాతగిలిన ఇంట్లో పైన్‌వృక్షాలమధ్య సముద్ర తీరాన లేయెండలో డాబామీద పచారు చేస్తుండడం నేను చాలాసార్లు చూచాను. అతనితోను, అతని భార్యతోను చాల సార్లు మాట్లాడడం కూడ తటస్థించినది. సెఫెరిస్ పైకి కొంచెం దురుసుతనంగాను వెటకారంగాను మాట్లాడుతున్నట్లు తోచినప్పటికి, అతని మనస్సులో దయ, స్నేహభావం దాగుకొని ఉన్నట్లు తెలిసికొన్నాను. కాని ఆ రోజులలో అతను నాతో కవిత్వ విషయాలను గురించి మాట్లాడకపోవడం మాత్రం నాకు కించ కలిగించినది. అయితే ఆ రోజులలోనే అతను "The Thrush'' అను పేరిట ఒక పెద్ద కావ్యాన్ని వ్రాస్తున్నట్లు నాకేమి తెలుసును? తర్వాత తెలిసినది అతను ఏదైనా గొప్ప సారస్వత కృషి చేస్తున్నప్పుడు అతను కవిత్వాన్ని గురించి ఎవరితోను మాట్లాడడని. అతను పద్యాలు వ్రాయడం కూడ కూర్చుని వ్రాయడట. ఇటూ, అటూ పచారు చేస్తూ పద్యాలు అల్లుతాడట. ఒకటి రెండు పద్యాలు పూర్తికాగానే ఎత్తుగా అమర్చబడివున్న ఒక బల్ల దగ్గరకు వెళ్ళి నిలుచునే ఆ పద్యాలు రెండూ కాగితం మీదికి ఎక్కిస్తాడట.

తర్వాత కొన్ని సంవత్సరాలకు నాకు సెఫెరిస్‌తో బాగా స్నేహం కుదిరినది. అప్పుడు తెలిసినవి అతన్ని గురించిన కొన్ని

1. జార్జి సెఫెరిస్‌కు ఇటీవలనే ఈ ఏడాది ఉత్తమ సాహిత్య రచనలో నోబెల్ బహుమతి వచ్చింది. ఈ వ్యాస రచయితకు సెఫెరిస్‌తో చిర పరిచయముగలదు.

రహస్యాలు. అతను తరచుగా ఎవరితోను సారస్వత విషయాలను గురించి ముచ్చటించకపోవడం అతనిలోవున్న సమ్రత వినయం మూలాన మాత్రమే. కొంచెం ఉంటే కొండంతగా చేసి తన గొప్పలు తానే చెప్పుకొనే గుణం అతని దగ్గరలేదు. కవిత్వ తత్త్వాలను గురించి మానసిక తత్త్వాలను గురించి శాస్త్రీకరించడం అతనికి కిట్టదు. తాను కవిత్వం చెప్పగలిగిన కారణం వలన తాను మామూలుగా, నిరాడంబరంగా, వినయంగా ఉండనక్కర లేదని అతను ఎప్పుడూ అనుకొనడు. అతను మామూలుగా అందరిలాగే దుస్తులు ధరిస్తాడు; సమాజంలో సర్వ సాధారణంగా అందరు మనుష్యులూ మెలిగినట్లే అతనూ మెలుగుతాడు. మధ్యధరా సముద్ర ప్రాంతంలో జన్మించి, పారిస్ నగరంలో విద్యాభ్యాసం చేసిన ఈ కవిలో ఎందువలననో ఆంగ్లేయుల పద్ధతులు, వాళ్ల ధోరణులు ఎక్కువగా కనిపిస్తవి. అతని కవిత్వం కూడ ఆంగ్ల కవులైన టి. ఎస్. ఇలియట్, ఇజ్రా పౌండ్ మొదలగువారి కవిత్వాన్ని పోలి ఉంటుంది. అంతేకాక, మిగతా భాషలలోనికన్న ఆంగ్లంలోనికి ఇతని కావ్యాలను సులభంగా తర్జుమా చేయవచ్చు.

## సెఫెరిస్ పూర్వచరిత్ర

సెఫెరిస్ నేటి వయస్సు 63. 1900 లో స్మిర్నాలో జన్మించాడు. అయితే మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు పది లక్షలమంది గ్రీక్ పౌరులతోపాటు మధ్య ఆసియా ప్రాంతాలనుండి తరలివచ్చి, గ్రీస్‌లో శరణువేడవలసి వచ్చినది. బహుశః అతని వోరిమి, తెలివి తేటలు, ప్రశాంతత అతని పూర్వీకులనుండి వచ్చిఉంటవి; ఏలనన వాళ్లు నిరంతరము విదేశీయుల అధికారంక్రింద పడిఉండి జాగరూకతగా మెలగవలసి యుండేవారు. అతని కావ్యాలు ఎంతసేపూ దేశాన్నించి వెళ్లగొట్టబడిన పౌరుని తలపించేవే. అటువంటి వ్యక్తికి ఉండే విచారభావాలు అతని రచనలో తరచు కన్పిస్తవి. పైకి అప్పుడప్పుడు అతను చిర్రు బుస్సుమన్నప్పటికీ లోలోపల ఈ భావాలే ద్యోతమవుతుంటవి.

సెఫెరిస్ తండ్రి న్యాయశాస్త్రంలో గట్టివాడు. సెఫెరిస్ కూడ న్యాయశాస్త్రాన్ని అభ్యసించినవాడే. చివరకు దౌత్యవర్గంలో ఉద్యోగం సంపాదించాడు. ఆ పనిలో ఆరితేరాడు. అతని సారస్వతకృషిలోవలెనే దౌత్యఉద్యోగంలో కూడ స్పష్టత, నిష్పక్షపాతం కన్పిస్తుంటవి. అవినీతి, పెడబుద్ధి, కళకు కవిత్వానికి ప్రధానాంశాలని ప్రజలు అనుకొనే ఈ రోజులలో పూర్వం గోథే మహాశయుడన్నట్లు "మంచి మనిషిగా ఉండి కావలసినంత కవిత్వం వ్రాయవచ్చు"నని నిరూపించాడు.

గ్రీస్‌లోని సారస్వత రంగంలో సెఫెరిస్ 30 ఏండ్లుగా తన ప్రభావాన్ని వ్యక్తంచేస్తున్నాడు. కవితా విధానంలో అతను క్రొత్తపోకడలు త్రొక్కాడు. ఈ పోకడ లను అతని శిష్యతుల్యులైన నేటి యువకవులు చాలమంది అనుకరిస్తున్నారు. గ్రీస్‌లో నవకవిత్వం ప్రవేశపెట్టిన వారిలో సెఫెరిస్ ప్రధముడు. తన సొంతకావ్యాల ద్వారాను, ఇలియట్ వ్రాసిన ఆంగ్లకవిత్వంయొక్క తర్జుమాల ద్వారాను అతను ఈ క్రొత్తదనాన్ని సాధించాడు. మొదట్లో అతని కవిత్వం విన్నవాళ్లు ఆశ్చర్య చకితులయ్యేవారు. అతని ధైర్యానికీ, ఒక్కొక్కప్పుడు కంగారు కలిగించే అతని శైలికీ, పద్యరచనకు అనువుకాని అతని కవిత్వ వస్తువుకీ చాలమంది విస్తుపోయేవారు. అయితే క్రొత్తదనానికి అర్రులుచాచుకున్న కుర్రకారునకు మాత్రం దాహోపశమనమన్నై, భావోద్రేకం కలిగించేది. పదాలలో ఉండే సంగీతపు విలువలు, 'అవకతవక' కలియిక అనిపించే పదగుంభనల వలన ఉద్భవించే కాంతిపుంజాలు, సెఫెరిస్ చవి చూపించాడు. విషాదరీతులను సృష్టించడానికి మారుమూల పదాలతో కూడిన ఆడంబరశైలి అనవసరమనీ, అదే రీతిని నిరాడంబరశైలిని కొద్ది మాటలతో సృష్టించవచ్చునని నిరూపించాడు.

అయితే జార్జ్ సెఫెరిస్ కవిత్వరీతులలో నిపుణుడు మాత్రమేకాదు. సారస్వత రంగంలోనేకాక, అతని పలుకుబడి ఇరవై నలభై యేళ్ల మధ్య ఉన్న అతని చదువరు లందరిమీద ప్రబలి ఉన్నది. ఇట్టి పలుకుబడి అతనికి ఎలాగు కలిగినది? భావనావిషయంలో ప్రస్తుత గ్రీస్‌లో అతను అసమానుడని చెప్పవచ్చునా అంటే నేను ఒప్పుకోను. అతని కవిత్వంలో ధ్వనిస్తూనే ఉంటుందికాని, అతనెప్పుడూ కూడ బుద్ధి కుశలతకు ప్రాధాన్యం ఇవ్వలేదు.

అయితే అతని పలుకుబడికి కారణం ఏమిటి? మాటల ఉపయోగంలో మంత్రవేత్తలాగు అతని పద్యాలలో మనం ఇదివరలో గ్రహించని విషయాలు ద్యోతకమవుతవి. పురాతనపు శిలలోని రంగు రమ్యతలు వెలిసివస్తవి; పాతకథల కథనంలో క్రొత్త అర్థాలు స్ఫురిస్తవి. మానవులను, వాళ్ల పూర్వ గాథలను, వాళ్ల చరిత్రలను సెఫెరిస్ చిత్రించడం మూలాన ఒక అతి వాస్తవికమూ, అతి సున్నితమూ, అతి సమగ్రమూ, అతిఉదారమూ అయిన ప్రపంచాన్ని మన కళ్లకు కనిపింపచేస్తాడు. ప్రపంచాన్ని చక్కగా అర్థం చేసికొనగలిగే శక్తిని ప్రసాదించడమే అతని పలుకుబడిలోని రహస్యం.

సెఫెరిస్ కవితలో అర్థంలేని ఆశయాలులేవు. అందులో అతిశయోక్తిగాని, నీతి ప్రదర్శనంగాని లేకున్నప్పటికి గాంభీర్యానికిగాని నీతికిగాని లోటులేదు. శాశ్వత మానవ భావాలు ఎన్నో అతని కవిత్వంలో రూపుదాల్చినవి. తన కాలాతీతమైన ప్రజ్ఞవలన మనకు ప్రశాంతత సమకూరుస్తాడు సెఫెరిస్.

అతని కవిత్వ వస్తువు గ్రీస్ దేశానికి సంబంధించినదే అయినా అది సర్వ ప్రపంచానికి వర్తించడానికి వీలయినదే. వట్టి ఆలోచనలకన్న కార్యనిర్వహణం ప్రధాన మని అతని ఉద్దేశం. అతని కవిత్వం మనలోని మానవత్వాన్ని ఇనుమడింపచేయగలదు.

# తెలుగులో ఆకరగ్రంథాలు



## శ్రీ నిడుదవోలు వేంకటరావు

ఏ భాషలోనైనా ఆకర గ్రంథాలు, భాషా వాఙ్మయాలు బాగుగ అభివృద్ధిచెందిన వెనుకనే తప్ప, ప్రాథమికావస్థలో నెన్నడు బయలువెడల నేరవు. అతి ప్రాచీనమైన సంస్కృత భాషలో కూడ క్రీ. శ. పదునొకండవ శతాబ్ది నుండి మాత్రమే ఆకర గ్రంథము లవతరించినవి. వానిలో "కవీంద్ర వచన సముచ్చయము" అనునది మొదటిది. పండ్రెండవ శతాబ్ది ప్రారంభమున వెలసినది. ఆ వెనుక జల్హణుని సూక్తి ముక్తావళి, శార్ఙ్గధర పద్ధతి, వల్లభదేవుని సుభాషితావళి మున్నగునవి రచితములై ప్రచారములోనికి వచ్చినవి..

ఈ ఆకర గ్రంథరచన యనగా సామాన్యమైన పని గాదు. అందును ముద్రణాది వ్యవస్థ లేనినాడు, అట్టి కార్య నిర్వహణము దుర్ఘటమనియే చెప్పవచ్చును. మొదటిది ఆకర గ్రంథకర్తకు తన కాలమునకు ముందున్న గ్రంథముల విషయము చక్కగా తెలిసియుండవలెను. రెండవది—ఆయా గ్రంథములను సేకరింపవలెను.. మూడవది—వాని నన్నింటిని చదివి తాను సూచింపదలచిన పద్యములు గాని, శ్లోకములు గాని గుర్తుపెట్టుకొనవలెను. నాల్గవది—అట్టి వానిని శీర్షికల క్రింద విభాగించవలెను. అయిదవది— వానిని గ్రంథముగా వ్రాయించవలెను. ఇట్టి "పంచకరపాట్లు"1 పడిన గాని ఆకర గ్రంథము లోకములో నవతరించదు. సృజనాత్మకమైన యుత్తమ రచన చేసిన కవి కావ్యమును చదివి యెంతగా యానందింతుమో, ఆకర గ్రంథ రచనవలన గూడ అంత యానందమును పొందుదుము—ఏలననగా, ఈ గ్రంథములో మనకు తెలిసి యుండియు లభ్యముగాని గ్రంథములనుండి కొన్ని పద్యములైన గ్రహింపబడును. వానివలన ఆ గ్రంథ విశిష్టత తెలిసికొనవచ్చును. ఒక్కొక్కప్పుడా గ్రంథమే పూర్తిగ లభ్యమైనచో, అప్పుడు మన కెంత యానందము కలుగును ? పోయిన ద్రవ్యము తిరిగి లభించినట్లు.

తెలుగు భాషలో తక్కిన ద్రవిడ, కన్నడ, మలయాళ, మహారాష్ట్ర భాషలకన్న యీ ఆకర గ్రంథాలు చాలా హెచ్చని చెప్పవచ్చును. ఈ ఆకర గ్రంథాలు మూడు విధాలు.

(1) సంకలన గ్రంథములు. (Anthologies.)

(2) లక్షణ గ్రంథములు. (works relating to Prosody )

(3) గ్రంథ సూచికలు. (Catalogues.))

వీనిని పరిశీలించిన, అవి మన తెలుగు భాషా సాహిత్య చరిత్ర కెంత ప్రధానాధారములో తెలియగలదు.

## సంకలన గ్రంథములు

### సకలనీతి సమ్మతము :

తెలుగున వెలసిన సంకలన గ్రంథములలో మొదటిది సకలనీతి సమ్మతము. మడికి సింగన కవికృతము. సింగన కాలము క్రీ. శ. 1420 ప్రాంతమని స్పష్టమగుటచేత నిందుదాహరింపబడిన గ్రంథములన్నియు నంతకుముందు రచితములైనవని చెప్పవచ్చును. ఇందు రాజనీతికి, లోకనీతికి సంబంధించిన పద్యములు, గ్రంథ భాగముల నుదాహరించి సింగన యైదాశ్వాసముల కృతిగా రచించెను. కాని యందు మూడాశ్వాసములు మాత్రమే మనకు లభించినవి. ఇందును వేయింటికి పైగా పద్యము లున్నవి.

ఇందు మహా భారతము, బద్దెనీతి, నన్నెచోడని కుమారసంభవము నుండియే గాక, ఈ క్రింది యలభ్య గ్రంథముల నుండి ఆకరము లుదాహరింపబడినవి.

1. పురుషార్థ సారము — శివదేవయ్య — కాకతి గణపతి దేవుని గురువు, మంత్రి.

2. నీతి భూషణము—క్షేమేంద్రుడు— (అక్కాభట్టు).

3. ముద్రామాత్యము— క్షేమేంద్రుడు — (అక్కాభట్టు)

4. నీతిసారము—ప్రతాపరుద్ర చక్రవర్తి.

5. పంచతంత్రము.2 గ్రంథకర్త పేరు తెలియదు. ఇందుండి 160 పద్యము లుదాహరింపబడినవి.

6. కామందకము3 గ్రంథకర్త పేరు తెలియదు. ఇందుండి 150 పద్యములు లుదాహృతము లైనవి.

ఈ గ్రంథమున 'చారుచర్య' అను నొక కృతి నుండి ఒక పద్య ముదాహృత మైనది. ఆ ఒక్క పద్యము వలన, తరువాత నా గ్రంథము పూర్తిగా దొరకి ప్రచారములోనికి వచ్చుట కవకాశ మేర్పడినది. అది దేహారోగ్యమును గూర్చి తెలుపు వైద్య గ్రంథము, మంత్రి అప్పన రచితము. ఇట్లేనాడు మన

1. ఇది 'శ్రీనాథ ప్రయోగము—"పంచకరపాట్లు బడి తన్ను బెంచి విసిగి ఆపదల బాసి రక్షించినట్టి తల్లి'—
కాశీఖండము 4 ఆ.

2.3 ఈ తరువాత కవులు రచించిన యీ పేళ్లు గల గ్రంథములలో పద్యములు పై గ్రంథములలో లేకపోవుటచేత నవి మఱి యొకకవి రచితములని నిర్ణయము చేయబడినవి.

కలభ్యములైనవే గాక, లభ్యములగుచున్న భారతాది గ్రంథముల నుండి, నన్నెచోడుని కుమారసంభవము, కేయూరబాహు చరిత్రము మున్నగువాని నుండి పద్యము లుదాహరింపబడినవి. వీనివలన ప్రస్తుతము ముద్రణములో నున్న పాఠములను ఆ కాలమున నా గ్రంథమందలి పాఠములను పరిశీలించుటకు అవకాశము కలుగును. కాబట్టి పాఠభేద నిర్ణయమున కివి ఎంతో తోడ్పడును. ఇదెన్నో తెలిసికొనదగిన విషయము లున్నవి. పద్యము లెట్లు చదువుట, బేరీజు లెట్లు వేయుట— ఆహోరపరీక్ష మొదలగునవి కలవు. ఈ గ్రంథము ముద్రిత మైనను[4] ప్రతులు లభించుటలేదు. దీని పరిష్కర్తలు సంపాదకులు బ్రహ్మశ్రీ పూజనీయులు—శ్రీ మానవల్లి రామకృష్ణకవి మహోదయులు.

## ప్రబంధ రత్నావళి:

ఇది రెండు సంకలన గ్రంథముల సంపుటి.

1. పెదపాటి జగన్నాథకవి (జగ్గన) ప్రబంధ రత్నాకరము.

2. ఉదాహరణ పద్యములు (అకర్తృకము).

ఈ రెండింటియందు క్రీ. శ. 1550 వఱకు గల కవుల రచనల నుండి పద్యములు గ్రహింపబడినవి. ప్రబంధ రత్నాకర మైదాశ్వాసముల గ్రంథము. తంజావూరి పుస్తక శాలలో మాత్రమే దీని ప్రతి యున్నది. ఉదాహరణ పద్యములు. ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున అనుపూర్వికముగా వ్రాయబడిన యొక తాళపత్ర గ్రంథము పై రెండింటిని పరిశీలించి క్రొత్తగా తెలియదగిన వానిని సంధానించి పండిత ప్రభాకరులు కీర్తిశేషులు వేటూరివారు దీనిని ప్రబంధ రత్నావళి యను పేర క్రీ. శ. 1918 లో ప్రకటించిరి. నాటికి నేటి కదియే ముద్రణము.

ఈ సంకలనము నుండి మనకు వాఙ్మయ చరిత్రకు తోడ్పడునవి లలభ్యములైన ఎన్ని గ్రంథములు గలవో చూడుడు.

1. తెలుగున జైనమత సంబంధములగు.
   1. జినేంద్ర పురాణము.
   2. ఆదిపురాణము.
2. నన్నెచోడకవి—కళా విలాసము.
3. రంగనాథుని—పద్య రచనలు.
4. తిక్కన విజయసేనము.
5. అథర్వణాచార్య భారత పద్యములు.
6. చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము.
7. దగ్గుపల్లి దుగ్గన శివకాంచీ మహాత్మ్యము.
8. పిల్లలమర్రి పినవీరన పురుషార్థ సుధానిధి.
9. బైచరాజు ముమ్మయవిష్ణు కథా నిదానము.
10. భావన పెమ్మన అనిరుద్ధ చరిత్ర.
11. తెనాలి రామలింగకవి.
    1. కందర్పకేతు విలాసము.
    2. హరి లీలావిలాసము.

12. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంత కోదాహరణము నుండి యుదాహరింపబడిన యొక పద్య మాధారముగా, ఆ గ్రంథమును పూర్తిగా సంపాదించి, ఉదాహరణ శాఖా చరిత్రమును నేను వ్రాసితిని.

13. శ్రీ తిరుపతి దేవస్థానము వారికి లభింపని తాళ్లపాక అన్నమాచార్యులవారి "వేంకటేశ్వర శతకము" నుండి యొక పద్య మిం దుదాహరింపబడిన్నది. దాని నాధారముగా ఆ శతకము నంతయు సంపాదించి ప్రకటించితిని.

14. ఇందున్న ఒక సీసపద్య మాధారముగా, ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు హరిభట్టు, ఉత్తర నారసింహ పురాణమును గుర్తించి ప్రకటించి యున్నారు.

ఇట్టి విలువగల గ్రంథము తిరిగి సంస్కరణతో ముద్రణ నందవలసి యున్నది.

## ప్రబంధమణి భూషణము :

ఈ సంకలన గ్రంథమున క్రీ. శ. 1750 వరకు నున్న కవుల గ్రంథముల నుండి పద్యములు పేర్కొనబడి యున్నవి. దీని కర్తపే రెలుగరాదు. ఇందు ప్రసిద్ధముగా నున్న మను చరిత్ర విజయ విలాసము, వాల్మీకి చరిత్ర మున్నగు ప్రబంధముల నుండియే గాక, అముద్రితములుగు నీ క్రిందివాని నుండి పద్యము లుదాహరింపబడి యున్నవి.

1. నారసింహ పురాణ—1. ఉషయునోదయము.
   ,, 2. వనమాలి విలాసము.
2. లింగర ప్రసంహకవి—రాజరాజ్యాభిషేకము.
3. కుమ్మారి భట్టురాజు—గౌరీకల్యాణము.

ఈ గ్రంథము శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి పీఠికతో క్రీ. శ. 1910 లో ప్రకటిత మైనది. నేటికిని పునర్ముద్రణము లేదు. ఈ పీఠికయందలి విషయము లింకను తెలియదగినవి చాల గలవు.

## శ్రీ కృష్ణ లీలావిలాసము :

ఇది పూచపాటి కుమారాచ్యుత రామరాజుచేత సంధానితము. ఇందు కూచిమంచి తిమ్మకవి రచనల నుండి యుదాహరణములు గైకొనబడుటచేత నిది క్రీ. శ. 1800 ప్రాంతమున రచితము. ఇది అముద్రితము. కొన్ని క్రొత్త ప్రబంధము లిందుండి తెలియనగును.

## శృంగార పద్యావళి (1903.)

ఇది శ్రీ వేంకటగిరి పాలకులైన శ్రీ కృష్ణయాచేంద్రుల యానతి ననుసరించి వోదీ జగన్నాథశాస్త్రి లను నాతనిచే

4. క్రీ. శ. 1923లో ఆంధ్ర గ్రంథమాలాధిపతులు కైలాసవాసి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు దీనిని ముద్రించిరి. దీని కింకను ద్వితీయ ముద్రణ భాగ్యము లభింపలేదు. ఇది తెలుగు సంకలన గ్రంథములలో ప్రథమమైనది. ప్రశస్తమైనది.

సంకలనము గావించబడినది. ఇందు ప్రబంధముల నుండి కేవలము శృంగార పద్యములు మాత్రమే చేకొనబడినవి.. ముద్రితము.

### ఋతుచక్రము (1915.)

ఇది మహా ప్రసిద్ధులగు సమర్ధిరంగయ్యసెట్టి గారుసమ కూర్చిరి. ఋతువర్ణన ప్రబంధములనుండి కలదు. ఆయన కుమారులు రామానుజముసెట్టిగా రచ్చు వేయించిరి.

### భారతసార రత్నావళి :

ఇందు కవిత్రయ భారతము నుండి, రాజకీయ, సాంఘి కాధ్యాత్మికాది సకల వ్యవస్థలకు సంబంధిం చిన పద్యము లాయా శీర్షికలలో వర్గీకరింపబడినవి. ప్రతి పద్యమునకు ఆకరము లీయబడినవి. ఈనాడు భారత మును గూర్చి వెలువడి, వెలువడుచున్న వందలకొలది పుటల నిస్సారములగు గ్రంథములకన్న నీ భారతసార ముక్తావళి యన్ని తెలుగుల సారభూతమైనది. కవిత్రయ భారతమునం దభి రుచి కలిగించుటకు ప్రథమ సోపానము. దీనిని సమకూర్చిన వారు సుప్రసిద్ధులగు కట్టమంచి రామలింగారెడ్డిగారి జనకులు సుబ్రహ్మణ్య రెడ్డిగారు. ఈ గ్రంథము రెండు ముద్రణము లందినను ప్రతులు దొరకుట దుర్లభము—అవశ్యకముగా తిరిగి ముద్రింప దగినది.

### భాగవతసార రత్నావళి :

ఇదియును పై భారత సారముక్తావళి పథకమున భాగవతమునుండి ఆయా పద్యములు వర్గీకరింపబడి, సంకలనము చేయబడినది. భాగవతము కేవల మాధ్యా త్మిక విషయికమే కావున నిందు వర్గీకరణముతోపాటు గ్రంథము—1. జగదుత్పత్తి ప్రకరణము. 2. సగుణ ప్రకర ణము. 3. నిర్గుణ ప్రకరణము, 4. స్తుతి ప్రకరణము అను నాలుగు ఖండములుగా విభాజ్యమైనది. దీని సంకలన కర్తలు —పై సుబ్రహ్మణ్య రెడ్డిగారే—ఇదియు రెండు మారులు ముద్రితమైనది. ప్రతులు దొరకవు.

### ఆంధ్ర కవితా రత్నాకరము :

భట్టిప్రోలు రామచంద్రయ్య అను నాతడు క్రీ. శ. 1900 లో వెలువరించెను. ఇందు సూక్తులు, లోకోక్తులు, ప్రాచీన ప్రబంధములనుండి ఆకరములతో నీయబడినవి.

### వర్ణన రత్నాకరము :

ఆద్యతన కాలమున వెలువడిన సంకలన గ్రంథములకు శిరోభూషణము. ఇందు మూడు వందల ప్రబంధముల నుండి వర్ణన లన్నియు వర్గీకరింపబడి, నాలుగు భాగములలో నున్నది. ఈ సంధానమసాధారణమని విద్వాంసు లేకగ్రీవముగా కొనియాడిరి. ఆంధ్ర భోజుడు శ్రీ పీఠికాపురా ధీశ్వరుని కంకితము. విద్వత్కవీంద్రులైన శ్రీ దాసరి లక్ష్మణ స్వామిగారిచే సంకలితము. ఈ గ్రంథము ప్రాచీన వాఙ్మయ పరిశోధన జరుగుచున్న యీ కాలమున సత్వరము ముద్రింప దగినది.

## లక్షణ గ్రంథములు

తెలుగు భాషలో ఆకర గ్రంథాలలో ఇవి చాల విలువ గలవి. వీనివలన కలిగెడి ప్రయోజనములు విశేషముగా నున్నవి.

1. లక్షణ గ్రంథకర్తలు, పూర్వ కవి ప్రయోగము లను పరిశీలించి ఛందో లక్షణములను యతి ప్రాసాదివిశేష ప్రయోగములను దెలుపుటచే, యతిప్రాస పరిణామము కాల క్రమమున—యతుల సంఖ్య ఎట్లు పెరిగినది, అని తెలుసు కొనుటకు వీలగును.

2. లక్షణ గ్రంథములు కావ్య భాషనే ప్రమాణ ముగా తీసుకొని భాషా లక్షణములను నిరూపించుటచేత— భాషా తత్త్వశాస్త్ర పరిజ్ఞానమున కివి యత్యంత సహాయ కారులు.

3. వాఙ్మయ విషయమున నీ లక్షణ గ్రంథకర్తలు, నన్నయాది పూర్వ కవికృత గ్రంథములనే కాక తమ సమీప కాలికులగు కవుల గ్రంథములనుండి పద్యము లుదాహరించుట చేత—ఈనాడు మనకు లభ్యముగాని గ్రంథముల నెఱుంగుటకు తోడ్పడుచున్నవి.

4. కొందరు లక్షణ గ్రంథకర్తలు బహుళముగా నొక కవికృత గ్రంథముల నుండి పద్యముల నొసగిన, వాని మూల మున ముద్రిత గ్రంథములలోని పాఠ భేదములను సరిచూచు కొనుట కుపయుక్తము.

కడచిన నెల భారతిలో కూచిమంచి తిమ్మకవి సర్వ లక్షణ సార సంగ్రహమున శృంగారనైషధమునందలి పాఠము లకు నేడు ముద్రితమైన ప్రతి యందు గల పాఠములకు గల భేదమును వివరించితిని. ఆ గ్రంథమునకే తక్కిన యొకటి రెండు లక్షణ గ్రంథములలోనుండి ముందు చూపుదును.

5. కవికాల నిర్ణయమునకు నీ లక్షణ గ్రంథము లొక విధముగా నాధారములని చెప్పవచ్చును. ఉదాహరణమునకు:

వెల్లంకి తాతంభట్టు—క్రీ. శ. 1480—ప్రాంతముల కవులనే తప్ప తక్కినవారి నుదాహరింపకపోవుటచేత— ఆతని కాలము క్రీ. శ. 1500 ప్రాంత మనియు, నా తడుదాహ రించిన కవుల శతాబ్దికి ముందువారనియు మనకు చెప్పుటక సాధ్యమగుచున్నది. లక్షణ గ్రంథకర్తలలో తాతంభట్టునకు పూర్వ లాక్షికులు, పూర్వ కవుల గ్రంథముల నుండి యుదా హరణము లీయలేదు గాన నీ పద్ధతి కాతడే యాద్యుడు—

ఆతని లింగమకుంట తిమ్మన (1550) సులక్షణ సారమున, అప్పకవి అప్పకవీయమున (1656), గణవరపు

వేంకటకవి (1670)—ఆంధ్ర ప్రయోగ రత్నాకరమున— వార్తాకవి రాఘవయ్య (1650)— లక్షణ దీపికయందు, పొత్తపి వేంకటరమణ కవి లక్షణ శిరోమణియందు (17 వ శ) కస్తూరి రంగకవి ఆనంద రంగరాట్ ఛందమున (1740)— కూచిమంచి తిమ్మకవి (1740) సర్వలక్షణ సార సంగ్రహమున— అడిదము సూరకవి (1760) కవిసంశయ విచ్ఛేదమున—నుదాహరించిన గ్రంథము లాయా కవుల కాలములు నిశ్చితము లగుటచే నందు దాహరింపబడిన కవుల కాలములు కూడ నితర సాధనములచేత నిశ్చయించుటకు వీలు కలుగుచున్నది.

లక్షణ గ్రంథోదాహృతుల వలననే మనకు తెలిసిన గ్రంథములు నష్టమైన వానిని చూడుడు.

అథర్వణాచార్యకృత భారతము:

2. ఎర్రాప్రెగడ రామాయణము.
3. కవుల షష్ఠము—అనగా భాగవత షష్ఠ స్కంధము.
4. అల్లసాని పెద్దన హరికథాసారము.
5. ,, సత్యావధూ పరిణయము.
6. నందితిమ్మన వాణీ విలాసము.
7. ,, శ్రీస్వరీ దండకము.
8. పింగళి సూరన గిరిజా కల్యాణము.
9. చదలువాడ మల్లన ద్విపద రుక్మాంగద చరిత్ర.
10. చరిగొండ ధర్మన శశిబిందు చరిత్ర.

ఇంకను కర్తృత్వము తెలియరాని—శారదా దర్పణము దేవీ విజయము, చారుదేష్ణ చరిత్రము—చమత్కార రామాయణము, మధుసేనము— మున్నగు పద్యకృతు లెన్నియో మనకు లక్షణ గ్రంథముల నుండి తెలియనగుచున్నవి.

6. సమగ్ర వాఙ్మయ చరిత్ర కేమి, సమగ్ర వాఙ్మయ సూచికా సంకలనమున కేమి, లక్షణ గ్రంథోదాహృతులు, పరమ ప్రమాణములు—కాని యీ లక్షణ గ్రంథములలో చాలవఱకు అముద్రితములు. ముద్రితములై యున్న వానిలో నే రెండో మూడో తప్ప తక్కినవి సుపరిష్కృత ములు కావు. ఈనాడు ముందుగా నీ లక్షణ గ్రంథముల ముద్రణము పరిశోధన ముఖ్యముగా నావశ్యకమై యున్నది.

7. ప్రస్తుతము ముద్రింపబడిన ప్రాచీన గ్రంథ ములు వ్రాత ప్రతులతో సరిచూచుకొనుటకు నీ లక్షణ గ్రంథము లుపయుక్తములు. వీనికి ఒక ప్రసిద్ధ గ్రంథము నుండి ప్రాచీన కృతి నవీన కాలమున వెలువడిన దాని నుండి రెండుదాహరణములు చూపుచున్నాను.

1. నాచనసోముని యుత్తర హరివంశమునుండి "ఆపాద శిరోమస్తక" అను కంద పద్యమును తాతంభట్టుదాహరించి యున్నాడు. అప్పకవి అప్పకవీయమున "నాతో మాఱ్కొన లేరు నిర్జరపురీనాకేశ ...." అను శార్దూల వృత్త పద్యమును నేటి ముద్రితోత్తర హరివంశమున కానరావు.

2. ప్రాచీన కృతియగు పండితారాధ్యుల శివతత్త్వ సారము నలుబదేండ్ల క్రిందట ముద్రితమైనది. అంతకు ముందిది వ్యాప్తిలో లేదు. ముద్రిత గ్రంథ మసమగ్రము. 489 కంద పద్యము లున్నవి. కాని గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరమున, కస్తూరి రంగకవి ఆనంద రంగరాట్ ఛందస్సునను దూరాహ్వానప్లుత యతికి లక్ష్యముగా నున్న యీ క్రింది పద్యము ముద్రిత ప్రతిలో గానరాదు.

క. ఆ యలి త్రిపురాంతక దే
వాయని పిలుచుటయుఁ గటకమంతయు వినఁగా
బాయక కిన్నెరబ్రహ్మయ
కోయని యెలుగిచ్చె తొల్లి యురగాభరణా !

అముద్రితములైన బాల బోధ ఛందస్సు, భూపాలీయము సుకవి కర్ణామృతము మొదలగువానిని సమ్యక్పరిశీలనము గావించిన నింకను నెన్నియో విశేషములు—ముద్రిత గ్రంథము లలో కానరానివి బయలుపడును. తంజావూరి పుస్తకశాలలో ఎనిమిది తాళపత్ర గ్రంథముల కట్ట లున్నవి—అవి యన్నియు లక్షణ గ్రంథములే. కొన్ని సమగ్రములు, కొన్ని అసమగ్ర ములు, కొన్ని సంకీర్ణములు—అయినను నవి మిక్కిలి విలువ గలవి. అవి అచ్చుమాట యటుంచి కాగితముపై గూడ నెక్క లేదు. క్షేమేంద్రుని నిశిత పక్షి సంవాదము నుదాహరించిన తిక్కన సోమయాజి కవి వాగ్బంధము తాళపత్ర దశను దాటి రాలేదనిన, వీని పరిస్థితి యెట్లున్నదీ తెలియగలదు. ఈ విషయ మింతటితో విరమింతును.

## గ్రంథ సూచికలు

ఇవి రెండు వర్గములు—

1. అముద్రిత గ్రంథ సూచికలు.
2. ముద్రిత గ్రంథ సూచికలు.

మొదటి వానిలో తొలిగా పేర్కొనదగినవి మదరాసు ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార సూచికలు—Trenniel Catalogues-Descriptive Catalogues

ఇవి రెండు విధలు—1. త్రైవార్షిక సూచికలు. 2. వివరణాత్మక సూచికలు..

(1) త్రైవార్షిక సూచికలు అనగా మూడేండ్ల కొకసారి ప్రభుత్వమువారు సేకరించినవాని వివరము లిందుండును. గ్రంథ మెచ్చట లభ్యమైనది, దాని స్వరూపము—గ్రంథము నుండి మనకు తెలియదగినవి, ఆద్యంతములు కవికాల నిర్ణయమునకుపకరించు విషయము లుండును.

---

5. ఇందు వ్యాస విస్తర భీతిని కొన్నియే యిచ్చితిని. ఇంకను పెక్కులు. గలవు.

ఇవి 6 సంపుటములు.

| సంపుటము సంఖ్య | సంవత్సరము | సంగ్రహింపబడిన గ్రంథసంఖ్య. |
|---|---|---|
| 1 వ సంపుటము | 1911—1913 | 1—137 |
| 2 ,, | 1914—1916 | 138—292 |
| 3 ,, | 1917—1919 | 293—559 |
| 4 ,, | 1920—1922 | 560—715 |
| 5 ,, | 1923—1928 | 716-812 |
| 6 ,, | 1928—1935 | 813—1069 |

ఇవి ఆరు సంపుటములు— 5, 6 సంపుటములలో త్రైవార్షిక విధానము సడలినది. అనగా—1069 గ్రంథముల సూచిక లిందున్నవి.

(2) వివరణాత్మకములు—Descriptive Catalogues

ఇవి 15 సంపుటములు.

| | | |
|---|---|---|
| 1 వ సంపుటము | | ప్రబంధములు |
| 2 | ,, | శృంగార ప్రబంధములు. |
| 3 | ,, | ,, |
| 4 | ,, | ద్విపద. |
| 5 | ,, | ఛందో వ్యాకరణములు. |
| 6 | ,, | వచన కావ్యములు. |
| 7 | ,, | శతకములు. |
| 8 | ,, | యక్షగానము—దండకము. |
| 9 | ,, | వేదాంతము. |
| 10 | ,, | గణితము —జ్యోతిషము. |
| 11 | ,, | వైద్యము |
| 12 | ,, | సంగీము. |
| 13 | ,, | చరిత్ర. |
| 14 | ,, | మెకంజీ కైఫీయతుల సూచిక. 1—150. |
| 15 | ,, | 150—250. |

మొత్తము 21 సంపుటములు.

త్రైవార్షిక సూచికల కంటె వివరణాత్మకములలో హెచ్చు వివరము లుండును. ఇవి సాహిత్య శాఖల ననుసరించి సాహిత్యప్రక్రియల ననుసరించి సంకలనము చేయబడినవి. వివరణాత్మకములలో తాళపత్ర గ్రంథ లేఖన కాలము కూడ, లభ్యమైన వానికి తీయబడుటచేత, కవి చరిత్రకారులకు పరిశోధకులకు నివి ఎంతయో సహాయకారులు—ఈ రెండింటియందును ఆంగ్లభాషలో గూడ సంగ్రహముగా వివరణము లుండుటవలన నాంధ్రేతరులకు నివి యుపయోగించుట కనుకూలపడును. ఈ 21 సంపుటములలో 19 సంపుటముల తెలుగు వివరణములు వ్రాసినారు కీ. శే. ప్రభాకరశాస్త్రులవారే యైనను నివి ప్రభుత్వ పక్షమున సాధికారముగ ప్రకటితము లగుటచేత వారి పే రిందు కన్పట్టదు. ఇవి యన్నియు ప్రామాణికములుగా గ్రహింపదగినవి. కాని, యీ 21 సంపుటములలోని విషయము లచ్చులో నున్నను యీనాటికిని కొన్ని విషయము లాంధ్ర సాహిత్య చరిత్ర కెక్కలేదు.

తంజావూరి సరస్వతీ మహలు లైబ్రరీవారి తెలుగు గ్రంథ సూచికలు ఇవి రెండు సంపుటములు.

1. 1—818 వఱకు గల గ్రంథముల వివరణ మున్నది. ఇదియే నేడు మనకు సుదూరమున నున్న తంజావూరిలోని అపూర్వ గ్రంథములను తెలుపు కేటలాగు. దీనిని ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు ప్రకటించిరి.

2. 818—1043 వఱకును గల గ్రంథములు. ఇందు తెలుగు కావ్యములు లేవు గాని, సంగీత నాట్య శాస్త్రములకు సంబంధించిన పెక్కు గ్రంథములు—భరతశాస్త్రము తెలుగు టీక— అభినయదర్పణము తెలుగు టీక మున్నగునవి యెన్నియో గలవు. శహజీ కృతమగు రాగవిబోధ మున్నగు నపూర్వ కృతులు, పదములు గలవు. సోమనాథ్యుడు మున్నగు సంగీత విద్వాంసు లిందు తెలియవత్తురు. సంపాదకులు శ్రీ విశ్వదేవుని సుందర శర్మగారు—ఇది ప్రస్తుత వ్యాసకర్త విపులాంగ్లేయ పీఠికతో వెలువడినది—

## పరిషత్పుస్తక భాండాగార సూచికలు :

ఆంధ్రసాహిత్య పరిషత్తున గల అపూర్వ తాళపత్ర గ్రంథ సూచికలు మూడు భాగము లిప్పటికి వెలువడినవి. ఇందులో ప్రథమ భాగము పరిషత్పత్రిక 3 వ సంపుటము నుండి ప్రారంభమైనను అది వేరుగా గ్రంథరూపమున వెలువడలేదు. ద్వితీయ తృతీయ భాగములు ప్రత్యేక గ్రంథములుగా వెలువడినవి. తృతీయ భాగమున వ్యాకరణ ఛందోలంకార గ్రంథ వివరణము లున్నవి. మొదటి రెండు భాగములకును కీ. శే. కొత్తపల్లి సూర్యారావుగారును, మూడవ భాగము శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారును కర్తలు.

మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార సూచికల రీతిని, ఆంధ్ర సాహిత్య పరిషత్పుస్తక భాండాగారమునకు సూచికలు వెలువడినచో, మన వాఙ్మయ చరిత్రకనేక నూతనాంశములు సమకూడుటయే గాక, కవికాల నిర్ణయాదులకు, పాఠభేద పరిష్కరణమునకు నవి యత్యంతము సహాయకారులు కాగలవు.

## ముద్రితగ్రంథ సూచికలు :

తెలుగులో ముద్రణ ప్రారంభము క్రీ. శ. 1747 నైనను, క్రీ. శ. 1868 వ కు ననగా ముద్రణ శాసన్మ

లములలోకి వచ్చు వఱకు ముద్రింపబడిన గ్రంథముల పట్టికి గాని, వివరణముగాని లేదు. 6ప్రభుత్వమువారే తెలుగు ముద్రణ గ్రంథ వివరములను—1868—1888 వఱకు నొక సంపుట ముగా చాలకాలము క్రిందటనే ప్రచురించిరి రెండేండ్ల క్రిందట—1888—1900 వఱకు ముద్రించిన గ్రంథ ముల సంపుటము ప్రకటించిరి. అవి ఆంగ్లభాషలో నున్నవి. కాని వీని యన్నింటికిని మకుటాయమాన మైనది. ఆంధ్ర గ్రంథమాలాధిపతులు ప్రకటించిన—

## ఆంధ్ర వాఙ్మయ సూచిక :

ఇది క్రీ. శ. 1927 లో ప్రకటితమైనను ఈనాడు తెలుగువా రందఱకు గ్రంథ ముద్రణ వివరణము తెలుసు కొనుటకు పరమాధారమై యున్నది. గ్రంథము పేరు, కవి పేరు పద్యమా—గద్యమా—ముద్రిత సంవత్సరము నిట్టి వివరములు శీర్షికగా నీయబడినవి. గ్రంథము పూర్తియైన వెనుక కవులు—వారు రచించిన గ్రంథములు వేఱుగా తెలుసుకొను కనుకూలముగ వివరము తీయబడినవి. ముద్రిత గ్రంథములతోబాటు, అనాటి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోను, ఆంధ్ర సాహిత్య పుస్తక భాండారములోను గల యముద్రిత గ్రంథ ముల పట్టికను ప్రకటించిరన్నచో వా రాంధ్ర సాహితీ చరిత్రకు భాషకు నొనర్చిన శాశ్వత మహోపకార మెట్టిదో విజ్ఞుల గ్రహింతురు గాక—

ఈ గ్రంథమును ప్రకటించిన వెనుక తరువాతి సంవత్సరములలో ప్రకటితములైన గ్రంథములను ప్రభుత్వ నివేదికల నుండి భారతి పత్రికయందు, పురాణములు, కావ్యములు ప్రబంధములు, శతకములు, వచనములు తిరిగి వానియందు విభాగము ఈ రీతిగా నాలుగేండ్లు ప్రకటించిరి.

నేడు పూర్వముకన్న గ్రంథ కావ్యములు హెచ్చుగా విశ్వవిద్యాలయములందేమి, ఇతర సంస్థలయందేమి జరుగుచునే యున్నది. ఇప్పటికి 36 ఏండ్లక్రిందట ప్రకటితమైన ఆంధ్ర వాఙ్మయ సూచిక—భారతి పత్రిక అనుబంధములే ఆధారములై యున్నవి.

తెనుగునకు సమగ్ర గ్రంథ సూచి (Comprehensive Bibliography) యింతవఱకు లేదు. సాహిత్య అకాడమీవారు 1900—1950 వఱకును నొక గ్రంథ సూచి కను తయారు చేయించిరి. అది ఎంతవఱకు సమగ్రమో చెప్పజాలము. కాని ముద్రితా ముద్రిత గ్రంథ సమగ్ర సూచిక కింతవఱకు నెట్టి ఏర్పాటులు గాని, ప్రయత్నములు గాని జరిగినట్లు లేదు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవా రట్టి దానిని తయారుచేయుటకు సంకల్పించినట్లు తెలియు చున్నది. కాని అది కార్యరూపమును దాల్చినట్లు లేదు.

ఇట్టి పరిస్థితులలో నీ యాంధ్ర గ్రంథ సూచికా ప్రాముఖ్యమును నించుమించుగా నలువదేండ్ల క్రిందటనే గమనించి "ఆంధ్రవాఙ్మయ సూచికను" ప్రకటించిన ఆంధ్ర గ్రంథమాలాధిపతులకు ఆంధ్రసాహిత్య ప్రపంచమంతయు ఋణపడి యున్నదనుట అతిశయోక్తి కాదు వాస్తవమే.

---

6. నా వచనవాఙ్మయము — భారతియందు ప్రకటిత మైన కొక్కొండవారి జీవితమున నిట్టి పట్టికను తయారు చేయుటకు వలసిన సాధన సామగ్రి సమకూర్చితిమి.

---

దండార్హుల దండింపమి
దండనార్హులగు వారి దండించుట యీ
రెండు నకీర్తి దములు భూ
మండల నాయకుల నిరయ మగ్నులఁ జేయున్.

—సూరన

# మట్టిబొమ్మ

శ్రీ సుగమ్‌బాబు

ఇది మట్టిబొమ్మ
ఆవేశాలకు పట్టుగొమ్మ
మూనాళ్ళ జీవితంలో మంచి చెడుల మేళవించి
పరమార్థ మేదో సాధించగ యత్నించే తోలుబొమ్మ!

పుట్టుట గిట్టుట కొరకే
ఈ కట్టుకథంతా అప్పటివరకే
అనుచు కనులు మూసి నిరసించువాడు నాస్తికుడు!

స్వర్గ నరక ద్వారములవిగో
కర్మానుసారముగా లభ్యమగునహో
అనుచు రాతిబొమ్మ పూజించే మట్టిబొమ్మ ఆస్తికుడు!

లేదు శక్తి
లేదు రక్తి
లేదోయీ... లేదు ముక్తి,
ఎందుకొరకు ప్రాకులాట?
స్వార్థానికే! ఇది విధి ఆట!!
అనుచు వాపోయే వారసుడు తాత్వికుడు!

కలగాదు సుమా జీవితం
దీని సరి పర్యాయపదం రణరంగం,
నేటి కష్టమే రేపటి భవిత
సాగండోయ్ సృష్టించండి చరిత
అనుచు బహుళ ప్రచారం చేయువాడు తాంత్రికుడు...మాంత్రికుడు

విచిత్రమైన స్వభావాలు
దరి తెలియని అగాధాలు
ఎదురుపడినా యత్నించరు తెలిసికోను నిజాలు
అలాగే నడుస్తోంది కాలహేల
యుగాలు దొర్లినా కలియబోవు

# మొల్ల కవయిత్రి కాలము



## శ్రీ తురగా కృష్ణమూర్తి

మొల్ల కవయిత్రి కాలనిర్ణయమును గూర్చి "భారతి" పత్రికా ముఖమున జరుగుచున్న చర్చలలో శ్రీ దేవరపల్లి కృష్ణారెడ్డిగారు పాల్గొని, అక్టోబరు భారతిలో (సంపుటము 40. సంచిక 10) నొక విమర్శనా వ్యాసమును ప్రకటించి, మొల్ల శ్రీ శాస్త్రిగారు నుడివినట్లు యెర్రాప్రెగడ కాలము నాటిది గాని, నే నన్నట్లు శ్రీనాథుని కాలమునాటిది గాని గాక శ్రీ కృష్ణదేవరాయల వెనుక విజయనగర పాలకుడైన యాతని జామాత అళియ రామరాయలు కాలము నాటిదై యుండునని, తత్కవయిత్రి కృత రామాయణ కావ్యములోని యొక పద్యమును బట్టి నిర్ణయింప వచ్చునని అభిప్రాయ మిచ్చియున్నారు.

ఈ పద్యములో మొల్ల "వర్ణ మిళితంబు చిత్తరు పందు, యవనులందు" యను పద ప్రయోగము "అళియ రామరాయలు ఆర్య ధర్మసంరక్షణాభిరతుడై, "యవనుల" లో దప్ప నితర వర్ణములలో వర్ణసంకర మేర్పడకుండ వారించి, హిందూ ధర్మ పునరుద్ధరణము సేయుటను సూచించుచున్న ద" ను నూత్నాంశమును తమ విమర్శనా దృష్టితో కనిపెట్టి, రామరాయలు వర్ణ సాంకర్య మొదవకుండ వారించిన విధ మును తెలుపుచున్నవని "వసు చరిత్ర" లోని కొన్ని పద్యము ముల నుట్టంకించి, మొల్ల రామాయణములోని యీ పద్యము వలన వ్యంజకముగా తన కాల నిర్ణయ మొనరించు మార్గ మును చూపెనని సూచించియున్నారు.

త్రేతాయుగమున రామరాజ్యమందు యవను లుండి, వర్ణ సంకరము జరుగుచుండ శ్రీరాముడు దానిని వారించెనని పద్యములోని మూలార్థము; వ్యంజకముగా నది వేరొక విషయ వివరణము నొసంగుచున్నదని వాక్రుచ్చుట గూడ వస్తు కవిత లోని మర్మముల వెదకి పట్టుకొనుట యగును. మొల్ల శ్రీరామచంద్రుని కాలమున యవను లుండిరని వ్రాయునట్టి వ్రాతను "కాల విషయకమైన విచిత్ర భ్రాంతి భావము" (Anachronism) గా విజ్ఞులు నిర్వచింతురు. కవి కాలమున నున్న విషయములను కథాకాలమున లేకున్నను యున్నటుల వర్ణించుటయే యీ భ్రాంతి భావమునకు మూలము. ఈ భావ వ్యక్తీకరణమే కవికాలమును నిర్ణయించు టకు తోడ్పడు ననుట గూడ కాదనరాని సత్యము. ఈ సత్యము ననుసరించియే శ్రీ రెడ్డిగారు మొల్ల అళియ రామరాయల కాలమునాటిదై యుండవలెనను నిర్ణయము చేయ నుద్య మించినారు. కాని—"యవన" పద ప్రయోగము చేయుటలో మొల్ల కొక ప్రామాణ్య బుద్ధి గాని, విశిష్టాభిప్రాయము గాని లేదనుకొనవలసి యున్నది. ఏలనన—ఆమె సీతా స్వయం వరమునకు వచ్చిన రాజన్యుల గుణగణాదుల వర్ణించు పట్టున,

సీ. ద్రవిడ కర్ణాటాంధ్ర యవన మహారాష్ట్ర
రాజకుమారులు తేజమలరఁ
బాండ్య ఘూర్జరలాట బర్బర మళయాళ
భూప నందనులు విస్ఫూర్తి మెరయ
గౌళ కేరళ సింధు కాశ కోసల సాళ్వ
ధరణీశ పుత్త్రులు సిరి వెలుంగ
మగధ మత్స్య కళింగ మాళవ నేపాళ
నృప తనూభవులు నెన్నికకు నెక్క
గీ. ఘటియు సుత్కళ కోంకణ మద్ర పౌండ్ర
వత్స గాంధార సౌరాష్ట్ర వంగ చోళ
రాజ్యముల నొప్పు చున్నన్న రాజసులులు
వచ్చి రక్కామినీ స్వయంవరమునకును.

అని సీతా స్వయంవరమునకు యవనాగమనమును గూర్చి యుగ్గడించినది. ఈ వర్ణనము వాల్మీకి రామాయణము నందు లేదు. అంతమాత్రమున నద్దాని నిరసింప వలను పడదు. కవి తన స్వకపోల కల్పనంతో కావ్య నిర్మాణ మొన రింప వచ్చును. తక్కుంగల రామాయణములలో స్వతంత్ర పోకడలు, కవి ప్రతిభా వ్యుత్పత్తుల బట్టి రూపొందియుండుట మన కనుభవైక వేద్యమే! అందుచే మొల్ల తన రామాయణ ములో యావద్భారతంలోని యాబదియారు దేశముల రాజ

లను సీతా స్వయంవరమునకు విచ్చేసిరని చెప్పుటలో వింత ఏమియునుండరాదు. కాని—వింతయైన విషయ మేమన— ఆయోనిజాతయగు సీతను, రాజర్షియగు జనకుని కూతురగు సీతను పరిణయ మాడుటకు ''యవనులు'' గూడ వచ్చిరనుట ! సీతాకల్యాణ కాలముననే ''యవనులు'' హిందూదేశమున నుండిరని చెప్పుటకు మొల్ల సాహసించుట !

పూర్వ గ్రంథము లుట్టంకించిన షట్పంచాశద్దేశములలో గాని, కేరళాది బసవరాజకృత ''శివతత్త్వ రత్నాకరము''లో గాని ''యవన'' దేశపు ప్రసక్తి ఎంతమాత్రము గానరాదు. మహా సంకల్పధృత దేశ నామములలోను, పురాలవ ఇండియా గ్రంథకర్త గ్రహించిన దేశ నామములలోను మాత్రము ''యవన'' దేశ నిరూపణము గానవచ్చుచున్నది. అందుచే నీ ''యవన'' దేశ ప్రశంస కొంత అధునాతన మని యనుకొనవలసి వచ్చుచున్నది. ఏది ఎట్లున్నను మొల్ల ''యవన'' పద ప్రయోగమును ''తురుష్కులు'' లేక ''మహమ్మదీయులు'' అను వాచ్యార్థమున వాడి యుండె ననుకొనుటకు వీలులేదు ! అట్టి యర్థముతోడనే మొల్ల యీ పదప్రయోగ మొనరించెనన్న సీతా స్వయంవరములో పాల్గొన తురకలు కూడ విచ్చేసిరని చెప్పవలసి వచ్చును. ఇదెంత అపహాస్య భాజనమగు విషయమో విజ్ఞులకుఁదెలుపఁ బనిలేదు. అందుచే మొల్ల ''యవన'' దేశ ప్రశక్తిని యాదాలాపముగఁ దెచ్చి యుండు ననవలెను. ''యవన'' దేశ ప్రజలలో గల వర్ణ సమ్మేళన గుణముపై శ్లేషార్థమును సాధించు తలంపున ''వర్ణ మిళితంబు చిత్తరువందు, యవనులందు'' నని ప్రయోగించెనే గాని శ్రీ రెడ్డిగా రూహించినట్లు యళియ రామరాయలు తురుష్కుల జయించి, హిందూమతము వర్ణ సంకరము గాకుండ నిల్పి, యవనుల కట్టుబాటులో నుంచెనని రూఢ్యర్థము దీయుటకుఁ గాని, గూఢార్థముగా వాచ్యార్థమును సమన్వయింపఁ జూచుటకుఁ గాని మొల్ల యుద్దేశించి యుండలేదనుట సమంజసము. ఈ విధిని శ్రీ రెడ్డిగారు తత్పద ప్రయోగమునకు విశేషార్థముల కల్పించి, కవయిత్రి కాల నిర్ణయము చేయుట సాహసమే యగుచున్నది !

అంతతో నూరుకొనక శ్రీ రెడ్డిగారు ''వసు చరిత్ర'' లోని,

గీ. యనఘతర పార్థివేంద్రిర సధిగమించి
సాధు కర్ణాట విభవ సంస్థాపనంబు
పూని శరణాగతుల నెల్లఁ బ్రోచె రాముఁ
డతఁడు నిజ చరితంబు రామాయణముగ.

అను పద్యము నాధారముగాఁ గొని అళియ రామరాజు కాలములోనే రామాయణము రచింపబడియె ననియు, నది రామరాజు స్వీయ చరిత్రకు ప్రతిబింబమై నెగడె ననియు, నందుచే మొల్ల అళియ రామరాజు కాలమునాటిదై యుండె ననియు సిద్ధాంతీకరించినారు. ఈ ప్రయత్నములో శ్రీ రెడ్డిగారు పూర్వాపర సందర్భముల సమన్వయించుకొనియే ఇట్టి నిర్ణయము చేయ పూనిరా ? యను సందేహము కలుగుచున్నది. ఏలనన—వసుచరిత్రకారుడు తన కృతిపతియగు తిరుమలేంద్ర మహారాయని, ఆతని వంశ్యుల నభివర్ణింపఁ దొరకొని, ఆదినుండియు రామాయణ పరముగానే వారి చరిత్రల సమన్వయించుచు, తన శేముషీ విభవమును వ్యక్తీకరించుచు వచ్చినాడు కాని ఈ పద్య పాద మొక్కదానిలోనే రామరాయం నిజ చరిత్రము రామాయణ కథా విధానముగా మలచి అభివర్ణించి యుండలేదు. కృతిభర్తను, ఆతని వంశావళిని 'యభి' వర్ణించు ప్రతి పద్యములోను రామరాజభూషణుఁడేదో యొక అలంకారమును సంతరించి విడిచెనే కాని సామాన్యముగ రచించి యుండలేదు. అట్టి అలంకార భూయిష్ఠమును, అర్థ స్ఫూర్తియు గల పద్యములలో నొకదానినే యుట్టంకించి, యిది ప్రత్యేకముగా రామరాయల చరిత్ర నడచుచున్న కాలముననే యది రామాయణముగ రచింపఁబడె ననుటయు పొందిక కుదురని ఊహాపోహలు ! అందునే శ్రీ రెడ్డిగా రుదహరించిన యెత్తుగీతలోని ''పూని శరణాగతుల నెల్లఁ బ్రోచె రాముఁ డతడు నిజ చరితంబు రామాయణముగ'' యను రెండు పాదములును మొల్ల రామాయణము అళియ రామరాయల కాలమున రచింపబడెనని తెలుపుట కుద్యోగింపబడెనని యూహించుటకు మనసొప్పకున్నది. అటులనే మొల్ల యుద్ధకాండాంత్య పద్యముగా చెప్పిన ''మాలిని'' వృత్తములోని చివర పాదము ''కపి జననుత నామా, కావుమా మమ్ము రామా'' యనుటలోఁ గూడ నళియ రామరాయల ప్రశంస యుండెనని యనుకొనుట భ్రాంతి మూలకముగాని యన్యముగాదని చెప్ప సాహసించుచున్నాను.

మొల్ల కవయిత్రి కాలమును నిర్ణయించుటకు సాధనములలో నా తొలి వ్యాసములో నే నుదహరించినట్లు గ్రంథములో గల అంతస్సాక్ష్యము (Internal evidence) ప్రధానము. మొల్ల అగ్గించిన పూర్వ కవుల విధానమును బట్టి ఆమె శ్రీనాథుని సమకాలీనయై యుండవలెనని నేను సూచించితిని. కాని శ్రీ రెడ్డిగారి కది రుచించలేదు. వారు నురొక సీస పాదమును బట్టుకొని, యందలి ''యవన'' పద ప్రయోగమునకేవేవియో వింత యర్థముల స్ఫురింపఁజేసి, మొల్ల అళియ రామరాయల కాలము నాటిదని నిర్ణయింపఁ బూనడినారు. అంతస్సాక్ష్య ప్రమాణముగానే మొల్ల శ్రీ రెడ్డిగారు నిర్ణ

యుంచినట్లు రామరాయల కాలము నాటిది కాదని నిశ్చయింప దగు యాధారము లున్నవి. వాని నీ క్రింద విస్తరించి సత్యము నిరూపింపఁజేయ బ్రయత్నించెదను.

మొల్ల పూర్వ కవిస్తుతి నొనర్చిన పిదప స్వవిషయము దెలుపుకొనుచు,

కం. గురులింగ జంగమార్చన
వరుఁడును, శివభక్తిరతుఁడు, బాంధవహితుఁడున్
గురుఁ డాతుకూరి కేసయ
వరపుత్త్రిని మొల్ల యనగ వఱలిన దానన్.

అని తన తండ్రినిఁ గూర్చి విశదీకరించినది. ఆతు కూరి కేసయ గురులింగ జంగమార్చనపరుడును, శివభక్తి రతుఁడును. సామాన్య శైవ మతావలంబియైనచో శివభక్తి రతుఁ డని వర్ణించిన సరిపోయి యుండెడిది. కాని కేసయ అట్లు గాడు. అతడు గురులింగ జంగమార్చనపరుఁడు. ఈ గురులింగ జంగ మార్చన తత్త్వ నిరూపణము గావించినచో మొల్ల కవయిత్రి కాలము నిర్ణయింప వీలగును.

కళచురి బిజ్జలుని మంత్రియు, దండనాథుఁడునై వన్నెకెక్కి వీరశైవ మతమును స్థాపించి, ప్రచారించిన బసవే శ్వరుఁడు క్రీ. శ. 1160—1185 ప్రాంతము వాడుగా చరిత్రకారులు కొందరు నిర్ణయించినారు. శ్రీ కృష్ణారెడ్డిగారు కూడ నా వాదమునఁ బాల్గొని, వారి నిర్ణయమును యథా శక్తిని, యుక్తిగ ప్రకటించినవారే. బసవని వీరశైవమత తత్త్వ మీ క్రింది విధమున వర్ణింపబడినది.

"వీరశైవమునకు బాహ్యమునందు వలె అంతరంగము నందును లింగధారణము బీజముగా నున్నది. వైదిక మతము నందలి దేవతార్చనము, వేదాంతము నందలి తత్త్వార్థము, జైన మతము నందలి సంఘారాధనము వివిధ మతములందలి కర్మా రాధనము వీరశైవ భక్తియందు సంయోగమును పొందినవి. లింగార్చనము, లింగైక్యము, జంగమ భక్తి, వీరదీక్ష వీర శైవమునందు సంయోగమును బొందినవి. వీరశైవులు జైన మతములను ఖండించి, ఆ మతస్థులను హింసించినను ఆ మత ధర్మములు వీరశైవమునందు ప్రతిష్ఠనుబడసినవి. బౌద్ధ మత మునకు మూలస్కంధములైన "1. బుద్ధం శరణం గచ్ఛ, 2. ధర్మం, శరణం గచ్ఛ, 3. సంఘం శరణం గచ్ఛ" యను మూడు ధర్మములును "గురులింగ జంగమ" శరణు రూపము లను దాల్చినవి. ఏ తద్ధర్మానుష్ఠానము వ్యక్తి కైవల్యమున కును, మానవ కల్యాణమునకును సాధనంబుగ నున్న విధమును నిగమాగ మాచారములు తెల్లము చేయుచున్నవి. వీరశైవులు జాతి, కుల భేదములు లేక జంగమ లింగములకు శరణాగతులగు చుందురు." ఈ విషయ విపులీకరణము దీక్షాబోధ ప్రకరణమున,

"గురులింగ జంగమాకుంఠితభక్తి—యరిది సుజ్ఞానంబు నా ప్రసాదములు
నరిఁ గరణములుఁ బ్రాణంబులు నగుచుఁ—దలపంగ దేహ చైతన్యము లగుచుఁ
గ్రమమున నెలకొన్నఁ గడు సంతసిల్లి—భ్రమలేక పొడమిన ప్రజ్ఞచేనంత
గురుడు లింగంబని గురుతుగా నెఱిగి—యరయ లింగమ గురుం డనియునెఱింగి
గరిమ జంగమము లింగంబుగా నెఱిగి—మరలి లింగము జంగమంబుగా నెఱిగి
చను జంగమము గురుస్వామిగా నెఱిగి—ఘన గురువరుని జంగమముగా నెఱిగి
యొక రొక రొకరందు నుండుట యెఱిగి— యొక రీతి మువ్వురు నొకటిగా నెఱిగి
యిట్టి విజ్ఞాన మహిష్ఠుడై మనసు— ముట్టిమూర్తి త్రయంబును భజింపుచును
బరమ సదానంద భరితాత్ముఁడగుచు—నరుదైన గురు కరు ణాబ్ధిఁ దేలుచును."

యని తెలుపబడుచున్నది. కావున గురులింగ జంగమార్చన విధానము వీరశైవ మతమునకు ప్రాణ సమాన మైనదిగాఁ దెలియనగును. బసవేశ్వరుని వీరశైవము ప్రజాబాహుళ్యమున ప్రచారమొంది, పాదుకొన్నంతకాల మీ గురులింగ జంగమార్చన దీక్ష గైకొననివా డొక్కండును లేడు ! బసవని వీరశైవ మతము క్షీణదశకు వచ్చిన పిదపఁ గాని ఈ అర్చనా విధానమునకు విఘాతము వాటిల్లలేదు. కావున గురులింగ జంగమార్చన దీక్ష వహించినవా డెల్ల బసవని వీరశైవ మత మత్యంత వ్యాప్తిలో నున్న కాలముననే గాని, తద్భిన్నమగు పరిస్థితిలో నవలంభింపబడి యుండలేదని నిబద్ధ యగుచున్నది.

ఇట్లు వీరశైవము ఉచ్చ దశలో నుండి, ప్రజాభి మానమునుఁ జూరగొనుచుండిన కాలముననే మొల్ల తండ్రి కేసయ జీవించి యుండవలెను. క్రీ. శ. 1160—1230 మధ్య కాలమున బసవేశ్వరుని వీరశైవ మత ప్రచారమునకుఁ బూనుకొని, దేశ ఛందమున గ్రంథ రచనల సాగించి, మాన్యు డైన పాల్కురికి సోమనాథుని కాలమున నీ గురులింగ జంగమార్చన విధాన మమలునం దున్నది. ఆ విధానమును సోమనాథుడు,

శ్రీ గురులింగ జంగమ విశిష్ట మహా మహిమంబు వేడెదన్
శ్రీ గురులింగ జంగమము జెప్పెఁ ద్రిమూర్తినిగూఢమై చనున్
శ్రీ గురులింగ జంగమ విశేషము లేకముగాదలంచియా
శ్రీ గురులింగ జంగమ వశీకృతమౌ మదిగొల్చి సమ్మతిన్

అని తన అనుభవసార పద్యమున వర్ణించి యున్నాడు. అందుచే నీ గురులింగ జంగమార్చన విధి క్రీ. శ. 1230 వరకు గూడ నుండియున్నట్లు తెల్లము.

కాకతీయుల యుగాంతము వరకును వీరశైవ మత మతి ప్రాబల్యములో నున్నట్లును, కాకతీయ ప్రభువులును జైన, బౌద్ధముల విసర్జించి, శైవ మతానుయాయులై, శైవ మఠముల స్థాపించుటలును, మతాభివృద్ధికి, పోషణాదిక ములకు గ్రామదానము లొనరించుటలును చరిత్ర ప్రసిద్ధ ములు. కావున క్రీ. శ. 1323 వరకును వీరశైవ మతము తన ప్రతిభను కోలుపోకుండ ప్రజలపై నాధిపత్యమును నెఱపుచున్నటులే దృష్టాంతములు కానుపించుచున్నవి.

క్రీ. శ. 1323 వ సంవత్సరమున కాకతీయ సామ్రాజ్య మును తురుష్కులు జయించి, తత్సామ్రాజ్య వైభవమున్న రూపఱజేసి, మతోన్మాదముతో హిందూమత నాశన మొన రించి దేవాలయములు బడగొట్టి, విగ్రహముల రూపుమాపి, దేవాయతన శిలములపై మసీదుల నిర్మించి, ప్రజల మతాం తరులఁ జేయ పెద్ద పెట్టున యుద్యమించి, విక్రమించుట చరిత్ర దెలిసిన ప్రతి యొక్కరికిని వేద్యమే ! ఆయవ మతో న్మాదుల మునుదు ఆంధ్ర ప్రజ యవలంబించిన వీరశైవము స్వీయ ప్రతిభ నుడిగి, పూర్వపు మతాభి నివేశము (Religious fervour) ను గోలుపోయి సామాన్య శైవ మతముగా నిలిచిపోయినది. కాకతీయుల వెనుక నాయకులై, స్వాతంత్ర్యో ద్యమమును నడిపి, ఆంధ్ర భూమిని యవనదాస్య శృంఖలముల నుండి తప్పించిన రెడ్డి నాయకులీ శైవ మతావలంబులై, తద్వ్యాప్తికి పరిశ్రమించిన విషయము గూడ నంద రెఱింగి నదే అందువలన ఆంధ్రభూమిని రెడ్డి రాజ్యము సుస్థిరమగు నాటికి వీర శైవమత ప్రాబల్యము ముప్పాతిక మువ్వీసము తగ్గి, శైవ మతమే ప్రజలలో వేఱూని, పాలకులకు, పాలితు లకుఁ గూడ అభిమానపాత్రమై విలసిల్లెను. అగుట, గురు లింగ జంగమార్చన దీక్ష వహించువారు రెడ్డి యుగవు నడిమి కాలమునాటికి దాదాపు మృగ్యు లగుటయే సంభవించెను. మొల్ల జనకుడు కేసయ గురులింగ జంగమార్చన రతుడని వర్ణింపఁబడుటచే నాతఁడీ కాలమునాటి వాఁడగుట తప్పనిసరి యగుచున్నది.

అదియునుఁగాక క్రీ. శ. 1400—1500 మధ్య కాలము వాడుగా నెంచబడుచున్న "వేమన" తన పద్యములలో "గురులింగ జంగము" ప్రస్తావన రెండు, మూడు చోట్ల తెచ్చియున్నాడు.

ఆ. వె. కుక్క యే మెరుంగు గురులింగజంగంబుఁ
బిక్క యొడిసిపట్టి పీకుగాని,
సంతపాక తొత్తు సన్యాసి వెరుగునా ?
విశ్వదాభిరామ వినురవేమ !

ఆ. వె. కుక్క తిన్నవాడు గురులింగ జంగంబు
పంది తిన్నవాడు పరమ యోగి
యేన్గు తిన్నవాడు ఎంత మజ్ఞానిరా !
విశ్వదాభిరామ వినురవేమ !

ఆ. వె. కుక్క యే మెరుంగు గురులింగ దేవుని
నక్క యే మెరుంగు నొక్కప్రొద్దు,
మూర్ఖుడే మెరుంగు మోక్షంబు త్రోవను
విశ్వదాభిరామ వినురవేమ !

ఈ పై పద్యములలో "వేమన" చెప్పనెంచిన వేదాంతార్థ ములఁ మాట యెట్లున్నను, అతని కాలమునాటికి గురులింగ జంగమార్చన విధానము ప్రజాభిమానము నంతగా నాచు కొని యుండలేదని తెలియుసగుచున్నది. వేమన క్రీ. శ. 1412 సంవత్సరమున జనించినాడనియు, నప్పటికి శ్రీనాథునకు 40 లేక 50 సంవత్సరముల వయస్సు యుండి యుండుననియు కీ. శే. వంగూరి సుబ్బారావు, కొమర్రాజు లక్ష్మణరావు గారలు నిర్ణయించి యున్నారు. కావున గురులింగ జంగమార్చన రతు డగు కేసయ క్రీ. శ. 1375 కు పూర్వపువాడై యుండి, అతని పుత్రిక మొల్ల, శ్రీనాథుని సమకాలీనయై నెగడుట సంభవమని నిర్ధరించ నగుచున్నది. కాకతీయ సామ్రాజ్య వినా

ఉప కారకులగు యవనుల పౌష్కల్యము నెరింగిన మొల్ల తన కృతిలో వారు మతోన్మాదముతో చేయు వర్ణసాంకర్యమును వర్ణించినది. అందు నిగూఢార్థములనేయు ప్రయత్నింపవలసిన యవసర మంత కానఁబడదు. ఈ వ్యాసములోనే పైన పేర్కొన్న విధముగా "వర్ణ మిళిత" పద ప్రయోగము మొల్ల శ్లేషార్థ స్ఫురణకునై చేసినదే గాని ప్రత్యేక దృష్టితో తన కాల నిర్ణయ విధానమునకు వ్యంజకముగ వాడినది గాదని చెప్ప సాహసించుచున్నాను.

ఇంక నొకమాట. "ఆంధ్రదేశమున వైష్ణవ మతము కృష్ణదేవరాయల తరువాతనే కొంత వేళ్ళూనినది. ప్రాచీన మైన శైవమతమును, రాజాశ్రయ బలము నెదుర్కొని, జన సామాన్యమును వైష్ణవులుగాఁ జేయ ప్రయత్నించినవారు తాతాచార్యుల వంశమువారు. వారి కాలముననే మాలలు మొదలు రాజుల వరకు నీ దేశమున నించుమించుగా సామాన్య జనులు ముక్కాలు మువ్వీసము వైష్ణవు లయిరి." అని శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు వాక్రుచ్చి యున్నారు. అందువలన శ్రీ కృష్ణదేవరాయల కాలమునాటికే వీరశైవము మాటటుండనిచ్చి శైవ మతమునకే ప్రాధాన్యత నశించినది. రాజు వైష్ణవ మతానుయాయి యగుటవలన ప్రజలలో గూడ నా మతమే వ్యాప్తమయ్యెను. కావున శైవ మతమునకే ప్రాధాన్యత తగ్గిపోయెను. అట్లగుడు అప్పటికి వీరశైవము నామమాత్రావశిష్టమై యుండె ననుటలో విప్రతిపత్తి ఏమియు నుండరాదుగదా ! శ్రీ కృష్ణదేవరాయల కాలము నాటికే రూపుమాసిపోయిన వీరశైవము అళియ రామరాయల కాలమున నుండియున్న దనుట సాహసము గాక మరేమి ? వీరశైవమే కలికములోనికిఁగానరాకుండ పోయినప్పుడు తన్మతము నవలంభించి దీక్ష నెరపువా డున్నట్లు చెప్పుట నమ్మదగిన మాటయేనా ? అట్లెన్నటికినిఁ గాజాలదు.

# కుమ్మొనసి - కుంమొనసి

## శ్రీ ఎస్. టి. పి. [illegible]. రామానుజాచార్యులు

ప్రాచీన కవి ప్రయోగములు నేడు సందేహాస్పదములై చిత్ర విచిత్రములగు మార్పుల నొందుచు పండితుల బుద్ధి చాతుర్యమునకు తార్కాణములై యున్నవి. ఏ వాదమునకు గావలసిన యుపపత్తులా వాదమున కుపలభ్యము లగుటతో నే ప్రయోగము కవి హృదయ మయ్యెనో దురూహ్య మగు చున్నది. నన్నయగారి "కమ్మని లతాంతముల కుమ్మొనసి" యనుచోట మత్పన్నమగు వివాద మిట్టిదియే. చింతామణి యందలి "లుగ్వా ద్రుతప్రకృతికాత్", "లలుకిచ సంశ్లిష్ట స్వ్యత్", బిందుం ప్రవదంతి తం క్వచిత్కేచిత్" అను సూత్రములు "కుమ్మొనసి" యను ప్రయోగమును సాధింపజాల నందున చింతామణి భారతములకేక కర్తృకత కుదర కుండుట గమనింపఁదగి యున్నది. "ప్రయోగ శరణం వ్యాకరణమ్"ను న్యాయమును బట్టి చింతామణికర్త నన్నయయే యయిన "భారత" రచనలోని ప్రయోగములు చింతామణి సూత్రములకు లక్ష్యములై యుండవలయును. అట్టి లక్ష్య సమన్వయము కుదురనందున నిట్టి వివాదము లుత్పతిల్లు చున్నవి. "కుంమొనసి" యని యుండవలె ననుటకు నేఁడు చూపఁబడు నుపపత్తులు :—

(1) సంధి జరుగుచోట రెండు రూపము లభేదములుగాఁ బ్రయుక్తములు గావు గాన "కుమ్మొనసి"—"కుంమొనసి" యను రెండు రూపము లుండవు.

(2) ద్రుతమునకు మత్వ మపేక్షితమైన నధర్వణుడు మత్వమునే చెప్పెడివాడు. అట్లు చెప్పక అభేదత్వమును చెప్పుటచే "కుమ్మొనసి" అథర్వణ సమ్మతము గాదు.

(3) బాలసరస్వతి, అహోబలపతి, అప్పకవి, తిమ్మ కవి మున్నగువారు మకార పరకత్వమున ద్రుతమునకుఁ బూర్ణ బిందువు వచ్చునని చెప్పిరి. కస్తూరి రంగకవి, కూచి మంచి తిమ్మకవి, "కుంమొనసి" యనియే ప్రయోగించిరి.

(4) మకారేతర స్థిరవర్ణ పరకత్వమున ద్రుతమునకు బిందువు వచ్చు ప్రయోగము భారతమున లేదు. మకార పరకత్వముననే బిందువు వచ్చుటను సూచించుటకే "బిందుం ప్రవదంతి తం క్వచిత్ కేచిత్" అను సూత్రము రచిత మయినది. వర్గయుక్కులు కాని స్థిరములు పరమైనప్పుడు ద్రుతమునకు బిందువు విధించుట చింతామణి ప్రత్యేక లక్షణము. "కుంమొనసి' తదనుగుణముగ ప్రయోగించుట యేకకర్తృకతకు నిదర్శనము.

(5) "కంమని లతాంతములకుంమొనసి" ఇత్యాదిగా వ్రాయుట సరికాదు. "కమ్మని లతాంతముల కుమ్మొనసి" యని వ్రాయుట సత్యదూరము. "కమ్మని లతాంతముల కుంమొనసి" అన్నదే నన్నయ పాఠము.

ఈ యుపపత్తులు వాదమునకు నిలువని తీరుతెన్నులై పరిశీలింపఁ దగియున్నవి. సంస్కృత భాషానుసరణము నన్నయ గారి భారతమున గలదు. "సమ్మద"—"సంమద" అను రూపము లున్నట్లు "కుంమొనసి"—"కుమ్మొనసి" యను రూపము లుండుటలో నాక్షేపణ యుండదు. అట్లు ద్విరూప ప్రాప్తికవకాశ మున్నను, నన్నయగారు "కుమ్మొనసి" యను

రూపమే యుపయోగించి రసుటకు, నన్నయకుఁ బ్రాచీన మున గల శాసన భాషయే ప్రమాణము. నన్నయగారి పద్య మున గల పదునాలు ప్రాస స్థానములందును విభక్తిగత, పద మధ్యగత, సంధిగత "మ్మ" కారములే కానవచ్చుచున్నవి. సంధి గతముననే వివాదముత్పతిల్లుట గమనీయము. 11వ శతా బ్దము వఱకును గల శాసనములలో బిందు పూర్వక మకార ములు కానరాకుండుట పరిశీలింపవలసి యున్నది.

"అద్దంకి శాసనము :—"దమ్మ పురంబున దమ్మువులు" 770. కా.
"కొమ్మాసాని" 1030. కా.
"ఆతని తమ్ముణ్ణాన్వయ" 1046. కా.
"కమ్మనాండును" 1072. కా.
"కమ్మనాంటిలోని" 1073. కా."
"ఫలమ్ము" 1146. కా.

ఈ వివరము లన్నియు "సంపత్కుమార" గారి వ్యాసము లోనివి. (ఆగస్టు. భారతి 1963).

"తంమ్మన్న" మున్నగు రీతి బిందు పూర్వకముగా వ్రాయు పద్ధతి 1732 ప్రాంతమునందున్నందునను, నన్నయ గారికి పూర్వము గల శాసనములలో నీ పద్ధతి లేనందునను, నన్నయ కభిప్రేతమగు రూపము "కుమ్మెనసి" యనుట నిర్వి వాదము. ఇంక "బిందుంప్రవదంతి తం క్వచిత్కేచిత్" అన్న సూత్రమును బట్టి మవర్ణ పరకత్వముననే బిందువు వచ్చు ననియు, నితర స్థలములందు రాదనియు తెల్పుగల స్వారస్యము కనబడుటలేదు. అందువలననే "చింతామణి" నన్నయ రచి తము కాదన వీలున్నది. "బాలసరస్వతి" మున్నగు కవులు చింతామణి రచనను నన్నయ కంటగట్టుటకే భారత ప్రయో గములను దిద్ద సాహసించిరి. ఆ దిద్దుబాట్లలో "కుమ్మెన"సి ప్రాణసంకటమైనది. దీనిని చింతామణ్యనుగుణముగ "కుంమె నసి" యని దిద్దిరి గాని, "కమ్మని" లోని "మ" కారమును దిద్దలేకపోయిరి. అందువలననే ప్రాస విశేషముగాఁ బేర్కొను టయు జరిగినది. సాధారణముగ "ప్రాస" లో మొదలినుండి తుది దాక యొకేరీతి నుపయోగించుట శ్రవణసుభగము, సౌకు మార్య సిదర్శనము. బిందుపూర్వక మకారమే నన్నయగారి యభిమత మన్నచో "కంమని" తో ప్రారంభమై తుది వఱకు నా నియమమే పాటింపబడి యుండెడిది. పద మధ్య మున బిందుపూర్వక మకారము "క్రమ్మని" మున్నగు పద ముల వంటి వాటిలో నిది లేనందుననే "కే చిద్వదంత్య భేదత్వ మనుస్వార మకారయోః" అనవలసి వచ్చినది. ఈ యభి ప్రాయాన్నే స్థిరీకరించిన వాఙ్మయ మహోధ్యక్షుల వాక్యాలు పరిశీలింపఁ దగియున్నవి.

"అయితే యీ పద్ధతిలో శబ్ద తత్వానికి అను గుణంగా వ్రాసుకోవడంవల్ల పై లయగ్రాహి మొదటి పాదంలో ద్విత్వ మకారానికీ, బిందుపూర్వక మకారానికీ, (మ్మ—ంమ లనే వాటికి) ప్రాస యతి మైత్రినీ, మత్తకోకిలలో ద్విత్వ మకారానికీ, బిందు పూర్వక మకారానికీ ప్రాస మైత్రినీ అంగీకరించాల్సి వచ్చింది. ఈవిధంగా "మ్మ—ంమ' అనే వాటికి ప్రాస చెల్లుతుందని అప్పకవికి పూర్వు లెవ్వరూ చెప్ప లేదు. కాబట్టి "కే చిద్వదంత్య భేదత్వమను స్వార మకారయోః" అనే అధర్వణకృత మనబడే కారిక వల్ల అనుస్వార మకారాలకు అభిన్నత్వ మున్నదని చెప్పుకుని పై రెండు పద్యాల్లోను, ప్రాస యతి మైత్రిని, ప్రాస మైత్రిని సరిపెట్టుకుని తృప్తిపడ్డారు." (ధ్వని—లిపి—పరిణామం. పుట 173) "బిందుం ప్రవదంతి తం క్వచిత్కేచిత్" అను సూత్రముచే మవర్ణ పరకత్వమున ద్రుతమునకు బిందువు వచ్చుటనే తెల్పు నెడల, వర్గ యుక్కులు కావి స్థిరములు పరమై నప్పుడు ద్రుతమునకు బిందువు విధించు చింతామణి ప్రత్యేక లక్షణమునకుఁ గూడ నా యుదాహరణే యుదాహృత మగుట సరియగు పద్ధతి కాదు. అందువలన చింతామణి కర్త, భారత కర్త, ఒక్కరే కాదు, శాసన భాషనుబట్టి, శ్రవణ సుభ గతను బట్టి భారతమున "కమ్మని—లతాంతముల కుమ్మె నసి" యనునదియే నన్నయ ప్రయుక్త మనుట సుసంగ తము. 11 వ శతాబ్దమున గల బిందుపూర్వక మకార పద్ధతి నన్నయ భారతమునకు కట్టబెట్టజూచుట హాస్యాస్పదము.

---

# మూడు చిత్రాలు



"ద్విరేఫ"

ఆధునిక చలనచిత్ర రంగంలో అద్భుత పరివర్తనము తీసుకొనివచ్చిన ప్రక్రియ స్వతస్సిద్ధమైన రంగులతో దృశ్యమును ప్రదర్శించుట. చిత్రలేఖనంలో వలె దీనిలో కూడ రంగులతో రససిద్ధి కలుగజేయుట ఒక కళా విశేషం. చైతన్యముగల ప్రకృతి దృశ్యాలలో కాని, పాత్రల అభినయ కళా కౌశలముచేత కాని రసానుభూతి కలుగజేయడం సహజమే కాని, చైతన్యములేని చిత్రాలతో కదలిక తెచ్చి, ఆ కదలికలతో భావ చైతన్యం కల్పించడం ఒక అపూర్వ ప్రతిభ. భారత దేశంలో వన్నె వన్నెల దృశ్యాలు ఎక్కడ చూచినా ఎదురవుతూ ఇంద్రధనస్సును తలపిస్తూ ఉంటాయి. రంగుల చలనచిత్రం తీసేవారికి యిచ్చటి వర్ణ దృశ్యాలు కన్నులపండువ కలిగిస్తూ ఉంటాయి. నిజమే. కాని, యిట్టి చలనచిత్ర పరిశ్రమ లేనపుడు, నాలుగైదు వందల యేండ్ల క్రితం ఇచ్చటి చిత్రలేఖకులు చక్కని వర్ణచిత్రాలు తమ కుంచెలతో చిత్రించారు. ప్రకృతి సౌందర్యమే కాక సమకాలీన లోకసౌందర్యము కూడ ఆ చిత్రాలలో చిరస్థాయిగ ముద్రించి యుంచారు. అంతే కాదు. ఈ భారతదేశ చరిత్రలో, సంస్కృతి, కళ, విజ్ఞానము, తత్త్వచింతన దేనిలో కలిగించిన దివ్య ప్రభావాలను కూడ ఈ వర్ణ చిత్రాలలో సంగ్రహపరచి నెలకొల్పారు. అలాంటి వర్ణచిత్రాలు, మొగలాయి చిత్రకళలోను, రాజపుత్ర శైలిలోను ప్రసిద్ధి కెక్కాయి. ఈ చిత్రాలలో రాజాంతఃపురములలోని దృశ్యాలే కాక, రాగరాణి భావాల రంగుల కదలికలు, రాధాకృష్ణ ప్రేమలోని రమణీయత ఆనాటి చిత్రకారులు ఎంతో లలితంగా చిత్రించారు. ఈ చిత్రాలను ఆధారంగా గైకొని భారత ప్రభుత్వంవారి చలనచిత్ర శాఖ తయారు చేసిన 'రాధాకృష్ణ' ప్రపంచ ప్రదర్శనములలో పలుతావులలో బహూకృతు లందుకొన్నది. ఈ శైలిలోనే— అమెరికాలో కొందరు ఉత్సాహవంతులు ఒక నూతన వర్ణచిత్రం తయారుచేశారు. ఈ చిత్రంపేరు "ఖడ్గము—మురళి" (The sword and the Flute) ప్రదర్శనకు పట్టే కాలం 24 నిమిషాలు. మొగలు, రాజపుత్ర వర్ణచిత్రావళి సేకరించి వానితో ఒక కథ, ఒక కదలిక వచ్చేటట్లు చిత్రించిన యీ చిన్ని వాస్తవిక వర్ణచిత్రాన్ని చూస్తూ ఉంటే ఒక స్వప్న జగత్తులో విహరించినట్లు ఉంటుంది. ఒక మనోహర ఖండకావ్యం ఇచ్చే రసానుభూతి, ఒక సురుచిర రాగమాలిక కలిగించే శ్రవణ సుఖం యీ చిత్రం కలిగిస్తుంది. నేటి చలనచిత్రంలో ముఖ్యమైన దృశ్య శ్రవ్య కావ్యానుభూతులకు కావలసిన సన్నివేశాలన్నీ సంఘటించుకొని కన్నులకన్న వీనులకు కూడా విందు కలిగించేదిగా ఉన్నది. 'ఖడ్గము' మొగలాయి దర్బారుకి సంకేతమైతే 'మురళి' రాజపుత్ర రస వైభవానికి చిహ్నము. ఈ రెండింటి సమ్మేళనములు మొగలు చక్రవర్తుల రాజ భవనములు, విలాసములు, వినోదములతోపాటు ఆనాటి వైభవము చిత్రితమైనవి. 'సలీమ్' జనన వృత్తాంతము, ఆతడే జహంగీరుగా రూపొందినతీరు, అతని మృగయా వినోదము, యమునానదీ తీర వన ప్రాంతములో అతని వాహ్యాళి యివన్నీ ముచ్చటగా ప్రదర్శిత మైన . షాజహాన్ చక్రవర్తి కాలంలో రాజాజ్ఞ లేనిదే పిట్టలు కూడ ఎగరటానికి భయపడేవట. ఆ రాజ వైభవాన్ని కన్నులకు కట్టినట్లు చూపుటలో వ్యక్తుల జీవితాంతోపాటు సామ్రాజ్యాల సముజ్జ్వల గౌరవము పలు వర్ణములలో ప్రదర్శిత మైనది. దీనికి విరుద్ధముగా తదనంతరము వచ్చిన రాజపుత్ర శైలిలో రాధాకృష్ణ ప్రేమలీలలు, శివపార్వతీ సమైక్య భావము చిత్రించిన బొమ్మలలో ఒక అపురూపమైన అతిలోక సంపద వ్యక్తమయింది. ఎన్ని వన్నె చిన్నెలు, ఎన్ని చిత్ర పరివర్తనలు పొందినప్పటికీ, మానవుడు తన భక్తి సాధనతో పరబ్రహ్మ స్వరూపుడైన అధిదైవతమును పొందే సాధన రాధాకృష్ణులలో, శివ పార్వతులలో, ప్రకృతి పురుషులలో చిత్రితమైంది. వింత వింత రాగ రాగిణుల విశేష వర్ణములతో రాజిల్లుతూ ఉంది. విశ్వమోహన లీలా మానవుడైన వేణులోలుడు శ్రీకృష్ణ పరమాత్మ చేబట్టిన మురళీగానము వర్ణ వర్ణముల తరంగితమై లలిత మంజుల రేఖల పల్లవితమై ఈ చిత్రాలలో స్ఫురిస్తూ ఉన్నది. ఈ చిత్రానికి నేపథ్య సంగీతముగా రవిశంకర్ సితార్, ఉస్తాద్ ఆలీ అక్బర్‌ఖాన్ సరోద్, పార్వతీకర్ రుద్రవీణ, చతుర్‌లాల్ తబ్లా, టి. విశ్వనాథన్ మురళి చాల ఉపకరించాయి. ఆయా దృశ్యాలలో రసవంతమైన మధుర ఘట్టాలకు—ఈ సంగీతము అమర్చినట్లు సరిపోయింది. మొగలు రాజదర్బారులోని దృశ్యాలకు సితార్, సరోద్ వాద్య సంగీతము, వేట అడవులు చూపుటలో 'తబలా' వత్, ప్రేయసీ ప్రియుల విప్రలంభ శృంగారము చూపుటలో—'అపదూరుకు లోనైలినే' అనే జావళి మురళిపైన వినిపించడం ఎంతో చక్కగా ఉన్నది. సంగీతం ఆయా రసవత్ ఘట్టాలకు వ్యంజనాత్మకంగా వినియోగించడం ఈ చిత్రంలో గొప్ప విశేషం.

ఈ ఫిలిం నిర్మాణములో వినియోగించిన మూడు వందల పైచిల్లర చిత్రాలు అమెరికాలోని బోస్టన్, వాషింగ్టన్, మేసచుసెట్సు నగరాలలోని మ్యూజియముల వద్ద నుండే కాక

కొందరు కళాభిమానుల వద్ద నుండి కూడ సేకరించి ఎంతో శ్రమపడి వర్ణచిత్రంగా రూపొందించారు.

దీనికి దర్శకత్వం వహించి నిర్మించినవారు జేమ్స్ ఐవరీ, ఇంగ్లీషులో వ్యాఖ్యానము చెప్పినవారు సయ్యద్ జాఫ్రీ (భారతీయుడే). నిర్మాతలు న్యూయార్కులోని ఫిల్ము 'ఇమేజెస్'. ఈ చిత్రము చిన్నదైనా ఇంత అల్ప పరిధిలో అంతులేని భారతీయ తత్త్వ చింతనలోని అమూల్య భావములను అందముగా చిత్రించి, ఆనందదాయకంగా రూపకల్పన చేశారు. అమెరికా సమాచార శాఖవారు ప్రదర్శిస్తున్న ఈ చిత్రం, కళాభిమాను లందరు తప్పక చూడవలసిన చక్కని చిత్రం.

*　　　*　　　*

రంగుల చిత్రమనగానే కన్నులకు మిఱుమిట్లు గొలిపే దృశ్యాలతో మనసు మోహింపచేసే కథా చిత్రాలు అమెరికా నుండి వస్తూ ఉన్నాయి. ఆ ఒఱవడిలోనే భారతీయుల చిత్రాలు కూడా రంగులలో కంటి మైకం కలిగించే దృశ్యాలు చూపు తున్నాయి. ఉదాహరణగా 'నవ రంగ్', 'స్త్రీ', మొగల్—ఇ—ఆజామ్' వంటి టెక్నికలర్ చిత్రాలు చెప్పుకోవచ్చు. అలాగ రకరకాల కన్నులు మిఱుమిట్లు కొలిపే దృశ్యాలు చూపించి, ఆధునిక సంఘంలో ఎన్నో చిన్నెలు ఉన్నవి ఉన్నట్లు చూపించ ప్రయత్నించిన క్రొత్త చిత్రం, ఉరుదూ భాషలో నిర్మించిన ''మేరే మెహబూబ్''. లక్నో నగరంలోని నవాబుల చిహ్నాలు చూపించే యీ చిత్రంలో రంగులు ఒక వినూతన సృష్టి చేసి, కన్నుల కరువుదీరే దృశ్యాలు మనోహరంగా ప్రదర్శింపబడును. ఈస్ట్మన్ కలర్‌లో తీసిన యీ చిత్రంలో దర్శకుడు, హర్నామ్ రావల్ ప్రత్యేక శ్రద్ధ కనబఱచి రానురాను అంతరించిపోతున్న జమీందారీ ప్రథలోని విలువలు, విలాసాలు చాల బాగా చిత్రించాడు. ఈ చిత్రం జమీందారులలో 'లక్నో' నవాబుల రాజ వైభవాలను ఇతివృత్తంగా తీసుకొని అది యీ కాలపు వాతావరణంలో ఇమిడ్చింది. దీనిలో కథా వస్తువు, ఇద్దరు అమ్మాయిలు ఒక అబ్బాయి ప్రేమయే అయినప్పటికీ ఆ ప్రేమ పొందిన పరిణామము ప్రతి క్షణ కుతూహలంతోను, ఈ ప్రణయ త్రిభుజములో ప్రతి యొక్కరూ చేసిన అద్భుత త్యాగముతోను ఎంతో ఆదర్శ ప్రాయంగా చిత్రితమయింది.

కథానాయకుడు అన్వర్ హుస్సేన్. అన్వర్—అలీఘుర్ విశ్వవిద్యాలయంలో చదువుకొంటూ—కాలేజీ ఉత్సవంలో ఒక 'గజల్' రచించినందుకు బహుమతి పొందుతాడు. ఆ 'గజల్' పాడుతూ ఉంటే, ఆ కళాశాల ఆవరణలో చేరిన వేలకొలది రసికులతోపాటు మేలి ముసుగు వేసుకొన్న ఒక విద్యార్థిని కూడ ఉంటుంది. ఆమె ఎవరో తెలుసుకోకుండానే ఆమెపైన అతని మనస్సు లగ్న మవుతుంది. కళాశాలకు సెలవు లిచ్చారు. అలీఘుర్ నుండి లక్నోకు పోయే రయిలు ప్రయాణంలో ఆ అబ్బాయి, ఆ అమ్మాయి ఒకరికి తెలియకుండా ఒకరు ప్రయాణం చేస్తారు. అమ్మాయి—లక్నో నవాబుల కుటుంబంలో జమీందారు చెల్లెలు. ఆ జమీందారు కూడ ఆ బండిలో ప్రయాణంచేసి అన్వర్‌తో పరిచయమవుతాడు. లక్నోలో వారి పరిచయం గాఢ మవుతుంది. 'అన్వర్' కవితకు ఆశపడి ఆతనిని తన చెల్లెలు 'హుస్నా' వ్రాసిన కవితలు దిద్దిపెట్ట డానికి నవాబ్ నియమిస్తాడు. ఆ ఊరిలోనే ఒక పత్రిక సంపాదకునిగా ఉద్యోగం ఖాళీ ఏర్పడితే అది 'అన్వర్' కి తన పలుకుబడి వినియోగించి ఇప్పిస్తాడు. 'అన్వర్' కి ఆతని అక్క 'నజమా' చదువు చెప్పిస్తూ ఉంటుంది. ఆమె నాట్య కత్తె. రంగస్థలంమీద నాటకాలు ప్రదర్శించి, ధన సంపాదన చేసి, దానితో చదువు చెప్పిస్తుంది. అతడు తండ్రివలె—వైద్య విద్యలో పెద్ద పట్టం పొందడానికి విదేశాలకు పోయి రావాలని ఆమె కోరిక. ఆమె—రంగస్థల నటిగా ఉండటం, దానివలన తన చదువు కొనసాగడం అన్వర్‌కి ఇష్టంలేదు. ఆమెను వెంటనే ఆ నాట్య జీవితం విరమించమంటాడు. ఆమె అలాగే చేస్తుంది. కాని, ఆమెకు నవాబుకు సంబంధం. ఆతనికి ఆమె యెడల ప్రేమచేత వివాహం చేసుకోవాలనే ఉంటుంది కాని, నవాబు తన వంశ మర్యాద కోసం, ప్రతిష్ఠ కోసం అపని చేయలేకపోతాడు. ఆమెకు స్వయానతమ్ముడే 'అన్వర్' అని నవాబుకి తెలియదు. ఆమె కూడ చెప్పదు. చెప్పవలసిన అవసరం కలగదు. 'హుస్నా', 'అన్వర్' చేత తెఱచాటు నుండి తన కవితలు దిద్దించుకునేటప్పుడు, అతడు పాడిన 'గజల్' జ్ఞాపకం చేస్తుంది. ఆతనిమీద అనురాగం పొంది నది తానే అయినా 'నసీమారా' అనే మారుపేరుతో కొంత ప్రేమ అభినయిస్తుంది. ''అన్వర్'' నిజం సంగతి తెలుసు కొని ఆమెపైన అనురక్తు డవుతాడు. వారి ఉభయులకు వివాహం నిశ్చయం అవుతుంది. ఇంతలో 'హుస్నా' ను ప్రేమించిన 'మున్నా రాజా' అనే చిన్న నవాబు ఒకడు ఉన్నాడు. ఆతడు నవాబును 'హుస్నా' ను తన కిమ్మని కోరగా ఆతడు నిరాకరిస్తాడు. హుస్నాకు—అన్వర్‌కు వివాహమైపోతుంది. ఆ రాత్రి పెండ్లి మెరవణిలో నవాబ్—తన ప్రేయసి 'నజమా' యింటికి పోయి చూచేటప్పటికి ఆమె ఒడిలో—'అన్వర్' కనిపిస్తాడు. ముందు అర్థంకాదు. చివరికి ఆమె ఆతని అక్కయని తెలుసుకొని యిట్టి వివాహ సంబంధం వలన తన వంశ ప్రతిష్ఠ మన్నుపాలైనదని వాపోతూఉంటే అతని చెల్లెలు ''హుస్నా'' వంశ ప్రతిష్ఠ కోసం ఏమి చేయ మన్నా చేస్తానంటుంది. భర్తను విడిచిపెట్టివేస్తుంది. నవాబు అప్పులపాలు అవుతాడు. రాజ భవనం—పది లక్షలకు మున్నా రాజా వేలం పాడతాడు. ఈ సమయంలో 'అన్వర్' తన్ను ప్రేమించిన 'నసీమారాను' పెండ్లి చేసుకోవడానికి ఇష్టపడి ఆ పది లక్షలు కట్నం తెచ్చిన నవాబుకి యిస్తాడు.

ఈ సమయంలో—నవాబు, ఆతరిని చెల్లెలు వంశ ప్రతిష్ఠ నాశనం కావడం చూడలేక విషపానం చేయబోతే, పోయిన ప్రతిష్ఠను పవారించి లాభంలేదని నవాబు నచ్చ చెప్పుకొంటాడు. ఆత్మహత్యా ప్రయత్నం విరమిస్తాడు. 'అన్వర్ తెచ్చిన పది లక్షలు తిరిగి ఆ 'నసీమారా' కే పెండ్లి కానుకగా ఇయ్యబోయిన సమయంలో ఆ పెండ్లికుమార్తె అద్భుత త్యాగం చేసి 'అన్వర్' చేత తిరిగి 'హుస్నా' కే నిఖ్ఖా చేయిస్తుంది. ఈ కథ—అలనాటి నవాబు దర్జాతో నున్న

# మూడు చిత్రాలు

పరదా స్త్రీల అంతఃపుర సౌధములలోని రంగురంగుల దృశ్యాలతో ఉన్మీలనం అనుభూతమౌతుంటే ఒక తీయని బాధ అనుభవించినట్లవుతుంది. ప్రేక్షకులకు ఆ చిత్రాలు తన్మయత్వం కలిగిస్తాయి.

చిత్రానికి ప్రాణమిచ్చిన పాటలు—నౌషాద్ సంగీతం, మహమ్మద్ రఫీ, లతామంగేష్కర్ పాడిన 'గజల్స్' చెవులలో నిరంతరానందామృతం చిలుకుతూనే ఉంటాయి. 'మేరే మెహబూబ్' అనే పాట చిత్రీకరించిన రెండు షుట్టాలూ రెండు అపూర్వ దృశ్యాలతో, రంగులరాసులు పోసిన వర్ణ వైచిత్ర్యంలో హోలీ ఆడినట్లున్నవి. ఇంత గొప్ప చిత్రం నిర్మించడంలో 'సెట్టు'ల నిర్మాణంలో చాల శ్రద్ధ చూపి, 'ప్లాట్సు' పద్ధతిగా పైకప్పు లేకుండానే—యిన్ని సుందర దృశ్యాలు, అంతఃపుర సన్నివేశాలు రంగులతో చిత్రించడం ఆర్ట్ డైరెక్టర్ సుధీంద్రరాయ్ అపూర్వ ప్రతిభను చాటుతున్నది. ఈ చిత్రంలో—అస్లర్ భూమిక నిర్వహించిన రాజేంద్రకుమార్, నవాబుగా నటించిన అశోక్‌కుమార్, నర్తకి నజమాగా అభినయించిన 'నిమ్మి', కథానాయిక 'హస్నా', గా నిలిచిన అపూర్వ సౌందర్యవతి 'సాధన' చిత్రానికి ఎంతో వన్నె చేకూర్చారు.

* * *

వన్నెలు చిన్నెలు, వస్తు వైభవము, వర్ణ నాడంబరాలు లేకుండ సినిమా తీయవచ్చునని నిరూపిస్తున్న దర్శకుడు—సత్యజిత్‌రాయ్. ఆతడు ఏ చిత్రం తీసినా అందులోని వాస్తవిక చిత్రణంతోపాటు ఒక నూతనత్వం గోచరిస్తూ ఉంటుంది. ఆతడు నిర్మించిన క్రొత్త చిత్రం 'మహానగర్' లో కూడా ఈ నూతనత్వమే చూస్తున్న ప్రతి 'ఫ్రేమ్'లోను పలుకరిస్తున్నట్లు ఉన్నది. విజయదశమికి విడుదలయిన యీ క్రొత్త చిత్రంద్వారా సత్యజిత్‌రాయ్‌లో మరొక నూతన వ్యక్తిత్వం దర్శన మిచ్చిందనవచ్చు. ఇదివరకు ఆతడు చేసిన చిత్రాలలో సన్నివేశానికి, సమాజ జీవనంలోని స్తబ్ద సత్యానికీ ప్రాధాన్యం ఇచ్చాడు. ఈ 'మహానగర్' లో ఆతడు చేసిన ప్రయోగం జీవిత చిత్రణం కాదు. పాత్రల భావ చిత్రణం. దీనిలో కథ చాల చిన్నదే. అందులో విశేషం ఏమీ లేదు. కలకత్తాలో జీవిస్తున్న చిన్న కుటుంబంలో కష్ట సుఖాలు ఆ మహానగర వాతావరణంలో కన్నులకు కట్టినట్లు చిత్రించడమే ఈ సినిమాలో చేసిన ప్రయత్నం. కథ వ్రాసిన నరేంద్రనాథ్ మిత్ర—మధ్య తరగతి నిమ్న వర్గంలోని చిన్న రాబడిలో జీవించే సంసారాలలో ఉండే దైనందిన కష్టాలను వర్ణించారు. చిత్రనిర్మాణంలో సత్యజిత్‌రాయ్ కథలోని సంఘటనల కంటె పాత్ర చిత్రణకు ప్రాధాన్యమిచ్చి, ఈ మధ్య తరగతి కుటుంబ జీవనంలోని బాధలు జాలిగా చిత్రీకరించారు. ఈ ప్రయత్నంలో ఒక సిస్య్త, ఒక నిగ్రహము, ఒక నిండు తనము గోచరిస్తుంది.

ఈ చిత్రములో నాయిక ''ఆరతి''—కుటుంబ పోషణ నిమిత్తం ఉద్యోగం చేయుటకు నిశ్చయించినది. తనకిదే అని భర్త 'సుబ్రత్' ఆఫీసులో దిగబెట్టి వెళ్తాడు. అయితే ఆమె, ఆ యాఫీసులోనే పనిచేసే ఆంగ్లో యిండియన్ అమ్మాయి—ఎవరు నీ 'బాయ్ ఫ్రెండా' అని అడుగుతుంది. 'ఆరతి' నవ్వి—తన పాపిట ధరించిన 'సిందూర్' చూపిస్తుంది. ఇంకేం మాటలాడదు. అదే చాలు ఆమె పతివ్రత్యాన్ని, ఆమె సంసార జీవనాన్ని పరిచయం చేయడానికి. అలాగే ఆమె మామ గారు ఒక పురాతన కాలపు బడిపంతులు. ఈ నాటి యుగంలో కూడ ఇంగ్లీషు పద్యములలో ఇంగ్లీషు మాటలాడుతూ తన పూర్వ సంపద గూర్చి చెప్పుకొంటూ ఉంటాడు. తన దగ్గర చదువుకొన్న విద్యార్థులు—ఒకప్పుడు ద్రోణాచార్యునకిచ్చినట్లు గురుదక్షిణ యివ్వాలని కోరుతాడు. కాలంతో మారక తప్పదయ్యా అంటే ఐయామ్ టూ ఓల్డ్ టు ఛేంజ్ (I am too old to change) అంటాడు. అతడు బోధించే విద్యార్థులలో ఆత్మగౌరవము, సంస్కారము మఱచిపోలేదు. ఈ దృశ్యాలను సత్యజిత్‌రాయ్ చక్కగా చిత్రించాడు. తన పూర్వ విద్యార్థులు తన సంఘం గుర్తించలేదనే అహంభావంలో కొడుకు మీద, కోడలి మీద తీర్చుకొంటాడు. వాళ్లను ప్రతిక్షణం సాధిస్తూ ఉంటాడు. చివరకు వివేచన దృష్టితో సంసారంలో తప్పు తెలిసికొని కోడలి పట్ల కరుణగా ఉంటాడు. కొమారుడు సుపుత్రుడికి ఒకవైపు పితృభక్తి ఒకవైపు తన సంసారాసక్తి వీటిమధ్య పడి, ఏమ్మీ మనస్కుడై ఏమీ చేయడానికి సాహసించని యువకభావన. ఈ సంసారంలో మంచి చెడ్డలను ఓర్చుకొని—సంసారానికి దూర్వాదిగా సమస్తవా భూదేవి వంటి ఓర్పుగల తల్లి—వీటిమధ్య చిక్కిన నాటిలో ఉద్యోగంచేసే విద్యావతి ఐన స్త్రీ ఇంటి పోరాటం ఎదుర్కొం పొందుతూ అవమానాలు సహించవలసినదేనా? సహించదు; ఆమెలో అగ్ని రాజుకొంటున్నది. స్ఫులింగాలు ప్రజ్వరిల్లుతున్నాయి. ఆమె తిరుగుబాటుచేసి తన ఉత్తమ వ్యక్తిత్వం నిలుపుకొంటుంది. ఇది సత్యజిత్‌రాయ్ నిరూపించాడు. ఆమె త్రోవలో ట్రామ్ ఎక్కి వస్తూ ఉంటే—ఒక దివ్య కాంతి రేఖలో ఆమె ఆశ చూస్తుంది. అదే ఆమె జీవన సందేశకర్త. ఈ గభీర సహనశీలలోని శక్తి, సామర్థ్యము మానవజాతికే ఒక క్రొత్త ధైర్యము, ఒక జీవితేచ్ఛ కలిగించినట్లు నిరూపిస్తాడు రాయ్. ఈ చిత్రనిర్మాణంలో ఒక సంయమనము ఒక ద్రుతగమనముతెచ్చి దర్శకుడు చిత్రవేగంలో ఒక ఉద్వేగగలిని తీసికొని వచ్చాడు. ఈ చిత్రంలోని వివిధ పాత్రల అభినయంలో సత్యజిత్‌రాయ్ స్వయంగానే అందరితోను కలిసి నటిస్తున్నాడా అనిపిస్తుంది. ముసలి బడిపంతులుగా హరేన్ ఛటోపాధ్యాయ్, సుబ్రతునిగా అనిల్ ఛటోపాధ్యాయ్ కథానాయిక ఆరతిగా మాధవి ముఖోపాధ్యాయ్ అద్భుతంగా నటించారు. ఈ చిత్రానికి సంగీతం కూడ సత్యజిత్‌రాయ్ సమకూర్చారు. ప్రతి స్వరంతోను చిత్రధ్వని వ్యంజన చేయించారు.

# అమెరికా కొత్త అధ్యక్షుడు



**శ్రీ కె. తిరుమలరావు**

అమెరికా సంయుక్త రాష్ట్రాల ఉపాధ్యక్ష పదవికి రాజకీయమైన ప్రాముఖ్యత ఏదీలేదని ప్రతీతి. ('ది మోస్ట్ ఇన్‌సిగ్నిఫికెంట్ దట్ ఎవర్ ది ఇన్వెంషన్ ఆఫ్ మాన్ కంట్రయివ్‌డ్' అన్నాడుట మొదటి అమెరికా ఉపాధ్యక్షుడు జాన్ ఆడమ్స్.) అంతదాకా రాజకీయ నాయకులుగా చెలామణీ అయ్యేవారు కూడా ఉపాధ్యక్షులు కాగానే క్రమంగా ప్రభుత్వానికి అంత అవసరంలేని ఒక ఆభరణంగా తయారయిపోతారంటారు. ఇది ఎంతవరకూ నిజమో కాని, చట్ట ప్రకారం కెన్నెడీ మరణంవల్ల అమెరికా 36 వ అధ్యక్షుడుగా నియమింపబడ్డ లిండన్ బెయిన్స్ జాన్‌సన్ మాత్రం ఎందరో అనుకుంటున్నంత, అంటున్నంత నిస్సహాయుడు కాదు.

రాజకీయవేత్తగా ఇప్పటికి చాలా సంవత్సరాలుగా ప్రసిద్ధి పొందినవాడు శ్రీ జాన్సన్. 1960—61 లో కెన్నెడీకి ఎదురుగా తనే అధ్యక్ష పదవికి ప్రయత్నించాడు. అయితే ధోరణి కనిపెట్టి, తను ఓడిపోయానని గ్రహించగానే కెన్నెడీకి నమ్మిన అనుచరుడైపోయాడు.

జాన్సన్ వయస్సు ఏభై అయిదు. మనిషి ఆరడుగుల మూడు అంగుళాల పొడుగు. టెక్సాస్‌లో స్టోన్‌వాల్ అనే చిన్న ఊరి దగ్గర జన్మించాడు. అతని తండ్రి, తాత ఇద్దరూ కూడా 'రాజకీయ వ్యక్తులే'. ఇద్దరూ టెక్సాస్ శాసనసభలలో సభ్యులు. తొమ్మిదవఏట ఒక మంగలి షాపులో బూట్లకి పాలిష్ వేసేవాడు శ్రీ జాన్సన్. పదిహేను ఏళ్లు రాగానే స్కూలువదలి రోడ్లు వేసే కూలీగా చేరాడు. ఇంకా ఎన్నో చిల్లరపనులు చేసి, కొంతకాలానికి చదువు మీద ఆసక్తి గలిగి తనని తనే పోషించుకుంటూ బి. ఎస్. సి డిగ్రీ సంపాదించాడు. 1931 లో రాజకీయరంగంలోకి ప్రవేశించి తన 29 వ ఏట అమెరికా కేంద్ర శాసనసభకి ఎన్నిక అయ్యాడు.

బాగా దక్షిణాది రాష్ట్రానికి చెందిన వాడయినప్పటికీ లిండన్ జాన్సన్ 'పురోగమనవాది'గా పేరు పొందాడు. 'న్యూడీల్' సిద్ధాంతాల నిర్మాత ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ ప్రభావం క్రిందికి వచ్చాడు. అతను తనకి 'డాడీ' అన్నాడు. ఆ తర్వాత డెమొక్రాటిక్ పార్టీ 'విప్' నుంచి ఆ పార్టీ 'సెనేట్ నాయకు' డయ్యాడు.

పార్టీ 'నాయకుడు'గా జాన్సన్ విశేషమయిన లౌక్యం కలవాడని పేరు పొందాడు. శత్రువులని రాజీ చేసుకొని మిత్రులుగా మార్చుకొంటాడంటారు కొందరు. ఉపన్యాసాలవల్ల కాక వ్యక్తిగతమయిన కృషివల్ల అవతల వాళ్ళని తనవైపుకి మార్చుకొనగలడనే పేరు సంపాదించుకున్నాడు జాన్సన్. అదీగాక స్వయంగా ప్రపంచంలో ఎన్నో ప్రదేశాలు పర్యటించి చాలా విషయాలు గ్రహించాడు.

అందుచేతనే జాతి సంబంధాల విషయమై అమెరికాలో కల్లోల పరిస్థితి ఏర్పడిన ఈ సందర్భంలో రాజకీయ నైపుణ్యం ఎవరిప్పుడూ నేర్చుకోనవసరంలేని లిండన్ బెయిన్స్ జాన్సన్ విధానాలు ఎటువంటివో పరిశీలించటం ముఖ్యం.



నీగ్రోల హక్కుల విషయంలో కొత్త అధ్యక్షుడు నల్లవారివైపే ఉన్నట్టు నొక్కి చెప్పాడు. ఇతని అభిప్రాయాలకూ, కెన్నెడీ అభిప్రాయాలకూ పెద్ద వ్యత్యాసం లేదు. అసలు శాసనసభల నిర్వహణలో ఎక్కువ సామర్థ్యం కల జాన్సన్ కెన్నెడీ కన్నా ఎక్కువే సాధిస్తాడేమో !

ప్రపంచశాంతి నెలకొల్పటానికి రష్యాతో మంతనాలు జరపటానికి సిద్ధంగా ఉన్నానని జాన్సన్ చాలాసార్లు చెప్పాడు.

ఐక్యరాజ్యసమితి లేకపోతే యుద్ధం తప్పదన్న కొత్త అధ్యక్షుడు ఈ సంస్థని అభిమానంతో పరిగణిస్తాడనటంలో సందేహంలేదు.

# నివాళి పాట



### శ్రీ హస్నాబాద నాగలింగ శివయోగి

నేటి వ్యవహారము ననుసరించి పాట, గేయము, గీతము, పదము పర్యాయపదములు. చిరకాలమునుండి తెలుగునాట గేయ సాహిత్య సంపద యపారముగ వర్ధిల్లినను మనకు లభించినది మాత్రము బహు కొద్ది. అద్దైనను 14, 15 వ శతాబ్దముల నాటిదే యని చెప్పక తప్పినది కాదు. ఈ గేయ సాహిత్యమును గడచినవా రందరును 11, 12 వ శతాబ్దముల నాటివగు, శిష్టకవులు పేర్కొన్న సమకాలిక గేయ పణతులైన అంక మాలికలు, ఊయల పాటలు, గౌడు గీతములు, ఆల తులు, తుమ్మెద, ప్రభాత, పర్వత, ఆనంద, శంకర, నివాళి, గొబ్బి, వెన్నెల, వాలేశు, ఇత్యాది పదముల నామములు మాత్రమే మిగిలినవి గాని, వాటి స్వరూపము ఇదమిత్థమని తెలియుటలేదని పలువురు పండితుల యభిప్రాయమై యున్నది.

లక్షణకారులు గూడ వీటికి లక్ష్య లక్షణముల నేర్పరచిరని వేరే చెప్పనక్కరలేదు. శిష్ట కవులు గూడ పద రచనలు జేసిరట్లు మన వాఙ్మయ చరిత్రలు చెప్పుచున్నవి. శ్రీనాథాది మహాకవులు గూడ నిట్టి రచనలకు కడంగినచో వాఙ్మయమున వీటికి గల విశిష్ట స్థానము విదిత మగుటలేదా! కావున నిట్టి గేయ వాఙ్మయమును గూర్చి పరిశ్రమించి గాలించినవారికి బహు పురాతనమైన గేయ పుష్పములు లభించగలవనియే నా నమ్మకము. ఎందరెందరో మహానుభావులు గేయ సాహిత్యమును సేకరించి ముద్రించిరి. మరికొందరు సేకరణలోనే యున్నారు. నేను యీ గేయముల వేటకై బయలుదేరగా నెన్నియో అపురూపమైన పురాతన గేయములు నా కంట బడినవి. అందు కొన్ని కవులపేర్లతో గూడ వెలసినవి.

ప్రసిద్ధ శైవ వాగ్గేయకారులగు మడివాళయ్య, ఘన, ఘంట, మతము వారివి కూడ లభ్యమైనవి. వీటిని గురించి మరియొకసారి తెలియజేయుదును. అనేక పురాతన పదములు వ్రాయబడిన తాటాకు గ్రంథములు లెక్కకు మిక్కిలి లభించినవి. నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడును, సమకాలిక గేయముల నెన్నింటినో పేర్కొనిరి. ముఖ్యముగ సోమనాథుడు పలు రకములైన గేయములు (పదము) లను తాను స్వయముగా జూచినట్లె వర్ణించినాడు.

గమనింపుడు :—

''పదములు తుమ్మెద పదముల్ ప్రభాత
పదములు పర్వత పదములానంద
పదములు శంకర పదములు నివాళి
పదములు వాలేశు పదములు గొబ్బి
పదములు వెన్నెల పదములు సంజ
వర్ణన మరి గణ వర్ణన పదము
లర్ణవ ఘోషఘూర్ణిల్లంచు నుండ
బాడుచునాడుచు బరమహర్షమున
గూడి సద్భక్త సంకుల మేగు దేర''

ఇట్టి గేయరూపము లెట్లుండెడివో తెలిసికొనుట కష్టమైనప్పటికి, కొద్ది మారు రూపములతోనో, భిన్నాభిన్నమైన యవయవములతోనో, జానపదులవలన నేటికి జీవించి యుండవచ్చుననుట సమంజసము. నే జూచినంత వరకు ముద్రితములై లభ్యమగుచున్న గేయ సాహిత్యమునందు 'నివాళి' పాట నా దృష్టికి తగులలేదు. అందుచేత నట్టి 'నివాళి' పాటను సేకరించి గేయ సాహిత్యాభిమానుల ముందుంచుచున్నాను.

చూడుడు :—

''1 నివ్వాళి ప్రభురాయ నివ్వాళి బసవ
నివ్వాళి గురుమూర్తి నీకు నివ్వాళి
2. అఖిలేశ లోకేశ అమిత ప్రకాశ
నిఖిల లోకారాధ్య నీకు నివ్వాళి
3. ఉర్జితపరిశేష ఓ పరమేశ
నిర్జిత జగదైత్య నీకు నివ్వాళి
4. శ్రీకంఠ సిత కంఠ శ్రీ నీలకంఠ
వైకుంఠపతి దంట నీకు నివ్వాళి
5. శివభక్త సంపన్న చెన్న బసవన్న
నీ వింతగుణికన్న నీకు నివ్వాళి
6. ఇష్ట ప్రణవపర అష్టాంగయోగ
ఇష్ట చిన్మయమూర్తి నీకు నివ్వాళి
7. భక్తుల పాలిటి భావజ్ఞుడైన
(శక్తి) చిన్మయమూర్తి నీకు నివ్వాళి
8. పర్వతకోద్దండ భవ్యదోర్దండ
నిర్వాణ గురుమూర్తి నీకు నివ్వాళి
9. శ్రీ మహేశ్వరలింగ చిన్మయమూర్తి
మంగళ పదమిచ్చు నీకు నివ్వాళి
10. నరసంత మర్త్యేశ సకల లోకేశ
నీవెంత ఘనుడన్న నీకు నివ్వాళి

11. అంగజ మదభంగ (హ) ప్త పారంగి
జంగమ గురులింగ నీకు నివ్వాళి

12. [1]యాల పురములోనె (దార మబ్బంగ)
నీరాజనము లిచ్చు నీకు నివ్వాళి

13. మడివేళ మాచయ్య మాది రాజయ్య
మా యిష్ట లింగయ్య నీకునివ్వాళి

మంగళహారతికి నివాళి పర్యాయపదము. పాల్కురికి సోమనాథుని కాలమున శుభ సమయములందు 'నివాళి' పాడుట యాచారమై యున్నట్లుగా తోచుచున్నది. రానురాను 'నివ్వాళి'యే మంగళముగా మారినదా ? అన్నమయ గారి కాలమునుండి మంగళములు పాడుట యాచార మయ్యె నేమో ! అయిన యీ 'నివాళి' పాటయందు, నీరాజనములు (ఆరతులు) మంగళము మున్నగు శబ్దములును వచ్చుటచే నీరాజనములు నివాళులు వేరువేరు అయి యుండునా యని సంశయము కలుగుచున్నది.

ఇక దీనిని గణ విభజనచేసి చూచిన నొక్కొక్క చరణమున మూడింద్రగణములు వాని వెంబడి నొక సూర్య గణమును అట్లే పాదమునకు 3, 5, 7 వ గణాద్యక్షరము యతి గలిగి యున్నది. ప్రాస గూడ గలిగియుండుట మరొక విశేషము. కాన నిది తరువోజ యనబడును. ఈ తరువోజను గురించి ఇంచుక పరిశీలించిన, వేంగీ చాళుక్యుడగు గుణగ విజయాదిత్యుని అద్దంకి శాసనమందు (9 వ శతాబ్దము)[2] తరువోజ గలదని తెలియుచున్నది. నన్నయకు పూర్వము గల పండిత కవులు తరువోజనే దేశి ఛందస్సు క్రింద వాడుచు లను కవిరసు వెదజల్లి యుందురు. అందుచేతనే కావోలు ఆ తరువాతి గేయముల వరుస లన్ని తరువోజ, మధ్యాక్కరలకు సమీపముగనే కనబడుచున్నవి. దీనినిబట్టి దేశి ఛందోరీతులు పదములనియే తెలియుచున్నది. అనగా వీటిని దేశి కవిత లనవచ్చును. పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న, తుమ్మెద, వెన్నెల, వాలేశు పదములు గూడ వీ దేశి కవిత లనబడు తరువోజలై యుండును. కావున పై నుదాహరించిన 'నివాళి' పదము 12, 13 వ శతాబ్దముదై యుండును.

చివరి కొన్ని చరణములయందు యతి ప్రాసలు తప్పినవి. లేఖకుడు వ్రాయునెడ కొన్ని చరణ పంక్తుల మరచినాడేమో యనిపించును. పల్లవి అనేది లేదు. విశిష్టమైన రాగము సూచించలేదు. అయినను ఏదో యొక లయపై బాడుచు బోయినచో పై చరణములు పునరావృతముగా పందుకొను యవసరము గూడ లేనంతగా పాట సాగిపోవుచునే యున్నది. ప్రతి పాదాంతమున 'నివాళి' యను మాట మారుమారు కానవస్తున్నది. ఈ పాటయందు—అల్లమ ప్రభువు, మడివాళ మాచయ్య, మాది రాజయ్య, చెన్న బసవన్న మున్నగు పురాతన (బసవేశ్వరుని సమకాలికులు) భక్తుల పేర్లు వినబడుచున్నవి. "ఏవం భక్త హితార్థ మత్కలియుగే పాల్కురికి సోమప్రభో" అని ప్రసిద్ధి వడసిన శివభక్తాగ్రేసరుడగు పాల్కురికి పేరు లేదు. అందుచేత నీ పాట సోమనాథునికి పూర్వముదై యుండును. లేదా సమకాలిక గేయమైన యై యుండి యుండును.[3]

సోమనాథుడు పేర్కొన్న 'నివాళి' పదము లిట్టివే అయి యుండును. విశేషించి గేయ సాహిత్యమునం దభిమానము గలవారు దీని ప్రాముఖ్యతను గూర్చి తెలియజేయుటే గాక, లభ్యమైన దేశీయ పదములందు రాగ తాళ ఛందోబద్ధమై వెలసిన తొలిపాటలు వాటి రచయితల కాలము మున్నగు వివరములతో పత్రికా ముఖమున తెలియజేయగలరని ఆశించుచున్నాడ.

---

1. యాలపురము అనునది పూర్వము గొప్ప శైవ క్షేత్రముగా నుండెడిది. నేడు 'యాలాల' యని పిలువబడుచున్నది. (తాండూరు సమీపము, జిల్లా హైద్రాబాద్) ఇక్కడ కోటిలింగాలు గలవని ప్రతీతి. నే నిచ్చటికి వెళ్లి చూచితిని. ఇచ్చట అనేక శివలింగములును, వరాహ విగ్రహములును, కాగ్నా నది యొడ్డుననే గలవు. ద్వాపరమున కాలయవనుని రాజధానియై యుండును. ఇచటికి కొద్ది దూరములోనే ముచికుందుడు నిద్రించిన గుహ (రాకమాద్రి) భైరవ క్షేత్రము, ముచికుంద క్షేత్రము, మార్కండేయ క్షేత్రము (అనంతగిరి), దామగుండం మొదలగు తీర్థములు గలవు. ఇచటనే ముచికుంద రాజర్షివలన కాలయవనుడు భస్మమైనాడని ముచికుంద మాహాత్మ్యమను పురాతన సంస్కృత గ్రంథము (అముద్రితము) వలన తెలియుచున్నది. ఇచటి పర్వత ప్రాంతముల నుండి పుట్టిన నదికే ముచికుందానది యని పేరు. నేడు మూసానది యని పిలువబడుచున్నది.

2. అద్దంకి శాసనమందలి 'తరువోజ' పంక్తులు—

"పట్టంబు గట్టిన ప్రథమంబు నేడు—బలి గర్వమొప్పంగ బైలేచి సేన
పట్టంబు గట్టించి ప్రభుం బండరంగు—బంచిన సామంత పదువతో బోయ—

3. నేను సేకరించిన కొన్ని పదములయందు, కవి పేరుతోబాటు కాలమునుగూడ తెలియజేయు చరణములు గలవు.

ఉదా :—"మడివాళయ్య జెప్పెను పుడమి ప్రజనులొప్పను
ప్రభవ శుద్ధ చైత్రము పాడ్యమి గురువారః

# ఆల్డస్ హక్స్‌లీ



అధ్యక్షుడు కెన్నెడీ హత్య, భారత సైనికాధికారులు విమాన ప్రమాదంలో మరణించటం, శ్రీ కన్నంవార్ మృతి, వీటి వల్ల ఆల్డస్ హక్స్‌లీ మరణానికి రావలసినంత ప్రాముఖ్యత రాలేదు.

ఆల్డస్ హక్స్‌లీ పుస్తకాలు, ఏవో కొన్ని చదవని సాహిత్యాభిమానులు ఉండరేమో! 'క్రోమ్ యెల్లో',, 'ఏంటిక్ హే', 'బ్రేవ్ న్యూవరల్డ్', 'పాయింట్ కౌంటర్ పాయింట్' మొదలయిన పుస్తకాలు వాటిని చదివేవారిని దిగ్భ్రాంతులనుగా చెయ్యకుండా ఉండి ఉండవు. ఈ రచయిత ప్రభావంలేని ఆధునిక రచయితలు చాలా తక్కువమంది ఉన్నారనటం అతిశయోక్తి కానేరదు.

(''ఆల్డస్ ఉన్నాడు'' అంటాడు ఒక మామ్ నవలలోని పాత్ర. రచయితల కీర్తిని వ్యంగ్యంగా, నిశితంగా వ్యాఖ్యానించే ఈ నవలలో కూడా మామ్ ఆల్డస్ హక్స్‌లీ ప్రాముఖ్యాన్ని గుర్తించా డనుకున్నా ఫరవాలేదు.)

ఆల్డస్ హక్స్‌లీ 'గొప్ప' వంశంలో జన్మించాడు. థామస్ హక్స్‌లీ—శాస్త్రజ్ఞుడు—ఈయన తాత; జూలియన్ హక్స్‌లీ—మరొక శాస్త్రజ్ఞుడు—ఈయన సోదరుడు. తల్లివైపు మాత్యూ ఆర్నాల్డ్ సంతతివాడు. భౌతిక శాస్త్రాలు అభ్యసిద్దా మనుకున్న ఆల్డస్ హక్స్‌లీ చిన్నప్పుడే వచ్చిన కంటి జబ్బు మూలంగా ఆ ఆశను వదులుకుని సాహిత్యంవైపు తిరిగాడు. సాహితీ ప్రపంచంలో దుమారం లేపాడు. ఒకప్పుడు ఆయన పేరు ఉచ్చరించటమే 'ఫాషన్' గా ఉండేదిట లండన్ సాహిత్యాభిమానుల వర్గాలలో .....

లలితకళలమీద, మానవజాతి నైతిక పతనం మీద, హక్స్‌లీ వ్రాసినంత సున్నితంగా, సూక్ష్మంగా బహు కొద్ది

మంది వ్రాయగలరు. నమ్మశక్యంకానంత పాండిత్యం, సున్నిత మనస్తత్వం కలవాడు కాబట్టి ఈయన రచనలు చాలా సునాయాసంగా వ్రాసినట్లు కనిపిస్తాయి. చదివే వారిలోనూ తమకి అన్నీ తెలుసునన్న భావం కలిగిస్తాయి! హక్స్లీ పుణ్యమా అంటూ కొందరు కథాకారుల పేర్లు చాలా ప్రసిద్ధి పొందాయి. కాని ఆయన అత్యుజ్జ్వల ప్రతిభ మొత్తంమీద మేలు కన్న కీడే ఎక్కువ చేసిందనే అనుమానం చాలామందికి ఉంది.

'క్లేర్ ద బెల్మాన్' అనే చిన్న కథలో ముఖ్య పాత్రని గురించి ఒక అమ్మాయి అనుకుంటుంది, అతను తిరగబడిన 'ఆల్కెమిస్ట్' అని; బంగారాన్ని కూడా సీసంగా మార్చే శక్తి అతనిలో ఉందిట! పాఠకులకి హక్స్లీ విషయంలో ఇదే అనుమానం కలుగుతుంది. ఆయన మనస్తత్వం ఎంత సుని శిత మయినదో అంత సున్నిత మయినది. అంతేకాక శరీరానికి సంబంధించిన కొన్ని క్రియల విషయంలో హక్స్లీ వ్యంగ్యం వెనకాల జుగుప్స, భయం ఉంటాయనిపిస్తుంది. 'ఐలెస్ ఇన్‌గాజా' లో ఒక పాత్ర అన్నీ జీర్ణకోశం మీదనే ఆధారపడి ఉంటా యంటాడు. ఎల్‌గ్రెకో చిత్రాలలోని రంగులు దేహం లోపల కొన్ని భాగాలు జ్ఞాపకం చేస్తాయి హక్స్లీకి. స్త్రీ పురుష సంబంధం విషయంలో ఇక చెప్పనే అక్కర్లేదు—ఎంత గాఢమయిన అనుభూతి అయినా విరక్తి పుట్టించక మానదనే సూచన మాత్రమే కాక, శారీరకమయిన వివరాలు రచయితలో జుగుప్స కలిగిస్తాయనే సూచన సయితం పాఠ కునికి గోచరిస్తుంది. [షేక్స్పియర్ (ఉదాహరణకి) లో కూడా ఈరకం విరక్తి కనిపించినప్పటికీ అసలు అనుభవం వర్ణించే టప్పుడే అసహన భావం లేదనిపిస్తుంది.] అందుకనే ఆల్డస్ హక్స్లీని మొదట 'భక్తి' తో చూసి, ఆయన ప్రభావం క్రింద వ్రాసినా పోను పోను ఎదురు తిరుగుతారు. ["కాని విషం అప్పటికే రక్తనాళాలని ప్రవేశించింది!" అన్నాడు ఒక రచ యిత ఇటీవలే, హక్స్లీ ప్రభావం పూర్తిగా వదిలించుకొనలేక పోయాననే విచారంతో.]

1930 ప్రాంతాల ఆంగ్ల సాహిత్యంమీద పెరిగిన వారి మీద హక్స్లీ ప్రభావం మంచిదయినా చెడుదయినా తక్కువది మాత్రం కాదని నిస్సందేహంగా చెప్పవచ్చు. అమెరికా ఇంగ్లాం డుల సంగతి అటుంచి భారత మేధావులు, రచయితలు ఎంత వరకు, ఏవిధంగా హక్స్లీకి ఋణపడి ఉన్నారో పండితు లెవ రయినా పరిశీలిస్తే బాగుంటుంది.

ఆల్డస్ హక్స్లీ భారత సంస్కృతి పట్ల చాలా ఆసక్తి చూపారు. ఎన్నో పరిశోధనలు జరిపారు. కాని, ఆయనకి 'హాలీవుడ్ యోగి' అనే బిరుదు సంపాదించిపెట్టిన ఈ పరిశో ధనలు ఆయన కీర్తికి ముఖ్య కారణాలుగా పరిగణింపబడవు—'మెస్కాలిన్' ప్రభావం క్రింద వ్రాసిన పెద్ద వ్యాసాలు చదవటానికి బాగానే ఉంటాయి కాని, విశేషమయిన సంస్కృతి కల ఒక పాశ్చాత్యుడు ఇటువంటి మందు తింటే ఏవిధంగా ఊహిస్తాడో మాత్రం తెలుపుతాయి, అంతే.

69 వ ఏట పుట్టకురుపుతో అమెరికాలో మరణిం చిన ఆల్డస్ లియోనార్డ్ హక్స్లీని చదివినవా రెవరూ తమ మీద ఆయన రచనల ప్రభావాన్ని మరిచిపోలేరు.

—కె. ఆర్.

---

కళలఁ బ్రవీణుఁడై మిగులఁ గావ్యములందుఁ బ్రియంబు గల్గి కో
ర్కులు సకలార్థికోటులకుఁ గూర్చి యొసంగుచు దానశూరుఁడై
పొలిచి సుకీర్తియై వినయ భూషణుఁడై మహిమానుభావుఁడై
నిలిచిన వాని నాయకుఁడని న్వచియింతురు సత్కవీశ్వరులు.

—చిత్రకవి పెద్దన

# గ్రంథ పిమర్శలు

## శ్రీ కాళహస్తి మాహాత్మ్యము

ధూర్జటి కవి ప్రణీతము. పరిష్కర్త : శ్రీ తిమ్మా వజ్ఝల కోదండరామయ్యగారు. ఎం. ఏ. సారస్వత కుటీరము. మద్రాసు—21. వెం : రు. 3.00.

శ్రీ కాళహస్తి మాహాత్మ్యము తొలుదొల్త, శ్రీ క్రొత్త పల్లి వేంకట పద్మనాభశాస్త్రిగారి పరిష్కరణముతో—1895 లో అచ్చు పడినది. పరిష్కరణము సరిగా జరుగలేదు.

తరువాత 1914 లో—ఒకపాటి పరిష్కరణముతో, వావిలికొలను సుబ్బారావుగారి లఘుటీకా సహితముగా ముద్రిత మైనది. కాని, అనపాఠము లనేక మట్లే యున్నవి. ముద్ర ణము ముగిసిన పిదప దొరకినవి కాబోలు ! "తాళదళ గ్రంథ ముల నుండి గ్రహింపఁబడిన సాధు పాఠాంతరములు" అని యొక పట్టిక, గ్రంథాంతమున చేర్పఁబడినది. ఒకటి, రెండు తప్ప, ఆ పాఠము లన్నియు సాధువులే.

అటుపిమ్మట, 1930 లో—అది మరల ముద్రిత మైనది. కాని వెనుకటి పట్టికలోని సాధు పాఠములందు చేర్పబడలేదు. (పట్టిక యైనను చేర్పఁబడలేదు.) అందువల్ల పూర్వ ముద్రణములోని తప్పు పాఠము లట్లే నిలిచిపోయినవి.

అనంతర మా గ్రంథమును, శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారి సంస్కరణముతోను, వారి లఘుటీకతోను— వేంక ట్రామ అండ్ కో వారు ప్రకటించినారు. అందును తప్పులు తొలఁగిలేదు. మఱికొన్ని క్రొత్తవి చేరినవి. మొత్తముమీఁద ధూర్జటి కృతి అసాధు పాఠముల కగ్గమై, అట్లే ప్రచార ములో నున్నది.

నేను 1962— జులై 'భారతి' లో "కాళ. మా. పాఠపరామర్శము" అను వ్యాసములో, పై రెండు ప్రతుల స్వభావములను తెల్పి, కొన్ని యప పాఠములను చూపించి, సాధు పాఠములను సూచించియున్నాను.

కాళ. మాహాత్మ్య మిప్పుడు (1963 లో) శ్రీ తిమ్మా వజ్ఝల కోదండరామయ్యగారి సంస్కరణముతో క్రొత్తగా వెలువడినది.

శ్రీ కోదండరామయ్యగారు, ఈనాటి భాషా పరిశోధకు లలో సుప్రసిద్ధులు. ప్రాత పలుకుబడులు, ప్రాచీన కవుల ప్రయోగ రహస్యములు—చిరకాలానుభవమున— బాగుగా గుర్తించి యున్నవారు. మఱియు పూర్వ కావ్యములను చక్కగా పరిష్కరించి, వరుసగా ప్రకటింపవలెనను సంకల్పముతో— ఇంతకుముందు కేయూరబాహు చరిత్రమును ఆవిష్కరించి యున్నారు. ఆ పరిష్కరణము భాషావిదుల ప్రశంసల నందు కొనియు నున్నది. కాని, ఈ పరిష్కరణ మంత సుష్ఠుగా జరుగలేదు.

వారు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున, బ్రౌను పండితుడు వ్రాయించి యుంచిన—వివిధ ప్రతుల పాఠముల నెత్తి వ్రాసికొని, సంశయము గలిగిన తావుల వ్రాతప్రతుల లోని ఆ యా పట్టులను పరిశీలించి సాధుపాఠ నిర్ణయము చేసికొనుచు, ఈ పరిష్కరణ కార్యమును సాగించినట్లు పీఠి కలో తెల్పియున్నారు.

ఆ పరిశోధనము వలన తప్పు పాఠములు కొన్ని తొలగి నవి గాని, నిశ్శేషము కాలేదు. వారు చిలుకూరివారి ప్రతిని గాని 'భారతి' లోని నా విమర్శను గాని, క్రొత్తపల్లివారి 1914 ప్రతిలోని సాధు పాఠముల పట్టికనుగాని, చూచినట్లు లేదు. చూచియున్నచో—అన్నియు కాకపోయినను—మఱికొన్ని యైనను తొలఁగియుండెడివి. వారు మరల నొకమారు శ్రమ తీసికొనిన గాని, గ్రంథము నిర్దుష్టము గాదు.

వ్రాతప్రతుల పాఠములను, నే నూహించిన పాఠము లను ఇందు చూపుచున్నాను. అర్థ వివరణాదు లెక్కువగా పెట్టుకొన్నచో, వ్రాత విస్తరిల్లును గావున, అచ్చుప్రతి పాఠమును—పాఠాంతరమును ఉదాహరించి, దాని క్రింద సాధుపాఠము సూచించి వదలెదను.

1. "త త్పట్టన, ప్రతిబింబించినఁ జంద్రకాంత రచిత ప్రాకార మొప్పారు." (1—19)

'ప్రతిబింబంబున' అని వ్రాతప్రతి పాఠము.

2. "బంగారు ప్రాంతచెఱంగుల గోణాము" (1– 30)

బంగారు—'వ్రాత' (వ్రా. పా.)

3. ''భక్తిపూర్వక మతిన్ 'శరణార్థి' యొనర్చి'' (1—34)

'శరణార్థి యొనర్చి'—ఏక పదము (శబ్ద పల్లవ క్రియ).

4. ''రతి ప్రసంగముల, నర్ధ నిమీలిత నేత్ర పద్మముల్
మానని చుంబినంబులును, మాటల చొక్కులు వీడి వీడి పో
సీని కవుంగిలింతలు, ననేక విలాసములుం జెలంగఁగన్.'' (1—42)

'రతి ప్రసంగములు—నర్ధ నిమీలిత'.... అని యుండ నగును.

ఈ పద్యము, అప్పకవీయమునను—పై పాఠముతోనే ఉదాహృతమై యున్నది (3—151)—కాని, పద్యములోని—నేత్ర పద్మములు, చుంబనములు మున్నగు విశేష్యముల వలెనే 'రతి ప్రసంగములు' కూడా ప్రథమలోనే యుండవలెను. లేనిచో సమంజసార్థ మేర్పడదు. (ఇంత కెక్కువ వివరించుట కిది చోటు కాదు.)

5. ''ఘన భక్తి గర్త—నిర్మాత—చిత్తస్తంభ
తను గేహమున గాలి దలఁకు లేక.'' (1—71)

'గర్త—నిఖాత' (ప్రా. పా.) గర్తమునందు—'పాతఁ బడిన' అని యర్థము.

6. ''ఖర్జూ భర్జనోపార్జనా, ఖండ ప్రావము''(1—73)

'భర్జనోపార్జనా....' (ప్రా. పా), ఉపార్జనము = సంపాదనము.

7. ''బ్రహ్మ విద్యాధనభిక్ష నాదు హృదయం బను పాత్రమునందుఁ బెట్టవే'' (1—83)

'విద్యౌదనభిక్ష' (ప్రా. పా)—విద్యా+ఓదన=విద్యౌదన. 'ఓదన' మనగా—అన్నము. (ఈ 'ఓదన' పాఠమును చిలుకూరి వారు గుర్తించినారు గాని, గ్రంథములో — 'విద్యాధన' అను పాఠమును చేర్చినారు.)

8. ''ప్రకాశిత జగచ్చిత్ర క్రియాభోగమై.''(1–88)

'చిత్రక్రియా' (ప్రా. పా), 'జగత్తనెడు—చిత్రక్రియ' అని యర్థము. ఈ పాఠము—అచ్చు ప్రతిలో—అడుగున చూపబడినది.

9. ''డగ్గఱి సేవఁజేసి'' (1—90)

'సేవచేసి' అని యుండనగును. (ఇది—శ. ప. క్రియ)

10. ''దేవ ప్రమద సేవనప్రథ నిలిచెన్.'' (1—95)

'దేవ—ప్రమథ' (ప్రా. పా), ఇదియు అడుగున చూపబడినది.

11. ''గిరిజా కర్ణోత్పల ధ్వంసితో
ల్బణ గండస్థల ఘర్మవారి.'' (1—97)

'కర్ణోత్పలోద్వాసిత' అని యుండుట యుచితము. 'ఉద్వాసిత = పోఁగొట్టబడిన' అని యర్థము.

12. ''ఉత్తరాశాభూమి ప్రుంకి ద
క్షిణ భూమి కడు నొడ్డ గెడవుగాఁగ.''(1—108)

భూమి 'క్రుంగి' అనుట యుచితము.

13. ''బడబాగ్ని వడికి లోపడని పాథోరాశి''(1—124)

'లోఁబడని' అని యుండవలె. ధాతువు 'లోఁబడు' గాని 'లోపడు' కాదు.

14. ''జాలంధరోడ్డీన బంధంబులం బుట్టుచున్.'' (1—146)

యోగబంధము—ఉడ్డీనము—కాదు. 'ఉడ్యాణము.'

ప్రాణు నపాను గూర్చి, యలపాముఁ గదల్చి, తదూర్ధ్వ కీలితోడ్యాణము నొత్తి, మేను దృఢమై నిగుడం బిగియించి, దృష్టులన్ ఘోణముఁ జేర్చి, యా ప్రణవ ఘోషణమున్ విని, యందు మానస క్షీణము సేసినం బవనసిద్ధుఁ డనా ! శివదేవ ధీమణీ ! (సకల నీతి సమ్మతము—పీఠిక.)

కాబట్టి పాఠము—'జాలంధరోడ్యాణ బంధంబులన్' అని యుండనగును.—'రోడ్యాన' అని. ప్రా.పా—

15. ''శితికంఠు డద్రి కన్యా
పతియై సుఖియయ్యె భువన భవనంబుల.'' (1—153)

'భవనంబున' (ప్రా. పా) ఏకవచనమున నుండుటయే సరసము.

16. ''అఖిల విద్యా రహస్యముల శంకలు దీర్ప
పరస నుండెడు మునీశ్వరులు వొగడ.'' (2—4)

'రహస్యములు శంకలుదీర్ప' అని యుండుట క్రమము. అది కర్తృపదము.

17. ''వ్యాహార సింహాసనారూఢ యయ్యును
బహువిధ వ్యావృత్తిఁ బ్రౌఢగాక.'' (2—7)

బహువిధ—'వ్యాహృతి' (ప్రా. పా.), వ్యాహృతి=మాట. 'మితిమీఱిమాటలాడక' అని భావము.

18. ''మోము పున్నమ చందమామ వెన్నెల గాయ
డెందంపుఁ గెందమ్మి గ్రిందు పడునొ?''(2—10)

ఈ సీసమున తక్కిన మూడు పాదములలోను—'అవియబడునొ', 'తప్పి పడునొ', 'మరలఁబడునొ' అనియే యున్నది. పడెనొ ?' అని యుండిన గాని అర్థము పరివడదు.

# గ్రంథవిమర్శలు

19. "తలఁపుతెర్వరి త్రోవఁ దప్పిపడునా?" (2—10)

'త్రోవదప్పు'—క్రియ. 'త్రోవన్—తప్పు' అనుట సరి కాదు. కనుక పాఠము 'త్రోవదప్పి పడెనా ?' అని యుండ నగును.

20. "రాయంచ నడపుల రాయడి." (2—10)

'రాయిడి' సరియైన రూపము. చిలుకూరి వారి ప్రతి లోను, వ్రాతప్రతిలోను 'రాయిడి' అనియే యున్నది.

21. "మ్రొక్కిన నొకలేమ మో మెఱ్ఱింగాఁ జేయు."
(2—18)

'ఎఱ్ఱింగా' అనుట సరికాదు, 'ఎఱ్ఱిగా' అనుట సరి.

22. "కోవన నార్చిసం దెసలఁ గుంజరముల్ సెదరెన్."
(2—35)

'కోవున నార్చిసన్ దెసల కుంజరముల్' అని సరియైన పాఠము. (శ. ర. లో—'కోవు' క్రింద నున్నది.) దెసల కుంజర ముల్ = దిగ్గజములు.

23. "చిత్తాయత్తమై కార్ముకా
మోఘాస్త్రంబులు దాల్చి." (2—37)

'చిత్తాయత్తమౌ' అని యుండవలె. తమకు—చిత్తము వచ్చిన=ఇష్టమైన—అని యర్థము.

24. "పట్టిన మునుమున్, గడదేఱిచి." (2—42)

మూడు ప్రతులలోను 'గడదేఱిచి' అనియే యున్నది. ధాతువు కడతేఱు' గాని, 'కడదేఱు' కాదు. కాబట్టి 'గడతేఱిచి' అని యుండనగును.

25. "మనజాహౌఘ దేహాస్త్ర ధారా
ధౌత క్షితి ధూళిపాళిగ." (2—49)

'దేహాస్త్రధారాధౌత' (వ్రా. ప్ర.) అస్రధారాధౌత— రక్తధారలచేత కడుగబడిన అని యర్థము. 'అస్ర' పాఠ మర్థరహితము.

26. "నిశాత బాణముల నా జో దేసె బేతాళముల్
గ్రుక్కిళ్లుమ్రింగఁగఁ గ్రొత్త నెత్తురుల వాఁగుల్
పాఱఁ గ్రవ్యాదులున్." (2—51)

'క్రవ్యాదులన్' (వ్రా. ప్ర.), 'ఏసెన్' అను క్రియకు 'క్రవ్యాదులు' కర్మ. కనుక 'క్రవ్యాదులున్' అనుట సరి పడదు.

27. "ముప్పదివేల రక్కసుల, ముంచె విరించి తనూజుఁ డీశ్వరుం
డప్పుర దైత్యవీర నివహమ్ము శరమ్ములఁ గ్రుమ్మ
కైవడిన్." (2—55)

'క్రమ్మ కైవడిన్' (వ్రా. ప్ర.), ఈశ్వరుడు పురదైత్య నివహమును, శరములచేత,—క్రమ్మ కైవడిన్ = పాదివిన విధ ముగా, విరించి తనూజుడు రక్కసులను, విశిఖావలిన్— ముంచెను—అని యర్థము. 'క్రమ్మ'అను పాఠము అచ్చుప్రతిలో అడుగున చూపబడినది.

28. "కిరీటంబుల నుండి రాలిన వజ్రవమౌక్తిక రజో
గుణంబు లవణంబు." (—262)

'రజోగణంబు' (వ్రా. ప్ర.)—అదే సాధువు.

లవణముగా చెప్పబడినది 'రజోగుణము' కాదు. రజో గణము—రజస్సుయొక్క సమూహము. వజ్రాల పొడి, ముత్యాల పొడి అన్నమాట.

29. "ప్రాతఃకాల తుషార శీకరచయ ప్రాప్తిన్ లస
న్మౌక్తికో
పేతాగారము లట్లు చెల్వెసఁగు త ద్బిందుచ్ఛటా
జాతఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు ఇహా రత్నోదీర్ణ
గేహంబులై
లూతాకల్పిత తంతు సద్మములు వొల్చున్."
(2—96)

'చెల్వెసఁగి' అని వ్రా. ప్ర.—అదే సరియైనది.

30. "విషాదచిత్తుఁడై" (2—110)

'విషణ్ణచిత్తుఁడై' (వ్రా. ప్ర.) సాధువు.

31. "అనువున శివపూజఁ జేసి." (2—113)

'శివుఁ బూజచేసి' అనుట యుచితము. 'పూజచేయు' శ. ప. క్రియ.

32. "వెడవిల్తు వేఁడిమి విడుపుఁ జూప." (2—124)

'విడుపుచూప' అనుట సాధువు—విడుపు చూపు, వెలుపు చూపు, మొలకచూపు మొదలైనవి—శ. ప. క్రియలు.

33. "చింత యన్ వేఁకి తనలోను చేసికొనియె."
(2—124)

'తను లోనుచేసికొనియె' అనుట సమంజసము. తనున్ = నన్ను, లోను చేసికొనియెన్=ఆక్రమించెను. అని యర్థమగును.

"అట్టి చింతాజ్వరంబు న న్నలమికొనియె."
(కాశీ. 1—111)

34. "వియుత్తలము మీదన్ మించి యొప్పారు ద
ట్టపుఁ బెంజీకటిచెట్టుఁ జుట్టుకొని యుండం
బోల్చెఁ దారల్ తదీ
య ఫలాకాంతర దర్శితోర్ధ్వ భవహో ద్యద్దీప్తి
ఖండక్రియన్." (2—130)

క్రొత్తపల్లివారి ప్రతిలోను ఇదే పాఠము. 'ఫల'—'భవన' అనునవి అపపాఠములు.

'పలాశాంతర .... భువనో ద్యద్దీప్తి' అని చిలుకూరివారి పాఠము. అదే సాధువు. (ఈ ప్రతిలో 'భువన' అడుగున చూపబడినది.)

35. "ఉదయ గ్రావము పానవట్టు, మభిషేకోద ప్రవాహంబు వార్థి, ధరధ్వాంతము ధూపధూమము." (2—132)

చిలుకూరివారి పాఠమును ఇదే. కాని, వారు—ఈ పాఠమున—ద ధ లకు ప్రాస సాంకర్య మున్నదనియు, 'దరధ్వాంత' మున్నచో ప్రాసము సరిపడుననియు వ్రాసినారు. ప్రాసము మాట యెట్లున్నను, ధరధ్వాంతము—దరధ్వాంతము అను పాఠములు రెంటను అర్థము సరిపడదు. 'దరీధ్వాంత' మున్నచో అన్నియు సరిపడును. నే నీ విషయమును నా పరామర్శలో తెలిపియున్నాను.

36. "రజనీ సుధాకర రతివియోగ నిధాన
కామప్రతాపాగ్నిధామ మనఁగ." (2—137)

"రజనీ .... నిధాన—రాత్రికి చంద్రునిమీఁది ప్రేమతోడి వియోగమునకు, ప్రధాన కారణమైన" అని చిలుకూరివారి టీక. ప్రధానకారణమను అర్థమునిచ్చు పదము 'నిదానము' గాని, 'నిధానము' కాదు. కాబట్టి పాఠము—"వియోగ నిదాన' అని యుండదగును.

37. "సంధ్యాది దేవతా చారు పీతవ్రాత
పద్మరాగ ప్రభాపటల మనఁగ." (2—137)

'పీత ప్రోత' అని వ్రా. పా—ఆ పాఠమే సరసము.

'పీత=పీఠములయందు, ప్రోత = కూర్పఁబడిన, పద్మరాగముల ప్రభాపటల' మని యర్థము.

38. "దళితకుంభ, సీమ నుస్ప పాము చిదిసె, నేనుంగును
బడియె, నెత్తురచటఁ బడియుగట్టె." (2—150)

"బడియెఁ గట్టి (పూ. ము.)" అని ఫుట్‌నోటు.

'బడియె నకట' అని చిలుకూరివారి ప్రతి.

ఈ మూడు పాఠములును అర్థము కుదురనివే = పద్యములోని క్రియల క్రమమును బట్టి—'పడియుగట్టె' అని యుండుట యుచితము. 'నెత్తురు, పడియగట్టన్—పడియగట్టఁగా, ఏనుఁగుపడెను, పాము చిదిసెను' అనుట సరిపడదు.

39. "సంభ్రమరత ! భవబంధ విమోచన !
గౌరా—గీశఁగ వగావన సంవిత్సుఖ సూచక !"
(2—152)

ఈ పాఠమున అంత్యానుప్రాసము తప్పినది.

'సంవిత్సుఖ సూచన' అని వ్రా. పా—

40. "త్రోవలఁ బోయినఁ జిద్రూపమ్మును
కని చాలింతురు మది సంతాపము." (2—152)

ఇందును అంత్య నియమము చెడినది. తొలి పాదమున, 'నీ చిద్రూపము' అని వ్రా. పా.—

ఇవి స్థూలదృష్టికి కనపడిన విషయములు. నిశితముగా చూచి సరిపఱచవలసిన పట్టులు చాల కలవు. వ్యాసము పెరుగు నన్న భయముచేత, మొదటి రెండాశ్వాసములలోని పాఠములను మాత్రమే పరామర్శించితిని. మూడు నాలు గాశ్వాసములలోను ఇట్లే విచారింపవలసిన పాఠము లెక్కువగనే యున్నవి.

భవిష్యత్తున శ్రీ కోదండరామయ్యగారి పరిష్కరణమునకును, ముద్రితమగు ధూర్జటి కృతి సరితలకును కొంత వఱకు ఉపకరింపవచ్చు నన్న తలపులో ఈ కొలది విషయములు తెలుపఁబడినవి. వీటిలోని గుణదోషములకు పండితులు ప్రమాణము.

—దీపాల పిచ్చయ్యశాస్త్రి.

# తాగుబోతు

(నవల—రచన: నిసుకొండ నాగరాజు. ప్రచురణ: జయభారత్ బుక్‌డిపో, సుల్తాన్ బజారు, హైదరాబాదు. వెం: రు. 1.50. పేజీలు: 95.)

ఈ నవలను 'ల్యాండ్ స్కేప్ నవల' అన్నారు రచయిత. అంతకంటె 'ఇన్‌స్కేప్ నవల' అనటం బాగుంటుందేమో ! భౌతికదృశ్య వర్ణన కంటె వ్యక్తి మనస్స్రోతస్సు వర్ణనకే ఇందులో ప్రాధాన్యం. ఇది ఏకపాత్రాభినయం వంటిది. మాదిగలింగడు తాగుబోతు, కథానాయకుడు. సంధ్యవేళ పొలం దగ్గర బయలుదేరి పడుతూ లేస్తూ చీకటి పడుతూండగా గ్రామం దాటి ఊరు పొటుపడగే వేళకు మాదిగ పల్లి చేరుతాడు. ఈ ప్రయాణంలో అతని మనస్సంచలన చిత్రమే నవలలో వస్తువు. అతని జీవితంలోని అనుభవాలను స్పృశిస్తూ అతని వ్యక్తిత్వాన్ని చిత్రించే ప్రయత్నం జరిగింది. ఇది ఆధునిక పద్ధతి. ఇరవయ్యో శతాబ్దంలో నవల పొందిన పరిణామం—సంఘటనల క్రమానుస్యూత పద్ధతిని వదలిపెట్టి, కాలగతికీ, బాహ్య ప్రపంచ గమనానికీ ప్రాధాన్యం ఇవ్వకుండా త్రికాల సంకీర్ణమగు వ్యక్తి అనుభూతికీ, మనస్తత్వ వైచిత్రికీ ప్రాధాన్యత యిచ్చే పద్ధతి. ఇది రచయిత చిత్తశుద్ధికి గీటురాయి. భావనాశక్తి సహానుభూతిగా ఒకే

వర్ణసంచేది, రచయిత పరకాయ ప్రవేశం చేస్తే తప్ప కావ్య ఫలసిద్ధి ఫలించదు. ఈ ప్రయోగాత్మకమైన రచనపట్ల నాగరాజుగారు ప్రదర్శించిన శ్రద్ధాసక్తులకు ఆయనను అభినందించవలసినదే !

రచయిత హెమింగ్వే వ్రాసిన "Old man and the sea" అన్న గ్రంథాన్ని దృష్టిలో పెట్టుకున్నట్లు తెలుస్తోంది. హెమింగ్వే శైలిని కూడా అనుకరించాలని ప్రయత్నించారు. ఈ రెండు విషయాల్లోను కృతకృత్యులు కాలేదు. కాకపోయినా ఫరవాలేదు. లింగడి ఏకపాత్రాభినయం ఒడుదుడుకులు లేకుండానే రూపొందింది. "Life is a tale told by an idiot" అన్నట్లు జీవితానికీ, తాగుబోతు చిత్తవృత్తికీ కూడా సామ్యం ఉంది. తప్పతాగిన లింగణ్ణి జీవితానికే ప్రతీకను చేయటానికి—అలా నవల చివరి పేరాలో సూచించి ముగించటం— రచయిత పొందిన ఫలసిద్ధి. "....ఆకలి, ఆకలి, పట్నుదల, పగ, దొంగతనం, హింస, బలమైనవాళ్లు, బలహీనులు, కృతఘ్నత, చేతకానితనం, విశ్వాసం గల కుక్కలు, విశ్వాసంలేని విషజీవులు, లోపల అగ్ని, అరచేతిలో స్వర్గం, కష్టంలో సుఖం, సుఖంలో కష్టం. ఎన్నో పదజాలాలు చేరిస్తే పేరడాక్సులు. సాహిత్యంలో విలువైనవి. జీవితంలో ప్రతినిత్యం అంతా నిద్దరోతుంది. తిరిగి లేచేవరకూ. పశ్చాత్తాపంలేని జీవులు. ఇందులో—మాదిగ లింగడు." ఈ ముగింపు బాగానే ఉంది.—ఏమంటే పైన యిచ్చిన జాబితాలో అక్కరాలా ఒక్కొక్కటీ లింగడి మనస్సు ద్వారా నవలలో పాఠకునికి అనుభూతం చెయ్యబడినవే ! కానీ, యింతాచేసి, మధ్య రచయిత జోక్యం ఎందుకు ? "ఎన్నో పదజాలాలు చేరిస్తే పేరడాక్సులు. సాహిత్యంలో విలువైనవి" అన్న రచయిత మాటల్నీ "పశ్చాత్తాపం లేని జీవులు" అన్న రచయిత వ్యాఖ్యానాన్నీ తీసివేస్తే ఆ ముగింపు మరీ చక్కగా ఉండేది. ఇలా ఒక్కచోటే కాదు, ఈ పొరపాటు ఈ గ్రంథంలో అక్కడక్కడా చాలచోట్ల జరిగింది. గ్రంథం ఎత్తుగడలో మొదట పిచ్చమ్మనీ, కూలిపనిపిల్ల వెంకమ్మనీ ప్రవేశపెట్టటం, పెట్టినా, వెంకమ్మను గూర్చిన సుదీర్ఘమైన చరిత్ర కథనం చాలవరకు అనవసరమే. ఆ యిద్దరిమీదా లింగడి వ్యక్తిత్వ ప్రభావం చూపించటమే రచయిత ఉద్దేశమైతే, అది లింగడి ఏకపాత్ర ప్రాధాన్యతకే భంగం కలిగించేటంత మేర సాగటం, శిల్పం దృష్ట్యా లోపమే. కావ్యం ఏకాగ్రతని అది చెడగొట్టుతోంది. అలాగే కొన్నిచోట్ల లింగడి మనస్సుకూ ఊహకూ సంబంధంలేని రచయిత వ్యాఖ్యానాలూ, భావాలూ, పానకంలో పుడకల్లా ఉన్నాయి.

లింగడి పాత్రను సహజంగా సంపూర్ణంగా చిత్రించటం, వాడిని జీవితానికి ప్రతీక చెయ్యటం ఒక విజయం— కాని హెమింగ్వే పొందిన ఫలసిద్ధి పొందటం పేయిటా మొత్తం చిత్రణమీద ఒక ధ్వని రూపమైన సౌందర్య స్ఫురణ కావాలి ఉండాలి. ఆ ధ్వని సౌందర్యం సాధించలేకపోయినందువల్లే నాగరాజుగారి విశేష ప్రయత్నం కావ్య గౌరవాన్ని పొందలేకపోతోంది. శైలి విషయంలోనూ, సర్వత్రా హెమింగ్వే శైలిలాంటూరు పై మెరుగులు సాధించలేకపోవటం ఒక్కొక్క చోట హాస్యాస్పదంగా తయారైంది. భావను అనవసరంగా ముక్కలూ, చెక్కలూ చేస్తూ, (అవసరమైనప్పుడు చేసినా ఫరవాలేదు) ఉద్దేశ్యపూర్వకంగా వాక్యాలముక్కలు యీ పట్టుదల గ్రంథం మొదట్లోనే కనిపిస్తూ ఉంది. తర్వాత, తర్వాత వస్తువుమీద దృష్టితో వ్రాయడంవల్ల శైలి సహజంగా ఉండి యీ లోపం కనిపించటంలేదు. ఈ నవలకు కూర్చబడిన "పరిచయం" క్రొత్త రచనా విధానాన్ని వ్యాఖ్యానించబోయి లేనిపోని అపోహల్ని కలిగించేదిగా ఉండటంవల్ల తృప్తికరంగా లేదు.

—ఆర్. ఎస్.

## నవవిధ భక్తులు

రచయిత : శ్రీరామ శరణ్, కుందుర్తి వెంకట నరసయ్యగారు. మూల్యము రు. 2.50. ప్రకాశకులు : శ్రీరామ శరణ్ మందిరము, బుద్ధాం, నామ ప్రయాగ, (వయా) చందోలు, గుంటూరు జిల్లా.

"శ్రవణం—కీర్తనం, విష్ణోః స్మరణం, పాదసేవనమ్
అర్చనం, వందనం, దాస్యం—సఖ్య మాత్మ నివేదనమ్"

అనే నవవిధ భక్తులను కూలంకషంగా చర్చించి నిరూపించిన గ్రంథమిది. త్యాగయ్య, పోతన, తుకారాం, క్షేత్రయ్య వంటి భక్తవతంసుల కీర్తనలలోను, ప్రబంధాలలోను, భక్త్యావేశమును చూపిస్తారు. ముక్తిప్రాప్తిలోగల సాధనాలను నిరూపిస్తారు. శ్రీ వేంకట నరసయ్యగారు తమ గ్రంథంలో పురాణములు, ఉపనిషత్తులు, కీర్తనలు, మున్నగు వాటిలో నుండి యుపపత్తులను చూపుచు భక్తి పద్ధతులను నిరూపిస్తారు. త్రిమతాచార్యులలో జ్ఞాన పూర్వక భక్తికి ప్రాధాన్య మియ్యడంలో శంకరులు, మధ్వాచార్యుల వారే పురోగమిస్తారు. శ్రీ రామానుజాచార్యుల వారు భక్త్యంగభూత విధానములలో "త్వమేవ శరణం మమ" అనే దాన్ని బలపరుస్తూ, "ప్రపత్తి"నే అత్యుత్తమ ముక్తి సాధనగా నిరూపిస్తారు. "దేహి" చేసే ప్రతి పనియు భగవదర్పణే అనే

విధంగా సాగే ఈ భక్తి మూడు వంతులు తగ్గిస్తే హాస్యాస్పదంగా నేడు పరిగణింపబడుతోంది. దానికి కారణం మొదట్లో వున్న "అనుష్ఠాన వైఖరి" పూర్తిగా తగ్గి ఆడంబరం కావడమే. అందుకే నవవిధ భక్తిక్రమము ఆవశ్య మాచరణీయమను దృక్పథము శ్రీ వేంకట నరసయ్యగారి గ్రంథంలో ప్రతిఫలిస్తుంది. శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత గ్రంథంగా స్థూల దృష్టికి గోచరించినా "సర్వమత సాధ్యం"గా భక్తి విధానం విశదీకరింపబడింది. ఈ గ్రంథాన్ని గురించి విడిగా చెప్పడం చంద్రుని కోనూలు పోగువంటిది. భక్తిసాధనలో ఎట్టి సంశయములున్నా, ఆ సంశయాల నన్నిటినీ తొలగించి ఆస్తిక్యాన్ని చేకూరుస్తుందీ గ్రంథం. అచ్చు తప్పులు చాల తక్కువ. "అమర్యాదః క్షుద్రః చలమతిః, అసూయా ప్రసవభూః' అనే తత్త్వంలో సాగిన వైష్ణవ వైచ్యాను సంధానం మరింత వివరిస్తే బాగుండేది. అందరు చదువదగిన గ్రంథం. ఎంతో ఆవశ్యకమైనది.

—ఎన్. టి. సి. వి. రామానుజాచార్యులు.

## ఆనందభిక్షువు

పద్య కావ్యము. కవి: వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావుగారు. ప్రచురణ: విశ్వర్షి గ్రంథమాల, చేబ్రోలు, గుంటూరు జిల్లా. మూల్యము: 2 రూపాయలు.

ఇది ఏడా శ్వాసముల కావ్యము. శ్రావస్తి నగరమునందు బుద్ధభగవాను డుండిన నాటి కథ. దాహముగొన్న ఆనంద భిక్షుకునికి నీరిచ్చి, పంచమ కన్య ప్రకృతి అతనిని మోహించినది. ఆమె తల్లి మాంత్రికురాలు. కూతురు మనోభీష్టమును, అనునయమువల్ల వారించలేక మంత్రశక్తితో ఆనందుని ఆకర్షించి, కూతురు దగ్గరకు లాగి తెచ్చినది. గాలివాటుకు ఎండుటాకువలె ఆనందుడు మంత్రశక్తికి లొంగి వచ్చి పడినాడు. అయితే ప్రకృతిని నా డాకర్షించిన ముఖదీప్తీ, శరీరప్రభా ఈనాడు లేవు. ఈతనిని లాగి తెచ్చుటతో ఖర్చయిపోయిన మంత్రశక్తి జ్వాలయై మాంత్రికురాలిని కబళించినది. మాతంగికి జ్ఞానోదయమైనది. పాతాళమందున్న ప్రకృతిని పైకి లాగుటకు తల్లి శక్తీ, మునివర్యు ఆత్మశక్తీ కళవళపడ్డాయి. అది ఖర్చైపోయినది. ఇది బాధపడి పడక విలిచినది. ఇదీ కథ.

కవిగారికి ధారాశుద్ధిగల వాక్కు కలదు. కొత్త అందమును చూచి పట్టగల సౌందర్య దృష్టి కలదు. చక్కని పాండిత్యము కలదు. వీరి పద్ధతి, వర్ణనా సౌందర్యాన్ని మెరపించే ప్రాచీనకవులపద్ధతే. అయితే వర్ణనలు కొత్తవి. బౌద్ధ సంప్రదాయాభిమానమూ, హిమవంతుని చల్లని ఎత్తూ వీరి ప్రకృతిని పట్టిలాగినవి. అన్వయవక్రత లేక, కాలిబాటవలె మలుపు పిలుపులతో సాగిపోయే వీరి రచన నిసర్గ సుందరము, ఈనాటి రచనలలో విచిత్రము. రచనా పాటవంతోకాక, కథా సౌందర్యముతో చదువరులను లాగే కావ్యము వీరు రచిస్తే చదవాలని ఉన్నది నాకు.

—శ్రీపాద గోపాలకృష్ణమూర్తి.

## నాట్యశాల

(రచన: శ్రీనివాస చక్రవర్తి. ప్రచురణ. జయంతి పబ్లికేషన్సు, విజయవాడ 2. (ద్వితీయ ముద్రణ—1963) శారదా ప్రెస్ ముద్రణ. వెల: 1.50. పుస్తక పరిమాణము: 103 పుటలు.

ఈ గ్రంథము విన్నదైనను ఇందు ఆవిష్కరించి, కధను మొనర్చిన వస్తువు పురాతన మైనది; అధునిక మైనది—నాట్యకళ. కాని, రచన వేరువేరు వ్యాసములుగా వ్రాసి గ్రంథ ప్రచురణకై ఏకసూత్రమున సంధింపబడినది. అందుచే రచనా (Organism) పునరుక్త విషయములతో నుండుట, చెప్పదగిన విషయములు లేకుండుట సిద్ధించినది. వ్యాసములను పేర్చుట కూడ తారుమారుగా నున్నది.

'నాట్యశాల' యందు జరుగు కార్యకలాప మేమన :—

తత్ర వృక్షస్థానీయం కావ్యం, తత్ర పుష్పాదిస్థానీ
యోఽభినయాది వ్యాపారః, తత్ర ఫలస్థానీయః
సామాజిక రసాస్వాదః.

దృశ్యకావ్య మొకదానిని కవి రచించును. ఇది చెట్టు. ఆ రూపకమును నటీనటులు అభినయాది వివిధ భంగులతో నటింతురు. ఇవి ఆ చెట్టు ఫలములు. వాటిని ఆరగించి సహృదయులు రసానందభరితు లగుదురు. ప్రేక్షకులుండు కక్ష్యయు నాట్యశాలయందలి భాగము. ఈ పాత్రమున ఆర్య మిత్రుల గూర్చి వ్యాస మొక్కటి యుండి తీరవలెను. ఇందు చెప్పినవి నటులకు హెచ్చరికగా ఉపయోగించును. కాని, మన కాలమున కావలసిన హెచ్చరిక సామాజికులకు. వారు కావలెనన్ననే నాటక ప్రయోగము జరుగును.

రచయితకు దోహద మొసంగిన గ్రంథముల పట్టి ఇచ్చియుండిన ఈ నాట్యకళపై పరిశోధన సలుపువారికి ఉపయోగముగ నుండెడిది.

వీరు నాట్యకళను గూర్చి బహుముఖ పాండిత్య మార్జించినవారే. అట్టి విద్యాసంపన్నులు మన భారతీయ రూపక నిర్మాణ సాంప్రదాయమును గూర్చియు గ్రంథ మొక్కటి వ్రాయుదురుగాక!

—కృష్ణశ్రీ

## శ్రీతత్త్వము

కృతికర్త: మర్రిపాటి వెంకట నరసింహారావు. ఇది శ్రీ విద్యా సంప్రదాయమును గూర్చి తెలుపు వచన గ్రంథము. ఇందు పీఠిక 45 పుటలలో, 40 పుటలలో యందు శ్రీతత్త్వ స్వరూప నిరూపణ గావింపబడినది. శ్రుతుల నుండి, యుపనిషత్తుల నుండి ప్రమాణ వాక్యము లుదాహరింపబడినవి. ఈ వాక్యములు సస్వరముగా ముద్రింపబడి యుండుట విశేషము. ఆ వెనుక గ్రంథకర్త గురువులు శ్రీ శ్రియానంద నాథాపర నామధేయులగు ఈశ్వర సత్యనారాయణ శర్మగారి జీవిత విశేషములు గ్రంథరచనలు గలవు. ఆ వెనుక కృతి

కర్త స్వవిషయము మున్నది. ఈతడు మైసూరు రాష్ట్రాంతర్గత షిమోగా మండలమున షరావతీ ప్రాజెక్టులో నొక ఇంజనీరింగు కంట్రాక్టు సంస్థయందుండి, యీ గ్రంథము రచించెను. వేదము, యోగవిద్య గురు ముఖముగ నభ్యసించి నట్లు తెలియుచున్నది.

నూట యెబ్బదియేడు పుటల దరావళి గ్రంథభాగమున (1) మణిద్వీపయాత్ర—ఒక మధుర స్వప్నము, శ్రీ శ్రియానందనాథ గురువేనమః అను రెండు శీర్షికలు. (2) షడశీ నామకథా (3) మహేశ్వర రూప మెట్టిది. (4) శ్రీమాత గాయత్రీమాత. (5) షోడశాక్షరీ మంత్ర స్వరూపము అను శీర్షికలు గలవు. శ్రీ విద్యోపాసకులందఱు పఠింపదగినది. ప్రతులకు : సాధన గ్రంథమండలి, తెనాలి—వెల: 2.00.

## జగద్గురు బోధలు

ప్రథమ సంపుటము—రచన : విశాఖ. గ్రంథ పరిశోధకులు : శతావధాని, (ఎం. వి. బి. ఎస్. శర్మ), వేలూరి శివరామశాస్త్రి. ఇందు శ్రీ కంచి కామకోటి జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శంకరాచార్య స్వామి వారొనరించిన బోధనలు గ్రంథరూపమున ముద్రితములైనవి. శ్రీ జగద్గురువుల బోధనలీ వఱకు ''ఆంధ్రప్రభ'' లో క్రమముగా వెలువడినవి. అవియే యీ గ్రంథమున సంతరింపబడినవి. ఇందు (1) జగన్మాత—జగత్పిత, (2) అద్వైత సిద్ధాంతము, (3) భక్తికర్మ, (4) సల్లనయ్య, (5) చెఱుకువిల్లు పూవుటమ్ము, (6) వినాయకుడు. (7) భయమెందుకు, (8) ఉపనిషత్తులలో ఉమాదేవి, (9) రత్నత్రయము, (10) వేదము—ధర్మము (11) వేదాంతము, (12) ఆనంద తాండవమూర్తి, (13) దక్షిణామూర్తి, (14) అష్టమహాల, (15) శివుడవో మాధవుడవో (16) లోపల—వెలుపల, (17) గీతోపదేశము, (18) ద్వైత తత్త్వము. (19) భక్తి, (20) అపరిగ్రహం, (21) ఏది మోక్షము, (22) అద్వైత దర్శనము— అను శీర్షికలు గలవు. వీనిని బట్టి గ్రంథ ప్రాశస్త్యము తెలియనగును. పుటలు: 232. వెల : 2.50. ప్రాప్తిస్థానము : సాధన గ్రంథ మండలి, తెనాలి.

## పంచాయత్ శుభోదయ సంచిక

ఈ పంచాయత్ శుభోదయ సంచిక రాష్ట్ర పంచాయతీ రాజ్ పరిషత్ అధికార పత్రిక మాసపత్రిక యొక్క నవంబరు నెల సంచిక. (సం. 2. సం. 2) 96 పుటలలో నున్న యీ సంచికయందు, పంచాయత్‌రాజ్ పరిషత్తుకు సంబంధించిన రాజకీయ, సాంఘిక, ఆర్థిక, విద్యా, ఉత్పత్తి సాధనాది సకల విషయములను గూర్చిన 42 గద్య పద్య శీర్షిక లున్నవి. పంచాయతీరాజ్ మంత్రి శ్రీ చెన్నారెడ్డిగారి లేఖతో ప్రారంభము. మాసవారి పంచాంగముతో ముగింపు.

ఇది ప్రతి నెల రాష్ట్ర పంచాయత్‌రాజ్ తరఫున టి. వి. రత్నాకరరావుగారిచే ప్రకటిత మగుచున్నది. ముఖ్య సంపాదకులు : జె. రఘోత్తమరెడ్డిగారు. వెల : 0.50 న. పై. పత్రిక కావలసినవారు : రాష్ట్ర పంచాయతీరాజ్ పరిషత్తు, బషీర్‌బాగ్, హైదరాబాద్—27.

## ఉషః కన్య

రచయిత : శ్రీ ధన్వంతరి రఘూత్తమాచార్య. ఇది ఇంగ్లీషు భాషలో యవ్. డబ్ల్యు బెయిన్ వ్రాసిన ''హెఫర్ ఆఫ్ ది డాన్'' అను గ్రంథమునకు వచనాంధ్రానువాదము. ఉష స్సంబంధమైన ప్రాచీన ప్రణయగాథ. శైలి గ్రాంథికము. పుటలు : 68. వెల: రూపాయి: ప్రాప్తిస్థానము. కమలా ప్రకాశన మందిరమ్, 40/2 గిరిమ్‌పేట, చిత్తూరు.

## కేశవ ప్రపత్తి

రచయిత : శ్రీ కుంటిమద్ది శేషశర్మ. పద్యకృతి. విశిష్టాద్వైతమత సంప్రదాయానుసారముగ, అకించన్యము, పంచ సంస్కారములు, వ్యూహ స్వరూపము, ప్రపన్నము మున్నగు నిరువదియారు విషయము లిందు గలవు. 'కేశవాయనమః మకుటముతో 108 పద్యము లున్నవి. శైలి ధారాళము. మలభము. 32 పుటలు. వెల: 75 న. పై. ప్రాప్తిస్థానము: కె. సదానంద, మెడికల్‌హాల్, ధర్మవరము, అనంతపురముజిల్లా.

## వర్ణోచ్చారణ శిక్ష

పాణినిముని ప్రణీతమగు నీ గ్రంథమునకు శ్రీ స్వామి దయానంద స్వరస్వతీ విరచిత వ్యాఖ్య గలదు. దానిని తెలుగున శ్రీ కేశవార్యశాస్త్రిగారు వ్యాఖ్యన పూర్వకముగ ప్రకటించిరి. సంస్కృత భాషా భ్యాసకుల కుపయుక్తము. పుటలు : 20. వెల: 20 న. పై. ప్రతులకు: శ్రీ మద్దయానంద వేదానుసంధాన సదనము, నారాయణగూడ, హైదరాబాదు.

## క్షయాధిమాస నిర్ణయానుబంధము

శ్రీ పిడుపర్తి చిన కృష్ణమూర్తిశాస్త్రి, భాషా ప్రవీణ సుబ్రహ్మణ్యశాస్త్రిగార్లచే రచితము. ఇది జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన చర్చ గల గ్రంథము. అధిక మాసము వచ్చినపుడు, రెండు మాసములయందును కర్మ కలాపము జరిగింపవలెనా లేదా అను విషయ మిందు చర్చితమై, అధిక మాసమువ కూడా క్షయ మాసమునందు వలెనే జరుపవలెనని నిర్ణయింపబడినది. పుటలు 21. వెలలేదు. పలయువారు : పిడుపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి, తెలుగు పండిట్, జిల్లా పరిషత్ హైస్కూల్. ర్యాలి, తూ. గో. జిల్లా

## చైనా దురాక్రమణ

రచయిత: శ్రీ నూతక్కి రాఘవేంద్రరావు. ఇది అత్యవసర పరిస్థితులను కలిగించిన చైనా దురాక్రమణమును గూర్చిన బుర్రకథ. కథానంతరం, వీరి రస ప్రబోధక గేయా లున్నవి. పుటలు: 41. వెల: 50 న. పై. ప్రతులకు: గ్రంథకర్త, శ్రీ సాంబశివా టింబర్ డిపో, మారీస్‌పేట పోస్టు, తెనాలి, గుంటూరు జిల్లా.

## వి జ్ఞా ని

ఇది యొక పత్రిక. డి. లక్ష్మారెడ్డి, కె. వెంకటరావు' విలియం శర్మ సంపాదక వర్గము. పుటలు: 20. సంపాద కీయమున్నదిగాని, సంపుట సంచికలులేవు. పద్యములు, చిన్న కథ ఉన్నవి. వలసినవారు: విజ్ఞాన సమితి, పెదవంగర, జన గావ్, వరంగల్ జిల్లా.

## గే య వా హి ని

కన్నెకంటి రాజమల్లాచార్యులు రచించిన గేయముం సంపుటి. గేయము లతి వాస్తవిక కవితాధోరణి ననుసరించి నవి. కృతికర్త తొలి ప్రయత్నం. పుటలు : 42. వెల : 50 న. పై. ప్రతులకు : మిత్రమండలి కార్యాలయం, షేక్ అల్లాబక్షు, న్యూస్ యేజెంటు, పార్కురోడ్డు, మాచర్ల, గుంటూరుజిల్లా.

## వీ ర బ్ర హ్మ మా !

రచయిత ఫణిదెపు ప్రభాకరశర్మ. ప్రసిద్ధ తత్త్వవేత్త యగు పోతులూరి వీరబ్రహ్మముగారిని గూర్చిన శతకము. 'వీర బ్రహ్మమా' అని 'బ్రహ్మమా' అని, 'శ్రీ' వీరబ్రహ్మ అని వివిధ మకుటము లున్నవి. పద్యశైలి సులభము, ధారాళము. పుటలు: 26. వెల : 50 న. పై. ప్రాప్తిస్థానము : రచయిత, శీలేరు ప్రోజక్టు, విశాఖపట్నంజిల్లా.

## దీనబంధు ఠక్కరుబాపా జీవితము

కృతికర్త చోళ్లవిష్ణు. నవీన భారత వర్షమున హరిజన గిరి జనోద్ధరణకై అపూర్వమైన సేవ చేసిన దీనబంధు ఠక్కరుబాపా (1869—1950) పవిత్ర జీవితమీ గ్రంథమున 122 పుట లలో, 20 శీర్షికలలో కన్నులకు గట్టినట్లు వర్ణితమైనది. "మానవసేవయే మాధవ సేవ" అను బాపా జీవిత సూత్ర మునకీ గ్రంథము వ్యాఖ్యానము. రచన సుగమము. వెల : రు. 1.25. ప్రతులకు : సి. హెచ్. విష్ణు, హరిజన నివాస్, కింగ్సువే. న్యూఢిల్లీ—9.

## శ్రీ తల్లాప్రగడ నారాయణమూర్తి

షష్ఠి పూర్తి సన్మాన సంచిక. హరిజన బంధువు, రాజ కీయ, సాంఘికసేవా పరాయణుడు, త్యాగశీలి అయిన తల్లా ప్రగడ నారాయణమూర్తిగారి 60 వ జన్మదిన పూర్తి సమయ మున, ప్రముఖులు, మిత్రులు, శిష్యులు సమర్పించిన అభి నందన సంపుటము. వారి జీవిత విశేషములు, దేశసేవ పూర్తిగ నిందు తెలుపబడినవి. పుటలు : 122. వెల : తెలియదు. ప్రతులకు: గ్రామిక విద్యాకేంద్రం. పెరవలి, తణుకు తాలూకా, ప. గోదావరిజిల్లా.

## క ల్ప వ ల్లి

కృత్తివెంటి వెంకటేశ్వరరావు. కల్పవల్లి అను పేరుతో కృతికర్త రచించిన గ్రంథములోనిది రెండవ భాగము. నట సామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావునకు అంకితము. ఇదివఱకు రచితములై పత్రికలలో ప్రకటితములైన 22 శీర్షికలతో పద్యము లున్నవి. అవి ఆంధ్రభారతవర్ష చరిత్రకు సంబంధించి నవి. పుటలు : 62. వెల : రు. 1.50. ప్రతులకు వెంకటే శ్వర గ్రంథమాల, గుడివాడ.

## భగవన్నామ ప్రభావము

కర్త : శ్రీరామశరణ్ కుందుర్తి వెంకటనరసయ్య. ఈ వచన గ్రంథమున 47 పుటలలో, 20 శీర్షికలలో ఆదిని, వేద ఋషుల కాలమునుండి, అద్యతన కాలంలో రమణమహర్షి వఱకు రామనామముయొక్క మహాత్మ్యమును తెలుపు వాక్య ములు గలవు. చివర సంకీర్తన ప్రధానము నివరింపబడి యున్నది. వెల : 40 న. పై. ప్రాప్తి స్థానము : శ్రీరామ శరణమందిరము, నామప్రయాగ, బుద్ధాం—యాజలిపోస్టు, గుంటూరుజిల్లా.

## శ్రీ గోదా సూక్తిమాల

శ్రావ్యకవితా విశారద శ్రీమాన్ మాడభూషి గోపాలా చార్యులుగారు రచించినది. వైష్ణవ వాఙ్మయమున బహు ప్రచారముగల 'ఆండాళ్' పాయించిన తిరునాయిమొళి అను 14 దశకములు గల ద్రవిడ గ్రంథమునకు నాంధ్ర పద్యానువాద మిది. పుటలు : 62. వెల : 1.50. ప్రాప్తిస్థానము : శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణపురము, ఒల్లిపాలెము పోస్టు, దివి తాలూకా (కృష్ణా).

## శ్రీ వీరభద్ర సుప్రభాతము

రచయిత : కె. వి. అప్పలాచార్యులు. బి. ఒ. ఎల్. ఆంధ్ర రాష్ట్రమున హైదరాబాదునకు 25 మైళ్ల దూరమున నున్న "బొంతపల్లి" వీరభద్రుని గూర్చి సుప్రభాతము, విజ యము, మంగళము—అను శీర్షికలతో 54 శ్లోకములు గల లఘుకృతి—వేంకటేశ్వర సుప్రభాతము వలె "శ్రీ వీరభద్ర విజయీాన్తవ సుప్రభాతమ్" అను మకుటము గలది. పుటలు: 23. వెలలేదు. ప్రతులకు: కాలయాపన కార్యాలయము, గుమ్మిడిదల పోస్టు, మెదకుజిల్లా.

## బా ల నా టి క లు

రచయితలు : 1. కవుల ఆంజనేయశర్మ, 2. పిళ్లా అప్పారావు, 3. సుంకర భాస్కరరావు. బాలబాలికలకై మూడు నాటికలు. బాలసాహిత్యానికి సంబంధించినవి. పుటలు : 29. వెల : 50 న. పై. ప్రతులకు : రామా బాలానంద సంఘము, (రిజిష్టర్డు) శాఖవీధి, అనకాపల్లి, విశాఖజిల్లా.

# లేఖలు

# ఆంధ్ర నాటక సమీక్ష

భారతి సంపాదకులకు:

ఆర్యా !

''నేను ఒక పాఠకుణ్ణి ! సాహిత్యాభిమానిని. శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారి వలె ప్రత్యేకంగా నాటకాలమీద, నాటక సాహిత్యముమీద కృషిచేసినవాణ్ణి గాని, శ్రీ శ్రీవాత్సవ గారి వలె వ్యాస కర్తని—ప్రత్యేకించి విమర్శక వ్యాసకర్తనిగాని కాదు. కేవలం ఒక పాఠకుణ్ణి !

పాఠకుడిలాగే శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారి ఆంధ్ర నాటక సమీక్ష, నాటక పోటీలు, నట శిక్షణ, నాటక దర్శిని వంటి గ్రంథాలు చదివాను. అలాగే నవంబరు నెల భారతిని చదివాను. భారతి వంటి ఉత్తమ సాహిత్య పత్రికలో (98 వ పేజీలో) శ్రీ వాత్సవగారి ''గ్రంథ విమర్శనము'' చదివిన తరువాత ఒకటి రెండు విషయాలు వ్రాయవలసి వచ్చింది.

ముఖ్యంగా శ్రీ శ్రీవాత్సవగారు ''ఆంధ్ర నాటక సమీక్ష'' విమర్శిస్తూ చివరి రెండు మూడు వాక్యాల్లో ''ఇదొక క్యాటలాగు వలె ఉన్నది. కాని, సమగ్ర నాటక సాహిత్య సమీక్షగా లేదు'' అన్నారు. దీన్ని గురించి తరువాత ముచ్చటిస్తాను. ముందు వా రన్న వాక్యం ఒకటి చూద్దాం. ''కీర్తిశేషులు'' ''చిల్లర కొట్టు చిట్టెమ్మ'' ''నాలుగిళ్ల చావిడి'' వంటి నాటకాల ప్రస్తావనే లేదు, అన్నారు వారు. కాని ''ఆంధ్ర నాటక సమీక్ష'' పుస్తకం 10 వ పేజీ మొదటి పేరాలో యిలా ఉంది:

''పూజించవలసిన కవి బ్రతికుండగా ఛీకొట్టి అతనింక బ్రతకడని తెలియగానే అతని మృత్యువును ఆధారం చేసుకొని కీర్తి ప్రతిష్ఠలు గడించాలని చూసే నీచబుద్ధులను నేటి కవి అనుభవించే దుర్భర జీవితాన్ని భమిడిపాటి రాధాకృష్ణ (రామ కృష్ణ అని అచ్చు తప్పు వేశారు) ''కీర్తిశేషులు'' నాటకంలో దుయ్యబట్టారు.''

రామకృష్ణ అని వేశారు గనుక చూడటంలో గమనించ లేదా శ్రీ వాత్సవగా రనటానికి 'కీర్తిశేషులు' అని ఉన్నది కదా ! ఇక 'చిల్లరకొట్టు చిట్టెమ్మ' గురించి ఆంధ్ర నాటక సమీక్ష 106 వ పేజీలో యిలా ఉంది :

''సరికొత్త పాత్రలతో గ్రామీణ జీవితంలోని ఒక భాగాన్ని చిత్రిస్తూ దాసరి గోపాలకృష్ణ రచించిన నాటకం 'చిల్లరకొట్టు చిట్టెమ్మ'. ఇందులోని పాత్రలు చిల్లరకొట్టు పెట్టుకొని జీవించే చిట్టెమ్మ, ఇంటింటికీ తిరిగి ఇవి అవీ అమ్ముకునే జీడీల సీతయ్య పువ్వుల పున్నయ్య, బట్టల ఒంగారం, పప్పుల వడ్డిశెట్టి, దత్తుడు సామాన్య వ్యక్తులు. ఈ సామాన్య వ్యక్తులతో ప్రతి గ్రామంలో నిత్యము జరిగే సంఘటనలతో ఈ నాటకం విరాజిల్లు తోంది. చిట్టెమ్మ అమాయకత్వాన్ని, కలుపుకోలుతనాన్ని ఆధారం చేసుకొని ఆమెను వశం చేసుకోవాలని వీరంతా యత్నించి తుదకు ఆమె మరణానికి కారకు లవుతారు. గ్రామీణ జీవితంలోని ఈ భాగం మన కన్నులకు కట్టేటట్టు నేర్పుగా గోపాలకృష్ణ రచించారు.''

ఇక మూడోది నాలుగిళ్ల చావిడి :

దీన్ని గురించి శ్రీ చక్రవర్తిగా రెందుకు చేయలేదో నేను చెప్పలేను గాని 107 వ పేజీలో ఉన్న ''1950–62, మధ్యకాలంలో వచ్చిన నాటకాల ఇతివృత్తాలలో ఉన్నంత వైవిధ్యం ఇంకే దశాబ్దంలోను కనుపించదు.' అని ''ఇక శిల్పం....'' అన టంతో వారు సరిగా 1962 వరకే సమీక్షించటానికి పూను కున్నారు అనే అర్థం లేదుగాని అలాచేసి ఉండవచ్చు అనిపిస్తుంది. ఎందుచేతనంటే 1963 లో వచ్చిన నాటకాల ప్రస్తావనే లేదు ఇందులో. ''నాలుగిళ్ల చావిడి'' శ్రీ రావి కొండలరావుగారు ఎప్పుడు వ్రాశారో ఏమో గాని అది 1963 హైదరాబాదులో జరిగిన ఆంధ్ర నాటక కళాపరిషత్తులో ప్రదర్శింపబడి తరు వాత మదరాసు నుంచి ప్రసారమైంది కూడ. అయితే పుస్త కంగా ఇప్పటికీ వెలువడినట్లు లేదు.

శ్రీ వాత్సవగారు ఒకసారి కూడ చదవకుండా విమర్శిం చారనే సాహసానికి నేను పూనుకోను. కాని ఎవరూ ఏక సంథ గ్రాహి కారుకదా ! మామూలుగా చదువుకోనేందుకు ఒకసారి చదివినా ఫరవాలేదు. కాని, ఒక గ్రంథాన్ని సమీక్షిస్తూ ఉన్నప్పుడు దాన్ని మరొకసారి చదవటం అనుచితంకాదు. పైగా అవసరమేమో ! అయితే పైలాగా వ్రాయటానికి ఎన్నిసార్లు చదివా రనుకోవాలి అనేది ప్రశ్న ?

శ్రీ శ్రీవాత్సవగారి సమీక్షలోని మరొక వాక్యం : ''అందు చేత ప్రాతకాలంలోనివే కాక ఇటీవల వచ్చిన నాటకాల ప్రసక్తి కూడ దీనిలో లేదు.'' అన్నారు. అయితే ఒక విషయం మనవి చెయ్యవలసి ఉంది. శ్రీ వాత్సవగారు పేరెన్నికగన్న విమర్శ కులు. వారు (పొరపాటునే కానివ్వచ్చును) ఇలాటి నాటకాల ప్రస్తావనే లేదని ఏ ఒకటి రెండు నాటకాల పేర్లు అదృష్ట వశాత్తు ఉదహరించారో, అవి అందులో ఉండటం ఆ పుస్త కాని కొక గీటురాయి. శ్రీ వాత్సవగారు ఏవైతే ఉదహరింప వలసి ఉన్న వన్నారో అవి ఉన్నై. కాకపోతే లేవని స్పష్టంగా వా రవేశారు. ఇక వాటి ప్రస్తావన ఉన్న విషయం గమనిస్తే శ్రీవారి పై వాక్యానికి అర్థంలేకుండా పోవటమే కాదు వారి విమర్శే మరో రకంగా ఉండాల్సి వస్తుందేమో !

మరో విషయం : ''ఇదొక క్యాటలాగువలె ఉన్నది. కాని సమగ్ర సాహిత్య సమీక్షగా లేదు'' అని. ఇందులోని మొదటి వాక్యాన్ని గురించి ముందు చూద్దాం. పైన నేను శ్రీ చక్ర వర్తిగారి సమీక్షలోని రెండు నాటకాల గురించి యథా తథంగా ఉదహరించాను. 108 పేజీల గ్రంథంలో సముచిత స్థానం ఇవ్వతగిన వాటికి ఇవ్వ తగినంతగా ఇవ్వకపోతే పైన

వ్రాసినంత సుదీర్ఘంగా ఎందుకుంది? శ్యాటలాగుల్లో ఇతివృత్తాన్ని గురించి గానీ, గ్రంథాన్ని గురించి గాని చెబుతారు నిజమే! కాని, పై పేరాల్లో వ్రాసిన విషయాలు అలానే ఉన్నాయా?

కాగా 108 పేజీల ఒక గ్రంథాన్ని చదివి విమర్శ వ్రాయవలసి వచ్చినప్పుడే ఈ విమర్శలో "మయసభ" (ఉన్నవి లేనట్లుగా) ఏర్పాటవుతూంటే 'ఆంధ్ర నాటక సమీక్ష" లో (కేవలం 108 పేజీల గ్రంథంలో) ప్రత్యేకంగా గ్రంథ కర్తలు దిఙ్మాత్రంగా సమీక్షించ దలచుకొన్నప్పుడు శ్రీ వాత్సవ గారు వ్రాసినట్లు "సమగ్ర నాటక సాహిత్య సమీక్ష"గా లేదనటంలో అర్థంలేదు.

కాకపోతే సమగ్ర నాటక సమీక్ష బహుశా 108 పేజీ లది కాక 1008 పేజీలది శ్రీ చక్రవర్తిగారు వ్రాయాలని శ్రీ శ్రీవాత్సవగారి "ఆకాంక్ష" ఏమో! అలా అని ఎందు కనుకోవలసి వచ్చిందంటే "ఆ ప్రగతిలో ప్రబలిన వివిధ ధోరణులను, ఆ ధోరణుల అవతరణకు కారణాలయిన పరిస్థితు లను, ఆ ధోరణుల ప్రాతినిధ్యం వహించే నాటకాలను, ఇతి వృత్తాలను, రచనా విధానాలను దిఙ్మాత్రంగా సమీక్షించి పాఠ కులకు పరిచయం చేయుట నా లక్ష్యం" అన్న గ్రంథకర్త వాక్యాలు వారి దృష్టిపథంలోనే వున్నాయి. (ఈ వాక్యాల్ని శ్రీ వాత్సవగారు వారి విమర్శలోనే ఉదహరించారు.) ఆ వాక్యాన్ని ఉదహరించిన్నీ సమగ్రంగా లేదు అంటే అలా వ్రాయాలని వారి ఆకాంక్ష అయిఉంటుందనేగా అనుకోవాల్సింది?

ఆంధ్ర నాటక సమీక్షలోని గుణ విశేషాలను గాని, శ్రీశ్రీ వాత్సవగారి సమీక్షా దక్షతను గురించిగాని వ్రాయటానికి ఉద్దేశించిన వ్యాసం కానే కాదిది. ఇది కేవలం ఒక పాఠకుడిలేఖ.

(విజయవాడ) స్వర్ణ రాజ హనుమంత రావు

## నిడదవోలువారి రోదనసంఖ్య

ఆర్యా,

భారతి (అక్టోబరు 1963) గ్రంథ విమర్శనములో "ఆంధ్ర సాహితీ సార్వభౌముడు" అను గ్రంథమును సమీ క్షించుచు, పూజ్యపాదులు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు 'ఆముక్త మాల్యద ఆరాశ్వాసముల గ్రంథముకాగా వేదమువారు ఏడాశ్వాసములుగా విభజించినట్లు తెలుపుచు శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారిని సమర్థించిరి.

అది యాఱాశ్వాసములదా? ఏడాశ్వాసములు కలదా? అని నిర్ణయించుటకై కొన్ని యుపపత్తులు చూపించిరి. అందులో "ఏ కవియైనా గ్రంథమునకు నాశ్వాసములను రోదన సంఖ్య యగునే డాశ్వాసములుగా వ్రాయడు......" అని వ్రాసిరి.

సప్త సంఖ్య రోదన సంఖ్య యే యైనచో ఋషులలో సప్తర్షులు, సంతానములలో సప్త సంతానములు, సంగీతము లో సప్త స్వరములు, గ్రహములలో సప్త గ్రహములు, సము ద్రములలో సప్త సముద్రము లుండుట ఏడుపు గొట్టులే యగును. ఎవరైనా ఏదైనా ప్రయోజనము నాశించి వీటిని ఏడ్పులోకానికి మార్చిరో యేమో! నిడుదవోలువారు పరిశో ధించి వీటిని ఆరింటికి తగ్గించిన ఆరు స్వరములలోనే సంగీ తము నేర్చుకొనవచ్చును......ప్రపంచములోగల సంఘము లందు సామాన్యముగా అయిదుగురు, ఏడుగురు సభ్యులుండె దరు. ఏదో జన వ్యవహారమున సామెతగా యున్నదిగాని సాహితీ లోకమున దానికి దుష్టస్థానముండినట్లు కనబడదు. అయినను సంఖ్యకు ఆశ్వాస విభజనకు ముడి పెట్టుట అసమర్థనీయము.

విశ్వ విఖ్యాతి నొందిన కవికుల చక్రవర్తి కాళిదాస కృత శాకుంతలమునం దేడంకములు, శ్రీనాథ కవిసార్వభౌముడు ప్రాయ మింతకు మిగుల గైవ్రాలకుండ రచించిన 'కాశీఖండము, న కేడా శ్వాసములే. వీటికి రోదన సంఖ్యచేత కల్గిన లోప మేమి? నిడుదవోలువారు వీటిని గూడా ఆరింటికి కుదించు మంటారా?

రెండవది "ఆముక్త మాల్యద" యందున్నవి ఆరక్షర ములే కావున రాయలవారు ఆఱాశ్వాసములు వ్రాయుట సహే తుకము. సమంజసము. అటులైన "కాశీఖండము"నకు వైదక్ష రములే—దీనిలో శ్రీవారి విమర్శవాదృష్టిచే రెండాశ్వాసములు తగ్గించి తర్వాతి ముద్రణములో ఐదాశ్వాసములుగా ముద్రించ వలయును. పరిశోధకులు, విమర్శకులు, సహృదయులునగు నిడుదవోలువారు గడుసుగా పెడసరపు మాటలచే వేదము వారిని ఖండించుటలోని స్వారస్యము తెలియదు.

సుప్రసిద్ధ సాహిత్య పరిశోధకులు చాగంటి శేషయ్య గారు ఆంధ్ర కవి తరంగిణి సప్తమ సంపుటము (పుట 134) లో కూలంకషముగా చర్చించి "రాయల తరువాత మరియొకరు షష్ఠాశ్వాసమును రెండుగా విభజించుటకు ప్రసక్తిగాని, ప్రయో జనముగాని లేదు. కావున రాయ లీ గ్రంథమును నే డాశ్వాస ములుగా రచించిరని నిర్ణయించి యున్నారు.

ఇంతకు నేను ఆ రాశ్వాసములా? ఏడాశ్వాసములా? అను నిర్ణయము చేయబూనుకొనట్లంలేదు. నిడుదవోలు వారు చూపిన పై రెండుపపత్తులు వాదమునకు నిల్చునవికావనియు, ఇంతటి అల్ప హేతువులచే ఆశ్వాస సంఖ్య నిర్ణయించుట అస మంజసమనియు మనవి. క్షంతవ్యుడను.

జోగిపేట: ఎం. కృష్ణమాచార్యులు.

## ఖే రీ యో గ ము

ఆర్యా,

"లగ్నేశే పరమోచ్చస్థే ధనరాశి సమన్వితే
రాజ్య నాథేన సందృష్టే ఖేరీయోగ ముశంతి తం'

యీ శ్లోకంలో లగ్నాధిపతి ధన స్థానంలో పరమోచ్చలో ఉండాలని ఉంది. ఇది సంభవమా ఏ లగ్నమునకైనా? మరి శ్లోకం తప్పా? తెలిసినవారు వ్రాయకోరుచున్నాను.

(అవనిగడ్డ) కవితా కామేశ్వరశర్మ.



# కీర్తిశేషుడు జాన్ కెనెడీ

గుండ్రని ముఖం. కోటేరువంటి ముక్కు. నీలి రంగు కళ్లు. దువ్వేనకు లొంగని జుట్టు. ముగ్గిన తాటిపండువంటి శరీర ఛాయ. శరీరానికి అంటుకొన్నట్టు ఉండే పామ్‌బీచ్ సూటు. పొడగరి విగ్రహం. కంగునమోగే కంఠస్వరం. అనర్గళమైన వచోధోరణి. మొత్తంమీద ఘటికుడు. గడసరి అని చూడగానే అనిపించే మూర్తి జాన్ ఫిట్జ్‌రాల్డ్ కెనడీది. అమెరికా విదేశాంగ శాఖ కార్యాలయంలో అరగంటసేపు జరిగిన పత్రికా విలేకరుల సమావేశంలో అధ్యక్షుడు శ్రీ కెనడీని గమనిస్తూ వచ్చినప్పుడు కలిగిన భావాలు ఇవి.

ఆయన అభిమానులు కూడా ఆయనను అసాధారణ వ్యక్తిగా వర్ణించరు. ఆయన అలగ్జాండరుకాదు. నెపోలియన్ కాదు. చర్చిల్ కాదు. చివరకు డీగాల్‌తో కూడా పోలడు. కాని వీరందరిలోవున్న ప్రత్యేక లక్షణాలన్నీ కొంచెం కొంచెంగా "మా కెనడీ" లో ఉన్నాయని ఆ సందర్భంలో అన్నాడొక అమెరికా మిత్రుడు. అవి క్యూబా వ్యవహారంలో అధ్యక్షుడు శ్రీ కెనడీ గట్టిగా వ్యవహరించి, అణ్వస్త్ర యుద్ధానికి కూడా సిద్ధమై, శ్రీ కృశ్చేవ్‌ను ఒక అడుగు వెనకకు వేయించిన రోజులు. పారిస్ సభలో శ్రీ కృశ్చేవ్ చేతిలో శ్రీ ఐసెన్‌హోవర్ పొందిన పరాభవానికి క్రుంగిపోయిన అమెరికనులకు ఈ ప్రతీకారచర్య ఉత్సాహం, ఉత్తేజం కలిగించిన సమయ మది. అప్పుడు తెలిసింది అమెరికా రాజకీయ నాటక రంగంలో మెప్పు పొందడానికి కీలకం ఎక్కడ ఉందో, టెక్సాస్ రాష్ట్రంలోని డల్లాస్‌లో తుపాకి గుండ్లకు శ్రీ కెనడీ బలి కావడం ఎందుకు జరిగిందో. ప్రతీకార చర్యఅనేది అమెరికనులకు ఎంత (ప్రమాదకారి అయినా) ముఖ్యమో.

ఇంతా చేసి శ్రీ కెనడీ వయస్సు 46. ఆయన అధ్యక్ష పదవిని నిర్వహించినది 36 నెలలు. అయినా ఆయన ఒక కీలక సమయంలో హత్య చేయబడినందున, గత చరిత్ర ద్వారా సృష్టించుకున్న సుముఖ వాతావరణంవల్ల, అమరజీవి అయినాడు. అబ్రహాం లింకన్ స్థాయిని అందుకున్నాడు. "మహాత్ములు ఎప్పుడు మహాత్ములు అనిపించుకుంటారు" అని ఒక చరిత్రకారుడు ప్రశ్నించుకొని "అశేషమైన అల్ప మానవులకు తమలోను నిగూఢమైన మహత్తు కలదన్న గుర్తింపు కలిగించి, కార్యరంగంలోకి దించినప్పుడు" అని సమాధానం చెప్పుకున్నాడు. ఇది శ్రీ కెనెడీ విషయంలో అక్షరాలా నిజం. అమెరికాలో కేవలం నీగ్రోలనేకాదు. స్వల్పాదాయం కల వర్గాలకు ఆయన ఆశాజ్యోతిని చూపాడు. కాని ఆ జ్యోతిని వారు అందుకొనడానికి అమెరికా రాజకీయ విష చక్రం అడ్డు వచ్చింది. దానిని తొలగించే ప్రయత్నంలో శ్రీ కెనెడీ బలి అయినాడు. అమెరికా చరిత్రలో చిరస్మరణీయుడనిపించుకున్నాడు.

ఉడ్రో విల్సన్, ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు, హారీ ట్రూమన్, ఐసెన్‌హోవరు వంటి అధ్యక్షులతోను, వారి కాలపు సమస్యలు, వారు సాధించిన విజయాలతోను పోల్చి చూచినప్పుడు శ్రీ కెనడీకి లభించిన అవకాశాలు, సాధించిన ఫలితాలు చరిత్ర దృష్టిలో అల్పం. ఈ అధ్యక్షులందరూ శాంతిప్రియులు. కాని

వారి కృషి ఫలించలేదు. యుద్ధం కొనసాగించక తప్పలేదు. భవిష్యత్తులో అయినా శాంతి జీవనం సాధ్యం చేయాలన్న ఉత్సాహంతో, ఆశయాలతో వారు వ్యవహరించారు. రంగంనుంచి తప్పుకున్నారు. ఆ సమయంలో తెరమీదికి వచ్చాడు శ్రీ కెనెడీ వారి ఆశయాలకోసం, ధైర్యంగా, సంకల్ప బలంతో కృషి చేయడానికి ఉద్యమించాడు. వారికి చారిత్రక వారసుడయ్యాడు. అందువల్లనే అదినుంచి ఆయన ఘనత కెక్కాడు.

రూజ్వెల్టు, చర్చిల్, స్టాలిన్ వంటి అగ్రశ్రేణి నాయకులు ద్వితీయ ప్రపంచ యుద్ధాన్ని ముగింపు చేయించి, అంతర్జాతీయ రాజకీయ రంగాన్ని తీర్చి దిద్దిన అనంతరం వారితో సమ ఉజ్జీలు అనిపించుకొనే నాయకత్వం ప్రపంచానికి లభించలేదు. వారి స్థానాలను భర్తీ చేయడం ఇప్పట్లో సాధ్యపడదనుకుంటున్న సమయంలో శ్రీ కెనెడీ 36 వ అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. నూతన ప్రపంచ వాతావరణానికి తగిన యువ నాయకుడు లభించాడన్న ఆశలు ప్రపంచ ప్రజానీకానికి తొలి సంవత్సరంలోనే కలిగించాడు.

హార్వర్డ్ విశ్వ విద్యాలయంలో విద్యాభ్యాసంకంటె ఆయన సంకల్ప బలాన్ని పెంచి, నూతన అవధులను చూపిన సందర్భాలు కొన్ని ఉన్నాయి. ఒకటి బోస్టన్ నగరంలో కెనడీ కుటుంబం అక్కడి ధనిక వర్గాలనుంచి ఎదుర్కొనవలసి వచ్చిన వ్యతిరేకత. రెండు జాన్ అనారోగ్యం. "బోస్టన్ బ్రాహ్మిన్స్" అని బోస్టన్ నగరంలో వంశ పారంపర్యంగా ధనవంతులైన కుటుంబాలు కొన్ని ఉన్నాయి. కొత్తగా ధనికులైన కెనడీ కుటుంబానికి అవి తమ మధ్య చోటివ్వలేదు. అందువల్ల కెనెడీల పిల్లల పెంపకం కట్టుదిట్టంగాను, ప్రత్యేకమైన ఏర్పాట్లతోను జరిగింది. కెనెడీ తండ్రి జోసెఫ్ కేథలిక్ మతస్థుడు. ఈ కుటుంబం ఐర్లాండు నుంచి వచ్చింది. కెనడీ తాత జీవితం బోస్టన్ నగరంలో "సెలూన్"తో ఆరంభమైంది. కెనడీ తండ్రి మద్యాల వ్యాపారి. బ్యాంకరు. డెమొక్రాట్ అభిమాని. రూజ్వెల్టు అనుయాయి. బోస్టన్ నగరంలోని రిపబ్లికన్ వాతావరణానికి ఇవన్నీ వ్యతిరేకం. అయినా రూజ్వెల్టు హయాంలో కెనడీ తండ్రి ఇంగ్లండులో అమెరికా రాయబారిగా వెళ్లాడు. కెన్నడీల కుటుంబం డెమొక్రాటిక్ వర్గాలకు ప్రతినిధిగా నిలిచింది. అందువల్లనే "ఇంట గెల్చి రచ్చ గెలిచాడు" అన్న ప్రతిష్ఠ జాన్ కెనడీకి సెనటర్‌గా పున్నప్పుడు వచ్చింది. ఆయన రాజకీయ స్వభావాన్ని తీర్చిదిద్దింది. తండ్రి ప్రభావంలోనే "Why England Slept" అనే పరిశోధన గ్రంథాన్ని కెనెడీరచించాడు. మేధావంతులశ్రేణిలో చేరాడు.

యువకుడుగా శ్రీ కెనెడీ నౌకా బలంలో చేరాడు. పి. టి. పడవ ప్రమాదంలో వెన్నెముకకు దెబ్బ తగిలింది. ఆపరేషను చేయించుకున్నాడు. 1954 అక్టోబరులో ఆయన ఇక జీవించ డనుకున్నారు. కాని, మృత్యు ముఖాన్నుంచి బయటపడ్డాడు. అనారోగ్యంగా ఉన్నప్పుడే (1956) "Profiles in Courage" అనే గ్రంథాన్ని రచించాడు. అమెరికా రాజకీయాలలో చొరవ, తెగువ చూపిన కొందరు సెనటర్ల జీవితాలను దీనిలో సంగ్రహించి, రాజకీయాలలో 'సమయం—స్థలం—తెగువ" అనేది ఎంత ముఖ్యమో సిద్ధాంతీకరించాడు. రాజకీయ పరిపూర్ణ దశను మానసికంగా అందుకున్నా డనిపించుకున్నాడు. ఆయన అధ్యక్షుడుగా ఎన్నికైన అనంతరం కొందరు వ్యాఖ్యాతలు ఈ విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ అనారోగ్యమనేది ఫ్రాంక్లిన్ రూజ్వెల్టులోవలెనే, కెనెడీలో కూడా ఆత్మ విశ్వాసాన్ని పెంచి రాజకీయ సాహసికులుగా రూపొందించిందని వ్యాఖ్యానించారు.

అయితే శ్రీ కెనడీ సెనటర్‌గా ఉన్నప్పుడు రాజకీయ సాహసం చూపని సందర్భం ఒకటి ఉంది. అది కమ్యూనిజానికి వ్యతిరేకంగా సెనటరు మెకార్థి కొనసాగించిన ఉద్యమం. అది వేసిన వెర్రితలలు. ఆ సమయంలో శ్రీ కెనెడీ ముందుకు వచ్చి మెకార్థీని విమర్శించకపోవడం చాలామందిని ఆశ్చర్యపరచింది. విమర్శలను పెంచింది. ఆ కాలంలో ఆయన ఆరోగ్యం సరిగాలేని మాట నిజమే కాని, మెకార్థీ పట్ల తటస్థ వైఖరి చూపడానికి కారణాలు కొన్ని లేకపోలేదు. కెనెడీ తండ్రికి మెకార్థీ మిత్రుడు. కెనెడీ తమ్ముడు రాబర్టు కొంతకాలం మెకార్థి దగ్గర పనిచేశాడు. ఐర్లాండు కేథలిక్కులకు మెకార్థీ అంటే అభిమానం. అందువల్లనే శ్రీ కెనెడీ శ్రీ మెకార్థీని బహిరంగంగా విమర్శించడానికి సిద్ధపడలేదు. రాజకీయ సిద్ధాంతాలకు విలువ ఇచ్చే కెనెడీ కూడా అవసరమైతే అవకాశవాదిగా మారగలడన్న అపవాదు ఇందువల్లనే ఆనాడు ఆయనకు వచ్చింది. అంతేకాదు. తన తమ్ముడు రాబర్టును అటార్నీ జనరల్‌గా నియమించుకొనడంతో అధ్యక్షుడు శ్రీ కెనడీ బంధుప్రీతికి, ఆశ్రితపక్షపాతానికి అతీతుడు కాదన్న విమర్శవచ్చింది.

గతంలో అమెరికా అధ్యక్షులుగా ఎన్నికైన వారిలో మేధావంతులు లేకపోలేదు. నూతన నినాదంతో జాతిని ఉత్తేజితులుగా చేసి ముందుకు నడిపించకపోలేదు. ఉడ్రోవిల్సన్ "న్యూ ఫ్రీడమ్", రూజ్వెల్టు "న్యూడీల్" అనేవి ఇందుకు ఉదాహరణలు. వీరిలాగానే కెనడీ కూడా "న్యూఫ్రాంటియర్స్" అనే నినాదాన్ని ప్రచారంలోకి తెచ్చాడు. యువక తరానికి చెందిన పెక్కుమందిని ఆకర్షించాడు. అయితే దీని కార్యాచరణకుగాను ఏర్పడిన "కెనెడీ సర్కిల్" అనేది అమెరికాలో పెక్కుమంది మేధావులను సమీకరించింది. చరిత్రకారులు, ఆర్థిక శాస్త్రజ్ఞులు,, జర్నలిస్టులు దీనిలో ఉన్నారు. వీరిది హార్వర్డ్ విశ్వవిద్యాలయ వాతావరణమని, ఆచరణకు పనికిరాదని సోషలిజానికి దగ్గరగా ఉంటుందనే విమర్శల కూడా దీనిమీద వచ్చాయి. అయినా "కెనెడీ సర్కిల్" ద్వారా "న్యూఫ్రాంటియర్స్" విధానం ఆచరణలో ఒక కొసకు రాకమునుపే శ్రీ కెనడీ మరణం అమెరికాకు తీరని నష్టం కలిగించింది. చరిత్రలో మహత్తర అవకాశాన్ని కోల్పోయేట్లు చేసింది. అందులోను తుపాకి గుండ్లకు ఆయన బలి కావడం అనేది ప్రపంచంలో అమెరికా నైతిక ప్రతిష్ఠను కూడా క్రుంగతీసింది.

—పంచశీలక్

Printed & Publisbed For Nageswara Rao Estates (Private) Ltd , bv S. Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Acting Editor: S. Radhakrishna